# శ్రీకృష్ణ లీలా తరఙ్గిణి

## శ్రీ సద్గురు నారాయణతీర్థ కృతము

## భావార్థ సుధయును
## తెలుగు టీకాతాత్పర్య సహితము

ప్రతిపదార్థము అనుగ్రహించినవారు :

పరమపద నివాసులు **శ్రీమాన్ దామోదర కృష్ణదాసు అయ్యగారు**

(రాధా గోపాలకృష్ణ దాసు) ఒంగోలు

సంకలనము, సమర్పణ :

**శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణ**

స్వాతంత్ర్య సమరయోధుడు

ఒంగోలు - 523 002 ప్రకాశంజి



24-6-2000 ఒంగోలు షిర్డి సాయిబాబా మందిరంలో శ్రీశ్రీశ్రీ [illegible]
శ్రీ కృష్ణలీలా తరంగిణి గ్రంథావిష్కరణ



24-6-2000 ఒంగోలు షిర్డి సాయిబాబా మందిరంలో తరంగగానము
పాల్గొన్నవారు ఎడమనుంచి చెంగంశెట్టి వెంకటేశ్వర్లు (మృదంగం),
అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, బొమ్మరాజు పాండురంగారావు, జి. సంపత్‌కుమార్,
రాచపూడి చిదంబరం, సుబ్బారావు (హార్మోనియం)

శ్లో॥ యదం ఘ్రి పంకేరుహ రేణులగ్నం నిపయపిరం
విమలాం తరంగః జానామి తత్వం నిజమాత్మరూపః
తన్నౌమి నారాయణ తీర్థమార్యం
యన్నామ్న పఠనం అనాగపేయతే ఓంకార లక్ష్యాధికం



**శ్రీ నారాయణ తీర్థ యతీంద్ర సద్గురు స్వామి**

శ్లో॥ యన్మూర్తే రవిపూజనం హరిహర బ్రహ్మాదిపూ స్మృతం
యత్కార్యం త్రివిధం సమస్త జగతాం శాస్త్రార్థ నిర్ణాయకం
శ్రీమన్నారాయణ తీర్థ సద్గురువరం తన్నౌమి ముక్తిప్రియో

# శ్రీముఖము

శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణపంతులుగారికి సకలశ్రేయోభివృద్ధిగా నారాయణస్మృతి పూర్వక ఆశీస్సులు.

మీరు స్వాతంత్ర్యసముపార్జనకై, సుఖశాంతులకు దూరమై, ఉజ్జ్వలభవిష్యత్తును కూడా లెక్కచేయక, దేశంకోసం త్యాగంచేసిన ఆదర్శ స్వాతంత్ర్యసమరయోధులు.

తొంబయి సంవత్సరాలవయస్సును శరీరాన్నికూడా లక్ష్యపెట్టక, ఉత్సాహంతో సాంఘిక, రాజకీయ, ధార్మిక కార్యక్రమాల్లో పాల్గొనటంలో మీకుమీరే సాటి. ఇప్పటికీ నిత్యజీవితాన్ని అవిశ్రాంతంగా గడపటం మీలోవున్న విశేషం

అందుకే సద్గురు నారాయణతీర్థకృత "శ్రీకృష్ణలీలా తరంగిణి" గ్రంథాన్ని టీకాతాత్పర్యాలతో ముద్రించి ప్రకటించటమే తార్కాణం ఇదొక మహాపుణ్యకార్యం ఈ మహాగ్రంథాన్ని శ్రమకోర్చి వెలుగులోకి తెచ్చిన మీరెంతో ధన్యులూ, అభినందనీయులున్నూ.

"శ్రీకృష్ణలీలా తరంగిణి" శ్రీనారాయణతీర్థులవారి హృదయ పుండరీకంలోంచి పెల్లుబికి వెలికి జాలువారిన భక్తిరసనిర్భర వాహిని. ఈ రసగంగా తరంగాల్లో మునకలువేయని భక్తులంటూలేరు. జగద్విఖ్యాతిగాంచిన మహాగ్రంథం, గ్రంథకర్త శ్రీ తీర్థులవారున్నూ భక్తగాయకహృదయాల్లో నిరంతర స్మరణీయులై నిలిచారు. ఎక్కడ తరంగ కాలక్షేపం జరిగినా తీర్థులవారి శ్రీకృష్ణలీలా తరంగగానం తప్పకవుండి తీరుతుంది. ఆ రసప్రవాహం భక్తుల హృదయక్షేత్రాలను తడుపుతూనే వుంటుంది

"శరణంభవ, కరుణాంమయికురు, దీనదయాళో!
కరుణారసవరుణాలయ, కరిరాజకృపాళో!"
"మంగళాలయ మామవదేవ
పంకజాసన భావితభావ"
"మంగళానితనోతు, మధుసూదనస్సదా"
గంగాధరో పి తవసాపిగంగా"
"ఏహి ముదంమమదేహి జగన్మోహనకృష్ణామాం పాహి"
"కృష్ణం కలయసఖి సుందరం - బాల
కృష్ణం కలయసఖి సుందరం"

ఈ మొదలయిన తరంగాలు ఇప్పటికీ మన అంతరంగాల్లో మెదలుతూనే వున్నాయి ఇది భక్తజనసామాన్యం. తీర్థులవారి మృదుమధురభావన శ్రీకృష్ణపరమాత్మ యందు దృఢంగా నిలిచి, విష్ణుపాదోద్భవగంగలాగా గలగలలాడుతూ, అప్రయత్నంగా కమ్మని కవితాతరంగాలతో మధురనాదం చేసుకొంటూ బాహిరిల్లింది.

శ్రీకృష్ణచరిత్రలోని ఘట్టాలు, ఒక్కొక్కటి ఒక్కొక్క తరంగంలో అభివర్ణితాలయి, సన్నివేశాలను కట్టినట్లుండటం యెంతో బాగుంది.

శ్రీకృష్ణుడవతరించింది మొదలు, బాల్యం, గోపాలనం, గోపికావస్త్రాపహరణం, రాసలీల, కంసమర్దనం, ద్వారకాప్రవేశం మొదలగు అనేక లీలావిశేషాలతో అష్టమహిషులతో జరిగిన వివాహాలవరకు అతిలోకసుందరంగా మృదుళపదసరణిలో కృష్ణలీలలు వర్ణింపబడి గానంచేయబడినాయి.

సరళసంస్కృతవాణి విభిన్నరాగాలతోను, దరువులతోను, వివిధ విధ్వ సంగీతమధురామృతతరంగాలతో శ్రీశ్రోతృజనానంద సంధాయకమైనది

ఆంధ్రదేశంలో కృష్ణలీలా తరంగాలు పారాడనిలోగిళ్ళులేవు. భక్తగాయకులు ఆయావుత్సవాల్లో భక్తిపారవశ్యంతో నృత్యంచేస్తూ పాడటంకూడా పరిపాటిగా వుండేది.

జయదేవుని అష్టపదులతోబాటు నారాయణతీర్థులవారి తరంగాలుకూడా రాధాకృష్ణుల్లాగా జంటగా ఖ్యాతివహించాయి భారతీయుల భక్తిసంపదలో ఇవి అమూల్యరత్నాలై వెలుగొందుచున్నాయి. పదములల్లు సార్థకమైంది

ప్రకాశంజిల్లా ప్రాంతవాసులు తీర్థులవారి తరంగాలను భక్త్యావేశాలతో కీర్తనచేయుచుండగా, ఆంధ్రేతర ప్రాంతాల్లోకూడా అనేక వేదికలపై చేసిన ఆసంగీత సేవను పరిశోధనాత్మకంగా విశ్లేషించి మీగ్రంథంలో పొందుపరచటంవలన భవిష్యత్తులో ఇలాంటి అంశాలపై ఉన్నత విద్యాప్రమాణాలతో పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాసేవారికందరికీ ఈగ్రంథమే కరదీపిక అవుతుంది వ్యక్తిగతంగా సన్నిహిత విశేషాంశములు మీకు తెలిసి వుండటంవలన ఈ గ్రంథం విశేషప్రాధాన్యం సంతరించుకొన్నది

ఇలాంటి ఉత్తమ ప్రామాణిక గ్రంథం 24-6-2000న ఒంగోలు శ్రీసాయిబాబా దేవస్థాన ప్రాంగణంలో ఆవిష్కరించే సదవకాశం మాకు లభించింది.

ఈ గ్రంథం సాంప్రదాయక సంగీతప్రియులకేకాక చారిత్రక పరిశోధకులకుకూడా గొప్పప్రామాణిక గ్రంథం కాగలదు.

ప్రతియింటను ఈ గ్రంథం భాగవతరామాయణాలవలె ఆదరింపదగినది అందరూ చక్కగా చదివి కంఠస్థంచేసి, తమలోతామే పాడుకొంటూనైనా తమ మనస్సును నిర్మలంగా నిల్పుకోటానికీ తద్వారా నిత్యాంనదమనుభవించటానికీ, ఎంతగానో ఉపయోగపడుతుంది. ఇదొక ముచ్చటయిన సంగీతభాగవతం ఇలాంటి గ్రంథాన్ని ఇంత మనోహరంగా తీర్చిదిద్ది బహుజనోపయోగంకోసమని టీకాతాత్పర్య సహితంగా ముద్రించి ప్రకటించిన మీకృషి అమోఘం. ఈ కృష్ణలీలా తరంగాలు పాఠకజన హృదయాంతరాళాల్లో నిరంతరంగా ప్రసరిస్తూ భగవదనుభూతి కలిగించాలని మా ఆకాంక్ష.

ఇతోధికంగా మీకు ఆయురారోగ్య భక్తిజ్ఞానవైరాగ్య సంపదలనిచ్చి మా పీఠాధిదేవత శ్రీరాజరాజేశ్వరి అమ్మవారు మిమ్మల్ని సర్వదా సర్వధా కాపాడుతూ వుండాలని కోరుకుంటూ.

నారాయణస్మృతులతో

ఆశీర్వదిస్తున్నాము.

ఇట్లు

శ్రీ శివచిదానంద

భారతీస్వామి

# నివేదన



పవిత్రమూర్తులారా,

ఈ గ్రంథప్రచురణ ప్రేరణకు పురికొల్పిన పూర్వాపరములను తెలియజేయుట అవసరమని భావించుచున్నాను. శ్రీకృష్ణలీల తరంగిణి అనుగ్రంథమును పరమభక్తాగ్రేసరుడు, సంగీత, సాహిత్య, నృత్య విద్యావినయ సంపన్నుడు యతివరుడు శ్రీశ్రీశ్రీ నారాయణతీర్థులవారిచే సంస్కృతములో యక్షగాన పద్ధతిలో రచియింపబడు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే తెలుగు తాత్పర్యముతో సహా ప్రథమముగా ప్రచురింపబడినది. కానీ, సంస్కృత పదములకు తెలుగున ప్రతిపదార్థము వ్రాయబడలేదు. ఈ కొరత తీర్చుటకు చాలాకాలముగా ప్రయత్నించుచుంటిని. అయితే ఉదారులు సాహిత్యసేవాపరాయణులు గౌరవనీయులునగు శ్రీ రాజావేంకటాద్ర్యప్పారావు బహద్దర్‌గారు శ్రీకృష్ణ లీలాతంగిణిని ఆంధ్రీకరణముచేసి ప్రచురించినప్పటికిని సంస్కృతమునకు తెలుగు ప్రతిపదార్థము లేనిలోటు తీరలేదు. వారి గ్రంథము నాయీప్రయత్నమునకెంతయో వుపకరించి ఉత్తేజం కల్గించినది. వారికి నేనెంతయో కృతజ్ఞుడను. నా 12వ ఏట నుండి మా గ్రామములో జరిగే శ్రీరామ ఉత్సవములలోను, చదలవాడ, మల్లపరం బ్రహ్మోత్సవములలోను ఇతర సప్తాహము మొదలగు కార్యక్రమములలోను జరుగు తరంగ భజన కాలక్షేపములకు హాజరై హరిదాసుల భక్త్యావేశములకు ఆకర్షితుడనై భగవదనుభూతిని పొందేవాడిని. అంతేగాక నా స్వగ్రామమగు కొలచనకోటకు దగ్గరగా గుళ్ళపల్లి గ్రామ వాస్తవ్యులు గుళ్ళపల్లి రామక్రిష్ణయ్య అనువారు పెదకొత్తపల్లి గ్రామంలో వివాహము చేసుకొని అచ్చట కొన్ని తరంగములు, మృదంగ వాయిద్యము నేర్చుకొనిరి. ఆయన తరంగ గానము చేయుచూ మృదంగ వాయిద్యము కూడా తానే సమర్థతతో నిర్వహించే ప్రజ్ఞగలవాడు. నేను, మరికొందరం ఆయనను కొలచనకోటకు రాత్రిపూట రప్పించి 4, 5 తరంగములు నేర్చుకొంటిమి. వారు తాళజ్ఞానమును కూడా కొద్దిగా కల్గించిరి. ఈ భజనపరులలో ధేనువకొండవారు, మైనంపాటివారు, బొమ్మరాజువారు, చదలవాడవారు, పోరూరువారు, రామాయణంవారు ఉండేవారు. వీరందరూ ఒకరిని మించినవారు మరియొకరు. కవులేకాక సంగీత, సాహిత్య, నృత్య, అభినయ, భరతశాస్త్ర కళలలో ఆరితేరినవారుకూడా. వీరిని రాష్ట్రమంతట సగౌరవముగా ఆహ్వానించి సత్కరించేవారు. కొత్తపల్లి సీతారామయ్య, దాసరికేశవులు, గురవయ్య అనువారు తరంగముల భజనకు ప్రత్యేక పద్ధతిలో మృదంగము వాయించే మంచిదిట్టలు. దాక్షిణాత్య సంగీత పండితులు ధేనువకొండ చిన్నయ్య పంతులుగారు మొదలు రామాయణం సోదరులు సీతాపతి, బలరామస్వామి, బొమ్మరాజు సీతారామదాసుగారు, పోరూరి సోదరులు (వాలి సుగ్రీవులు) వెంకటసుబ్బయ్య, రమణదాసు, మైనంపాటి నరసింహారావు (ఆలకూరపాడు) మొదలగు

విద్వన్మణుల తరంగ కాలక్షేపములాలకించి ఆనందానుభూతిని, తృప్తిని పొందితిని. ఆ కారణమున తరంగములకు తెలుగు అర్థము ప్రచురించవలెనని సంకల్పము, తీవ్రమైన కాంక్ష పదిసంవత్సరములుగా ఏర్పడినది. అందుకు అనుకూలముగా భక్తాగ్రేసరుడు, నిర్మల మనస్కుడు, నిగర్వి, సాధుపుంగవుడు అగు శ్రీమాన్ కీ॥ శే॥ దామోదర కృష్ణదాసు అయ్యగారు అనుగ్రహించిన సంస్కృతమునకు తెలుగు ప్రతిపదార్థముగల పుస్తకము సహృదయులు కీ॥ శే॥ మైనంపాటి ధర్మరాజుగారిచే వ్రాయబడి వారి కుమారుడు హరినారాయణతీర్థుల ద్వారా నాకు లభ్యమైనది. నేటికి ఈ గ్రంధము రూపుదాల్చినందుకు మహదానందము. నా చరమదశలో ఇంతకన్న కావలసినది ఏమి కలదు?

ప్రచురించు గ్రంధములో జిజ్ఞాసుల కొరకు లభ్యమైనంతవరకు తీర్థులవారి జీవితచరిత్రను సంకలన రూపముగా అందజేసినాను. చరిత్రను గురించి వ్రాసినవారిలో ఆచార్య పి. సాంబమూర్తి అను వారు తీర్థులవారు దక్షిణాదిన పుట్టి పెరిగాడని, పెళ్ళి అక్కడే జరిగినదని, ఆయన సన్యసించిన నదీప్రవాహము కూడా అక్కడే ఉన్నదని వ్రాసినారు. ("Narayana Thirtha" ప్రొ॥ పి. సాంబమూర్తి రాజావేంకటాద్ర్యప్పారావుగారి "శ్రీకృష్ణలీలాతరంగిణి" ఆంధ్రీకరణము గ్రంధములో) ఆ అభిప్రాయము నిరాధారమైనది. కంచి కామకోటి పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ వ॥ వ॥ చంద్రశేఖర సరస్వతీ స్వామివారు సేకరించిన సమాచారములో కూడా తీర్థులవారి అసలుపేరు గోవిందశాస్త్రి అనియూ, అత్తగారి ఊరు వేదాద్రియనియూ, సన్యాసాశ్రమ స్వీకరణ కృష్ణానదిలోనే జరిగినదనియూ లిఖిత పూర్వకములైన ఆధారములద్వారా తెలియుచున్నది. ఆయన విద్యాభ్యాసము కూడా ఆంధ్రదేశము నందు జరిగినది. ఎంత వారైననూ, వాస్తవములు తికమకలు చేసి చరిత్రను మార్చుటకు ప్రయత్నించుట శోచనీయమని మనవి చేయుచున్నాను. తీర్థులవారు తపస్సు ఆచరించిన బిళము శింగరకొండపై మూసివేయబడినటుల ఇప్పటికీ చూడవచ్చును. తీర్థులవారి జీవిత విధానము వల్లను, పారమార్థిక చింతనాశక్తి వల్లను, కార్యక్రమములవల్లను ఈ ప్రాంతపు వారిపై వారి ప్రభావము ఎక్కువగా నుండెను. ఈ ప్రాంతపు వారికి తరంగముల గాన పద్ధతి (బాణీ) తీర్థులవారి ముఖతః ప్రసాదింపబడినదని చరిత్రకలదు. [illegible] ప్రాంతమందే అరువది కుటుంబములవారు పరంపరగ గానము చేయుచున్నట్లు శ్రీ [illegible] నరసింహశాస్త్రిగారి "శ్రీకృష్ణ లీలాతరంగిణిలో భక్తితత్త్వము" అను వ్యాసములో వ్రాయబడినది. తీర్థులవారు దక్షిణాదిన ఎక్కువ కాలము నివసించని కారణమున ఈ బాణీ వారికి లభ్యముకాలేదు. దక్షిణదేశముననే కాదు మన ఒంగోలు తాలూకాలో తప్ప మరెక్కడను ఈ బాణీలేదు. మన పూర్వీకులు మోక్షప్రాప్తికై ఈ తరంగగానమును సాధనసామాగ్రిగా నెంచుకొని కృతార్థులైరి. అట్టివారిలో అద్దంకి హరిదాసు వెంకటరాయుడుగారు, పాలపర్తి నృసింహదాసుగారు, బొమ్మరాజు సీతారామదాసుగారు మొదలగు పుణ్యపురుషులు ఎందరో కలరు. ఈ గ్రంధము భక్తిరస ప్రధానమైన గ్రంధరాజము గనుక ఈ ప్రాంతమునకు సంబంధించిన పరమభక్తుల, హరిదాసుల, సాధువుల, సన్యాసుల చరిత్రలను గ్రంధవిస్తరమైనను ఇందులో ప్రచురించితిని. వారు చిరస్మరణీయులు, ధన్యజీవులు, మార్గదర్శకులు.

**1971 సం॥లో శ్రీకృష్ణలీలా తరంగముల కాలక్షేపమహోత్సవములు 3 రోజులు ఒంగోలులో జరిగినవి. ఆ ఉత్సవములకు అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖమంత్రి గౌ॥ శ్రీ పి.వి. నరసింహారావుగారు,**

ఎ ఐ ఆర్ అధికారి కీ॥ శే॥ ఓలేటి వెంకటేశ్వర్లుగారు హాజరై ఎంతగానో ప్రశంసించినారు. ఈ ఉత్సవములో ఈ ప్రాంతపువారేగాక ఇతర జిల్లాల వారుకూడా హాజరైరి. ఈ కార్యక్రమము ఏర్పాటుకు కొరిశపాడు వాస్తవ్యులు, సహృదయులు, కళారాధకులు, పత్రికా సంపాదకులు కీ॥ శే॥ నీలంరాజు వెంకటశేషయ్యగారు [illegible] నాడు ఈ తరంగ కాలక్షేపముల పురాతన బాణిని ఉద్ధరించుటకై ఒక పాఠశాలను స్థాపించ [illegible] ప్రయత్నించిరి కానీ, సఫలీకృతులు కాలేదు. తరువాత నారాయణ తీర్థకళానికేతన్ అను సంస్థ స్థాపించబడినది. ముఖ్య కార్యకర్త కీ॥ శే॥ మొక్కపాటి వాసుదేవశర్మగారి (అనమనమూరు వాస్తవ్యులు) సేవాతత్పరులు [illegible] లక్ష్మీనరసింహారావుగారి ఆధ్వర్యమున చక్కగా నిర్వహింపబడినది. తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలం, భద్రాచలం మొదలగు ప్రదేశములలో కళానికేతన్ వారిచే తరంగ కాలక్షేపములు నిర్వహించి ప్రశంసలను అందుకొనిరి.

కీ॥ శే॥ న్యాయవాది మల్లవరపు సుబ్బారావు పంతులుగారి ఇంటిలో ప్రతి ఏకాదశికి, కీ॥ శే॥ ఘోరకవి రామారావుగారి ఇంటిలో ప్రతి అష్టమికి తరంగభజన కాలక్షేపములు జరిగెడివి కీ॥ శే॥ బొమ్మరాజు సీతారామదాసుగారితోపాటు ఇతర హరిదాసులు కూడా వచ్చి ఇందు పాల్గొనేవారు 1966 సం॥ శ్రీకాళహస్తిలో కంచి కామకోటి స్వామివారు జరిపిన బ్రహ్మయజ్ఞములో కళానికేతన్‌వారు తరంగకాలక్షేపము గావించి శ్రీవారి నుండి ప్రశంసలను అందుకొనిరి. 1989వ సంవత్సరములో మద్రాసు టి నగర్‌లో తీర్థులవారి స్మారకోత్సవములకు బొమ్మరాజు సుబ్బరాయుడు, గోపాలకృష్ణమూర్తి, పాండురంగారావుగార్లు ఆహ్వానముమేరకు వెళ్ళినారు. నేనునూ ఆ ఉత్సవములకు ప్రేక్షకునిగా వెళ్ళియుంటిని. ఆ ఉత్సవములకు యమ్.యస్. సుబ్బలక్ష్మి దంపతులు, పట్టమ్మాళ్, ఫణికృష్ణస్వామి మొదలగు ప్రముఖ వాగ్గేయకారులు 3 రోజులు హాజరై మన బాణీని ఎంతగానో ప్రశంసించి కొన్ని కీర్తనలుకూడా రికార్డు చేసుకొనిరి. ఇచ్చట భజనపరులు చాలామంది తమిళనాడులోగల తిరుపుందుర్తి గ్రామమునందు శ్రీ సద్గురు నారాయణ తీర్థులవారి సమాధివద్ద తరంగ గానమొనర్చి వారిఆతిధ్యమును స్వీకరించి మర్యాదలను పొంది వచ్చిరి. పై వివరములనుబట్టి తరంగ కాలక్షేపములో మన బాణీకి ఎంత గౌరవము, ఆసక్తి, ఆకర్షణ కలదో మీరూహించగలరు. ఆ కారణమున ప్రసిద్ధినొందిన ప్రతిగాయకుడు తనకచ్చేరిలందు కృష్ణలీలా తరంగములనుకూడా గానము చేయుచూ వాటియొక్క ప్రాముఖ్యతను చాటుచునేయున్నారు. మన పూర్వీకులు శ్రమించి పారమార్థిక బుద్ధితో మనకనుగ్రహించిన వారసత్వపు సంపదగా ఈ తరంగ భజనబాణీని కాపాడుకొనవలసిన బాధ్యత విజ్ఞులైన మనపైనున్నదని విజ్ఞప్తి చేయుచున్నాను.

నాకు అవకాశము దొరికినప్పుడల్లా శ్రీ కృష్ణలీలా తరంగిణి పుస్తకము చదువుకొను అలవాటుకలదు ఆ సమయములో పరిమిత భాషాజ్ఞానముగల నాకు తృప్తికలిగే విధముగా అభిరుచి ఏర్పడినది. ఈ శుభసందర్భములో గ్రంధప్రాశస్త్యమును గూర్చి ముచ్చటించుకొనుట మనందరికీ శ్రేయోదాయకమని తలుస్తాను. శ్రీ సద్గురు నారాయణతీర్థులవారు మనలనుద్ధరించుటకై భక్తి ప్రపత్తులకు పునాదియై, పరమపద ప్రాప్తిపొందుటకు సాధనసామాగ్రియైన ఈ గ్రంధమును మనకందించినారని నాకు తోచుచున్నది. అందుకు తగినట్లు నాకు తోచిన కొన్ని ఈక్రింది ఉదాహరణలు మీముందుంచుచున్నాను. నాకు 90 వ సంవత్సరము నడుచుచున్నది. ఈ తరంగములు షుమారు 75 సంవత్సరములుగా ఆసక్తితో వినుచున్నాను.

ప్రారంభములో భజనపరులు 'జయజయరమానాథ' అను కీర్తన నాటరాగములో గానముచేసే
ఆనవాయితీ కలదు ఆ కీర్తనలో "నిరవధిక కారుణ్య నిఖిలలోకశరణ్య" అను చరణముకలదు [illegible]
చరణమును ఆర్తితో, భావోద్రేకముతో తాళములు, గతులు మార్చి లయవిన్యాసముతో [illegible]
అరగంటకుపైగా పాడేవారు. ఇప్పుడుకూడా ఆ చరణమునకు ఒక ప్రత్యేక స్థానము కల్పించి [illegible]
పాడుచున్నారు. ఆ చరణములో సర్వేశ్వరుని కారుణ్యము, శరణ్యము ప్రసాదించినారు నిరవధిక కారుణ్య
నిఖిలలోకశరణ్య అను రెండు పదములు ఒకే చరణములో నుండుట తీర్థులవారి అంతఃకరణము
తెలుపుచున్నది. పరమాత్ముని యొక్క సహజ ప్రవృత్తిని తెలియజేసే విశిష్టమైన భాషాసౌందర్యం
ఇమిడియున్నది భగవదనుభూతిని అనుభవించే అలవాటుగల వారికి పరమానందమును కలిగించే పదము
నా అభిప్రాయము భక్తులు ఎంతో ఆప్యాయత, అనురక్తి ఆనందము కలిగి భగవద్గుణానుభవము
పొందుతారు. అందుకే ఆ చరణమును వదలిపెట్టలేరు

శ్లో॥ లీలామానుషదేహం లక్ష్మీశం, త్వాం ప్రసాదయేదేవం
సంసారార్ణవ పతితం కంసరిపో మాం త్వముద్ధర త్వరయా ॥

ఈ "త్వరయా" అనుమాట త్వరగా ఈ సంసార సముద్రము నుండి ఉద్ధరింపుమను [illegible]
ఆతురతను తెలియజేయుచున్నది ఇది జీవులందరికీ ఒక హెచ్చరిక అని భావించుచున్నాను [illegible]
పరమ పురుష శేషపర్యంక మృదుభాష" అనుచరణములో మృదుభాష అనుమాట [illegible]
మహదానందమును కలిగించే పదముగా భావించవలసియున్నది. సర్వాభరణములు [illegible]
భూషణములు వర్ణించుట సహజము. ఇందు తీర్థులవారు కృష్ణపరమాత్ముని భాషనూడా [illegible]
ఈ మృదుభాష అను పదప్రయోగమువలన తీర్థులవారు కృష్ణపరమాత్మతో కలసి గానసల్లాపములు [illegible]
జరిపినారన్న చరిత్ర నిజమని ఋజువు అగుచున్నది. "దేవదేవప్రసీదమే" అను కీర్తనలో [illegible]
దీనజన పరిపాల" అను పల్లవికలదు ఆ అనుపల్లవిలో దీనజన పరిపాల అనే పదము వలన తీర్థులవారికి
పరమాత్ముని స్పృహతోపాటు క్రిందిస్థాయిలోగల మానవజాతి స్పృహకూడా ఉన్నదని స్పష్టమగుచున్నది.

"వీక్షేకదా దేవదేవం" అనుకీర్తనలో అనుపల్లవి "సాక్షాన్మదన కోటి సౌందర్య భాస్యం" అనుపదము
వలన ఆవేదనతో ఆక్రందించే భక్తుల కొరకు అనుగ్రహింపబడే స్వస్వరూపముగా భావించాలి
భక్తులకుఆనందము గొల్పుటే భగవంతునికానందము. "కేళీకళాకుతుక కించిత్కుంచితా ధరం" అను
మరొక చరణము ఎంతో సహజమైన "కేళీ" కళకు సంబంధించిన చర్యగా తోస్తుంది. ఈ చర్య వలన
కృష్ణపరమాత్ముని అతి సామాన్యునిగా భావించే అవకాశం ఉన్నది. ఈ కేళీ కళాకలాపము బహుశా తీర్థులవారు
స్వయముగా చూచి వ్రాశారేమోననిపిస్తుంది. ఈ అపవాదును పరమాత్మునికి అంటగట్టుట తీర్థులవారికి
ఇష్టములేదు. కాబట్టి ఈక్రింది చరణములో స్వామివారి శీల సంపత్తిని గురించి వ్రాసినారు ఆ
చరణమేమనగా "సిద్ధజనవినుత ప్రసిద్ధతరశీలం" శీలం అనగా మామూలు భాషలో నడవడిక అని అంటారు.
స్వామివారి శీలం సిద్ధులైన మహాయోగులచేత ప్రశంసింపబడినదిగా వ్రాసినారు. అందువలన స్వామివారి
శీలమునకు భంగము కలుగలేదని భావము. మరొక చరణము "సరసమురళీ గీతరసామృతలహరీ".

ఈ చరణములో విశేషమేమన మురళి నుండి రాబడే ధ్వని అమృతప్రవాహము కావలెనన్న వాయిద్య సాధనమగు మురళి లోపరహితముగా ఉండవలె, అందువలన సరస మురళి అని వాడినారు. అనగా మురళి సరసముగా లేనిచో గానరసామృతము ఉద్భవించదు. ఇచ్చట ప్రధానవస్తువగు మురళికి ప్రాముఖ్యతనిచ్చి 'సరస' అను విశేషణమును వాడినారు మరొక కీర్తన "రేరేమానసగోపాలం భజదూరే పరిహార భూపాలం" అను పదము వలన తీర్థులవారికి సామాజిక స్పృహకూడా ఉన్నదని చెప్పవచ్చును. దీనజన, సేవకజన, పరిజన అనే పదములు కూడా ఉపయోగించినారు. "శ్రీ వాసుదేవ ప్రభో" అను కీర్తనలో ప్రభో అంటే సర్వశరణ్యుడు అని భావన. ప్రభో అనే మాటలో ఆక్రందన యిమిడియున్నది. నీవే తప్ప యితః పరుంబెరుగ అన్నట్లు. ఈ కీర్తన రుక్మిణీదేవి ప్రార్థనకు సంబంధించినది. "సరసిజోదరచరణ విలసిత సరస నూపుర" అనే పదములో విశేషమేమన "సరసనూపుర". పద్మనాభుని యొక్క పాదములకు ఉన్న అందెలు లోపరహితముగా శోభాయమానముగా నున్నవని భావము. దీనివలన తీర్థులవారు అందెలను స్వయముగా దర్శించుచున్నారని భావించవచ్చును. దీనినే భక్తుని పరమానుభూతి అనవచ్చును. మరొక చరణము "దివ్యమంగళగోపవేష" దీనియందు గోపాలుని వేషముతోనున్నది గోపాలుడు కాదని దివ్యమంగళ విగ్రహుడని భావము. అంటే ఉత్కృష్టమైన శుభములననుగ్రహించే గోపాలవేషధారి అని అర్థము. మనమనుకునే గోపాలుడుకాదు.

మరొక చరణము "నవ్యనవనీతరసిక" కృష్ణపరమాత్మకు నవనీతచోరుడు అను బిరుదు కలదు. అయితే ఆయనకు చలిది వెన్న రుచించదు. అప్పటికప్పుడు తీసిన వెన్న యందు అపేక్షకలవాడని అర్థము. కృష్ణపరమాత్మకు లోగడరోజు వెన్న తినిపించుట తీర్థులవారికి ఇష్టంలేదని భావన. ఇది అతి సున్నితమైన భావముగా ఆనందింపజేస్తుంది. దీని నుండి తీర్థులవారి హృదయం ఎంత మనోజ్ఞమైనదో ఊహించవచ్చును. మరియొక చరణము "దేవనారాయణానంద తీర్థ విరచిత దివ్యగీత". ఈ కీర్తన కూడా రుక్మిణీదేవి ప్రార్థన. కృష్ణపరమాత్ముని యొక్క సర్వతోముఖ వైభవము, దయాళుత్వము, కృపారసము, ఐశ్వర్యము ఇందు అనుగ్రహింపబడినవి. ఈ కీర్తనను దేవనారాయణానంద తీర్థవిరచిత దివ్యగీత అని తీర్థులవారు ఆఖరిచరణములలో ప్రశంసించుకొన్నారు.

మరియొక చరణము "హీరరత్న కటిసూత్రం". ఈకీర్తనలో కళ్యాణానంతరము అష్టభార్యలతో సర్వవైభముతో గూడియున్న సభను గూర్చి విశ్లేషించబడినది. అందున కటిసూత్ర వర్ణన చాలా ఆశ్చర్యము. అలంకారము వర్ణించుటలో తీర్థులవారు గోప్యముగా నుండే కటిసూత్రమును (మొలత్రాడు) వర్ణించుట గమనించదగియున్నది. అది తీర్థులవారి పరమభక్తికి నిదర్శనము. ఈ కీర్తనలోనే అఖరి చరణము "శరణాగతోద్ధారగోత్రం". ఏ భక్తులు ఇవ్వని శరణాగతోద్ధారణ గోత్రం అనుకొత్తబిరుదును స్వామివారికి సమర్పించుకొని కృతార్థులైనారు తీర్థులవారు. మరొక కీర్తనలో "కుందసుందరరదన" అను పదమునకు అర్థము మల్లెమొగ్గలవలె సుందరమైన పలువరుసగల వాడుగా వర్ణించినారు. సర్వేశ్వరుని అవయవముల వర్ణనలో తీర్థులవారి ఆసక్తి, అహ్లాదము గ్రహించుట మనకర్తవ్యము. అవయవముల వర్ణనలో మనకు కూడా ప్రత్యేక ఆసక్తిని కలుగజేసినందుకు తీర్థులవారు పూజనీయులు. "శ్రీగోపాలదయారసమిళితం" అను పదములో దయారసమిళితం అనేమాట హృదయాన్ని కదలించేదిగా నున్నది. దయారసం అంటే ఈ

కీర్తనకే ప్రాణంలాంటిది. దయారసం భక్తులకేగాక కీర్తనకు కూడా అపాదించుట క్రొత్త విషయముగా కన్పిస్తుంది. తీర్థులవారి దృష్టికి సర్వము దివ్యముగానే అనిపిస్తుంది. మరొక చరణము "దివ్యకనకమణి మంగళ సూత్రము" దివ్యకనకం అంటే శ్రేష్టమైనటువంటి బంగారం అంటే కల్తీలేనిది లేదా [illegible] బంగారం అని అర్థము సామాన్యులకు వలె సాదా మంగళసూత్రము అమ్మవారు ధరించుట తీర్థులవారికి గిట్టదు. ప్రతి వస్తువుకు విశేషము చేరిస్తేకానీ ఆయనకు తృప్తి ఉండదు అందుకనే దివ్యమైన బంగారమునకు మణినికూడా చేర్చి తృప్తిని పొందినారు. "పూరయమమకామం" గోపాల అను కీర్తన కృష్ణపరమాత్మ స్వరూప వర్ణనయే. ఈ ప్రార్థన పర్యవసానము భక్తుడు తన కోరికను తీర్చమని ప్రార్థిస్తాడు ఆ కోరికను సఫలము చేసే సర్వజ్ఞుడైన పరమాత్మునికి మాత్రమే తెలియాలి. అందుకనే పల్లవిలో ఫలానా కోరిక అని చెప్పబడలేదు. పరమాత్ముని సర్వజ్ఞత్వమునకు లోటు రానీయరాదనే భావముతో వివరము చెప్పబడలేదు. ఈ పల్లవిని భజనలో గానము చేయుచూ భక్తులైన శ్రీమాన్ బొమ్మరాజు సీతారామదాసుగారు పరమాత్మునిలో లీనమై చరితార్థులైరి. ఈ సంఘటన ఎప్పుడోకాదు మనకనుల ఎదుటనే 1942వ సంవత్సరంలో చదలవాడ గ్రామములో రఘునాయక స్వామి బ్రహ్మోత్సవ సమయమున జరిగినది

ఈ గ్రంధమున రుక్మిణీదేవి చేత పంపబడిన లేఖకు సంబంధించిన గద్యము, "[illegible]" అనుకీర్తన, లగ్నాష్టకములు ప్రత్యేకముగా ప్రశంసింపదగినవి, హృదయాకాశమున [illegible] సర్వేశ్వరుని అనుగ్రహం పొందడానికి ఆర్తితోకూడిన ఆక్రందనకావాలి అందుకు తగిన భాషకావాలి. ఆ భాష ఈ గ్రంధమున కోకొల్లలుగా నున్నది. ఆ పదముల పొందిక, పటుత్వం, భావప్రాధాన్యత, లాలిత్యము అప్రయత్నముగా నాస్తికులను, మూఢులను కూడా ఆకట్టుకుంటాయి నాదృష్టిలో ఈ గ్రంధము [illegible] నుద్దేసింపజేసే పరమసాధనము, పరమపద ప్రాప్తికి నిచ్చెనలాంటిది తీర్థులవారి జీవితవిశేషములను క్లుప్తముగా వివరిస్తాను. వీరు గుంటూరుజిల్లా, మంగళగిరి సమీపమునగల 'కాజ' అనుగ్రామములో 1675 వ సంవత్సరము ప్రాంతములో జన్మించిరి. కాశీలోను, కంచిలోను, విద్యనభ్యసించిరి ఒకనాటి భార్యకొరకు చీకటిరాత్రిలో వేదాద్రి వెళ్లుటకు కృష్ణానదిని దాటుచుండగా అకస్మాత్తుగా ప్రవాహము పెరిగి బ్రతుకుటయే అనిశ్చయమనితోచి తీర్థులవారు నదిలోనే ఆతుర సన్యాసము స్వీకరించిరి. అప్పుడు[illegible] ప్రవాహముతగ్గి ఒడ్డుకు చేరిరి. భార్యమీద వ్యామోహముతో ఆశ్రమ స్వీకారమును విస్మరించి అత్తగారి ఇంటికి వెళ్ళిరి. అల్లుడికి జరగవలసిన గౌరవమర్యాదలు జరిగినవి. భార్య సమీపించినట, కాని ఆమెకు తన భర్త తీర్థులవారుగాకాక సన్యాసిగా మాత్రమే కనిపించిరి. ఇటుల రెండు, మూడు పర్యాయములు ప్రయత్నించి ఈ చిత్రమైన విషయము తల్లిదండ్రులకు మొరపెట్టుకొనగ వారికి సన్యాసిదర్శనము కాలేదు అందువలన ఈ విషయమును తీర్థులవారిని ప్రశ్నించగా ఆశ్రమస్వీకారము ఒప్పుకొని దేశాంతరగతులై వెళ్ళిపోయిరి. ఈ సంఘటన అసాధారణమైనది. మన ప్రయత్నము కన్నా పూర్వజన్మ ఫలవిశేషము గొప్పదని అనుభవింపక తప్పదని ఈ ఉదంతము ఋజువుచేయుచున్నది. శ్రీనారాయణతీర్థులవారి భార్య పేరు "మహాలక్ష్మి" యనియు తీర్థులవారు సన్యసించిన పిదప ఆమెవారి శిష్యురాలై వారితో నాంధ్ర దేశమంతయు ప్రచారముగావించి క్రమముగా కాశీ చేరిరనియు శ్రీ పంగులూరి వీరరాఘవుడుగారు రచించిన "శ్రీమత్ అంధ్రమహాభక్త విజయము" అను గ్రంథమున వ్రాయబడి యున్నది. దక్షిణాదిన మరొక గొప్ప సంఘటన గురించి మీముందుంచుతాను. పరమాత్ముడు వరాహరూపంలో వచ్చి తీర్థులవారిని తనముట్టెతో కొట్టి తాను మార్గము చూపుచూ వరాహపురముచేర్చి అంతర్ధానమయ్యెను. భక్తుడు కోరకున్నను తన భక్తుని ఉద్ధరించుటకై తానే స్వయముగా దిగివచ్చిన ఈ ఉదంతము తీర్థులవారి అవిచ్ఛిన్నమైన, అపారమైన భక్తికి నిదర్శనమనియు ఆయన కారణజన్ముడనియు మనము సదా స్మరించుకొనవలసియున్నది.

తీర్థులవారు వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమును 12 కోట్లు జపమాచరించి సర్వేశ్వరుని స్వస్వరూపమును సాక్షాత్కరించుకొన్న మహాతపస్వి సిద్ధులు. (Ref: Dr. హేమామాలిని గారి వ్యాసం) తరంగభజన కాలక్షేపముతో సర్వకాల సర్వావస్థల యందు మునిగి తేలి పరమపదమునకు చేరిన కొందరి గాథలను, చిత్రములను సంపాదించి ఈ పుస్తకమున ప్రచురించితిని. యితర ప్రదేశములలోను, ఇచ్చటను అజ్ఞాతముగా ఎందరో తరంగములు గానము చేయువారు వుండవచ్చును. వారి వివరములను తెలియజేయలేని నా అశక్తతను చదువరులు క్షమింతురుగాక. ఈ గ్రంధ సంకలనము ప్రచురణలద్వారా అనేకమంది పుణ్యపురుషుల గాధలను అధ్యయనముచేసి నా చరమదశ సద్వినియోగపరుచుకొనే అదృష్టమును అనుగ్రహించి నన్ను కృతార్థుని చేసిన ఆర్తత్రాణ పరాయణుడగు సర్వేశ్వరునకు సదా నమోవాకములర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంధమునకు నేను కేవలం సంకలనకర్తను మాత్రమే. అన్ని విషయములు పూర్వాపరములు నాశక్తిమేరకు మీముందుంచినాను. శ్రీకృష్ణ లీలాతరంగిణి గ్రంథమును గురించి గ్రంథరచయిత శ్రీ సద్గురు నారాయణ తీర్థులవారిని గురించి జిజ్ఞాసులకు, భక్తులకు, కవులకు, పండితులకు, పరిశోధకులకు వీలైనంత ఎక్కువ సమాచారం లభింపచేయుటకు ప్రయత్నించి లభించినంతవరకు ఈ గ్రంథముద్వారా సమర్పించుచున్నాను. అర్హత ననుసరించి ఎట్టి నిషేధములు లేకుండా ఈ గ్రంధముద్వారా లభ్యమగు ప్రయోజనమును కులమత రహితముగా ఎల్లరునూ పొంది పురుషార్థపరులుగా జీవయాత్ర సాగించ వేడుకొనుచున్నాను. ప్రస్తుతం సనాతనమైన మన తరంగముల భజన బాణీని పునరుద్ధరించుటకై ప్రయత్నించవలసిన బాధ్యత మనపైనున్నది. తరంగముల భజనకు లయజ్ఞానము, శబ్దవిన్యాసము, గానము ప్రధమాలంకారములని భజనపరులకు చెప్పనక్కరలేదు. ఈ సమయమున యువకుడు, ఉత్సాహవంతుడు, కార్యదక్షుడు సంగీతవిద్వాన్ పోరూరి నరసింహారావు మన ఒంగోలులో నుండుట మన అదృష్టము. వారి తండ్రి పినతండ్రులు కూడా తరంగ భజన కాలక్షేపములలో సుప్రసిద్ధులు. లక్ష్మీనరసింహారావుగారు బాధ్యత వహించి ఇతర భజనపరుల సలహాసహకారములతో నొక పాఠశాలను స్థాపించుటకు పూనుకొనవలసినదిగా ఈ నివేదికద్వారా అర్థించుచున్నాను. అట్టి ప్రయత్నమునకు ప్రథమముగా నేను 10 వేలు ఇచ్చుటకు సిద్ధముగానున్నానని మనవిజేసుకొనుచున్నాను. పండితులు, భజనపరులు, కళాభిమానులు కలిసి కార్యక్రమమును నిర్ణయింపగలరని ఆశతో ఎదురుచూచుచున్నాను.

ఈ సంకలనముద్వారా ఎవరు ఎట్టి ప్రయోజనము పొందినను నాకు ఆనందమే. ప్రప్రథమంగా వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్స్‌వారు శ్రీకృష్ణ లీలాతరంగిణి గ్రంథమును తెలుగు భాషలో తాత్పర్య సహితముగా ముద్రించి కృతార్థులైరి. వారు చిరస్మరణీయులు

అనూహ్యమైన, ఆనందకరమైన ఒక చారిత్రాత్మక సంఘటనను చదువరుల ముందుంచుట అవసరము. శ్రీకృష్ణలీలా తరంగిణి రచయిత శ్రీ సద్గురు నారాయణతీర్థులవారు ఒంగోలు తాలూకా అద్దంకికి సమీప గ్రామమగు కాజ గ్రామ వాసులు. తరంగములకు తెలుగు తాత్పర్యమును వ్రాసినవారు వెన్నెలకంటి సుందరరామయ్యగారు ఒంగోలు సమీపమునగల టంగుటూరి నివాసి. వీరు సంస్కృతము, ఇంగ్లీషు, తెలుగు, తమిళము, మళయాళము, ప్రాకృతము, ఉర్దు, పార్శి మొదలగు ఎనిమిది భాషలయందు పండితులు. సంస్కృత భాషలోనున్న తరంగములకు తెలుగు ప్రతిపదార్థము అనుగ్రహించినవారు కీ.శే. దామోదర కృష్ణదాసు అయ్యగారు. (దామోదర రాధాగోపాలకృష్ణ దాసు, ఒంగోలు) గ్రంథ సంకలనమొనర్చినవారు ఒంగోలు వాస్తవ్యులు గుండ్లపల్లి ఆదినారాయణ భావార్థ సహితముగా ప్రచురించిన

ఈ కృష్ణలీలా తరంగిణి గ్రంథము ఒంగోలులో షిర్డి సాయి మందిరములో ప॥ ప॥ శ్రీశ్రీశ్రీ కుర్తాళం శివచిదానంద భారతిస్వామివారిచే 24-6-2000 అవిష్కరింపబడినది. ఇలాంటి అరుదైన పరిణామమునకు కారకులైన శ్రీ సద్గురు నారాయణతీర్థులవారికి నా నమోవాకములు.

మాకోరికను మన్నించి ఈ గ్రంథావిష్కరణ మొనర్చుచున్న శ్రీశ్రీశ్రీ ప॥ ప॥ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు కుర్తాళం శివచిదానందభారతిస్వామి వారికి నా నమోవాకములు.

గ్రంధ ప్రాశస్త్యము గురించి ఆసక్తితో తమ అభిప్రాయములను వ్రాసియిచ్చిన నాట్యావధాని, స్రష్ట, కవిపండితులు డాక్టరు ధారారామనాధశాస్త్రి, సహృదయుడు, సదాసత్కార్యాభిలాషి రిటైర్డ్ అధ్యాపకులు, వక్తలు అయిన గాలి వెంకటసబ్బారావుగార్లకు నా ఆశీస్సులు.

ఈ గ్రంధ విషయ సేకరణలో భక్తిశ్రద్ధలతో సహకరించిన శ్రీ వాణీ కళానికేతన్, చీరాల నిర్వాహకులుయైన చిరంజీవి సంగీత విద్వాన్ పోరూరి లక్ష్మీనరసింహారావు, బొమ్మరాజు పాండురంగారావు, ఘోరకవి సంపత్‌కుమార్, గుండ్లపల్లి సత్యనారాయణ, రాచపూడి చిదంబరంగార్లకు నా ఆశీస్సులు

ఈ గ్రంధ ముద్రణకు అవసరమగు సలహాలనుఇచ్చి ఓపికతో ప్రూఫునుసరిదిద్ది తోడ్పడిన సహృదయులు సంగీత, సాహిత్యవిద్యాకోవిదులు నిగర్వి ఒంగోలు తాలూకా ఇలపావులూరు వాస్తవ్యులు ప్రస్తుతం నెల్లూరు కాపురస్తులు అగు శ్రీయుతులు ఇలపావులూరి కామేశ్వరరావుగారికి కృతజ్ఞతాశీస్సులు ఈగ్రంధ ముద్రణకు అత్యంత శ్రద్ధ తీసుకొని శ్రమించి సహకరించిన మిత్రుడు శ్రీ మద్దాళి మోహనరావు. అయన కోడలు శ్రీమతి కామాక్షి, పి. దయాల్‌దాసుగార్లకు నా ఆశీస్సులు.

ఈ పుణ్యకార్యమునకు ఆర్థిక సహాయమొనర్చిన టి.ఆర్.యస్.రావు, జి.యస్.వి. సుబ్బారావు, బొల్లాపల్లి వెంకటసుబ్బారావు, మైనంపాటి హరినారాయణతీర్థులు, నరహరి విమలమ్మ పద్మనాభం గార్లకు నా హృదయపూర్వక ఆశీస్సులు.

వృద్ధాప్యములోనున్న నాకు కార్యక్రమనిర్వహణలో తోడ్పడిన మిత్రులు చీమలమర్రి వెంకటసుబ్బారావు, కలుజులపాటి సీతారామశాస్త్రి, బొల్లాపల్లి వెంకటసుబ్బారావు, రుద్రవరపు వాసుదేవరావుగార్లకు నా హృదయపూర్వక ఆశీస్సులు.

గ్రంథావిష్కరణ కార్యక్రమమునకు తమ మందిరమును ఇచ్చి తోడ్పడినందుకు శ్రీషిర్డిసాయి కార్యవర్గము వారికి నా కృతజ్ఞతలు.

జీవితము చరమదశలో దృష్టిలోపించినది. అయినా నాకుటుంబసభ్యులు నాకుమారుడు చి॥ వెంకటకృష్ణయ్య, దౌహిత్రుడు చి॥ మైత్రేయ, యం. నత్యనారాయణ (నెల్లూరు) కూడా గ్రంధ ముద్రణలోపరహితముగా నుండుటకు ప్రయత్నించినారు. అయినా నాకు తృప్తికలుగలేదు. తప్పొప్పుల పట్టికకూడా ముద్రించినాము. ముద్రణ దోషములకు క్షమింప వేడుచున్నాను.

ఒంగోలు
24-06-2000

అర్తత్రాణ పరాయణస్య భగవాన్ శ్రీమన్నారాయణోహరిః
సదావిధేయుడు
సంకలనము, సమర్పణ
గుండ్లపల్లి ఆదినారాయణ

# శ్రీకృష్ణలీలా తరఙ్గిణి ప్రశంస

రచన నరకేసరి పాదరేణువు, గాలి వెంకటసుబ్బారావు, రిటైర్డ్ టీచర్ - ఒంగోలు

*అయి నంద తనూజ, కింకరం పతితం మాం విషమే భవాంబుధే*
*కృపయా తవపాద పంకజ స్థిత - ధూళీ సదృశం - విచింతయ*

"కృష్ణా నేను నీ సేవకుడను అయినను ఎట్లో ఈసంసార సాగరంలో పడినాను నన్ను రక్షించి నీపాద పద్మముల యందు - ఒక దూళి కణముగా నన్ను చేర్చుకొమ్ము" అని చైతన్య ప్రభువు - కృష్ణుని ప్రార్థించినాడు. కృష్ణుడు సచ్చిదానంద స్వరూపుడు జ్ఞాన విగ్రహుడు, అవ్యయుడు, అనంతుడు -- సర్వకారణములకు కారణమైనవాడు. గోవిందుడు.

కృష్ అంటే జన్మపరంపర. 'న' అంటే నివారించేవాడు. అని అర్థం. జన్మ పరంపరలను నివారించగల శక్తి సంపన్నుడు కృష్ణుడని తెలిసి బుధులు అనేక రీతులలో కృష్ణుని అర్చించినారు. బహుజన్మముల సుకృత ఫలితంగా చరమజన్మలో కృష్ణభక్తి లభ్యముకాగలదని శాస్త్రములు ఘోషించుచున్నవి

జయదేవుడు, లీలాశుకుడు --- సూరదాసు -- మీరాబాయి --- పురందర దాసు ---మున్నగు భక్తులు అచ్యుతునిపై కీర్తనలు రచించి, పాడి, బాలగోపాలుని సన్నిధిని చేరినారు. శ్రీనారాయణ తీర్థులు, ఈ కోవకు చెందిన భాగవతోత్తముడు. శ్రీకృష్ణలీలా తరంగిణి - నారాయణ తీర్థకృతము ఈగ్రంథము భక్తిరస ప్రధానమైనది. శ్రీకృష్ణ ప్రాదుర్భావముతో ప్రథమ తరంగము నారంభించి, రుక్మిణీ కళ్యాణముతో ద్వాదశ తరంగములు పూర్తికావించి, శ్రీతీర్థులవారు ధన్యజీవులైనారు.

శృంగార రసభర సంగీత సాహిత్య లహరి ఖేల సంగమముగా ఈ గ్రంథము భాసించినది. విశిష్టాద్వైత, అద్వైతములకీ గ్రంథము నెయ్యమును కూర్చినది. - శ్రీ మద్భాగవతము, భగవద్గీత, బ్రహ్మ సూత్రములు విష్ణుపురాణము - విష్ణుసహస్ర నామముల సారమెరింగిన వారికి - శ్రీకృష్ణలీలా తరంగిణి అవగతము కాగలదు. ఉపనిషత్సారమే - శ్రీతీర్థులవారి హృదయము నుండి శ్రీకృష్ణ లీలా తరంగిణిగా వెలువడినదని పండితుల విశ్వాసము.

ఈ గ్రంథమునందు శ్రీ మన్నారాయణుని నామరూప లీలా వైభవములు - వర్ణితములైనవి. కృష్ణచరితమును ఆధారముగా - వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధ చతుర్ వ్యూహములు - శ్రీకృష్ణ లీలా తరంగిణి యందు వివరింపబడినవి.

నారాయణాయ - మాధవాయ -- గోవిందాయ - అచ్యుతాయ -- నందాత్మజాయ - గోపాలాయ - శ్రీ వెంకటేశాయ -- రమానాథాయ గోపీజన వల్లభాయ - కృష్ణాయ - అనంతాయ -- పురుషోత్తమాయ. మున్నగు సహస్రాధిక సంభోధనములతో శ్రీ నారాయణతీర్థులవారు లక్ష్మీనాధుని స్తుతి చేసినారు. ప్రతి తరంగములోను, ప్రతి చరణమునందును నామ వైభవము విశదీకరించబడినది.

శ్రీయఃపతి - నేత్రములు -- వికజ, కమల సన్నిభములట -- శేషశాయి [illegible] కుండలముల కాంతి, సమస్త దిక దిశతిమిర భారమును మథించునట - స్వామి [illegible] దివ్యతనువును ధరించెనట. గోవిందుని, నయనార విందములు కారుణ్య రసమును వర్షించును. [illegible] సౌందర్యము మదనకోటి లావణ్యమును గేలిసేయునట - [illegible] మంగళకరములట - రూపవైభవమిట్లు బహులీలలు - ఉగ్గడించబడినవి

తరంగములయందు నారాయణుని గుణగణములు భక్తి హృదయరంజకముగా [illegible] నారాయణుడు అగణిత - కళ్యాణ గుణములకు నిధి. ధరణీపతి ఉచ్ఛ్వాస, నిశ్వాసములుగా [illegible] వెలువడినవి. పరమాత్మ భూమి స్వరూపుడు. నానా చరా చర సకనారీ రూపములు [illegible] గోచరించుచున్నాడు. రమాపతిని స్మరించిన వారికి భయ శోకములుండనేరవు స్వామి [illegible] భావ - మహోదారుడు - మదనజనకుని జ్ఞానబోధ - నిర్మల గంగా ప్రవాహమై జనన మరణ [illegible] నుండి జీవుల నుద్ధరించును. శ్రీ వెంకటేశుడు భక్తజన సులభుడు. పద్మనాభుని స్మరణము [illegible] సుఖసారము.

ఇట్లు శ్రీ నారాయణతీర్థులు, నాదబ్రహ్మ ఉపాసనకు సాధనముగా శ్రీకృష్ణ లీలాతరంగిణిని రచించి తాను శ్రీకైవల్య పదమును చేరుటయేగాక, భవసాగరమున మునిగిన [illegible] కృష్ణభక్తియను నౌకయందు చేర్చి ముక్తి మార్గమును చూపినాడు.

శ్రీ తీర్థులవారు -- స్వయముగా ఒంగోలు మండలవాసులకు తరంగముల గానముచేయు పద్ధతి విధానము నేర్పినారు. గుండికానది తీరములో నృసింహ పదసన్నిధిలో తీర్థులవారి శిక్షణము నందు ఒంగోలు భాగవతోత్తములు - తరంగ గానములో విలక్షణమైన సాంప్రదాయమును నెలకొల్పినారు. చదలవాడ రఘునాధుని సన్నిధిలో మల్లవరపు శ్రీనివాసమూర్తి కొలువులో వార్షికముగ తరంగ కాలక్షేపములు నేటికిని జరుగుచున్నవి. ప్రాచీనులు సంగీత సాహిత్యముల యందు దిట్టలుగాన, తత్త్వము [illegible] తెలిసి, అనుభూతితో తరంగ గానము చేసినారు. ఒడలు మరచి, - కనుల ఆనంద భాష్పములొలుకగా, [illegible] తరంగ గానమునుచేసి, తమ హృదయ కమలములను కమలలోచనునకు కానుకగా [illegible] గాయకులొసంగినారు.

పూజ్యులు శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణగారు బాలకృష్ణుని భక్తులు, నవ దశాబ్దములలో వారు ప్రాచీనుల - తరంగ కాలక్షేపములలో పాల్గొని, పరమాత్ముని విభూతి, వైభవముల - హృదిలో నింపుకొనినారు - శ్రీ బొమ్మరాజు కృష్ణమూర్తిగారు - ఆర్ద్ర చిత్తముతో - తరంగముల గానము చేయుచుండగా, శ్రీ ఆదినారాయణగారు పరవశులై, కన్నీరు కార్చుచూ, మాధవుని చిత్తములో ప్రతిష్ఠించుకొన్న దృశ్యమునకు ఈ రచయిత - ప్రత్యక్ష సాక్షి.

కృష్ణ భక్తుడునూ, పండితుడైన శ్రీకృష్ణదాసుగారు, ఒంగోలు భక్తులకు తరంగముల ప్రతిపదార్థ సహితముగా బోధించియున్నాడు. ఆనాటి భక్తులలో కొందరు శ్రీకృష్ణదాసుగారి బోధనలను వ్రాసియుండిరి. ఆ ప్రతి శ్రీ ఆదినారాయణ గారికి లభ్యమైనది. బాలగోపాలునిపైగల భక్తితో తీర్థులవారిపైగల గౌరవముతో శ్రీకృష్ణలీల తరంగిణియందుగల ఆసక్తితో శ్రీ ఆదినారాయణగారు పై గ్రంధమును అర్థసహితముగా ప్రచురణ గావించినారు. కృష్ణునిపై ప్రజలకు భక్తి వున్నంతకాలము, సంగీతసాహిత్యములపై అభిమానము ఆదరణము వున్నంతకాలము, ఈ గ్రంధమును, ప్రచురణము గావించిన శ్రీ ఆదినారాయణగారిని ఆంధ్రజాతి మరువజాలదు.



# ఋణత్రయం

డా. ధారారామనాథశాస్త్రి

నమ్మశక్యంగాని లోకోపకార సత్కార్యాలు లోకంలో జరుగుతుంటే వాటినిచూచి తలయూచి ఉప్పొంగి పోవడమేకాక ఉడుతాభక్తి ఉడుగర లర్పించడం - ఇదీ ప్రస్తుత ఘట్టం. దానికి సంబంధించి నాలుగు మారులు నివేదించుకోవటం ఈ జన్మకి ఋషులెవరో ప్రసాదించిన అదృష్టంగా భావించి ఆపనికి పూనుకోవటం తప్ప అందుకుతగ్గ యోగ్యతాధికారాలు కానీ పాండితీవిశేషాలు కానీ ఉన్నాయనే అహంకారంలేదు. అదిన్నీ మా పంతులుగారి, అంటే మా అందరికి పరమగౌరవాస్పదులైన పెద్దలు శ్రీ గుండ్లపల్లి ఆదినారాయణగారి ఆదేశం కాబట్టి.

గుండ్లపల్లి ఆదినారాయణగారంటే ఇప్పటి ప్రకాశం, నెల్లూరు, గుంటూరు జిల్లాలకేకాక యావదాంధ్రంలోను పేరెన్నికగన్న నిష్కళంక దేశభక్తులు, స్వాతంత్ర్య సమరయోధులు. ఆతరానికి చెందిన సగటు దేశభక్తులు చాలామంది జీవితవిశేషాలూ కథలూ గాథలు, ఆశలూ ఆశయాలూ, చదువుతూ సాములు బేరీజు వేసుకుంటే నాకనిపిస్తుందీ "తొలుత వాళ్లంతా ధర్మబద్ధమైన జీవితానుభవంలో పండిన భోగులు" అని. గృహస్థధర్మాన్ని చక్కగా నిర్వర్తిస్తూ, అతిథి అభ్యాగత సేవచేస్తూ సాధుసత్పురుషుల సత్కరిస్తూ, కవిపండితులను గౌరవిస్తూ, పీఠాధిపతులకు పీటవేస్తూ, కుటుంబం తామరతంపరగా ఇల్లు శ్రీనివాసంగా వృద్ధిలోకి వస్తుంటే అందలి ఆనందమాధుర్యాలను సాక్షీభూతులై ఆనందిస్తూ ఉండటం అదోభోగం. ఆ అర్థంలో మాపంతులుగారు మంచిభోగి.

ఇప్పటికి దాదాపు ఎనభై ఐదేళ్లు పైబడిన వార్ధక్యంలో వున్నా (క్షమించండి యౌవ్వనంలో) ఆయన దేశం, ప్రజలు, వారి పురోగతి వంటి మంచి విషయాల గురించి స్పందించే నిండుగుండెకల నిండుకుండ. దేశానికి నేనేం చేశాను? అన్న ప్రశ్నతప్ప దేశంవల్ల నాకేమిటి? అన్న ప్రశ్ననెరుగని త్యాగి. స్వాతంత్ర్యసమర మహోద్యమంలో ఎంత కోల్పోయినా, ఎన్నాళ్లు చెరసాలల్లో మగ్గినా, ఎన్ని క్లేశాలకు తెల్లవాడు గురిచేసినా సహించి ఉద్యమ నేతృత్వం వహించి స్వతంత్ర్య భారతాన్ని తమజీవితకాలంలోనే రూపొందించుకొని అందలి మంచిచెడ్డలను, వెలుగు నీడలను మననం చేసుకుంటూ పవిత్ర జీవితం గడుపుతున్న అలనాటి ఆసాముల తరానికి మా ఆదినారాయణగారు ప్రతినిధి. జాతిపిత బాపూజీ, గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామిసీతారాం) ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపతులుగార్ల ఆశయాలు ఆచరణము ఆదర్శాలుగా స్వీకరించి జీవయాత్ర సాగించుచున్న ధన్యజీవి. అందుచేతనే ఆయన త్యాగశీలం అందరికీ ఉపాధేయము అని మాదృశులము పదేపదే అనుకుంటాం.

భోగము, త్యాగము అయ్యాక అనుభూతికి రావలసింది, బహుశా ఈత్రయంలో గరీయసియోగమనుకుంటాను. పంతులుగారి యోగాన్నిగూర్చి చెప్పటం నాప్రధానోద్దేశ్యం. గీతాచార్యులు ఒకచోట సమత్వం యోగఉచ్యతే అని, ఒకచోట యోగఃకర్మశుకౌశలం అని, మరొకచోట తపస్వీకంటే జ్ఞానికంటే కర్మిష్ఠికంటే యోగి అధికుడనిచెప్పి యోగిని సర్వాధికస్థానంలో నిలిపాడు. పంతులుగారి యోగం

చాలాగొప్పది. అనేక విషయాలు మనసులో పెట్టుకొని ఈమాట అంటున్నాను ఉపనీతుడైన నాటినుండి ఏ సంధ్యావందనంతోనో ప్రారంభమై ఆసాధన దేవతార్చనగానో, జపహోమ యజ్ఞక్రతు నిర్వహణగానో అన్నిటి సమాహారంగానో జీవన క్రమదశలలోని సుఖదుఃఖాల పెనవేసుకుంటూ అతీతంగా ఉంటూ మొత్తంమీద ఒక పరిస్థితిని ఒక సంస్కారాన్నీ జన్మజన్మల పాథేయంగా ఆయనకి లభించిందనుకుంటాను అంచేత ఏవృత్తిలో ప్రవృత్తిలో మసలుతున్నా ఆయోగస్పర్శను మరువని వైనం ఆయనలో కన్పిస్తుంది ఆయన వ్యవసాయం చేసినా, వ్యాపారం చేసినా, నాటకాలు వేసినా, సభలు నడిపినా అన్నిటా యోగి అన్పిస్తాడు. తన్ను గురించి ఇతరులు నాలుగు మంచిముక్కలు చెబుతుంటే ఒకరకమైన సాత్త్వికాహంకారంతో మొదలై రాజస తామస మార్గాల వెర్రితలల ప్రతిస్పందనను ప్రతివాళ్లు ప్రదర్శించే ఈ ప్రచారయుగంలో రాగద్వేషాలకి - సుఖదుఃఖాలకి దూషణ భూషణలకి చలించక చాతైన మటుకు కొన్ని మంచిపనులు చేద్దాం అనుకోవటం, అనుకోవటమేమిటి తక్షణం ఆచరించటం అదొక యోగం.

ఆమధ్య పంతులుగారి షష్టిపూర్తి జరిగింది. ఎవరోమిత్రులు ఓసంచిక వేద్దామని సూచించారట ఆయన అంగీకరిస్తూనే అది కేవలం తన విషయాలకు పరిమితం కాగూడదని సామాజిక ఉపయోగంకల ఓ మంచి సంచికగా రూపొందాలని సంకల్పించారు. దేశభక్తులు, విజ్ఞాన మూర్తులు స్వా.స.యో కీ శే రామచంద్రుని వెంకటప్ప అనే మహామనీషిని తన యింట నిలిపి అస్మదాదులైన కవిపండితులచేత ఆసంగతి, ఈ సంగతి స్వీకరింపించి వెంకటప్పగారి నేతృత్వంలో ఒక వాఙ్మయయజ్ఞం నిర్వహించి మంచి సంచిక తెచ్చారు. అప్పటికీ ఇప్పటికీ ప్రకాశంజిల్లా విశేషాలకీ, భారత స్వాతంత్ర్య సమర చరిత్రకీ అదొక ప్రామాణిక విజ్ఞాన సర్వస్వం. పంతులుగారి యోగజీవితంలో ఋణవిమోచన ఘట్టాలలో అది మొదటిది

ఇంతకీ ఆసంపన్న గృహస్థుకి ఋణమేమిటి? ఋణత్రయం ఎవ్వరికీ తప్పదు. తీర్చితీరాలి దేవఋణం దేవపూజాది కార్యక్రమాలతోనూ, పితౄణం సత్సంతానం తోనూ తీరుతవి. ఆ విషయంలో పంతులుగారికి బాకీలులేవు. ఇప్పుడీ పుస్తకంతో ఆయన ఋషిఋణం తీర్చుకుంటున్నారు. ఎలాగో మనవి చేస్తాను.

దేవఋణం తీర్చటానికి యజన, యాజన, ధ్యాన, జప, హోమ, భక్త్యాది కార్యక్రమాలతోబాటు సత్పురుషులు, సాధుపుంగవులు, ఋషులు, కవులు దైవ కథలను వివిధ వాఙ్మయ రూపాలలో సృష్టించి మానవాళికి ప్రసాదిస్తారు. సమకాలీనులు అనంతరకాలాలవారు ఆయాసద్గ్రంథాలను పఠించి, పఠించి, వ్యాఖ్యానించి, ప్రచురించి తద్గత సద్విషయవ్యాప్తికి దోహదంచేసి ధన్యులు అవుతారు. వారిని చూచి తరువాత తరాలవారు అలాగే చేస్తారు. ఈపరంపర వాఙ్మయ జగత్తులో అవ్యాహత, నిరంతర దీర్ఘసత్రం వంటిది.

ఈపరంపరలో కృష్ణతత్త్వ ప్రతిపాదకమైన మహాద్భుతసృష్టి కృష్ణలీలా తరంగిణి కర్త మానవాళికి ప్రాతః స్మరణీయులైన శ్రీశ్రీశ్రీ సద్గురు నారాయణ తీర్థులవారు. కృష్ణజననం మొదలు కంసవధ, కల్యాణం వరకు ఇతివృత్తంగా కల ఈ యక్షగానం విశ్వస్థాయిలో తరతరాల సహృదయ పరంపరను తన్మయులనుచేసి ధన్యులను చేస్తున్న ఒక మహాశక్తి. సంగీత సాహిత్య నృత్యాత్మకమైన కృష్ణలీలా తరంగిణి తాకని ఎత్తులుగాని, సోకని లోతులుగానిలేవు. నారాయణ తీర్థులవారు పదునేడవ శతాబ్దానికి చెందిన ఆంధ్రులు. కృష్ణాతీర కాజగ్రామం అభిజనం. ఇంటిపేరు తల్లావఝ్ఝలవారు. సర్వశాస్త్రకోవిదులు, తపస్సంపన్నులు, అనన్య

వాఙ్మయ రచనా శిల్పమూర్తులు అయిన తీర్థులవారు అద్వైత బ్రహ్మానంద స్వరూపులైన కృష్ణతత్వాన్ని సహస్ర ముఖాలుగా ప్రవచించారు. గృహస్థాశ్రమం తొలిరోజుల్లోనే విరక్తులై యత్యాశ్రమస్వీకారంచేసి తీర్థయాత్రాచణులై కృష్ణ బ్రహ్మానందానుభూతిని సర్వులకు అందించి తాము తరించి ఇతరులను తరింపచేసిన అవతారపురుషులని, దక్షిణదేశంలో సిద్ధిపొందారనీ ఇవన్నీ జగద్విదిత ప్రసిద్ధాంశాలు.

తీర్థులవారు తీర్థయాత్రాచణులై పాకనాటి సీమను పావనంచేసిన సందర్భంలో గుళ్లకమ్మతీర వాసులైన సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబాలవారు ఆయనదగ్గర తరంగాభినయాన్ని ఒక ప్రత్యేకమైన తాళలయాన్విత మార్గంలో అభ్యసించి ఆసంప్రదాయాన్ని ఊరూర, వాడవాడ వ్యాపింపచేసి జనాన్ని ఉర్రూతలూగించేవారట. కొన్ని రాత్రులకు రాత్రులు లయవిన్యాసము, రాసగానము, సంకీర్తన, యక్షగాన ప్రదర్శనలాంటి ప్రయోగాలు ఈప్రాంతంలో ప్రసిద్ధములై ఒక శిష్టతని, విశిష్టతని సంపాదించుకొని సువర్ణాక్షర పంక్తిగా నిలిచిపోయాయట. ఈప్రత్యేకమైన 'బాణి'లో తరంగిణి పొంగులెత్తి చెంగలించి నేలనాలుగు చెరగులు ముంచెత్తిందట. ఈ ఉద్యమంలో పెద్దలైన ఒజ్జల్లో - ఒజ్జబంతులలో రెండవ తరానికి చెందిన కొందరిని ఈ వ్రాయసగాడు దర్శించుకొని ధన్యుడైనాడు.

అలాంటి పెద్దల్లో మాపంతులుగారు ఒకరు. ఆయనకి తరంగిణికి చెందిన పూర్వోక్త సంస్కారం ఒక పురానిక్షేపం. దానిని ఆయన ఇన్నాళ్లూ, ఇన్నేళ్లూ ఒక చైతన్యస్ఫూర్తిగా శ్రవణ, మనన, పఠన, పాఠనాదిరీతుల్లో ఆరాధిస్తున్నారు.

ఇపుడు బాగా తలపండిన వేళ మదినిండిన ఈమహత్తుకు ఏవిధంగా రూపకల్పనచేసి ఋషిఋణాన్ని కొంతైనా తీర్చగలను అన్నతపన ఈ మనీషికి కలిగిందో ఏమో లేక తీర్థులవారు ఆశీర్వదించారో కీ. శే. శ్రీమాన్ దామోదరం కృష్ణదాసు అయ్యగారు అనే 'ఒక భక్తాగ్రేసరుడైన మనీషి తరంగిణికి రచించిన ప్రతిపదార్థగ్రంథం వ్రాతప్రతి పంతులుగారికి లభించింది. అదీ ఎలాగా? మైనంపాటి ధర్మరాజుగారు వ్రాసుకున్న నకలురూపంలో. ఇంకొకరైతే గ్రంథాన్ని భద్రంగా అటకకెక్కించేవారు. ఆదినారాయణగారు సంపన్నులు, అభిరుచి సంపన్నులు విశేషించి పూర్వోక్త విధానాన పరంపరాగత ఋషిఋణాన్ని తీర్చటానికి ఉద్యమించిన వారూ కాబట్టి గ్రంథ ముద్రణ, ప్రచురణ చేపట్టారు. ఇది నిర్మలము నిరహంకారము, బహుజన హితకరము అయిన పవిత్ర సంకల్పం. దీనివల్ల తరంగిణిలోని అర్థవిశేషాలు సామాన్యపాఠకునికి అందుబాటులో ఉంటవి. సర్వాంగసుందరమైన కృష్ణలీలా తరంగిణి అవతరించింది. ఇది ఆంధ్రులకు ఆదినారాయణగారు సమర్పించుకునే పారమార్థికసంపద.

తీర్థులవారు కృష్ణతత్వాన్ని యక్షగానంగా రోళ్లారోకళ్లా పాడించి దేవఋణాన్నీ, ఋషిఋణాన్నీ (కృష్ణుడు, వ్యాసుడు) తీర్చుకున్నారు. పాకనాటి భాగవత పరంపర తరంగ కాలక్షేపంచేత ధన్యులై తీర్థఋషి ఋణం తీర్చుకున్నారు. ఇంతమంచి పుస్తకాన్ని మనకిచ్చి పంతులుగారు ఋషిఋణం తీర్చుకొని తాను ఋషితుల్యులైనారు.

మరి మనం? ఈ పుస్తకాన్ని చదివి, అర్థంచేసుకొని కృష్ణతత్వ స్పర్శను పొంది కృష్ణదేవఋణాన్నీ, వ్యాసులవారితో ప్రారంభమైన ఋషిఋణాన్నీ తీర్చుకోవాలి. కృష్ణపరమాత్మయొక్క, ఆయనకాలికి గజ్జెకట్టించి నృత్యం చేయించిన తీర్థులగారియొక్క కృపావిశేషంచేత పంతులుగారు శతాధిక ఆయురారోగ్యవంతులై సకుటుంబ తామర తంపరగా వర్థిల్లి ఇలాంటి మంచిపనులు ఇంకా ఇంకా చేయాలి అంటూ ఆదినారాయణగారికి అయిదుపది.

# శ్రీ తీర్థనారాయణస్వామి జీవిత సంగ్రహము

## కుమారి నే. హేమమాలిని

*శ్రీ వి. అ. కృష్ణస్వామి గారి తమిళ మిందులకుమూలము*

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ
సమ్భవామి యుగే యుగే.

అను భగవానుని ప్రతిజ్ఞ ప్రకారము భగవంతుని ఆజ్ఞచేత ఈ మహానుభావుడు క్రీ.శ 1675లో ఆంధ్రదేశమున గుంటూరుజిల్లాలోనున్న మంగళగిరి అను క్షేత్రమునకు సమీపమున "కాజ" అను కుగ్రామమున "తిల్లవత్సల" బ్రాహ్మణ కుటుంబమున శ్రీ గంగాధరుడు శ్రీమతి పార్వతి అను దంపతులకు పుత్రుడుగ నవతరించి "గోవిందుడు" అను నామముతో పరమభాగవతుడుగా ప్రకాశించెను. అతి బాల్యమునుండియే ఈయనకడ ఏర్పడినట్టి "కృష్ణప్రేమ" అభివృద్ధిచెంది ఇతని హృదయకమలమునందే వేర్లతో పాతుకొనినట్టి ఒక గొప్ప వృక్షమైనది శ్రీ గోవిందునకు 8-వ సంవత్సరముననే ఉపనయనము కావింపబడినది.! 'వాసుదేవశాస్త్రులు" అను పండితుని వద్ద 12 ఏండ్ల వఱకు విద్యాభ్యాసము సాగెను

అట్టియెడ శ్రీగోవిందుని స్వప్నమున ఒక యతీశ్వరుడు కనిపించి ద్వాదశాక్షరి మహామంత్రమును పంద్రెండుకోట్లు జపము కావించినచో శ్రీకృష్ణభగవానుడు ప్రత్యక్షము కాగలడు. అని పలికి అదృశ్యుడయ్యెను. వెంటనే శ్రీగోవిందుడు తన తల్లిదండ్రుల అనుమతిని పొంది, దివ్యదేశయాత్రలో పాదచారిగనే బయలుదేఱి, "వేదాద్రి" అను పుణ్యస్థలము చేరి తపముచేయ దొడంగెను. శ్రీకృష్ణ పరమాత్ముడు మునుపటివలెనే మరల యతిరూపమున కనిపించి శ్రీగోవిందునకు ద్వాదశాక్షరిమంత్రము నుపదేశించి అంతర్ధానమొందెను.

శ్రీగోవిందుడు, తనకు జీవితరత్నముగా లభించిన ద్వాదశాక్షరిని కోట్లలెక్కలో ఉపాసించి యోగసిద్ధులను, ఆత్మజ్ఞానమును పొంది, శ్రీకృష్ణపరమాత్మనే ధ్యానించుచు, కాశి క్షేత్రమున నివసించుచుండిన శ్రీ శివరామానందతీర్థయతిని చేరి, ఆయనకు ప్రధమ శిష్యుడై ఉపదేశముపొంది, సన్న్యాసాశ్రమమును స్వీకరించి, తన గురుని అనుగ్రహముచేత "శ్రీనారాయణతీర్థ" నామధేయమును ధరించి సదాచార్యుడుగా ప్రకాశించుచుండెను.

ఇట్లు గోవిందుడు కాశిలో తప మాచరించి కీర్తిగడించి అనేకులను శిష్యులను ఆదరించి కరుణామూర్తియు కమలనేత్రుడునగు కృష్ణుని ఎటులైన ప్రత్యక్షముగ దర్శించియే తీరవలయునను సంకల్పముతో తిరుపతిని చేరి శ్రీవేంకటేశుని దర్శించి, అచటనే నివసించుచుండెను. కాని, తిరుపతి వేంకటేశుని సంకల్పము వేఱుగనుండినది. శ్రీతీర్థులను అవల కంపి ఆయన పూనిన అవతార ప్రయోజనమును సంపూర్తిగావింప తీర్మానించి, ఆయనకు తీరని కడుపునొప్పిని కలిగించెను

ఒకదినము శ్రీవేంకటేశ్వరుడు శ్రీతీర్థ నారాయణుని స్వప్నమున శ్రీ శివరామానందుల రూపమున కనిపించి "ఓప్రియా, కావేరీ తీరమున నున్న భూపతిరాజపురము అనుక్షేత్రము నావాసస్థలము. నీవచ్చోట కేగినచో నీ ఉదరబాధలతోబాటు మనోవ్యాధియు తొలగిపోగలదు'అని అనుగ్రహించి అంతర్ధానము చెందెను. పిదప శ్రీతీర్థనారాయణుడు తన గురునాధుని ఆజ్ఞను శిరసావహించి తిరుపతిని వీడి పాదచారిగనే దక్షిణదిశాభిముఖముగా పయనించి పలుదివ్యక్షేత్రముల నన్నింటిని దర్శించుచు, శ్రీకృష్ణధ్యానమగ్న చిత్తుడై ప్రపంచమునకే అద్వితీయారామముగా ప్రకాశించు చోళదేశ రాజధానియగు తంజావూరు కుత్తరమున కావేరికిదక్షిణమున, త్రిదేవప్రస్తుతమును శివలింగ మహిమాంచితమును శ్రీ అప్పర్‌స్వాముల మఠముండు చోటును పంచనదక్షేత్రమున చేరి ధర్మసంవర్ధినీసమేత శ్రీ ప్రణతార్తిహరుని దర్శించి, అటనుండి పడమరగా సుమారు 4 మైళ్ళ దూరమున నున్న మధ్యకావేరి అను గ్రామమును చేరి, కావేరీనదీ తీర్థమున వెలసియున్న ఒక మహాగణపతి ఆలయమున రాత్రిని గడిపి కడుపు నొప్పిని భరింపజాలక విలవిలక లాడుచునే నిష్ఠతో కూర్చుండెను

శ్రీరామకృష్ణపరమహంసకు సన్న్యాస ప్రదాత తోతాపురిస్వాములకు కడుపునొప్పిని కలిగించినవిధముగను, "కూత్తాయినవారు విలక్కిలీర్"అను తేవారపు ప్రబంధమును బుట్టింప "శ్రీ తిరునావుక్కరశు' (అప్పర్) స్వాములకు ఈశుడు శూలరోగమును కలిగించినవిధముగను, తన్ను గుఱించి అజరామరమగు ఒక సంగీత కావ్యమును సృజించుటకే శ్రీ శ్రీనివాసుడు శ్రీ తీర్థనారాయణునకు కడుపునొప్పిని ప్రసాదించె నేమో! తన్ను సమీపించిన భక్తుని గాంచి భగవంతుడు పరమానందము చెంది శంఖచక్రగదాపాణియై కనిపించి "భక్తశిఖామణీ, తిరుపతిలో నేను పూర్వము తెలిపినవిధముగా, రేపు ఉషఃకాలమున నీఎదుట గోచరించు నొకనిని అనుసరించి ఇటనుండి 4 మైళ్ళ దూరమున పడమటిదిశలో నా నివాసస్థలమైన భూపతిరాజపురమునకు వచ్చి చేరి ఆజీవి అంతర్ధానము చెందుస్థలమున నిలచినన్ను స్తుతింతువుగాక" అని యుగ్గడించి అదృశ్యుడాయెను. శ్రీ తీర్థులును కనుల దెఱచి శ్రీకృష్ణుని అనుగ్రహమును శిరమున ధరించి ఉషఃకాలమున వినాయకుని ఆలయమునుండి బయల్వెడలెను. శ్రీ వినాయకభగవానుడు తనతొండముతో అచట దృగ్గోచరమై నిలచు ఒక శ్వేతవరాహమును నారాయణునకు చూపి అద్దాని ననుసరించునట్లు సంజ్ఞగావించి అదృశ్యుడయ్యెను. అంతట శ్రీ తీర్థనారాయణుడు కేలు మోడ్చి కొంతదూరము ఆ ప్రాణిని అనుసరించి చనగా అయ్యది చంద్రలేఖాక్షేత్రమునకు తూర్పున దక్షిణముగా మరలి బ్రాహ్మణులు పలువురు నివసించు అగ్రహార మధ్యభాగమున ఒక మెట్టను చేరి నిలిచి తటాలున మాయమైనది.

వెనువెంటనే శ్రీ తీర్థనారాయణుడు శ్రీతిరుపతీశుని ఆజ్ఞను, మధ్యకావేరిలో వినాయక భగవానుడు నిజస్వరూపమును చూపి అదృశ్యుడైన విధమును మనమున తలచి ఆపుణ్యస్థల మిదియే యని గుర్తించి అచటనే అమరి అన్న పానాదులను విస్మరించి అమలుని స్మరించు "ఆపద్బాంధవా ఈదాసుని బ్రోవ వరాహరూపమున త్రోవ చూపి ఇచ్చటికి కొని తెచ్చిన కారణమేమి? మాయమై పోయినందుకు కారణమేమి? ఈదాసు ఒనరించిన అపచారమేమి? శూన్యములో నన్ను విడిచి ఆక్రందనల సల్పజేయుటయొక్క మర్మమేమి?" అని పలువిధముల విలపించి కన్నీరు కార్చి ఏడుదినములు అదేస్థలమున దీర్ఘధ్యానమున నమరెను.

నిష్ఠలోనుండు శ్రీ తీర్థనారాయణుని ఆర్తిని తీర్పదలచి ఎనిమిదవదినపు ప్రొద్దున కుంభమాసమున అష్టమితిథియు రోహిణీనక్షత్రమును అమృతయోగమును కూడినట్టి శుభదినమున శ్రీతీర్థులకు శ్రీ లక్ష్మీనారాయణభగవానుడు శిలారూపిగ మొదట దర్శన మొసంగి అదృశ్యుడయ్యెను వెంటనే విరాట్స్వరూపి విమలుడగు శ్రీ శ్రీనివాసుడును శంఖచక్రగదా పాణియై శ్రీతీర్థులకు దర్శన మొసంగి అదృశ్యుడాయెను మనమున నూహింపరానివియు, కలలోనైన చూడలేనివియు నగు నాదృశ్యములను కన్నులార గాంచి కేలుమోడ్చి కన్నీరు ప్రవహింప, తీరని ఉదరవ్యాధి కారణముగా నోరారస్తుతింప లేమిచే పంచాబ్దప్రాయుడగు ధ్రువునివలె చలనరహితుడైనిలిచెను శ్రీ తీర్థనారాయణుడు. వెంటనే చలనరహితత్వమువడసి యుండిన అవయవములు చలింపజొచ్చినవి. పెదవులు దెఱచుకొన్నవి మేను విస్మృతమయ్యెను కవిహృదయు ముప్పొంగినది. తన యెదుట దర్శన మొసంగిన రమాకాంతుని

"జయ జయ రమానాథా
జయ జయ ధరానాథా
జయ జయ - వరాహపుర
శ్రీ వేంకటేశా"

అని స్తుతించి పలు శ్లోకములను పాడెను

ఆపుణ్యదినము నుండియే భూపతిరాజపురము అను పేరుగలిగిన అయ్యగ్రహారము వరాహపురి (వరాహూరు) అని పేర్కొనబడుచు వచ్చినది.

ఇట్లు కొంతకాలము ఉదరవ్యాధి సంపూర్ణముగ తీరకుండగనే శ్రీతీర్థనారాయణుడు భగవానుని పూజచేయుచున్న తఱిని, శ్రీ వేంకటేశుడు ఒకనాటి రాత్రియందు అతని స్వప్నమున శ్రీ కృష్ణ పరమాత్మునిరూపమున కనబడి భాగవత దశమస్కంధమును సంగీత నృత్య తాళభావములతో "కృష్ణలీలాతరంగిణి" అను అజరామరమగు కావ్యమును సృజించుమ నాజ్ఞనొసంగి అదృశ్యుడాయెను. వెంటనే శ్రీతీర్థనారాయణుని హృదయమున ఘనీభవించి నిలిచియుండిన కృష్ణప్రేమయు, నాభియందు జ్వలించుచుండిన సంగీతైశ్వర్యమును, అంగాంగములందు దాగియుండిన నృత్యసౌందర్యమును బహిర్గతములై ప్రవహింప నారంభించినవి. కృష్ణపరమాత్ముడు స్వప్నమున నొసంగిన ఆజ్ఞను సంపూర్ణము గావింప నిశ్చయించి శ్రీమద్భాగవతముయొక్క తాళపత్రములను, పఱచినపుడు "మంగళాయ" అను వాక్యము ఒక పత్రముననను "మంగళమ్ రుక్మిణి" అను వాక్యము మఱియొక పత్రముననను గోచరించుటంజేసి. శ్రీకృష్ణపరమాత్ముని అనంత కళ్యాణగుణ విశేషములనుపాడి.

"అదౌ కృష్ణావతార
స్తదను నరహరే ర్బాలలీలావిలాసో
వత్సానామ్ పాలనం తచ్చరిత మథగవామ్
పాలనమ్ ప్రౌఢభావః"

అను ఆధారవాక్య ప్రకారము దేవకీ వసుదేవుల వివాహమునుండి ఒండు విడువక శ్రీ రుక్మిణీ కళ్యాణమువఱకు వ్రాసి పూర్తిగావించి ఆ గ్రంధమునకు "శ్రీకృష్ణుని లీలానది" అనునర్థము నిచ్చునట్టి "శ్రీకృష్ణలీలా తరంగిణి" అను నామధేయము నుంచెను. శ్రీతీర్థనారాయణు నొద్దనుండి భగవానుని కళ్యాణగుణములు తరంగములుగా ప్రవహించినవి ఆక్షణము నుండి యతని ఉదరవ్యాధి బాధయు పూర్తిగ పోయినది.

శ్రీతీర్థనారాయణుడు భగవంతుని ఆజ్ఞలను శిరసావహించి అగ్రహారవాసుల సహకారముచేత శ్రీలక్ష్మీనారాయణభగవానుడు శిలారూపియై పూర్వమే వెలసియున్న అదేస్థలమున ఒక దేవాలయమును నియమప్రకారము నిర్మించి తిరుపతీశుడే ఈయన అని గ్రహించి, ఉభయ దేవీసమేతముగ శ్రీవేంకటేశుని ఉత్సవ మూర్తిగా ప్రతిష్ఠ గావించి, (తిరుమలనాధునకు జరుగు విధముగనే) వైఖానసాగమవిధి ప్రకారము ఆరాధనలను ఏర్పఱచి, భగవంతుని ఆజ్ఞప్రకారము కృష్ణుని లీలల నింకను పాడుచు నిలిచెను.

తాను మధ్యకావేరియందు వినాయకభగవానుని సన్నిధానమున శ్రీ శ్రీనివాసుని స్వప్నమున గాంచి ఆయన యభిప్రాయమును గ్రహించినందున ఆవినాయక భగవానుని ఈ క్రింది విధముగ స్తుతించెను

"జయ - జయస్వామిన్ - జయ - జయ
జయ - జయ - జితవైరివర్గ ప్రచండ
జయ - జయ గజముఖ జయ వక్రతుండ"

అనుపాటను కృష్ణుని లీలల గేయములకు ఆది కీర్తనము గావించి, కన్నులు మూసి మనమున కృష్ణుని తలంచి కరగిగానవర్షము కురిపించెను:

ఈవిధముగ శ్రీశుక బ్రహ్మముఖమున వెడలిన శ్రీమద్భాగవతమున నున్న ప్రకారమును, అందు కాంచలేని కొన్ని రహస్యార్థములను, శ్లోకరూపమునను, పద్యములుగను, గద్యములుగను, శ్రీకృష్ణపరమాత్ముడు నర్తింపదగినట్లు, జతిక్రమములుగను స్తుతించి పాడెను.

ఒకదినము యతీంద్రుని హృదయమున ఒక శంక బయల్వెడలినది తాను రచించిన లీలా తరంగిణి పూర్తిగ దోషరహితమైనదేనా? లేక అవి దోషభూయిష్ఠములా? అద్దానిని భగవానుడు సంపూర్ణముగ నంగీకరించెనా? కృష్ణ పరమాత్ముడు ఆయనలీలలను స్వీకరించినది నిజమైన యెడల తాను పాడు ఒక్కొక్క దానిని అంగీకరించుటకు చిహ్నముగ భగవానుని శ్రీపాదములు ధరించియున్న గజ్జెలధ్వని "ఘల్లు ఘల్లు' ' మని తనకు వినబడవలెనని తనకు తానే ఒక నియమమును పూని, పరమాత్ముని మది దలంచి "సంగీతసరససల్లాపా" అని పలికి

"ఏహి ముదం దేహి శ్రీకృష్ణకృష్ణ
మామ్ పాహి గోపాలబాల కృష్ణ కృష్ణ"

అని పాడినంత, భగవానుడు తనభక్తుని యలరింప గీతమునకు తగినరీతిని తనకాలిగజ్జెల శబ్దముచే సూచించి కళానర్తనమాడ గాంచి వేదములాశీర్వదించినవి; దేవతలు పుష్పవర్షము కురిపించిరి. వాద్యముల బోరు చెలంగెను. ఇక తమగ్రామమునకు మంచికాలము వచ్చిన దని అధీత వేదులైన ద్విజులును శ్రీతీర్థనారాయణుని, శ్రీవేంకటాచలపతిని స్తుతించి మోకరిల్లిరి.

వరాహపురసన్నిధానమున శ్రీతీర్థనారాయణుడు భక్తులకు పూర్వార్జితపుణ్యముగా వీడివసిన భజనచైతన్య సంప్రదాయములును ప్రతి సంవత్సరము ఆచరించి చూపిన గోకులాష్టమి, ఉట్టిగొట్టుట, సిక్యోత్సవములాదిగ గల మహిమలను వరాహపుర శ్రీవేంకటేశ సాన్నిధ్యమహిమా ప్రభావములను, వానికి కారణభూతుడుగా వెలసిన శ్రీతీర్థనారాయణుని అరుదైన మహిమలను, అద్వైతమునుండి చిలికి ఆయన రచించిన తన కావ్యమున చేర్చిన తాత్పర్యములను అంతర్గర్భమున దాల్చి సాటిలేని రత్నముగ ప్రకాశించు ఈకావ్యము, ఆయన పెన్నిధులుగ అనుగ్రహించిన 12 తరంగముల నుండియు కొన్ని భాగముల నేఱి, ఒక్కొక్కదానికి ఉపనిషత్తత్త్వ రహస్యార్థములను భక్తులు సులభముగ అర్థమెఱుంగురీతిని విడివిడిగా వ్రాసియుండుట ఆస్తికుల భాగ్యమే.

శ్రీలీలాతరంగిణివంటి నాదప్రవాహముచే భగవానుని స్తుతించి ఆనందసాగరమున మునిగి, పలు శిష్యకోట్లు పరవశించి జీవించిన సమయమున ఒకదినము శ్రీతీర్థనారాయణుడు నిద్రింపకే నిద్రించుచున్న మహానందనిష్ఠలో శ్రీకృష్ణ పరమాత్ముడు సాక్షాత్కరించి, "ఓ ప్రియా, ప్రాపంచికు లెఱుంగునిమిత్తము, వరాహపుర శ్రీవేంకటేశ మాహాత్మ్యము, శ్రీలీలా తరంగిణి అను వీని అరుదగు మహిమలను నీ మూలముననుం నీభక్తకోటుల మూలముననను, వ్యాపింపజేసి నామహిమయు నీమహిమయు అభివృద్ధిజెంది, నీ దైవికశక్తియు, సాన్నిధ్యమును, కోటికాలమువఱకు వ్యాపించి, నిన్ను ధ్యానించిన వారందఱుకు పలుకోట్ల పుణ్యమును, పేరుప్రతిష్ఠలును, నాకరుణచే ప్రవహించునట్లు అనుగ్రహింతును. నాకృపచే నీవు జీవన్ముక్తుడవై యుండి, నాయందలి భక్తిని వ్యాపింపచేసి, నీయిచ్ఛవచ్చినపుడు నన్ను వచ్చి చేరుదువుగాక" అని అనుగ్రహించి అదృశ్యుడయ్యెను.

వరాహపురియందు తనచే స్థాపింపబడిన అలమేలుమంగాసమేత ప్రసన్న వేంకటేశ్వరుని తన భక్తకోటిని వీడలేకున్నను ఎట్లో వీడ్కోలుబడసి శ్రీకృష్ణపరమాత్ముని ఆజ్ఞను శిరమున ధరించి శ్రీనారాయణతీర్థుడు వరాహపూరిని వీడి దివ్యదేశయాత్రలో ఆంధ్రదేశమును చేరినట్లు కొందఱి యభిప్రాయము.

కానివరాహపురి శ్రీనారాయణకవి రచించిన, "శ్రీకృష్ణసిక్యోత్సవ" చంపు ప్రబంధ ప్రథమభాగమున 93-వ శ్లోకమున చెప్పినరీతిని,

> "క వేర కన్యా పరిపూత పార్శ్వే<br>
> శ్రీపుష్ప వాటీశ్వర వాసధన్యే<br>
> గ్రామేశ నారాయణ తీర్థనామా<br>
> యతిః ప్రపేదేహి - వికుంఠ లోకమ్!!"

అనగా శ్రీతీర్థనారాయణుడు పంచనదులలో నొకటగు పవిత్రకావేరినది పుణ్యతీర్థ స్పర్శను పొంది, శ్రీపుష్పవాటీశ్వరుడు వెలసియున్న పుణ్యగ్రామమును చేరి జీవన్ముక్తు డయ్యెను అని తెలియుచున్నది.



# శ్రీకృష్ణలీలా తరఙ్గిణిలో భక్తితత్త్వము

## శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు

శ్రీనారాయణతీర్థులవారు రచించిన శ్రీకృష్ణ లీలాతరంగిణి యక్షగానశాఖకు చెందిన దృశ్య ప్రబంధము. గద్యములు శ్లోకములు కీర్తనలు సమానప్రౌఢిమాధుర్యములతో ఒప్పుచున్నవి. ఇందులో సాహిత్యము సంగీతము నృత్యము అభినయము ఏకమై సంపూర్ణత నొందినవి. ఔపనిషదులు భావించు బ్రహ్మానందమే ఇందులో నాట్యస్వరూపముగా ప్రదర్శింపబడుటచే, భక్తిసాహిత్యములోనే కాక విశ్వసాహిత్యములోనే సాటిలేని ఉద్గ్రంథమిది.

దీనిని రచించిన శ్రీనారాయణానందతీర్థులవారు తీర్థసంప్రదాయమునకు చెందిన పరమహంస యతీశ్వరులు. వారు తురీయాశ్రమము స్వీకరించినది కంచిలో శ్రీశివరామానందతీర్థులవారియొద్ద. వీరి పూర్వాశ్రమ నామము గోవిందశాస్త్రి. గుంటూరు మండలములో మంగళగిరిసమీపమందలి కాజగ్రామములో వీరుజన్మించిరి. ఇంటిపేరు తల్లావఝ్ఝులవారు. వీరి సోదరుడైన నరసింహశాస్త్రి సంతతి నేటికిని ఆప్రాంతములలో శాఖోపశాఖలై వర్ధిల్లుచున్నది. ఆవంశములో పలువురుభక్తులును విద్వాంసులును మాత్రమేకాక సన్న్యాసాశ్రమము స్వీకరించినవారును కలరు

ఈనాట్యప్రబంధము రచించిన నారాయణతీర్థులవారు షట్శాస్త్రముల పారమెఱిగిన విద్వదగ్రేసరులు. బహుకాలము వీరు కాశిలో నుండి 'భాట్టభాషాప్రకాశ' మనుపూర్వమీమాంసా గ్రంథమును రచించిరి. శాండిల్యభక్తిసూత్రవ్యాఖ్య మొదలగు ఇతర గ్రంథములను గూడ రచించిరి. వీరు బ్రహ్మ విద్యోపదేశము చేసిన శిష్యులలో కాశ్మీరసదానందతీర్థులవారు మిక్కిలి ప్రసిద్ధులు, తీర్థులవారు బ్రహ్మవిద్యను తురీయాశ్రమములకు విరివిగా పంచిపెట్టుటతో తృప్తిచెందక, అశేష సామాన్యజనమునకు కూడ బ్రహ్మానందరుచి ప్రదర్శించు నుద్దేశముతో, ఈ గ్రంథము రచించిరి. వీరు తమపాదవిన్యాసముచే భరత భూమినంతటిని పవిత్ర మొనర్చినను, ఎక్కువగా సంచరించినది ఆంధ్రభూమి యందని తోచును. శ్రీకాకుళమునుండి నెల్లూరు వఱకును వంశపారంపర్యముగా వారికీర్తనలను 'తరంగము'లను పేర గానముచేయుచున్నవారు పలుశ్శతముగా కలరు. తల్లావఝ్ఝులవారి వంశములో ప్రతివారును అధమపక్షము మూడు తరంగములైనను చెప్పుకొనవలెనను నియమమున్నది. అద్దంకి ప్రాంతమందే అఱువదివేర్వేఱు కుటుంబములవారు పరంపరగా తరంగగానము చేయుచున్నారు.

వీరు చరమదశలో కావేరీతీరమందలి వరహూరుచేరి ఆసమీపముననే కల పురుందుర్తిలో సిద్ధిపొందిరి. వీరితరంగములకు తమిళదేశమం దంతటనుగూడ విశేషప్రచారముకలదు. నేటికిని వారుసిద్ధిపొందిన ఫాల్గుణశుద్ధ అష్టమినాడు పురుందుర్తిలో ఆరాధనోత్సవము జరుపుచున్నారు.

తరంగిణిలో తరంగములను పంద్రెండు భాగములున్నవి. ఇందులోని కథ భాగవత దశమస్కంధములోని రుక్మిణీకల్యాణాంతమైన శ్రీకృష్ణలీలలు. ఐనను జయదేవునిగీత గోవిందమును స్మరించు నుద్దేశముతో కావచ్చును. శ్రీకృష్ణతత్త్వజ్ఞులుగా రాధను ప్రవేశపెట్టి, ఆమెచే గోపికలకు

శ్రీకృష్ణతత్త్వమును ఉపదేశము చేయించినారు. ఇందలి ద్వాదశ తరంగములును వాసుదేవద్వాదశాక్షరిని, భాగవతములోని ద్వాదశస్కంధవిభాగమును స్మరణకు తెచ్చుచున్నవి. భక్తాగ్రేసరుడగు జయదేవుడు వర్ణించిన రాధాకృష్ణశృంగారము ప్రాకృతులకు కాముకశృంగారముగా భాసించుప్రమాదమున్నది కాని తీర్థులవారి శ్రీకృష్ణలీలలలో ఆభాసమాత్రముగాకూడ కాముకశృంగారము కనబడక పోవుట గొప్ప విశేషము.

గ్రంథములో వర్ణించిన ప్రధానకథ శ్రీకృష్ణలీలావర్ణనమే కాని అతడు కేవలము అష్టమావతార శ్రీకృష్ణుడేకాదు. ప్రథమతరంగములో సనకాదులచేత,

"రామకృష్ణగోవిందేతి
నామసంప్రయోగే
కామమిహస్నాతవ్యం
సర్వోత్తమప్రయాగే"

అనిపించినారు. అతడు మరియు 'నృణాం బంధహతిం కుర్వన్ నృసింహోసి దయాఘన' అనిపించుకొన నర్హుడైనవాడు అతనినే గ్రంథారంభములో 'నీలాచలవరనిలయం నిఖిల జగన్నాథ మాకలయే' అని కవి భావనచేసెను. తాను నిత్యము భావించు నారాయణునకు శివునకు భేదము లేదని సూచించుటకు తఱచుగా కీర్తనలముద్రలో తననామముతో పాటు గురునామముకూడ జోడించి 'శివనారాయణ తీర్థ'లని పలుతావుల జెప్పికొనిరి. పూతనాసంహారమైన పిమ్మట గోపగోపికలచేత.

"మంగళానితనోతు
మధుసూదనస్సదా
గంగాధరో పి
తవసాపిగంగా" అనియు,
"దక్షిణామూర్తిరపి దాక్షిణ్య మాహవతు" అనియు,
"దుర్గాణివారయతుదుర్గాసరస్వతీతే
భర్గో పి భర్గయతుపాపవర్గమ్"
అని ఇత్యాదిగా స్వస్తిపలికించెను. ఈకవి దృష్టిలో శరత్కాలమెట్టిది?
"శార దేవ శర దాగతా స్వయమ్
తార కోదయ విశేషభాసురా
వారి తేషు సలిలేషు ధీమతామ్
స్మారితార్థమవభాసయం త్యసౌ"
మరియు,
"శంకే శంకరం శారదసమయం
పం కేరుహాపరాగవిభూతిధవళమ్" అన్నారు.

ఈ కవి దృష్టిలో విష్వక్సేనుడు 'మహత్తమమైన అద్యతేజస్సు", అమృతకలశహస్తుడైన వైనతేయుడు 'ఆమ్నాయగాయకుడు' అర్చావతారుడైన వరాహపుర వేంకటేశ్వరుడు కూడ'' నిగమగోచర నిత్యనిర్మలానందఘనుడు!''

గ్రంథమునందటను సందర్భము గల్పించి కవి అద్వైతము బోధించుచుండును. కాళీయమర్దన సందర్భమున బంధబద్ధునివలె లీల ప్రదర్శించిన "సర్వాత్మకు" డైన కృష్ణుని 'సకలాత్మదర్శి' యైన బలరాముడు

''బంధనాన్మోచయ - కాళీయకృత - బంధనాన్మోచయాత్మానమ్. .''
ఇత్యాదిగా ప్రబోధింపజేసినాడు.

యజ్ఞపత్నులు చేసిన స్తవము బాలగోపాలతరంగమని ప్రసిద్ధిబడసినది. అందులో మరల మరల, ''తద్ధిత్వమేవాసి, తద్ధిత్వమే వాసి, తత్సర్వ మేత త్త్వమే వాసి నూనమ్ - నృత్యంత మత్యంత మానందమీడే - మితం త్వా మహం త్వా మహం త్వా మహామ్'' అని నృత్యము చేయించినాడు.

గోపాలురతోడ నాడుచు పాడుచున్న శ్రీకృష్ణునిగూర్చి కవి 'సోయం మాయా విహరతి మహు ర్నాదయన్ వేణుమీశః'' అని వర్ణించినాడు. అందువల్లనే కాశిపండితులు "సగుణ నిర్గుణములను ఏకవాక్యములో చెప్పగల సమర్థత శ్రీశంకరభగవత్పాదులతర్వాత నారాయణతీర్థులవారి కొక్కరికే కల''దని పలికినారు.

శ్రీకృష్ణలీలలస్వరూప మవగాహనచేసికొనలేని ఆధునికులకు గోపికావస్త్రాపహరణము ఏహ్య మనిపించును కాని తీర్థులవారి కీర్తన విన్నప్పుడది పటాపంచలై పోగలదు, గోపికా వస్త్రాపహరణముచేసి 'పుణ్యపుంజఫలదాయకు''డైన గోవిందుడు గోపికలకు 'పరమబాంధవు'డై వారితో 'శర్మదములైన ధర్మవాక్యములు' పలికినాడట. గోపికలు తమకు ఆవరణ మిమ్మని వేడగా శ్రీకృష్ణుడిట్లు వారికి జ్ఞాన ముపదేశించెను

'ఆవరణం మమ నహితే దాతుమ్.....
''సీతుం నైవ మయా పరకీయం
నైవ మ మావరణం నిజ దృష్ట్యా ........
''యుక్తి సహం నహి భవదావరణం
యోగిభి రితి మీ మంసిత మబలాః''

సప్తమాష్టమతరంగములలో రాసక్రీడ, శ్రీకృష్ణాన్వేషణము, గోపికాగీతములు వర్ణింపబడినవి. ఆరెండు తరంగములును భక్తులైన వారికి అమృతాయమాన మైనవి. అది ఇట్లారంభింపబడినది.

''భక్తిసంకల్పసిద్ధి మాతన్వానో గోపరమణీనయనోత్పలారాధితమదన గోపాలమూర్తి ర్వాసుదేవో గోపీభి స్సహ రాసక్రీడా మహోత్సవారంభసంభ్రమచేతాః గోపీభిస్సార్థమాత్మతత్త్వ ముపదిశ న్నిద మాహ''

ఆశౌరివాక్సుధ బ్రహ్మానుభూతిరసికమైనదట, గోపిక లద్దానిని త్రావుచు కృష్ణబ్రహ్మనిష్ఠులైరట వారంతట నతనితో కలసి రాసమండలమున గానముతోడి నృత్యము చేయుచు అతడుపదేశించిన అద్వైతము నిట్లు అనుకరించిరట.

"అద్వయ మఖండిత మశేష జగదాదిం
యత్ర చజగత్త్రితయ మాస్థిత మనం తే
యత్ర విలయం పునరుపైతి మృదికుంభో
యద్వదవధారయత సత్య మితిమామోమ్"

సంసారరోగ సంతప్తలైన యాగోపికలు కృష్ణ బ్రహ్మరసాయనము గ్రోలి ముక్తలై అభయము పొందిరి. వారి యానందావస్థ ఈ విధముగా వర్ణింపబడినది.

"ఆత్మారామాః పరానంద
నిత్యతృప్తాః పునః పునః
ఆత్మానుభూతిం గాయంత్యః
కృష్ణైకరతాం గతాః
"రమంతే పరమానందే
కృష్ణ బ్రహ్మణి తా భృశమ్
త్యక్త దేహా ద్యహం మానా
నిర్విశేష సుఖే స్థితాః"
"విస్మరంత్యః స్వకందే హ
మాత్మ మాత్రావ శేషితమ్
బాలోన్మత్తాదయో యద్వ
దాత్మ న్యేవ సమాహితాః"

అప్పుడు వారిని కృతకృత్యులనుగా నెఱింగి శ్రీకృష్ణపరమాత్మ వారికి దర్శనమీయగా వారాతనిని శ్రుతులు పరబ్రహ్మను యథేష్టముగా చుట్టుముట్టి ఆలింగన మొనర్చుకొని అనురాగముతో గానము చేయునట్లు గానము చేసిరి.

శ్రీకృష్ణలీలాతరంగిణిలో తీర్థులవారు బ్రహ్మానందతరంగిణినే మనకు ప్రసాదించినారు. వారు గ్రంథాదిలో పరమభాగవతులను స్మరించిన శ్లోకము జగత్ప్రసిద్ధము.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీషశుక శౌనక భీష్మదాల్భ్యామ్
రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదిన్
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి"

తీర్థులవారు అభక్తులకోవలోనివారే; బ్రహ్మలోకమునుండి లోకోద్ధరణార్థ మవతరించు నాధికారిక పుణ్యపురుషులలో ఒకరు. వారు ప్రసాదించిన ప్రయాగలో భక్తులందఱు తానమాడి ముక్తులై బ్రహ్మానంద మనుభవింతురుగాత!

ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీనారాయణతీర్థ యతీంద్ర సద్గురు స్వామివారి చరిత్ర

## పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీనారాయణ తీర్థానాం గురూణాం చరణస్మృతిః
భూయాన్మే సాధకేష్టానా మనిష్టానాంచ బాధికా.

ఆయత భక్తి గృష్ణ చరితామృత వార్ధి దరంగిణీ సమా
ఖ్యాయతమైన గవ్యమున గ్రమముగా మథియించి పండితా
ప్యాయకరంబు మోక్ష రుచిరామృతముఁ గృపనిచ్చినట్టి
నారాయణ తీర్థపాద యతిరాజ గురూత్తము సంస్తుతించెద్.

### వంశము

శ్రీ నారాయణతీర్థ యతీంద్ర సద్గురు స్వాములవారు పూర్వాశ్రమమున ఆంధ్ర దేశమునందు గుంటూరు మండలమున మంగళగిరి క్షేత్రమునకు సమీపమునగల కాజయను గ్రామములో తల్లావఝుల వారను ఇంటిపేరుగల ఒక బ్రాహ్మణుని కుటుంబమున జన్మించిరి. ఈ కాజ గ్రామము గుంటూరు మండలమున నంబూరు రైలు స్టేషనుకు నాలుగుమైళ్ళ దూరమున ట్రంకురోడ్డు మీద మంగళగిరి మార్గమున కలదు.

తల్లావఝుల రామకృష్ణ (శాస్త్రి) కవి వీరికి మూల పురుషుడని తెలియుచున్నది. ఈ రామకృష్ణ శాస్త్రి కుమారుడు వేంకట కృష్ణశాస్త్రి, వీరు రమారమి 475 సంవత్సరములనాటి వారని తెలియుచున్నది. వీరి కుటుంబములు శాఖోపశాఖలుగ నభివృద్ధి జెందగా వారిలో ననేక కుటుంబములవారు నలుదిక్కులకు వ్యాపించి ఆంధ్ర రాష్ట్రమునసేగాక అన్యరాష్ట్రములందు గూడ పలుప్రాంతములకు జేరి అచటనే స్థిరపడిపోయి నటుల దెలియుచున్నటి. ఆవిధముగా వెళ్ళిన వారిలో దక్షిణ దేశమున శేర్మ మహాదేవి యను గ్రామములో నేటికిని రమారమి రెండు వందల కుటుంబముల వారున్నారని చెప్పుచున్నారు.

తల్లావఝ్ఝులవారు కాజ గ్రామమునకు ఎచ్చటి నుంచి వచ్చినదియు తెలియుటలేదు. కాజలో నేడు ఉన్న తల్లావఝుల వారికి నరసింహశాస్త్రి అనువారు మూల పురుషుడు. ఈ నరసింహశాస్త్రిగారి కుమారుడు రాజగోపాలశాస్త్రి. ఈ రాజగోపాలశాస్త్రిగారు తమ పాండిత్య ప్రతిభా విశేషములచేత ప్రభువుల అభిమానము సంపాదించి అమరావతికి సమీపమున ధరణికోట రాజధానిగా నేలుచుండి ప్రభువులగు వాసిరెడ్డి వారినుండి తాము నివసించుచుండిన కాజ గ్రాములోనే నాలుగు వందల యకరముల పొలమును కంట్రికగా సంపాదించిరి.

తల్లావఝ్ఝల రాజగోపాలశాస్త్రిగారి కుమారుడు రఘునందనశాస్త్రి. ఈయన కుమారుడు రుక్మిణీశ్వరశాస్త్రి,. వీరి కుమారుడు గంగాధరశాస్త్రి. వీరి కుమారుడు శ్రీకృష్ణశాస్త్రి. ఈ పరంపరలో అందరును యత్యాశ్రమమును స్వీకరించినవారే. వీరిలో చివరి వారైన కృష్ణశాస్త్రిగారు జీవించియున్నచో నేటికి సుమారు నూటయిరువది సంవత్సరముల వయసును గలిగి యుందురు.

శ్రీ నారాయణతీర్థుల వారు పై వారికి మూల పురుషుడైన నరసింహశాస్త్రిగారికి సమకాలికులు గాని లేక అంతకు పూర్వపువారు గాని అయియుందురు. తల్లావఝులవారు ఎచ్చట నుండినను తీర్థులవారు తమ వంశము వారని చెప్పుకొనుట కలదు తమ కుమాళ్ళకు పేరు చివరను తీర్థులని నామకరణమును జేయుట గూడ గలదు. తీర్థులవారి తరంగములను అందరును పాడుకొనుచుందురు తీర్థులవారు మా వంశములోని వారని దేశమున మరెవరును చెప్పుకొనుటలేదు. తీర్థులవారి ఆనాటి చిత్రరూపు కలదు ఈ రూపమే తీర్థులవారి రూపమని గుర్తించుటకు వారి వంశములో ఆ రూపముగల వారనేకులు ఉండుట కూడ నిదర్శనమని చెప్పుచున్నారు

## కాలము

తీర్థులవారి జనన తేదీ లభించుటలేదు. 'సంగీత సంప్రదాయ ప్రదర్శని' యను గ్రంథమును రచించిన సుబ్బరామ దీక్షితులవారు, తీర్థులవారు మూడు వందల సంవత్సరములకు పూర్వపు వారని తన గ్రంధమున వ్రాసిరి. ఆ గ్రంథము 1904లో అచ్చు అయినది దీనిని బట్టి తీర్థులవారు నేటికి 363 సంవత్సరములకు పూర్వపు వారని తెలియుచున్నది. తీర్థులవారు రచించిన పారిజాతాపహరణమను అను యక్షగాన గ్రంథమునందు చివరి కీర్తనలో.

"అచ్యుతాబ్ధిప్రభో వరదరాజ" అనుచరణము కలదు అచ్యుతాబ్ధి యనగా మెరటూరు ఆ పూరునేలిన అచ్యుతప్ప నాయకుడు క్రీ.శ. 1561-1614 వరకు ఉండెను. దీనిని బట్టి కొందరు తీర్థులవారు క్రీ.శ. 1600 నాటివారని, కొందరు అంతకు పూర్వపు వారని యనుచున్నారు. అదికూడ యించుమించు 363 కు సరిపోవుచున్నది. 'అచ్యుతాబ్ధిప్రభో'యనునది అచట దైవపరముగ చేయబడిన సంబోధనమనుటచే నీ ప్రమాణము ఉపయోగింపకున్నది.

కంచర్ల గోపన్న యను భద్రాచల రామదాసుకు అప్పటి గోలకొండ నవాబు అబుల్ హసన్ తానీషా భద్రాచల రామాలయమునందు ఉద్యోగిగా నియమించుచు హిజరీ 1075 న జమాదిలవల్ మాసమున నొక ఫర్మానా నొసంగెను. అది జరిగి యిప్పటికి 310 సంవత్సరములయినది. తీర్థులవారు అంతకు పూర్వపు వారను ప్రతీతికలదు. మొత్తము మీద తీర్థులవారు 360 సంవత్సరములకు పూర్వపు వారని విశదమగుచున్నది. ఈ విషయమై యింకను పరిశోధన జరుగవలసి యున్నది.

## విద్యాభ్యాసము

తీర్థులవారికి దైవభక్తి జన్మతోనే లభించినది. వీరు పూర్వాశ్రమమున వాసుదేవ పండితుని యొద్ద సర్వశాస్త్రములను అభ్యసించిరి. విద్య నభ్యసించు కాలమున అపుడపుడు దైవపరముగ కీర్తనలను గానము చేసుకొనుచు అందు తన్మయులగుచుండెడివారట. కొందరు సహపాఠీలు ఈ విషయమును గమనించి గోవిందుడు గానము చేయుచు పాఠములను నిర్లక్ష్యము చేయుచున్నాడని గురువుగారికి చెప్పిరట. (గోవిందు డనునది తీర్థులవారి పూర్వాశ్రమ నామము) అప్పుడు గురువుగారు గోవిందశాస్త్రిని (తీర్థులవారిని) పిలిచి గానము చేయవలదని మందలించెడి వారట.

ఆ కాలమున సాధారణముగా వేదశాస్త్ర పండితులు తమ శిష్యులు గానము నభ్యసించుటకుగాని శ్రుత పాండిత్యము వలన కలిగిన జ్ఞానముతో గానము చేయుటకుగాని అంగీకరించెడివారు కారు. రాగముతో శ్లోకమును గూడ చదువనిచ్చెడి వారుకారు గానము వలన వేదశాస్త్రాభ్యాసమునకు అనర్థము కలుగునని వారి భయము. అంతేగాక చెడిపోయెడివారని కూడ యనుకొనుచుండెడివారు.

గురువుగారు మందలించిన పిమ్మట తోటి విద్యార్థుల బాధపడలేక గోవిందశాస్త్రి వేకువజామున లేచి నర సంచారము లేనంత దూరమువరకు గ్రామము వెలుపలకు వెళ్ళి అచ్చట నొకచెట్టు క్రిందను కూరుచుండి కీర్తనలను గానము చేయుచు తన్మయులగుచుండెడివారట తిరిగి పాఠముల సమయమునకు యథాప్రకారము గురువుగారి వద్దకు వెళ్లుచుండెడివారట.

ఈ విధముగా కొంతకాలము గడచిన పిమ్మట ఎటులనో కొందరు సహాధ్యాయులీ విషయమును గమనించి వీడు గురువుగారు వలదనినను మానక గురు ధిక్కారముజేసి గానము చేయుచునే యున్నాడని మరికొన్ని కల్పించి గూడ గురువుగారికి చెప్పిరట.

అందరు విద్యార్థులలోను గోవిందశాస్త్రి (తీర్థులవారు) ఏకసంతగ్రాహి యగుటచేతను, శిష్యులందరిలోను గోవిందశాస్త్రి యందు అధికమైన ప్రేమగల వారగుట చేతను చెప్పుడు మాటలమీద నాధారపడక అసలు విషయమేమో తెలియగోరి ఒకరోజున వేకువజామున లేచి ముందుగానే గురువుగారు ఆ ప్రదేశమునకు వెళ్ళి గోవిందశాస్త్రి కూరుచుండు చెట్టునెక్కి చాటున కూర్చుండెనట. పిమ్మట కొంత తడవునకు గోవింద శాస్త్రి వచ్చి యథాప్రకారముగా నాచెట్టుక్రింద కూర్చుండి దివ్యనామ సంకీర్తనను ప్రారంభించి గానము చేయుచు తన్మయావస్థలో నుండెనట. చెట్టుమీద నుండి గమనించుచుండిన గురువుగారు శిష్యుడు మహాభక్తుడని గ్రహించెను. చెట్టు దిగి వచ్చి గోవిందునకు (సాష్టాంగముగ) సాగిలపడి నేను గాదు గురువును నీవే నాకు గురువైనావని శిష్యుని అపరిమితా నందముతోస్తుతించిరట.

ఆ రోజు ఉదయమున యథాప్రకారముగా శిష్యులందరును పాఠములకు వచ్చిరి. అప్పుడు గురువుగారగు వాసుదేవపండితుడు "గోవిందుడు సామాన్యుడు కాడు. భక్తి, జ్ఞాన, వైరాగ్యములు అతనికి జన్మతోనే లభించినవి. అతను యిక నేర్వవలసిన దేమియు లేదు" అని గోవిందశాస్త్రిని గురించి తాను చెట్టుమీదనుండి చూచిన విషయమును గూడ వివరించెనట. నాటినుండియు అందరును గోవిందశాస్త్రిని పరమభాగవతోత్తముడుగ గౌరవించుచుండిరని ప్రతీతి.

## యత్యాశ్రమము

గోవిందశాస్త్రి అత్తవారి యూరు కృష్ణకావలి యొడ్డునగల వేదాద్రి యను దివ్యక్షేత్రము. ఒకనాడు గోవిందశాస్త్రి అత్తగారి యూరునకు వెళ్లుటకు కృష్ణను దాటుచుండెను. సగము దూరము వెళ్లునప్పటికి ప్రవాహము అధికమై ప్రాణాపాయ స్థితి యేర్పడినందున గత్యంతరము కానక ప్రేషోచ్చారణము చేసిమానసికముగ ఆతుర సన్యాసమును స్వీకరించిరి. (ఈ విషయము శివోత్సవము అను గ్రంథమునందు మూడవ పుటలో నున్నది) దైవికముగా అంతలో చేతికి ఆలంబనము దొరుకగా ఒడ్డునకు చేరిరి.

అత్తవారింటికి బోగా అత్తగారు చూచి తన కుమార్తెతో నీ భర్త వచ్చినారు పాద ప్రక్షాళనకు ఉదకమును తీసుకొని వెళ్ళమని చెప్పెను. గోవిందశాస్త్రి భార్య ఉదకమును తీసుకొనిరాగా ఆ మహా పతివ్రతకు గోవిందశాస్త్రి ఒక సన్యాసిగ కనుపించెను. వెంటనే తల్లివద్దకు వెళ్ళి ఎవరో సన్యాసిరాగా మీ అల్లుడని చెప్పితివేమి అనెను అంతట ఉభయులును వచ్చి చూచి అల్లుడేనని తల్లియు, కాదు సన్యాసియని కుమార్తె యనుటను గోవిందశాస్త్రి గమనించినవాడై నదిలో తాను మానసికముగ సన్యసించిన విషయమును తెలిపి భార్య వద్దను సన్యాస స్వీకారము కొరకు అనుజ్ఞను పొంది తన జన్మ స్థానమైన కాజ గ్రామమునకు వచ్చి తన సహోదరుని కుమారునితో తన కుటుంబమును చూచుకొనుమని చెప్పి కాశికి వెళ్ళి అచ్చట శ్రీ రామానందుల వారి యొద్ద యత్యాశ్రమమును స్వీకరించెను.

## కాశీవాసము

తీర్థులవారు కాశీ క్షేత్రమున నుండినపుడు ఏడు యిండ్లకు వెళ్ళి భిక్షము తెచ్చుకొని ఒక గదిలో ఆహారమును తీసుకొనుచుండెడివారు. నిరంతరము కృష్ణ పరమాత్మను గురించి గానము చేయుచు తన్మయులగు చుండెడివారు. వీరు తన్మయులై గానము చేయుచుండ కృష్ణ పరమాత్మ బాలుని రూపమున నృత్యము చేయుచుండెను. తన ధ్యానమునకు యితరుల వలన అభ్యంతరము కలుగకుండునట్లు తీర్థులవారు తలుపులు వేసుకొని గానము చేయుచుండెడివారు. తీర్థులవారి గానమే గాక లోపలినుండి మద్దెల, తాళముల ధ్వని, గజ్జల మ్రోత వినుపించుచుండెను. ఆ సమీపమున వినువారికి అది కొంత అనుమానమునకు కారణమైనది. కొందరు స్త్రీలతో రాత్రిళ్ళు గాన కాలక్షేపమును చేయుచున్నారని తీర్థులవారిమీద ఇరుగు పొరుగువారు నిందనుమోపి ప్రచారము చేయుటకు ప్రారంభించిరి అందువలన భిక్ష నొసంగువారు మానిరి. తీర్థులవారును భిక్షకు వెళ్లుట మానిరి. నిరంతరము భగవన్నామ సంకీర్తనలో నిమగ్నులై కాలమే తెలియకయుండిరి. తీర్థులవారిని అనుమానించిన వారికి నిరంతరము తీర్థులవారి చర్యను పరీక్షించుటయే పని అయ్యెను. ఎంతకాలమైనను తలుపులను తెరచుటలేదు ఎవరును వచ్చి వెళ్లుచున్నట్లులేదు. కాని నిరంతరము అనేకులు లోపలనుండి భజన చేయుచున్నటుల వినవచ్చుచుండెను ఈ చిత్రమును తెలియగోరి కొందరు బుద్ధిమంతులు యింటికి ఒకచోట సూక్ష్మమైన మార్గమును కల్పించి చూచిరి. ఆ సమయమున లోననొక మహాతల్లి తీర్థుల వారికి అన్నమును కలిపి నోటిలో పెట్టుచుండినటుల కనుపించెను. అంతట అందరును జేరి తలుపులను తెరచి చూడగా అచ్చట అన్నములేదు ఆమెయును లేదు. తీర్థులవారు మాత్రము సమాధ్యవస్థలో నుండిరి. అప్పుడు అందరు ఆశ్చర్యపడినవారై తమ యపరాధమునకు చింతించి తీర్థులవారు దైవాంశ సంభూతులని గ్రహించినవారై నాటినుండియు అపరిమితమైన భక్తితో తీర్థులవారిని సేవించుచుండిరి.

తీర్థులవారు గంగకు స్నానముకొరకు వెళ్లునపుడు వారియొద్దనుండి చందనపు వాసన వచ్చుచుండెను. అందులకు కొందరు సంశయించి రాత్రి సమయమున యింటిమీది కప్పున కొంచెము రంధ్రము చేసి చూడగా తీర్థులవారు గానము చేయుచుండ శ్రీకృష్ణ భగవానుడు గోపికలతో కూడి నర్తన చేయుటను చూచి విభ్రాంతులైరి. మరునాడు వారు చేసిన అపరాధమునకు తీర్థులవారిని క్షమాపణ వేడుకొనిరి. శ్రీకృష్ణ పరమాత్మ దర్శన భాగ్యము మీకు కలిగినది గాన మీరు ధన్యాత్ములు, ఇంకను నాకు ఆ భాగ్యము కలుగలేదని చింతించిరట.

ఒకనాడు ఒక కాశ్మీర పండితుడు అనేక పండితులను గెలిచి పట్టముకట్టుకొని తనకు జయపత్రమునిమ్మని కాశీపండితులను కోరగా వారు వచ్చి నారాయణ తీర్థులవారికి తెలిపిరి. అందులకు తీర్థులవారు సమ్మతించిరి. జయపత్రము లభించిన పిమ్మట ఏనుగునెక్కించి ఊరేగింపు చేయబడెను. ఆ సమయమున తీర్థులవారి శిష్యులు ఎదురుపడి ఆ పండితుని ప్రశ్నల ప్రవాహములో తికమకలాడించగా ఆయన ఓడిపోయినటుల ఒప్పుకొని తనకు లభించిన బహుమానముల నన్నిటిని తీర్థులవారి ప్రధమ శిష్యునకు సమర్పించెను. ఆయన వానిని తమ గురువుగారైన తీర్థులవారి యొద్దకు తీసుకొని వెళ్ళగా జరిగిన వృత్తాంతమునంతను తీర్థులవారు గ్రహించినవారై వెంటనే కాశ్మీర పండితునకు వాటినన్నిటిని తిరిగి యిచ్చి వేయవలసినదిగా చెప్పిరి. ఈ విషయము చూచిన కాశ్మీర పండితుడు ఆశ్చర్యపడి తీర్థులవారి వద్దకు వెళ్ళి సాగిలపడి తన్ను శిష్యునిగా జేర్చుకొనవలసినదిగా ప్రార్థించెను. తీర్థులవారు ఆయనను ప్రధమ శిష్యునిగా జేర్చుకొనెను. అది మొదలు ఆ పండితుడు కాశ్మీర సదానంద కవియని ప్రసిద్ధి వహించెను.

## గురువులు

గోవిందశాస్త్రి యతియైన పిమ్మట 'శ్రీనారాయణతీర్థులు' అను ఆశ్రమనామము కలిగెను. భక్త్యధికరణమాలా శాండిల్య సూత్ర వ్యాఖ్య యందు తీర్థులవారు

శ్లో॥శ్రీరామగోవింద సుతీర్థపాద
  కృపా విశేషాదుప లబ్ధబోధం
  శ్రీ వాసుదేవా దధిగత్య సర్వ
  శాస్త్రాణి వక్తుం కిమపి స్పృహానః

అని చెప్పెను. ఈ రామగోవిందతీర్థులకే శివరామానందతీర్థులని శ్రీకృష్ణలీలా తరంగిణియందు కలదు. పూర్వాశ్రమమున గురువులు వాసుదేవ పండితులుగా చెప్పబడెను.

## శిష్యులు

తీర్థులవారి శిష్యులలో గౌడ బ్రహ్మానందులు, కాశ్మీర సదానందులు, ఆంధ్ర మహేశ్వరతీర్థులు అనువారి పేర్లు మాత్రమే తెలియబడుచున్నవి. గౌడ బ్రహ్మానందులవారు తాము రచించిన లఘుచంద్రిక వ్యాఖ్య ప్రారంభమున గురుస్తుతిగా

శ్రీ నారాయణతీర్థానాం గురుణాం చరణస్మృతిః
భూయాన్మేసాధి కేష్టానా మనిష్టానాంచ బాధికా
అద్వైత సిద్ధి వ్యాఖ్యానం బ్రహ్మానందేన భిక్షుణా
సంక్షిప్త చంద్రికార్థేన క్రియతే లఘుచంద్రికా
మహానుభావ ధౌరేయ శివరామాఖ్య వర్ణినః
ఏతద్గ్రంధస్య కర్తారః లేఖకాః కేవలంవయం.
(వ్యాఖ్యానాంత్యమందు)
శ్రీనారాయణ తీర్థానాం షట్ శాస్త్ర పారమీయుషాం
చరణౌ శరణీకృత్య తీర్ణ స్సారస్వతార్ణవః ॥

ఆంధ్ర మహేశ్వరతీర్థులు రచించిన తత్వ దీపికయను, రామాయణ వ్యాఖ్యానము నందు ప్రణమ్య నారాయణతీర్థ దేశికాన్

> భావానలార్ద్రామృత పూరనీరదాం
> కరోతి రామాయణ తత్వ దీపికాం
> మహేశ తీర్థాఖ్య ము నిర్యథామతి.

రామాయణమునకు తత్వదీపికయను వ్యాఖ్యానమును రచించునపుడు ఆంధ్ర మహేశ్వరతీర్థులు శ్రీనారాయణతీర్థులవారిని పై శ్లోకమున గురువులుగ స్తుతించిరి.

ఏక వాక్యమున సగుణ నిర్గుణములను బోధించు శక్తి శ్రీ విద్యా శంకరుల తరువాతను శ్రీ నారాయణతీర్థుల వారికే కలదనియును, మధు సూధన సరస్వతి వాచస్పతి మిశ్రులకు మించిన ప్రజ్ఞ గలదనియును కాశీపండితులు శ్రీ నారాయణతీర్థులవారి గ్రంధ భూమికలో లిఖించినటుల తెలియు చున్నది.

## తీర్థుల వారి గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీకృష్ణలీలా తరంగిణి - | దీనికి గోవింద తీర్థుని సహాయమున వేంకటేశ్వరుడను వారు ఒక వాఖ్యను రచించి నటుల దెలియుచున్నది |
| 2. | పారిజాతాపహరణము- | తెలుగు యక్షగానము - దీని వ్రాతప్రతి తంజావూరులో సరస్వతీ మహల్ గ్రంధాలయములో ఉంచబడిన దీనిని సిద్ధేంద్రయోగి కృష్ణా జిల్లాలోని కూచిపూడి అగ్రహారీకులకు బోదించెనను ప్రతీతి గలదు ఈ విషయమును గూఢ పరిశోధించి నిర్ణయించ వలసియున్నది. |
| 3. | హరిభక్తి సుధార్ణవము - | సంస్కృత వాఖ్యానము, భాగవతము దశమ స్కంధమును బట్టి రచించబడినది. ఇందుకొన్ని ప్రకరణములు లుప్తమైనవి. |
| 4. | శాండిల్యభక్తి సూత్రవ్యాఖ్య- | ఈ రెండును భక్తి |
| 5. | భక్త్యధి కరణమాల - | సిద్ధాంత సంబంధములు |
| 6. | సాంఖ్యకారికా వ్యాఖ్య | |
| 7. | సాంఖ్య తత్వకౌముది వ్యాఖ్య | సాంఖ్య పరములు. |
| 8. | న్యాయ కుసుమాంజలి టీక | |
| 9 | న్యాయముక్తావళి టీక | తర్కపరములు |

| | | |
|---|---|---|
| 10. | భాట్ట భాషా ప్రకాశము | పూర్వమీమాంసా గ్రంధము |
| 11 | యోగ సూత్ర వ్యాఖ్య | యోగ పరము |
| 12. | సిద్ధాంతబిందు | |
| 13 | లఘు చంద్రిక | వేదాంతము |
| 14. | వేద స్తవ టీక | |
| 15 | వేదాంత విభావనాటిక | |
| 16. | వివరణ దీపిక | సురేశ్వరా చార్యులవారి పంచీకరణ వార్తికము మీద వివరణము. |

వీనిలోకొన్ని ముద్రితములు, కొన్ని అముద్రితములుగా కాశీ విశ్వవిద్యాలయములో నున్నవి.

తీర్థులవారు తమ వ్యాఖ్యలను కొన్నిటిని చంద్రికలుగను కొన్నిటిని గురుచంద్రికలుగను చెప్పిరి. వీనిలో భాట్టభాషా ప్రకాశమును పూర్వాశ్రమములో ప్రారంభించి యత్యాశ్రమమున ముగించి నటుల దెలియుచున్నది.

"భగవచ్ఛివ రామతీర్థ శిష్యో మునినారాయణతీర్థ నామధేయః వ్యతనోదధి కాశి భాట్ట భాషాగ్ర ధనం భాట్టనయ ప్రకాశ హేతోః॥ అని భాట్టభాషా ప్రకాశములో కానవచ్చుచున్నది

## శ్రీకృష్ణలీలా తరంగిణి
### వివరములు

శ్రీ తీర్థులవారు శ్రీ మద్భాగవతమునందు దశమస్కంధము పూర్వభాగమును రుక్మిణీ కల్యాణాంతముగ సంస్కృతమున గద్యపద్య పదాత్మకముగ రచించెను. ఈ గ్రంధమున 12 భాగములు కలవు. అందొక్కక్క భాగమును తీర్థులవారు తరంగమని పేర్కొనెను. అందువలన అందలి కీర్తనలకు తరంగములను ప్రసిద్ధి యేర్పడినది. నిజముగా నవితరంగములనియే యనదగును. తరంగములనగా అలలు, తరంగమును గానము చేయునపుడు భావములు అలలవలె వృద్ధినొందును. తరంగములకు మధ్య మధ్యను శ్లోకములను గద్యలు (వచనములు) ను కథా సందర్భమును తెలుపునవి కలవు. దరువులతో సహా శ్రీ కృష్ణలీలాతరంగిణియందు 152 తరంగములు (కీర్తనలు) కలవు. ఇవిగాక మంగళము కొరకు చెప్పబడినది ఒకటి, ప్రక్షిప్తములని నాలుగు చేరి మొత్తము 157 అచ్చులో నున్నవి.

చేతో శ్రీరామం అను నవరోజు రాగములోని కీర్తన అచ్చులో లేనిది గలదు. అచ్చులోనున్న ప్రక్షిప్త తరంగములలో "జయ జయ వైష్ణవి దుర్గే" అను దేవగాంధారిలోని తరంగము చివరను అంకితముగల పాదము లభించుటలేదు.

## రాగములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆనందభైరవి | రాగమున | 2 | 19 | పంతువరాళి | ,, | 1 |
| 2. | అహిరి | ,, | 3 | 20 | పూరి కల్యాణి | ,, | 1 |
| 3. | ఆరభి | ,, | 2 | 21. | పున్నాగవరాళి | ,, | 3 |
| 4. | కాంభోజి | ,, | 16 | 22 | భైరవి | ,, | 4 |
| 5. | కల్యాణి | ,, | 9 | 23 | బిలహరి | ,, | 2 |
| 6. | కేదారగౌళ | ,, | 9 | 24. | ముఖారి | ,, | 9 |
| 7 | కురంజి | రాగమున | 1 | 25 | మధ్యమావతి | రాగమున | 13 |
| 8. | కర్ణాట సారంగ | ,, | 1 | 26. | మోహన | ,, | 4 |
| 9. | కాపి | ,, | 2 | 27 | మంగళకాపి | ,, | 1 |
| 10 | కమాస్ | ,, | 1 | 28. | యదుకుల కాంభోజి | ,, | 4 |
| 11. | గౌరీ | ,, | 1 | 29. | రేగుప్తి | ,, | 2 |
| 12. | తోడి | ,, | 1 | 30. | శ్రీరాగము | ,, | 3 |
| 13. | ద్విజావతి | రాగమున | 5 | 31. | శంకరాభరణము | ,, | 7 |
| 14. | ధన్యాసి | ,, | 2 | 32 | సౌరాష్ట్ర | ,, | 15 |
| 15. | దేశాక్షి | ,, | 1 | 33. | సావేరి | ,, | 8 |
| 16. | నాట | ,, | 2 | 34. | సురటి | ,, | 2 |
| 17 | నాదనామక్రియ | ,, | 1 | 35. | సారంగ | ,, | 1 |
| 18 | నవరోజు | ,, | 1 | 36 | హుసేని | ,, | 1 |

ఈ ప్రకారముగా 36 రాగములలో 157 తరంగములు చెప్పబడినవి చేతో శ్రీరామం [illegible] అముద్రితము కలసి 158 గలవు. ఈ తరంగములలో కొన్నిటికి వానికి చెప్పబడిన రాగములలో నేడు గానము చేయక భూపాళము, మలహరి, వరాళి, శహన, సారంగ, దేవగాంధారి మొదలైన రాగములలో మార్చి గానము చేయబడుచున్నవి.

## ఈ తరంగములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | త్రిపుట చతురశ్రజాతి (ఆది) తాళమున | | 82 | ను |
| 2. | అట లేక చాపు | ,, | 47 | ,, |
| 3. | త్రిపుట త్రిశ్రజాతి | ,, | 13 | ,, |
| 4. | ఝంప మిశ్రజాతి | ,, | 9 | ,, |
| 5. | ధృవ | ,, | 1 | ,, |
| 6. | మఠ్య | ,, | 2 | ,, |
| 7. | రూపక | ,, | 4 | ,, |
| 8. | ఏక | ,, | 1 | ,, |

**మొత్తము ఎనిమిది తాళములలో చెప్పబడినవి.**

## కాశీ నుండి దక్షిణ భారతమునకు యాత్ర

### జగన్నాథ క్షేత్రము

శ్రీ నారాయణ తీర్థులవారు కాశీనుండి దక్షిణ భారతమునకు యాత్రార్థము బయలుదేరినపుడు మార్గమున ఒరిస్సా దేశమునందుగల జగన్నాథ క్షేత్రమునకు వెళ్ళి అచ్చటి జగన్నాథస్వామిని దర్శించి నటుల శ్రీకృష్ణలీలా తరంగిణిలోని "నీలాచల వరనిలయం - నిఖిల జగన్నాథమేక మాకలయే॥ నిరధివట తరునికటం నిజసేవక బృందహిత విధాతారం అను శ్లోకము వలనను, దానికి తరువాతను సౌరాష్ట్ర రాగమున త్రిపుట తాళమున గల -

ప॥ సుభద్రా బలభద్ర సుదర్శన సహిత

చ 1 లవణజలధితీర లలిత నీలాచల

చ 5 - జగదేక నాయక జిత సురారి మండల ॥

అను తరంగము వలన తెలియ బడుచున్నది.

### కూచి మంచివారి అగ్రహారము

తరువాతను తీర్థులవారు ఆంధ్రదేశములో తూర్పుగోదావరి మండలమున కోనసీమయందుగల కూచిమంచివారి అగ్రహారమున మూడు సంవత్సరములుండి నటుల కొందరనుచున్నారు. కాని అందులకు ఆధారములు కనుపించుటలేదు.

### ఆగిరిపల్లి

తీర్థులవారు కృష్ణా జిల్లా విజయవాడకు సమీపమునగల ఆగిరిపల్లికి వెళ్ళి అచట గిరిమీద వెంచేసియుండిన శ్రీ శోభనాద్రి నృసింహస్వామివారిని దర్శించి నటుల సావేరి రాగమున త్రిపుట తాళములో చెప్పబడిన

ప॥ కరుణయా పాలయమాం శ్రీ నృసింహ

అను॥ శూరాసుర సంహార శోభనాద్రి శ్రీ నృసింహ॥

అను తరంగమువలన తెలియ బడుచున్నది.

### శ్రీకాకుళము

తీర్థులవారు కృష్ణా జిల్లాలో కృష్ణా తీరమునగల శ్రీకాకుళమునకు వెళ్ళి అచట స్వామిని సేవించినటుల దశమస్కంధములోని శంకరాభరణ రాగము మిశ్రచాపు తాళము గల అవలోకయత శ్రీ గోవిందం అను తరంగమున

ఏకాంత దైవతం - యాదవాబ్ధి సముదితం

శ్రీకాకుళ నగరీ - శ్రీభూమి సహితం.

అనుచరణము వలన దెలియబడుచున్నది.

## వేదాద్రి

తీర్థులవారు (తమ అత్తవారి యూరగు) కృష్ణా తీరమునగల వేదాద్రికి వెళ్ళి శ్రీ లక్ష్మీ నృసింహస్వామివారిని సేవించి నటుల కాంభోజి రాగమునందు ఝంప తాళమునగల

వ॥ వేదాద్రి శిఖర నరసింహ ॥
అను తరంగము వలన తెలియబడుచున్నది.

## అద్దంకి (శింగరకొండ)

తీర్థులవారు తమకు గలిగిన పరిణామ శూలవ్యాధి నివారణార్థము గుంటూరు మండలమున ఒంగోలు తాలూకాయందు అద్దంకి దగ్గర శింగరకొండకు వెళ్ళి అచ్చటి గుండికా (గుండ్లకమ్మ) నదీ తీరమునగల నృశింహస్వామికి కొంత కాలము ప్రదక్షిణములు చేయుచు తపస్సు జేయగా శూలవ్యాధి నివారించి నట్లును, ఆ రోజులలో ఆ ప్రాంతమున 60 గ్రామముల వారికి శ్రీకృష్ణలీలా తరంగములను బోధించినట్లును ప్రతీతికలదు. నేటికిని ఆంధ్ర దేశమున తరంగములను గానము చేయుటలో అద్దంకి ప్రాంతీయులది శుద్ధమైన సంప్రదాయమగుటయే యందులకు ప్రబల నిదర్శనముగా నున్నది.

అద్దంకి అయిదు నూర్ల సంవత్సరముల నాడు మహోన్నత దశ యందుండినటుల తెలియుచున్నది దేశమున ప్రసిద్ధులైనవారిలో మొదటి తరగతి పండితులందరును అచటనే యుండిరి. అచ్చట నూట ఒక్క దేవాలయములు న్నటుల శాసనము కలదు. సూర్య సిద్ధాంతమునకు కల్పవల్లియను వ్యాఖ్యానమును రచించిన యల్లయార్యుడు 50 సంవత్సరముల నాడు అద్దంకి యందుండెను ఆయనది అసలు అద్దంకికి సమీపమునగల (అద్దంక్యాం యామ్యభాగే సకల శుభకరం కల్వ పూర్యాభిధానం ॥ కల్పవల్లి వ్యాఖ్య) కలవకూరు అనుగ్రామము. అంతటి ప్రసిద్ధిగల దగుట చేతనే తీర్థులవారు అచటి భక్తకోటికి దర్శనమును కలుగజేసిరి. ఇటీవలి వరకు గూడ అద్దంకి మహాభక్తులకు స్థానమైయున్నది. అచ్చట బ్రాహ్మణ సత్రములు, సప్తాహములు, సామ్రాజ్య పట్టాభిషేకములు అనంతములుగా జరిగి యుండెను. నేటికి ఏబది సంవత్సరముల పూర్వము వరకు జరుగుచుండినవి. అట్టి సందర్భములలో అహోరాత్రి భజనలు జరుగుచుండెడివి. అందరును తరంగములనే గానము చేయుచుండిరి. ఆ పరంపరలోనివారే అద్దంకి వేంకట్రాయుడుగారు, పాలపర్తి నృశింహదాసుగారు, చల్లా సుబ్బయ్యగారు తాడిగడప (పెద్ద) శేషయ్యగారు మొదలయినవారు వీరందరును అద్దంకి వారేను. అద్దంకి యందేగాక ఆ మండలమందు అనేక గ్రామములలో నేటికి తరంగ కాలక్షేపముల జేయువారు కలరు.

## భూపతి రాజపురము

శ్రీ నారాయణతీర్థులవారు ఆంధ్రదేశము నుండి దక్షిణదేశమునకు వెళ్లునప్పుడు మార్గమున తిరుపతి క్షేత్రమునకు వెళ్ళి శ్రీ వెంకటేశ్వర స్వామివారిని సేవించిరి. పిమ్మట అనేక పుణ్యక్షేత్రములను మార్గమున దర్శించుచు వరగూరు అను భూపతిరాజపురమునకు జేరిరి. ఈ గ్రామము తంజావూరు జిల్లాలో కావేరినదికి ఉపనదియగు "కుడుమపత్తి" అను నదికి దక్షిణ తీరమున కలదు.

XXXX

## పరమాత్మ నృత్యము

అచటివారు తీర్థులవారి అమానుషమైన శక్తిని గుర్తించినవారై వారిని భక్తితో సేవించుచుండిరి. తీర్థులవారి ఆజ్ఞానుసారము అచటిరాజు శ్రీకృష్ణ పరమాత్మకు ఒక గుడిని నిర్మించగా తీర్థులవారే అందు స్వయముగా శ్రీకృష్ణ పరమాత్మ ప్రతిమను ప్రతిష్టించెను.

శ్రీనారాయణ తీర్థులవారు పాడుకొనుచుండు సమయమున ఒక తెరను కట్టించెడివారట. ఆ తెర వెనుకను వారిగానమునకు తగినటుల నృత్యము చేయుచున్నటుల గజ్జలధ్వని వినుపించు చుండెడిదట. ఆవిధముగా భూపతిరాజపురమునందు మూడు సంవత్సరములనుండి అనేకులగు శిష్యులకు తరంగములను భోధించిరి.

తీర్థులవారు దక్షిణ దేశ యాత్రలను జేయునపుడు అనేక దివ్య క్షేత్రములను దర్శించుచు శ్రీకృష్ణభగవాసుని దివ్యనామమును గానము చేయుచు పరమశాంత స్వభావులై తిరుగు చుండిరి.

ఈ విధముగా అనేక క్షేత్రములను దర్శించుచు దివ్యమైన తోటలతో గూడిన మధ్యార్జునము అను తిరువిడై మరుదుర్రై అను ప్రదేశమునకు జేరి అచటి శ్రీ మహాలింగస్వామిని దర్శించి అచ్చట నివసించుచుండిరి. ఆ కాలమున సచ్చిదానంద స్వాములవారు అనేకులగు శిష్యులతో నచట నివసించుచుండిరి

## తిరువయ్యూరు

శ్రీ నారాయణ తీర్థులవారు తిరువయ్యూరుకు వెళ్ళి అచట నుండిన శ్రీ సచ్చిదానంద స్వాములవారిని దర్శించినపుడు తీర్థులవారి చిత్తపరిపక్వతను గమనించి శ్రీ సచ్చిదానంద స్వాములవారు వారిని పంచనద క్షేత్రమునకు వెళ్ళి అచట నుండవలసినదిగా జెప్పిరి. అంతట తీర్థులవారు పంచనదములతో చుట్టబడిన తిరువయ్యూరు అను దివ్య క్షేత్రమునకు జేరి అచట నొకబిల్వ వృక్షము క్రిందను కూర్చుండిరి. కొంతకాలము అచట నుండి ఏకాంతముగ నుండుటకు వసతిగలస్థలమునకు చేరదలచి విళాంగుడిలో ఇప్పతోటలో నొక చెట్టు క్రింద నివసించిరి. కొంత కాలమైన పిమ్మట శివస్థలములలో గొప్పదగు కొళ్ళడమునకు ఉత్తర దిక్కుగా నుండు తిరుమళ్ళప్పాడియల్‌లో నొకచోట ఆశీనులై యుండిరి.

ఒక రోజున కోళ్ళడము మొదలైన నదులను దాటి తీర్థులవారు దక్షిణ ముఖముగా పోవుచు సూర్యాస్తమగు సమయమునకు బ్రాహ్మణులు విశేషముగా నుండు నడుక్కావేరియను గ్రామమునకు చేరిరి. ఆ గ్రామములో వినాయకుని గుడిలో ఆ రాత్రి బసజేసి యోగములో నుండిరి. ఆ రాత్రి కలలో శంఖ చక్రాదులను ధరించిన శ్రీ మహావిష్ణువు కనబడితాను ప్రపంచమును రక్షించుటకు పూర్వము అవతరించిన బహురూపములను (అవతార రూపములను) జూపి ఈ కలియుగమున ప్రపంచమును కాపాడుటకు కొరకై యెత్తిన అవతారము అలమేలుమంగా సమేతముగ శ్రీశ్రీనివాస భగవానుని రూపములో దర్శనమిచ్చి తీర్థులవారిని చూచి రేపు ఉదయమున యిచ్చట కనబడు వరాహము వెంటబోయి అదిచూపునట్టి చోటికి చేరుదువుగాక యని చెప్పి అంతర్ధానమయ్యెను. తెల్లవారిన పిమ్మట కలలో

చెప్పబడినటుల ఒక వరాహము తీర్థులవారి ప్రక్కన కనుపించెను తీర్థులవారు ఆ వరాహము వెంటబోగా అది వరగూరు అను గ్రామములో బ్రాహ్మణవీధిలో మధ్యనుండు ఒక యింటిలోపలేరెను లోపలికి దూరిన వరాహమును ఎన్ని పర్యాయముల వెదికినను కానరాలేదు. తనను తీసుకొని వచ్చిన వరాహము మహావిష్ణువేయని గ్రహించి శిరముపై చేతులు జోడించి కన్నీటి ధారతో సావేరిరాగమున "మత్స్యః కూర్మవరాహనర మృగవామనానురభార్గవ" అని దశావతారముల తరంగమును పాడుచు ధ్యానమందు నిలిచిరి. అచ్చట ఏడు రోజులు నిష్ఠతో నుండి ఎనిమిదవ రోజున అదే యింటిలో దేవాలయము నేర్పురుపజేసి అందు శ్రీ వెంకటేశ్వరుని ప్రతిష్ఠించి తాము అయింటిలో నుండి పూజచేయుచుండిరి. పెరటాసి నెలయందును, శనివారము లందును పూజలు చేయుచు, గోకులాష్టమికి ఉత్సవమును జరిగించుచుండిరి. తమకు కలలో కనుపించిన వెంకటేశ్వరుని యొక్క మహాత్మ్యమును భక్తులకు బోధించుచుండిరి. అప్పుడు తీర్థులవారికి అచ్చట కొందరు శిష్యులేర్పడిరి

ఒకనాడు రాత్రి కృష్ణ పరమాత్మ కలలో కనుపించి నాయొక్క లీలలను నీవుగానము చేయవలయునని అంతర్ధానమయ్యెను. తెల్లవారిన పిమ్మట కలలో కృష్ణపరమాత్మ ఆజ్ఞాపించిన ప్రకారము "జయ జయ రమానాధ" అను తరంగమును గానము చేసెను

వరగూరులో తనచే స్థాపించబడిన శ్రీ వేంకటాచలపతి యొక్క ఆజ్ఞనుపొంది తిరువైయారు సమీపమునగల "కొల్లనొతురిత్తియే" అను క్షేత్రమునకు వచ్చి శ్రీ అప్పర్‌స్వామిని దర్శించి అటనుండి కావేరినదికి దక్షిణమునగల తిరుపందుర్తి అను క్షేత్రమునకు జేరిరి. ఈ గ్రామము వరగూరునకు కొంత దూరమును కుడుమపత్తియను ఉపనదీ తీరముననేకలదు. తిరువాడు నుండి తిరుకుట్టుపల్లికి బోవు మార్గము నందే యీ గ్రామములున్నవి. తిరుపందుర్తియందు నదియొడ్డున పొదలతో గుమిగూడి యుండు ఒక మామిడిచెట్టు క్రింద కూర్చుండి చాలకాలము తపస్సులో నుండిరి. ఆ మామిడిచెట్టు గొప్పగా పెరిగి నేడుకూడ బాగున్నదని తెలియుచున్నది. 1952 సంవత్సరమున నవంబరు 30 తేదికి సరియగు నందన సంవత్సర కార్తిక శుంగలు ఆదివారము రోజున దక్షిణ దేశమున పెద్దతుఫాను గాలికి అన్ని చెట్లు పడిపోయి ఆ మామిడిచెట్టు మాత్రము పడిపోలేదని, అచెట్టు వయసు 400 సంవత్సరములపై కాలమని అచటివారు తెలుపుచున్నారు. అది తీర్థులవారి మహిమకు నిదర్శనమగుచున్నది

ఒక బ్రాహ్మణుడు తీర్థులవారికి సేవజేయుచుండ కొంత కాలమునకు నీకేమి కావలయునని యడుగగా కుటుంబము కొరకు కొంత ధనము కావలయుననెను. శ్రీస్వామివారు ఆ బ్రాహ్మణునికి చేయిజాపుమని ఒక ఆకు నిచ్చెను. పచ్చని ఆకును యిచ్చిన కారణమును ఆ బ్రాహ్మణుడు అడుగగా నారాయతీర్థస్వామివారు ఈ క్రింది విధమున దెలిపెను.

"తంజాపూరు రాజధానిగా అమరసింగు అను రాజు ధర్మపరిపాలన జేయుచున్నాడు. అతను వేదాంగము పద్ధతి యందే అనేక ధర్మములను చేయుచున్నాడు. పూర్వజన్మ కర్మఫలముగా అరాజు చేతిలో నొకవ్రణమేర్పడి అతనిని మిక్కిలి బాధించుచున్నది. ఈ మూలిక అతని చేతిలోని వ్రణమునకు దివ్యౌషధము. అచటికి వెళ్ళి ఉపయోగించుము. నీకు కావలసిన ధనమును అరాజు యిచ్చుననెను"

శ్రీ నారాయణతీర్థ స్వామివారి ఆజ్ఞ ప్రకారము ఆ బ్రాహ్మణుడు అమరసింగు మహారాజును దర్శించి ఆయన చేతిలోని వ్రణమును తనవద్ద నున్న ఆకుతో నయము జేసెను.

రాజుగారి సత్కారము నొంది బ్రాహ్మణుడు వెళ్లుచుండ తమకీ దివ్యౌషధము ఎటుల లభించినదని రాజుగారు ప్రశ్నించిరి. తనకు అది లభించిన వృత్తాంతము నంతను అమరసింగు మహారాజుగారికి తెలియజెప్పెను.

చేతిలోని వ్రణమును నయము చేసిన బ్రాహ్మణుని వలన నారాయణతీర్థులవారి ఉదంతము నంతను తెలిసిన అమరసింగు మహారాజు తీర్థులవారిని దర్శించి పూజించ వలయునని తగిన యేర్పాట్ల కొరకు మంత్రికి జెప్పిరి. మరునాడు అమరసింగు మహారాజు సకుటుంబ సపరివారముగా

మంగళవాద్యములతో తిరుపందుర్తికి చేరిరి. కాని మూడు రోజులవరకు దర్శనము లభించలేదు. అందులకు రాజుగారు సంతాపపడుచుండుటను గ్రహించి తీర్థులవారు రాజుముందు దర్శనమిచ్చి ఎవరని యడిగిరి.

మహానుభావులారా, నన్ను గాచి రక్షించిన కరుణాసముద్రుడా, నేను తంజావూరు నేలు అమరసింగు రాజును, మీ పుణ్యలాభ దర్శనముగోరి యిచ్చటికి వచ్చితినని చెప్పి అనేక విధముల కొనియాడిరి. ఒక గుడిని కట్టించి శ్రీవారి యొద్దనున్న మేక తిరుగుటకు తగిన స్థలమునిచ్చెదనని రాజుగారు తీర్థులవారికి విన్నవించి, ఎంత భూమిని యివ్వవలయునోనని రాజుగారు యోచించుచుండ రాజుగారి సందేహము తీరుపథమున అచ్చట నున్న మేకలేచి తన వెనుక కాలితో గీతను గీచుకొనుచు తీర్థస్వామి వారుండు తోటలో కొంత ప్రదేశమును చుట్టివచ్చెను. రాజు ఆశ్చర్యపడి వెంటనే మేక చుట్టివచ్చిన ప్రదేశము నంతను పట్టాచేసి యిచ్చెను. రాజుగారు అచట సూర్య పుష్కరిణీయను పేర నొక తటాకమును కట్టించిరి. మేక వచ్చి నిలబడిన ప్రదేశములో నొక దేవాలయమును మండపమును ప్రాకారమును కట్టించెను. తీర్థులవారు తమ వంశమువార్లై అంతటి మహనీయులని తెలిసిన కొందరు తల్లావఝులవారు దక్షిణదేశమున శ్రీర్ణమహాదేవి గ్రామములో నివాస మేర్పరచుకొనిరి. ఆ పరంపరలో తల్లావఝులవారు అచట 200 కుటుంబములవారు కలరని లోగా చెప్పడెను.

శ్రీ నారాయణతీర్థ యతీంద్ర సద్గురుస్వామివారు తమ నిర్యాణకాలమును అమరసింగు మహారాజునకును, తిరుపందుర్తి వాసులకును, తమ శిష్యులకును ముందుగా తెలిపిరి. తీర్థులవారి మోక్షకాలము దర్శింప అనేక ప్రాంతములనుండి రాజులతో సహా అనేకులు వచ్చిచేరిరి. స్వామివారు తెలిపిన సమయమును ఆ సన్నము కాగానే గొప్పకాంతి గోచరించి, ఆజ్యోతి పైకి కొంత దూరము వరకుపోయి కనుపించక పోయెను. ఆరోజు మాసినెల, శుక్ల పక్షము - అష్టమితిధి, కృత్తికా నక్షత్రము గురువారము శ్రీ స్వామివారు జీవన్ముక్తినొందిన పిమ్మట అమరసింగు మహారాజుగారు తీర్థులవారి సమాధి పూజాదులకుగాను 19 యకరముల మాన్యము నిచ్చిరి. నేటికిని నిర్యాణదినమున ప్రతి సంవత్సరము తీర్థులవారి ఆరాధన వారి సమాధివద్దను తిరుపందుర్తియందు జరుచుచున్నది. అనేకులు భక్తులు అచట సమావేశమై శ్రీవారి తరంగములను ఆడిపాడి సేవించుచున్నారు.

కొంతకాలము క్రిందట శ్రీవారి సమాధివద్దను నమశ్శివాయ అనువారు సేవించుచుండిరి. పిమ్మట అచ్చులవాడన అనువారు పిమ్మట చిదంబర తంబి అనువారు తరువాతను చిత్రంచలస్వామి అనువారు, వీరికి అనంతరము తిరువణ్ణామలై అధీనములో నున్న కున్నక్కుడియా మఠము యొక్క తిరుకైలాస పరంపరస్వామి శ్రీ శ్రీ పరమాచార్య స్వామివారికి ఒప్పగించబడెను. నేటికిని కున్రక్కుడియార్ అధీనములో నున్నది.

తీర్థులవారు నిర్యాణము మొదలు నేటివరకును వారిసమాధి మహిమరానురాను ప్రబలముగానే యున్నది. భక్తులు ప్రార్థనలతోను,బీదల అన్నదానములు, నేతి దీపముల బెట్టుకావడిని ఎత్తువారును, పాలబిందెలు ఎత్తువారును, ఉపనయనములు పెండ్లి మొదలైన శుభకార్యములు, అంగప్రదక్షిణములు చేయువారు, అడుగుల ప్రదక్షిణముల జేయువారు, అభిషేకములు అలంకారార్చనలు, దివ్యనామ సంకీర్తనలు, భజనలు మొదలైన వాటితో ఏటేటా అతివైభవముతో జరుగుచున్నవి.

శ్రీనారాయణతీర్థులవారి సంగీతాభ్యానమును గురించి యేమియు తెలియుటలేదు. కాని సంగీతమందు వీరికిగల పాండిత్యము సశాస్త్రీయమైనదని వీరి తరంగముల వలన విశదమగుచున్నది.

ప॥ "హేరా మహే కృష్ణ అను భూపాల రాగమునందుగల తరంగములో

"భూపాల దేశాక్షి; దేవగాంధారి, శుభ

బిలహరి, వసంత, ముఖరాగ బృందం అని చెప్పిరి.

అనగా భూపాలము, దేశాక్షి, దేవగాంధారి, శుభపంతువరాళి బిలహరి, వసంత, ముఖారి మొదలయినవి ప్రాతఃకాల రాగములుగా చెప్పబడినవి.

శ్రీ నారాయణతీర్థులవారి తరంగము లన్నిటిలోను బాలగోపాల తరంగము చాల ప్రసిద్ధి వహించినది. ఈ తరంగమునందు మొదటి చరణమున శబ్దమును కొంతవరకు వ్రాసి తరువాతను స్ఫురించనందున నిలిపెనట మరునాడు పూర్తి చేయుటకు చూడగా పూర్తి చేయబడియుండెనట శ్రీకృష్ణ పరమాత్మ స్వయముగ పూరించెనని గ్రహించి తన్మయుడై మిగతా చరణములను గానము చేయుచు పూర్తి చేసెను.

అద్దంకి సీమ తీర్థులవారి తరంగ కాలక్షేపములకు ప్రసిద్ధి వహించిన విధము లోగా వివరింపబడెను. పైన చెప్పబడిన బాలగోపాల తరంగమును ఒకదానినే అద్దంకి వేంకట్రామయ్యగారును, పల్లా సుబ్బయ్యగారును ఒక రాత్రి అంతయుకాలక్షేపము జేసెడివారు వెంకట్రామయ్య గారు గజ్జెకట్టి రాత్రి అంతయు తరంగ కాలక్షేపము చేయగా ఉదయమగు నప్పటికి గరుత్మంతుడు వచ్చి "కృష్ణా" యనుచుతిర్గి ఆకాశమున సంచరించగానే అప్పుడు నారికేళములుకొట్టి హారతియిచ్చి కాలక్షేపమును పూర్తి చేసెడివారు. తీర్థులవారు తపస్సుచేసిన శింగరకొండ యందుగల గుహలో నేటికి అరువది సంవత్సరములకు పూర్వము పాలపర్తి నరిశింహదాసుగారు సిద్ధిపొందిన సమాధి కూడ నేటికిని కలదు, ఇచ్చట అనేకులు భక్తులు అద్దంకి సీమలో తరంగ కాలక్షేపములను జేసి తరించిరి. బొమ్మరాజు సీతారామయ్యగారు, రావినూతల వరద రామదాసుగారు, కోట చంద్రమౌళిగారు, తరంగ కాలక్షేపముల జేసి తరించిరి, బొమ్మరాజు సీతారామయ్యగారు తరంగ కాలక్షేపము జేయుచునే కైవల్యము నొందిరి వీరందరును గాక గుంటూరు మండలమున కొల్లూరు గ్రామవాసియగు మహాభక్తులగు అనంత రామ సోమయాజులుగారు కూడ గుంటూరు భక్త సమాజమున తరంగ కాలక్షేపము చేయుచునే పరమ పదించిరి

శ్రీ నారాయణతీర్థులవారి శ్రీకృష్ణలీలా తరంగము లందలి విశేషములను గురించి సమగ్రముగ వివరించ వలయుననిన అంతటి పండితులకే సాధ్యమగును. అందువలన వారి చరిత్రను మాత్రమే తెలిసినంతలో సంగ్రహముగ నివేదించడమైనది.

---

Swami Sri Sivasankara Sastri is of the view that Narasimha Sastri might have been a young man from Tirthulu's nearer coparceners (sannihita jnati).

The genealogy tree is of interest :

Narasimha Sasri (Resident of Kaza Village)
(A son of Govinda Sastri's brother)
|
Rajagopala Sastri — land agent and yati (ascetic)
|
Raghunandana Sastri — yati (ascetic)
|
Rukminisvara Sastri — yati (ascetic)
|
Gangadhara Sastri — yati (ascetic)
|
Krishna Sastri (born in 1848)
|
Gangadhara Sastri — Swami Sivasankara Sastri (born in 1892)

## తరంగముల ప్రతిపదార్థ రచనకర్త :

# కీ॥ శే॥ శ్రీమాన్ దామోదర కృష్ణదాసు అయ్యగారు మరియు కుటుంబ చరిత్ర

## (శ్రీకాంత భోగావళి నుండి)

## శ్రీ దామోదర కేశవదాసు గారి (కృష్ణదాసుగారి తాతగారు) చరిత్ర

### రచన : నీలంరాజు ఆదినారాయణదాసు (ఆదిమూర్తి)

కేశవదాసుగారు 1777వ సంవత్సరములో క్రొత్తపట్నంలో జన్మించినారు. వీరికి లీలాహృషీకేశదాసు అని తిరునామము గలదట. వీరు 2 సం॥ల ఈడుననే దోగాడుచూ తమదోడ్డిలోని గుమ్మడిపాదలో ప్రవేశించి 4 రోజులు కనిపించలేదట విశేషకాలము సముద్ర దరిని ఏకాంతంగా సంచరించుచు యోగాభ్యాసము చేసిరట. సకల విద్యలు అనర్గళంగా గ్రహించి క్రొత్తపట్నంలో తన గృహమున "రామటెంకే" అనుపేరున మందిరం నిర్మించుకొని నిత్యతిరువారాధన జరుపుకొనుచూ ప్రతి సంవత్సరము భగవత్ప్రేరణతో గ్రామస్తులు చేయు సహాయమున కళ్యాణ పుత్సవములు జరుపుచుండేవారుట. వీరి మహిమవిని శ్రీ వైష్ణవ జియ్యంగారొకరువేంచేసి, విచారించి, పంచ సంస్కారదీక్ష పొందమనిరట. అందుకు భగవానుడు అదివరకు స్వయంగా నాకుచేసియున్నారు అని చెప్పి పద్మాసన స్థితులై తమ శరీరమున విష్ణుచిహ్నములు గనుపరచగా వారు సంతసించిరట. నిత్యకైంకర్యమునకు భక్తసహాయము తప్ప వేరొక సంపాదన లెఱుగరట. వీరి మహిమవిని శ్రీతూము నృశింహదానువారు వచ్చి దర్శించి అనుగృహింవబడిరట. అలూరి వెంకటాద్రిస్వాములవారు వీరి ప్రశిష్యులనెదరు. చాలా శిష్యకోటి ననుగ్రహించిరట, గృహకళ్యాణోత్సవ సంకీర్తనలకు వీరే మొదటివారని వాడుకకలదు. వచ్చిన పనిముగియుచూ ఆసన గండమాల అనే వ్రణమునకు గురియై దానినివారణకు యేచికిత్సచేయకపోవుటయేగాక అకురుపులో పుట్టిన పురుగులను తీయవద్దని, దహనం కాబోవుకండలు, రక్తంవృధాకాకుండ వాటికి కావలసినంత వరకు తిననియ్యమని అనేవారట. చివరకు అషాఢశుద్ధమున తమయింట పరమపద ఉత్సవమొకటి జరుగునని రమ్మని తమముఖ్యబంధువులకు శిష్యులకు శ్రీ ముఖములంపి, రావించి నియమితకాలమునకు శుచియై ప్రాణవాయువు బిగించి మస్తకముచించి బ్రహ్మరంధ్రమునుంచి లేచి 1822 సం॥ రము ఆషాఢశుద్ధ ౧౦ శ్రీ విష్ణుసాయుజ్యమేగిన మహనీయులు. ఆ తరుణమున వీరు పలికి వ్రాయించిన పద్యము.

కం. హరితసగోత్రోద్భవులై
హరియందే మనస్సు నిల్పియందరుకనగా
హరిదాసులలో నొకడై
హరిపద మునకేగె కేశవాఖ్యుండెలమిన్

వీరు రచించిన భగవస్తోత్ర మాలిక, సమస్త విషయములు తెలియు 34 విన్నపములు అనే గ్రంధము కొన్ని కీర్తనలు వీరి చరిత్ర సహ 1934వ సం॥లో ఒంగోలు విద్యాప్రచారిణి ముద్రణాయంత్ర శాలలో వీరిపౌత్రులు కీ॥శే॥ శ్రీమాన్ రాధా గోపాలకృష్ణదాసువారు అచ్చువేయించిరి.

# శ్రీదామోదర రాధాగోపాలకృష్ణదాసు (కృష్ణదాసు) వారి చరిత్ర

**రచన : గుం॥ ఆదినారాయణ**

శ్రీకృష్ణలీలా తరింగిణియను సంస్కృత గ్రంధమునకు తెలుగు ప్రతిపదార్థము అనుగ్రహించిన భాగవత శిరోమణి శ్రీమాన్ దామోదర రాధాగోపాలకృష్ణదాసు అయ్యగారి జన్మస్థలము ఒంగోలుజిల్లా క్రొత్తపట్నం గ్రామం. వీరి జననం 26-11-1862 పరమపదసాయుజ్యము 11-12-1945 ధర్మపత్ని వెంకటలక్ష్మమ్మగారు. కుమారులు ముగ్గురు కలరు. (1) శ్రీ వెంకటకృష్ణదాసు (2) సీతారామదాసు (3) పుండరీకాక్షదాసు కుమార్తె లక్ష్మిదాసి అనువారు కలరు. వీరి తండ్రి వెంకటకృష్ణదాసు తల్లి తెలియదు సోదరులు జ్యేష్ఠులు కేశవదాసుగారు. తాతగారు కేశవదాసుగారు.

శ్రీమాన్ రాధాగోపాలకృష్ణదాసుగారు, ఒంగోలులో కొంతకాలము కాపురమున్న కారణమున వారిని నాకు స్వయంగా తెలుసును. వీరు నిరాడంబరులు, నిస్వార్థులు సదా భగవత్చ్చింతనా సక్తులు వీరి మాతామహుడు భగవత్దాసుడు, అయిన భీమరాజు రాధాకృష్ణదాసుగారు శ్రీ ఆంజనేయస్వామివారి వీధిలో (పాంచాలవరపు వారి ఇండ్లవద్ద) నిర్మించిన శ్రీ ప్రపత్తి శ్రీ ఆంజనేయస్వామివారి దేవస్థానం నిత్యనైవేద్య దీపారాధనలతో స్థిరంగానున్నది. వీరి జ్యేష్ఠ సోదరులు కేశవదాసుగారి సంతానము అంతా ఉత్తరాదిన తాతా ఐరన్ కంపెనీలో ఉద్యోగరీత్యా స్థిరపడినారు. ఈ ప్రాంతమున ఎవరులేరు. వీరికి కొంతమంది శిష్యులు కలరు. వీరును, వీరి సోదరులు కేశవదాసుగారున్నూ, నృశింహోపాసకులు, తపోనిష్ఠాగరిష్ఠులునగు శ్రీమాన్ పాలపర్తి నృశింహదాసుగారి శిష్యులు వారి పరమానుగ్రహమును సాధించుకొన్న శిష్యశ్రేష్ఠులు. శ్రీ కృష్ణదాసు అయ్యగారు శ్రీకృష్ణపరమాత్మ కథయన్న గాఢమగు ప్రేమ. అచంచల భక్తి విశ్వాశములు కలవారు. అందువల్లనే శ్రీకృష్ణగాధకు సంబంధించిన శ్రీకృష్ణలీలా తరంగములకు తెలుగున ప్రతిపదార్థమును వ్రాసి లోటును తీర్చిరి. వీరి ధన్యకుటుంబముల గాధలను కార్యక్రమములను విశేషములను తెలియజేయుటకై నిరంతర భగవత్ సేవాపరాయణులగు శ్రీమాన్ కీ.శే. నీలంరాజు ఆదినారాయణదాసు (ఆదిమూర్తి) గారు ప్రచురించిన శ్రీకాంత భోగావళి నుండి యధాతధముగా ప్రచురించుచున్నాను.

వీరు దామోదర వెంకటకృష్ణదాసుగారి రెండవ కుమారుడు. వీరు దుందుభి సంవత్సరమున మార్గశిర శు॥ 26-11-1862 న శ్రవణ నక్షత్రమున క్రొత్తపట్నంలో స్వగృహములో జన్మించినారట. విశేష పట్టుదల, నిష్కర్షగల నవనీత హృదయులు, అప్పట్లో హూణ విద్య 6వ తరగతి ఉత్తీర్ణులై సంస్కృత భాష స్వయంకృషితో వృద్ధిపరుచుకొనిరి. అన్నగారివలె ఉద్యోగిగా కనిగిరి డి.ము. కోర్టులో వుంటూ 1892వ సం॥ ఏప్రియల్‌లో భద్రాద్రి రాముని సేవించివస్తూ, అద్దంకిలో కీ॥ శే॥ శ్రీమాన్ పాలపర్తి నృశింహ దాసువారిని వీరి అన్నతోపాటు ఆశ్రయించి పంచసంస్కారదీక్ష పొందిరి. భగవత్ విషయములు వృద్ధియగుకొలది ఉద్యోగమందు విరక్తిగలిగి తుదకు రాజీనామా వ్రాసియిచ్చిరట. వీరి స్థితినెఱింగిన అధికారులు కరుణించి వీరిని పిచ్చివానినిగా పైకి వ్రాసి వీరి భార్యగారు పోషకురాలిగా పన్ను గడచేసి నెలకు 1 కి 7/- రూ॥ వంతున పెన్షన్ వచ్చునటులచేసినారట. రుణము దొరికే కొలది శ్రీరామోత్సవములు జరిపించెవారట. లోగా ఒంగోలులోగల యిల్లు భూమి సహారుణములకుపోగా భీమరాజువారి సత్రములో నివసించెడివారట. వీరి పరిస్థితి

తెలిసినవారు ఎప్పుడైనా తెచ్చియిచ్చే సామాగ్రితో తిరువారాధన అరగింపులేనినాడు జలామృతసేవతో శయనింపు జరుపుచూ గడిపేవారట 5-6 పర్యాయములు తిరుమంత్ర జపయజ్ఞములు జరిపిరట. 1908వ సం॥లో 160 రోజులు దీక్షపెట్టుకొని గడ్డిటనుసునాహారముతో జరిపి వీరి గురువుగారు శ్రీ కాకర్ల నారాయణదాసు రంగదాసు మొదలగు బహుభక్త బృందముతో 40 రోజులు ఉత్సవములు విశేష వైభవంగా జరిపేవారట చివరన 200/- బాకీ నిలిచి శ్రీవారి కైంకర్యమునకు అయిన అప్పువారే తీర్చుకొనవలయునని పట్టుపట్టి రోజు 1 కి 8000 వేల చంతున జపమును. క్షీరపానముతో 6 నెలలు జరిపించిరట జవాబు పుట్టలేదట అంజలిపానము, అని శ్రీమద్రామాయణములో కలదు. రోజుకు ఒక అంజలి (దోసెడు) క్షీరాహారముతో జపించుచూ దీక్ష 13 రోజులు జరిగినంతలో కీ.శే. బ్ర శ్రీ ధారా మార్కేండేయ శాస్త్రులు గారి స్వప్నంలో శ్రీ భగవత్ప్రేరేపణ గలిగి వారే వచ్చి వీరిమాటతో పనిలేకుండా గ్రామములో వసూలు పరిచి వడ్డి త్రోసివేయించి శ్రీ దేవతముసలయ్యగారి అప్పు నుంచి వీరిని విడుదలచేయించినారట. తంబురచేపట్టి భగవత్సం కీర్తనతో విరామకాలము తిరుగుచూ అయాచితముగా లభ్యపడు ధనసామాగ్రితో కల్యాణోత్సవాదులు జరిపేవారట.

ఒకరోజు తప్పధాన్యమే వుండి పచనము చేయించి తిరువారాధన గడిపి, పిల్లలకు ఆ ఆహారం యిప్పించి తానుపవసించి యోగం క్షేమం వహామ్యహం అనునది యెటుల నెరవేర్చుకొనెదరో చూతునని శ్రీవారు ఇచ్చే వరకు అమృతవృత్తిలో అందరం వుండవల్సిందేనని దీక్షపట్టి 3 రోజులు గడపగానే భగవద్భక్తులద్వారా శ్రీవారే వీరి పోషణ జరుపుచుండే వారట. భక్తాదులొనర్చు కల్యాణోత్సవాదులుకు ఆహ్వానము మీద వెళ్లి తరంగ, రాస, మహోత్సవ సంకీర్తనలలో విశేషముగా పాల్గొనుచుండెవారట. ఒంగోలులో పేరున్నిక కల్గిన ప్లీడరు. కీ.శే. శ్రీ మల్లవరపు సుబ్బారావు పంతులు వారికి శ్రీ భాగవతార్థములు బోధించి ప్రపన్న కోటిలో చేరపించి వారికి, శ్రీ ఘూరకవి రామారావుపంతులు వారికి మరికొందరికి పంచసంస్కారదీక్ష వొసంగి కరుణించిరి. తమశిష్యుల కోరిక మీద శ్రీనారాయణ తీర్థులువారు రచించిన శ్రీకృష్ణలీలా తరంగిణిలోని గద్య, శ్లోక తరంగములను ప్రతిపదార్థములు చెప్పి వ్రాయించిరి. అట్టి వ్రాతప్రతి కలదు. శ్రీ జయదేవ అష్టపదివలె ఇది అచ్చుపడిన యెడల సంకీర్తన పరులుకు నిండా ఆనందమివ్వగలదని తలచెగాని అది అచ్చువేయించుటకు బూనిన దాతలు చిక్కలేదు. వీరి ముగ్గురు కుమారులు ప్రపన్న దీక్షాపరులే. 3వ కుమారుడు పుండరీకాక్ష దాసుగారు మద్రాసులోని పాత మాంబళములో శ్రీ వమిడి ఘంటం రంగదాసు వారి శ్రీనివాస మందిరములో శ్రీ వెంకటాద్రి స్వామివారి తిరువారాధన పరిపాలకులుగా కైంకర్యపరులుగా వుంటున్నారు.

వీరితాతగారివలె ఆసన గండమాల అనెవ్రణమునకు గురియై స్వల్పబాధలనుభవించుచూ సూళ్ళూరుపేటలో హైస్కూలులో హెడ్‌మాస్టరుగా వుంటూ వచ్చిన, 2వ కుమారుడు సీతారామదాసువారి వద్దకు వీరి దంపతులుచేరి, అంత్య సమయమును చెప్పి రాసక్రీడా నరహరి సంకీర్తనలు వీరిపెద్ద కుమారులగు శ్రీ వెంకటకృష్ణదాసు, కుమార్తె లక్ష్మిదాసి అనువారల వలనవింటూ భూశయనము తానే చేయించికొని భగవన్మార్గ సద్విషయములతో ధైర్యము వారికి చెప్పుచూ పార్థివ సం॥ రం మార్గశిరశుద్ధ సప్తమి 11-12-45 ఉదయము తనువు విడచి దివ్యధామము చేరిరి. వీరి ధర్మపత్ని వెంకటలక్ష్మమ్మగారు వికారి సం॥ రం మార్గశిరశుద్ధ అష్టమిన 7-12-59 దివ్య తనువు విడిచి భర్తగారి సాన్నిధ్యము చేరిరి.

# శ్రీదామోదర వెంకటకృష్ణదాసువారి చరిత్ర

## (కృష్ణదాసుగారి తండ్రి)

వీరు 1810 సం॥ లో నెల్లూరులో జన్మించిరి. వీరు శ్రీదామోదర కేశవదాసుగారి పుత్రులు వీరి తండ్రిగారి తిరువారాధనకై కైంకర్య పరులుగానుంటూ భగవత్ప్రేరేపణతో గ్రామస్థులందచేయు సామాగ్రితోనే కాలము గడుపుచుండేవారట ప్రతి సంవత్సర కళ్యాణోత్సవ ప్రారంభమునకు ముందే శ్రీవారితో ఘర్షణపెట్టుకొని తకరారుపర్చి సకలం తెప్పించుకొని జరుపు ఆచారమట. అట్టి పరిస్థితిని తెల్పుచూ వీరు వ్రాసిన కీర్తనలలో 8 మాత్రము వీరి రెండవ కుమారులున్ను యీ దాసుని గురువుగారగు కీ.శే శ్రీమాన్ దామోదర రాధా గోపాలకృష్ణదాసు స్వామివారి వలన చిక్కినవి. వీరు ఒంగోలు ఆంజనేయ స్వామివారి వీధిలో కోవెల కట్టించి ప్రపత్తి శ్రీ ఆంజనేయస్వామిని ప్రతిష్టింపచేసిన కీ.శే. భీమరాజు రాధాకృష్ణ దాసువారి అల్లుడుగారేనట. వీరు విశేష కోపిష్టియట. వీరిని ఒక జమీందారులు తమ గ్రామము పిలిపించి గౌరవించి ఒక పల్లకి మీద బోయలమోతతో పంపించిరట. అరణ్యమధ్యమున వీరిపై బోయలు అలిగి, పల్లకీదించి పరారైనారట. వీరికి దరితోచక తమ తిరువారాధనలోగల, కరస్థ వెన్నముద్దతో డోగాడు కృష్ణవిగ్రహం నడుమునకు ఒక త్రాడుకట్టి ఒక చెట్టుకు వ్రేలాడగట్టి దిగువ చెప్పబడే కీర్తన పాడుచూ చింతచెత్తముతో మోదుచుండిరట. ఆ సమీపంలో వేటాడి అలసి నిద్రించుచున్న మరొక జమీందారువారికి ఆదెబ్బ తగిలిలేచి విస్మయ మొందుచుండ, ఒక జవానువచ్చి సమీపంలో ఒక పెద్దాయన బాధపడుచున్నాడు. వెళ్ళి విచారింపండని పలికెరట. ఆ జమీందారు వెతుకుచూవచ్చి వీరి పరిస్థితి విచారించి క్రొత్త బోయలను రప్పించి పల్లకీతో వీరిని క్రొత్తపట్నం చేర్పించినారట. ఆకృష్ణ విగ్రహము కావలిలో కీ.శే భీమరాజు సీతారామదాసువారి పూజామందిరంలోగలదని చెప్పిరి. అట్టి సంఘటనలెన్నో గలవట. చిక్కలేదు చివర వరకిటులనే గడిపి సునాయాసముగా నెల్లూరులో 16-10-1877న తనువు చాలించారు

# శ్రీదామోదర కేశవదాసువారి చరిత్ర

వీరు దామోదర వెంకటకృష్ణదాసు గారి పెద్ద కుమారులు. వీరి జనన అంత్య సమయములు తెలియలేదు. తండ్రిగారి కోపములో కొంత బాగస్థులేనట. గానీ, భక్తి అతిశయములలో తన్మయత చెందుటలో వీరికి సమానులు వీరే అనెదరు. గవర్నమెంటు ఉద్యోగిగా కొంతకాలం పనిచేసినారట. అద్దంకి నివాసులు కీ.శే. శ్రీమాన్ పాలపర్తి నృశింహదాసుచే అనుగ్రహింపబడి వీరి తమ్మునితో సహపంచసంస్కార దీక్షనొంది పిమ్మట కొంతకాలమునకే ఉద్యోగమునకు స్వస్తి చెప్పిరట. వీరి గురువుగారి గృహమున జరిగే ప్రతి ఉత్సవమునకు వీరు వీరి తమ్ములు తప్పక చేరుచుండేవారలు. ఒకరోజు ఉదయం బహిర్దేశమునకు ఈ ఇద్దరు వెళ్ళి అద్వైత విశిష్టాద్వైత వాదము ఉభయులు పెట్టుకొని సాయంత్రము వరకు ఆ ప్రదేశమున అటులనే కూర్చునివున్నారట భోజనవేళ అతిక్రమించినను రాలేదేనని శిష్యులను వీరి గురువుగారంపి పిలిపించుకొనిరట. ఒకరోజు భజనలో తన్మయులై శ్రీ వైకుంఠమునకు గుఱ్ఱమెక్కి వెళ్ళుచున్నానని అంటూ అకస్మాత్తుగా నిలిచియున్న వీరి గురువుగారి భుజములపై ఎక్కి ఇరువైపుల కాళ్ళుచాచి గురువుగారి గడ్డపు

వెంట్రుకలు జూలుగా పట్టుకొని "చల్ చల్ గుర్రమా చెంగమెయ్య గుర్రమా" అని అదిలించుట చూసి అందరూ ఆశ్చర్యపడి చల్లగా వీరిని దింపినంతట వీరు తప్పు తెల్సుకొని గురుపాదముల పైబడి విశేష కాలం విలపించి క్షమించబడినారట

ఒక హరివాసరము రోజు తాను ఆకలిపట్టలేనని, గురువును వదలి తాను తిననని పట్టుబట్టి వారినిష్ఠను అతిక్రమింపజేసి తనతోపాటు గురువుగారిని సహభుజింపచేసిరట  తరంగాది సంకీర్తనలలో నృత్యముతో కాలము గడుపుచుండేవారట. వీరి భార్య గతించి, సంతతి పసిపిల్లలై, తానేవారికన్నీ వండిపెట్టుచూ, తాను పిలిచిన సమయమునకు పిల్లలురాని ఎడల వచ్చెదరా, లేదా ఈ అన్నము మీరు తినినను, కాకులు, కుక్కలు తినినను నాకు ఒక్కటే, రార్సైతిరా, వీధిలో పాత్రలనుంచె దనంటూ అటులచేయుచుండెడివారట ప్రహ్లాదులవలె పట్టుదలగల భక్తిగలవారై తన్మయులగుచూ విశేష కష్టములనను భవించుచూ దైవకార్యములు నిష్ఠగా జరుపుకొనుచుండేవారట కుమారులు వృద్ధికివచ్చి తాతా ఐరన్ కంపెనీ ఉద్యోగములో పుంటుస్థులయిన నాలవద్దకు చివరిదశలో వేంచేసి సునాయాశంగా తనువు చాలించినారట.



ప్రతిపదార్థము వ్రాసిన కృష్ణదాసు అయ్యగారు, వారి ధర్మపత్ని, కుమారుడు



24-6-2000 గ్రంథావిష్కరణ సందర్భములో కుర్తాళం పీఠాధిపతులచే
గుండ్లపల్లి ఆదినారాయణగారికి సన్మానం



గ్రంధముద్రణకు సహకరించిన దాతలు
శ్రీమతి నరహరి విమలమ్మ
స్వర్గీయ పద్మనాభం
రూ॥ 1116/-



గ్రంధముద్రణకు [illegible]
డా॥ తమ్మవరపు [illegible]
(టి.ఆర్ [illegible]
రూ॥ 10,000/

XXXXX



గ్రంథముద్రణకు సహకరించిన దాతలు .
శ్రీ ఘోరకవి శ్రీనివాస వేంకట సుబ్బారావు
(G.S V. SUBBA RAO)
రూ॥ 2116/-

గ్రంథముద్రణకు సహకరించిన దాతలు
శ్రీ మైనంపాటి హరినారాయణ తీర్థులు
దంపతులు
రూ॥ 1116/





గ్రంథముద్రణకు సహకరించిన దాతలు :
శ్రీ బొల్లాపల్లి వేంకట సుబ్బారావు దంపతులు
రూ॥ 1001/-

నా ఆధ్యాత్మిక గురుదేవులు

# శ్రీశ్రీశ్రీ పరమహంస, పరివ్రాజకా చార్యవర్య, అత్యంత తపోనిష్ఠాగరిష్ఠ

## పూజ్యపాద శ్రీ చిదానంద సరస్వతీ స్వాములవారు

**రచన : గుండ్లపల్లి ఆదినారాయణ**



శ్రీవారు నా ఆధ్యాత్మిక గురువులు. వీరి ప్రథమ దర్శనం బహుశః 1960 ప్రాంతములో హృషీకేశములోని ఆంధ్రాశ్రమమునందు లభించినది. శ్రీవారు అప్పటి విషయములు తెలుపుటకై మావెంట వచ్చుటకు సిద్ధపడినను, అజ్ఞానము చేత మేము నిరాకరించితిమి. అది మా దురదృష్టము. తరువాత పది సంవత్సరములకు కీ. శే. భీమరాజు నరసింహారావు ([illegible]) గారి ఆహ్వానము పురస్కరించుకొని రెడ్డిపాలెము లక్ష్మీకాంతానందయోగి గారితో కలిసి ఒంగోలు వచ్చుటయు, వారిని భిక్ష కొరకు మా ఇంటికి ఆహ్వానించుటయు జరిగినది. ఉత్తరాది తీర్థ ప్రదేశములనుండి గుర్తుకొరకై తెచ్చిన ఒక చెంబు ఆధారంగా శ్రీవారు నన్ను గుర్తుపట్టి హృషీకేష్ ఆంధ్రాశ్రమ సంఘటనను జ్ఞప్తికి తెచ్చిరి. అప్పుడు వారిని నేనాశ్రయించుటయు, నాకు మంత్రోపదేశమిచ్చుటయు జరిగినది. వారి హృదయము అమృత తుల్యము శిష్యులన్న అఖండమైన ప్రేమ, వాత్సల్యములు చూపెడువారు. కృష్ణాజిల్లా గన్నవరములో చిదానందాశ్రమము అను ఒక ఆశ్రమమును స్థాపించి, సమీపముననే శ్రీబాలాత్రిపుర సుందరీ సమేత శ్రీ సోమలింగేశ్వరస్వామి దేవాలయమును నిర్మించి ప్రతిసంవత్సరం కార్తీక పౌర్ణమికి రుద్రాభిషేకము, లక్షబిల్వార్చన, లక్షకుంకుమార్చన మొదలగు విశేష కార్యక్రమములు జరిపించుటేగాక, ఆ ఆశ్రమమునందు నిరతాన్న ప్రదానము, బీదలకు విద్యాదానము, ఉపనయనములు నిర్వహించెడివారు. శ్రీవారు కాశి, హరిద్వార్, హృషీకేష్ మొదలగు పుణ్యక్షేత్రములందు ముప్పై సంవత్సరములు అత్యంత కఠిననియమములతో వాయు భక్షకులై కఠోరమైన తపస్సుచేసి, వారి గురువులైన ప.ప శ్రీశ్రీశ్రీ జ్ఞానానంద సరస్వతీ స్వామివారి కృపకు పాత్రులైరి. బదరి, కేదార, నేపాళ, కైలాస మానస సరోవరములను పాద, యాత్రతో సేవించి పునీతులైన మహాయోగులు. వీరు శ్రీరమణ మహర్షులవారి కటాక్షమునకు పాత్రులై, బ్రహ్మ విద్యనుపాసించి, హఠయోగమున నిష్ణాతులైన జ్ఞానవృద్ధులు, సిద్ధసంకల్పులు 1975 సంవత్సరములో మా మనవిని మన్నించి ఒంగోలులో మా స్వగృహమునందు చాతుర్మాస్య దీక్షావ్రతమును పూర్తిచేసి మమ్ముద్ధరించిన మహనీయులు. వారి అనుజ్ఞ ప్రకారము, ప్రతిరోజు ఉదయము గోపూజ, పాదపూజ, భజనలు, వేదపఠనము, పాటకచ్చేరీలు జరిగెవి. వారి అనుగ్రహమువలన ఎంతోమందికి సంతానప్రాప్తికూడ కలిగినది.

1972లో జరిగిన నాషష్టిపూర్తి కార్యక్రమమునకు దయతోవచ్చి నన్నాశీర్వదించి నాకెంతో ఆనందము, తృప్తిని కలిగించిరి. వారు బ్రహ్మీభూతులైన తరువాత, వారు నెలకొల్పిన చిదానందాశ్రమములో శ్రీ భువనేశ్వరి పీఠము స్థాపింపబడి వార్షికోత్సవములు నవరాత్రులు వగైరా కార్యక్రమములు చక్కగా నిర్వహింపబడుచున్నవి. మా అధ్యాత్మిక గురువుల శాశ్వత సంస్మరణ కొరకై శ్రీ చిదానందాశ్రమము, అందు స్థాపింపబడిన భువనేశ్వరీ పీఠము బహుముఖములుగా ప్రసిద్ధినొంది సామాన్యజనులకు జ్ఞానాభివృద్ధిని ప్రసాదించుగాకయని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

# శ్రీమాన్ తూర్పు తక్కెళ్లపాడు అయ్యావార్లంగారు

**సంస్మరణ : గుండ్లపల్లి ఆదినారాయణ**

ఈ గ్రంథములో సద్గురు నారాయణతీర్థులవారి సంస్కృత రచనకు తెలుగు (టీకా) తాత్పర్యములు ప్రచురించబడుచున్నవి. ఈ సదవకాశమును పురస్కరించుకొని మాప్రాంతమునకు సంబంధించిన బహువిధ పుణ్యపురుషుల చరిత్రలుకూడ ముందుతరములవారి కొరకై సమకూర్చబడినవి. అట్టివారిలో తపస్సంపన్నులు, మంత్రసిద్ధులు, సత్యసంధులునగు ఈ క్రిందనుదహరించిన మహనీయుని సంస్మరణకూడ ఉండుట ఉచితమనియు, భావిసంతతతికి మార్గదర్శకమనియు భావించి ఈ సద్గ్రంథమునకు సంబంధములేకున్నను ఇందు ప్రచురించుకొనుచున్నాను. పాఠకులు సాహసముగా భావించినను శ్రీవారితో నాకుగల పరిచయము స్వానుభవముల కారణముగా వారిని సంస్మరించుట నావిధిగా భావించుకొనుచు పరమపదవి నధిష్ఠించిన ఆమహనీయునకు ఈద్వారా నా నమోవాకములర్పించు కొనుచున్నాను.



శ్రీమాన్ శ్రీ మదద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ తిరువేంకటతాత దేశికాచార్యులయ్యావార్లంగారు.

జననం : 1893 పరమపదం : 1961

వీరివంశీకులు దక్షిణదేశమునందుండి ఆంధ్రదేశములో విశిష్టాద్వైత సాంప్రదాయమునకు చెందిన గురుస్థానీయులుగా ప్రకాశంజిల్లా అద్దంకి తాలూకా, తూర్పు తక్కెళ్ళపాడు గ్రామములో స్థిరపడినారు వీరు కీ.శే. శ్రీమాన్ తట్టాడ రాఘవాచార్య పండితులను తమింట 12 సంవత్సరములు ఉంచుకొని వ్యాకరణము, భాష్యాంతము మొదలగు ఆర్షవిద్యలను, కీ.శే. శ్రీమాన్ కూరపాటి రామానుజాచార్యులవారి వద్ద గాత్రం, ఫిడేలు, వీణ మొదలగు లలిత కళలను అభ్యసించిరి. తర్కవేదాంతములనుకూడ అభ్యసించిరి కాని, వివరములు తెలియవు. కీ.శే. బ్రహ్మశ్రీ చింతలపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వద్ద సిద్ధాంత, జ్యోతిషములు అభ్యసించిరి మరియు చదరంగం, కర్రసాము, కత్తిసాము, విలువిద్య ఆయుర్వేదం మొదలగు విద్యలందుకూడ ప్రావీణ్యతను సంపాదించిరి.

వీరు మంత్రముతో నింపిన చీట్లతో పశువ్యాధులను మసూచి, కలరావంటి వ్యాధులను నివారించేవారు, ఈప్రాంతమున వీరికి శిష్యకోటి చాలాకలదు. దేవాలయ ప్రతిష్టలకు అవసరమైన యంత్రములు, వాస్తు, ఆగమములకు సంబంధించిన విషయాలపై సలహాలిచ్చెడివారు. మంత్రోపాసన, మంత్రసిద్ధి వాక్శుద్ధి, శీలసంపద, నిరాడంబరత, పారమార్థికబుద్ధి, ఉదారాశయములతో నిండిన త్యాగనిరతికి వీరికి వీరేసాటి. వీరివంశీయులకు అద్దంకివద్దనున్న శింగరకొండ లక్ష్మీనరసింహ స్వామివారు ఇష్టదైవమని ప్రతీతి.

వీరిని నాకు గత నలభై సంవత్సరములకుపైగా తెలియును. మా దత్తతండ్రి కీ.శే వెంకటరంగయ్యగారితో కూడ వీరికి పరిచయముకలదు. వీరి మంత్రసిద్ధిని గురించి తెలుపుటకై నా స్వానుభవమునే ఉదాహరణగా పాఠకుల ముందుంచుతున్నాను.

నాకు మూడు సంతానములు నష్టమగుటచే మా బంధువుల సలహామేరకు, సంశయ నివారణకై శ్రీవారిని దర్శించితిని. వారు ఎంతో ఆదరణతో మాదంపతుల విన్నపమాలించి, వారి అనుగ్రహమును ప్రసాదించిరి. వారు ఒక అంగుళం వెడల్పుగల తెల్లకాగితం ముక్కమీద యేదో మంత్రం వ్రాసి నలభైచీట్లు నాభార్యపరంగా ఇచ్చి గ్లాసెడునీళ్ళలో ప్రతిరోజూ ఉదయం ఒకచీటి అందుంచి తర్వాత ఆచీటీని తీసివేసి అందలినీరును త్రాగవలసినదిగా ఆదేశించినారు. అప్రకారము నాభార్య నలభైరోజులు సేవించింది. తత్ఫలితంగా ప్రథమంగా నాకు ఒక పుత్రిక జన్మించింది. ఆమెపేరును ఇందిరగా వారే నామకరణం చేసిరి. తదుపరి రెండవ పర్యాయముకూడ అదే పద్ధతిలో తీర్థం సేవించడం జరిగింది. ఈతడవ మగశిశువు జనించగా అతనికికూడ వారే వెంకటకృష్ణయ్యగా నామకరణంచేసిరి. యెప్పుడు వెళ్ళినను పండ్లు, తాంబూలము తప్ప మరిదేనిని స్వీకరించేవారుకాదు. మావంశాభివృద్ధికి కారకులైన ఈ మహనీయుని నిరంతరం స్మరించుట నావిధిగా భావించుచున్నాను.

శ్రీమాన్ అయ్యవార్లంగారు ఒక విశిష్టమైన వ్యక్తి, అందుకు సంబంధించిన ఒక సంఘటన పాఠకులకు తెలుపుట ఉచితమని భావిస్తాను.

అయ్యవార్లంగారికి చీరాలలో భవనములు, స్థలములు ఉన్నవి. వాటి విషయములో కోర్టుదాకా వెళ్ళవలసివచ్చింది. జయముపొందవలెనంటే నిజమునకు విరుద్ధముగా అల్పమైన అబద్ధము చెప్పవలసిరాగా అయ్యవార్లంగారు అందుకు నిరాకరించిరి. ఈ స్థితిలో కాగితము ద్వారానైనా అసత్యమును పలికించ ప్రయత్నించిన వారి అనుయాయులకు ఆశాభంగము తప్పలేదు. తత్ఫలితముగా లక్షలవిలువైన ఆస్తిని శ్రీవారు కోల్పోవవలసి వచ్చినది.

ధర్మోరక్షతి రక్షితః అనుధర్మ సూక్తమును మనసావాచా కర్మణ పాటించిన మహామనీషి ఆయన. పూర్వపు రోజులలో 'శీలావంతులు' అని కొందరు పిలువబడేవారు. వీరిని వారిలో నొకరుగా పరిగణించవచ్చును.

శ్రీశైలాన్వయ సింధు శీతకిరణం శ్రీ శింగరార్యాత్మజం<br>
శ్రీశైలాఖ్యగురోః పదాబ్జమధుపం తత్ప్రాప్త భాష్యాదికమ్<br>
వాత్సల్యాది సమస్త సద్గుణ నిధిం సర్వాశ్రితా భీష్టదం<br>
శ్రీమద్వేంకట తాతదేశిక గురుం గురూణాం వరమ్ ధ్యాయే

# విషయసూచిక

# విషయసూచిక

# అకారాదితరఙ్గ సూచీపత్రము

# అకారాదితరఙ్గ సూచీపత్రము

# అకారాదితరఙ్గ సూచీపత్రము

శ్రీరస్తు

# శ్రీ కృష్ణలీలా తరఙ్గిణి

## ప్రథమతరఙ్గము

అవతారిక గ్రంథకర్త విఘ్ననివారణార్థమై యిష్టదేవతాభివాదనము నాచరించుచు అందుఁ దొలుత విఘ్నేశ్వరునిఁ దలంచుచున్నాడు

మంగళాచరణము

శ్లో ॥ హిమగిరితనయాపత్యం హేమాచలచాపసముదితం తేజః,
కిమపిమహ త్తమమాద్యం స్మర్తవ్యం విఘ్న తిమిరహరణాయ
గిరిరాజసుతాసూనుః కరిరాజవరాననః,
పరిపంథిగణధ్వంసీ సురసేవ్యో విరాజతే.

హేమాచల చాప = మేరుపర్వతమును ధనుస్సుగా బట్టిన శివునికి , సముదితం = పుట్టబడినటువంటి; తేజః = తేజోరూపుడును; హేమాచల చాపం = శివుడు అని ఒక అర్థం; కిమపి మహత్వం = గొప్పమహిమ కలిగినటువంటిన్ని ; హిమగిరి తనయాపత్యం = పార్వతీదేవి కుమారుడైన విఘ్నేశ్వరుడు; విఘ్న తిమిర హరణాయ -- విఘ్నములనే చీకట్లను పోగొట్టుటకుగాను . అవశ్యం = తప్పక; స్మర్తవ్యం = స్మరించదగినవాడు అయియున్నాడు; గిరిరాజసుతాసూనుః = పార్వతీదేవి కుమారుడైన వాడునూ; కరిరాజవరాననః = గజాననరూపముగా అవతరించి పరమాత్మను. పరిపంథిగణ = శత్రుసమూహములను; ధ్వంసీ = నశింపచేయువాడు (విఘ్నములను పోగొట్టువాడు) . సురసేవ్య = దేవతలచేత సేవింపబడుచున్నటువంటి; విరాజతే ఒప్పుచున్నటువంటి వాడు అయియున్నాడు.

తాత్పర్యము తాను నిత్యసిద్ధుఁడగు నాదిపురుషుఁ డైనను లీలార్థము పార్వతీదేవియందుఁ బరమేశ్వరునివలన గజాననరూపముగ నవతరించిన పరమాత్మను విఘ్ననివారణార్థము సేవించుచున్నాఁడను.

సౌరాష్ట్రరాగము అటతాళము (మోహన - చాపు)

పల్లవి : జయజయ స్వామిన్ జయజయ

అనుపల్లవి : జయజయ జితవైరి వర్గప్రచండ
జయజయ గజముఖ జయవక్రతుండ

మూషకవాహన మునిజనవంద్య
దోషరహిత దళితాసురబృంద
శేషభూషణ శైవవారిధిచంద్ర
పోషితపరిజన పుణ్యైకకంద

| | | |
|---|---|---|
| 2. | అద్రిసుతాసుత | అనవద్యచరిత |
| | భద్రభక్తభవ | భయహర ముదిత |
| | రుద్రోదిత ఋజు | మస్తకసహిత |
| | సద్రూపసరసిజ | సముదితవినుత |
| 3. | లంబోదర ధీర | లావణ్యాసార |
| | కంబుసుధానిధి | కర్పూరగౌర |
| | సాంబ సదాశివ | సత్కృతిచతుర |
| | సామవేదగీత | సకలాధార |
| 4 | శక్రాదిసురగణ | సన్నుతచరణ |
| | శాతకుంభమణి | దివ్యాభరణ |
| | ధిక్కృతఘనవిఘ్న | తిమిరావరణ |
| | ధీరనారాయణ | తీర్థసుకరణ |

ప॥ జయజయ = సర్వోత్కర్షముగా వర్తింపుము. జితవైరివర్గ = జయింపబడిన శత్రు సమూహములు కలవాడు. ప్రచండ = తీక్షణమైనటువంటి కోపముగలవాడు. జయజయగజముఖ = ఏనుగుముఖము కలిగిన వాడా. జయవక్రతుండా = వంకర కలిగిన తొండముగలవాడా !

1. మూషక వాహన = ఎలుకను వాహనముగా గలవాడా; దోషరహిత = దోషములు లేనివాడ; మునిజన వంద్య = మునులచేత నమస్కరింపబడినవాడ. అసురబృంద = కొట్టబడినటువంటి రాక్షస సమూహములు; శైవవారధి చంద్ర = శివమత సముద్రమునకు చంద్రుడువంటివాడ. భోగిహార = సర్పములే హారముగా గలవాడ. పోషితపరిజన = ఆశ్రయించిన భక్తులను రక్షించువాడ! పుణ్యైక కంద = పుణ్యమునకు మూలమైనవాడ.

2. అనవద్య చరిత = దోషములేని నడవడికలవాడా (అవద్యం = దోషం), భద్ర భక్త భవభయ హర = మంగళకరమైన భక్తులయొక్క సంసారభయమును హరించువాడ; ముదిత = సంతోషముకలవాడ, (రుద్ర + ఉదిత) రుద్రోదిత = రుద్రునికి పుట్టినవాడ; ఋజుమస్తక సహిత = వక్రములేని శిరస్సుగలవాడ; సద్రూప = స్థిరమైన రూపముగలవాడ; సరసిజ = కమలమునందు. సముదిత - ఉత్పత్తికాబడిన బ్రహ్మదేవుని చేత; వినుత = స్తుతింపబడువాడ; అద్రిసుతాసుత = పార్వతియొక్క కుమారుడ

3. (లంబ+ఉదర) లంబోదర = వ్రేలాడుచుండు బొజ్జగలవాడా; ధీర = ధైర్యముగలవాడా. లావణ్యసార = శృంగారముయొక్క సారముగలవాడా; కంబుసుధానిధి కర్పూరగౌర - శంఖమువలెను చంద్రునివలెను కర్పూరమువలెను శుభ్రమైన వర్ణముగలవాడా; సాంబ సదాశివ సత్కృతి చతుర = ఈశ్వరుని అనుగ్రహముబడయుట యందు నేర్పుగలవాడ; సామవేద గీత = సామవేదముచేత గానము చేయబడువాడ; సకలాధార = సకల జగములకు అధారభూతుడ

4. శక్రాది సురగణసన్నుత చరణ = దేవేంద్రుడు మొదలగువారిచేత నుతింపబడు పాదములుకలవాడ; శాతకుంభ = బంగారము చేతను; మణి = మణులచేతను చేయబడిన హారములచే అలంకరింపబడినవాడ; ధిక్కృత + సురవిఘ్న = ధిక్కరింపబడిన దేవతల విఘ్నములు అను; తిమిరావరణ = చీకట్లను పోగొట్టువాడ; ధీర నారాయణ తీర్థ = ధీరుడగు నారాయణ తీర్థులను; సు + కరుణ = లెస్సగా కరుణించువాడ.

ప-అ. స్వామీ! ఆశ్రయించినవారివిఘ్నములను అవలీలగ నణఁచు నట్టి విఘ్నేశ్వరా! నీవే సకలలోకముల నగ్రపూజ్యుఁడవు గదా!

1. మూషకవాహనము నెక్కువాఁడ వనియును, అవిద్యాదిదోషములు లేనివాఁడవనియును, శత్రువుల సంహరించువాఁడవనియును, నాగాభరణముల ధరించువాఁడవనియును. శివభక్తులకు సంతోషము గలిగించువాఁడవనియును, నిన్నాశ్రయించినవారిని సంరక్షింతు వనియును, సకలధర్మములకు మూలభూతుఁడ వనియును నిన్ను మునీంద్రులు స్తోత్రము చేయుచున్నారు.

2. పార్వతీదేవికిఁ బుత్రుఁడవై పవిత్రమైన చారిత్రముగలవాఁడవై పుణ్యాత్ములైనభక్తులకు సంసారభయమును హరించువాఁడవై నిత్యసంతోషముగలవాఁడవై రుద్రునివలన నుదయించినవాఁడవై చక్కనిశిరస్సుగలవాఁడవై సద్రూపుఁడవైన శ్రీగణనాథా! నిన్ను బ్రహ్మాదులు తలంచి నుతించుచున్నారు.

3. చారుబొజ్జగలవాఁడ వనియును, లావణ్యకాంతి మీఱినవాఁడ వనియును, శంఖము, చంద్రుఁడు, పచ్చకర్పూరము వీనివలె శుభ్రవర్ణముగల వాఁడవనియును, పరమేశ్వరుని బూజించుటయందు ఆసక్తిగలవాఁడ వనియును, సకలప్రపంచమునకు నాధారభూతుఁడ వనియును సామవేదము నిన్నుఁగూర్చి పాడుచున్నది.

4. ఇంద్రాదిదేవగణములచే స్తుతింపఁబడినవాడవై సువర్ణరత్నాభరణముల ధరించినవాడవై విఘ్నములను చీకట్లకు సూర్యుడవై వెలుంగుచు శ్రీనారాయణతీర్థుల నెడు యతీశ్వరుని గరుణించుగణేశ్వరా! నీకు నమస్కారములు చేయుచున్నారము.

శ్లో॥ అమృతకలశహస్తం శ్రీపతే ర్యానకేతుం
సురరిపుతిమిరారిం సోమసూర్యాదిగీతం,
అమితబల మశేషప్రాణినాం ప్రాణభూతం
నిగమమయశుభాంగం భావయామ్యా ప్తకామమ్.

అమృత కలశహస్తం = అమృత కలశమును హస్తములో కలవాడ; శ్రీపతే ర్యానకేతుం = శ్రీమన్నారాయణునకు రథధ్వజముగా, నుండు వాడున్నూ; సురరిపు తిమిరారిం = దేవతల శత్రువులు అను చీకట్లను పోగొట్టుటకు సూర్యుడంటి వాడున్నూ; సోమ సూర్యాదిగీతం = చంద్రసూర్యులు మొదలగువారివల్ల గానము చేయబడువాడున్నూ; అమితబలం = విశేష బలముగలవాడు; అశేష ప్రాణినాం = సమస్త జంతువులకు; ప్రాణభూతం = ప్రాణములు రక్షించునటువంటివాడను; నిగమమయ శుభాంగం = వేదమయములైన మంగళకరములగు అవయవములుగలవాడు; ఆప్తకామం = తీరిన సమస్తకామములు కలవాడున్నూ (అయినటువంటి గరుత్మానులవారి); భావయామి = ధ్యానము చేయుచున్నాము.

తాత్పర్యము: స్వర్గలోకమున దేవగణముల నందఱిని గెల్చి యమృతకలశముఁదెచ్చిన వాఁడును, శ్రీమన్నారాయణునకు ధ్వజ మైనవాఁడును, శత్రువులనెడుచీకట్లకు సూర్యుఁడై రూపుమాపువాఁడును, చంద్రసూర్యాదులగు వారిచేఁ గొనియాడఁబడినవాఁడును, సర్వలోకమునకు మించినబలముగలవాఁడును, సర్వప్రాణులకును బ్రాణస్వరూపుఁడయినవాఁడును, వేదస్వరూప మైనవాఁడును దివ్యమంగళవిగ్రహముగలవాఁడును, సర్వార్థసిద్ధిగలవాఁడుననగు శ్రీగరుత్మంతుని నామసంబునఁ దలంచుచున్నాను

శ్లో॥ వైనతేయం విరాజంతం విష్ణువాహన ముత్తమం,
వైకుంఠాశ్రయ మామ్నాయకాయం గాయామి కామదమ్.

**వైనతేయం = వినతా పుత్రుడున్నూ; విరాజంతం = ప్రకాశించుచుండు వాడున్నూ; విష్ణువాహన ముత్తమం = విష్ణువునకు ఉత్తమమైన వాహనమైనటువంటి వాడున్నూ; వైకుంఠాశ్రయం = విష్ణువును ఆశ్రయించి యుండువాడున్నూ; ఆమ్నాయకాయం = వేదములే శరీరముగా గలవాడున్నూ; కామదమ్ = సమస్త కోరికలు యిచ్చేవాడున్నూ (అయినటువంటి) గరుత్మంతుని; గాయామి = గానము చేయుచున్నాము.**

తాత్పర్యము : వినతాదేవిసుపుత్రుఁడై శ్రీవిష్ణుదేవున కుత్తమవాహనమై, శ్రీవైకుంఠమునందు నివసించుచు వేదస్వరూపుఁడై యాశ్రయించినవారి యిష్టార్థముల నిచ్చునట్టి గరుత్మంతునిఁ గూర్చి పాడుచున్నాఁడను.

ముఖారిరాగము - అటతాళము

ప. శ్రీనారాయణవాహన - శ్రిత మునిజనమండలపాలన
అ. వినతావరతనయ వేదాంగశుభకాయ
వివిధవిశ్వాలయ వీర మాం పాలయ
1. సకలజగత్ప్రాణదాయక - సుర సన్నుతసర్వవినాయక
వికటాసురరిపువిదారక - విశ్వ విపులకల్యాణవిధాయక
అకళంకశితికంఠ ఆశ్రితవైకుంఠ
వికచకమలతుండ విగతమోహకాండ
శకలితపాషండ శత్రుహరప్రచండ
అధికబలోద్దండ అద్భుతదోర్దండ
2. అశుభతిమిరచండ భాస్కర-సామ విశదఘోషపక్ష భాసుర
మశకీకృతసకలాసుర - మంజు మణిరశనా శేషశుభకర
అసురభయంకర అమృతకలశహర
కుసుమనిచయభార క్రూరభుజగహార
అసదృశాచలాకార ఆశ్రితశుభకర
లసదరుణాధర లీలామయశరీర

3. నిరవధికామల పరాక్రమ - నిత్య నిర్మలఖలదురతివిక్రమ
మురరిపుచరణాబ్జసంభ్రమ - ముని నారాయణతీర్థమతిరమ
అరవిందలోచన అఘబంధమోచన
సురరిపుశాసన సోమరవినయన
పరిజనపాలన పామరవిదళన
గురుకృతసేవన గోకులభవన

ప॥ శ్రీ నారాయణవాహన = నారాయణమూర్తికి వాహనముగా నుండువాడా; శ్రితమునిజన మండలపావన = ఆశ్రిత మునిజన సమూహములను పావనము చేయువాడు;

అ॥ వినతా వరతనయ = వినతాదేవికి కుమారుడైనట్టిన్ని; వేదాంగశుభకాయ =వేదములే శరీరముగా గలవాడ; వివిధ విశ్వాలయ = అనేకములైనజగములకు స్థానమైనవాడా; వీర = వీరుడవైన ఓ గరుత్మంతుడా; మాం = నన్ను; పాలయ = రక్షించుమా

1. సకల జగత్ ప్రాణదాయక = సకల జగత్తుకు ప్రాణమిచ్చువాడా; సురసన్నుత = దేవతలచేత స్తుతించబడువాడా; సర్వ, వినాయక = సమస్తమైన పక్షులకు రాజా! ; వికటా సుర రిపువిదారక = వికటాసురుడు అను శత్రువును చీల్చినటువంటివాడా; విశ్వ = జగత్తుకు; విపుల కల్యాణ = శ్రేష్ఠమైన శుభమును; విధాయక = కలుగజేయువాడా; అకలంక శితి కంఠ = కళంకములేని తెల్లని కంఠముగలవాడ; ఆశ్రిత వైకుంఠ = విష్ణుదేవుని ఆశ్రయించినవాడ; వికచ కమల తుండ = వికశించుచున్న కమలమువంటి ముక్కుగలవాడ; విగత మోహకాండ = నశించిపోయిన మోహవృత్తుల సముదాయముగలవాడా; శకలిత పాషండ = తునాతునకలు చేయబడినటువంటి వేదవిరుద్ధ శాస్త్రమతావలంబులుకలవాడ లేక, మతావలంబులను గలవాడ; శత్రుహర ప్రచండ = శత్రుసంహారమందు మిగులుఉగ్రరూపుడా; అధికబల = గొప్పదైన బలముచేత; ఉద్దండ = అతిశయించినవాడ; అద్భుత దోర్దండ = ఆశ్చర్యకరమైన భుజపరాక్రమము కలవాడ;

2. అశుభ = అమంగళములైనటువంటి; తిమిర = చీకట్లకు; చండభాస్కరా = తీక్షమైన సూర్యుని వంటివాడ; విశదఘోషపక్షభాసుర = స్పష్టమైన ధ్వనిగల మంచి అెక్కలుగల్గి ప్రకాశించుచుండువాడ; మశకీకృత సకలాసుర = దోమలుగా చేయబడిన రాక్షసులుగలవాడ; మంజు మణి రశనా = మనోహరమైన మణిస్థగితమైన మొలతాడుగలవాడ; అమృతకలశ హర = అమృత కలశమును తెచ్చినవాడ; అశేష శుభకర = సమస్త శుభములను యిచ్చువాడు; అసుర భయంకర = రాక్షసులకు భయము కలిగించువాడు; కుసుమ నిచయభార = పుష్పములను భారముగా ధరించువాడు; క్రూరభుజగహార = క్రూరబుద్ధిగల పాములను హారముగా ధరియించినవాడ; అసదృశ + అచలాకార = సమానములేని పర్వతమువంటి శరీరముగలవాడ; ఆశ్రిత శుభకర = ఆశ్రయించినవారికి శుభముల నిచ్చువాడ; లసత్ = ప్రకాశించున్నట్టి; అరుణ అధర = ఎఱ్ఱనైన పెదవిగలవాడా; లీలామయ శరీర = ప్రపంచమునకు ఆనందకరమగునటువంటి శరీరము కలవాడ.

3. నిరవధిక + అమలపరాక్రమ = పరిమితములేనటువంటిన్ని, నిర్మలమైనటువంటిన్ని, పరాక్రమముగలవాడ; నిత్యనిర్మల = ఎల్లప్పటికి నిర్మలమైనవాడ; ఖల దురతివిక్రమ = దుర్మార్గులచేత అతిక్రమింపబడుటకు వీలుకానివాడ; మురరిపు చరణ అబ్జ సంభ్రమ = విష్ణువు యొక్క పాదకమలములయందు అనురాగము కలవాడ; ముని నారాయణ తీర్థ మతిరమ = మౌని అయినటువంటి నారాయణ తీర్థులవారి మనస్సు రంజింపచేయువాడ; అరవిందలోచన = తామర కమలములవంటి నేత్రములు కలవాడ; అఘబంధమోచన = పాపమనే పాశములనుంచి విడిపించువాడ; సురరిపుశాసన = దేవతల శత్రువులను (రాక్షసులను శిక్షించువాడ); సోమరవినయన = సూర్యచంద్రులను నేత్రములుగాగలవాడ; గురుకృత సేవన = పెద్దలచేత చేయబడుచుండు శుశ్రూషగలవాడ; పరిజనపాలన = సేవక జనులను రక్షించువాడ; పామర విదళన = అజ్ఞానులను ఖండించువాడ; గోకులభవన = గోకులము ఇల్లుగా కలవాడ.

ప. శ్రీమన్నారాయణునికి వాహనమైనట్టియు, నిన్నాశ్రయించిన మునిగణములఁ బరిపాలించునట్టియు ఓమహానుభావా!

అ. వినతాదేవికి పుత్రరత్నమవై వేదరూపమగు మంగళవిగ్రహముఁ గలవాఁడవై సర్వలోకాధారుఁడ వైనదయాకరా! నన్నుఁ గాపాడుమా.

1. సకలలోకములకును బ్రాణముల నిచ్చువాఁడవై, సకలదేవతలచే స్తుతింపబడినవాఁడవై, పక్షికులముల కెల్లను రాజవై, దుష్టశత్రువుల సంహరించువాఁడవై, సకలలోకములకు మిగుల శుభములు కలిగించువాఁడవై, శివునిసఖ్యముగలవాఁడవై, విష్ణుదేవు నాశ్రయించినవాఁడవై, సంతోషముచే వికసించినహృదయముకమలములగలవాఁడవై, అజ్ఞానమును ఖండించినవాడై, పాషండులను సంహరించువాడవై శత్రుసంహారమునందు మిగుల నుగ్రుండవై, లోకాతిశయమగు బలము గలవాఁడవై, అద్భుత మైన బాహుపరాక్రమము గలయోస్వామీ! వైనతేయా ! నన్నుఁ బరిపాలింపుమీ!

2. నాథా! వైనతేయా! నీవు అమంగళము లనెడు చీకట్లకు మధ్యాహ్నసూర్యుఁడవు. సామవేదఘోషముగల తెక్కలు గలవాఁడవు, రాక్షసుల నందఱిని దోమలుగ నలక్ష్యము చేసినవాఁడవు, రత్నములు చెక్కిన మొలనూలు గలవాఁడవు, శుభముల నన్నింటిని గలిగించువాఁడవు, అసురులకు భయమును గలిగిచువాఁడవు, అమృతకలశముఁ దెచ్చినవాఁడవు. పుష్పముల ధరించుకొనువాఁడవు, నాగాభరణుఁడవు, పర్వతమువలె నున్నతమగు నాకారముగల వాఁడవు, ఆశ్రయించినవారికి శుభము లిచ్చువాఁడవు, ఎఱ్ఱనియధరము గలవాఁడవు, లీలామయమైన మంగళవిగ్రహము గలవాఁడవు, నన్నుఁ గాపాడుమా!

3. పరిమితిలేని పరాక్రమముగలవాఁడవును, నిత్యనిర్మలుఁడవును, దుష్టులకు లోఁబడనివాఁడవును, విష్ణుమూర్తి పాదారవిందములను సేవించువాఁడవును, నారాయణతీర్థస్వామిమనమున రమించువాఁడవును, తామరలవంటి కన్నులుగలవాఁడవును, పాపములఁ దొలఁగించువాఁడవును, రాక్షసుల దండించువాఁడవును, చంద్రసూర్యులు నేత్రములుగాఁ గలవాఁడవును, పరిజనమును బాలించువాఁడవును, దురహంకారుల నణఁచువాఁడవును, తండ్రి మొదలగు గురుజనమును సేవించువాఁడవును, గోకులమునుండి సేవించువాఁడవును నగు ఓగరుడదేవా! నన్నుఁ గాపాడుమా!

శ్లో॥ ప్రహ్లాదనారదపరాశరపుండరీక
వ్యాసాంబరీషశుక శౌనకభీష్మ దాల్భ్యాన్,
రుక్మాంగదార్జునవసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి.

౬వ శ్లోకము ॥ ప్రహ్లాదనారద .......... స్మరామి అను శ్లోకము తెలిసినందులకు వ్రాయలేదు

అవ ప్రహ్లాదాది పరమభాగవతులఁ దలఁచుచున్నాడు.

తాత్పర్యము: ప్రహ్లాదుడు, నారదుఁడు, పరాశరుఁడు, పుండరీకుఁడు, వ్యాసుడు, అంబరీషుఁడు, శుకుఁడు, శౌనకుఁడు, భీష్ముఁడు, దాల్భ్యుడు, రుక్మాంగదుఁడు, అర్జునుడు, వసిష్ఠుడు, విభీషణుఁడు మొదలుగాఁగల పరమభాగవతులను సదా స్మరించుచున్న వాఁడను.

శ్లో॥ నీలాచలవరనిలయం నిఖిలజగన్నాథ మేకమాకలయే,
నీరధి వటతరునికటం నిజసేవకబృందహిత విధాతారమ్.

నీలాచలవరనిలయం = నీలాచల పర్వతమే శ్రేష్ఠమైన స్థానముగా గలిగినవాడున్నూ. నిఖిల జగన్నాథం = సకల జగత్తులకు నాధుడున్నూ; ఏకం = అసమానుడున్నూ; నీరధి వట తరు = సముద్రమునకున్నూ, మర్రిచెట్టుకున్నూ; నికటం = సమీపమున నుండువాడున్నూ; నిజసేవక బృందహిత విధాతారమ్ = తనయొక్క సేవకులయొక్క సమూహమునకు మేలును ఒనరించువాడున్నూ అగుశ్రీ జగన్నాధస్వామిని; ఆకలయే = ధ్యానింపుచున్నాను.

అవ. జగన్నాథస్వామిని సేవించుచుఁన్నాడు.

పూర్వసముద్ర తీరమునఁ బురుషోత్తమ క్షేత్రమున మహావటవృక్ష సమీపమున నీలగిరియందు నెలకొని సేవకులకు హిత మొనర్చు నకలలోకైక నాథుఁడగు శ్రీజగన్నాథస్వామిని సేవించుచున్నాను.

### 3. సౌరాష్ట్ర రాగము - త్రిపుటతాళము

ప. సుభద్రాబలభద్ర సుదర్శనసహిత
అ. ఇభరాజతారక ఈశ మా మవ దేవ
1. లవణజలధితీర లలితనీలాచల
2. నవమణిపరిశోభి నవ్యదివ్యభవన
2. వటవిటపినికట వరసింహాసన
నిటలాక్షవిధికృత నిత్యమంగళాచరణ
3. మార్కండేయజలధి మధ్యగణేశహిత
దుర్గతిహర అష్ట దుర్గాపరివేష్టిత

4. పతితజనపావన      పరమదివ్యమంగళ
అతికరుణాకర      అద్భుత మహాప్రసాద
5. జగన్మోహనమంటప      జయశబ్దబహుళ
జగదేకనాయక      జితసురారిమండల
6. వినతాతనయసేవ్య      వినతమంగళకర
విదళితభవబంధ      వేదవనసంచార
7. నారదాదిమునిగేయ      నామధేయ సుఖద
నారాయణానంద      తీర్థభావితానంద

ఇభరాజతారక = గజేంద్రుని తరింపజేసినవాడ; ఈశదేవ, మామ్ అవ = నియామకుడవైన హే స్వామి! నన్ను రక్షింపుము. సుభద్రబలభద్ర సుదర్శన సహిత = సుభద్రబలభద్రుని తోడకూడి సుదర్శన చక్రమును ధరించినస్వామి.

1. లలిత నీలాచల = మనోహరమైనటువంటి నీలాద్రి ఒకటి; నవమణి పరిశోభిత - క్రొత్తమణులచేత ప్రకాశించుచున్నట్టి; లవణ జలధితీర = ఉప్పునీటి సముద్రదరిన వేంచేశిన; నవ్యదివ్యభవన = క్రొత్త దైవశ్రేష్ఠమైన ఆలయముగలవాడ.

2. మార్కండేయ జలధి మధ్య గణేశహిత = మార్కండేయ సముద్ర మధ్యమునం దుండు వినాయకునికి హితముచేయువాడ; దుర్గతి హార = సంకటమును సంహరించువాడ; అష్టదుర్గా పరివేష్టిత = అష్టదుర్గలచేత చుట్టబడియుండువాడ.

3. వట విటపి నికట = మఱ్ఱివృక్ష సమీపమునందు; వరసింహాసన = శ్రేష్ఠమైన సింహాసనముకలవాడ; నిటలాక్ష విధికృత నిత్య మంగళాచరణ = శివుని చేతనున్నూ, బ్రహ్మదేవుడిచేత నున్నూ నిత్యముచేయుచుండు మంగళా శాసనములుగలవాడ.

4. పతిత జనపావన = మహాపాపజనులను పరిశుద్ధి (నిర్మలం) చేయువాడ; పరమ దివ్యమంగళ = శ్రేష్ఠమైన దివ్యమంగళ స్వరూపుడా; అతికరుణాకర = సర్వాతిశయమైన దయగలవాడ; అద్భుత మహాప్రసాద = ఆశ్చర్యకరమైన గొప్పప్రసాదమునిచ్చువాడ.

5. జగన్మోహన మంటప = జగుత్తును మోహింపజేసే మండపముకలవాడ; జయశబ్ద బహుళ = అనేకమైన జయశబ్దములతో నిండియుండువాడ; జగదేకనాయక = ఈ జగత్తుకెల్ల ఒక్కడే నాయకుడై యుండువాడ; జిత సురారి మండల = జయింపబడిన రాక్షస శత్రుసమూహములకలవాడ.

6. వినతా తనయ సేవ్య = గరుత్మంతునివల్ల సేవింపబడువాడ; వినత మంగళకర = నమస్కరించుచుండు వారికి శుభములు చేయువాడ; విదళిత భవబంధ = నాశనము చేయబడిన సంసార పాశములుగలవాడ; వేదవన సంచార = వేదములను వనములందు సంచరింపబడువాడ.

7. పారదాది మునిగేయ నామధేయ = నారదుడు మొదలగువారి వల్ల గానము చేయబడు చుండునట్టి నామధేయముగలవాడ; సుఖద = సుఖము నిచ్చువాడ; నారాయణా నందతీర్థ భావితానంద = నారాయణ అనందతీర్థులచేత ధ్యానము చేయుచున్న అనంద స్వరూపుడా.

ప-అ. సుభద్రాదేవితోడను బలభద్రునితోడను గూడినవాఁడవై, సుదర్శన చక్రమున ధరించి గజేంద్రుని రక్షించినస్వామీ ! జగన్నాథా! నన్ను రక్షింపుమా!

1. సాగరతీరమునందుండు నీలగిరిమీఁద రత్నములచే వెలుఁగొందు నిలయమున నెలకొనినవాఁడవు.

2. వటవృక్షసమీపమున దివ్యసింహాసనమున వేంచేసి బ్రహ్మరుద్రాదులచే నుతింపబడినవాఁడవు.

3. మార్కండేయుఁడు, సముద్రము వీరిమధ్యనున్న గణపతికి హితము సేయుచు నతనిదుర్గతిని మాన్పునట్టివాఁడవై అష్టదుర్గలతోఁ గూడినస్వామీ! నీకు వందనము.

4. అచారభ్రష్ఠులు కులభ్రష్టులగు వారిని నయితము పరమపావనులుగఁ జేయునట్టి మంగళస్వరూపా! దయానిధీ! అద్భుతముగ అనుగ్రహించు మహానుభావా! శరణు.

5. జగన్మోహనమండపమునందు వేంచేసిన జగదేకనాయకా! జయము నొందు మనియు, నసురుల జయింపుమా యనియు, స్తుతింఁపబడు మహనీయమూర్తీ! స్వామీ! రక్షింపుమా!

6. గరుడునిచే సేవింవబడినవాఁడవు, నమస్కరించినవారికి మంగళము లిచ్చువాఁడవు, సంసారబంధములను ద్రుంచువాఁడవు, సకలవేదములచే నుతింపఁబడినవాఁడవు.

7. నారదాదిమునీంద్రులచే నుతింపఁబడిన పరమపావనమైన నామధేయము గలవాఁడవు, సుఖముల నిచ్చువాఁడవు, నారాయణతీర్థులనుయతి వరునకు నానంద మిచ్చువాఁడవు, జగన్నాథా ! నన్ను రక్షింపుమా!

శ్లో॥ సర్వజ్ఞాన క్రియాశక్తిం సర్వయోగేశ్వరం ప్రభుం,
సర్వవేద్యవిదం విష్ణుం ప్రభవిష్ణుముపాస్మహే.

సర్వజ్ఞాన క్రియాశక్తిం = సర్వజ్ఞాన శక్తియున్నూ, సర్వక్రియా శక్తిం (సర్వమును తెలుసుకునే శక్తిగలవాడున్నూ) సర్వమును అచరించేశక్తిగలవాడున్నూ; సర్వయోగీశ్వర ప్రభుం = సర్వయోగి శ్రేష్ఠులకు ప్రభువైన వాడున్నూ; సర్వవేదమయం విష్ణుం = సర్వవేదములచేత తెలియబడుచుండు వాడున్నూ, సర్వవ్యాపియైన; ప్రభ విష్ణుం = సృష్టికి కారణభూతుడున్నూ అయిన విష్ణుదేవుని; ఉపాస్మహే = ధ్యానించుచున్నాను.

తాత్పర్యము : సమస్తజ్ఞానశక్తియు, సమస్తకార్యములఁ జేయుశక్తియుగలవాఁడును, సర్వయోగులకు అధిపతియు, సర్వము నెఱిఁగినవాఁడును, సర్వకారణమును నగు శ్రీవిష్ణుమూర్తిని సేవించుచున్నారము.

## నాటరాగము - జంపెతాళము

| | | | |
|---|---|---|---|
| ప. | జయజయ రమానాథ | జయజయ ధరానాధ | |
| అ. | జయజయ వరాహపుర | శ్రీ వేంకటేశ - | జయజయ |
| 1. | నిగమగోచర నిత్య | నిర్మలానందఘన | |
| | విగళితమహామోహ | విమలవిజ్ఞానహరే | |
| | ఖగయానసంచార | ఖండితాసురనికర | |
| | సకలగుణసంపన్న | సత్యపరిపూర్ణ | జయజయ |
| 2. | మధుసూద నానంత | మాయయా కృతభువన | |
| | విధుదివాకరనయన | వేదాంతభవన హరే | |
| | విధిముఖసురేంద్రనుత | విపులకల్యాణయుత | |
| | విమలయోగిధ్యేయ | వివిధమునిగేయ | జయజయ |
| 3. | మురనరకసంహార | మూఢమతిజనదూర | |
| | పరిజనశివంకర | పరావరశరీర హరే | |
| | నిరవధికకారుణ్య | నిఖిలలోక శరణ్య | |
| | సరసనారాయణతీర్థ | సద్గురువరేణ్య | జయజయ |

ప॥ జయ జయ = సర్వోత్కృష్టుడవై వర్తించుమా; జయజయ రమానాధ, జయజయధరానాధ = శ్రీభూదేవీ సహితముగా వరాహక్షేత్రమగు వెంకటాచలమునందు వేంచేసియున్న శ్రీనివాసా నీకు జయముకలుగుగాక.

1. నిగమగోచర = వేదములయొక్క తాత్పర్య భూతుడైనవాడ; నిత్యనిర్మల = ఎల్లప్పుడును ప్రకృతి సంబంధమైన మైల అంటనివాడవు; ఆనందఘన = గొప్పదైన ఆనందముగలవాడ; విగళిత మహామోహ = కొట్టివేయబడిన గొప్ప మోహమనే చీకటిని పారద్రోలినవాడ; విమలవిజ్ఞాన = నిర్మలమైన జ్ఞానముకలవాడ; ఖగయాన సంచార = గరుత్మంతుని వాహనముగా గల్గి విహరించువాడ; ఖండిత అసురనికర = సంహరింపబడిన రాక్షస సమూహముగలవాడ; సకల గుణసంపన్న = అనంత కళ్యాణగుణములు కలవాడ; సత్య పరిపూర్ణ = సత్యస్వరూపుడు (నిర్వికార స్వరూపుడైనవాడు); పరిపూర్ణ = అన్నింటియందు పూర్ణముగా నిండియుండువాడు.

2. మధుసూదన = మధువనే రాక్షసుని సంహరించినవాడు; అనంత = అంతములేనివాడ; మాయయా కృతభువన = దివ్యసంకల్పముచేత నిర్మించబడిన లోకములుగలవాడ; విధు దివాకర నయన = సూర్యచంద్రులు నేత్రములుగాగలవాడ; వేదాంత భవన = వేదాగ్రములే నిలయముగాగలవాడ;

విధిముఖ = బ్రహ్మమొదలైన; సురేంద్రనుత = దేవతా శ్రేష్ఠులచేత స్తుతించబడువాడ; విపుల కళ్యాణయుత = నిర్మలమైనటువంటి శుభములతో కూడుకున్నటువంటివాడ; విమల యోగిధ్యేయ = నిర్మలమైన యోగులచేత ధ్యానింపబడువాడ; వివిధ మునిగేయ = అనేకవిధములైన మునులచేత గానము చేయబడువాడ; ముర నరక సంహార = మురాసురుని, నరకాసురుని సంహరించినవాడ; మూఢమతిజనదూర = మూఢజనులకు దూరముగా నుండువాడ; పరిజన శివంకర = భక్తులకు మంగళములు నొసగువాడ; పరాపరశరీర = పరప్రకృతిని అపర ప్రకృతిని శరీరముగలవాడ (అపర ప్రకృతియనగా పంచభూతమయమైనది (భూమిరాపోనల వాయు శరీరము); పరప్రకృతి = జీవభూతుడు; నిరవధిక కారుణ్య = సర్వాతిశయమైన కరుణగలవాడ; నిఖిలలోక శరణ్య = సర్వలోక రక్షకుడా; సరస = (రసయుక్త) ఆనందస్వరూపుడైనవాడ; నారాయణతీర్థ = నారాయణ తీర్థులవారి యొక్క; సద్గురు వరేణ్య = సద్గురు శ్రేష్ఠుడా (అజ్ఞానమును పోగొట్టువారలలో శ్రేష్ఠుడా); జయజయ = సర్వోత్కృష్టుడవై వర్తించుమా.

ప-అ. శ్రీవరాహక్షేత్రమగు వేంకటాచలమునందు శ్రీభూదేవీసమేతుఁడవై వేంచేసియున్న శ్రీనివాసా! నీవే సర్వోత్తమ మగుదైవతము; నీవే రక్షకుఁడవు; నీకే వందనములు.

1. సర్వకల్యాణపరిపూర్ణుఁడవు. నిత్యానందమయుఁడవు, వేద స్వరూపుఁడగు గరుడు నధిరోహించి తమోమయు లగునసురుల సంహరించు లోకరక్షకుఁడవు.

2. నీమాయ మఱి యెవ్వరికిని నెఱుఁగరానిది, అంతములేనిది, దానిచే సకలజగములను నిర్మించుచున్నవాఁడవు, సర్వప్రపంచస్వరూపుఁడవు. సూర్యచంద్రులు నీకు కన్నులు, భూమి నీకు పాదములు, ఆకాశము నీకు నాభి, వాయువు సకలప్రాణులు నీయుదరమునందున్నవి. ఇట్లు బ్రహ్మాదిదేవతలును నారదాదిమునులను సనకాదియోగులను నుతించుచున్నారు.

3. భూభారమును హరించుటకై యదువంశమున నవతరించి మురాసురుఁడు నరకాసురుఁడు ఆదిగాఁగల దుష్టాత్ములను సంహరించి యాశ్రయించిన వారికి సకలశుభము లిచ్చుచు లోకములఁ గాపాడు పరమదయావేరుఁడవు. సర్వలోకరక్షకుఁడవు నారాయణతీర్థమునికిఁ దత్వార్థము నెఱింగించిన మహానుభావుఁడవు. లీలామానుషవిగ్రహుఁడవు.

శ్లో॥ కృష్ణ కృష్ణ కృపాసింధో భక్తసింధుసుధాకర,
మాముద్ధర జగన్నాథ మాయామోహమహార్ణవాత్

కృష్ణ కృష్ణ కృపాసింధో = దయాసముద్రా; భక్తసింధు సుధాకర = భక్తులు అను సముద్రమునకు చంద్రునివంటివాడా; హే జగన్నాథా! = జగన్నాథస్వామీ!; మాయామోహ మహార్ణవాత్ = మాయచే తగిలిన మోహమనే గొప్ప సముద్రము నుండి (సంసార సముద్రము నుండి); మా ముద్ధర = నన్ను లేవదీయుమా.

తాత్పర్యము : శ్రీకృష్ణా! దయాసాగరా! నీవు భక్తులనెడు సముద్రమునకు చంద్రుని వంటివాడవు - అనగా నానందాతిశయమును గలిగించు మంగళమూర్తివి. మాయామయమైన సంసార సముద్రమునుండి నన్నుద్ధరింపుమీ స్వామీ!

సౌరాష్ట్ర రాగము - త్రిపుటతాళము

1. మత్స్యకూర్మవరాహనరమృగ - వామనామరభార్గవ
కుత్సితారివి రామదశరథ - రామబలరామాభవ - కృష్ణ కృష్ణ

2. కృష్ణ కృష్ణ కృపాసముద్ర వి-తృష్ణ బుద్ధ గుణాకర
కృష్ణ కల్కిశరీర ఖలజన - కృంత నామర సుఖకర - కృష్ణ కృష్ణ

3. నిత్యశుద్ధసుఖానుభూతి - నిరంజ నాఖిలరంజన
ప్రత్య గేకరసై కవిగ్రహ - పరమపావన పావన-కృష్ణ కృష్ణ

4. గోపగోపీగోపనావన - గూఢపరతత్త్వాచ్యుత
తాపహరనారాయణతీర్థసం - తారకవిజయగోపాలక - కృష్ణ కృష్ణ

5వ కీర్తన సౌరాష్ట్ర రాగం - త్రిపుటతాళం

1. మత్స్య కూర్మవరాహ నరమృగ వామన అమర భార్గవ = ఈ మొదలగు అవతారముల నెత్తిన ఓస్వామి; కుత్సితారి = కపట రాక్షసులు అనే శత్రువులను; విరామ = నాశము చేయువాడ; దశరధరామ బలరామాభవ = అభవ = జన్మలేనివాడ.

2. వితృష్ణ బుద్ధ = వైరాగ్యముచేత, వివేకముచేత కలిగిన; గుణాకర = కళ్యాణగుణముల కన్నిటికి స్థానభూతుడ; కృష్ణ కల్కిశరీర = కలిక్యావతారమును దాల్చబోవువాడ; ఖలజన కృంతన = దుర్మార్గులను సంహరింపు చేయువాడ; అమర సుఖకర = దేవతలకు సుఖములు కలుగజేయువాడ.

3. నిత్య శుద్ధ సుఖానుభూతి = నిత్యమైనటువంటి పరిశుద్ధమైనటువంటి దుఃఖము యొక్క కల్పులేనటువంటి సుఖము యొక్క అనుభవము కల్గిన; నిరంజన = అజ్ఞానము లేనివాడ; అఖిలరంజన = అందరిని రంజింపచేయువాడ; ప్రత్యగేకరసైక విగ్రహ = వేరుగానుండి, అద్వితీయమైనట్టి ఆనందమే ప్రధానముగా గలిగినట్టి, మూర్తిగలవాడ; పరమపావన పావన = శ్రేష్ఠమైన పావన వస్తువులను పావనము చేయువాడ.

4. గోప గోపీ గోపనావన = గోపాలకులను, గోపికలను, గోవులను కాపాడువాడ; గూఢపర తత్త్వాచ్యుత = గూఢమైన పరతత్త్వ స్వరూపుడా; నాశములేనివాడ; తాపహర నారాయణతీర్థ = సంసార తాపమును హరించువాడ; సంతారక విజయగోపాలక = నారాయణ తీర్థులను తరింపజేయునట్టి విజయగోపాలా!

స్వామీ! శ్రీకృష్ణా! నీవు సత్యజ్ఞానానందస్వరూపుఁడవు, కర్మబంధముల నంటనివాఁడవు, మాయాతీతుఁడవు, పరమపావనమూర్తివి, లోకము నుద్ధరించుటకై మత్స్య కూర్మాద్యవతారమును దాల్చినవాడవు. అందు వేదాపహారియైన సోమకాసురవధార్థము మత్స్యావతారమును, దేవాసురులుకూడి మంధరపర్వముతో క్షీరసముద్రమును మథించుచుండ నాపర్వతము మునుంగఁగా దానినెత్తుటకుఁ గూర్మావతారమును, హిరణ్యాక్షుఁడు భూమిని రసాతలమునకుఁ గొనిపోవ దాని నుద్ధరించుటకు వరాహావతారమును, బరమభక్తుఁడగు ప్రహ్లాదుని బాధించు హిరణ్యకశిపుఁ జంపుటకు శ్రీనరసింహావతారమును, దేవభోగ్యమగు త్రైలోక్యము నవహరించి బలిని నియమించుటకు వామనావతారమును, దుష్టరాజుల వధించుటకుఁ బరశురామావతారమును, రావణవధార్థము

శ్రీరామావతారమును, ఇపుడు భూభారనివృత్తికి బలరామ కృష్ణావతారమును దాల్చితివి. మఱియు బుద్ధ కల్కిరూపములఁ దాల్చితివి. నీయవతారము లెల్లియుఁ గర్మనిమత్తములు కావు. స్వేచ్ఛాయత్తములు. నీవు గోపగోపీ జనములతోను గోవులతోను సమానముగా విహరించుచున్నవాఁడవైనను దేవమనుష్యాది సకల చేతనాచేతన వస్తువులకు అంతరాత్మవు, ఆధారమవు, సర్వ ప్రపంచమును లోపలను వెలుపలను వ్యాపించియుండు పరతత్త్వమవు. నిత్యుండవు. నారాయణతీర్థయతీశ్వరుని తాపత్రయమును బోఁగొట్టి సంరక్షించిన మహానుభావుఁడవు. ఇట్టి సర్వకల్యాణగుణాకరుఁడవగు శ్రీకృష్ణా! నీకు జయముగలుగును గావుత. నీవే సర్వోత్కృష్టుఁడవు.

## - అధికారి నిరూపణము -

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తిప్రవణయా ధియా,
వ్యజ్యతే భక్తిసారాఢ్యా, కృష్ణలాలీతరఙ్గణీ.

వాసుదేవే భగవతి = భగవంతుడైన వాసుదేవుని యందు; భక్తి ప్రవణయాధియా = భక్తిచేత సమ్రతనందిన, బుద్ధిచేత; వ్యజ్యతే భక్తిసారాఢ్యా కృష్ణలీలా తరంగిణి; భక్తియను నీళ్ళచేత యొప్పుచున్నట్టి కృష్ణలీలలు అను నదీప్రవాహము ఒప్పుచున్నట్లు విశదముగా చెప్పబడుచున్నది.

అవ. ఇట్లు గ్రంథకర్త తాను రచించు గ్రంథము నిర్విఘ్నముగా నెరవేరుటకై స్వేష్ట దేవతా నమస్కారరూపమగు మంగళము నాచరించి యీ గ్రంథమునకు నధికారిని నిరూపించుచున్నాఁడు. వాసుదేవే భగవతి అను శ్లోకమున.

ఈ కృష్ణలీలాతరంగిణి భక్తిసారమును దెల్పుచున్నది గావున దీనియర్థము శ్రీకృష్ణునియందు భక్తివిశేషముగలవారికిఁ దెలియునుగాని సామాన్యజనులకు బోధపడనేరదు.

## ప్రబంధ ప్రతిపాద్యకథానంగ్రహము

ఆదౌ కృష్ణావతార స్తదను నరహరే ర్బాలలీలావిలాసో
వత్సానాం పాలనంతచ్చరిత మథ గవాంపాలనం ప్రౌఢభావః,
గోపీవస్త్రాపహార స్తదను గిరివరోద్ధారణం రాసలీలా
కంసాదీనాం నిరాసస్తదనుజలనిధౌ ద్వారకాయాంప్రవేశః
రౌహిణేయస్య కృష్ణస్య వివాహ స్తదనంతరం,
రుక్మిణ్యాద్యష్టమహిషీసహితో గీయతే మద్రైః
ఇత్యేవం సంగ్ర హే ణోక్తా కృష్ణలీలాతరంగిణీ,
ఆద్య కృష్ణావతారో యం సంగ్ర హేణాభినీయతే.
ఉగ్రసేన స్తతః కంసో దేవకీవసుదేవయోః,
తయోః కారాగృహే వాసః కంసేన విహితః కిల.

బ్రహ్మ సురేంద్రో ధరణీ సనకాద్యాస్తతో హరిః,
భగవత్ప్రార్ధనా తేషాం తత్తత్ స్థాననివేశనమ్.
నారదస్యోపదే(శని )షట్సుతానం వినాశనం ·
దేవక్యా స్సప్తమో గర్భః సంకర్షణ ఇతీరితః.
గోకులే కృష్ణగమనం దుర్గాయా మధురాగమః
కథాయా సంగ్రహస్త్వేవం చరిత్రే స్మి న్నిగద్యతే.

## ప్రబంధ ప్రతిపాద్య కథా సంగ్రహము

ఆదౌ కృష్ణావతారః = ప్రథమమున కృష్ణుడు అవతరించుటయున్ను; తదను - అప్పుడు (అనంతరం); నరహరేః = శ్రీకృష్ణస్వామి వారియొక్క; బాలలీలా విలాసో = బాలక్రీడా విలాసమున్ను; వత్సానాం పాలనం = ఆవులదూడలను కాయుటయున్ను; తచ్చరితం = స్వామివారిచేత జరిగింపబడినటువంటి వత్సపాలనమున్ను; అథ = అటుతర్వాత; గవాం పాలనం ప్రౌఢభావః = పెద్దవాడగుటయున్ను, గోవులను పాలించుటయున్ను; గోపీ వస్త్రాపహారః = గోపికల గుడ్డలు దొంగిలించుటయున్ను; తదను = అనంతరం; గిరివరోద్ధారణం = గోవర్ధన పర్వతమునెత్తుటయున్ను; రాసలీలా = రాసక్రీడ జరుపుటయున్ను; కంసాదీనాం = కంసుడు మొదలగువారిని; నిరాసః = నిరసించుటయున్ను; తదనుజలనిధౌ = అప్పుడు సముద్రమునందు; ద్వారకాయాం ప్రవేశః = ద్వారకా నగరము నిర్మింపజేసి, అందుచేరుటయున్ను.

శ్లో 11. రౌహిణేయస్య = బలరామునియొక్క; కృష్ణస్య = కృష్ణునియొక్క; వివాహం = వివాహమున్ను; తదనంతరం = అటుపిమ్మట; రుక్మిణ్యాద్యష్టమహిషీ = రుక్మిణి మొదలగు అష్టభార్యలతో; సహితః = కూడుకొని; గీయతే అమరైః = దేవతలచేత గానము చేయబడినట్టియున్ను.

శ్లో 12. ఇత్యేవం (ఇతి + ఏవం) = అని ఈ ప్రకారముగా; సంగ్రహేణ + ఉక్తా = ముక్తసరిగా చెప్పబడినది; కృష్ణలీలా తరంగిణీ = కృష్ణలీలాతరంగిణి ప్రవాహముపై విధముగా చెప్పబడినది; అద్యః = మొదటి తరంగములో; కృష్ణావతారః + అయం = కృష్ణావతారము అను ఈ కథను; సంగ్రహేణ + అభినీయతే = ముక్తసరిగా పాగింపబడుచున్నది.

శ్లో 13. ఉగ్రసేన సుతః కంసః = ఉగ్రసేనకుమారుడు కంసుడు; దేవకీవసుదేవయోః = దేవకీ వసుదేవులకు; తయోః = వారిద్దరికి; కారాగృహవాసం = బంధికానాలోనుంచుట; కంసేన విహితః కిల = కంసునిచేత ఏర్పాటు చేయబడినదిగదా!

శ్లో 14. బ్రహ్మ సురేంద్రః = బ్రహ్మయున్ను, ఇంద్రుడున్ను; ధరణీ = భూమిన్ని; సనకాద్యస్తతో హరిః = సనకసనందవాదులచేత స్తోత్రము చేయబడునటువంటి శ్రీమన్నారాయణుడు అను; భగవత్ + ప్రార్థనా = స్వామివారిని ప్రార్థించుటయున్ను; తేషాం = వారందరున్ను; తత్తత్ స్థాన నివేశనం = వారి వారి స్థానములకు తిరిగి చేరుటయున్ను.

శ్లో 15. నారదస్య ఉపదేశేన = నారదుని యొక్క ఉపదేశమువల్ల; షట్సుతానాం = ఆర్గురు కొడుకులను; విదారణం = చంపడమున్నూ; దేవక్యా సప్తమో గర్భః = దేవకీదేవి యొక్క ఏడవగర్భమందు; సంకర్షణ ఇతీరితః = బలరాముడు అని చెప్పబడు పిండమును యోగమాయ - రోహిణియందు చేర్చుటయున్నూ.

శ్లో 16. గోకులే కృష్ణగమనం = గోకులమందు శ్రీకృష్ణపరమాత్మ ప్రవేశించుటయున్నూ; దుర్గాయా మధురాగమః = మధురకు దుర్గాదేవియొక్క రాకయున్నూ; కథాయాః + సంగ్రహస్తు + ఏవం = కథయొక్క సంగ్రహము యీవిధముగా; అస్మి ౯ చరిత్రే = ఈ ప్రబంధమందు; నిగద్యతే = చెప్పబడుచున్నది.

అవ. ఈ గ్రంథమునందు: బ్రతిపాదించు విషయములను గ్రమముగాఁ దెల్పుచున్నారు.

మొదట శ్రీకృష్ణావతారము, తరువాత బాలక్రీడ, వత్సపాలనము (దూడలమేపుట), కౌమారలీల, గోపాలనము (అవులమేపుట) గోపికావస్త్రాపహారము, గోవర్ధనోద్ధరణము, రాసక్రీడ, కంసాదివధ, సముద్రమున ద్వారకానగరము నిర్మింపఁజేసి యందుఁజేరుట, రామకృష్ణుల వివాహము, రుక్మిణి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజిత్తి, భద్ర, లక్ష్మణ, జాంబవతి, అను అష్ట మహిషులతో (పట్టపుదేవేరుల) సమేతుఁడై క్రీడించుట శ్రీకృష్ణావతారమునందు ఉగ్రసేనుఁడు దేవకీవసుదేవులకు వివాహము చేసి యరణ మిచ్చిపంపుటయు, కంసుడు రథము నడపుచుఁ బోవుటయు, అపుడాకాశవాణిని విని దేవకీవసుదేవుల కారాగృహమునందుంచుటయు, బ్రహ్మాది దేవతలును భూదేవియు శ్రీవైకుంఠమునకుఁ బోయి భూభారనివారణార్థము భగవంతునిఁ బ్రార్థించుటయు, భగవదనుగ్రహమును, భగవత్సాహాయ్యార్థము దేవగణములుయదువంశముననతరించుటయు, నారదోపదేశమున దేవకీపుత్త్రుల వార్గురిని గంసుఁడు వధించుటయు, దేవకి సప్తమగర్భముఁ బ్రవేశించిన బలరాముని యోగమాయ రోహిణిగర్భమునుంచి తాను యశోదగర్భముజొచ్చుటయు, భగవదవతారమును, గోకులమునఁ బ్రవేశించుటయు, యశోధగర్భమున నవతరించినయోగమాయ కారాగృహమున జేరి కంసుని బరిభవించి దేవతలచేఁ బూజవడయుటయు, ఇట్లు భగవదవతారచరిత్ర సంగ్రహముగాఁ దొలుతఁ జెప్పఁబడుచున్నది.



# కథా ప్రారంభము

*అథ తత్రాదా వుగ్రసేనాగమనమ్*

దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

అగ్రేసరో మహాత్మనాం — అగ్రగణ్యో పిధీమతాం
ఉగ్రశాసనకాగ్రణీ — రుగ్రసేనో విరాజతే.

6వ కీర్తన సౌరాష్ట్ర రాగం - ఆదితాళము

అథ తత్ర = అనంతరం ఈ కథలో; అదౌ ఉగ్రసేన ఆగమనం = మొదట ఉగ్రసేనుడు ప్రవేశించడము; అగ్రేసరో మహాత్మానాం = మహాత్ములలో శ్రేష్ఠుడైనట్టి; అగ్రగణ్యః అపిధీమతాం = బుద్ధిమంతులలోకి శ్రేష్ఠుడు అయినను; ఉగ్రశాసనకాగ్రణీః = భయంకరమైన ఆజ్ఞయిచ్చుటలో శ్రేష్ఠమైనవాడు, ఉగ్రసేనో విరాజతే = ఉగ్రసేనుడనురాజు ప్రకాశించుచున్నాడు; అథ కంస ఆగమనం = అనంతరము కంసుడు ప్రవేశించడము.

తాత్పర్యము : మహాత్ములతో శ్రేష్ఠుఁడును బుద్ధిమంతులలో నుత్తముఁడును దుష్టుల దండించువాఁడును నగు నుగ్రసేనుఁడు భోజవంశమున రాజుగా నుండెను.

*అథ కంసాగమనమ్*

దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

శఠో హఠా దధర్మకృన్ — మహామూఢో మహాబలీ
కఠోరహృదయో నిత్యం — కంసాసుర స్సమాయాతి.

శఠో = గూఢమైన అపకారము చేయువాడు; హఠాత్ అధర్మకృత్ = హఠమువలన, అక్రమపనులు చేయువాడు; మహామూఢో, మహాబలీ = గొప్పమూఢుడున్నూ, గొప్పబలముకలవాడున్నూ; కఠోరహృదయో నిత్యం = కనికరములేని మనస్సుకలవాడున్నూ, ఎల్లప్పుడున్నూ; కంస అసురఃసమాయాతి = కంసుడు అసురాక్షసుడు వచ్చుచున్నాడు; అథ దేవక్యా ఆగమనం = అనంతరం దేవకీ దేవి వచ్చుటయున్నూ.

తాత్పర్యము : అతనిపుత్రుండగు కంసుఁ డాలోచన యించుకైనను లేక అధర్మము నాచరించువాఁడును, జ్ఞాన మనునది కొంచెమైనను లేనివాఁడును, మిగుల బలముగలవాఁడును, మనంబున దయలేనివాఁడును నై యుండెను.

*అథ దేవక్యాగమనమ్*

దరువు - నాదనామ క్రియారాగము - ఆదితాళము

ఆయాతి దేవకీ దివ్యసుందరీ - విష్ణు
మా యేవ సాక్షా దియ మమరీనారీ
నరాధిపవర గేహినీ శ్రీ
నారాయణీయదివ్యమూర్తిజననీ
ఇందువద నారవిందలోచనా శుభ
కుందరదనా కుటిలకుంతలఘనా.

ఽయాతి దేవకీ = దేవకీదేవి వచ్చుచున్నది; దివ్యసుందరీ = మిక్కిలి సౌందర్యముగలది; విష్ణుమాయా ఇవ = విష్ణుమాయవలెనే వుండెను; సాక్షాత్ ఇయం అమరనారీ = ఈమె ప్రత్యక్షమైన దేవతా స్త్రీవలె నుండెను; నరాధిపవర గేహినీ = వసుదేవునికి శ్రేష్ఠురాలై భార్య అయినటువంటి; శ్రీ నారాయణీయ దివ్యమూర్తి జననీ = శ్రీమన్నారాయణమూర్తికి తల్లి అయినటువంటిన్నీ; ఇందువదన = చంద్రునివంటి ముఖముగలది; అరవిందలోచనా = తామర కమలముల వంటి కన్నులుగలది. శుభ = మంగళకరమైనటువంటిది; కుందరదనా = మల్లెమొగ్గలవంటి పండ్లుగలది; కుటిల కుంతల ఘనా = దట్టమైన వంకరలుగల ముంగురులుగల దేవకీ దేవి ప్రవేశించెను; అథ ఉగ్రసేన అనుజ్ఞయా = అనంతరం ఉగ్రసేనుని ఆజ్ఞప్రకారము; వసుదేవ ఆగమనం = వసుదేవుడు ప్రవేశించుచున్నాడు.

తాత్పర్యము: అయుగ్ర సేనునితమ్ముఁ డగుదేవకుఁ డనువానికూఁతురు దేవకి యను చిన్నది, సాక్షాత్ విష్ణుమాయయో యనునట్లు దేవతాస్త్రీయో యనునట్లు రాజగృహమున నవతరించి లక్ష్మియో యనునట్లు విలసిల్లి శ్రీమన్నారాయణ దివ్యలీలావతారమునకుఁ దల్లియై పూర్ణచంద్రునిఁ బోలుమోమును తామరలంబోలు కన్నులును మొల్లమొగ్గలఁ బోలు పలువరుసయు మేఘముంబోలినకురులుం గల్గి సకలసద్గుణవతియై యుండెను.

*అథ ఉగ్రసేనానుజ్ఞయా వసుదేవాగమనమ్*

దరువు - శ్రీరాగము - ఆదితాళము

అసురారణ్యకుఠారో వసుమత్యాం మహానసౌ
వసుధాధిపతిలకో వసుదేవో విరాజతే

అసుర అరణ్యకుఠారో = రాక్షసులు అను అరణ్యమునకు గొడ్డలివంటి వాడున్ను; వసుమత్యాం = భూమియందు; అసౌ మహాన్ = ఈయన గొప్పవాడు; వసుధ అధిపతిలకః = భూపతులకు బొట్టువంటివాడు; వసుదేవః విరాజతే = వసుదేవుడు ప్రకాశించుచున్నాడు.

తాత్పర్యము : యదువంశమునందు శూరుఁ డనురాజునకు వసుదేవుఁ డుదయించె. ఆ మహానుభావుడు రాజశ్రేష్ఠుఁడై దుష్టరాక్షసుల సంహరించి లోకమునఁ ప్రఖ్యాతిఁ గాంచె.

అశరీరవాణీ శ్రవణము

గ. అథ దేవకీవసుదేవ యోః వివాహోత్సవానంతరం వసుదేవ
గృహప్రవేశసమయే తయో స్సారథ్యం కుర్వతి కంసే దేవ
క్యాస్త్వష్టమో గర్భః కంసమృత్యురిత్య శరీర వాక్యం
శ్రుత్వా కంసో వసుదేవం ప్రత్యాహ.

అథ = అనంతరం; దేవకీ వసుదేవయోః వివాహోత్సవానంతరం వసుదేవ గృహప్రవేశ సమయే = దేవకీ వసుదేవులయొక్క వివాహానంతరం గృహప్రవేశ సమయే; తయోః = వారిద్దరికీ సారథ్యం, కుర్వతి కంసే = కంసుడు సారధ్యము చేయుచుండగా; దేవక్యాసు అష్టమోగర్భః = దేవకీదేవి యొక్క ఎనిమిదవ బిడ్డ; కంసః మృత్యుః ఇతి = కంసునికి మృత్యుదేవతయని, అశరీర వాక్యం = ఇట్లని, ఆకాశవాణి చెప్పిన పలుకును; శృత్వాకంసః = కంసుడు విని, వసుదేవ ప్రతి ఆహ = వసుదేవుని గూర్చి చెప్పెను

తాత్పర్యము: ఇట్లుండఁగా దేవకుడు తనకుమార్తె దేవకిని వసుదేవున కిచ్చి వివాహము చేసె. అంత నావధూవరులు తమ ఇంటికిఁ బోవునపుడు కంసుఁడు రధము గడపుచున్నవాఁడై "కంసుఁడా! దేవకియొక్క అష్టమగర్భమున నుదయించుశిశువు నిన్నుఁ జంపును' అనునట్టి యశరీరవాణిని 'విని వసుదేవునితో నిట్లనియె.

శ్లో॥ వసుదేవ హనిష్యామి కరిష్యా మ్యాత్మనో హితం,
దేవకీ భగినీమేనాం మృత్యుబీజం మమాప్యహమ్.

వసుదేవా! = వసుదేవుడా!; మమ అపి మృత్యుబీజం = నాకుగూడ మృత్యువుకు కారణమైనట్టి; ఏనాం భగినీం దేవకీం = ఈ చెల్లెలు అయిన దేవకిని; అహమ్ హనిష్యా కరిష్యామి = నేను చంపెదను; ఆత్మనఃహితం = నాకు మేలును చేసికొనెదను; అథ వసుదేవః = అనంతరము వసుదేవుడు; కంసం ప్రతి ఆహ = కంసుని గురించి పలికెను.

తాత్పర్యము : వసుదేవా! యీదేవకి నాకుఁ జెలియలైనను నాచావునకు మూలముగా నున్నది గావున నీమెను వధించెదను. అంత నాభయము దీరును.

*అథ వసుదేవః కంసంప్రత్యాహ*

వసుదేవుఁడు కంసున కిట్లనియె.

## మంజరి - కాంభోజీరాగము - జంపెతాళము

ప. హేకంస రాజసుత హే నరశ్రేష్ఠ
అ. హే సత్యసంధకుల జలధిభవరత్న

1. హే సౌమ్యగుణయుక్త హితజనాసక్త
కల్యాణవేద్యాం చ కలితబహుంభద్రాం
ముంచ భగినీ మద్య ముహుంరధికహృద్యాం
సత్యం వదామి తవ సత్యసంధో స్మి

2. దాస్యామి తజ్జాత వత్సా ననింద్య
మా సాహసం కర్తు మర్హసినదైవ
తవ భగిన్యైవ సహ సుఖమధివసామి
భవనే తవైవ పర మన్నుశుభ మద్య.

హే కంస! రాజసుత = ఓ కంసుడా! రాజకుమారుడ; హే నరశ్రేష్ఠ! = ఓ ప్రజలలోకి గొప్పవాడా!; హే స్త్ర సత్యసంధ = సత్యమైనటువంటి ప్రతిజ్ఞగల; కుల జలధి = వంశమనెడి సముద్రమందు; భవరత్న! = పుట్టినటువంటి రత్నమువంటివాడా!

1. సౌమ్య గుణయుక్త! = మంచి స్వభావము, గుణములతో కూడుకున్నవాడా!; హితజనాసక్త! = నీ మేలును కోరువారిని ప్రేమించువాడా!; కళ్యాణ వేద్యాం చ = వివాహ వేదికయందు కళ్యాణపతియైన దానిని; కలిత = కూడుకున్నటువంటి; బహుభద్రాం = అనేకవిధములైన సులక్షణములు గల్గినట్టిన్నీ; అధిక హృద్యాం = మిక్కిలి మనోహరమైనటువంటిన్నీ; భగినీం = చెల్లెలిని; అద్యముంచ = ఇప్పుడు విడిపింపుము; ముహుః = పలుమారు; తవ సత్యం వదామి = నీకు సత్యమునే చెప్పుచున్నాను; సత్యసంధ అస్మి = సత్యప్రతిజ్ఞగలవాడుగా నున్నాను; హే అనింద్యా = నిందలేని నడవడిగలవాడా; తజ్జాతవత్సాన్ = ఆమెకు పుట్టినట్టి పిల్లలను; దాస్యామి = ఇచ్చెదను; మా సాహసం కర్తుం = నన్ను గురించి తెంపుగల పనిని చేయుటకుగాను; మా అర్హసి సదా ఏవ = ఈ ప్రకారము ఎల్లప్పుడు చేయుటకు తగవు; మా అర్హసి = చేయుటకు తగవు; తవ భగిన్యైవ సహ = నీ చెల్లెలితో గూడా; అధి వసామి = యజమానిగా; సుఖం = సుఖముగావించెదను; భవనే తవైవ = నీయొక్క ఇంటిలోనే; అధివసామి = నివసించెదను; అద్యశుభం = ఇప్పుడు మంగళకరము అయిన; వరము అస్తు = వరము (నాకు) అవుగాక

తాత్పర్యము : కంసా! నీవు రాజపుత్రుఁడవు. ఉత్తమపురుషుఁడవు. సత్యమైన మర్యాద గలవంశమునందు రత్నముగ నుదయించినవాఁడవు మంచిగుణములు గలవాఁడవు. నీకు హితమును గోరువారిని బ్రేమించువాఁడవు. ఇప్పుడే పెండ్లి చేసికొని మంగళవతి యగు నీతోడఁబుట్టు దేవకి నీకు మిక్కిలి ప్రీతిపాత్రముగదా! ఈమెను జంపకుము. నామాట వినుము. నే సత్యము తప్పువాఁడను గాను. సత్యముగఁ బల్కుచున్నాను. నీవు బుద్ధిమంతుఁడవు. నామాట హితమగును వినుము. ఈ చిన్నదాని యెనిమిదవగర్భముగదా నిన్నుఁ జంపు ననివింటివి! పుట్టినబిడ్డల నందఱిని నీకిచ్చెదను. నీయిష్టమువచ్చినట్లు చేసికొనుము. నాకొక్క వరమిమ్ము. అదియేమనిన: నాకు బిడ్డలు లేకున్నను ఈచిన్న దానింగూడి సుఖియించినఁజాలును. మే మెటుకాని తప్పించుగొని పోవుదుమే మోయని విచారింపవలదు. మేము నీయింటనే యుండెదము. నీకు మేలగును.

## దేవకీవసుదేవుల కారాగృహప్రవేశము

గ. అథ వసుదేవవాక్యం శ్రుత్వా కంసస్తౌ కారాగృహం ప్రావేశయత్.

అథ = అనంతరమందు; వసుదేవ వాక్యం శృత్వా = వసుదేవుని వాక్యమును విని; కంసః తౌ = కంసుడు వారిద్దరిని; కారాగృహం ప్రావేశయత్ = బంది ఖానాయందు ప్రవేశపెట్టెను; అథ బ్రహ్మాగమనమ్ = అనంతరం బ్రహ్మదేవుడు ప్రవేశించడము.

తాత్పర్యము : అంత నావసుదేవునిమాట విని కంసుఁడు వారిని కారాగృహమునందుండునట్లు నియమించెను.

అథ బ్రహ్మాగమనమ్

1. దరువు - నాదనామక్రియారాగము - అటతాళము

| | |
|---|---|
| ఆయాతి చతురాననో | బ్రహ్మసదసి |
| గాయంగాయం ధ్యాయంధ్యాయం | విష్ణుం చేతసి |
| దండకమండలుధారీ | దానవవైరీ |
| అండబ్రహ్మాండవిధాతా | అఖిలజనయిదా |

అథ దేవేంద్రాగమనమ్

దరువు - శ్రీరాగము - ఆదితాళము

| | |
|---|---|
| బృందారకాదివినితో | మందం మందం మహీసుఖం |
| అంతరంగే విచింతయ్ | ఇంద్రో మహా్ విరాజతే. |

అథ ధరణ్యాగమనమ్

దరువు - మధ్యమావతి - ఆదితాళము

| | |
|---|---|
| లావణ్యమూర్తి ర్ధరణీ సమాయాతి | లలితభాసురధారిణీ · |
| సర్వలోకహితకారిణీస దాదేవీ | సత్యలోకసంచారిణీ. |

చతురాస్యో = నాలుగు ముఖములుగల బ్రహ్మదేవుడు; బ్రహ్మసదసి ఆయాతి - సభయందు ప్రవేశించుచున్నాడు; చేతసి విష్ణుం = మనస్సునందు శ్రీమన్నారాయణుని; గాయం గాయం = గానము చేయుచు చేయుచు; ధ్యాయం ధ్యాయం = ధ్యానముచేయుచు చేయుచు, దండ కమండల ధారీ - దండ కమండలమును ధరించినవాడున్నూ; దానవ వైరీ = రాక్షసులకు శత్రువును; అండ బ్రహ్మాండ విధాతా ! = అన్నిటిని జనింపజేసినవాడు; అథ దేవేంద్ర ఆగమనం - అనంతరము, దేవేంద్రుడు ప్రవేశించుటయు; బృందారకాది వినుతో = దేవతలు మొదలగువారివల్ల స్తోత్రము చేయబడువాడున్నూ; మందం మందం మహిసుఖం = భూదేవత యొక్క సుఖము తగ్గిపోవుటను గురించి; అంతరంగే విచింతయన్ = మనస్సులో ఆలోచించినవాడై; ఇంద్రో మహాన్ విరాజితే = ఇంద్రుడు సభకు ప్రవేశించుచున్నాడు; అథ ధరణ్యాగమనం = అనంతరమందు భూదేవి ప్రవేశించుట; లలిత = సుందరమై ఒప్పుచున్నటువంటి; లావణ్యమూర్తి = శృంగారముతోకూడినటువంటి; భూసుర ధారుణి = బ్రాహ్మణులను ధరించినటువంటి; ధరణి సమాయాతి = భూదేవత వచ్చుచున్నది; సర్వలోక హితకారిణి = సమస్త లోకములకు మేలుచేయునది, సదాదేవి = ఎల్లప్పుడు పూజింపబడు చుండెడిది; సత్యలోక సంచారిణి = సత్యలోకమునందు సంచరించునది, సమాయాతి = లెస్సగా వచ్చినది.

తాత్పర్యము : సత్యలోకమునందు బ్రహ్మమనంబున భగవంతుని శ్రీమన్నారాయణుని ధ్యానము చేయుచున్నవాఁడై నాల్గుముఖములను శ్రీహరిగుణంబుల నుగ్గడించి పాడుచున్నవాఁడై హస్తంబుల దండకమండలువుల ధరించి సకల బ్రహ్మాండము నిర్మించువాఁడై లోకములఁ దండ్రులకుఁ దండ్రియై దుష్టరాక్షసుల నణంచు. వాఁడై కొలువు దీరి యుండెను.

2. అంత నుపేంద్రుడు దేవగణంబులఁ గూడి కంసాదిదుష్టరాజులచేఁ గలిగిన భూభారమును చింతించి బ్రహ్మసభకు వచ్చెను.

భూదేవి భగవంతుని శరణంబు వేఁడుట

3 ఆసమయంబున సర్వలోకమునకు హితమును గోరినదై ఉత్తము. లైన బ్రాహ్మణులకు నాశ్రయ మైనభూదేవి సత్యలోకమునకు వచ్చెను.

శ్లో. దృష్ట్వా సురేంద్రం బ్రహ్మాణం బ్రహ్మణో నుజ్ఞయా సహ,
బ్రహ్మణా, చ సురేంద్రేణ విష్ణుం సా శరణం గతా. 20

20 శ్లో॥ సా బ్రహ్మాణం = ఆ భూదేవి, బ్రహ్మనున్నూ; బ్రహ్మణః అనుజ్ఞయా = బ్రహ్మదేవుని అనుజ్ఞచేత; సురేంద్రం దృష్ట్వా = దేవేంద్రునిన్నీ చూచి; బ్రాహ్మణ్యం అనుజ్ఞయా = బ్రహ్మదేవుని యొక్క అనుజ్ఞచేత; బ్రాహ్మణా సురేంద్రణ = బ్రహ్మదేవుడితోనున్నూ, దేవేంద్రునితోనున్నూ; సహ = చేరుకొని; విష్ణుం = శ్రీమన్నారాయణునిగురించి; సా = ఆభూదేవి; శరణంగతా = (భూదేవి) శరణుజొచ్చినవాడాయెను.

గద్య 21 అధ = అనంతరమందు; భగవాన్ = షాడ్గుణ్య పరిపూర్తిగలవాడు అనగా జ్ఞాన, బల, వీర్య, ఐశ్వర్య, తేజస్సు, శక్తి యీ ఆరుగుణములు పూర్తిగా గలవాడు; అపరిమిత = పరిమితములేని; చిత్ + ఆనందం = జ్ఞాన అనందుము కలిగినటువంటిన్నీ; సత్య = భూత, భవిష్యత్, వర్తమానముల యందు వికారము చెందని; పరిపూర్ణః = సర్వదేశ, సర్వకాల, సర్వవస్తువులయందు నిండియుండువాడు; పరమాత్మా (పరమ+ఆత్మ) = జీవాత్మలకంటె విలక్షుణుడైనవాడు (ఎవరికంటె అతిశయములు వేరో అట్టివాడని యర్థము); అనాది = ఆదిలేనటువంటిన్నీ; అనిర్వచనీయ = చెప్పుటకు అలవికానటువంటిన్నీ; అచింత్య = చింతించుటకు అలవికానటువంటిన్నీ; శక్తిః = సామర్థ్యము కలవాడున్నూ; మాయావిలసిత = మాయ చేత ప్రకాశించుచున్న; లోకాన్ + అనుజిఘృక్షయా = లోకములను అనుగ్రహించు తలంపుచేత; పరిగృహీత = (పరిగ్రహింపబడిన) అంగీకరింపబడిన; దివ్యమంగళ విగ్రహ = దివ్యమైన మంగళప్రదమగు; మూర్తి = (మూర్తిగలవాడు) రూపముగలవాడు అయినటువంటి; శ్రీమన్నారాయణః = లక్ష్మీనారాయణుడు; క్షీరాబ్ధౌ = పాలసముద్రమునందు; శేషపర్యంకశయనో = ఆదిశేషుని పాన్పుగాగలవాడు; మహాన్ = మహాపురుషుడు అయినటువంటి; అసౌ = ఈ నారాయణుడు; సదా అస్తే = ఎల్లప్పుడూ వుంటున్నాడు; తం ఏనం = అటువంటి ఈ నారాయణుని; అసురభార = రాక్షసుల భారముయొక్క; భరాక్రాంతా = భరించుటచే ఆక్రమింపబడినదన్ని; గోరూపధారిణీ ధరణీ = గోరూపమును ధరించిన భూదేవి; సురపతి ముఖ = ఇంద్రుడు మొదలైన, సుర పరివేష్టితా = దేవతలచేత చుట్టుకొనబడియుండు నటువంటిన్నీ; సతీ = ఆ భూదేవి; అనన్యశరణా = అన్యులను శరణాగతి చేయునటువంటిదిన్నీ అగు ధరణి; శరణ, మాజగామ = శరణాగతి చేయుటకు వచ్చెను; అధ = అనంతరము; భగవన్నామ మహాత్యం = భగవన్నామ మహిమను; ఖ్యాపయతాం = ప్రశిద్ధపరచుచున్న; సనకాదీనాం, ఋషీణాం = సనకాదిదేవ ఋషులయొక్క; అగమనం గీయతే = వచ్చుట గానముచేయబడుచున్నది.

బ్రహ్మను సేవించి తనమనోగతము నివేదించి బ్రహ్మేంద్రాదిదేవతలం గూడి శ్రీమన్నారాయణుని శరణంబు వేఁడఁజనెను.

తథాహి :

గ. అథ భగవాన్ - అపరిమితచిదానందసత్యపరిపూర్ణః - పరమాత్మా - అనాద్యనిర్వచనీయా చింత్యశక్తిః - మాయావిలసితలోకానుజిఘృక్షయా పరిగృహీత దివ్యమంగళ విగ్రహమూర్తిః- శ్రీమన్నారాయణః - క్షీరాబ్ధౌ శేషపర్యంక శయానో - మహాన సౌ సదా స్తేత మేన మాసురభార భరాక్రాంతా గోరూపధారిణీ ధరణీ - సురపతిముఖసురపరి వేష్టితా సతీ - అనన్యశరణా - శరణమాజగామ.

అథః = అనంతరమందు; భగవాన్ = షాడ్గుణ్య పరిపూర్తిగాగలవాడు, అనగా జ్ఞాన, బల, వీర్య ఐశ్వర్య, తేజస్సు; శక్తియీ ఆరుగణములు పూర్తిగాగలవాడు; అపరిమిత = పరిమితములేని, చిత్+ఆనందం = జ్ఞాన ఆనందము కలిగినటువంటిన్నీ; సత్య =భూత, భవిష్యత్, వర్తమానముల యందు వికారము చెందని; పరిపూర్ణః = సర్వదేశ, సర్వకాల, సర్వవస్తువులయందు నిండియుండువాడు; పరమాత్మా (పరమ+ఆత్మ) = జీవాత్మలకంటె విలక్షణుడైనవాడు (ఎవరికంటె అతిశయములు వేరో అట్టివాడని యర్థము); అనాది = ఆదిలేనటువంటిన్నీ; అనిర్వచనీయ = చెప్పుటకు అలవికానటువంటిన్నీ; అచింత్య = చింతించుటకు అలవికానటువంటిన్నీ; శక్తిః = సామర్థ్యము కలవాడున్నూ; మాయావిలసిత = మాయచేత ప్రకాశించుచున్న; లోకాన్ + అనుజిఘృక్షయా లోకములను అనుగ్రహించుతలంపుచేత; పరిగృహీత = (పరిగ్రహింపబడిన) అంగీకరింపబడిన; దివ్యమంగళ విగ్రహ = దివ్యమైన మంగళప్రదమగు; మూర్తి (మూర్తిగలవాడు) రూపముగలవాడు అయినటువంటి; శ్రీమన్నారాయణః = లక్ష్మీనారాయణుడు; క్షీరాబ్ధౌ = పాల సముద్రమునందు; శేషపర్యంకశయనో = ఆదిశేషుని పాన్పుగా గలవాడు; మహాన్ = మహాపురుషుడు అయినటువంటి; అసౌ = ఈ నారాయణుడు; సదా అస్తే = ఎల్లప్పుడూ వుంటున్నాడు; తం ఏనం = అటువంటి ఈ నారాయణుని; ఆసురభార = రాక్షసుల భారముయొక్క; భరాక్రాంతా = భరించుటచే ఆక్రమింపబడినదిన్ని; గోరూపధారిణీ ధరణీ = గోరూపమునుధరించిన భూదేవి; సురపతి ముఖ = ఇంద్రుడు మొదలైన; సుర పరివేష్టితా = దేవతలచేత చుట్టుకొనబడియుండునటువంటిన్నీ; సతీ = ఆ భూదేవి; అనన్యశరణా = అన్యులను శరణాగతిచేయునటువంటిదిన్నీ అగు ధరణి; శరణ మాజగామ = శరణాగతి చేయుటకు వచ్చెను; అథ = అనంతరము; భగవన్నామ మహాత్మ్యం = భగవన్నామ మహిమను; ఖ్యాపయతాం = ప్రశిద్ధిపరచుచున్న; సనకాదీనాం, ఋషీణాం = సనకాదిదేవ ఋషులయొక్క; ఆగమనం గీయతే = వచ్చుట గ్నాము చేయబడుచున్నది.

అపరిమితసత్యజ్ఞానానందస్వరూపుఁడను, అనాదియై యిది యిట్టిదని యెఱుంగరానిశక్తిగలవాఁడును, తనమాయచేత నిండియున్న లోకము ననుగ్రహింపఁ గోరి దివ్యమంగళవిగ్రహమును దాల్చినవాఁడును, భగవంతుండగు శ్రీమన్నారాయణుఁడు క్షీరసాగరమునందు శేషపర్యంకమున శ్రీదేవిసమేతుఁడై వేంచేసియుండెను. అట్టిభగవంతుని సన్నిధికి భూదేవి గోరూపధారిణియై బ్రహ్మాదిదేవగణములఁ గూడి పోయి శరణాగతి చేసెను.

అథ సనకాదీనాం (ఋషీణాం) భగవన్నా మమాహాత్మ్యం ఖ్యాపయతామాగమనం గీయతే

అంత సనకాదిమహామునులు భగవన్నామ ప్రభావములు వెల్లడిసేయుచు భగవత్సన్నిధానమున కరుదెంచిరి.

## శ్రీమన్నారాయణుసన్నిధికి సనకాదు లేతెంచుట

అథసనకాదయ ఊచుః-

### భైరవిరాగము - ఆదితాళము

ప. రామకృష్ణగోవిందేతి నామసంప్రయోగే
అ. కామ మిహస్నాతవ్యం సర్వోత్తమ ప్రయాగే
1. దిగ్దేశ కాలానపేక్ష సిద్ధసర్వసులభే
సద్గురుకృపాసముద్ర సంగహేతులాభే
2. రామనామగంగయా మిళితకృష్ణనామ
యామునే గోవింద నామసరస్వతీ ప్రథితే
3. యోగిమానసపరమ హంసకులకలితే
వాగీశవిష్ణురుద్రాది వాగ్లహరీలలితే
4. సర్వలోకాలోక కామ సాంగఫలదానే
నిర్విశేషనిత్యసుఖ లాభసునిదానే
5. ఋగ్యజుస్సామాదివేద శాఖమూలవిలశితే
రాగలోభాదిసంతాప శాంతికరచరితే
6. స్నానసంధ్యాజపహోమ తర్పణానపేక్షితే
హానివృద్ధ్యాదిరహి తాఖండసుఖఫలదే
7. స్నానం మానసికం తస్య స్మరణం వాచికమ్
కీర్తనం కాయికం తస్య కీర్తనే పునర్తన
8. యాగయోగరాగభోగ త్యాగసంబంధం వినా
భక్తివిరక్తి విజ్ఞానద్వారా ముక్తిఫలదే
9. బ్రహ్మవిద్యాలక్షణ నిరీక్షణవిచక్షణే
బాధితఘోరసంసార వారణతత్కారణే
10. సర్వపాపౌఘతిమిర చండసూర్యమండలే
సాధునారాయణతీర్థ తీర్థరాజవిమలే

### 12వ కీర్తన భైరవిరాగం - ఆదితాళం

**ప॥ రామ కృష్ణ గోవింద ఇతి = రామకృష్ణ గోవింద యను; నామ సంప్రయోగె = భగవన్నామము యొక్క ఉచ్చారణ రూపమైనటువంటి; సర్వోత్తమ ప్రయాగే = సర్వోత్కృష్టమైన ప్రయాగయందు; ఇహ.......కామం = (యిప్పుడు) యిక్కడ మిక్కిలి; స్నాతవ్యం = స్నానము చేయబడతగినది.**

1. దిక్కు, దేశము, కాలము = దిక్కు, దేశము, కాలము - యీమూటితో, అనపేక్ష = వీటిని అనుసరించకుండా, సిద్ధ సర్వసులభే = సిద్ధమైనటువంటిన్నీ, సర్వసులభమైనటువంటిన్నీ; సద్గురు కృపా సముద్ర = సద్గురు కృప అనే సముద్రము యొక్క; సంగహేతు లాభే - సంగమనే లాభముకు హేతువైనటువంటి భగవన్నామములో స్నానము చేయవలసినది

2. రామనామ గంగయా = రామనామమే గంగగానున్నూ; కృష్ణనామ, కృష్ణనామ యామునే యమునగా నున్నూ గోవిందనామ సరస్వతీ = గోవిందనామము సరస్వతిగా నున్నూ; మిళిత కృష్ణనామ = ఈ మూటి యొక్క మేలనముచే; ప్రథితే = ప్రసిద్ధిచెందిన భగవన్నామ సంప్రయోగము నందు స్నానము చేయతగినది.

3. యోగిమానస = యోగుల మనస్సు లనేడు; పరమహంసకుల కలితే = పరమ హంస సమూహముల చేతకూడినటు వంటిన్నీ; వాగీశ విష్ణురుద్రాది = బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు మొదలైన యోగులయొక్క; వాక్+లహర్ (వాగ్లహరీ) = హక్కులనెడు ప్రవాహముచేత; లలితే = ఒప్పుచున్నట్టి, భగవన్నామ ప్రయాగయందు స్నానము చేయవలసినది.

4. సర్వలోకా = సమస్తలోకములను; ఆలోక = చూడవలయునను; కామ సంగ = కోరికయొక్క సంగము కలిగి; ఫలదానే = ప్రయోజనమును యిచ్చునట్టిన్నీ; నిర్విశేష = ప్రకృతి సంబంధము లేనట్టి, అప్రాకృత మైనటువంటి; నిత్యానంద = శాశ్వతానందరూపమై; లాభ = ప్రయోజనమునకు; (ను) నిదానే = అది కారణమైనట్టి భగవన్నామ ప్రయాగమయినది; నిదానం = వ్యాధికారణం.

5. ఋగ్యజు స్సామాదతి వేదశాఖ = ఈ నాలుగువేదముల శాఖలకు; మూల విలసితె = గూఢముగా ప్రకాశించునట్టిన్నీ; రాగలోభ = విషయాసక్తి, లభించిన దానిని విడువకుండుటను; ఆది, సంతాప = మొదలగు, తాపములను; శాంతికర చరితె = శమింపజేయునటువంటి చరిత్రము కలిగినటువంటివి.

6. స్నాన, సంధ్య, జప, హోమ, తర్పణ = ఈ అయిదు నిత్యకర్మలను; అనపేక్షతే = అపేక్షించనటువంటిన్నీ (నిమిత్తము లేనటువంటిన్నీ) హాని, వృద్ధిరహిత = క్షీణదశ, పూర్ణదశ, అవిలేనటువంటి; అఖండ సుఖఫలదె = గొప్పదైన సుఖమును ఇచ్చునటువంటిన్నీ.

7. తస్య = ఆ స్వామివారియొక్క నామమును; మానసికం స్మరణం = మనస్సునందు స్మరించడము; స్నానం = స్నానము (మనో తపస్సు); కీర్తనం వాచనికం = పాడడమే వాక్ తపస్సు; తస్య కీర్తనేషు నర్తనం = ఆ కీర్తనపాడు కాలమందు నృత్యము సమర్పించుటయే; కాయకం = కాయక తపస్సు.

8. యాగ యోగ = యాగమువల్ల, అష్టాంగాది యోగములవల్ల; రాగ, భోగ = విషయానురాగమువల్లను, భోగమువల్లను; త్యాగ, సంబంధం వినా = విసర్జించడము పైవాటి సంబంధములేకయే; భక్తి, విరక్తి = భక్తివల్లను, వైరాగ్యమువల్లను; విజ్ఞానద్వారా = విజ్ఞానమువల్లను, వీటిమూలకముగా; ముక్తిఫలదే = ముక్తి ఫలమును యిచ్చునటువంటి రామ, కృష్ణ, గోవింద.

9. బ్రహ్మవిద్యయే = లక్షణముగా కలిగినటువంటి పరబ్రహ్మమును; నిరీక్షణ, విచక్షణే = చూచుటయందు, నేర్పుకలుగజేయునట్టిన్నీ, బాధిత = బాధించుచున్నటువంటి; ఘోర, సంసార = భయంకరమైన, జనన మరణాదులను; వారణ, తత్కారణె = నివారించుటకు, కారణభూతమైనది ॥ రామ ॥

10. సర్వ పాపౌఘ = సమస్త పాప సంఘములనే; తిమిర = చీకట్లను; చండసూర్యమండలే = తీక్షమైన సూర్యమండలమువలె నున్నటువంటిన్నీ; సాధు నారాయణతీర్థ = సాధువైన నారాయణతీర్థులవారిని; తీర్థ రాజవిమలే = నిర్మలమైన, రాజశ్రేష్ఠమైన, పుణ్యతీర్థమగునట్టి (భగవన్నామ మహిమ రూపమైన ప్రయాగయందు స్నానము చేయవలెను)

ప-అ 1-10. రామ, కృష్ణ, గోవింద అనెడు భగవద్దివ్యనామత్రయోచ్చారణమే సర్వోత్తమమైన ప్రయాగ; (అనఁగా ప్రయాగ మనునది గంగాయమునాసరస్వతు లనెడు మూఁడునదులచేరిక గనుక అట్లే యీనామత్రయోచ్చారణము ప్రయాగతో సమానమనుట). ఇందు స్నానము చేసిన వారికి (ఈనామ త్రయమును బఠించినవారిక) ఇష్టమైన ఫలము లభించును. దీనికి దిగ్దేశకాలముల యపేక్షలేదు; (అనఁగా నేదిక్కునఁ గాని యేచోటఁగాని యెప్పుడుగాని తలంచుకొన్న మాత్రమున నందఱికిని దొఱకునట్టిది) ఈ ప్రయాగ (అనగా భగవన్నా మోచ్చారణము నేలాటినియమ మక్కరలేకయే యభీష్టసిద్ధి గలుగుచున్నదిగాన లోకసాధారణమైన ప్రయాగకన్న నీప్రయాగ విలక్షణ మైనదని భావము) మఱియు శ్రీ ప్రయాగయందు సదాచార్యకృపయనెడు సముద్రమును జేరునట్టిరామనామ మనెడుగంగయు, కృష్ణనామ మనెడుయమునయు, గోవిందనామ మనెడుసరస్వతియుఁ జేరియున్నవి. యోగీశ్వరులమనస్సు లనెడు రాజహంసలతోఁ గూడినది. (అనఁగానీ భగవన్నామత్రయము యోగీశ్వరులమనసున కెక్కిన దని యర్థము) బ్రహ్మ, విష్ణు, రుద్ర ఇత్యాదినామములు ఈప్రయాగయందలి అలలు. (అనఁగా సమస్తనామములు సర్వస్వరూపుఁ డగుభగవంతునియందు నన్వయించుచున్నవనుట) ఇందు స్నానము చేసినవారికి (ఈనామత్రయమును బఠించినవారికి) పశుపుత్రాది దృష్టఫలములును స్వర్గాద్యదృష్టఫలములును నిర్వి శేషనిత్యసుఖమయమగు మోక్షమును గలుగుచున్నవి: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము లనెడు వృక్షముల మొదళ్లనుండి ప్రవహించునది యీప్రయాగ (అనఁగా సర్వవేదములను, ఈనామత్రయార్థమునే విస్తరించుచున్నందున నిది సర్వవేదసారమని తాత్పర్యము) ఇది కామక్రోధాదులనెడు సంపతాపముల హరించి చల్లపఱచునది. మఱియు నీప్రయాగయందు గ్రుంకిన మాత్రముచాలును. మఱి యేనియమ మక్కఱలేదు. ఈనామత్రయమును స్మరించుట మానసికస్నానము, కీర్తనము చేయుట వాచికస్నానము, కీర్తనము చేయునపుడు నర్తనము సల్పుట కాయికస్నానము, (అనగా నీనామత్రయమును దలంచినమాత్రమున మనసు పరిశుద్ధమగును. కీర్తించిన వాక్కు పరిశుద్ధమగును. నీనామము నుడువుచు నర్తనము చేసిన శరీరము పవిత్ర మగును. ఇటుల మనోవాక్కాయము లనెడుత్రికరణములు పవిత్రములగుననుట) ఈప్రయాగయం దంగభూతము లగుయాగదానాదులగు నేసత్కర్మలును పని లేదు; జ్ఞానభక్తి వైరాగ్యము లుండిన, జాలును. మోక్షము సిద్ధము. ఉపనిషత్ప్రతిపాద్య మయిన బ్రహ్మస్వరూప మీనామత్రయముచే నెఱుఁగవచ్చును. సంసారనివారణమున కిది కారణమైనది. సమస్తపాపములనియెడు చీఁకట్ల కిది చండసూర్యుడు. శ్రీనారాయణతీర్థముని సేవించినది యీనామత్రయప్రయాగ.

గ. ఏవం సనకాదిభిః ప్రశస్యమానదివ్యనామధేయో భగవాన్
శేషేశయ ఆవిరాసీత్. తదేతదభిధీయతే.

ఏవం సనకాదిభిః = ఈ ప్రకారము సనకాదులచేత; ప్రశంస్య మాన = కొనియాడబడుచున్నట్టి, దివ్య, నామధేయః = అప్రాకృత్యమైన, నామధేయముకల్గినట్టి; భగవాన్ = నారాయణమూర్తి; శేషశాయీ = ఆదిశేషుని యందు పవళించిన స్వామివారు; ఆవిరాశీత్ (అవః + ఆశీత్) = ప్రత్యక్షము, ఆయెను; తత్, ఏతత్ = అట్టి ఈ విషయము; అభినీయతే = చెప్పబడుచున్నది; తత్ + ఏతత్ + అభినీయతె = (తదేతరభినీయతె) పరసంధి.

తాత్పర్యము : ఇట్లు సనకాదులచేఁ బ్రశంసింపఁబడిన దివ్యనామ ధేయములు గలభగవంతుఁడు శేషపర్యంకమునందు శయనించి ప్రత్యక్షమాయెను.

దరువు - శంకరాభరణము - చాపుతాళము

| | |
|---|---|
| అశేషలోక కారణం | అనాదిమధ్య మవ్యయం |
| సశేషశయనో విభు | ర్విశేషతో విరాజతే |
| మహాఫణీంద్రశయనో | మహామునీంద్రసేవితో |
| మహాలక్ష్మీమహీయుతో | మహావిష్ణుర్విరాజతే. |

13వ కీర్తన: (దరువు) శంకరాభరణము చావుతాళము; అశేషలోక కారణం = సమస్తలోకములకు కారణభూతుడైనట్టిన్నీ; అనాది మధ్యం = మొదలు మధ్యలేనివాడున్నూ; అవ్యయం = (వ్యయము కానటువంటి) నాశములేనటువంటి; సః, శేషశయనః = అట్టి, శేషశాయి; విభుః = ప్రభువు; విశేషతః = సర్వాతిశయముగా; విరాజితే = ప్రకాశించుచున్నాడు.

సర్వలోకములకుఁ గారణభూతుఁడును, ఆదిమధ్యాంతములు లేనివాఁడుననగు శ్రీమన్నారాయణుఁడు శేషర్యంకమునందు శయనించినవాఁడై శ్రీదేవియు భూదేవియు సేవించుచుండ నిత్యసిద్ధు లగుభాగవతసత్తములచే నుతింపఁబడుచుఁ బ్రసన్నుఁడయ్యెను.

గ. ఏవం భగవతిప్రసన్నే ప్రణిపాతపూర్వకం మహావిష్ణుం
ప్రతిధరణ్యువాచ.

గద్య 23. ఏవం, భగవతి = ఈ ప్రకారముగా, భగవంతుడు; ప్రసన్నే = ప్రత్యక్షముకాగా; ప్రణిపాత పూర్వకం = సాష్టాంగ నమస్కారపూర్వకముగా; మహావిష్ణుం ప్రతి = నారాయణమూర్తిని గురించి; ధరణీ, ఉవాచ = భూదేవి విన్నవించెను.

తాత్పర్యము: ఇట్లు ప్రసన్నుఁ డగుపరమపురుషునికి సాష్టాంగనమస్కార పూర్వకముగా భూదేవి విన్నవించుకొనెను.

శ్లో. శరణ ముపగతా హం త్వాం శరణ్యం జనానాం
నిఖిలభయవియోగం యోగిచింత్యం మహాంతం.
సురరిపుగణభారం దుస్సహం దుర్భరమ్మే
పరిహర పరమాత్మన్ భక్తిసిద్ధైకమూర్తే.

శ్లో 24. జనానాం శరణ్యం = జనులకు రక్షకుడువున్నూ; నిఖిలభయవియోగం = సమస్త భయములు పోగొట్టునట్టిన్నీ; యోగి చింత్యం = యోగులవల్ల చింతింపబడుచున్నటువంటిన్నీ; మహాంతం = మహాపురుషుడైనటువంటిన్నీ; త్వాం, అహం = నిన్ను (మిమ్ములను); నేను; శరణం, ఉపగతాం = రక్షకుడవనినమ్మి, పొందితిని; సురరిపుగ॰ = రాక్షస సమూహములయొక్క; భారం = భారమును; దుస్సహం దుర్భరం = సహించరానట్టిన్నీ, భరించరానట్టిన్నీ; మే = నాకు; (యీభారమును); భక్తి సిద్ధైక మూర్తే = భక్తిచేతనే సిద్ధించునట్టి ఏక స్వరూపముగలవాడా; పరమాత్మ! = జీవాత్మలకంటె విలక్షణుడైనటువంటి శ్రీనారాయణ స్వామీ! (పైరాక్షసబాధను); పరిహర = తొలగించుమా.

తాత్పర్యము: స్వామీ! శ్రీమన్నారాయణా! సకలచేతనులకు రక్షకుఁడవు. సకలభయములను దీర్చువాఁడవు. యోగీశ్వరులచే ధ్యానింపఁబడువాఁడవు. మహానుభావుఁడవు. పరమాత్మవు. రాక్షసులు రాజవేషమున మిక్కుటముగఁ బుట్టి యున్నారు. వారిభారమును సహింపలేక వచ్చి శరణఁ జొచ్చినదానను. భక్తిసేయువారియెడ ననుగ్రహించు నాథా! దుర్భర మైనయీభారమును వారించి నన్ను రక్షింపుమా!

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

ప. శరణం భవ కరుణాం మయి కురు దీనదయాళో
కరుణారసవరుణాలయ కరిరాజకృపాళో
అ. అధునా ఖలు విధినా మయి సుధియా సురభరితం
మధుసూదన మధుసూదన హర మామకదురితమ్
1. వరనూపురధర సుందర కరశోభితవలయ
సురభూసురభయవారక ధరణీధర కృపయా
త్వరయా హర భర మీశ్వర సురవర్య మదీయం
మధుసూదన మధుసూదన హర మామకదురితమ్.
2. ఘృణిమండలమణికుండల ఫణిమండలశయన
అణిమాదిసుగుణభూషణ మణిమంటపసదన
వినతాసుతఘనవాహన మునిమానసభవన
మధుసూదన మధుసూదన హరమామకదురితమ్

| | | |
|---|---|---|
| 3. | అరిభీకర హలిసోదర | పరిపూర్ణసుఖాబ్ధే |
| | నరకాంతక నరపాలక | పరిపాలితజలధే |
| | హరిసేవక శివనారా | యణతీర్థపరాత్మన్ |
| | మధుసూదన మధుసూదన | హర మామకదురితమ్. |

## 14వ కీర్తన సౌరాష్ట్ర రాగం - ఆదితాళం (రూపకం)

ప॥ హేదీన దయాళో = దీనులయందు దయజూపించే స్వభావముగలవాడా; మయి కరుణాంకురు = నాయందు దయజూపించే స్వభావముగలవాడా; శరణం భవ = రక్షకుడవు కావలసినది; కరుణారస = దయారసమను నీళ్ళచేనిండిన; వరుణాలయ = సముద్రుడా; కరిరాజ కృపాళో = గజేంద్రుని రక్షించినటువంటివాడా; అ.ప॥ మయి విధినా = నాయందు దైవయోగముచేత (ఏర్పడిన దురితం); అసురభరితం ఖలు = రాక్షసులచేత నిందింపబడినది కదా; మామకదురితం =అట్టి నాయందు చేరిన పాపమును; మధుసూదన = మధువనురాక్షసుని చంపినవాడా-హే స్వామీ; సుధియా = కరుణా బుద్ధిచేత; అధునా హర = ఇప్పుడు తీసివేయుమా.

1. వర నూపురధర = శ్రేష్ఠమైన అందెలను ధరించిన స్వామీ!; సుందరకర = సౌందర్యము కలిగిన శ్రీహస్తమందు; శోభితవలయ = ప్రకాశించుచున్నట్టి కడియములకలవాడా! సురవర్య! ఈశ్వర! = దేవతాశ్రేష్ఠుడా! సర్వమును నియమించువాడా!; మదీయం భరం = నాయొక్క, భారమును; కృపయా, త్వరయా, హర = కృపచేత, శీఘ్రముగా, తొలగించుమా

2. ఘృణిమండన = చెక్కిళ్ళను ప్రకాశింపచేయునట్టి; మణికుండల = మణి ఖచిత కుండలములు గలవాడా; ఫణిమండల శయన = ఆదిశేషుని పడగల సమూహమునందు శయనించినవాడా!; అణిమ ఆది = అష్టసిద్ధులు అనగా (అణిమ అతిసూక్ష్మరూపమును మహిమ = అతిస్థూలరూపమును ధరించునట్టి) ఈ మొదలైన; సుగుణ = సమస్త కళ్యాణ గుణములను; భూషణ = అలంకారముగా నుండువాడ; మణిమంటప = మణులచే చేయబడిన మంటపమును; సదన = స్థానముగా గలవాడ; వినతాసుత ఘనవాహన = గరుత్మంతుని వాహనముగా గలవాడ; ముని మానస భవన = మునులయొక్క మనస్సులు ఇల్లుగాగలవాడ; మధుసూదన మధుసూదన హర మామక దురితం = మధుసూదన! నా పాపమును పోగొట్టుము.

3. హలి సోదర! = (హలము) నాగలిని ధరించినందున హలి. అనగా బలరాముడు. బలరాముని తమ్ముడు కృష్ణుడు; అరిభీకర = శత్రువులకు భయంకరముగా నుండువాడు; పరిపూర్ణ సుఖ అబ్ధే! = నిండినటువంటి సౌఖ్యముకు (ఆనందమునకు) సముద్రమువంటివాడ!; నరకాంతక! నరపాలక! = నరకాసురుని సంహరించినవాడా, ప్రజలను పరిపాలించువాడా!; పరిపాలిత జలధే! = సముద్రుని రక్షించినటువంటివాడా; హరిసేవక = నారాయణమూర్తిని సేవచేయుచున్నట్టి; శివ నారాయణ తీర్థ = శివనారాయణ తీర్థులకు; పరాత్మన్ = విలక్షణమైన ఆత్మగలవాడా; మధుసూదన, మధుసూదన, హర మామక దురితం.

వ-అ. దీనులయెడలదయ సేయునాథా! కరుణారసమునకు సముద్రుఁడవు. (అపరిమితకరుణగలవాఁడవు. అనఁగా కష్టపడువారిని జూచి మిగుల వగచువాఁడవు) గజేంద్రునిమొర యాచించి కాపాడిన సదయుఁడవు. నన్ను రక్షింపుము. మధుకైటుభ లనురాక్షసులఁ జంపి లోకహిత మొనరించినస్వామీ! నేఁ జేసినపాపమున నేర్పడిన యీదుష్టదానవభారమును హరించి నన్నుంగాపాడుమీ!

1. నూపురాది (అందెలు) దివ్యాభరణములు ధరించి దివ్యసుందరమూర్తివై కంకణముల ధరించిన శ్రీహస్తమున దేవబ్రాహ్మణులకు నభయమొసంగి కృపతో లోకమును గాపాడుస్వామీ! యీభారము త్వరగా హరించి నన్నుఁ గాపాడుమా!

2. దివ్యకాంతుల నొప్పెడురత్నకుండలముల ధరించినవాఁడవై శేషపర్యంకమునందు శయనించిన స్వామీ! నీవు అణిమ (అతిసూక్ష్మరూపము), మహిమ (అతిస్థూలరూపము) మొదలగు సిద్ధులు గలిగి దివ్యరత్నమండపమున వెలుఁగొందుచున్నవాఁడవు. అయినను యోగులమనంబుల నుండువాఁడవు. వేదస్వరూపుఁ డగుగరుడునెక్కి సంచరించువాఁడవు. (వేదములచే నెఱుఁగఁదగినవాఁడవు)

3. శత్రువుల నణఁచువాఁడవు. బలరామునికిఁ దమ్ముఁడవు. నరకాసురుని వధించినవాఁడవు, పరిపూర్ణమైన యానందము గలవాఁడవు. హరిభక్తుఁడగు శివనారాయణ తీర్థులనియెడు యతీశ్వరుని గాపాడుస్వామీ! నన్నురక్షింపుము.

## బ్రహ్మాదులు భగవంతుని స్తుతించుట

శ్లో. ఇతి వివిధవచోభిః ప్రార్థయంత్యాం ధరణ్యా
మఖిలభువనమిత్రం శత్రుహంతార మీశమ్,
విధిముఖసురవర్యాస్తుష్టువుర్విష్ణు మాద్యం
నిఖిలనిగమవేద్యం స్వార్థసంసిద్ధి హేతుమ్.

## బ్రహ్మాదులు భగవంతుని స్తుతించుట

25 శ్లో॥ ఇతి వివిధ వచోభిః = ఇట్లని అనేకవాక్కులచేత; ధరణ్యాం ప్రార్థయంత్యా = భూదేవి ప్రార్థించుచుండగా; అఖిల భువనమిత్రం = సమస్తలోకములకు మిత్రుడైనట్టిన్నీ; శత్రు హంతారం = శత్రువులను హననము చేయునట్టిన్నీ; ఈశమ్ = సర్వేశ్వరుని (నియమించువారిని) ఇట్లు ప్రార్థించుచుండగా; విధిముఖ = బ్రహ్మ మొదలగు; సురవర్య = దేవతా శ్రేష్ఠులు; అద్యం = అదిపురుషుడైనట్టిన్నీ; నిఖిల నిగమవేద్యం = సమస్త వేదములచేత తెలియబడదగినట్టిన్నీ; స్వార్థ సంసిద్ధి హేతుం = స్వకీయపు పురుషార్థమును సిద్ధింపజేయు కారణభూతుడైనట్టిన్నీ; విష్ణుం స్తుష్టువుః = విష్ణువును స్తోత్రము చేసిరి.

తాత్పర్యము: ఇట్లు భూదేవి సర్వలోకరక్షకుఁడయి దుష్టసంహారకుఁ డగుభగవంతుని స్తుతించుచుండఁగా బ్రహ్మాదిదేవతలు సర్వలోకకారణభూతుఁడై, సర్వవేద వేద్యుఁడై సర్వాభీష్టముల నొసంగునట్టి శ్రీమన్నారాయణుని స్తుతించుచున్నారు.

శ్లో. క్షీరాబ్ధిమధ్య భుజగేంద్ర మహాసనాయ
దేవాయ నాభికమలోదితపద్మజాయ,
యోగీంద్ర భావ్యగగనామలనిత్యబోధ
భూమాభిధాయ పురుషాయ నమఃపరస్మై

26 శ్లో॥ క్షీరాబిద్ధి మధ్య = పాల సముద్రము నడుమను; భుజగేంద్ర మహాసనాయ = శేషశయ్య యేగొప్ప ఆసనముగా గలవాడా; దేవాయ = ప్రకాశించుచున్నట్టిన్నీ; నాభికమల ఉదిత పద్మజాయ = బొడ్డుయందు కమలములో సృష్టిచేయబడిన బ్రహ్మదేవుని కలిగినట్టిన్నీ; యోగీంద్ర = యోగశ్రేష్ఠులచేత; భావ్య = ధ్యానము చేయబడుచుండు; గగన, అమల, నిత్య, బోధ = ఆకాశమువలె, నిర్మలమైన, నిత్యమైనటువంటి జ్ఞానముగలిగిన; భూమాభిధాయ = 'భూమ' అనేపేరు వహించినట్టిన్నీ అటువంటి; పరమైపురుషాయ = పరమపురుషుని కొఱకు; నమః = నమస్కరించుచున్నాము.

తాత్పర్యము: క్షీరసముద్రమధ్యమున శేషపర్యంకమునందు శయనించి నాభికమలము నందు బ్రహ్మనుగని సనకాదియోగులకు నుపాసింపదగిన నిత్యజ్ఞానానంద స్వరూపుడగు పరమపురుషునకు వందనముల నాచరించుచున్నారము.

### శంకరాభరణ (ఆనందభైరవి) రాగము - త్రిపుటతాళము

ప. నారాయణాయ నమో మాధవాయ

అ. నాగేంద్రశయనాయ నందితాఖిలలోకాయ

1. నాభికమలజనిత విధిముఖాయ - నూతనజలధరాభాయ
నానాచరాచర నారీనరరూపాయ
నారాదాదిమునివర్య వందితఘనమాయాయ

2. అగణితగుణగణాయ అగమగేయాయ - విగళితభయశోకాయ
గగననిర్మలబోధగంభీరభావాయ
భగవద్భక్త హృదయపద్మభానురూపాయ

3. కరధృతరథచరణకంబుపంకజ-కౌమోదకీశార్ఙ్గాయ
నిరవద్యగళశోభినిజకౌస్తుభభూషాయ
పరిహృతపరపక్ష పక్షిరాజవాహాయ

4. జగదేక నాథాయ జాతమదనాయ - జితవైరిమండలాయ
నిగమనిశ్వాసాయ నిత్యానందరూపాయ
నిరుపమగోకులనీతనవనీతాయ

5. ఆమయాదివిరహితాయా ఖిలామాయాయ - కామకోటిసుందరాయ
నామరూపరహితాయ భూమస్వరూపాయ
సోమసూర్యనయనాయ సామగానగేయాయ

6. వారిజలోచనాయ వాసుదేవాయ - వరమునిపారిజాతాయ
కరుణాకరభక్త కారుణ్యసారాయ
నారాయణతీర్థనతచరణాబ్జాయ

### 15వ కీర్తన. శంకరాభరణరాగం - త్రిపుటతాళం

ప॥ మాధవ = లక్ష్మీదేవికి భర్త అయినటువంటి, నారాయణాయ = నారాయణుని కొఱకు; నమో = నమస్కరింపుచున్నాను.

అ.ప॥ నాగేంద్రశయనాయ = ఆదిశేషుని మీద పవళించినవాని కొఱకు నమో నందిత అఖిల లోకాయ = అఖిలలోకములు ఆనందింపజేయువాని కొఱకు నమో.

1. నాభికమల జనిత = నాభిరూపకమైన కమలమునందు పుట్టించబడినటువంటి; విధి ముఖాయ = బ్రహ్మాదులను కలిగినటువంటి వాని కొఱకు; మాతన, జలధర, అభాయ = నవీనమైనటువంటి, మేఘముయొక్క, ప్రకావముగలవాని కొఱకు; నానా, చర, అచర = నానా విధములైనటువంటి, స్థావర జంగమ రూపమైన ప్రపంచము అనునట్టి; నారీ నరరూపాయ = స్త్రీరూపముకు భర్తగా నుండువాని కొఱకు; నారద ఆది మునివర్య = నారదుడు మొదలగు మునిశ్రేష్ఠులచేత; నందిత, ఘన,మాయాయ = శ్లాఘించబడిన, గొప్పదైనట్టి, మాయగలిగిన వాని కొఱకు; నమో = నమస్కరింపుచున్నాను.

2. అగణిత = లెక్కపెట్టజాలనట్టి; గుణగణాయ = గుణసమూహములు కలగిన వాని కొఱకు; అగమ గేయాయ = వేదములచేత గానము చేయబడునట్టి వానికొఱకు; విగళిత, భయ శోకాయ = జారిపోయినటువంటి, శోకము గలవాని కొఱకు (భయ శ్లోకములు లేనివాడనుట); గగన, నిర్మల, బోధ = ఆకాశమువలె, ప్రకృతి మాలిన్యము అంటని, జ్ఞానము కలిగినటువంటిన్నీ; గంభీర భావాయ = గంభీర స్వభావముకలిగినటువంటిన్నీ; భగవద్భక్త హృదయ పద్మ = భగవద్భక్త హృదయములను కమలములకు; భానురూపాయ = సూర్యునివలె వుండునట్టిన్నీ (ఇట్టి నారాయణ మూర్తికి నమస్కరింపుచున్నాను.

3. కర, ధృత = శ్రీహస్తములందు, ధరించబడినట్టి; రథచరణ = చక్రమున్నూ; కంబు, పంకజ = శంఖమున్నూ, కమలమున్నూ; కౌమోదకీ = కౌమోదకి అనుపేరుగల గదయున్నూ; శార్ఙ్గాయ = ధనుస్సును కల్గినట్టి వానికొఱకు)

4. జగదేక నాథాయ = జగత్తుకు అంతటికి ఒక్కడే నాథుడుగా వుండువాడున్నూ; అజ, మదన, జాత = బ్రహ్మదేవుని, మన్మథుని కన్నటువంటివాడు; జిత, వైరిమండలాయ = జయింపబడిన వైరి మండలములుగలవాని కొఱకు; నిగమ, నిశ్వాసాయ = వేదములే, నిట్టూర్పులుగా గలవానికొఱకు; నిత్యానందరూపాయ = ఎల్లప్పుడు ఆనందముగలవాని కొఱకు; నిరుపమ, గోకుల =

ఉపమానములేనట్టి, గోకులమునందు; నీత, నవనీతాయ = గ్రహింపబడిన (తీసికొనబడిన) వెన్నముండ్లగలవాని కొఱకు - నమో.

5. ఆమయాది, విరహితాయ = రోగములు మొదలగునవి లేనట్టివాని కొఱకు; అఖిల, మాయాయ = ఎల్ల మాయలుగలవాని కొఱకు; కామకోటి, సుందరాయ = కోటి మన్మధులతో సమానమైన సౌందర్యముగలవాని కొఱకు; నామరూపరహితాయ = లౌకిక నామరూపములు లేనివాని కొఱకు; భూమ, స్వరూపాయ = సర్వవ్యాపక స్వరూపములుగలవాని కొఱకు, సోమసూర్య నయనాయ = సూర్యచంద్రులే కండ్లుగా గలవానికొఱకు, సామగాన గేయాయ = సామవేదరూపకమైన గానముచేత (గానము చేయబడునట్టివాని కొఱకు)

6. వారిజలోచనాయ = కమలములవంటి కన్నులుగలవాని కొఱకు; శ్రీవాసుదేవాయ = సర్వభూత నివాసుడైనవాని కొఱకు; వరముని పారిజాతాయ = శ్రేష్ఠమైన మునులకు పారిజాతమువంటి, కంజవృక్షము వంటివాని కొఱకు; కరుణాకర = కురుణకు ఉనికిపట్టు అయినటువంటిన్నీ; భక్తకారుణ్య రూపాయ = భక్తులయందు దయను జూపునట్టి రూపముగలవాని కొఱకు; నారాయణతీర్థ = నారాయణ తీర్థులవారివల్ల; నత, చరణాబ్జాయ = సేవింపబడిన పాదములు గలవాని కొఱకు నమస్కరింపుచున్నాను.

తాత్పర్యము : ప.అ. 1-6.నారాయణుఁడు (ప్రపంచమునకు లోపలను వెలుపలను నుండువాఁడు), మాధవుఁడు (లక్ష్మీపతి), నాగేంద్రశయనుఁడు (శేషునిమీఁద శయనించువాఁడు) అయినభగవంతునికి వందనములు. మఱియు నాభికమలమునందు బ్రహ్మాదిసకల చేతనులను గనినవాఁడు, సకలస్త్రీపురుష రూపముల ధరించినవాఁడు, క్రొక్కారు మేఘముకాంతి గలవాఁడు నారదాదులచే స్తుతింపఁబడిన మాయగలవాఁడు, ఎన్నరాని యనంతకల్యాణగుణములు గలవాఁడు, వేదములఁ గీర్తింవబడినవాఁడు భయశోకాదిదోషము లించుకైనను లేనివాఁడు ఆకాశమువలె నిర్మలమయిన సత్యజ్ఞానస్వరూపుఁడు, భాగవతులమానసము లనియెడుపద్మములకు సూర్యుఁడు, హస్తములందు శంఖ, చక్ర, గదా, పద్మ శార్ఙ్గముల ధరించినవాఁడు దివ్యకాంతిశోభిత మైనకౌస్తుభరత్నమును కంఠమున ధరించినవాఁడు, శత్రుసంహారకుఁడయిన గరుడుఁడు వాహనముగాఁ గలవాడు, సర్వలోకములకుఁ దా నొక్కఁడే నాథుఁడు, మన్మథుని కన్నవాఁడు, శత్రువుల జయించినవాఁడు, వేదములే నిశ్వాసముగాఁ గలవాఁడు, నిత్యానందస్వరూపుఁడు, గోకులమునందు దివ్య నవనీతము నారగించువాఁడు, రోగాదిశరీరవికారములు లేనివాఁడు, కోటి మన్మథులఁ బోలి చక్కఁదనముగలవాఁడు, లౌకికము లయిననామరూవములు లేనివాఁడు, నర్వవ్యావకన్వరూవుఁడు, చంద్రసూర్యులు నేత్రములుగాఁ గలవాఁడు; సామవేదముచేఁ బాడఁబడువాఁడు, వద్మములవంటి కన్నులుగలవాఁడు వానుదేవుడు, నర్వాంతర్యామి (అనగా నంతటనుండువాడు) మునీంద్రులకుఁ గల్పవృక్షమువంటివాఁడు (కోరినవరముల) నిచ్చువాఁడు, భక్తులయెడ కరుణగలవాఁడు, నారాయణతీర్థునిచే సేవింపఁ బడినవాఁడగు భగవంతునికి వందనము.

శ్లో. ఇతిస్తుత్వా జగన్నాథం కృతాంజలిపుటాస్సురాః,
ముహుర్ముహుర్నమంత స్తమూచుశ్చాత్మహితం వచః

27.శ్లో॥ ఇట్లు జగన్నాథం స్తుత్వా = ఇట్లని, శ్రీమన్నారాయణుని గురించి స్తోత్రముజేసి; కృత+అంజలిపుటా = చేయబడిన చేమోడ్పుగలవారై; ముహుర్ముహుః = మాటి మాటికి; తం, నమంతః = ఆస్వామినిగూర్చి, నమస్కరించుచున్నవారై; ఆత్మహితం = తనకు, మేలగునట్టి; వచః, ఊచుః = వాక్కులను, పలికిరి.

తాత్పర్యము ఇట్లు దేవతలు శిరంబుల యంజలి చేసి స్తోత్రము చేసినవారై మాటి మాటికి నమస్కారములు చేయుచు తమకు హిత మైనవాక్యములు విన్నవించుకొనిరి.

శ్లో. భగవా నపి తా నాహ భక్తినమ్రా నసౌ సురాన్,
అవతీర్య యదోర్వంశే కరిష్యామి హితం తువః.

28.శ్లో॥ అసౌ, భగవాన్, అపి = యీ, స్వామివారు, కూడా; భక్తి, నమ్రాన్ = భక్తిచేత, నమ్రులైన వానినిగూర్చి; తాన్ సురాన్ = (వారలను గూర్చి) ఆదేవతలను గూర్చి;యదోర్వంశే = యదువుయొక్క వంశమునందు; అవతీర్య = అవతరించి; వః హి తంతు = మీకు మేలును; కరిష్యామి, ఆహ = చేసెదను (అని) పలికెను.

తాత్పర్యము : ఇట్లు భక్తిచే నమ్రులయినదేవతలఁ గటాక్షించి భగవంతుఁడు దేవతలారా! భయపడకుండుఁడుః నేను యదువంశమునం దవతరించి మీకు హితము చేసెదను అని ఆనతిచ్చెను.

గ. ఇత్యేవం భగవతో వాసుదేవస్య వదనసుధానిధిగళితాం స్ఫుటతరపద రసమనోహరాం వచనసుధాధారాం సురభూసురబలాధారాం శ్రవణాంజలిపుటైః పాయంపాయం -శనైః శనైః స్వస్వభవనాభిముఖాః - తచ్చరణస్మరణచంద్రి కాపనోదితశోక మోహానలాంధ కారాః - చతురాననాదయస్స ర్వే గీర్వాణాః - కరతలకలితకపిత్థోపమం స్వకార్యం మన్వానా స్సంపూర్ణమనోరథాః - స్వస్వభవనమావివిశుః.

29. గద్య. (ఇతి+ఏవం) ఇత్యేవం = ఇట్లని; భగవతః వాసుదేవస్య = భగవంతుడైన వాసుదేవుని యొక్క; వదన, సుధానిధి = ముఖమనెడు, అమృత సముద్రము నుంచి; గళితాం = స్రవించినదానిని; స్ఫుటతర = కేవలం స్పష్టమైన; పదరస, మనోహరాం = పదస్వారస్యము చేత మనోహరమైనట్టిదిన్నీ; వచన సుధాధారాం = వాక్కులనెడు అమృతధారలను; సుర = దేవతలకు; భూసుర = బ్రాహ్మణోత్తములకు ఆధారమైనటువంటి వాక్యములను; శ్రవణాంజలి పుటైః = చెవులనే దోసిళ్ళచేత; శనైః శనైః = నెమ్మది నెమ్మదిగా; పాయం పాయం = త్రాగుచూ త్రాగుచూ; స్వస్వభవన అభిముఖాః = వారి వారి యిండ్లకు పోవుటకు ఉద్యుక్తులై; తచ్చరణ = ఆశ్రీమన్నారాయణుని చరణములను; స్మరణ = స్మరించుటయనెడి; చంద్రిక = వెన్నెలచేత; అపనోదిత = పోగొట్టబడిన; మోహఅనల

అంధకారాః = శోకమోహ అంధకారములుగలవారై, పత్యురానన, ఉడుపః = [illegible], సర్వే, గీర్వాణాః = సమస్త దేవతలున్నూ; స్వకార్యం = తమయొక్క కార్యము [illegible] = అరచేతియందు వుండునటువంటి, కపిత్థ, ఉపమం = వెలగపండుతో సమానమైనది [illegible] మన్వానాః = తలచినవారై; సంపూర్ణ మనోరథా = కోరికలు పూర్తియైన వారై, స్వస్వ,భవనం = స్వగృహములకు, ఆవి విశుః = ప్రవేశించిరి.

తాత్పర్యము : ఇట్లు శ్రియఃపతియొక్క వదన మనెడుచంద్రబింబమునుండి వచ్చిన స్పష్టము లయి గంభీరమధురము లయిన శ్రీసవాక్కు లనెడు సమస్త[illegible], దేవబ్రాహ్మణాదిసాధుజనబలాధారలను నీను లనెడుచోనిళ్లు తనివి [illegible] భగవత్పాదస్మరణ మనెడువెన్నెలచే శోక మోహము లనెడు [illegible] పరమానందపరిపూర్ణు లయిన బ్రహ్మాదిసురమునిగణములు తమతమ మనోరథము కరతలామలకమువలె సిద్ధముగ నున్న దని నిశ్చయించుకొన్నవారై తమతమ లోకములకుం జనిరి.

శ్లో. దదౌ కంసాయ దేవక్యాశ్శిశుం ప్రథమజ నృపః
అష్టమం స రిపుం మత్వా దదౌ కంసః పునశ్శిశుమ్.

30. శ్లో॥ నృపః, దేవక్యాః = రాజు దేవకీదేవికి; ప్రథమజం, శిశుం = మొదటపుట్టిన బిడ్డను; సః,కంసః = ఆ కంసుడు, అష్టమం రిపుంమత్వా = ఎనిమిదవ శిశువును, శతృవునిగా తలచి; పునః శిశుం = తిరిగి బిడ్డను; నృపాయ, దదౌ = (వసుదేవునికి) ఇచ్చెను.

తాత్పర్యము : అంత వసుదేవుఁడు తొలుత తనకుఁ గలిగినశిశువును కంసునియొద్దకుఁ దెచ్చి యిచ్చెను. కంసుఁడును వీఁడు నాకు శత్రువుగాఁడు. ఎనిమిదవవాఁడు గదా శత్రువు! వాని వధించెద, వీనిఁ దీసికొని పొమ్మనెను.

శ్లో. తద్వృత్తం నారదో జ్ఞాత్వా త్వరయా కంసమందిరమ్,
సమాగతో నిమిత్తజ్ఞశ్శిశూనాం నిధనం ప్రతి.

31. శ్లో॥ తత్ వృత్తం = ఆ సమాచారమును; నారదః, జ్ఞాత్వా = నారదుడు తెలిసికొని; శిశూనాం, నిధనం, ప్రతి = బిడ్డలయొక్క మరణమును, గూర్చి; నిమిత్తజ్ఞః = హేతువును తెలిసినవాడు గనుక; త్వరయా = శీఘ్రముగా; కంసమందిరం, సమాగతః = కంసగృహమునకు, వచ్చినవారైరి; అథ, నారదాగమనం = అనంతరం నారదుడు ప్రవేశించును.

తాత్పర్యము : అవ్వృత్తాంతమును నారదముని దెలిసికొన్నవాఁడై వీరిని జంపించినఁగాని లోకములకు హితము గలుగదని శీఘ్రముగఁ గంసునియొద్దకు వచ్చెను.

*అథ నారదాగమనమ్*

దరువు - పంతువరాళిరాగము - రూపకతాళము

నారాయణ నారాయణ నారాయణేతి సతతం
వారం వారం గాయన్ భక్త్యా నారదో యం విరాజతే

16వ కీర్తన - దరువు

వారం వారం = మాటిమాటికి (పునఃపునః); భక్త్యా, గాయన్ = భక్తిచేత పాడుచూ; అయం, నారదః = ఈ, నారాదుడు; విరాజతే = ప్రకాశించుచుండెను; అథ, కంసప్రతి, నారదవచనం = అనంతరం కంసునిగూర్చి, నారదుడు చెప్పిన వచనం యేమనగా.

తాత్పర్యము : "నారాయణ" అనెడు దివ్యనామమును భక్తితో పలుమరుపాడుచు వచ్చెను.

*అథ కంసంప్రతి నారదవచనమ్*

శ్లో. అష్టానా మష్టమత్వే తు న విశేషోస్తి కశ్చన,
ఉపేక్షసే కథం మూఢ యత్కర్తవ్యం కురుష్వ తత్.
ఏవ ముక్తో నారదేన షట్సుతానవధీత్ఖలః,
సంకర్షణస్తు రోహిణ్యామానీతో యోగమాయయా.

32. శ్లో॥ అష్టానాం = ఎనిమిది మంది శిశువులలో ప్రతి శిశువు యొక్క; అష్టమత్వేతు = ఎనిమిదవవాడుగా నుండుటయందు (అనగా ఎనిమిదవవానికి వీరునహాయులగుదురు) (అకాశవాణిచేత చెప్పబడియుండు ఎనిమిదవవాడుగా నుండుటయందు); కశ్చన విశేషః నాస్తి = ఏ విశేష గుర్తున్నూ లేదు; హే మూఢః = ఓ అజ్ఞాని; కథం ఉపేక్షసే? = ఎట్లు చూస్తూ ఊరకున్నావు?; యత్, కర్తవ్యం = ఏది చేయవలెనో; తత్, కురుష్వ = దానిని (ఆపనిని) చేయుము.

33. శ్లో॥ ఏవం, నారదేన, ఉక్త్వా = ఇట్లు, నారదునిచేత, చెప్పబడినవాడై; ఖలః = దుర్మార్గుడైన కంసుడు; షట్సుతాన్, అవధీత్ = ఆర్గురు పిల్లలను చంపెను; సంకర్షణస్తు = అదిశేషమూర్తి; యోగమాయయా = యోగమాయచేత; రోహిణ్యాం, ఆనీత = రోహిణి గర్భములోనికి, తేబడెను.

తాత్పర్యము : కంసుఁడా! నీ వవివేకముచేత ఈశిశువులఁ జంపకపోతివి గాని వీరిని నుపేక్షింపరాదు. ఎనిమిదవాఁడుగదా! నాకు శత్రువందు వేమో ఎనిమిదవవానికి వీరు సహాయులై వీరందఱు నీకు శత్రువులగుదురు గనుక వీరిని వధింపు మనెను. అంత కంసుఁడు దేవకిబిడ్డల నార్గురిని వధించెను. తర్వాత దేవకి యేడవగర్భమునఁ బ్రవేశించినశిశువును భగవంతునియాజ్ఞచే యోగమాయ వసుదేవుని మఱియొకభార్య యగురోహిణీదేవిగర్భమునం దుంచెను. యోగమాయ తాను గోకులమున నందపత్నియగు యశోదగర్భముఁ బ్రవేశించెను.

*అథ భగవదావిర్భావ :*

దరువు - మాధ్యమావతీరాగము - ఆదితాళము

శంఖీ చక్రీ గదీ పద్మీ శార్ఙ్గీ కిరీటకుండలి
శ్రీవత్సకౌస్తుభీ దివ్య పీతాంబరో విరాజతే

17వ కీర్తన - దరువు మధ్యమావతిరాగం - ఆదితాళం

శంఖీ, చక్రీ, గదీ, పద్మీ = శంఖ, చక్ర, గదా, పద్మములు గలవాడు; శార్ఙ్గీ, కిరీటకుండలి = ధనుస్సు, కిరీటము, కుండలములు గలవాడు; శ్రీవత్స = స్వామివారి వక్షమునందు, రోమములతో యేర్పడినటువంటి శ్రీవత్సమనే గుర్తుగలవాడు; దివ్యకౌస్తుభ = శ్రేష్ఠమైన కౌస్తుభమణి గలిగినటువంటివాడున్నూ; పీతాంబరః = పీతాంబరమును ధరించిన వాడైనటువంటి కృష్ణస్వామివారు; విరాజతే = ప్రకాశించుచున్నారు.

తాత్పర్యము : శ్రీయఃపతి శంఖచక్రగదాపద్మముల ధరించి, శార్ఙ్గమును గరంబునఁ గీలించి, కిరీటదారియై, కర్ణముల మకరకుండలములు శోభిల్ల నురంబున శ్రీ వత్సలాంఛనము భాసిల్ల కౌస్తుభరత్నము మెఱయుచుండ దివ్యపీతాంబరవన మాలావిభూషితుఁడై యొప్పియుండె.

శ్లో. హరిరథ నిజశక్త్యా మూర్తిమాస్థాయ దేవః
ప్రకటితనిజరూపః ప్రాదురాసీన్ముకుందః,
యదుకులవర గేహే దేవకీగర్భవాసా
దుదిత మమరబృందం దేవ మస్తౌ దనంతమ్.

శ్లో. కల్యాణం వితనోతు కౌస్తుభమణిం కంఠే దధానశ్శిశుః
కల్యాణీ మపి మే కరోతు శుభదాంవాణీం ప్రవీణాంధియం,
దేవక్యా వసుదేవయాదవపతే శ్శంఖీ రథాంగీ గదీ
పద్మీ నందకశార్ఙ్గచాపమకుటీ పీతాంబరః కుండలీ.

34. శ్లో॥ అథ, దేవ, హరి = అనంతరమందు దేవుడైన శ్రీమన్నారాయణుడు; నిజశక్త్యా = స్వకీయమైన శక్తిచేత; మూర్తిం, ఆస్థాయ = శ్రీకృష్ణరూపమును, ధరించి; ప్రకటిత నిజరూపః = తన స్వరూపమును ప్రకటించినవాడై; ముకుందః = స్వామివారు; ప్రాదురాశీత్ = అవిర్భవించెను (కనపడెను); యదుకులవరగేహే = యదుకుల శ్రేష్ఠుడైన వసుదేవుని గృహమందు (జైలునందు); దేవకీ గర్భవాసాత్ = దేవకీదేవి గర్భములో నుంచి; ఉదితం = పుట్టినటువంటి (శ్రీకృష్ణస్వామివారిని); అనంతం దేవం = అపరిచ్ఛిన్నమైన స్వరూపముగలిగిన స్వామివారిని; అమరబృంద = దేవతా సమూహము; అస్తౌత్ = స్తోత్రము చేసెను.

35. కౌస్తుభమణిం = కౌస్తుభమణిని; కంఠే, దదానః = కంఠమునందు ధరించినటువంటి; దేవక్యాః = దేవకీదేవి యొక్క, శిశుః = శిశువు అయినటువంటిన్నీ; వసుదేవ, యాదవపతిః = యాదవులకు వసుదేవునకు పతి అయినటువంటి వాడున్నూ; శంఖీ, రథాంగీ = శంఖమున్నూ, చక్రమున్నూ; గదీ, పద్మీ = గదాధరుడున్నూ, పద్మమును ధరించినవాడు; నందక = ఖడ్గమున్నూ; శార్ఙ్గ చాపము = శార్ఙ్గమనే పేరుగల ధనుస్సున్నూ, మకుటము = కిరీటమునున్నూ; పీతాంబరః = పీతాంబరము ధరించినట్టిన్నీ; కుండలీ = కుండలములు ధరించినటువంటిన్నీ (అటువంటి శ్రీమహావిష్ణువు); కళ్యాణం వితనోతు = శుభములను కలుగజేయుగాక! మరియు శుభదాం = శుభమైన భగవన్నామము చేయుచున్నటువంటి (భగవన్నామము చేయుచున్నందువల్ల శుభమైనట్టి); మే, వాణిం = మాయొక్క జిహ్వను; ధియం, అపి = మాబుద్ధి నిన్నీ; ప్రవీణాం = బుద్ధికుశలతను; కరోతు = భగవద్భక్తి యుక్తమగునట్లు చేయుదురుగాక.

తాత్పర్యము : అంత నాదేవదేవుడు కారాగృహంబున నున్న దేవకీగర్భంబున తన దివ్యమంగళ విగ్రహముతో నుదయించి దేదీప్యమానముగఁ బ్రకాశించుచుండ బ్రహ్మాదిదేవతలు స్తుతించిరి.

స్వామీ! శ్రీపతీ! యిట్లు దివ్యాభరణభూషితుఁడవై, శంఖచక్రాది దివ్యాయుధధారివై యీదేవకీగర్భమున నుదయించి మాకు ప్రత్యక్షమైతివి. మేము కృతార్థుల మయితిమి. మామనసున నీస్మరణయే, మావాక్కున నీకీర్తనయే, మాశరీరమున నీకు వందనములే కలుగునట్లు అనుగ్రహింపుము. రక్షింపుము.

కళ్యాణి రాగము - ఆదితాళము

ప. జయ జయ శ్రీనివాస జయ జీమూతాభ - జయజయ
అ. భయకారణ వినాశ భక్తమానసనివాస

1. కమలదళనయన కనకమయవసన
రమణీయచంద్రానన రంజితభువన
కమలావల్లభ దీన కామితఫలనిదాన
కామకోటిసమ మోహన
మంజులకంజవదన మహామోహ మథన
మంగళఫలదాన మౌనీంద్ర బృందాధీన

2. సుందరచరణార విందా మణినూపుర
మంజులముక్తాహార మందరధర
కుందరదన సుర వందిత మనోహర
చంద్రి కాసమస్మేర బాల
నీరదఘననీల పారా వారవిహార పరి
పాలిత భూరా లోకనికర

| 3. | విపులపుండరీ కాక్ష | విశ్వసంత్రాణదక్ష |
|---|---|---|
| | అపహృతాసురపక్ష | ఆర్తసంరక్ష |
| | తాపసజనరక్ష | తారణాధ్వరదీక్ష |
| | ఆపదుద్ధార | కటాక్ష |
| | అశేషదుష్టశిక్ష | నానానిగమలక్ష |
| | నారాయణతీర్థపక్ష | శ్రీగోకులసంరక్ష |

## 18వ కీర్తన కళ్యాణి రాగము - ఆదితాళం

ప॥ జయ జయ శ్రీనివాస = హే శ్రీనివాసమూర్తి సర్వోత్కృష్టముగా వర్తించుదువుగాక; జీమూతాభ దేవేశ = మేఘమువంటి కాంతిగలిగిన దేవేశ!

అ॥ భయకారణ వినాశ = భయములను పోగొట్టునటువంటి; భక్తమానస = భక్తుల మనస్సులయందు; నివాస = నివసించియుండునటువంటి, జయజయ శ్రీనివాస = హే శ్రీనివాసమూర్తి సర్వోత్కృష్టముగా వర్తింపుము.

1. రమణీయ = శృగారమైనటువంటి; కమలా, వల్లభ = లక్ష్మీపతి! ; దీనకా మిత = బీదల కొఱకు, ఫల, నిదాన = ఫలములు యివ్వబడుచుండువాడ; మంజుల = మనోహరమైనటువంటి; కంజ, వదన = కములములవంటి మొగముగలవాడా; మహా మోహ, మధన = గొప్ప అజ్ఞానమును పోగొట్టువాడా; మంగళ, ఫలదాన = శుభమైన కోరికలను యిచ్చునటువంటివాడా; మౌనీంద్ర బృంద = మునులయొక్క సమూహములకు; అధీన = విధేయుడైనవాడ ॥ జయ

2. అరవింద నూపుర = లేత అయిన పదములకు అందెలు గలవాడా; మంజుల = మనోహరమైన; ముక్తాహార = ముత్యపు హారములుగలవాడా; కుందరదన = మల్లెమొగ్గలవంటి పళ్ళుగలవాడా; సురవందిత = దేవతలవల్ల సేవింపబడువాడ; మనోహర = మనస్సును హరింపజేయువాడ; చంద్రిక సమహాస = వెన్నెలతో సమమైన చిరునగలవుగలవాడా; చాల, నీరద = క్రొత్త, మేఘమువలె; ఘన, నీల = దట్టమైన నీలవర్ణముగలవాడా; పరిపాలిత = పరిపాలింపబడుచుండు; భూరాది = భూమి మొదలగునటువంటి; లోక నికర = లోక సమూహములను గలవాడ ॥జయ॥

3. విపుల = విస్తారమైనటువంటి; పుండరీక, అక్ష = తెల్లకలువలతో సమానమైన కన్నులుగలవాడ; విశ్వ, సంత్రాణ దక్ష = లోకములను సంరక్షించుటయందు సమర్థుడా అసురపక్ష. అపహృత = రాక్షస సమూహములను విడిచినవాడా; తారణ, అధ్వర = రక్షించేటువంటి యాగమునందు; దీక్ష = దీక్ష వహించినవారు; ఆప, దుద్ధార, కటాక్ష = ఆపత్తులనుంచి లేవదీయు కటాక్షముగలవాడా; అశేష దుష్ట, శిక్ష = సమస్తరాక్షసులను శిక్షించువాడ; నానా, నిగమ, లక్ష = సమస్త వేదములకు ఆధారమైనవాడా; నారాయణ తీర్థ, పక్ష = నారాయణ తీర్థులయందు అనుగ్రహము గలవాడా; శ్రీ, గోకుల సంరక్ష = సంపత్కరమైన గోకులమును రక్షించినవాడా

ప-అ శ్రీనివాసా! (లక్ష్మికి ఉనికిపట్టు-అనఁగా సర్వకల్యాణపరిపూర్ణతయే లక్ష్మీశబ్దార్థము. అట్టి లక్ష్మికిని భగవంతునికిని నెడబా టెప్పుడును లేదు భగవంతుఁ డనఁగా సర్వకల్యాణగుణ పరిపూర్ణత గలవాఁడనియు, సర్వకల్యాణ గుణపరిపూర్ణత భగవంతునియందే తప్ప మఱి యెచ్చటను లేదనియును, శ్రీ శ్రియఃపతులకు నిరూప్యనిరూపక భావసంబంధము రత్న కాంతి న్యాయముగను పుష్పపరిమళ న్యాయముగను సభియుక్తులు గనినపరమార్థము) జీమూతాభ! (మేఘమువంటి కాంతిగలవాడు. అనఁగా దేహసౌందర్యము సదానుభవయోగ్యమైనది మఱియు మేఘసామ్యముచే మేఘమువలె (సంసార) తాపము హరించువాఁడును, ఆశ్రితమనోరథసస్యముల ఫలింపఁజేయువాఁడు ననియు నర్థము) జయమునొందుమా! సర్వోత్కృష్టుఁడవై యుండుము (అనఁగా నీకు నమస్కారము అని అర్థము)

1 తామరలఁబోలుకన్నులు, చంద్రునిఁబోలు మోమును కలిగి కోటి మన్మథసుందరుఁడై, శ్రీలక్ష్మీదేవికిఁ బ్రియుఁడై, సకలలోకములఁ బాలింపుచు, మునీంద్రమానసములఁ బ్రకాశించుచు, నాశ్రితులు గోరినవరంబు లిచ్చు శ్రీనివాసా! జయజయ

2 తామరలం బోలినయందము లగుపాదంబుల నందెలు ఘల్లు మని మెఱయ, నురంబున ముత్యాలహారము మురువుఁజూపఁ మొల్ల మొగ్గలఁబోలిన పలువరుస భాసిల్ల, బాలచంద్రి కలంబోలు చిఱునగవు మోమునఁ జిందులాడ, తొలుకరి మేఘంబుభాతి నీలసుందర మగుదివ్యమంగళవిగ్రహ మొప్పుచుండ, క్షీరసాగరమున నెలకొని యెల్లలోకములను నేలునట్టి శ్రీనివాసా! జయజయ

3 సర్వలోకములను సంరక్షింపఁగలవాడవై దుష్టులగునసురులను వధించి యాపన్ను లగుసజ్జనులఁ గాచి మునిజనముల రక్షణముఁ జేసి శరణాగతుల రక్షించువ్రతము వహించి తెల్లదామరలంబోలినకన్నులఁ గటాక్షించి లీలావిభూతి నెరపుచు సకలవేదవేద్యుఁడవై గోకులమునం దవతరించి యేకాంబుయు నారాయణతీర్థునివాఁడ వగుశ్రీనివాసా! జయ జయ.

శ్లో. దేవక్యాశ్శిశుభావ మేత్య భగవా న్నారాయణః శ్రీపతిః
సర్వజ్ఞానమహావిభూతిసహితస్సత్ప్రార్థనైః కర్మభిః,
ఆదిత్యేందుసహస్రకోటి సదృశా భాసా గృహం భాసయ న్
పిత్రోస్స్నేహసుధామహోదధిశశాంకో యంహరిర్గీయతే.

36. శ్లో॥ భగవాన్ - భగవంతుడైనటువంటి; శ్రీపతిః = లక్ష్మీభర్త అయినటువంటిన్నీ; సర్వ,జ్ఞాన, మహా, విభూతి, సహిత = సర్వజ్ఞత్వము మొదలగు గొప్ప ఐశ్వర్యములతో కూడుకొని వున్నటువంటి; నారాయణః = శ్రీమన్నారాయణుడు (దేవకీ వసుదేవుల వల్ల చేయబడిన - (అధ్యాహారం), సత్ప్రార్థనైః - శ్రేష్ఠమైన ప్రార్థనుల చేతనున్నూ; కర్మభిః = శ్రేష్ఠమైన కర్మలవల్లనున్నూ అనగా వాటికిఫలరూపముగా, దేవక్యాః శిశుభావం ఏత్య = దేవకీదేవికి తనయత్వమును పొంది: సహస్రకోటి = వెయ్యికోట్ల; ఆదిత్య ఇందు = సూర్యచంద్రాదుల యొక్క; సదృశ, భాస = సమానమైనటువంటి ప్రకాశముచేత; గృహం, భాసయన్ = కారాగృహమును ప్రకాశింపజేయుచు; పిత్రోః = తల్లిదండ్రులయొక్క; స్నేహ, సుధా మహోదధి, శశాంక = స్నేహమునుబట్టి అమృత సముద్రమునకు చంద్రుడనదొప్ప; అయం హరిః గీయతె =ఈ కృష్ణుడు తల్లిదండ్రులవల్ల గానము చేయబడుచున్నా

సత్యజ్ఞానానందస్వరూపుడుపరమపురుషుఁడు అశేష చిదచిదంతర్యామి యగు శ్రీమన్నారాయణుఁడు, సమస్తకళ్యాణగుణైకనిధి యగుశ్రి యఃపతి, దేవకీసుదేవులు పూర్వతరజన్మంబునఁ జేసినతపోవిశేషంబునంజేసి వారికి పుత్రుఁడై కోటిసూర్యచంద్రుల ప్రకాశముతో నవతరించి యాకారాగృహంబును దేదీప్యమానంబుగఁ బ్రకాశింపఁ జేయుచుఁ, దనతల్లిదండ్రుల సంతోషమనెడుసముద్రమునకుఁ జంద్రుఁడై (అనఁగా నపార మైన సంతోషమును మఱిమఱింత వృద్ధినొందించుచు) కటాక్షింపుచుండెను

## కేదారగౌళరాగము - ఆదితాళము

ప. మంగళాలయ మా మవదేవ పంకజాసనభావితభావ

| | | |
|---|---|---|
| 1. | దేవకీవసుదేవతనూజ | దివ్యకిరీట దళితభవబీజ |
| | సర్వయోగివిచింత్యపదాబ్జ | సంగతాఖిలసాధుసమాజ |
| 2. | అపరిమితానందబోధస్వరూప | అతికరుణాకరకరధృతచాప |
| | కపటదైత్యహర ఖండితపాప | కనకాంబరధర కలితకలాప |
| 3. | మకరకుండల కేయూరవిభూష | మనసిజశతకోటిమంజులవేష |
| | వికచకమలసన్నిభ విపులాక్ష | విమలహృదయగోపాలకరక్ష |
| 4. | కలిత శ్రీ కౌస్తుభకమనీయకంఠ | కరుణారసభరమిళితవైకుంఠ |
| | పరిపాలయభువి భాగ్యవితరణ | గురుభక్తనారాయణతీర్థశరణ |

## దేవకీ వసుదేవులు శ్రీకృష్ణుని స్తుతించుట

ప॥ మంగళాలయ [illegible] మంగళములకు స్థానభూతుడైనవాడ హే దేవ, మా, [illegible] ఓ స్వామీ! మనుష్యులు [illegible] పంకజాసన, భావిత, భావ [illegible] ధ్యానము చేయబడుచుండు స్వరూపము గలవాడా.

1. దేవకీ వసుదేవ. తనూజ = దేవకీవసుదేవులకు కుమారుడైనవాడా: దివ్యకిరీట = దివ్యమైన కిరీట ప్రభావముచేత దళిత. భవబీజ = పోగొట్టబడిన అజ్ఞానముగలవాడా. (పోగొట్టబడిన సంసార హేతుక అజ్ఞానము [illegible] పుట్టుట అనే విత్తనము నశింపజేయువాడ. సర్వయోగి విచింత్య పదాబ్జ = సర్వయోగు[illegible] ధ్యానము చేయబడుచుండు పాదకమలములుగలవాడ. సంగత అఖిలసాధు [illegible] సాధు సమూహములయొక్క సమావేశముగలవాడా

[illegible] ఆనంద బోధ స్వరూపా = పరిమితములేని ఆనందమున్నూ, జ్ఞానమున్నూ స్వరూపముగా గలవాడ అనగా (సత్యజ్ఞాన ఆనంద స్వరూపుడా); అతి కరుణాకర = గొప్ప కరుణను చూపించేవాడా; కర ధృత చాప = చేతియందు ధనుస్సును ధరించినవాడా, కపటదైత్యహర = దుర్మార్గులైన రాక్షసులను చంపినవాడా; ఖండిత పాప = పాపులను ఖండించినవాడా; కనక అంబర ధర = బంగారు పీతాంబరము ధరించినవాడా; కలిత కలాపా = ఒప్పుచున్నటువంటి భూషణములుగలవాడా.

3 మకర కుండల కేయూర = మకర కుండలములు, భుజకీర్తులు; విభూష = అలంకరింపచేయబడిన వాడా, ఘనసిజ శతకోటి = నూరుకోట్ల మన్మధులవంటి; మంజులవేష = రమణీయమైన వేషముగలవాడ, వికచకమల = వికసింపబడిన కమలములవంటివాడా, విమల హృదయ = నిర్మలమైన హృదయము గలవాడా; గోపాలక రక్ష = గోపాలకులను రక్షించినవాడా.

4. కలిత శ్రీకౌస్తుభ కమనీయ కంఠ = ఒప్పుచున్నటువంటి కౌస్తుభముచేత మనోహరమైన కంఠముగలవాడా; కరుణారసభర మిళిత వైకుంఠ = కరుణారసముతో నిండి దానితో కూడుకొనియున్నట్టి శ్రీవిష్ణుమూర్తి; భువి భాగ్యవితరణ = భూలోకమునకు భాగ్యమును ఆశ్రితులకు చేర్చుచుండునట్టి స్వామీ; పాలయ = పాలింపుమూ; గురుభక్త శివ నారాయణతీర్ధ శరణ = గురుభక్తి గలిగినటువంటి శివ నారాయణతీర్థులకు రక్షకుడైనవాడా.

అవ. దేవకీవసుదేవులు పరమానందసాగరమగ్నులయి వినుతించుచున్నారు

ప 1-4. మంగళస్వరూపా! శ్రీపతీ! నీవు అపరిమితజ్ఞానానంద స్వరూపుఁడవు. సనకాదియోగులును, బ్రహ్మాదిదేతలును నీమహిమనుగనలేరు. అట్టివాఁడవు మాగర్భమున నీచీఁకటింట నుదయించుట యేమి? ఈ దివ్యకిరీట రత్న ప్రకాశమేమి? ఈపీతాంబరసుందరదివ్యమంగళ విగ్రహమేమి? ఈకౌస్తుభ వనమాలాలంకృతవక్ష మేమి? ఈమకరకుండల ప్రభావిభాసితకపోలమేమి? ఈకనుదామరల విలాసము లేమి? సకలదుష్టతమంబులం బారదోలునీదివ్య తేజః పుంజమేమి? ఆశ్చర్యముగ నున్నది. దీనుల మగుమమ్ముఁ గావుము. భూమియందు గురుభక్తి విశేషముగల నారాయణతీర్థమునికి రక్షకుఁడవు కమ్ము.

శ్లో. అలౌకిక మిదం రూప మాలోక్యానకదుందుభిః,
హరేస్సభార్యః ప్రోవాచ కంసాద్భీత స్త్వధీరధీః.

37. శ్లో॥ ఆనకదుందుభిః తు = వసుదేవుడు అయితేనో; సభార్యః = భార్యాసహితుడై; హరేః = శ్రీహరియొక్క; ఇదం అలౌకికం రూపం = ఈ లోకాతీతమైన రూపమును; ఆలోక్య = సేవించినవాడై; కంసాత్భీతః = కంసునివలన భయపడినవారై; అనన్యధీ = శ్రీహరికంటె అన్యమునందు బుద్ధిచొరనివాడై; ప్రోవాచ = విన్నవించెను.

శ్లో. సర్వాధార రమాపతే థ భవతాతచ్చింతనీయం విభో
యత్కర్తవ్య మశేషశేషవిభునా బ్రహ్మాణ్యరక్షావిధౌ
ఏవం రూప మమానుషం మునివర ధ్యేయం సమాచ్ఛాదయ
స్వామిన్మానుషబాలభావ మధునానందర్శయాస్మాన్ ప్రతి.

38. శ్లో॥ సర్వాధార = సమస్తమునకు ఆధారుడైనటువంటి; హే రమాపతే = లక్ష్మీపతి అయినటువంటి; హే విభు = హే సమర్థుడా; హే స్వామీ; అద్య = ఇప్పుడు, బ్రాహ్మణరక్షావిధౌ = బ్రాహ్మణ సమూహములను రక్షించునట్టి ప్రకారమునందు; అశేష శేష, విభునా = సర్వము సొత్తుగా గలిగిన, విభూ, భవతా = సమర్థుడైన మీచేత, యత్కర్తవ్యం = ఏది చేయబడ తగియున్నదో, తత్ చింతనీయం = అది, ఆలోచించబడతగినది; ఏవం, రూపం, అమానుషం = ఈ ఆకారమును మనుష్యులు చూచుటకు సాధ్యముకానిదన్నీ; మునివరధ్యేయం = మునులవల్ల ధ్యానింపబడతగినదన్నీ అయినటువంటి యీరూపమును; సమాఖ్యాదయా = కప్పివేయుండి (దాచండి); స్వామిన్ అధునా = హేస్వామీ (ఓ తండ్రి) యిప్పుడు; మానుషబాలభావం = మనుష్య బాల రూపమును; అస్మాన్ ప్రతి = మమ్ములను గురించి; సందర్శయా = చూపించవలసినది.

అవ. ఇట్లు వసుదేవుఁడు తదేకచిత్తముతో భగవంతునిదివ్యమంగళ విగ్రహమును సేవించి కంసునివలన భయము నొందినవాఁడు గావున విన్నవించుకొనుచున్నాఁడు.

శ్రియఃపతీ! సర్వాంతర్యామి వగునీవెఱుంగరానిది గలదే? సర్వేశ్వరుఁడవగునీవు దేవబ్రాహ్మణరక్ష యెటులఁ జేయనగునో! అయ్యదియానతిమ్ము. మఱియు మహాతపస్సంపన్ను లగుమునీంద్రులకు గమ్యమైన నీదివ్యరూపమును దర్శింప శక్తులముగాని మాకు మనుష్య బాలరూపమును జూపుము.

ముఖారిరాగము - అట తాళము

| | | |
|---|---|---|
| ప. | రక్ష రక్షాసురశిక్ష | రాజీవదళాయతాక్ష |
| | అక్షీణకృపాకటాక్ష | ఆశ్రితపక్షసంరక్ష |
| 1. | సర్వమనోరథాధ్యక్ష | సర్వలోకావనదక్ష |
| | సర్వవేదాంతైకలక్ష | సర్వయోగీంద్ర సంరక్ష |
| 2. | అప్ర మేయబలవీర్య | అనుపమమహౌదార్య |
| | అపరిమితగాంభీర్య | అవ్య యాఖండితైశ్వర్య |
| 3. | అచ్యుతానంత గోవింద | అత్యంత నిర్మలానంద |
| | విచ్యుతసంసారకంద | విశ్వమంగళ ముకుంద |
| 4. | పతితజనపావన | పంకజసుందరానన |
| | పతగపతివాహన | పండితపరిపాలన |
| 5. | తావక రూపముదారం | ధారయ శాంతసంసారం |
| | దర్శయ మానుషాకారం | దేవ బాలకశరీరం |
| 6. | చింత యాథ యద్విధేయం | చేతసా చిరమనుభావ్య |
| | అంతరాయో మాభూ దద్య | ఆగమబృందసంవేద్య |

7. అద్య మే జన్మసాఫల్యం అద్య మే వంశనైర్మల్యం
సద్య ఏవ సమజని సంభూతే త్వయి భూమని

8. కలికల్మషనాశనం కామితఫలనిదానం
నారాయణీయచరితం నారాయణతీర్థగీతం

20వ కీర్తన ముఖారిరాగం - ఆదితాళం

ప॥ అసుర శిక్ష = రాక్షసులను శిక్షించువాడా, రక్ష రక్షా = రక్షింపుము రక్షింపుము; రాజీవదళ = తామరకమలములదళమువలె, అయత అక్ష! = విశాలమైనటువంటి నేత్రములుగలవాడా.

అ॥ అక్షీణ కృపాకటాక్ష = క్షీణించని కృపాకటాక్షముగలవాడా, ఆశ్రితపక్ష సంరక్ష = ఆశ్రితుల పక్షమును (అనగా ధర్మమును రక్షించేవాడా)

1 సర్వమనోరధ అధ్యక్ష = సర్వమనోరధములకు ఫలప్రదాత అయినవాడ; సర్వలోకైక సంరక్ష = సర్వలోకములను ఏకరూపముగా రక్షించువాడ; సర్వవేదాంతైక లక్ష్య = సర్వఉపనిషత్తులచే ముఖ్యార్థముగా ప్రతిపాదింపబడువాడ; సర్వయోగీంద్ర సంరక్ష = సర్వయోగీంద్రులను రక్షించేవాడ.

2. అప్రమేయ బలవీర్య = ఇంతఅని లెక్కపెట్టలేని బలపరాక్రమముగలవాడ; అనుపమ (అతులం0 = ఇంత అని చెప్పుటకు అలవిగాని; మహా + ఔదార్య = గొప్పదైన ఉదారత్వముగలవాడా; అపరిమిత గాంభీర్య = పరిమితములేని గాంభీర్యత్వముగలవాడ; అవ్యయ = వ్యయముగాని, తరుగని, నాశములేని; అఖండిత ఐశ్వర్య = తెంపులేని (విచ్ఛిన్నములేని) యడతెగని ఐశ్వర్యముగలవాడ.

3. అచ్యుత = చ్యుతములేనివాడ, నాశములేనివాడ; అనంత గోవింద = అంతములేనివాడ; గోవులకు విందుచేయువాడ; అత్యంత నిర్మలానంద = అత్యంతమన, నిర్మలమైన, ఆనందముగలవాడా; సంసార కంద విచ్యుత = సంసారమను మూలదుంపను విడపించువాడా; విశ్వమంగళ ముకుంద = విశ్వమునకు శుభమును యిచ్చువాడా (ముక్తిం దదా తితి ముకుంద)

4. పతితజన పావన = పాపాత్ములగు జనులను (ధర్మమార్గమున నుండి జారిపడినవారు) పవిత్రము చేయువాడ; పంకజ సుందర ఆనన = తామర కమలములవంటి శృంగారమైన మోముగలవాడా; పతగపతివాహన = పక్షులరాజగు గరుత్మంతుని వాహనముగాగలవాడా; పండిత పరిపాలన = పండితులను పరిపాలించేవాడ (యోగక్షేమములను విచారించువాడ)

5. ఉదారం = ఔదార్యగుణ సంయుక్తమైన; శాంత సంసారం = సంసారతాపత్రయమును శాంతింపజేయునట్టి; తావక రూపం = మీయొక్క స్వరూపమును; ధారయ హేదేవ = దాచివుంచి ఓస్వామీ; మానుషాకారం = మనుష్యరూపముతోకూడిన; బాలక శరీరం, దర్శయ = శిశుప్రాయమైన రూపమును చూపుమా.

6. అథ, యతు, విధేయం = అనంతరం దేనిని చేయవలసినట్టు యేర్పడుచున్నదో; చిరం అనుభావ్యం = చాలాకాలము నుంచి అనుభవింపబడు స్థితి గలిగినటువంటిదానిని; చేతసా, చింతయా =

బుద్ధిబలముచేత ఆలోచించుమా; హే ఆగమబృంద సంవేద్య = వేదసమూహముపలన తెలియబడదగినవాడా; అద్య అంతరాయః = ఇప్పుడు విఘ్నము; మా, అభూత్ = జరుగకుండా వుండుగాక

7. అద్య, మే, జన్మసాఫల్యం = ఇప్పుడు నాయొక్క జన్మము సఫలమైనది. అద్య,మే, వంశ, నైర్మల్యం = ఇప్పుడు నా వంశము నిర్మలత్వము పొందినది; భూమని, త్వయి = భూమి స్వరూపమైనటువంటి మీరు; సంభూతే = అవతరంచిగా; సద్యఏవ = తక్షణమే; సముజాని = (మే జన్మసాఫల్యం, మే వంశనైర్మల్యం) కలిగినది.

8. నారాయణ తీర్థగీతం = నారాయణతీర్థులు అనేయతివల్ల గానము చేయబడినట్టి; నారాయణీయ చరితం = శ్రీమన్నారాయణుని చరిత్రము; కలికల్మషనాశనం = కలియుగ సంబంధమైన కల్మషమును నాశము చేయునట్టిన్నీ; కామిత ఫలనిధానం = కోరిన కోరికలను యిచ్చునట్టిదిన్నీ అగుచున్నది.

*అవ. మఱియు స్తుతించుచున్నారు.*

*ప-అ. ఓపుండరీకాక్షా! ఈకంసాదిదుష్టరాక్షసులఁ బరిమార్చి రక్షింపుమా!*

1. సర్వవేధాంతములును నిన్నే ప్రతిపాదించుచున్నవి. సకల యోగీశ్వరులమనంబుల నెలకొని యనుగ్రహించువాఁడవు. సమస్తలోకములఁ గాచువాఁడవు సమస్తఫలముల నిచ్చువాఁడవు నీవే.

2. స్వామీ! జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనెడుషడ్గుణ వర్ణుఁడు భగవంతుఁడని చెప్పఁబడినవచన ప్రకారము ఈయాఱుగుణములును నీయందే పరిపూర్ణముగ నుండుటంజేసి నీవేభగవంతుడవు (ఇతరులయందే గుణములు లేకయుండుటంజేసి) భగవచ్ఛబ్ద మౌపచారికము.

3. అచ్యుతా! అనంతా! గోవిందా! నిత్యనిర్మల మయినయానందము గలవాఁడవు. సంసారమునకు మూలమయిన కర్మ లేశము లేనివాఁడవు. సర్వవ్యాపకుఁడ వయిన నందలిదోషము లంటనిమంగళమూర్తివి.

4. గరుడవాహనారూఢుఁడవై దివ్యసుందరమంగళ విగ్రహముతో వేంచేయు నిన్ను సేవించినవారు జ్ఞానులైనను,జ్ఞానహీనులైనను పవిత్రులగుదురు.

5. స్వామీ! ఈదివ్యాద్భుతరూప ముజ్జగింపుము. లోకసామాన్యమగు మనుష్య బాలుఁడవై కనఁబడుము.

6. తరువాతఁ జేయవలసిన కార్యమును జక్కఁగ యోచించి చెప్పుము. కాలవిళంబము గారాదు. (కంసుఁడు కాచియున్నాఁడు) వేదవేద్యుఁడవగు నీకుఁ దెలియరానిదిలేదు.

7. స్వామీ! ఇఁక నాజన్మము సఫలమైనది. నావంశము పవిత్రమైనది. ఇపుడు నీ వవతరింపఁగనే లోకముల కెల్ల మంగళము గలిగినది.

8. ఇట్లు కలిదోషములు నశింపఁజేయునదియు, ఇష్టకార్యసిద్ధి గలిగించునదియు నగు శ్రీమన్నారాయణచరిత్రమును శ్రీనారాయణముని గానము చేసెను.

## వసుదేవుడు భగవత్ప్రేరణచేఁ గృష్ణుని గోకులమునకుఁ జేర్చుట

శ్లో.న ఇతి నిగదతి తస్మిన్ యాదవేంద్రే సభార్యే
భవభయతిమిరారి ర్దేవకీభాగ ధేయమ్,
సకలనిగమగుహ్యం దర్శయన్ స్వీయభావం
పరమకరుణయా తౌ స్వాంతయన్నేతదాహ.

39. శ్లో॥ సభార్యే = భార్యా సహితుడైనట్టి; తస్మిన్, యాదవేంద్ర = ఆ యాదవశ్రేష్ఠుడు అయిన వసుదేవుడు; ఇతి, నిగదతి = ఇట్లు చెప్పుచుండగా; భవ భయ తిమిరారిః = సంసారభయమను చీకట్లకు విరోధి (సూర్యుని వంటివాడున్నూ); దేవకీ భాగధేయం = దేవకీ దేవి యొక్క పూర్వతపః ఫలమున్నూ; సకల నిగమ గుహ్యం = సమస్త వేదరహస్యమైనట్టి (కృష్ణుడున్నూ); స్వీయభావం, దర్శయన్ = తన స్వరూపమును చూపించుచు; పరమ కరుణయా = మిక్కిలి దయచేత; తౌ, స్వాంతయన్ = వారిద్దరిని, ఊరడించుచు; ఏతత్, ఆహ = ఈక్రింద చెప్పబోవు విధముగా పలికెను.

ఇట్లు మహానుభావు లగుదేవకీవసుదేవులు. విన్నవించుకొనఁగా సంసార భయములఁ దీర్చువాఁడును, దేవకీదేవి చేసిన పుణ్యరాశి యగుశ్రియఃపతి వారి యెడ మిగులఁ గరుణించి సర్వవేదరహస్యమయిన తనమహిమను దెల్పుచు వారి నాదరించుచు నిట్లని యానతిచ్చె.

పూరికల్యాణిరాగము (సావేరి) - ఆదితాళము

ప. అవధారయ మామీశ్వరం దేవాదిదేవం - అవధా

అ. తవ తాత తపసా సంతోషితో హం
తావకతనయాత్మనావనౌ సమవతీర్ణాఖిలసారం

1. ఆగమాంతైకమానక మనన్యభావం
అగణితలోకనాయకం
విగళితమోహ మేకం విమలయోగితారకం
గగనాకారక మేకం గతాగతనివారకం

2. మధురాపురం సమానయ మామకయోగ
మాయా మిహ నిధాపయ
అథ గోకులే నయ మా నవద్యనందాలయం
విధినా కృతనిలయం వివిధ యోగిసుగేయం

3. సంకర్ష ణాఖ్యమవ్యయం సాధువిధేయం
సంభూతమాశ్రితాభయం
శృంగారాదినిలయం శ్రీరామనామధేయం
సంగతం మత్సహాయం సర్వలోకాభ్యుదయం

4. సురవైరిభూరిసంకులం ధరణీతలమిద మ
సురహరణోద్యమం
పరిభావయ మామితి పరమాత్మగీత మిహ
వరనారాయణతీర్థవిరచిత మేతదితి

## 21వ కీర్తన పూరి కళ్యాణిరాగం - ఆదితాళం

ప॥ మాం ఈశ్వరం = నన్ను, సర్వనియామకునిగాను; దేవాది దేవం = సమస్తదేవతలకు ఆదిదేవునిగాను; అవధారయ = తెలిసికొనుము.

అ॥ తాత, తవతపసా = హేతండ్రీ! మీయొక్క తపస్సుచేత; అహం సంతోషితః = నేను, సంతోషించినవాడనై; తాదక, తనయాత్మనా = నీయొక్క కొమరుని రూపముచేత; అవనౌ = భూమియందు; సమవతీర్ణం = లెస్సగా అవతరించినటువంటి; అఖిలసారం = సమస్తజగత్తునకు సారభూతమైనటువంటివానిగా; అవధారయ = తెలియుమా.

1. ఆగమాంత = (ఉపనిషత్తులైన) వేదాంతరూపమైన; ఏకమానకం = ముఖ్యమైన ప్రమాణముగలవారు; అనన్యభావం = అన్యమును చెందని స్వరూపముగలవారు; అగణితలోకనాయకం = లెక్కపెట్టుటకు సాధ్యముకాని (అనంఖ్యాకం) లోకములకు నాయకుడు); విగళిత మోహావేగం = మోహములేనటువంటిన్నీ, ముఖ్యమైనటువంటి; విమలయోగి = నిర్మలమైన యోగులను; తారకం = తరింపజేయువాడు; గగనాకారకం ఏకం = ఆకాశమువలె యితర వస్తువులతో చేరి చేరక యుండువాడును; గతాగత నివారకం = చావుపుట్టుకను వారింపజేయువాడును (మోక్షప్రదుడును).

2. మాం గోకులే = నన్ను గోకులమందు; విధినాకృత = దైవయోగముచేత నిర్మింపబడిన; నిలయం = స్థానమైనటువంటిన్నీ; వివిధయోగి సుగేయం = అనేక విధయోగులచేత లెస్సగా గానము చేయబడుచున్నటువంటిన్నీ; అనవద్య నందాలయం = దోషరహితమైనటువంటి నందగృహమును గూర్చి; నయ = చేర్చుమా; అథ మామక యోగమాయయా = అనంతరము నాయొక్క యోగమాయదేవి అవతారరూపమైన ఆడశిశువును; మధురాపురం సమానయా = మధురాపురమును గూర్చి తీసికొనిరమ్ము.

3. సాధువిధేయం = పెద్దలకు విధేయుడున్నూ; శృంగారాదినిలయం = సౌందర్యము మొదలగు సద్గుణములకు ఉనికిపట్టు అయినవాడును; శ్రీరామ నామధేయం = 'శ్రీరామ'యను పేరుగలవాడున్నూ; సంగతం మత్సహాయం = పొందబడిన నా సహాయభూతుడున్నూ; సర్వలోకా = సమస్తలోకములకు; అభ్యుదయం = మంగళ స్వరూపుడున్నూ; ఆశ్రితఅభయం = ఆశ్రయించిన భక్తులభయము దీర్చువాడున్నూ; అవ్యయం = నాశరహితుడున్నూ అగు; సంకర్షణాఖ్యం = సంకర్షణనే పేరుగల (బలరామునిగా); సంభూతం అవధారయ = పుట్టిపున్నట్టు తెలియుమా.

4. ఇదం ధరణీతలం = ఈ భూలోకము; సురవైరి భూరి సంకులం = రాక్షసులతో నిండివున్నదనిన్ని; మాం అసురసంహరణ ఉద్యమం = రాక్షస సంహరణ ప్రయత్నముగలవానినిగా; పరిభావయా = తలంచుమా; ఇతి ఇహ = ఇట్లని యిక్కడ, పరమాత్మగీతం = శ్రీకృష్ణస్వామి వారిచేత చెప్పబడిన వాక్యము అని; ఏతతు వర = ఈకీర్తన శ్రేష్ఠమైనటువంటి; నారాయణ తీర్థ = నారాయణతీర్థులవారివల్ల; విరచితం = రచింపబడినది.

ప. అయ్యా! వసుదేవా! నేను బ్రహ్మాదిదేవతలకును దేవుఁడను, సర్వేశ్వరుఁడను.

అ. పూర్వము మీరు చేసినతపంబునకు మెచ్చి (పూర్వము మీరు నా వంటిపుత్రుఁడు కావలయునని కోరఁగా నావంటివాఁడు మఱియొకఁడు లేనందున మీయాదరణను బట్టి యింతకముందు మీకు రెండుజన్మములఁ బృశ్నిగర్భుండన, వామనుం డనఁ బుత్రుండ నై యిప్పుడు (మూఁడవజన్మమున) పరిపూర్ణమైన యవతారముతో) మీకుఁ బుత్రుఁడనైతిని.

1. నన్ను (నామహిమను) వేదాంతము (ఉపనిషత్తు) లయందె ఎఱుంగవలయును. ప్రపంచమున నాకన్న వేఱు లేదు. నేనే సర్వలోకములకు స్వాభావికనాయకుఁడను. మఱియు అవిద్యాదిదోషములు నన్నంటవు: నన్నొకనినే యుపాసించి యోగీశ్వరులు తరించుచున్నారు. నే నన్నిటియందున్నను వాని దోషములెవ్వియు ఆకాశమునకంటనట్లు నాకంటవు. నేనే మోక్షప్రదుఁడను.

2. నన్నుఁ దీసికొని పోయి నందగోకులమునందు నందునియిల్లాలగు యశోదపాదిగిట నునిచి ఆయమ్మగనిన యాఁడుబిడ్డను నాయోగమాయను దెచ్చి యిట నుంపుము.

3. అట గోకులమున నందునియింటనున్న నీసతి రోహిణియందు నాయంశచేతను, శేషాంశచేతను పుత్రుఁడుదయించినాఁడు. అతండు ఆశ్రితుల భయముఁ దీర్చువాఁడు, సజ్జనులకు విధేయుఁడు, శృంగారరసప్రధానుఁడు, "రామ" అనురమణీయనామము గలవాఁడు, సర్వలోక శుభంబొనరించుటకై నాకు సహాయముగ నుదయించినవాఁడు.

4. ఈభూమియందు దుష్టరాక్షసులు రాజులుగఁ బుట్టిప్రజల బాధింపవారిం బరిమార్చుటకు నవతరించినవాఁడను. ఈగీతము నారాయణతీర్థులు (ఇప్పుడు) పాడినది.

శ్లో. సుప్తేషు కంసదూతేషు ద్వారేషూద్ఘాటితేషు చ,
మదాజ్ఞయా యమునయా దత్తమార్గేణ మాం నయ.

40.శ్లో॥ కంసదూతేషు = కంసదూతలు; సుప్తేషు = నిద్రబోవుచుండగా; ద్వారేషు = ద్వారములు; ఉద్ఘాటితేషుచ = తాళములు విడి దోవనీయగా; మదాజ్ఞయా = నా ఆజ్ఞచేత; యమునయా = యమునచేత; దత్త = యివ్వబడిన; మార్గేణ = మార్గముద్వారా; మాం నయ = నన్ను తీసికొని వెళ్ళుమా.

వసుదేవా! కంసునిభటులు గాఢముగ నిద్రఁబోవుచున్నవారు. ద్వారములు తెరువఁబడును. నాయాజ్ఞచే యమునానది మార్గమిచ్చును. నన్నుఁగొనిపొమ్ము.

శ్లో. ఇతి కథితవ తీశ్వరే తథైవ
ప్రణయవశా దకరోద్యదుప్రవీరః
సుఖమధివసతిస్మ గోకులాఖ్యం
హరిరఖిలాంతరచిత్ప్రభో పి మాయీ

41. శ్లో॥ ఇతి = ఇట్లని; ఈశ్వరే = సర్వేశ్వరుడు; కథవతి = చెప్పగా; యదుప్రవరః = యదు శ్రేష్ఠుడైనటువంటి వసుదేవుడు; ప్రయణయవశాత్ = స్వామివారిచేత అనురాగము వుండుటచేత; తథైవ = అ ప్రకారముగానే; అకరోతు = చేసెను; అఖిలాంతర చిత్ప్రభోఽపి = సమస్త హృదయములయందు వెలుగుచుండె; చిత్‌ప్రభు = జ్ఞానరూపమైనటువంటివాడైనను; మాయి = మాయకుడైనందున; హరి = శ్రీమన్నారాయణమూర్తి; గోకులాఖ్యాం = గోకులమనే పేరుగలిగిన పల్లెయందు; సుఖం అధివసతిస్మ = సుఖముగా వశించెను.

తాత్పర్యము : ఇట్లు భగవంతుఁ డానతీయఁగా వసుదేవుఁడు భగవదాజ్ఞాప్రకారము చేసెను. శ్రీహరియు, సర్వాంతర్యామి యైనను లీలామానుషవేషముఁదాల్చి గోకులమునందు సుఖముగ నివసించియుండెను.

## దుర్గావిలాసము

*అథ మథురాయాం య ద్వృత్తంత దుపవర్ణ్యతే*

గ. సఖలు నరపతే రుగ్రసేన స్యాగ్రిమసూనుః - సమధిగతాసుర ప్రకృతికః-కంసాసురనామా - అవినయదుర్విభావ్యగర్వమ దాంధ కారపరిభూతవివేకదర్శనః - పరిహృతకాలనేమిక ళేబరో ప్యపరిహృతతద్వాసనాజాలపరివేష్టితః - నిజపరిజనైస్సత్వర మవబోధితస్సన్ - అతిమందగతి రప్యమందగతిః - దేవక్యా స్తత్వష్టమో గర్భః కంసమృత్యు రిత్యశరీరవాక్యం శ్రుత మనుసందధానో - వేపనో వసుదేవమందిర మిందిరా సుందరమాజగామ.

42. గద్య - సహ = ఆకంసుడు; నరపతే ఉగ్రసేనస్య = రాజైన ఉగ్రసేన మహారాజుకు; అగ్రమ సూనుఃఖలు = పెద్దకుమారుడుగదా; సమధిగతః = లెస్సగా పొందబడిన; అసుర ప్రకృతికః = రాక్షస స్వభావముగలవాడు; కంసఅసుర నామ = కంసాసురుడు అనుపేరుగలవాడు; అవినయ = వినయములేనివాడు; దుర్విభావ్య = భావింపబడుటకు వీలుగాని దుర్మార్గముగలవాడు; గర్వమద అంధకార = గర్వము మదము అను చీకట్లచేత; పరిభూత = జయింపబడినది; వివేకదర్శనః = జ్ఞానముగలవాడు అనగా అజ్ఞాని అనుట; పరిహృత = త్యజింపబడిన; కాలనేమి కళేబర = కాలనేమి యను రాక్షస శరీరముగలవాడు; అపి = అయినప్పటికి; అపరిహృత = విడిపించబడని; తత్ వాసనాజాల = ఆ వాసన సమూహములచే; పరివేష్టిత = చుట్టుకొనబడియుండువాడు; నిజపరిజనైః = తన పరిచారకులచేత; సత్వరం = మిక్కిలి త్వరగా; అవబోధితఃసన్ = మేలుగొలుపబడినవాడు అగుచు; అతి మందగతిఃఅపి = మిక్కిలి నెమ్మతి నడకగలవాడు అయినప్పటికిని; అమందగతిః =

మిక్కిలి త్వరగా; దేవక్యాః = దేవకీదేవి యొక్క; అష్టమోగర్భః = ఎనిమిదవబిడ్డ; కంసమృత్యుః = కంసుడికి మృత్యుదేవత; ఇతి = ఇట్లని చెప్పబడినట్టి; అశరీరవాక్యం = ఆకాశవాణి పలుకులు (అనగా); శ్రుతం = తనచేత యిదివరకు వినబడియున్న దానిని; అనుసంధానః = అను సంధానము చేయుచున్నవాడై స్మరించు చున్నవాడై; వేపమానః = గడ గడ వడకుచున్నవాడై; ఇందిరాసుందరం = లక్ష్మీయుక్తమైన; వసుదేవ మందిరం = వసుదేవుని గృహమును గూర్చి; ఆజగామ = వచ్చెను.

ఇట మధురానగరమునం దుగ్ర సేనరాజునగ్రపుత్రుఁడు కంసుఁడు రాక్షసస్వభావము గలవాఁడై, గడుసుఁదనము గర్వము మదము అవివేకము మొదలగు దుర్గుణములు మెండు గాఁగలవాఁడై, ఆకాలనేమిజన్మము పోయినను మరల నాచేష్టలు నాస్వభావము విడువనివాఁడై గోకులమునుండి తెచ్చిన స్త్రీ శిశువేడ్వఁగానే మేలుకొనిన కావలివారలు విన్నసంగతి చెప్పఁగా నదరిపడి లేచి కాళ్లు తొట్రుపడ, గుండె జల్లుమన, దేహము కంపింప తొలుత నాకాశవాణి చెప్పిన వాక్యమును దలపోయుచు దేవకీవసుదేవులుండిన యింటికిఁజేరెను.

శ్లో. భాగినేయీ మసౌ దృష్ట్వా దుష్టాత్మా తత్ర మందిరే,
గృహీత్వా పాద మేతస్యాః క్షేప్తుం భూమౌ మనో దధే.

43. శ్లో॥ అసౌ దుష్టాత్మా = ఈ కంసుడు; తత్రమందిరే = ఆ గృహమునందు; భాగినేయీం = మేనకోడలిని; దృష్ట్వా = చూచినవాడై; ఏతస్యాః = ఈ ఆడశిశువుయొక్క; పాదం గృహీత్వా = పాదములను పట్టుకొని; భూమౌ క్షేప్తుం = భూమికి విసరికొట్టుటకు; మనోదధే = మనో నిశ్చయము చేసెను.

తాత్పర్యము : ఆదుష్టాత్ముఁ డాయింటనున్న మేనగోడలిని గాళ్లవట్టుకొని లాగి భూమిమీఁద కొట్టఁదలఁచెను.

శ్లో. పదా సంతాడ్య కంసం సా యోగమాయా సుదుర్జయమ్.
అంతరిక్షం గతా విష్ణోర్దుర్గా భూత్వా స్తుతా మరైః

44. శ్లో॥ సా యోగమాయా = ఆ యోగమాయాదేవి; సుదుర్జయం = కేవల దుర్నీతిపరుడైన; కంసం పదా = ఆ కంసుని పాదములచేత; సంతాడ్య = తన్ని; అంతరిక్షంగతా = ఆకాశమును పొంది; విష్ణోః = విష్ణువుకు సంబంధించిన; దుర్గాభూత్వా = దుర్గాదేవి అయి; అమరైఃస్తుతా = దేవతలచేత స్తోత్రము చేయబడెను.

తాత్పర్యము : ఆయోగమాయ వానిచేతనుండి తప్పించుకొని వాని గాలఁదన్ని దివికెగిరి యట నష్టభుజమహాదుర్గయై దేదీప్యమాన యై విలసిల్లుచుండె. సురమునిగణంబులు వచ్చి నానావిధంబుల స్తుతించుచుండిరి.

శ్లో. దుర్గే దుర్గతహారిణే త్రిజగతాం సర్గాదిసిద్ధార్థకే
స్వర్గాదీష్టఫల ప్రదాననిపుణే త్రాయస్వ నశ్శంకరి,
సాత్వం సర్వజనాంతరాంతరచిదంశానన్యసిద్ధాత్మికా
సారాసారవివేకదృష్టి విదితా సర్వైక సాక్ష్యాత్మనా.

45. శ్లో॥ దుర్గే = హే దుర్గాదేవి; దుర్గతిహారిణి = దుర్గతిని తొలగించుచున్న పార్వతీదేవి. త్రిజగతాం = మూడులోకములయొక్క; సర్గాది సిద్ధార్థకే = సృష్టిస్థితి లయములను చేయుదానవు. స్వర్గాదిష్టఫల ప్రదాన నిపుణే = స్వర్గము మొదలగు ఇష్ట ప్రయోజనములను సిద్ధింపజేయుదానా, త్రాయస్వనశ్శంకరి = శంకరునియొక్క పట్టపుదేవి; నః త్రాయస్వ = మమ్ములను రక్షింపుము. సాత్వం = అట్టి నీవు; సర్వజనాంతర = సర్వజనములయొక్క హృదయాంతరాళముల యందు. చిదంశ = జ్ఞాన స్వరూపమైన జీవులతో, అనన్య = విడువకుండా నుండునట్టి; సిద్ధాత్మికా - శక్తి మయివిగ , సారఅసార వివేక దృష్టి విదితా = లోకములో సారముగలిగిన పదార్థమును సారములేని పదార్థమును తెలుసుకొనునట్టి జ్ఞానమునందు సర్వసాక్షీ రూపురాలవుగా గోచరించుదానవు. సర్వైక సాక్ష్యాత్మనా = చరాచరాత్మక భూతములకు అంతర్‌సాక్షిగా నుండుదానా.

తాత్పర్యము : ఆశ్రయించినవారి కష్టములఁబాపుదువు. ముల్లోకముల సృష్టిస్థితి సంహారములఁ జేయుదువు. సర్వఫలముల నిత్తువు. సర్వజనాంతరాత్మలయందు నుందువు. సర్వకార్యసిద్ధి నీవలనఁ గలుగుచున్నది. సర్వజ్ఞానముగల్గి సర్వసాక్షివై వర్తింతువు ఇట్టి నిన్ను మేము శరణొందినారము. కావుము.

అహిరీ (కాంభోదీ) రాగము - చాపు (అట) తాళము

ప. జయ జయ దుర్గే జితవైరివర్గే

అ. వియదనిలాదివిచిత్రసర్గే

1. సుందరతరచరణారవిందే
సుఖపరిపాలితలోకబృందే
నందసునందాదియోగివంద్యే
నారాయణసోదరి పరానందే

2. సరసమణినూపురసంగతపాదే
సమధిగతాఖిలసాంగవేదే
నరకిన్నరవరసురబహుగీతే
నందనుతే నిఖిలానందభరితే

3. కనకపటావృతఘనతరజఘనే
కల్యాణదాయిని కమనీయవదనే
ఇనకోటిసం కాశదివ్యాభరణే
ఇష్టజనాభీష్టదాననిపుణే

4. అనుదయలయసచ్చిదానందలతికె
ఆలోలమణిమయతాటంకధనికే
నానారూపాది కార్యసాధనికే
నారాయణతీర్థభావితఫలకే

22వ కీర్తన  కాంభోజిరాగం - అటతాళం

ప॥ జయ జయ దుర్గే = హే దుర్గే సర్వోత్కృష్టముగా వర్తించుమా; జితవైరివర్గే = జయించబడిన శత్రు సమూహములు గలదానా.

అ॥ వియత్ అనిల ఆది = ఆకాశము వాయువు మొదలగు; విచిత్ర సర్గే = విచిత్రములైన సృష్టిచేయుదానా.

1. సుందరతర = మిక్కిలి సుందరమైన; చరణారవిందే = చరణ కమలములుగలదానా; సుఖపరిపాలితలోకబృందే = సుఖముగా పరిపాలించుచుండు లోకసమూహములుగలదానా! నంద సునందాదియోగి వంద్యే = నందసునందుడు మొదలగు యోగులచేత స్తోత్రము చేయబడు చుండుదానా; నారాయణ సోదరి = శ్రీమన్నారాయణునికి తోబుట్టువగుదానా; పరానందె = శ్రేష్ఠమైన ఆనందమే స్వరూపముగలదానా.

2. సరసమణి నూపుర = శ్రేష్ఠమైన మణులచే పొదగబడిన అందెలచేత; సంగతపాదె = కూడుకొనియున్న పాదములుగలదానా; సమధిగత = బాగాపొందబడిన; అఖిలసాంగవేదే = సమస్తమైన అంగసహితమైన వేదములుకలదానా; నరకిన్నెర వరసుర = మనుష్యులచేత కిన్నెరులచేత శ్రేష్ఠమైన దేవతలచేతను; బహుగీతే = మిక్కిలిగానము చేయబడుచుండుదానా; నందసుతె = నందునికి కొమార్తెగా నుండుదానా; నిఖిల ఆనందభరితె = సమస్త విధములైన సంతోషముతో నిండినదానా.

3. కనక పట ఆవృత = బంగారు వస్త్రముచే చుట్టబడిన; ఘనతర జఘనె = మిక్కిలి ఘనమైన పొత్తికడుపు కలదానా; కల్యాణదాయిని = మంగళములను యిచ్చుదానా; కమనీయవదనె = సుందరమైన ముఖముగలదానా; ఇనకోటి సంకాశ = కోటి సూర్యులతో సమానమైన; దివ్యాభరణె దివ్యమైన ఆభవరణములుగలదానా; ఇష్టజన = నీదాసులకు (ప్రియమైన జనులకు); అభీష్ట దాననిపుణె = కోరికలను యిచ్చుటయందు నేర్పుకలదానా.

4. ఉదయ లయ అన్ = సృష్టిన్నీ నాశమున్నూ లేనిదానా; సచ్చిదానంద లతికే = సత్తు చిత్తు ఆనందములే తిలకముగా గలదానా; ఆలోల మణిమయ = చలించుచున్న మణులపొదిగిన, తాటంక ధనికే = కమ్మలనే ధనముగలదానా; నానారూపాది కార్యసాధనికే = నానారూపములు మొదలైన కార్యములు సాధించుదానా; నారాయణ తీర్థ = నారాయణతీర్థులచేత; భావిత ఫలకే = స్మరించబడుచుండు ఫలములు యిచ్చుదానా.

ప-అ. శత్రుగుణముల నణఁచి లోకములను సుఖముగ బరిపాలించునట్టియుర్గా! ఆకాశవాయ్వాదివిచిత్ర సృష్టి యొనర్చునట్టియోదేవీ! సుందరపాదారవిందములుగల తల్లీ! శ్రీమన్నారాయణునికిఁ జెలియలివై నందానునందాదియోగులచే మ్రొక్కఁబడినదేవీ! పాదముల యందెలయందు సామవేదమును బల్కించుచుఁ గిన్నరకింపురుషాదులచేఁ గొనియాడఁబడు తల్లీ! దివ్యవస్త్రములను దివ్యాభరణములను దివ్యగంధపుష్పములను ధరించి వెలుంగుచుండుజననీ! పరమానందజ్ఞానస్వరూప యగుభాగ్యవతీ! నారాయణతీర్థముని వినుత యగుపుణ్యమూర్తి! నీకు జయము గలుగును గావుత!

శ్లో. ఇత్యాదిగీర్భిర్గీర్వాణగణైర్గీతా ప్రసాద్య తామ్,
సా వైష్ణవీతి విఖ్యాతా త్రిషు లోకేషు పూజ్యతే.

46. శ్లో॥ ఇత్యాది గీర్భిః = ఈ మొదలైన గీతములను; గీర్వాణ గణైః = దేవతా సమూహములచేత; గీతా =గానము చేయబడినదై; తాన్ ప్రసాద్య = వారలనుగూర్చి అనుగ్రహించి; త్రిషులోకేషు = మూడులోకముల యందు; సావైష్ణవీతి విఖ్యాతా = ఆమె వైష్ణవి అనునామముతో ప్రసిద్ధిగాంచినదై, పూజ్యతే = పూజింపబడుచున్నది.

తాత్పర్యము : ఇత్యాదివాక్యములచేత దేవత లాదేవిని స్తుతించుచుండిరి. దేవియు వైష్ణవి యమునామముతో ముజ్జగములఁ బూజింపఁబడుచుండెను.

శ్లో. దురంతచింతాగ్రాహేణ గ్రస్తోయం కంసకుంజరః,
అలబ్ధశరణో స్వస్థ స్సదనం స్వీయమాగతః

47. శ్లో॥ మరింత చింతా = అంతములేని చింతయనెడు; గ్రాహేణ = మొసలిచేత; అయం కంసకుంజరః = కంసుడనే ఏనుగ; గ్రస్తః = పట్టుకొనబడినదై; అలబ్ధశరణః = రక్షకులు లేనివాడై (లభించని రక్షకులు కలవాడై దిక్కులేనివాడై; అస్వస్థః స్వీయం సదనం = స్వభావస్థితి తప్పినవాడై స్వగృహములు గూర్చి; అగతః = వచ్చెను.

ఇట్లు దేవిమహిమం గాంచి యాకంసుఁడు మితిలేనిచింత నొందిన వాఁడై దిక్కు దోఁపక మనసు కుదురక దిగులొంది చేయునది లేక యింటికిఁ బోయెను,ద

**ఇతి శివరామానందతీర్థపాదసేవక శ్రీనారాయణతీర్థ విరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం - శ్రీకృష్ణప్రాదుర్భావ వర్ణనం నామ ప్రథమతరఙ్గ స్సమాప్తః.**

# ద్వితీయ తరఙ్గము

## బాలలీలా కథాసంగ్రహము

శ్లో. నందగోపశ్చ గోప్యశ్చ యశోదారోహిణీసుతౌ,
రామకృష్ణౌ తయో స్సమ్య గ్లాలనం రామకృష్ణయోః 1
గర్గాచార్యాభిగమనం తయోర్నామకృతిస్తతః,
పూతనాశకటాదీనాం మర్దనం తదనంతరమ్ 2
నవనీతాదిచౌర్యం చ యశోదాయై నివేదనమ్,
యశోదయా కృతం కృష్ణస్యాహ్వానం ప్రణయాన్ముహుః 3
ఉలూఖలే దామబంధో యమళార్జునభంజనమ్,
యక్షాభ్యాం చ కృతం స్తోత్రం విశ్వరూపప్రదర్శనమ్, 4
యశోదయా కృతం స్తోత్రం బాలభావప్రదర్శనమ్,
ఇత్యేవం బాలలీలాయాః కథాసంగ్రహ ఈరితః 5

# ద్వితీయ తరఙ్గము

## ప్రారంభము

### బాల లీలా కథా సంగ్రహము

1. శ్లో॥ నందగోపశ్చ = నందుడనే గోపాలుడున్నూ; (గోప్యః+చ) గోప్యశ్చ = గోపికలున్నూ; యశోదా రోహిణీసుతే = యశోదా రోహిణీ పుత్రులైన; రామకృష్ణౌ = రామకృష్ణులున్నూ; తయోః రామకృష్ణయోః = ఆ రామకృష్ణులయొక్క (సమ్యక్ +లాలనం) సమ్యగ్లాలనం = లెస్సగా లాలించుటయున్నూ

2. శ్లో ॥ గర్గా చార్యాభిగమనం = గర్గాచార్యులవారు వచ్చుటయున్నూ; తతః తయోః = అనంతరం వారిద్దరికిన్నీ; నామకృతిః = నామకరణము గావించుటయున్నూ; తదనంతరం = అటుతర్వాత; పూతనాశకటాదీనాం = పూతనయొక్క యున్నూ, శకటాసురుడు మొదలగువారి యొక్కయున్నూ; మర్దనం = సంహారమున్నూ

3. శ్లో॥ నవనీతాది చౌర్యం = వెన్న మొదలైనవాటిని దొంగిలించుటయున్ను; యశోదాయై నివేదనంచ = యశోదకొఱకు విన్నవించుటయున్ను; యశోదయా = యశోదఅమ్మవారిచేత; ప్రణయాత్ = స్వామివారియందు వుండు ప్రేమచేత; ముహుఃముహుఃకృతం = మాటి మాటికి చేయబడినది; కృష్ణస్య ఆహ్వానం = కృష్ణుని పిలచుటయున్నూ

4. శ్లో॥ ఉలూఖలేదామ బంధః = రోటియందు తాటిచేత కట్టివేయుటయున్నూ, యమళార్జున భంజనం = రెండు మద్దిచెట్లను పడవేయడమున్నూ; యక్షాభ్యాం = యక్షులచేత, కృతంస్తోత్రం = చేయబడిన స్తోత్రమున్నూ; విశ్వరూప ప్రదర్శనం = విశ్వరూపమును చూచుటయున్నూ

5. శ్లో॥ యశోదయాకృతం = యశోదచేత చేయబడిన; స్తోత్రం = స్తోత్రమున్నూ, బాలభావప్రదర్శనం = మనుష్య బాలరూపమును చూపించుటయున్నూ; ఇతి ఏవం = ఇట్లని ఈ చెప్పినవిధముగా; బాలలీలయాః = స్వామివారి బాలలీలల యొక్క; కథాసంగ్రహము = ముక్తసరియయిన కథను, ఈరితః = చెప్పబడినది.

అవ. ప్రథమావతారతరంగము వర్ణింపబడినది. ఇంక ద్వితీయము బాలలీలాతరంగము వర్ణింపఁబడుచున్నది

ఇందు యశోదానందులును, రోహిణియు, గోపికలును రామకృష్ణుల లాలించుటయు, గర్గాచార్యుఁడువచ్చి నామకరణము సేయుటయు, పూతనాశకటాసురుల వధించుటయు, నవనీతచౌర్యమును. ఆవృత్తాంతమును గోపికలు యశోదకుఁ జెప్పుటయు, యశోద కృష్ణుని ప్రీతితో మాటిమాటికి పిలుచుటయు, కృష్ణు నులూఖలమునఁ గట్టుటయు, యమళార్జునవృక్షముల విఱుచుటయు, యక్షులు స్తోత్రముచేయుటయు, విశ్వరూప ప్రదర్శనము, యశోద స్తోత్రముచేయుట, బాల్యప్రదర్శనము ఇట్లు క్రమముగా సంక్షేపమునఁ గథాసంగ్రహము వర్ణింపఁబడును.

## నందయశోదాదులు రామకృష్ణుల లాలించుట

*నందస్యాగమనమ్ నందుడు రావడమున్నూ*

భైరవిరాగము - ఆదితాళము

గోపైరనుగతో నిత్యం గోబృందాని విచారయన్

గోపాలకస్వామీ నంద గోపో మహాన్ విరాజతే

1. కీర్తన దరువు - భైరవిరాగం - ఆదితాళం

గోపైః అనుగతః నిత్యం = గోపాలకులతో యెల్లప్పుడు కూడుకొని; గోబృందాని విచారయన్ = ఆవులమందలను విచారించుచున్నవాడై మేపుచున్నవాడై గోపాలకస్వామి = గోవులను పాలించేవారికి ప్రభుడున్నూ అయిన. నందగోపః = నందుడనే గోపాలుడు; మహాన్విరాజతే = గొప్పవాడై ప్రకాశించుచున్నాడు.

నందుఁడు- గోకులమునందుండు గోపకులకందఱికిని రాజై యపరిమితములైన గోగణంబులు గల్గి సకలసద్గుణశోభితుఁ డై రాజిల్లుచుండెను. (**ఆనందుని సతీమణి యగుయశోద తాను స్త్రీశిశువును గనుటయు, దానిని వసుదేవుఁడు తీసికొని పోయి యతనికొడుకును దనపాదిగిట నుంచిపోవుటయు నెఱుఁగదు. మఱియెవ్వరు నెఱింగినవారులేరు. వసుదేవుఁ డదరిగిన తరువాతఁ దనకుఁ గలిగినవాఁ డాపురుషశిశువే యని యనుకొనెను.**)

వల్లవయువతికదంబం ఆయాతి　　వర మరుణాధరబింబం
శృంగారవిలసితపృథులనితంబం　　విఖ్యాత వివిధవిలాసవిడంబం
కరధృతదధిదుగ్ధ　　కమనీయఫలజాత
నిరుపమ సంతోష　　నీలకుంతలమిహ

2. కీర్తన - దరువు - మధ్యమావతి - ఆదితాళం

వల్లవయువతీకదంబం = గొల్లభామల గుంపు; వరం అరుణ అధర బింబం = శ్రేష్ఠమైన ఎఱ్ఱనైన పెదవిగలవారు; శృంగారవిలసిత = శృంగారములచేత ఒప్పుచున్నటువంటి; పృధుల నితంబం = విస్తారమైన పిరుదులు గలవారున్నూ; విఖ్యాత = ప్రసిద్ధమైన; వివిధ విలాస విడంబం = పలువిధములైన విలాసము యొక్క వ్యాపారము కలిగినటువంటిన్నీ; కరధృత దధిదుగ్ధ = హస్తములయందు ధరించబడిన పెరుగుపాలున్నూ; కమనీయ ఫలజాతం = మనోహరమైన ఫలసమూహములు కలిగిన వారున్నూ; నిరుపమ సంతోష = అసమానమైన సంతోషముతోకూడుకున్నట్టిన్ని; నీలకుంతలం = నల్లని ముంగురులు కలిగినట్టిన్నీ (వల్లవయువతీ కదంబం); ఇహ ఆయాతి = ఇప్పుడు వచ్చుచున్నారు.

అంత యశోద మగశిశువుం గనిన దను శుభవార్త యెల్లఱకుం దెలియవచ్చె. గోపికలందఱు సంతోషమగ్నులై నందగృహంబునకు వచ్చుచుండిరి. ఆగోపికలు భగవత్పరిచర్యార్థ మవతరించిన దేవస్త్రీలుగావున వారి యందమును, వారివిలాసగమనమును వర్ణింప నలవి గాకుండెను. మంగళోపహారములుగ పాలు పెరుగు వెన్న నేయి నిండినకుంభములును నానావిధఫలములును గైకొని వచ్చుచుండిరి.

శ్లో. పరం పరస్మా దపిప్రాక్తకర్మ
క్రమేణ వేద్యం కరణైర వేద్యమ్,
నిజేచ్ఛయా ప్రాప్తమనుష్య వేషం
సుతం యశోదా సుఖమాప దృష్ట్వా

6. శ్లో॥ పరస్మాత్ + అపి = గొప్ప వస్తువుకంటె కూడ; పరం = గొప్పదైనటువంటిన్నీ; ప్రాక్తకర్మక్రమేణ = పూర్వజన్మమందు చేయబడిన కర్మను అనుసరించి; వేద్యం = తెలియబడదగినదిన్ని; కరణైః = ఇప్పటిదేహమునందలి ఇంద్రియములచేత; అవేద్యం = తెలియబడనిదిన్ని; నిజేచ్ఛయా = తనయొక్క ఇచ్ఛచేతనే; ప్రాప్త మనుష్యవేషం = పొందబడిన మనుష్యరూపము కలిగినటువంటిన్ని; సుతం యశోదా = కొమరుని యశోదా అమ్మవారు; దృష్ట్వా సుఖం ఆప = చూచి సుఖమును పొందెను.

ఎప్పుడైనను నేజన్మమునందైనను నెన్నిజన్మములకు ముందైనను వాఁడు వాఁడు చేసినసత్కర్మగాని, యసత్కర్మగాని మనకుఁ దెలియదుగాని దాని దాని కాలము వచ్చినప్పుడు ఫలప్రదముకాకపోదు. అప్పు డాకర్మ మూహింపవలయు. అట్లే ఈయశోదానందు లెప్పు డేజన్మమున నేమితపంబు చేసిరో తెలియదుగాని అవాఙ్మానసగోచరమహిమ గలసర్వేశ్వరుఁడు వీరికి పుత్త్రుఁడై యవతరించి యింతసులభుఁడగుటకు వారొందినయానందము వర్ణింపశక్యముగాకుండెను.

శ్లో. ప్రభాతే గోకులే నందగేహే గోకులవాసినః,
ఆవిర్భావం హరేశ్శ్రుత్వా వివిశుర్నందమందిరమ్.

శ్లో॥ గోకులవాసినః = గోకులములో వుండే జనులు అందఱు; ప్రభాతేగోకులే = వేకువజామున గోకులమునందు, నందగేహే = నందుని గృహమునందు; హరేః ఆవిర్భావంశ్రుత్వా = శ్రీకృష్ణునియొక్క అవతరణమును వినినివార్మై; నందమందిరం వివిశుః = నందుని గృహమును ప్రవేశించిరి.

మరియు తెల్లవారగనే ఈ శుభవార్తను విన్న ఆయూరి వారందరునూ పరమౌత్సుక్యముతో ఆ నందుని గృహమునకు విచ్చేసిరి.

గ. **అవతిర్ణే భగవతి గోకులభూమిభాగేత త్రత్యచందనమందార నాగపున్నాగచంపకాశోకపనసరసాల ప్రముఖాః కుసుమఫల సంపదో దివ్యసౌగంధగంధితదిఙ్మండలాః విగళితమాధ్వీఝురి సంచరన్మత్తమధు వ్రతఝుం కారాలంకారరమణీయ కుసుమఫలభారానతశాఖాభిః అవనీగతాభిః అత్యంతభక్తినమ్రా ఇవభగవతో, వాసుదేవస్య సాష్టాంగలక్షణం ప్రణామంకుర్వాణాః తత్రత్యమాధవీజాతీమల్లి కాదిలతాః సంతతమందపవన స్పందనవిగళితకుసుమభారైః అవతీర్ణస్య శ్రీభగవతో నారాయణస్య పరమప్రేమలక్షణాం భక్తిమాతన్వంత్యః పుష్పాం జలింసమర్పయంత్యఇవ స్వకీయప్రార్థనయా సురభూసురకార్యార్థం క్షీరమహోదధేః గోకులమవతీర్ణస్య శ్రీనివాసస్య సంతోషాయాంతరానీత క్షీరసాగరపయోధరా ధరేయం అసంఖ్యాతగోరూపధ రేతి సాధుభిరుత్ప్రేక్షితా గావఃఖగ మృగనారీనరాదయః సర్వే చ జనాః సంప్రాప్తస్వస్వసంపదో బభూవుః.**

8. గ్యద:- గోకులభూమిభాగే = గోకులప్రదేశమునందు; భగవతి అవతీర్ణే = భగవంతుడైన కృష్ణుడు ఉత్పత్తికాగా; తత్రత్య = అందులోనుండునట్టి (అచ్చట); చందన మందార - చందన మందార వృక్షములున్నూ; ప్రముఖా = మొదలైనవిన్ని; కుసుమఫల సంపదః = పుష్పఫలములతో కూడుకున్నటువంటి; దివ్యసౌగంధః = మనోహరమై పరిమళముచేత; గంధిత దిఙ్మండలాః = గుమాళించుచున్న దిక్కుల సమూహముకలవియై; విగళిత మాధ్వీఝురీ = స్రవించుచున్న తేనెయొక్క ప్రవాహమునందు సంచరన్ = సంచరించుచున్న; మత్తమధువ్రత = మదించినటువంటి తేనేటీగలచేత; ఝుంకార = ఝుంకారధ్వనియొక్క; అలంకార రమణీయ = అలంకారముచేత మనోహరమైన; కుసుమఫల = పుష్పములయొక్క ఫలముయొక్క; భార ఆనత = బరువుచేత వంగి; అవని గతాభిః = నేలనుతాకుచున్న; శాఖభిః కొమ్మలచేత; అత్యంత భక్తినమ్రాః = విశేషభక్తిచేత విధేయమై; భగవతో వాసుదేవస్య = భగవంతుడైన వాసుదేవునకు; సాష్టాంగలక్షణం = అష్టాంగములతోకూడుకున్న లక్షణములుగల్గి; ప్రణామం కుర్వాణ ఇవ = నమస్కారము చేయుచున్నదా అని యెంచబడదగినవియై (మరియు); తత్రత్య = ఆ గోకులమునందు వున్నట్టి, మాధవి జాజి మల్లిక ఆది = గురిగింజతీగెలున్నూ జాజితీగెలున్నూ మల్లెచెట్లు మొదలైన; లతాః సంతత మంద = తీగలు యెడతెగని మెల్లగావీచు; పవన స్పందన = వాయువుచేత కదలినందున; విగళిత కుసుమభారైః = రాల్చబడిన పుష్పభారములచేత; అవతీర్ణస్య శ్రీభగవతః = అవతరించినటువంటి షాడ్గుణ్యపూర్తిగలిగి; నారాయణస్య = నారాయణునకు; పరమప్రేమలక్షణాం

= సర్వాతిశయమైన ప్రేమయే లక్షణముగా గలిగినటువంటి; భక్తిం = భక్తియోగమును; ఆతన్వంత్యః = విస్తరింపచేయుచూ, పుష్పాంజలిం = పుష్పగుత్తులను చేమోడ్పులోధరించి; సమర్పయంతి ఇవ = సమర్పించుచున్నవా అని యెంచబడదగినవియై (మరియు) స్వకీయ ప్రార్థనయా = తమయొక్క ప్రార్థనచేత; సురభూసుర కార్యార్థం = దేవ బ్రాహ్మణ కార్యనిమిత్తమై; క్షీర మహోదధేః = పాలసముద్రము నుంచి దయచేసి; గోకులం = గోకులమునందు; అవతీర్ణస్య శ్రీనివాసస్య = అవతరించినట్టి స్వామివారియొక్క; సంతోషాయా = సంతోషము కొఱకు; అంతరానీత = ఈలోపల తేబడిన; క్షీరసాగర పయోధరా ధరేయం = క్షీరాబ్ధి మధ్య భూమియే; అసంఖ్యాత గోరూపధర ఇతి = లెక్కలేని గోరూపములను ధరించినది. ఇట్లని; సాధుభిః ఉత్ప్రేక్షితా = సాధువులచేత ఉత్ప్రేక్ష చేయుచుండునట్టి; గావః = గోవులున్నూ; ఖగమృగ నారీ నరాదయః = పక్షులు మృగములు స్త్రీలు పురుషులు మొదలైనవారు; సర్వేచజనాః = సర్వజనులున్నూ; సంప్రాప్త = పొందబడిన; స్వస్వ సంపదః బభూవుః = వారివారి సంపదలు గలవారలు అయిరి.

జగన్మంగళ మగుభగవదవతారంబున భూమిభాగమున నేవనము: జూచినను సకలవిధవృక్షంబులును చిగిర్చి పుష్పించియుండె. పుష్పపరిమళంబులు దిగంతరంబులు నిండ మకరందపానమత్తములగుతుమ్మెదల మొత్తములు ఝుంకారనినాదంబులు సేయుచుండె ఫలభారమున ధరణికి వంగినవృక్షములు భగవంతునికి సాష్టాంగనమస్కారములు గావించుచున్నట్లుండెను. జాజీమల్లికాదిపుష్పలతలు మందమారుతమునఁ జలించుచుఁ బుష్పంబుల రాల్చుచు భగవంతుని భక్తితోఁ బూజసేయుచున్నట్లుండెను. సురభూసుర కార్యార్థము భగవంతుఁ డవతరింపగా భగవన్నివాసమగు క్షీరాబ్ధిమధ్య భూమియే వచ్చి నానావిధములుగ నవతరించినదో యనునట్లు గోవులు సకల సంపదల విలసిల్లు చుండెను. సకలజనంబులును, మృగపక్ష్యాది నానావిధ జంతునివహంబులును సకలశుభంబుల నొంది పరమానందభరితులై విలసిల్లు చుండిరి.

శ్లో. అన్యోన్యం వ్రజనార్యో నందస్యాంతఃపురే శిశుం దృష్ట్వా,
ఇతి జగు రావిర్భూతం లక్షణత స్తద్ధి వైష్ణవం తేజః

9. శ్లో॥ అన్యోన్య వ్రజ నార్యో = ఒకరికొకరు గోకులమందు వుండు స్త్రీలు; నందస్య అంతఃపురే = నందునియొక్క అంతఃపురమందు; శిశుం దృష్ట్వా = పుట్టిన బిడ్డను చూచి; ఆవిర్భూతం = అవతరించినటువంటి స్వామివారిని; లక్షణతః = సాముద్రిక లక్షణములనుబట్టి; వైష్ణవంతేజః తద్ధి = విష్ణు సంబంధమైన తేజస్సుగా వుండవచ్చునుగదాయని; ఇతి జగుః = ఇట్లని గానముచేసిరి.

గోపికలు యశోదానందనుంగాంచి సాక్షాత్ శ్రీమన్నారాయణుండని భావించి యొండొరులు గూడుకొని యీవిధంబుగ గానంబులు సేసిరి.

3. కాంభోదీరాగము - ఆదితాళము

ప. శ్రీపతి మిహ నందగోపగృహే పర

అ. మాగత మాకలయే - అయే సఖి - ఆగత మాకలయే

1. పరమపురుషచిహ్నం భద్రద మవధారయ
పద్మాంకుశాదిరేఖం - అయే సఖి - పద్మాంకుశాదిరేఖం
పరిపూర్ణభావం ప్రకటీకరోతి దివ్య
పాణిపదాబ్జగతం జగదార్తిహరమమోఘం

2. పశ్య పశ్యాధునా పాదపబృందాని
విశ్వస్య మే వచనం - అయే సఖి - విశ్వస్య మే వచనం
భృశ మివ భూమౌ దిశిదిశి సఫలాని
భవ్యసుగంధికుసుమై రతినిబడాని జాయంతే

3. అరవిందలోచనే ఆవిర్భవతి జగ
దతితరామిహ రమతే - అయే సఖి అతితరా మిహ రమతే
నిరుపమానందనిత్య బోధస్వరూపం
పర మనుగీత మిదం నారాయణతీర్థయతినా

3వ కీర్తన - కాంభోజిరాగం - ఆదితాళం

అయేసఖి = ఓ చెలికత్తె (ఓ స్నేహితురాలా); ఇహ నందగోపగృహే = ఇక్కడ నందగోపుని గృహమందు; ఆగతం = వేంచేసినట్టి (అవతరించినట్టి); పరం శ్రీపతిం = పరాత్పరుడైన శ్రియఃపతిని; ఆకలయే = సేవించుచున్నాను (చూచుచున్నాను); అయే సఖి! = ఓ స్నేహితులారా; ఆగతం ఆకలయే = వేంచేసిన శ్రీకృష్ణుని చూచుచున్నాను.

1. అయే సఖీ = ఓ స్నేహితురాలా; భద్రదం = మంగళకరమైన; పద్మాంకుశాదిరేఖం = పద్మము అంకుశము మొదలైన రేఖలు; పరమపురుష చిహ్నం = సర్వేశ్వరునియొక్క గుర్తులని; అవధారయ = గమనింపుము; జగదార్తిహరం = లోకముల దుఃఖములను హరించునట్టియు; అమోఘం = వ్యర్థముకానిదియు; దివ్యపాణి పద అబ్జగతం = స్వామివారి దివ్యమైన హస్తములయందున్నూ పాదములయందున్నూ ఉన్నటువంటి; పద్మాంకుశ ఆదిరేఖం = పద్మము అంకుశము మొదలగురేఖలు; పరిపూర్ణ భావం = ఈపురుషుడు షాడ్గుణ్య పరిపూర్ణుడు అనే భావమును; ప్రకటకరోతి = వెల్లడిచేయుచున్నది.

2. అయేసఖి = ఓ స్నేహితురాలా; అధునా = ఇప్పుడు; పాదపబృందాని = చెట్లసమూహములు; పశ్యపశ్య = చూడండి చూడండి; భూమౌ = నేలయందు; దిశదిశ = అన్నిదిక్కులయందు; సఫలాని = ఫలసహితములై; భవ్యసుగంధి కుసుమైః = శ్రేష్ఠమైన మంచిపరిమళముగల పుష్పములచేత; అతినిబిడాని = నిండాదట్టములై; జాయంతే = ఉంటున్నవి; పస్య మే వచనం = చూడుమా నామాటను; విశ్వస్య = విశ్వసింపుమా.

3. అయేసఖి = ఓ స్నేహితులారా; అరవిందలోచనే = తామరకమలములవంటి నేత్రములుకలవాడు; ఆవిర్భవతి = అవతరించగా, జగత్ = లోకము; ఇహ = ఇక్కడ; అతితరాం = విశేషించి; రమతే = ఆనందించుచున్నారు; నిరుపమా ఆనంద నిత్యబోధ = సమానములేని ఆనందమున్నూ తెంపులేని జ్ఞానమున్నూ; స్వరూపం = స్వరూపముగా గలిగిన; పరం = పరాత్పరుని; అనుఇదం = అనుసంధించి ఈకీర్తన; నారాయణ తీర్థయతినా = నారాయణతీర్థులు అనుయతిచేత; గీతం = గానము చేయబడును

వ-అ-1 ఓసఖి ! యీనందునియింట నుదయించిన యీబాలుఁడు సామాన్య మనుష్యబాలుఁడుగాఁడు సుమా! ఏమనుకొంటివో ఇతఁడు శ్రీమన్నారాయణుఁడు ఈయశోదానందులభాగ్యమువలన నిటనవతరించినవాఁడు. ఇటుచూడము. ఇతనిహస్తపాదముల దివ్యమంగళములగు పద్మరేఖలును శంఖచక్రాదిరేఖలు వెలయుచున్నది. ఇతనిపాదసేవ సేయువారికి కష్టములన్నియుఁ బాసిపోవును. సకలసుఖములును గలుగును.

2. మఱియు నీతని యుదయమున వృక్షములు మొదలగునవి యెంత పెంపునొందియున్నవి. చిగిరించి పుష్పించి ఫలించి యున్నవి. ఈశుభలక్షణములచేతనే యీశిశువు లోకము ననుగ్రహింపవచ్చిన పరమపురుషుఁడని నిశ్చయింపవలయును.

3. ఇతఁడు పుండరీకాక్షుఁడు, కావుననే లోకమంతయు శాంతమై నిరుపమానందమై నిత్యమంగళమై వెలయుచున్నది. అట్లు నత్యజ్ఞానానంద స్వరూప మగుభగవన్మహిమను శ్రీనారాయణతీర్థముని గానముచేసెను.

శ్లో॥ కరిష్యామశ్శిశోరస్య మంగళాచరణం వయమ్,
స్మరిష్యామః పరం దైవం లక్ష్మీనారాయణం ముదా.

10. శ్లో॥ వయం = మనము; అస్యశిశోః = ఈ శిశువును; మంగళా చరణం = ఆశీర్వాదమును; కరిష్యామః = చేసెదము; పరందైవం = విలక్షణదైవమైన (దేవదేవుడైన); లక్ష్మీనారాయణం = శ్రీమన్నారాయణమూర్తిని; ముదా = సంతోషముచేత; స్మరిష్యామః = స్మరింతము.

సఖులారా! మనమీ శిశువునకు మంగళాశాసనముఁ జేయుదము. ఇతని శ్రీలక్ష్మీనారాయణుని పరమపురుషుని సంతోషముతోఁ దలంచి పాడుదము.

కేదారగౌళరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | కలయ కల్యాణాని | నారాయణ |
| అ. | బలభద్రావరజాయ | నారాయణ |
| 1. | సరసిజనయనాయ | సకలలోకహితాయ |
| | నరలోకసంభవాయ | నారాయణ |
| | శరదిందువదనాయ | శతమన్మథసమాయ |
| | నిరవధికగుణాయ | నారాయణ |

| | | |
|---|---|---|
| 2. | నందగోపసుతాయ | నగరాజధీరాయ |
| | సుందరచరణాయ | నారాయణ |
| | ఇందిరామందిరాయ | ఈప్సితఫలదాయ |
| | చందనాదిగంధితాయ | నారాయణ |
| 3. | గురుతరకరుణాయ | గోకులభూషణాయ |
| | పరిజనపాలనాయ | నారాయణ |
| | నిరుపమసుందరాయ | నీలమేఘనిభాయ |
| | పరమపురుషలక్షణాయ | నారాయణ |
| 4. | నవపల్లవకరాయ | నవమణిభూషితాయ |
| | కవిజననాయకాయ | నారాయణ |
| | అవనీవల్లభాయ | ఆశ్రితవత్సలాయ |
| | శివనారాయణతీర్థ | సంసేవితాయ |

**4వ కీర్తన - కేదారగౌళ - ఆదితాళం**

నారాయణ = హేనారాయణమూర్తి; కళ్యాణాని = మంగళమును; కలయ = అగునట్లు చూడుమా; బలభద్ర అవరజాయ = బలభద్రుని తమ్ముడైన కృష్ణునికి; కళ్యాణాని = మంగళములను; కలయ = అగునట్లు చూడుమా

1. నరసిజనయనాయ = తామర కమలములవంటి నేత్రములుగలవాడున్నూ; సకలలోక హితాయ = సమస్తలోకములకు మేలు చేయువాడున్నూ; నారాయణ = (అయిన) హే శ్రీమన్నారాయణుడా; నరలోకసంభవాయ = భూలోకమున జన్మించినవాడున్నూ; శరత్ + ఇందువదనాయ = శరత్కాల చంద్రునితో సమానమైన ముఖముగలవాడున్నూ; శతమన్మథ సమాయ = నూర్గురు మన్మథులతో సమానమైన సౌందర్యముగలవాడు; నిరవధిక కరుణాయ = పరిమితములేని దయగలవాడున్నూ అగు బలరాముని తమ్మునికి శుభములు గలుగజేయుమా.

2. నందగోపసుతాయ = నందునియొక్క యశోదయొక్క కొమారుడున్నూ; నగరాజధీరాయ = హిమవత్పర్వతముతో సమమగు ధైర్యముగలవాడున్నూ; సుందరచరణాయ = సౌందర్యమగు పాదములుగలవాడు; నారాయణ = శ్రీమన్నారాయణ మూర్తీ; ఇందిరా మందిరాయ = లక్ష్మి అమ్మవారు నిల్చుటకు స్థానముగాగలవాడు; ఈప్సిత ఫలదాయ = కోరికలను యిచ్చువారు; చందన ఆది గంధితాయ = చందనము మొదలగు పరిమళము గలవాడున్నూ అగు బలరాముని తమ్మునికి శుభములు కలుగజేయుమా.

3. గురుతర కరుణాయ = విస్తారమైన దయగలవాని కొఱకు; గోకుల భూషణాయ = గోకులమునకు భూషణమువంటివాడున్నూ; పరిజనపాలనాయ = తన భక్తులను రక్షించువాడున్నూ; నిరుపమ సుందరాయ = అసమానమైన సౌందర్యముగలవాడున్నూ; నీలమేఘ నిభాయ = నీలమేఘమువంటి శరీరము కలవాడున్నూ; పరమపురుష లక్షణాయ = నారాయణమూర్తితో సమానమగు లక్షణములుగలవాడున్నూ; నారాయణ = (అగు) శ్రీమన్నారాయణా

4. నవ పల్లవకరాయ = క్రొత్త చిగురుటాకులతో సమమగు హస్తముగలవారు; నవమణి భూషాయ = క్రొత్తమణులచే చేయబడిన భూషణములుగలవాడన్నూ; కవిజన నాయకాయ = విద్వాంసులకు నాధుడుగా యుండువాడున్నూ; నారాయణ = శ్రీమన్నారాయణుడా; అవనీవల్లభాయ = సమస్తభూమికి నాధుడుగా యుండువాడున్నూ; ఆశ్రితవత్సలాయ = భక్తులయందు వాత్సల్యముగలవాడున్నూ; శివనారాయణతీర్థ = శివనారాయణ తీర్థులవల్ల; సంసేవితాయ = లెస్సగా సేవించబడువాడున్నూ.

ప-అ. శ్రీమన్నారాయణా! స్వామీ! నీకు శుభం బగుగాక. బలరామునికిఁ దమ్ముఁడ వైనభాగ్యశాలీ! నీకు మంగళము.

1. తామరలఁబోలుకన్నులచే సకలజగంబులఁ గటాక్షించుచు లీలామానుషరూపము ధరించినతండ్రీ! నీకుఁ గల్యాణము. శరత్కాలచంద్రుని కాంతియు, నూర్వురు మన్మథులచక్కదవమును గల్గి మామీదికరుణతో నిటనవతరించిన బాలగోపాలా! నీకు భద్రములు.

2. నందగోపకుమారుఁడవై నగరాజధీరుండవై సుందరము లగు పాదారవిందములుగలవాఁడవై సురమునిగణ సేవితుఁడ వై చందనాలంకృతవక్ష స్థలమున నిందిరాదేవి నెలకొని యుండఁగ ఆశ్రయించినవార లడిగిన వరముల నిచ్చుచుండు వరదా! నీకు శోభనంబులు.

3. అపారకరుణగలవాఁడ వై యీగోపాలకులము నలంకరింపఁగా సర్వలోకాతీత సౌందర్యముతో నీలమేఘశ్యామలవిగ్రహముతో నీపరమ పురుషదివ్యలక్షణముతో నవతరించిన శ్రీనివాసా! నీకు శ్రేయంబులు.

4. చిగురుటాకులంబోలు నీచేతులయందంబునకుఁ దగినటులె నీరత్నభూషణములు నీకే తగును. విద్వాంసులు నిన్నాశ్రయించియే ప్రకాశింతురు. భూదేవి ననుగ్రహింపను ఆశ్రితులసంరక్షింపను నవతరించి శివనారాయణతీర్థునిచే సేవింపఁబడు మహానుభావా! నీకు జయమగుగావుత.

గ. **ఇత్యేవం గోకులపురవరనార్యః వాసుదేవమశేషజగతా మాదికర్తారం నారాయణమవతీర్ణ మజానంత్యః విష్ణుమా యావిమోహితాః మానుషశిశు మివ మత్వా తస్యాయు రారోగ్యైశ్వర్యాభివృద్ధయే కృతస్వస్త్యయనాః తతోన్యమివ నారాయణం ప్రార్థయామాసుః. ప్రాగేవ వాసుదేవ స్సంకర్షణాఖ్యో రౌహిణేయో గోపీభి స్సంవర్ధిత స్తత్రవిహరతిస్మ.**

11. గద్య:- ఇతి + ఏవం = అని యీ ప్రకారము; గోకులపురవరనార్యః = గోకులమను పురశ్రేష్ఠమందుగల గోపికలు; విష్ణుమాయవిమోహితాః = విష్ణుమాయవల్ల మోహమునొందినవారలుగనుక; అశేషజగతాం

= సమస్తలోకములయొక్క; ఆదికర్తారం = మొదటికర్త అయినటువంటిన్నీ; నారాయణం = శ్రీమన్నారాయణమూర్తియే; వాసుదేవం = వసుదేవపుత్రుడుగా; అవతీర్ణం = అవతరించినారనే సంగతిని; అజానంత్యః = తెలియనివారలై; మానుషశిశుః = మనుష్యబాలునిగా; మత్వా = తలచినవారై; తస్య = ఆ బాలునికి; ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధయే = ఆయుష్యము ఆరోగ్యము ఐశ్వర్యము అభివృద్ధియగునటుల, కృతా = చేయబడినది. స్వస్త్యయనాః = మంగళాశీర్వాదముగలవారలై; తతః = ఈ కృష్ణునికంటె; అన్యం = ఇతరముగా (వేరుగా). నారాయణం = నారాయణమూర్తి వున్నాడనే ఉద్దేశ్యముతో, ప్రార్థయామాసుః = ప్రార్థించినవారలు. ప్రాగేవ = ఇదివరకే; వాసుదేవ = వసుదేవునికి; రోహిణేయో = రోహిణీ దేవియందు కలిగిన సంకర్షణాఖ్యః = సంకర్షణను పేరుగలిగిన బలరాములవారు; గోపీభిః = గోపికా అమ్మవారలచేత; సంవర్ధిత = పెంచబడుచున్నవారలై; తత్ర = ఆ గోకులమందు; విహరతిస్మ = విహరించుచుండిరి.

ఇట్లు గోపికలు భగవన్మాయా మోహితులై అభూదేవిని సకలజగత్కర్తయగు శ్రీమన్నారాయణుం డనుకొని అతనికి వాయురారోగ్యైశ్వర్యంబులు గలుగవలయు నని భగవంతుని ప్రార్థించుచుండిరి. అంతకు ముందే రోహిణీ దేవియం దుదయించిన బలరాముడును నచట విహరించుచుండెను.

### గర్గాచార్యుఁడు బాలురకు నామకరణము సేయుట

### అథ గర్గాచార్యాగమనమ్

మధ్యమావతీరాగము - ఆదితాళము

నిర్గతమోహతిమిరో నిర్మలమానసో నిత్యం
స్వర్గాపవర్గాధికారీ గర్గాచార్యో విరాజతే

5వ కీర్తన - మధ్యమావతి - ఆదితాళం

నిర్గత మోహతిమిరః = పోయినటువంటి మోహమనెడి చీకటిగలవాడు; నిర్మల మానసోనిత్యం = ఎల్లప్పుడు నిర్మలమైన మనస్సుగలవాడున్నూ; స్వర్గ అపవర్గ అధికారి = మోక్షము యిప్పించుటకు తగిన అధికారముగలవారు అగు; గర్గాచార్యో విరాజతే = గర్గాచార్యులవారు ప్రకాశించుచున్నారు.

గ. గర్గోపి నిర్గతమోహతిమిరపటలో దివ్యదృష్టిస్త యోర్నల
భద్రకృష్ణనామనీ నందేన కిల కారయామాస.

12. గద్య:- నిర్గతమోహతిమిర పటలః = పోగొట్టబడిన మోహమనే చీకట్లుగలవాడు; దివ్యదృష్టి = దివ్యజ్ఞానముగలవాడు; గర్గ అపి = గర్గాచార్యులు అయితేనో; తయోః = వారిద్దరికి; బలభద్రకృష్ణనామనీ = బలభద్రకృష్ణులను నామములను; నందేన = నందునిచేత; కారయామాస కిల = పెట్టించెను గదా!

అజ్ఞానాంధకారమును దప్పించుకొన్నవాఁడును, పరిశుద్ధమైన మనస్సుగలవాఁడును, స్వర్గమును మోక్షమునుఁ జెందగలవాఁడును, దివ్యజ్ఞాన సంపన్నుఁడు నగుగర్గమహర్షి నందునియింఇకి వచ్చి బలరామకృష్ణులమహిమను దెలిసికొని వారికి జాతకర్మ నామకరణాదిసంస్కారంబులఁ జేయించెను.

శ్లో. కంసేన ప్రేరితా కాచిత్పూతనా శిశుఘాతినీ,
కృష్ణంస్తనంధయం మత్వా తస్మైస్తన్యవిషం దదౌ 13
తద్భావం సర్వవిద్ జ్ఞాత్వాస్తన్యపానమిషేణ తాం,
జఘాన సా పతద్భూమౌ దర్శయంత్యాసురీం తనుమ్. 14
తతో దృష్ట్వా జగన్నాథం గోపబాల మివ స్థితం,
చక్రుస్స్వస్త్యయనం తస్య గోపగోప్యో పి తం జగుః 15

13. శ్లో॥ శిశుఘాతిని = బిడ్డలను చంపు స్వభావము కలిగినటువంటి; పూతన = పూతన అనుపేరుగల; కాచితు = ఒకానొకతె; కంసేన = కంసునిచేత; ప్రేరిత = ప్రేరేపింపబడినదియై; కృష్ణం = కృష్ణమూర్తిని; స్తనంధయం = పాలుకుడిచే సామాన్యమైన పిల్లవాడని; మత్వా = తలచినదై; తస్మై = ఆ స్వామివారికొఱకు; స్తన్యవిషం = విషయుక్తమైన స్తన్యమును; దదౌ = యిచ్చెను; సర్వవిద్ = సర్వజ్ఞుడైన కృష్ణుడు

14. శ్లో॥ తద్భావం = దానియొక్క భావమును; జ్ఞాత్వా = తెలిసికొని; స్తన్యపాన మిషేణ = పాలుద్రాగునెపముద్వారా; తామ్ =(దానిని) అనగా ఆపూతనను; జఘాన = చంపెను; సా = ఆపూతన; ఆసురీం= రాక్షస సంబంధమైన; తనుం = దేహమును; దర్శయతి = అందరికి కనుబడేలాగున; భూమౌ = నేలయందు; అపతత్ = పడెను (ప్రాణములు విడిచెను) తతః = అనంతరము; గోపబాలం ఇవ = సామాన్యుడైన గోపబాలునివలె; స్థితం = ఉన్నటువంటి; జగన్నాథం = సర్వజగదీశ్వరుని

15. శ్లో॥ దృష్ట్వా = చూచినవారై; తస్య = ఆ స్వామివారికి; స్వస్తి + అయనం = మంగళాచరణములను; చక్రుః = చేసిరి; గోపగోప్యః = గోపాలకులున్నూ, గోపికా అమ్మవారలున్నూ; అపి = అందరుకూడా; తం = ఆ స్వామివారిని గూర్చి; జగుః = గానముచేసిరి.

కంసుఁడు పంపినపూతన యనునొకరాక్షసి స్తనములయందు విషమునిడుకొని సుందరమైన కామరూపమున సంచరించుచు చూచినబిడ్డలకు స్తన్యము నొసంగి యాబిడ్డల నెల్లఁ జంపుచున్నదై నందగృహంబునకు వచ్చె. ఆసంగతి నాకపటబాలుం డెఱిఁగి దాని స్తన్యముఁ ద్రావుచు ప్రాణములఁ బీల్చెను. అంత నారక్కసి నిజరూపముతో మృతినొంది నేలంగూలెను దానిఁజూచి గోపకులును గోపికలును భయపడినవారై బాలునికి మంగళములు గలుగుటకై భగవంతుని ప్రార్థించుచుండిరి.

నాదనామ క్రియారాగము - జంపెతాళము

ప. మంగళాని తనోతు మధుసూదన స్సదా
గంగాధరో పి తవ సాపి గంగా

అ. శృంగారవారిధే శ్రీవత్సకౌస్తుభా
లంకార శిశుభావ భయవిభంగ

1. అస్తు తే భద్రమిహ దుస్తరభవాంభోధి
విస్తరభయాపహార వస్తుసుఖద
కస్తూరికాతిలకవి స్తీర్ణఫాల జగ
దస్తితాపాదక సదాస్తరహిత

2. అక్షీణసంపదిహ రక్షతు ధరేయ మథ
శిక్షతు హరిస్తవ విపక్షనిచయం
దక్షిణామూర్తి రపి దాక్షిణ్య మావహతు
వీక్షతాం త్వాం సకలసాక్షీ సదయం

3. దుర్గాణి వారయతు దుర్గా సరస్వతీ
భర్గో పి భర్జయతు పాపవర్గం
సర్గాదిసకలసంసర్గసాధక మిహ
మార్గస్సదా వతు తవాపవర్గం

4. పరిపూర్ణ బోధరస పరిపంథిహార సరస
నిరవధికసంపదం దిశతు భూమా
విరచిత మిదంతు శివనారాయణానంద
తీర్థేనపరమపురుషార్థ ఫలినా.

6వ కీర్తన నాదనామక్రియరాగం - జంపెతాళం

మధుసూదనః = శ్రీమహావిష్ణుమూర్తి; సదా = ఎల్లప్పుడు; తవ = నీకు; మంగళాని = మంగళములను; తనోతు = విస్తరింపజేయునుగాక; గంగాధర + అపి = శివుడున్న; సా అపి గంగా = గంగాదేవిన్నీ నీకు మంగళములు కలుగజేయుగాక; శృంగారవారిధే = శృంగారమునకు సముద్రమువంటివాడా; శ్రీవత్స కౌస్తుభఅలంకార = శ్రీవత్సము కౌస్తుభముతో అలంకరింపబడినవాడ; శిశుభావ = పసిబిడ్డగా కనబడుచుండువాడా; భయ విభంగ = సమస్త భయములను పోగొట్టువాడా!

1. దుస్తర భవ అంభోధి = దాటరాని సంసార సముద్రమును; విస్తర = దాటింపజేయువాడ; భయాపహార = సమస్తభయమును పోగొట్టువాడ; వస్తుసుఖద = వాస్తవమైన సుఖమును యిచ్చువాడ (స్వభావసిద్ధమైన సుఖము నిచ్చువాడ); కస్తూరికా తిలక విస్తీర్ణఫాల = కస్తూరి తిలకము ధరించినట్టి విశాలమగునొసలు గలవాడ; జగత్ + అస్తిత + ఆపాదక = జగత్తు స్వతంత్రముగా ప్రవర్తించుచున్నదనే భావము కలిగించువాడ; సదాస్తరహిత = ఎల్లప్పటికిన్ని మోహములేనివాడవగు; తే = నీకు; ఇహ = ఇక్కడ; భద్రం = మంగళములు; అస్తు = అవుగాక

2. ధర + ఇయం = ఈ భూదేవి; ఇహ = ఇప్పుడు; అక్షీణ సంపదం = క్షీణముగాని సంపదగలవానిగా; రక్షతు = రక్షించుగాక; అథ = అనంతరము; తవ = నీయొక్క; విపక్షనిచయం = శత్రు సమూహము; హరి = శ్రీమన్నారాయణమూర్తి; సకలసాక్షి = సమస్త జగత్తును చూచుచుండునటువంటి; దక్షిణామూర్తిరపి = శివుడుకూడనున్నూ; దాక్షిణ్యం అవహతు = కరుణను ప్రసరింపజేయుగాక; త్వాం = నిన్ను; సదయం = దయతోకూడుకొని; వీక్షతాం = చూచుగాక; దుర్గా = పార్వతీదేవిన్ని; సరస్వతి = సరస్వతీదేవిన్ని; తే = నీయొక్క; దుర్గాణి = కష్టములను; వారయితు = నివారణచేయుదురుగాత; భర్గో + అపి = శివుడుకూడ; పాపవర్గం = నీయొక్క పాప సమూహమును; భర్జయతు = నశింపజేయుదురుగాక; ఇహ = ఇప్పుడు; సర్గాది = సృష్టిమొదలైన; సకల సంసర్గ సాధకం = సకల విషయ సంయోగమునకు సాధకమగు; తవ + అపవర్గం = మీయొక్క మోక్ష స్వరూపమైన బ్రహ్మానందము; మార్గః = ధర్మము; సదా = ఎల్లప్పుడు; అవతు = రక్షించుగాక

4. పరిపూర్ణ బోధరస = పరిపూర్ణ జ్ఞానమే స్వరూపముగాగలవాడ; పరిపంథిహర = శత్రువులను హరించువాడ; సరస = హే సరసుడా; నిరవధిక సంపదం = మితిలేని ఐశ్వర్యమును; భూమా = పరమాత్మ; దిశతు = మీకు యిచ్చుగాక; ఇదం తు = ఈ కీర్తన అయితేనో; పరమ పురుషార్థ ఫలిన = పరమపురుషార్థమే (మోక్షమే) ఫలముగా కోరినటువంటి; శివనారాయణ ఆనంద తీర్థేన = శివనారాయణ ఆనందతీర్థులచేత; విరచితం = రచింపబడినది.

ప-అ. మధు వసురాక్షసుని సంహరించి లోకహితము చేసినారాయణుఁడు నీకు మంగళంబులన నొసంగుఁగాత. మఱియు సర్వలోకపావనియైన గంగయు, అగంగను ధరించినశివుఁడును, నీకు శివంబు లొసంగుదురు గావుత. సౌందర్యమునకు సముద్రుఁడ వై శ్రీవత్సకౌస్తుభాలంకారుఁడవై భయము నొందక బాల్యమున వర్ధిల్లుదువుగాత.

1. దాఁటరాని సంసారసాగరమువలనిభయమును దీర్చునట్టి పరమపురుషుఁడు నీకు సుఖమునిచ్చునుగాత ! నిగనిగలాడు కస్తూరిబొట్టు నెమ్మోమున నందము వహింప జగంబులకు సుఖంబు గలుగఁజేయుచు నెల్లకాలమును పుడమి నేలుచుండుమా!

2. ఈ భూమి సకలసంపదలుగలిగి నిన్నుఁ గాపాడుఁగాత ! శ్రీహరి యెప్పుడును నీశత్రుల నడచుఁగాత! దక్షిణామూర్తి నీయెడ కృపఁ జూచుఁగాత! సర్వలోకసాక్షి యగుసూర్యుఁడు దయతోనిన్ను గాచుఁగాత!

3. దుర్గాదేవియు సరస్వతీదేవియు అసాధ్యకార్యముల సాధింత్రుగాత! శివుఁడు నీపాపమును భంజించుఁగాత! ధర్మము నిన్ను సకలకార్యముల రక్షించుఁగాత!

4. సర్వవ్యాపకుఁ డైనభగవంతుండు నీకుఁ బరిపూర్ణజ్ఞానమునొసంగు గాత! సకలవిఘ్నముల నివారించుగాత! ఇట్లని శివనారాయణానంద తీర్థుఁడు పరమపురుషార్థమును నుతియించెను.

గ. సాఖలు నందగోపమహిషీ యశోదాఖ్యా సకలలోకాధార మనాధారమపరిమిత మహిమాన మ ప్యాత్తమహిమాన మవకల్ప్య స్వాంకమారోప్య విద్యుత్పుంజమధ్యాభివ్యక్త నూతనజలధరవద్విద్యోతమానం శ్రీకృష్ణం కరకమలాభ్యాం ముఖాభిమర్శనం కృత్వా భూతితిలకకరణాదినా ప్యాశీర్భి స్సంవర్ధయామాస.

16. గద్య:- సా నందగోప మహిషీ = ఆనందగోప పట్టపుదేవి, యశోదాభ్యాఖలు = యశోద అమ్మవారుగదా; సా, సకలలోకాధారం = (ఆమె) సమస్తలోకములకు ఆధారుడైనట్టి, అనాధార = తనకెవ్వరు ఆధారములేనట్టిన్నీ; అపరిమిత మహిమానం అపి = మితిలేని మహిమగలవాడు అయ్యును, అనాత్త మహిమానం = మహిమలేని (సామాన్యబాలునిగా); అవకల్ప్య = ఎంచి (భావించి); స్వ + అంకం = తన వడియందు; ఆరోప్య = చేర్చుకొని; విద్యుత్ = మెరపులయొక్క; పుంజ = సమూహము యొక్క; మధ్య = మధ్యయందు; అభివ్యక్త = బాగా కనబడుచుండు, నూతన = నవీనమైన, జలధర = మేఘము; వత్ = వలె; విద్యోతమానం = విశేషముగా ప్రకాశించుచున్నట్టి; శ్రీకృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; కరకమలాభ్యాం = తన హస్తకములములచేత; ముఖాభిమర్శనం = ముఖమును తుడుచుటను; కృత్వా = చేసి, భూతి, తిలక = భస్మము తిలకము; కరః = స్వామివారికి యుంచడము; ఆదినా = మొదలైనవాటి చేతనున్నూ; చ+ఆశీర్భిః = ఆశీర్వాదముల చేతనున్నూ; సంవర్ధయామాస = పెంచుచుండెను.

నందగోపునిసతీమణి యగు నాయశోద సకలలోకాధారుఁడయినను నాధారములేనివానిగను, అపరిమితమహిమగలవాఁ డైనను మహిమలేనివానిగను బాలుని దలంచుకొనినదై తొడమీఁద నిడుకొని మెఱపుఁదీఁగెల వెలయు నూతన మేఘంబుభాతి నానావిధరత్నాభరణంబుల భూషితుఁడగు నా బాలకునికిఁ బూర్వోక్తములయిన మంత్రంబుల నుడువుచుఁ గరంబున నభిమంత్రించుచు వక్షంబున రక్ష యిడి మంగళాశాసనంబుఁ జేసె.

శ్లో. నిహతే శకటే పద్భ్యాం తృణావర్తే చ మర్దితే,
కృష్ణేన విష్ణునా సో యం స్వస్థః క్రీడతి బాలవత్ 17

గ. అథ జానుచరాభ్యాం రామకృష్ణాభ్యాం సహయశోదాయా ఆగమనం గీయతే

17. శ్లో॥ విష్ణునా = విష్ణు స్వరూపుడైనటువంటి; కృష్ణేన = కృష్ణునిచేత; పద్భ్యాం = పాదముల (చేత)తో; శకటే = శకటాసురుడు; నిహతే = చంపబడగా; అయం+సః = ఆ, ఈకృష్ణుడు; స్వస్థః = నిర్వికారుడై (ప్రయాసలేనివాడై); బాలవత్ = బాలునివలె; క్రీడతి = ఆడుకొనుచున్నాడు

గద్య:- అథ = అనంతరమందు; జానుచరాభ్యాం = మోకాళ్ళతో సంచరించునటువంటి (దోగియాడు చున్నటువంటి); రామకృష్ణాభ్యాం = బలరామకృష్ణులతో; సహయశోదయా = ఆ బలరామకృష్ణులతోకూడిన యశోద అమ్మవారి యొక్క; ఆగమనం = వచ్చుట; గీయతే = గానము చేయబడుచున్నది.

అంత నొకప్డు శకటాసురుఁడువచ్చి నందునియింటఁ బెట్టియున్న బండియందుఁ జేరి యటశయనించి యున్న బాలగోపాలునిమీఁదికిం దొర్లగా నామేటి బాలకుండు బండిం గూలఁదన్నె. వేఱొకసమయమున సుడిగాలి రూపముతోవచ్చి తృణావర్తుం డనునొకరక్కసుండు త న్నాకసంబునకుఁ గొనిపోవఁగా వానికంఠముల బిగియఁబట్టి నేలపయిం బడంద్రోంచి సంహరించెను. ఇట్లు శత్రుసంహారం బొనర్చి యానందనందనుండు తాను నారాయణుండయ్యును సామాన్యబాలకునివలె బహువిధము లగునాటల నాడుకొనుచు సుఖముగఁ గాలముఁ గడపుచుండెను.

ద్విజావంతీరాగము - ఆదితాళము

| | |
|---|---|
| నందగేహినీ | మందగామినీ |
| సుందరాననా యశోదా | సురమోహినీ |
| నందితామరీ | నీలకబరీ మందం |
| మందమాయాతి | మధురభాషిణీ |
| లోకనాయకం | యోగితారకం |
| బాలక మధ యాతి | భగవంతం కృష్ణం |
| అంబుజాననం | అబ్జలోచనం |
| కంబువర్ణమపి శ్రీ | రామనామానం |

7వ కీర్తన - ద్విజావంతీరాగము - ఆదితాళము

నందగేహినీ = నందునియొక్క భార్యయున్నూ; మందగామిని = మెల్లగా నడచుచున్నది అయిన; సుందరానన = శృంగారముగల మొగము గల్గినట్టిన్నీ; సురమోహిని = దేవతలనుగూడ మోహింపజేయునట్టిన్నీ; నిందిత + అమరీ = దేవతాస్త్రీలనుగూడా మించినట్టి సౌందర్యము కలగినట్టిన్నీ; నీలకబరీ = నీలవర్ణమైన కొప్పుగలదిన్నీ; యశోదా = (అగు) యశోదాదేవి; మధురభాషిణి = మధురమైన సంభాషణజేయుచు; మందం మందం ఆయాతి = మెల్లమెల్లగా వచ్చుచున్న; అధ = మరియు (ఆమె) లోకనాయకం = సర్వలోకేశ్వరుడున్నూ; యోగితారకం = యోగులను తరింపజేయువాడున్నూ; భగవంతం = భగవంతుడున్నూ అయిన శ్రీకృష్ణునిన్నీ; అంబుజాననం = తామరకమలములతో సమమైన మొగముగలిగినటువంటివాడున్నూ; అబ్జలోచనం = కమలములవంటి నేత్రములుకలవాడున్నూ (అగు భగవంతుడైన కృష్ణుని గూర్చిన్నీ), కంబువర్ణము అపి = శంఖము వంటి వర్ణముగలవాడున్నూ - అగు; శ్రీరామనామానం = బలరాముడు అనే పేరుగలవానిని గూర్చిన్నీ, యశోద = యశోద అమ్మవారు; అధ = అనంతరము; ఆయాతి = వచ్చుచున్నది; యశోద = యశోదా అమ్మవారు; సుతం = కుమారుడగు శ్రీకృష్ణునిగని; ఆహ = చెప్పెను (పలికెను)

తర్వాతఁ గొంతకాలమునకు లోకేశ్వరుఁడును భక్తులగువారల నుద్ధరించువాఁడును, భగవంతుఁడగు శ్రీకృష్ణుడు దోఁగాడనారంభించెను. కమలములవంటి విశాలము లగునేత్రములతో పద్మసన్నిభ ముఖముతో శంఖమువలె నతిశుభ్రమగు శరీరకాంతితో సర్వజనులకు నానందమును గలిగించుచు బలభద్రుఁడు గూడ తనతమ్మునితోఁ జేరి విహరించుచుండెను. అతిసుందరమగుముఖమును, నల్లనితలవెంట్రుకలును గల్గి తనసౌందర్యముచే దేవతలను సహితము మోహింపఁజేయఁగలయానందపత్ని యగుయశోదయును, మధురము లగువాక్యములతో నీక్రిందివిధముగా నువలాలనముఁ జేయుచు తన పుత్రుల మందగమనముతో ననుసరించుచుండెను.

## అథ యశోదా సుతమాహ

ద్వి. సకలలోకాధార సచ్చిదాకార
ప్రకటితాగమజాల పద్మావిలోల
అగణితగుణగ్రామ ఆత్మాభిరామ
మృగమదాంకితఫాల మిత్రానుకూల
ఖగరాజవాహ ని ర్గతభవమోహ
నగరాజవరధీర నానావిహార
వికచవారిజనేత్ర విస్ఫురద్గాత్ర
శకలితాసురజాల శాంత్యేకమూల
భగవ న్భయాపహర భక్తమందార
నిగమశీర్షారామ నిత్యాప్తకామ
సకలసన్నుతగుణ సాధుసంత్రాణ
మకరధ్వజాకార మంజులహార
కలితకౌస్తుభశోభ కాలమేఘాభ
బలభద్రకృతఖేల బాలగోపాల
మదనగోపాల స న్మానితశీల
ముద మేహి దేహి సుత మునిబృందవంద్య
సారసాక్ష ముకుంద సచ్చిదానంద
ధీరనారాయణ తీర్థసుగీత

ద్విపద: సకలలోకాధార = సమస్తలోకములకు ఆధారమైనటువంటివాడా; సచ్చిదాకార = సత్యజ్ఞానస్వరూపుడా; ప్రకటిత ఆగమజాల = వేదములను ప్రకటింపజేసినవాడా; పద్మావిలోల = లక్ష్మియందు ఆసక్తిగలవాడా; అగణితగుణగ్రామ = అసంఖ్యాకమైన గుణసమూహముగలవాడా; ఆత్మాభిరామ = ఆత్మయందు అభిముఖుడై రమింపజేయువాడా; మృగమదాంకితఫాల = కస్తూరిచేత తిలకము దిద్దబడిన మోముగలవాడా; మిత్రానుకూల = శరణా గతిచేసినవారి యందు అనుకూలుడా; ఖగరాజవాహ = గరుత్మంతుడే వాహనముగా గలవాడా; నిర్గత భవ మోహ = సంసారమోహమును తొలగించువాడా తొలగిపోయినటువంటి సంసారమోహముగలవాడా; నగరాజవరధీర = శ్రేష్ఠమైన పర్వతరాజముతో సమమైన ధైర్యముగలవాడా; నానావిహార = నానావిధములైన విహారముగలవాడ; వికచవారిజనేత్ర =

వికసించిన కమలముతో సమానమైన నేత్రముగలవాడా; విస్ఫురద్గాత్ర = మెరయుచుండు దేహముగలవాడా; శకలితాసురజాల = కొట్టివేయబడిన రాక్షస సమూహములుగలవాడా; శాంతి + ఏకమూల = శాంతికి ముఖ్యమైనటువంటి హేతువుగలవాడ; భగవన్ = హే భగవంతుడా; భయాపహార = భయములను పోగొట్టువాడా; భక్తమందార = భక్తులకు మందార వృక్షమువంటివాడా; నిగమశీర్షారామ = వేదములకు అగ్రములైన ఉపనిషత్తులయందు విహరించువాడ; నిత్య ఆప్తకామ = ఎల్లప్పుడున్నూ సఫలించిన కోరికలుగలవాడా; సకల సన్నుతగుణ = అందరిచేత కొనియాడబడుచుండు గుణములగలవాడ; సాధుసంత్రాణ = సాధువులను రక్షించువాడ; మకరధ్వజాకార = మన్మధునితో సమానమగు సౌందర్యముగలవాడ; మంజుళహార = మనోహరమైన హారమును ధరించినవాడ; కలితకౌస్తుభశోభ = కౌస్తుభమనే ప్రకాశముతో ఒప్పుచుండువాడ; కాలమేఘ అభ = నీలమేఘముతో సమమగు కాంతిగలవాడ; బలభద్రకృతఖేల = బలభద్రునితో ఆడుకొనుచుండువవాడ; బాలగోపాల = గోపబాలుడా; మధనగోపాల = మన్మధునివంటి గోపాలస్వామీ (మదనో మన్మథోమారః) ఇత్యమరః; సమ్మానితశీల = పెద్దలవల్ల కొనియాడబడుచుండు శీలముగలవాడ; ముదం ఏహి దేహి నుత = కుమారుడా రమ్ము సంతోషమును ఇమ్ము; మునిబృందవంద్య = ముని సమూహముచేత నమస్కరింపబడుచుండువాడు; సారసాక్షముకుంద = కమలములవంటి కన్నులుగలవాడ; ముకుంద (ముక్తిం దదాతి) = మోక్షమును యిచ్చువాడా; సచ్చిదానంద = నిత్యసత్యజ్ఞాన అనంద అనే మానవుడా; ధీరనారాయణతీర్థ = ధైర్యముగల నారాయణ తీర్థులచేత; సుగీత = లెస్సగా గానముచేయుచు పాడుచుండువాడా

సకలలోకములకు నాధారభూతుఁడవై, సత్యము, జ్ఞానము, ఆనందము అనునవియే స్వరూపముగాఁ గలవాఁడవై, నిశ్వాసమువలన వేదములను బుట్టించినవాఁడవై, సకలకల్యాణగుణములకు నాశ్రయుఁడవై, సర్వపదార్థములకంటె నధికముగ నందఱచేతను బ్రేమింపఁబడువాఁడవై, భక్తజనులకు రక్షకుఁడవై, సంసారముతోడను, రాగద్వేషములతోడను సంబంధమేమియును లేనివాఁడవై, రాక్షసులను శిక్షించి సకలలోకములకును శాంతినిఁ గల్గించు మహాత్ముండవై, వేదాంతవేద్యుండవై, సమస్తమునిజనము చేతను స్తోత్రము చేయఁబడుచు వక్షస్థలమునందుఁ గౌస్తుభమణి ప్రకాశించుచుండ లక్ష్మీదేవితోఁ గూడి వైకుంఠమున విహరించుచుండియును, సజ్జనుల రక్షించి దుష్టుల వలన జనించినభయములను నివారించుటకై యీలోకమున గోపాలుఁడవై జనించితివి. ఓ భగవంతుడా! మేఘమువలె నీలవర్ణమై ప్రకాశించుదేహముతోను, మన్మథునిమించు సౌందర్యముతోను, కస్తూరీతిలకముచే నొప్పు ముద్దుమొగముతోను, సకలలోకములకు నానందమును గలిగించుచున్నావు. నీదివ్యగుణముల నెల్లరును గొనియాడుచున్నారు. తనయా! బలభద్రునితోఁ గూడి యొక్కమాఱిటురమ్ము. నాకు సంతసమును గలిగింపుము. గరుడవాహనుండవగు శ్రీమన్నారాయణుండవనియు, హిమవత్పర్వతమువలె నితరులచేఁ దిరస్కరింపరాని ధైర్యముగలవాఁడ వనియు, బుండరీకాక్షుండవనియు నారాయణతీర్థులండను భక్తుఁడు నిన్ను వినుతించుచున్నాఁడు.

శ్లో. జానుభ్యాం పాణిపద్మాభ్యాం వ్రజంతం నందనందనం,
ఆనందయంత మబలాస్సబలం పరమం జగుః.

19. శ్లో॥ జానుభ్యాం = మోకాళ్ళచేతనున్నూ, పాణిపద్మాభ్యాం = హస్తపద్మములచేతనున్నూ, వ్రజంతం = జరుగుచున్నటువంటిన్నీ; ఆనందయంత = సంతోషమును కలుగేయునటువంటిన్నీ, నందనందనం = నందపుత్రుడగు శ్రీకృష్ణుని; సబలం (సహ+బలం) = బలరామసహితముగా, అబలాః = గోపికలు; పరమం = సర్వాతిశయముగా (పరాత్పరునిగా); జగుః = గానము చేసిరి.

ఇట్లు పరమాత్ముఁడగు శ్రీకృష్ణుడు బలభద్రసహితుడై యెల్లఱకుఁ నానందమునుగలిగింపుచు దోఁగాడుచుండుటం జూచి గోపిక లందఱు నిట్లు పాడిరి.

మోహన (నవరోజ్) రాగము - చాపు తాళము

| | | |
|---|---|---|
| ప. | మాధవ మాధవ కృష్ణ | మంగళాలయ శ్రీకృష్ణ |
| అ. | సాధకఫలద కృష్ణ | సబల శ్రీకృష్ణ |
| 1. | నందనందన ముకుంద | సుందరముఖారవింద |
| | నందితగోపికాబృంద | నతజనానంద |
| | ఇందిరాహృదయానంద | ఇందువదన గోవింద |
| | మందరధర సునంద | వంద్య సానంద |
| 2. | దివ్యకస్తూరీతిలక | దీనజన పరిపాలక |
| | భవ్యయోగిభయవారక | భక్తోద్ధారక |
| | అవ్యయభూతిదాయక | అగణితలోకనాయక |
| | నవ్యనవనీతరసిక | నందబాలక |
| 3. | చారునూపుర కోమల | చరణ బాలచాపల |
| | సరససద్గుణజాల | సంగీతలోల |
| | నీరదనీల నిర్మల | నిత్యశుద్ధాగమమూల |
| | నారాయణతీర్థపాల | నతజనాలోల |

**8వ కీర్తనము - మోహన (నవరోజ) రాగము - చాపుతాళము**

**ప. మా = లక్ష్మీదేవికి; ధవ = భర్త అయిన నారాయణుడా; మంగళం ఆలయ = శుభములకు ఉనికిపట్టు అయినవాడా**

**అ. సాధక ఫలద కృష్ణ = నీ సేవ చేయువానికి ఫలమునిచ్చు కృష్ణా; సహ + బల (సబల) = బలరామ సహితుడయిన కృష్ణా**

1. నందనందన = నందునియొక్క కుమారుడా; సుందర ముఖ అరవింద = తామర కమలములవంటి సుందరమైన మొగముగలవాడా, నందిత గోపికా బృంద = గోపికా సమూహములను ఆనందింపజేయువాడా, నతజన ఆనంద = నమస్కరించుచుండు జనులకు ఆనందమునిచ్చువాడా; ఇందిరా హృదయానంద = లక్ష్మి అమ్మవారి మనస్సును ఆనందము చేయువాడా; ఇందువదన = చంద్రునివంటి ముఖముగలవాడా, గోవిందా = గోవులకు విందుచేయువాడా; మందరధర = మందర పర్వతమును ధరించినవాడా (కూర్మావతారము నెత్తినవాడా); సునంద వంద్య = సునందునిచేత నమస్కరింపబడువాడ; స + ఆనంద (సానంద) = ఆనంద సహితుడా

2. దివ్యకస్తూరి తిలక = అప్రాకృతిమైన (దేవసంబంధమైన), దీనజన పరిపాలక = దీనజనులను పాలించేవాడ, భవ్యయోగి = శ్రేష్ఠులైన యోగులయొక్క, భయవారక = సంసార భయమును పోగొట్టువాడ; భక్తోద్ధారక = భక్తులను ఉద్ధరించువాడా; అవ్యయ భూతిదాయక = నాశములేనట్టి ఐశ్వర్యమును యిచ్చువాడ; అగణితలోకనాయక = లెక్కలేని లోకములకు నాయకుడా; నవ్యనవనీతరశిక = నవీనమైన వెన్నముద్దల స్వారస్యము తెలిసినవాడ; నందబాలక = నందునియొక్క కొమారుడా

3. చారునూపుర = సుందరమైన అందెలు ధరించినవాడా; కోమల చరణ = మృదువగు పాదములు గలవాడా; బాలచాపల = బాల్య సంబంధమైన చపలత్వముగలవాడా; సరససద్గుణజాల = రసవంతములైన సద్గుణసమూహములు గలవాడ; సంగీతలోల = సంగీతమునందు ఆనందముగలవాడ; నీరదనీల = మేఘంమువలె నీలముగా నుండువాడ; నిర్మల = మాలిన్యములేనివాడ; నిత్యశుద్ధ = ఎల్లప్పటికి పరిశుద్ధమైనవాడ; ఆగమమూల = వేదములకు మూలస్వరూపుడా; నారాయణతీర్థపాల = నారాయణ తీర్థులను పాలించువాడ; నతజనాలోల = నమస్కరించు జనులయందు ఆసక్తిగలవాడ

ప. ఓ కృష్ణా! నీవే నారాయణుండవు. జగమునకు సకలశుభములను గలిగించువాఁడవు.

అ. సర్వకాలములయందును బలభద్రునితోఁ గూడి ధ్యానించువారలకుఁ గోరినధనముల నొసంగువాఁడవు.

1. లక్ష్మీదేవికి నానందమును గలిగించుపరమపురుషుండ వయ్యును ఉపనిషత్తులచే నుతింపఁబడుచున్నవాఁడ వయ్యును విలాసముగా నందునికిఁ బుత్రుఁడవై భూమియందు జన్మించి పూర్ణచంద్రునివంటి సుందరమగు ముఖముచే మనోహరుండవై గోపికల కానందమును గల్గించుచున్నావనియు, నిన్ను సేవించుభక్తులకు దుఃఖ మెన్నటికిని లేదనియు, సనకసనందనాదులు నినుం గొనియాడుచున్నారు.

2. భక్తియోగముచేతఁగాని, జ్ఞానయోగముచేతఁగాని నిన్ను సేవించు వారలనుద్ధరించువాఁడవు. దీనులై శరణుఁజొచ్చినవారిని భయముఁదీర్చి యపరిమితమగు నైశ్వర్యమును నిచ్చి రక్షించువాఁడవు. ఓసర్వలోకేశ్వరా! యిట్టి వాఁడ వయ్యును మాభాగ్యవశమున నందునకు తనయుండవై కస్తూరీతిలకము మొదలగు నలంకారములచే మిగుల మనోహరుండవై మాచేతనుండి వెన్నముద్దల నందికొని భక్షింపుచు నీగోకులమునందుఁ గ్రీడించుచున్నావు.

3. నారాయణతీర్థసంరక్షకా! పురుషోత్తమా! నీవు వేదాంతవేద్యము నిత్యశుద్ధమునగు పరబ్రహ్మంబయ్యును, భక్తపరాధీనుఁడ వగుటచే మనుష్య బాలభావము నంగీకరించి కాలియందెలు గల్లుగల్లుమనుచుండ మా సంగీతముల వినుటకై యిటునటు దిరుగుచు మమ్మానందింపఁ జేయుచున్నాఁడవు.

శ్లో. ఇత స్తతస్సంచరంతం జగన్మోహనవిగ్రహం,
కరాభ్యా మథ జానుభ్యాం లాలయంతి వ్రజాంగనాః 20

20. శ్లో॥ ఇతః తతః = ఇక్కడ నుంచి అక్కడికి అక్కడ నుండి ఇక్కడికి; కరాభ్యాం = చేతులతోనున్నూ; అథజానుభ్యాం = మోకాళ్ళతోనున్నూ; సంచరంతం = తిరుగుచున్నటువంటి; జగన్మోహన విగ్రహం = జగత్తును మోహింపజేయునట్టి రూపమగు శ్రీకృష్ణస్వామివారిని; వ్రజాంగనాః = గోపికలు; లాలయంతి = లాలింపుచున్నారు.

ఇట్లు జగన్మోహనాకారుఁ డగు శ్రీకృష్ణుడు దోఁగాడుచు గోకులమునం దంతటను సంచరించుచుండ గోపాంగన లబ్బాలు ననేకవిధముల లాలించుచుండిరి.

యదుకుల కాంభోదీరాగము - ఆదితాళము

| | | | |
|---|---|---|---|
| ప. | ఏహి ముదం | దేహి శ్రీ | కృష్ణ కృష్ణ మాం |
| | పాహి గో | పాలబాల | కృష్ణ కృష్ణ |
| 1. | నందగోప | నందన శ్రీ | కృష్ణ కృష్ణ-యదు |
| | నందన | భక్తచందన | కృష్ణ కృష్ణ |
| 2. | కలభగతిం | దర్శయశ్రీ | కృష్ణ కృష్ణ -తవ |
| | కర్ణౌ | చలయశ్రీ | కృష్ణ కృష్ణ |
| 3. | ధావ ధావ | మాధవ శ్రీ | కృష్ణ కృష్ణ - నవ్య |
| | నవనీత | మాహర శ్రీ | కృష్ణ కృష్ణ |
| 4. | విక్రమబలం | దర్శయ శ్రీ | కృష్ణ కృష్ణ - విధి |
| | శక్రాది | సన్నుత శ్రీ | కృష్ణ కృష్ణ |

| | | | |
|---|---|---|---|
| 5. | భవ్యనట | నం కురు శ్రీ | కృష్ణ కృష్ణ - బల |
| | భద్రస | హోదర శ్రీ | కృష్ణ కృష్ణ |
| 6. | చంచలమణి | కుండల శ్రీ | కృష్ణ కృష్ణ - చారు |
| | చంపకనాసా | మౌక్తిక శ్రీ | కృష్ణ కృష్ణ |
| 7. | కుంకుమపం | కిలదేహ శ్రీ | కృష్ణ కృష్ణ - భక్త |
| | శంకర | చరణ శ్రీ | కృష్ణ కృష్ణ |
| 8. | సాధుసాధు | కృత మిహశ్రీ | కృష్ణ కృష్ణ - లోక |
| | సాధక | హితాయశ్రీ | కృష్ణ కృష్ణ |
| 9. | నారదాది | మునిగేయ శ్రీ | కృష్ణ కృష్ణ - శివ |
| | నారాయణ | తీర్థవరద | కృష్ణ కృష్ణ |

9 కీర్తన - యదుకుల కాంభోదిరాగం - ఆదితాళం

కృష్ణ! కృష్ణ! = హే కృష్ణమూర్తీ!; ఏహి = రమ్ము; ముదందేహి = (సంతోషము నిమ్ము); గోపాలబాలకృష్ణ = గోవులను పాలించునట్టి బాలుడైన కృష్ణా!; మాం పాహి = నన్ను రక్షింపుము.

1. నందగోపనందన = నందుడను పేరుగల గోపాలుని కొమరుడా; యదునందన = యాదవులను సంతోషింప జేయువాడా; భక్తచందన = భక్తులను ఆహ్లాదింపచేయువాడ (చది అను ధాతువుకు 'ఆహ్లాదము' అను అర్థము గనుక); కృష్ణ కృష్ణ = కృష్ణుని అవిధముగా అన్వయించడమైనది

2. కలభగతిం = గున్న ఏనుగ నడచిన విధమును; దర్శయ = చూపింపుమా; తవ కర్ణౌచలయ = నీయొక్క రెండు చెవులను ఆడించుమా

3. కృష్ణ మాధవ = లక్ష్మికి భర్తవైన ఓ కృష్ణా; ధావ ధావ = పరుగెత్తుము. పరుగెత్తుము; నవ్య నవనీతం ఆహర = నవీనమైన వెన్నను తీసికొనుము

4. కృష్ణ విక్రమబలం = నీ అంగలు వేయు బలమును; దర్శయ = చూపింపుమా; విధి శక్ర ఆది = బ్రహ్మ ఇంద్రుడు మొదలగువారిచే; సన్నుత = స్తోత్రము చేయబడువాడ

5. కృష్ణ భవ్య నటనం = కృష్ణ! సుందరమైన నృత్యమును; కురు= చేయుము; బలభద్ర = బలరామునియొక్క; సహోదర = సోదరుడా

6. కృష్ణ చంచలమణికుండల = చలించుచున్న మణి కుండలములుగలవాడా; చారు = శృంగారమైన; చంపక = సంపెంగపుష్పమువంటి; నాసా = ముక్కునందు; మౌక్తిక = ముత్యముగలవాడ

7. కృష్ణ కుంకుమ పంకిల = కుంకుమ కలిసిన చందనము పూసిన దేహముకలవాడ; భక్త శంకర = భక్తులకు సౌకర్యమును యిచ్చునటువంటి; చరణ = శ్రీపాదములుగలవాడ.

8. కృష్ణ ఇహ = ఇక్కడ; సాధు సాధు = లెస్సగా లెస్సగా; కృతం = నృత్యము చేయబడినది; లోక = లోకమునందు; సాధక = కార్యసాధకులైనవారికి; హితాయ = మేలును చేయువాడ.

9. నారదాది మునిగేయ = నారదుడు మొదలగు మునులవల్ల గానము చేయబడుచుండునట్టివాడ; శివనారాయణతీర్థ వరద = నారాయణతీర్థులను సంరక్షించువాడ.

ప. శ్రీకృష్ణా! ఇటు రమ్ము. ఓగోపాలబాల! నాకానందమును గల్గించినను రక్షింపుము.

1. నీవు భక్తుల కానందము గల్గించుటకై యదువంశమునఁ బుట్టియు నందునిభాగ్యమున నిటకు వచ్చితివి. (ఇది యథార్థము నూహించిన గోపిక యొక్క వాక్యమని చెప్పవలసియున్నది.)

2. ఓకృష్ణా! యేనుఁగుగున్న నడచినట్లు మఱియొకమాఱు నడచి చూపుము. నీచెవుల నింకొకమాఱు కదలింపుము.

3. ఇదిగో! నాతో గూడఁబరుగిడుము. అచ్చట వెన్నముద్దయున్నది దాని దీసికొనుము. (దాని నిటకు దెమ్ము అని చెప్పుట అంత యుక్తముగా నుండదు)

4. దేవతలందఱును నిన్ను స్తోత్రము చేయుచున్నారు. నాపై నీలబమును జూపుము.

5. బలభద్రునితోఁ గూడి యొక్కమాఱు నృత్యము సేయుము.

6. నీ వాడునప్పుడు రత్నకుండలములును, ముక్కుననుండు ముత్యమును కదలుచుండుటచే వాని కాంతికి ముఖ మెల్లను మిగులఁ బ్రకాశించుచున్నది.

7. కుంకుమపువ్వు గలపినచందనముతో నతిమనోహరమైయొప్పు నీ మూర్తినిధ్యానించుచు, నీపాదముల నాశ్రయించువారికి దుఃఖమెన్నడునులేదు.

8. శ్రీకృష్ణా! నీవు చేసినపని మిగుల బాగుగ నున్నది. సజ్జనుల కానందము (హితము) గల్గించుటయే కదా! నీపని.

9. నీవు నారాయణతీర్థుని మిగుల కరుణతోఁ జూచుచుందువు. నారదాది మహామునులందఱు నెల్లప్పుడును నినుఁ గూర్చియే గానముఁ జేయుచుందురు.

శ్లో. విన్యస్యైకం భువి భువనభృత్పాద మేకం చ హస్తం.
మాత్రా చానుప్రణిహిత మథ స్వాదు హైయఙ్గవీనమ్,
హస్తే గృహ్ణన్ సకలజగతాం సారభోక్తా హ మాత్మే
త్యాచక్షాణో విహరతి జగన్మోహనో నందసూనుః.

21. శ్లో॥ భువన భృత్ = సమస్తలోకములను భరించుచున్న; ఏకం పాదం = ఒక పాదమునున్నూ; ఏకం హస్తం = ఒక హస్తమున్నూ (అనగా ఎడమపాదం ఎడమహస్తం); భువి విన్యస్య = నేలమీద వుంచి (మోపి); అథ = అనంతరం; మాత్రా = తల్లిచేత; అను = బాలభోగము జరిగిన అనంతరము; ప్రణిహిత = తీసి పాత్రలో వుంచబడియున్న; స్వాదు = మధురమైన; హైయఙ్గవీనం = అప్పుడు తీసిన వెన్నముద్దను; హస్తే = తన హస్తమునందు (కుడిహస్తమునందు); గృహ్ణన్ = పట్టుకున్నవాడై; సకలజగతాం = సమస్తజగత్తులయొక్క; సారభోక్తా = సారాంశమును అనుభవించువాడను అనిన్నీ; అహం ఆత్మ = నేను పరమాత్మ అనిన్నీ; ఇతి ఆచక్షాణః = ఇట్లని చెప్పుచున్న వాడమనట్లుగా; జగన్మోహన = జగత్తును మోహింపజేయుచున్నట్టి; నందసూనుః = నందపుత్రుడు; విహరతి = విహరించుచున్నాడు.

సకలజగంబులను బోషించునారాయణుండయ్యును, జగన్మోహనాకారముతో నందపుత్రుఁడై యువతరించియున్న యా శ్రీకృష్ణుడు బహువిధములగు బాలక్రీడలచే సర్వజనులకు నానందమును గలిగించుచుసంచరించుచుండెను. తనతల్లి యగుయశోద అప్పుడే వెన్నను దీసి దాని నొక పాత్రమునందుంచి క్రిందఁబెట్టఁగానే యాకృష్ణుడు దూరమునందున్నను నతివేగముగాఁ దోఁగాడుచువచ్చి యొకపాదమును నొకచేతిని భూమిపై నూని రెండవచేతితో నా పాత్రము దీసిగొని దానిలోనివెన్నను భక్షింపుచుండును. దీనింజూడ నేను పరమాత్మస్వరూపుఁడను. సకలలోకములలోని సారాంశముల ననుభవించు వాఁడను అని యందఱికిని బ్రకటించుచున్న ట్లుండెను

గ. తథావిధమిహ గోపరమణీచిత్తమత్తమాతంగమహనీయాలానభూతం శ్రీకృష్ణం నందగోపమహిషీ స్వసుతమివ లాలయంతీద మాహ.

గద్య: ఇహ తథావిధం = ఇక్కడ ఆప్రకారముగా (వెన్నముద్ద పట్టుకొని దోగాడు చున్నటువంటి); గోపరమణీ = గోపకాంతలయొక్క; చిత్తం = చిత్తములనే; మత్తమాతంగ = మదించిన ఏనుగలయొక్క; మహనీయ = గొప్పదైన; అలానభూతం = ఏనుగనుకట్టు స్తంభము అని యెంచదగిన; శ్రీకృష్ణం = అట్టి శ్రీకృష్ణస్వామివారిని; నందగోపమహిషీ = నందుని పట్టపుదేవి అయిన యశోదా అమ్మవారు; స్వసుతం ఇవ = తన కుమారుని మాదిరిగా; లాలయంతి = లాలింపుచున్నదై; ఇదం ఆహ = ఈ చెప్పబోవు వాక్యమును పలికెను.

ఇట్లు బహువిధములఁ గ్రీడించుచు గోపికాహృదయశుభ లనియెడు మదగజంబులకుఁ గట్టుకంబమై యున్నయన్నారాయణుని దనపుత్రుండ కాభావించి యువలాలనంబు సేయుచు నయ్యశోద యిట్లనియె.

ఆనందభైరవీ (తోడి) రాగము - చాపు (ఆది) తాళము

ప. ఏహి ముదం మమ దేహి - జగ న్మోహనకృష్ణ మాం పాహి

అ. ఏహిసమాహితదీనజనావనమోహరహితమునిముక్తివితరణ

1. కమనీయకౌస్తుభ - శోభకర కలితనవనీత ఘనాభ
సముదితగోకులకలభ - సర్వసహమాన యతివర్యసులభ
అమరేంద్రవల్లభ అనురసుదుర్లభ - విమతమదవిభఙ్గవీరపద్మనాభ

2. చరణజానుకరైరలంతే - బహు సంచరణేన గోపాల
కరధృతనవనీతకబళం - తవ కర్ధమంమాకురువిమలం
పరిపూర్ణ నిజకామపాతకగణభీమ వరనూపురాభరణవసుధా భరణ

3. కంకణకేయూరభూష - కనక కింకిణీకృత బహుఘోష
కుంకుమపంకిల వేష - కుటిల కుంతలగోకులభూష
కింకరహితకరకీర్తిసుధాకర మంగళకరనారాయణతీర్థతోష

10వ కీర్తన - ఆనందభైరవి రాగం - ఆదితాళం

ప॥ జగన్మోహన కృష్ణా = జగత్తును మోహింపచేయువాడా కృష్ణా, ఏహి = ఇటురమ్ము; మమముదందేహి = నాకు సుఖమును ఇమ్ము, మాం పాహి = నన్ను రక్షింపుమా

అ॥ ఏహి = రమ్ము; సమ్యక్ + అహిత (సమాహిత) = బాగా, ధ్యానించుచున్న; దీనజన + అవన (దీనజనావన) = దీనజనులను రక్షించువాడ; మోహరహిత = మోహములేనివాడ; ముని ముక్తి వితరణ = మునులకు మోక్షము నిచ్చువాడ

1. కమనీయ కౌస్తుభశోభ = శృంగారమైన కౌస్తుభమనే మణియొక్క కాంతిగలవాడ; కరకలిత నవనీత = హస్తమునందు వెన్నముద్దను వుంచుకున్నవాడ; ఘనాభ (ఘన+అభ) = మేఘమువంటి కాంతిగలవాడ; సముదిత = బాగా యేర్పడిన; గోకుల = గోకులమందు; కలభ = గున్నఏనుగై అవతరించినటువంటిన్నీ; సర్వ = సమస్తమైన; సహమాన = సహించుచున్నటువంటివాడ; యతివర్య సులభ = యతివర్యులకు సులభముగా నుండువాడ; అమరేంద్రవల్లభ = దేవేంద్రునికి ప్రియమైనవాడ; అసుర, సుదుర్లభ = రాక్షసులకు సాధ్యముకానివాడ, విమతమదవిభఙ్గ = శత్రువుల మదమును భంగపరచువాడ; వీర, పద్మనాభ = వీరాగ్రేసరుడా, నాభియందు పద్మముగలాడ

2. హే గోపాలా తే = ఓ గోపాలుడా మీయొక్క; చరణ, జాను, కరైః = పాదములచేతను, మోకాళ్ళచేతను, చేతులచేతను; బహు, సంచరణేన, అలం = విశేషముగా సంచరించుట చాలును; తవ, కర, ధృత = నీయొక్క చేతియందు ధరింపబడిన; విమలం = నిర్మలమైన; నవనీతకబళం = వెన్నముద్దను; కర్దమం, మా, కురు = మట్టిచేయవద్దు; నిజ, కామం = స్వకీయమైన కోరికలను; పరిపూర్ణ = ఫలించినటువంటివాడ, పాతక గణ భీమ = పాతకములనే సమూహములను నశింపచేయువాడ; వరనూపుర ఆభరణ = శ్రేష్ఠమైన అందెలు ఆభరణములు ధరించినవాడ; వసుధ, ఆభరణ = భూదేవికి భూషణమైనవాడ

3. కంకణ కేయూరభూష = కంకణములు, భుజకీర్తులు మొదలగు భూషణములు గలవాడ; కనక కింకిణీకృత = బంగారు చిరుగజ్జెలచేత చేయబడిన; బహు ఘోష = గొప్ప శబ్దముగలవాడ; కుంకుమ పంకిలవేష = కుంకుమచేత, బురదగా పూయబడినటువంటి చందనముగల శరీరముగలవాడ; కుటిల, కుంతల = వంకలు తిరిగిన, ముంగురులు గలవాడ; గోకులభూష = గోకులమునకు భూషణమువంటివాడ; కింకిరహితకర = దాసులకు మేలుసేయువాడు; కీర్తి సుధాకర = కీర్తికి చంద్రునివంటివాడ; మంగళకర = శుభములు చేయువాడ; నారాయణ తీర్థతోష = నారాయణ తీర్థులను సంతోషపెట్టువాడ.

ప. ఓజగన్మోహనాకారా! కృష్ణా! రమ్ము సంతోషమును గల్గించి నన్ను రక్షింపుము.

అ. శరణాగతు లగుదీనులఁ గాపాడువాఁడవును, అజ్ఞానము మొదలగు వికారములతో సంబంధము లేనివాఁడవును. ధ్యానపరు లగువారికోర్కెల నీడేర్చువాఁడవు నగు నారాయణా! యిటు రమ్ము.

1. శీతోష్ణాదులను సహించుస్థిరచిత్తము గలయోగులకును, సాత్వికులలో నత్యుత్తములగు దేవతలకునుగాక నితరులకు నగోచరుండ వయ్యును, కౌస్తుభరత్నముతో నొప్పు విశాలవక్షస్థలముతోఁ బ్రకాశించు మేఘశ్యామల వర్ణుఁడు నగుపద్మనాభుండవయ్యును, దుష్టుల మర్దింప గోపకుంజరుండవై యిటజన్మించి నవనీతకబళమును హస్తమునందు ధరించి క్రీడించుచున్నావు.

2. ఓగోపాలా! చాలసేపు దోఁగాడితివి. తప్పటడుగులం బెట్టుచు జాలకాలము సంచరించితివి. ఇఁకఁజాలును. నీచేత నుండు వెన్నముద్ద మిక్కిలి శుభ్రముగా నున్నది. దానిని బురదచేయకుము. భూలోకమున కెల్ల నలంకార మగునీయాకారము అందెలు మొదలగుసొమ్ములచే మిగులఁ బ్రకాశించుచున్నది ఆటలమీద యాశ తీరలేదా?

3. కంకణములును, భుజకీర్తులును మొదలగు భూషణములుగలవాఁడవై, కుంకుమపువ్వుతోఁ గూడినచందనము నలఁది వక్రమ లగుముంగురులు ముఖముపై వ్రేలుచుండ బంగరు గజ్జలు గల్లు మన గోకులమున కలంకారభూతుఁడవై యింతసేపు విహరించితివి. భక్తరక్షకుండవును, నారాయణ తీర్థులఁ గాఁచువాఁడవు నగు నోమహాత్మా! యిటు రమ్ము.

శ్లో॥ లాలయంతీ యశోదా సా నందస్య మహిషీ సుతమ్
చరంతం కర్దమభువి త్వరయా జగృహే హరిమ్.

23. శ్లో॥ నందస్యమహిషి = నందునియొక్క పట్టపుదేవి అయిన; సా యశోదా = ఆ యశోదా అమ్మవారు; సుతం లాలయంతి = కొమారుని లాలించినది అయి; కర్దమభువి = బురదనేలయందు; చరంతం హరిం = సంచరించుచున్నట్టి శ్రీకృష్ణుని; త్వరయా జగృహే = తొందరగా పట్టుకొనెను.

ఇట్లానందునిభార్య యగుయశోద తనపుత్రుం డగు శ్రీకృష్ణుఁడు బురద నేలలయందు సంచరించుచుండఁగా లాలనాపూర్వకము లగుమృదువాక్యములతో కట్టకడకు తానే యతిత్వరతో సమీపమునకుఁ జని పట్టుకొనెను.

గ. అయం హి పరమాత్మా పరమప్రేమాస్పదతయాపరమానంద ఘనః - స్వభక్తాను గ్రహచికీర్షయా స్వేచ్ఛయాప్రాప్తగోపబాలకవి గ్రహః - శనైశ్శనైః గోపబాలై స్సహ పద్భ్యా మేవ సంచర౯ అనంతకల్యాణగుణరత్న లీలాకల్లోలాస్పదతయా అత్యంతసౌందర్య రసజలనిధి రపారకరుణానుధానిధి రిహాజయతి భగవా౯ నందకుమారః. తస్యనవనీతచౌర్యాదిలీలా సక్తస్య సబలస్య చోరశిఖామణేః ఆగమనం గీయతే.

24. గద్య:- అయం పరమాత్మ హి = ఈ కృష్ణుడు పరమాత్మయే కదా; పరమప్రేమ + ఆస్పదతయా = పరమప్రేమకు స్థానభూతుడగుటచే;పరమానంద ఘనః = గొప్ప ఆనందముచేత నిండియున్నవాడ; స్వభక్త అనుగ్రహ = తనభక్తులయందు అనుగ్రహమును; చికీర్షయా = చూపించుకోరికచేత; స్వేచ్ఛయా

= స్వేచ్ఛచేతనే (తనకు యిష్టముగానే), ప్రాప్త = స్వీకరించినట్టి, గోపబాలకవిగ్రహ = గోపబాలరూపముగలవాడై; శనైః శనైః = మెల్ల మెల్లగా; గోపబాలైస్సహ = గోపబాలురతోగూడ, పద్భ్యాం + ఏవం = పాదములతోనే, సంచరన్ = తిరుగుచున్నట్టి, అనంతకల్యాణగుణ = అనంతకళ్యాణములను; రత్న = రత్నములకున్నూ; లీలాకల్లోలం = ఓలలు అనునట్టి అలలకున్నూ; ఆస్పదతయా = స్థానముగా నుండుటచేత; అత్యంత సౌందర్యరస జలనిధి = సర్వాతిశయమైన సౌందర్యమనునట్టి నీళ్ళు గల్గిన సముద్రము అని చెప్పబడదగినవాడు. అపారకరుణా సుధానిధి = అంతములేని దయకు పాలసముద్ర స్వరూపుడున్నూ అయినటువంటి. [illegible] - [illegible]గల, నందకుమారః = నందపుత్రుడయిన కృష్ణుడు, ఇహ జయతి = ఇక్కడ సర్వోత్కర్షముగా వర్తించుచున్నాడు; నవనీత = వెన్నముద్దలను, చౌర్యఆది = దొంగలించుట మొదలైన; లీలా, సక్తస్య = వేడుకవ్యాపారమందు ఆసక్తిగలవాడున్నూ, చోరశిఖామణేః = దొంగతనములలో శ్రేష్ఠుడున్నూ, సబలస్య = బలరామ సహితుడున్నూ అగునట్టి; తస్యఆగమనం = ఆకృష్ణునియొక్క విచ్చేయుటను; గీయతే = గానము చేయబడుచున్నదతి.

లోకమునందుండు సమస్త పదార్థములయందలి ప్రేమకంటె నత్యధికమగు ప్రేమకు నాధారభూతుఁడగుటచే పరమానందమయుఁడని చెప్పఁబడును. ఈపరమాత్ముండగు శ్రీహరి తనభక్తులఁ గరుణించుటకై స్వేచ్ఛచే గోపాలరూపమును దాల్చియుండెను గదా? ఆభగవంతుఁడు సమస్తకల్యాణ గుణములకు నాశ్రయుండగుటచే నీమనుష్యబాలరూపమునందుఁగూడ పరిపూర్ణమగు సౌందర్యముతోడను, లోకోత్తర మగుదయతోడను బ్రకాశించుచు వర్ధిల్లుచుండెను, ఆబాలుఁడు క్రమక్రమముగా దోఁగాడుట మాని సవయస్కు లగుగోపబాలురతోఁ గూడి నడువ నారంభించెను. కొంచెము నడుచుటకు నేర్చినది మొదలు వెన్న మొదలగువానిని దొంగలించుటకుఁగూడ నారంభించెను.

ముఖారిరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | కృష్ణం కలయ సఖి | సుందరం - బాల |
| అ. | కృష్ణం గతవిషయ | తృష్ణం జగత్ప్రభ |
| | విష్ణుం సురారిగణ | జిష్ణుం సదా - బాల |
| 1. | నృత్యంత మిహ ముహు | రత్యంత మపరిమిత |
| | భృత్యానుకూల మఖిల | సత్యం సదా - బాల |
| 2. | ధీరం భవజలధి | పారం సకలవేద |
| | సారం సమస్తయోగి | తారం సదా - బాల |
| 3. | శృంగారరసభర | సంగీతసాహిత్య |
| | గంగాలహరీఖేల | సంగం సదా - బాల |
| 4. | రామేణ జగదభి | రామేణ బలభద్ర |
| | రామేణ సహావాప్త | కామేన సదా - బాల |

5. రాధారుణాధర సుధాపం సచ్చిదానంద
రూపం జగత్త్రయ భూపం సదా - బాల

6. దామోదర - మఖిల కామాకరం ఘన
శ్యామాకృతి మసుర భీమం సదా - బాల

7. అర్ధం శిథిలీకృతా నర్థం శ్రీనారాయణ
తీర్థపరమపురు షార్థం సదా - బాల

### 11వ కీర్తన - ముఖారిరాగం - ఆదితాళం

ప॥ హే సఖి = ఓ చెలికత్తె!; సుందరం = సౌందర్యమైనటువంటి; బాలకృష్ణం = బాలుడైన శ్రీకృష్ణుని; కలయ = చూడుమా; గత విషయ తృష్ణం = పోయిన విషయ ఆశగలవాడు; జగత్తు = సకల ప్రపంచముయొక్క; ప్రభవిష్ణుం = సృష్టికర్తయున్నూ; సుర అరి గణ = రాక్షస సమూహములను; జిష్ణుం = జయించినవాడున్నూ అగు; కృష్ణం = కృష్ణుని; సదా కలయ = ఎల్లప్పుడూ సేవింపుచు.

1. ఇహ = ఇక్కడ; ముహుః ముహుః = పలుమారు; అత్యంత = అధికముగా, నృత్యంతం ఇహ = నృత్యము చేయుచున్నట్టిన్నీ; అపరిమిత = అంత్యములేని; భృత్య = భృత్యులయందు (సేవకులయందు) అనుకూలం = మిత్రత్వముగలవాడున్నూ; అఖిల = సర్వవిధముల; సత్యం = నిర్వికారుడు అగు శ్రీబాలకృష్ణుని; సదాకలయ = ఎల్లప్పుడు సేవించుమా.

2. ధీరం = ధైర్యముగలవాడున్నూ (మన బుద్ధులను ఆకర్షించువాడున్నూ); భవజలధిపారం = సంసారమనెడు సముద్రమునకు గట్టు అయినవాడున్నూ; సకల వేదసారం = సమస్తవేదములకు సారభూతుడున్నూ తెలిసికొనబడదగినవాడును; సమస్తయోగితారం = అందరి యోగులను తరింపజేయువాడున్నూ (సంసార సముద్రమును దాటించు) అగు; బాలకృష్ణం = బాలుడైన కృష్ణుని; సదా కలయ = ఎల్లప్పుడును సేవింపుమా.

3. శృంగార = శృంగారమనునట్టి; రస = నీళ్ళతో; భర = నిండిన; సంగీత సాహిత్య = సంగీత సాహిత్యరూపమైన; గంగా లహరీ = గంగా ప్రవాహమునందు; ఖేల సంగం = క్రీడించవలెనను ఆసక్తిగలవాడున్నూ అగుబాలకృష్ణుని; సదా కలయ = ఎల్లప్పుడు సేవింపుమా.

4. జగదభిరామేణ = జగత్తుకంతా మనోహరుడున్నూ; అవాప్తకామేన = సమస్తకోరికలు తీరినటువంటిన్నీ; రామేణ = సర్వఆనందపరుడైనట్టిన్నీ; బలరామేణ సహ = బలరామునితోకూడుకున్నటువంటి; బాలకృష్ణం = బాలకృష్ణుని; సదా కలయ = ఎల్లప్పుడు చూడుమా

5. రాధా అరుణ అధర = రాధా అమ్మవారియొక్క యెర్రనిపెదవియందలి; సుధా పం = అమృతమను పానము చేయునట్టి; సత్ = త్రికాలా బాధ్యమైనట్టిన్నీ; చిత్ = జ్ఞానరూపము అయినట్టిన్నీ; ఆనందం = ఆనందరూపమైనట్టిన్నీ; జగత్రయభూపం = మూడులోకములకు ప్రభువు అయినటువంటిన్నీ ఆ బాలకృష్ణుని సదాకలయ.

6. దామోదరం = పొట్టను త్రాటిచేత కట్టవేయబడినవాడు, అఖిల కామాకరం = సమస్త కామములకును ఆధారుడున్నూ; ఘనశ్యామం = మేఘమువలె నీలవర్ణమైన శరీరముగలవాడున్నూ, దనుజభీమం = రాక్షసులకు భయంకరుడున్నూ అగు

7. అర్థం = అన్నిటికి ప్రయోజన స్వరూపుడున్నూ, శిథిలీకృత అనర్థం = పోగొట్టబడిన అనర్థములుగలవాడున్నూ; శ్రీనారాయణ తీర్థం = నారాయణతీర్థులవారిచే పానము చేయువాడున్నూ; పరమ పురుషార్థం = శ్రేష్ఠమైన పురుషార్థ స్వరూపుడున్నూ అగుబాలకృష్ణుని, సదా = ఎల్లప్పుడు; కలయ = సేవించుమా.

ప. ఓ చెలీ! సుందరాకారుఁడగు నాబాలకృష్ణుని జూడుము

అ. సకలలోకములకును గారణభూతుఁడైనను రాక్షసులకు శత్రువగు శ్రీమన్నారాయణుఁడయ్యును, విషయములందిచ్ఛ లేనివాఁడయ్యును బాలునివలె నటించుచున్నాఁడు.

1. ఈ యనిత్యములగు పదార్థములకంటె నావల సత్యస్వరూపుఁడై యుండువాఁడయ్యును, భక్తులయందలిపరమానుగ్రహముచే నిచ్చట బాలుఁడై బహువిధములుగా నృత్యము చేయుచున్నాఁడు.

2. ఈతఁడే సంసారసముద్రమున కావలిగట్టు. సర్వవేదములకును సారభూతుఁడు. సకలయోగులను సంరక్షించువాడు. మిగుల ధైర్యవంతుఁడు.

3. సర్వకాలములయందును శృంగారరసపరిపూర్ణము లగుగానములును, కావ్యములును పరిశుద్ధము లగుగంగానదీతరంగములవలె నాకృష్ణుని కానందమును గలిగించుచుండును

4. మూఁడులోకములకును మనోహరుఁడై బలమునను దండతకంటె నధికుండై ప్రకాశించు బలరాముతోఁగూడి యాగోపాలుఁ డీదెసకే వచ్చుచున్నాఁడు.

5. మూఁడు లోకములకును రక్షకుఁడయ్యును, సత్యజ్ఞానానందస్వరూపుఁడయ్యును. ఆ శ్రీకృష్ణుడు నేఁడు రాధాలోలుండై యున్నవాఁడు.

6. భక్తులకు సమస్తకామముల నిచ్చువాఁడును, దనుజుల మర్దించు వాఁడును, నీల మేఘశ్యామలవర్ణము గలిగినవాఁడు నగు దామోదరుఁడే యీ బాలకృష్ణుఁడు.

7. ఈ శ్రీకృష్ణుడే సర్వపురుషార్థములలో నుత్తమపురుషార్థము. ఈతనియనుగ్రహమువలననే యనిష్టములన్నియును క్షణమాత్రముఁ దొలఁగి పోవును, ఈబాలకృష్ణుడే నారాయణతీర్థులనుఁ బ్రోచువాఁడు.

గ. నఖలు మహానుభావో లీలయా పరికలితాఖిలాండకోటి బ్రహ్మాండనాయకో మధుసూదననామా వ్రజపురవరసుందరీ పరివేష్టితో వశీకృతమహామాయోపిమాయాపరవశో బాలక ఇవ లీలావినోదం దర్శయ్ - కలభగమనకలభాషణకమలే క్షణమృదుమందహాసాదివిలాసైః నిజపరిజనానానందయన్ - సకలలోకసంరక్షణే జాగరూక స్సన్ స్వకీయపరబ్రహ్మభావ మనుసంధానో నందగోపమందిరే నందసూను రివవిహరతిస్మ.

25 గద్య - స = అశ్రీకృష్ణుడు, మహానుభావః = మహానుభావుడు, ఖలు = కదా!; లీలయా = అనాయాసముగా; పరికల్పిత = నిర్మించబడినటువంటి; అఖిల = సమస్తమైన; అండకోటి = అండకోట్లకు, బ్రహ్మాండ = బ్రహ్మాండమునకు; నాయకా = నాయకుడు; మధుసూదన నామ = మధుసూదనుడు అనేపేరుగలవాడు; వ్రజపుర = రేపల్లెయందు; వరసుందరీ = శ్రేష్ఠమైన సుందరమగు స్త్రీలచేత; పరివేష్టితః = చుట్టుకొనబడినవాడై; మహామాయః = గొప్పదైన విష్ణుమాయను (ప్రకృతిని); వశీకృత = వశపఱచుకున్నటువంటివాడు; అపి = అయివుండికూడా; మాయాపరవశః = మాయపల్ల పరవశుడైన; బాలకయిప = సామాన్యమైన బాలునివలె, లీలావినోదం = క్రీడ మొదలగు చమత్కారములను (నేర్పులను); దర్శయన్ = చూపించుచున్నాడు; కలభగమన = ఏనుగు గున్నవంటి నడకలను, కలభాషణ = అవ్యక్త మధురమైన సంభాషణఱలున్నూ; కమలేక్షణ = తామర కమలములతో సమానమైన నేత్రములున్నూ; మృదు = ప్రియమైన (విధేయమైన); మందహాస ఆది = చిరునగవు మొదలగు; విలాసైః = వేడుకలను; నిజపరిజనన్ = తన పరిజనులను; ఆనందయన్ = సంతోషింజేయుచు; సకలలోకసంరక్షణః = సమస్తలోకములను రక్షించుటయందు; జాగరూకస్సన్ = జాగ్రత్తగలవాడు అగుచూ; స్వకీయం = తన స్వభావ సిద్ధమైనటువంటి; పరబ్రహ్మభావం = పరమాత్మ స్వరూపమును; అనుసంధధాన = స్మరించుచున్నవాడై; నందగోపమందిరే = నందునియొక్క గృహమందు; నందసూనుఃఇవ = నందపుత్రునివలె; విహరతిస్మ = విహరించుచుండెను.

విలాసమాత్రముగా ననేకకోటు లగు బ్రహ్మాండము నిర్మించి వానికీశ్వరుఁడై పాలించుచుండు నామహానుభావుండగు నారాయణుఁ డిట్లు గోపబాలుఁడై గోపాలాంగనలు తన్నుఁ బరివేష్టించియుండ విహరించుచు మాయను జయించినవాఁడయ్యును, దానికి లోఁబడినవాఁడునుంబోలెఁ గపటబాలభావంబు, బ్రకటింపుచునుండె. మఱియుఁ దనమందగమనములచేతను, మధురము లగుసంభాషణములచేతను, కమలమాలికలఁ దిరస్కరించుచూపుల చేతను, మనోహరములగు మందహాసములచేతను, మఱియు ననేకవిధములగు వినోదములచేతను, దనపరిజనుల కానందముఁగల్గించుచుఁ గొంచెమైన నేమరుపాటులేక లోకరక్షణమునుగూర్చి చింతించుచుఁ దనకు స్వభావసిద్ధ మగు పరబ్రహ్మత్వమును సర్వకాలములందు ననుసంధానము చేసికొనుచు నందుని యింట సామాన్యబాలునివలె విహరింపుచుండెను.

శ్లో॥ వ్రజభువినందకుమారే వ్రజబాలబృందకుముదపూర్ణేన్దౌ,
విహరతి తస్య చరిత్రం వ్రజపురనార్యో జగుర్యశోదాయై

26. శ్లో॥ వ్రజభువి = రేపల్లెయందు; వ్రజబాలక = గోపబాలకులయొక్క; బృంద = సమూహములనెడు; కుముద = కలువలకు; పూర్ణ + ఇందౌ = పూర్ణచంద్రుడగు; నందకుమారే = శ్రీకృష్ణస్వామివారు; విహరతి = విహరించుచుండగా; తస్యచరిత్రం = ఆయనయొక్క చర్యలను; వ్రజపురనార్యః = రేపల్లెయందుండు స్త్రీలు; యశోదాయై = యశోదా అమ్మవారికొఱకు; జగుః = గానముచేసిరి.

పూర్ణచంద్రునివలె గోపబాలకుల కానందముఁ గల్గింపుచు నానందనుఁడు వ్రేపల్లెయందు విహరింపుచుండ నాబాలుని దుండగములఁగూర్చి గోపికలందఱు యశోదతో నిట్లనిరి.

కేదారగౌళరాగము - ఆటతాళము

ప. కలయ యశోదే తవ బాలం ఖలబాలకఖేలనలోలం

1. అపహృతబహుతరనవనీతం అనుపమలీలానటనకృతం
కపటమానుషబాలకచరితం కనకకందుకఖేలననిరతం

2. పథిపథిలుంఠితదధిభాండం పాపతిమిరశతమార్తాండం
అధిబలోద్ధృతజగదండం ఆనందబోధరస మఖండం

3. మల్లబాలక ఖేలనచతురం మనసిజకోటిలావణ్యధరం
కల్యాణగుణనవమణినికరం కమనీయకౌస్తుభమణిశేఖరం

4. నవనీతచోరబాలక చరితం నందాదివ్రజపుణ్యతరుఫలితం
ధ్రువపదఫలమేత దతిలలితం భువినారాయణతీర్థయతిఫణితం

12వ - కీర్తన కేదారగౌళరాగం - ఆదితాళం

యశోదా = ఆ యశోదాదేవి; ఖలబాలక = గోపబాలురతో (పోకిరిపిల్లలతో ఆడుచున్నాడు); ఖేలన = ఆడుకొనుటయందు; లోలం = ఆసక్తిగలిగినట్టి; తవబాలం = నీయొక్క కుమారుని; కలయ - చూడుమా

1. అవహృత = దొంగిలింవబడిన; బహుతర = చాలా ఎక్కువ అయిన; నవనీతం = వెన్నముద్దలుగలవాడున్నూ; అనుపమ = ఉపమానములేని; లీలానటనకృతం = విలాసమైన నటనంచేసినట్టిన్నీ; కపట = కపటముగల; మానుషబాలక = మనుష్య బాలునియొక్క; చరితం = నడవడికెగలవాడున్నూ; నిరతం = ఎల్లప్పుడును; కనకకందుక = బంగారుచెండుతో; ఖేలనం = ఆడుచుండువాడున్నూ; అగు; తవబాలంకలయ = నీయొక్క బాలుని చూడుమా

2. పథి పథి = వీధి వీధి యందు; లుంఠిత = పొడవబడిన; దధిభాండం = పెరుగుకుండలుకలవాడున్నూ; పాపతిమిర = పాపమనే చీకట్లకు; శతమార్తాండం = అనేకమైన సూర్యులకాంతి కలవాడున్నూ; అధికబల = గొప్పబలముచేత; ఉధృత = లేపనెత్తబడిన; జగదండం = బ్రహ్మాండముగలవాడు; ఆనందబోధరసం = జ్ఞానానందములయొక్క రసస్వరూపుడున్నూ, అఖండం = ఖండనార్హుడుగానివాడున్నూ అగు; తవబాలంకలయ = నీ కుమారుని చూడుమా

3. మల్లబాలక = మల్లయుద్ధం చేయువారి బాలురతో; ఖేలన = ఆడుకొనుచుండుటయందు; చతురం = నేర్పుగలవాడున్నూ; మనసిజకోటి = కోటిమన్మథులయొక్క; లావణ్య ధరం = సౌందర్యమును ధరించినవాడున్నూ; కళ్యాణగుణ కళ్యాణగుణములు అనునట్టి; నవమణినికరం = కొత్తమణులయొక్క స్థానభూతుడున్నూ; కమనీయ = మనోజ్ఞమైన; కౌస్తుభ = కౌస్తుభము అనునట్టి; మణిశేఖరం = శ్రేష్ఠమైన మణిగలవాడున్నూ అగు; తవబాలం కలయ = నీకుమారుని చూడుము.

4. నవనీతచోర = వెన్నలు దొంగిలించునట్టి; బాలకచరితం = బాలకునియొక్క చరిత్రము ఎట్టిదనగా; నందాది = నందుడు మొదలగు; వ్రజపుణ్యతరుఫలితం = గోకులమునందుగల పుణ్యవృక్షమునందు పండిన ఫలముగా నుండునట్టి, ధృవ, పద, ఫలం = స్థిరమైన స్థానము అనెడు ఫలముగా గలదియు అగునట్టి; అతి లలితం = విశేషమధురమైన, ఏతతు = ఈ కృష్ణకథ; భువి = భూలోకమునందు; నారాయణతీర్థ = నారాయణతీర్థులు అనుయతిచేత; ఫణితం = చెప్పబడినది.

ప. ఓ యశోదా! నీపుత్రుని జూడుము. దుర్మార్గు లగుబాలురతోఁ గూడి యాడుకొనుచున్నాఁడు.

1 వెన్న నపరిమితముగా దొంగలించుచున్నాఁడు. వీనివిలాసములను, వీని యద్భుతములగు కార్యములను జూచిన సామాన్య మనుష్యబాలకుని కార్యములుగాఁ దోఁచుటలేదు. ఎప్పుడు చూచినను బంగరు బంతితో నాడుచుండును.

2 జ్ఞానానందస్వరూపుఁడును, సర్వపరిపూర్ణుఁడును, పాపమను సంధకారమునకు సూర్యునివంటివాఁడును, వరాహరూపమునఁ దనబలముచే నీ ప్రపంచము నుద్ధరించినవాఁడును నగు నా శ్రీమన్నారాయణుఁడే యీ బాలుఁడని తోఁచుచున్నది అయినను వీనిదుర్మార్గములను సహింపలేకున్నాము. ఏవీధియందు గానవచ్చిన పెరుఁగుకుండల నావీధియందే పగులఁగొట్టి యందలి పెరుఁగును ద్రాగుచుండును.

3. మనోహరంబు లగుసద్గుణములతోఁబాటు కౌస్తుభమణికూడ తన కందమును గల్గింపుచుండ మన్మథునియట్లు మిగుల సుందరమగు తనశరీరము నొచ్చుననియైనను దలంపక సర్వకాలములయందును బెట్టెలతో కలహముఁ జేయుచుండును.

4. ఈబాలుఁడు జనించుట మనపూర్వపుణ్యపరిపాకమువలన ననుటకు సందేహము లేదు. అయినను, వీఁడిప్పుడు వెన్నదొంగయైనాఁడు. చక్కని పదములుగల (లేక ధ్రువపదమను పేరుగల) యీమనోహర మగుగీతము నారాయణతీర్థయతిచే రచియింపఁబడియున్నది

గ. అయి సఖి యశోదే తవ తు యశోదాత్వ మన్వర్థయన్ భగవాన్ గోపబాలపరివేష్టితో - బలభద్ర సహాయః తత్రతత్ర త్రాటక్యసంస్పర్శోన్న తగృహనిబద్ధేషు శిక్యేషు సంచితగోరస గ్రహణోపాయానభిజ్ఞాన్ గోపబాలాన్ ప్రతి - తదుపాయ నిచయమాచారతశ్శిక్షయన్ - ఆరురుక్షూ ని వారూఢ యోగీ తత్రత్యదధిదుగ్ధనవనీతాదిక మాకంఠ మాపీయా న్యా నపి పాయయన్ తత్రత్యగోపబాలబిడాలాదిభ్యోనిక్షిపన్ - క్వాపి క్వాపి కరపల్లవకలితవేత్రాదినా విరచితశిక్య భాండవివరా న్నిస్సరంతీ ర్దుగ్ధదధిధారాః - స్వయంపిబన్న న్యానపి పాయయన్ - భాండాని చా స్ఫోటయన్ - విశ్వాత్మా నిత్యసిద్ధవిపులతరపరానందరసతృప్తోపి స్వేచ్ఛయా పరిగృహీ తమూర్తిమత్తయా గోరసపరితృప్తః స్వయ మన్యాంశ్చతర్ప యన్ - ముఖ్యప్రాణ ఇవ వాగాదీ నశ్రాంతో విశ్రాంతిస్థాన మితరేషాం నిజానుచరైస్సహ సానందమిహ విహరతి నందసూనుః.

27 గద్య:- అయేసఖి = ఓ స్నేహితురాలవైన, యశోదే = యశోదాదేవి; తవతుయశోదాత్వం = నీయొక్క కీర్తిని యిచ్చునట్టిది. అనుపేరును; అన్వర్థయన్ = నిజపరచుచు నిజమగునట్లు చేయుచు, భగవాన్ = శ్రీకృష్ణభగవానుడు; గోపాలబాలపరివేష్టితః = గోపాలబాలురతో కూడుకొన్నవాడై; బలభద్రసహాయః = బలరాముని సహాయమగలవాడై, తత్ర తత్ర = అక్కడక్కడ; అశక్య సంస్పర్శ = శక్యముగాని స్పర్శముగల అనగా అందుకొనుటకు సాధ్యముగానట్టి; ఉన్నత గృహ, నిబద్ధేషు = ఎత్తు అయిన ఇండ్లయందు కట్టబడియున్నటువంటిన్ని; శిక్యేషు సంచిత = ఉట్లయందు దాచుకొనబడిన; గోరసగ్రహణ = పాలు మొదలగువాటిని తీసికొనునట్టి, ఉపాయ అనభిజాన్ = ఉపాయములను తెలియనటువంటి; గోపబాలాన్, ప్రతి = గోపబాలకులను గూర్చి; తదుపాయని, చయం = అటుల తీసికొనుటకుగాను ఉపాయములను; అచారతః = తాను స్వయముగా చూపించుటద్వారా; శిక్షయన్ = ఉపదేశించుచూ; అరు రుక్షన్ = యోగములో (యెక్కదలచినవారిని); అరూఢయోగి, ఇవ = యోగారూఢినివలె అనగా యోగములో యెక్కినవానివలె; తత్రత్య = అక్కడవున్న; దధి, దుగ్ధ, నవనీతాదికం = పెరుగుపాలు వెన్న మొదలగు వస్తువులను; ఆ కంఠం, ఆపీయ = కంఠము వఱకు త్రాగి; అన్యాన్ అపి = ఇతరులచేత గూడనున్నూ; పాయయన్ = త్రాగించుచు; తత్రత్య = అక్కడవున్న; గోపబాల = గోపబాలురకొఱకున్నూ; బిడాలాదిభ్యః = పిల్లులు మొదలగువానికొఱకున్నూ; నిక్షిపన్ = వుంచుచూ; క్వాపి క్వాపి = అక్కడక్కడ; కరపల్లవ = చిగురుటాకులవంటి హస్తములయందు; కలిత = వప్పువచ్చు; వేత్ర + ఆదినా = బెత్తము మొదలగువానిచేత; విరచిత = చేయబడిన; శిక్యభాండవివరాత్ = ఉట్లయందుగల కుండల చిల్లుల నుండి; నిస్సరంతీః = కారుచున్నటువంటి; దుగ్ధ దధి ధారాః = పాలు పెరుగు ధారలను; స్వయం పిబన్ = తాను స్వంతముగా త్రాగుచూ; అన్యాన్ అపి పాయయన్ = ఇతరులచేతగూడా త్రాగించుచూ; భాండానిచ = ఆ దుత్తలను (ఆ పాత్రలను); ఆస్ఫోటయన్ = పగులగొట్టుచూ; విశ్వాత్మా = సర్వజగత్తును తన ఉదరముగా గలవాడై; నిత్యశుద్ధ = ఎల్లప్పటికిని పరిశుద్ధమైన; విపులతర = విశాలమైన (గొప్పదైన); ఆనందరస = ఆనందమనే రసముచేత; తృప్తోఽపి = నిండినవాడు అయిగూడా; స్వేచ్ఛయా= తన ఇష్టప్రకారము; పరిగృహీత = ధరించబడిన; మూర్తిమత్తయా = రూపముగలవాడగుటచేత; గోరస, పరితృప్తః = గోరసముచేత తృప్తిగలవాడై; స్వయం, అన్యాంశ్చ = తామున్నూ, ఇతరులచేతనున్నూ; తర్పయన్ = తృప్తినొందించుచు (ముఖ్యప్రాణ ఇవ వాగాదీన్); వాగాదీన్ = వాగాది ఇంద్రియములను; ముఖ్యప్రాణఇవ = ముఖ్యప్రాణములవలె (తృప్తిపఱచుచు) అశ్రాంతః = బడలికలేనివారై (విశ్రాంతి స్థానమితరేషాం); ఇతరేషాం = ఇతరులకు; విశ్రాంతి, స్థానం = బడలికతీర్చునట్టి స్థానభూమి; నందసూనుః = శ్రీకృష్ణుడు; నిజఅనుచరైః = తనయొక్క పరివారముతోగూడా; ఇహ, సానంద = ఈగోకులమునందు, సంతోషముతో; విహరతి = విహరించుచున్నాడు.

సఖీ! యశోదా! నీపుత్రుఁడు నీపేరును బాగుగా సార్థకము సేయుచున్నాఁడు (యశోద యనఁగా కీర్తినిచ్చునది పైవాక్యము విపరీతలక్షణచేఁ జెప్పఁబడినవాక్య మని తెలిసికొనునది. అనఁగా "నీపేరు చెఱుపుచున్నాఁడు" అని తాత్పర్యము) గోపబాలకులు తనవెంట వచ్చుచుండ బలభద్రుని తనకు

సహాయునిగాఁ గొని యిల్లు యిల్లు దూరుచు నచటనున్న పెరుఁగు పాలు మొదలగువానిని దొంగలించుచున్నాఁడు. యోగసిద్ధుఁడగు యోగి తన శిష్యులకు యోగసాధనోపాయంబులం బోధించునట్లు, నీపుత్రుఁడు పెరుఁగు కుండలు మొదలగువానితో నిండియున్న యుట్లు చేతికందక యున్నతముగా నుండెనేని వానిని సాధించుటకుఁ దగిన యుపాయములఁ బ్రక్కనున్న బాలురకు నేర్పుచుండును. వారును మొట్టమొదట నాయుపాయములను దెలియనివారయ్యు నీకృష్ణునియుపదేశమువలనఁ దెలిసికొని యీపెరుఁగు మొదలగువానిని దొంగలించుచుందురు. ఆకృష్ణుడును అచ్చటనున్న పెరుఁగు మొదలగువానిని గంఠమువఱకుఁ ద్రావి కూడనున్న బాలురకు నట్లేద్రావనిచ్చి కొంచెము మిగిలియున్న నచ్చటనుండుపిల్లులకు వేయును. కొన్నికొన్ని చోట్లఁదన చేతనుండు కట్టెతో నుట్టిపైనుండు కుండకు రంధ్రమువైచి దానినుండి కారుపెరుగుఁ పాలు మొదలగువాని ధారను దోయిళ్లతో బట్టి కడుపునిండ ద్రావి, పరులచేతఁ ద్రాగించి, పోవునప్పు డాకుండల సంపూర్ణముగ పగులఁగొట్టిపోవును ఇట్లు నీపుత్రుఁడు స్వయముగా నారాయణుండే యైనను జగన్మయుఁడై పరమానందరసముచేఁ దృప్తినొందియున్న శుద్ధస్వరూపుఁడేయైనను స్వేచ్ఛచే మనుష్యరూపమును ధరించెను. కావున పాలు, పెరుఁగు మొదలగువానితోనే తృప్తిఁ జెందుచున్నాఁడు. ప్రాణము సర్వేంద్రియములకును దనతోఁగూడ తృప్తిని గల్గించునట్లు తనయనుచరులగుగోపబాలకుల కందఱకును తనతో సమానముగాఁ దృప్తిఁ గలిగించుచున్నాఁడు. సర్వజనులకును విశ్రామస్థాన మగునాభగవంతుడు పైనవర్ణించినవిధముగాఁ గొంత నేపైనను విశ్రాంతిం దీసికొనక తన యనుచరులతోఁ గూడి యీగోకులమునందు విహరించుచున్నాఁడు.

> శ్లో. వీథ్యాంవీథ్యాం వ్రజభువి సుఖం సంచరంతం ముకుందం
> మధ్యేమధ్యే ఘృతదధిపయః పాయయంతం పిబంతం,
> బుద్ధౌ బుద్ధౌ వహమహ మితి స్వాంతమాభాసయంతం
> భూయోభూయః సుత మనునయంత్యాహచేదంయశోదా.

28. శ్లో॥ వ్రజభువి, వీథ్యాం వీథ్యాం = గోకులమునందు, ప్రతివీథియందు; సుఖం చరంతం = సుఖముగా, సంచరించుచున్నట్టిన్నీ; మధ్యే మధ్యే = నడుమనడుమ; ఘృత, దధి = నేతిని, పెరుగును; పయః పాయయంతం = పాలను త్రాగించుచున్నట్టిన్నీ; పిబంతం = స్వయముగా త్రాగుచున్నట్టిన్నీ; బుద్ధౌ బుద్ధౌ = ప్రతి బుద్ధియందున్నూ; అహమహమతి = నేను నేను అని; స్వాంతం = మనస్సును; ఆభాసయంతం = ప్రకాశింపజేయుచున్నట్టిన్నీ; సుతం ముకుందం = కుమారుడైన శ్రీకృష్ణమూర్తిని; అను నయంతి = బుజ్జగించుచు; యశోదా = యశోదా అమ్మవారు; ఇదం, ఆహ = ఈక్రింద, చెప్పబోవు విధముగా పలికెను.

ఆనారాయణుం డిట్లు గోపబాలురతోఁగూడి గోకులమునందలి వీథులయందు యధేష్టముగ సంచరింపుచు నడుమ నడుమ వెన్న, పెరుగు, పాలు మొదలగువానిని తాను భక్షించుచు తనచుట్టునున్న బాలురచే భక్షింపఁజేయుచుఁ గ్రీడించుచుండెను. ప్రతిసంకల్పమునందును "నేను, నేను" అని స్ఫురించుచుండు జ్ఞానస్వరూపుఁడగునాసర్వసాక్షిని దనపుత్రునిఁగా భావించుచు నయ్యశోద యిట్లనియె.

కాంభోదీరాగము చాపుతాళము

ప. ఆయాహి మాధవ మాధవ - హే కృష్ణ - ఆయాహి

1. సంగమసమయే తీతే సవితరి మధ్య మాగతే
మంగళాచారోచితే త్వయి
అంగజసలిలావృతే అధిక శ్రమసంయుతే
అంగజ ఖేలనై రలంతే

2. చంద్రమండలసమానచారుదధిఖండఫేన
సాంద్రనవనీతాద్యాహారం
మందిరే మమ గృహాణ మంజునూపురాభరణ
సుందర సుఖయ సాదరం

3. పల్లవా దతికోమలపాదపంకజయుగళ
మల్లికాజాతీసుగంధిత ౹౹౦
పుల్లవం కేరుహదళభూరినేత్ర సుకపోల
పల్లవీమానసాలంకార

4. అలోలమణికుండల అనవద్యమౌక్తికజాల
బాలభావ - ఖేలనలోల
నళినసుందరనాభ నవనీతాహారవిలోభ
నారాయణతీర్థసులభ

13వ - కీర్తన : కాంభోదిరాగం - చాపుతాళం

హే మాధవ! =ఓ శ్రీమన్నానారాయణా!; హే కృష్ణ! = ఓ కృష్ణస్వామీ; ఆయాహి = ఇటురమ్ము

1. సంగమసమయే = (ఆటలాడుకొను) ప్రాతఃకాలము; అతీతే = గడచిపోయినది; సవితరి = సూర్యుడు; మధ్యమ ఆగతే = నెత్తిమీదికి రాగా; త్వయి, మంగళాచార = నీవు, స్నానము మొదలగునవి చేయుటకు; ఉచితే = తగియుండగా; అంగజసలిలే = దేహము నుండి పుట్టిన చమటచేత; ఆవృత = కప్పబడిన; అధికశ్రమ = మిక్కిలి కష్టముచేత; సంయుతె = కూడుకొనబడిన; తే = నీయొక్క; అంగఖేలనైః అలం = దేహపరిశ్రమలు చాలును

2. చంద్రమండల సమాన = చంద్రమండలముతో సమానమైన ధావళ్యకాంతి గలది; చారు = సుందరమైనటువంటి (రుచ్యమైనటువంటి); దధిఖండ, ఫేన = పెరుగుగడ్డయున్నూ, జున్నునూ; సాంద్ర = దట్టమైనటువంటి; నవనీత ఆది = వెన్నమొదలగునటువంటి; ఆహారం = తినదగినవస్తువులను; మమ, మందిరే = నా, గృహమువందు; గృహాణ = గ్రహించుమా,

(తీసికొనుమా); మంజుల = కమనీయమైన (నేత్రానందకరమైన); నూపుర అభరణ = అందెలు అభరణములుగా గలవాడ; సుందర! = సౌందర్యవంతుడా; సః + అదర (సాదర) = అదరముతోగూడిన; సుఖయ = సౌఖ్యమును ఇమ్మా

3. పల్లవ + వతు (పల్లవాత్) = చిగురుటాకువలె; అతికోమల = అమిత సుకుమారమైనటువంటి; పాదపంకజ యుగళ = పాదకమలములుగలవాడ; మల్లికా = మల్లెపూలయొక్క; జాజి = సన్నజాజులయొక్క; సుగంధిత = లెస్సయగు సువాసనగలవాడ; ఫుల్లపంకేరుహదళ = వికసించిన తామర కమలముల రేకులతో సమానమైన; భూరినేత్రః = విశాలమైనటువంటి నేత్రములుగలవాడు; సు కపోల = లెస్సఅయినటువంటి చెక్కిళ్ళుగలవాడు; వల్లవీ మానస = గోపికలయొక్క మనస్సులకు; అలంకార = ఆనందమును యిచ్చువాడ.

4. అలోల = వ్రేలాడుచుండు; మణికుండల = మణికుండలములుగలవాడ; అనవద్య = దోషరహితమైన, మౌక్తికజాల = ముత్యాల హారములుగలవాడ; బాలభావ = బాల లీలలను (పిల్లఆటలను); ఖేలనలోల = ఆడుకొనుటయందు అసక్తిగలవాడ; నళినసుందరనాభ = సుందరమైన తామరకమలమువంటి నాభికలవాడ; నవనీత ఆహార విలోభ = వెన్నముద్దలను తినుటయందు అసక్తిగలవాడ; నారాయణతీర్థ సులభ = నారాయణతీర్థులవారికి సులభముగా దర్శనమిచ్చువాడ

ప. శ్రీమన్నారాయణా కృష్ణా! ఇటు రమ్ము.

1. ఓ సుందరాకారా! ప్రాతఃకాలము గడచిపోయినది. సూర్యుడాకాశమధ్యమునకు వచ్చియున్నాఁడు. స్నానముఁజేసి అలంకారములధరించి వచ్చినవాఁడవయ్యు నిప్పుడు నీశరీరమంతయును దెమ్మట గ్రమ్మి యున్నది. మిగులనలసియున్నావు. ఇక నాటఁ జాలింపుము.

2. చంద్రబింబమువలెఁ దెల్లనిపెరుఁగు, మంచివెన్న మొదలగు నాహారములను దీసికొందువు గాని యింటికి రమ్ము. ఓసుందరాకారా! సమస్త భూషణములచే నలంకృతుండవై ప్రీతితో నన్నానందింపఁ జేయుము.

3. చిగురుటాకులకంటె మృదువు లగుపాదములు గలవాఁడవును, మల్లెజాజి మొదలగుపుష్పములచే నలంకరింపఁబడినవాఁడవును, తామరఱేకులవలె విశాలములగు నేత్రములతోను, సుందరము లగుచెక్కుటద్దములతోను, మనోహరమగు నాకారముతో గోపాంగనలచిత్తములహరించునో బాలకృష్ణా! యిటురమ్ము.

4. శ్రేష్ఠములగు ముత్యాలహారములు మొదలగు భూషణములనుధరించి కుండలములు చలించుచుండ, వీధులయం దాడుకొచున్నావు. వెన్నను తినుటకై యందరియిండ్లకును బోవుచున్నావు. ఓసుందరాకారా! పద్మనాభా! నారాయణతీర్థవరదా! యిటు రమ్ము.

శ్లో. ఇత్యేవం ప్రార్థయంతీ సా గోవిందం నందనందనం,
యశసా పూరయంత్యేషా యశోదా సా నయద్గృహమ్.

29. శ్లో॥ ఇత్యేవం = ఈప్రకారముగా సాయశోదా = ఆయశోదాఅమ్మవారు, నందనందనం = నందపుత్రుడైన; గోవిందం = గోవిందునిగూర్చి, ప్రార్థయంతి = ప్రార్థించినదై, యశసాపూరయంతి = యశస్సుచేత నిండింపజేయుచు; ఏషా, సా = ఈమె ఆయశోదాదేవి, నందనందనం = స్వామివారిని; గృహం అనయత్ = ఇంటికి చేర్చెను

అధిక మగుకీర్తిగలయాయశోద పై వర్ణించినవిధముగా పుత్రుడగు నాకృష్ణుని బ్రతిమాలి యింటికిఁ దీసికొనిపోయెను.

శ్లో. ఆనీయ స్వగృహం బాలం సబలం బాలవత్సలా,
నీలమేఘనిభాకారం యశోదా సమతోషయత్

30. శ్లో॥ బాలవత్సలా = యశోదా అమ్మవారు; నీలమేఘనిభాకారం = నీలమేఘముతో సమానమైన అకారము కలిగినటువంటి; బాలం = స్వామివారిని; సబలం = బలరామునటితునిగా, స్వగృహం = తన ఇంటికి; అనీయ = చేర్చి; యశోదా = యశోదా అమ్మవారు; సమతోషయత = సంతోషింపజేసెను.

ఇట్లు బలరామునితోఁ గూడ నీల మేఘశ్యాముఁ డగునాకృష్ణునియింటికిఁ గొని వచ్చి యాహారాదులచేఁ దృప్తి నొందించెను.

*యమళార్జున భంజనము*

శ్లో. కదాచి దౌద్ధత్య మనంతవీర్యే
హరౌ విలోక్యాప్రతిమం యశోదా,
బబంధ దామ్నా తమశేషబంధు
ములూఖలే బాలవిలాసలోలమ్.

31. శ్లో॥ అనంతవీర్యం = అంతులేని వీర్యము కలిగినటువంటి; హరౌ = స్వామివారియందు; అప్రతిమం + ఔద్ధత్యం = అసమానమైన దుడుకుతనమును; కదాచిత్ విలోక్య = ఒకానొకప్పుడు చూచి; అశేష బంధుం = అందరిని బద్ధపరచునటువంటినీ; బాలవిలానలోలం = బాలక్రీడయందు ఇష్టపడుచున్నటువంటి; తం = ఆస్వామివారిని; ఉలూఖలే = రోటియందు; దామ్నా బబంధ = తాటిచేత కట్టగల్గెను.

ఒకానొకప్పు డాశ్రీకృష్ణుఁ డద్భుత మగుసామర్థ్యముఁ గలవాఁడు. గావున, బాలక్రీడలవశమున నత్యధికమగుదుండగమును జేసెను. దానిఁజూచి యాయశోద సకలలోకములకుబంధువగునారాయణుని రోటికిఁగట్టెను.

శ్లో. ఆకృష్యోలూఖలం తస్మాద్యమళార్జునమధ్యగః,
బభంజ బలవాన్ కృష్ణ స్తావర్జునతరూ హరిః.

32. శ్లో॥ తస్మాత్ = అట్లుకట్టివేసిన చోటనుంచి, బలవాన్ కృష్ణ = బలవంతుడైన శ్రీకృష్ణుడు; ఉలూఖలం = రోటిని; ఆకృష్య = ఈడ్చుకొని; యమళార్జునమధ్యగః = మద్దిమానులరెంట నడుమవచ్చినవాడై; హరిః = స్వామివారు; తౌ అర్జునతరూ = ఆరెండుయేను మద్దిమ్రానులను; బభంజ = పెకళించి క్రిందపడవేసెను.

ఇట్లు కట్టఁబడినపిదప నా శ్రీకృష్ణుఁ డారోటి నీడ్చుచు పార్శ్వమున జంటగా నున్న మద్దులనడుమకుఁ జేరి తనబలముచే వానిఁ గూలఁద్రోఁచెను.

శ్లో. నారదమునివరశాపాద్యమళార్జునవృక్షభావమాపన్నౌ,
యక్షసుతౌ సవిచిత్రందామ్నా బద్ధో ప్యమోచయద్బంధాత్

33. శ్లో॥ నారదమునివరశాపాత్ = మునిశ్రేష్ఠుడైన నారదమునియొక్క శాపము వలన; యమళార్జున వృక్షభావం = రెండుయనుమద్దిమానుల స్వరూపమును; ఆపన్నౌ = పొందినటువంటి; యక్షసుతా = కుబేరుని పుత్రులైన నలకూబరమణిగ్రీవులు; సః = ఆకృష్ణుడు; దామ్నా = తాటిచేత; బద్ధోపి (బద్ధ + అపి) = కట్టబడినవాడైనను; బంధాత్ = శాపమనుబంధములోనుంచి; ఆమోచయత్ = వారిని యిద్దరిని విడిపించెను; విచిత్రం = ఇది మిక్కిలి ఆశ్చర్యము; అధ = అనంతరము; శాపవిముక్తయోః = శాపవిముక్తులు కాబడి, యక్షసుతయో! = నలకూబరమణిగ్రీవులయొక్క; ఆగమనం గీయతే = రాకడ గానము చేయబడుచున్నది.

ఇట్లు తాను కట్టఁబడియేయున్నను నారదశాపముచే నంతవఱకు మద్దిచెట్లుగా నున్ననలకూబరమణీగ్రీవు లనుయక్షకుమారుల విముక్తులం జేసెను. తాను బద్ధుఁడయ్యును పరులకు ముక్తిఁ గల్గించె ననుటయెంతయాశ్చర్యము?

అథ శాపవిముక్తయోర్యక్షసుతయోరాగమనం గీయతే

కాంభోదీరాగము - ఆటతాళము

వృక్షభావబంధముక్తౌ కృష్ణేన — యక్షసుతా వనురక్తౌ
లక్షితవిషయవిరక్తౌ సతతం — లక్ష్మీపతిపాదభక్తౌ
ప్రక్షీణకల్మషభారతయా హరి — భక్తిసుధారసగిరముద్గిరన్తౌ

14వ దరువు కాంభోదిరాగం - ఆటతాళం

కృష్ణేన = శ్రీకృష్ణస్వామివారి వలన; వృక్షభావ బంధముక్తౌ = వృక్షస్వరూపముగానుండి విడుదలచేయబడిన; యక్షసుతౌ = యక్షపుత్రులగు నలకూబర మణిగ్రీవులు; అనురక్తౌ = అన్యోన్యఅనురాగము గలిగినటువంటి; లక్షిత = చూడబడుచున్న; విషయవిరక్తౌ = విషయసుఖములయందు విరక్తిగలవారై; సతతం = ఎల్లప్పుడు; లక్ష్మీపతి పాదభక్తౌ = శ్రీమన్నారాయణునియొక్క పాదకమలములయందు; ప్రక్షీణ కల్మష భారతయా = కల్మషమంతయు నశించియున్నందున; హరిభక్తి = హరిభక్తియనే; సుధారసగిరం = అమృతతుల్యమగు వాక్కును; ఉద్గిరంతౌ = వెళ్ళగక్కుచున్న వారలైరి.

ఇట్లా యక్షకుమారులు కృష్ణునియనుగ్రహమువలన వృక్షాపమను బంధమునుండి విముక్తులై శ్రీకృష్ణునిపాదములయందు మిగుల భక్తిగలవారై తదితరము లగుశబ్దాదివిషయములఁ గోరక చక్కనివైరాగ్యము గలవారైరి (విషయానురాగమే వీరలకు శాపము గలుగుటకు కారణ.) పాపములన్నియును నశించిపోవుటచే భక్తిరసపూరితములగువాక్యములఁ బల్కుచు నా కృష్ణుని సమ్ముఖమునకు వచ్చిరి

శ్లో. తం తుష్టువతు రత్యంతసంతుష్టౌ దివ్యసుందరౌ,
కుబేరతనయౌ యక్షౌ దామోదర మరిందమమ్.

34. శ్లో॥ అత్యంత సంతుష్టౌ = విశేషముగా సంతోషించినటువంటి; దివ్యసుందరౌ = అమిత సౌందర్యము కలిగినటువంటి; కుబేరతనయా = కుబేరుని కుమాండ్లు అగు; యక్షౌ = నలకూబర మణిగ్రీవులు; అరిందమమ్ = శత్రు సంహారకుడు అయినట్టి; తం దామోదరం = శ్రీమన్నారాయణుని (శ్రీకృష్ణస్వామివారిని); తుష్టువతుః = స్తోత్రము చేశిరి.

కుబేరునిపుత్రు లగునాయక్షులు తమశాపమోక్షమువలన మిగుసంతసించి శత్రుసంహారకుఁడగు (రాక్షసులఁ జంపువాఁడు దేవతలను రక్షించువాఁడనుట) నాశ్రీకృష్ణుని నిట్లని నుతించిరి.

కళ్యాణీరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | దామోదర తావక పర | భావ మహం సదా జానే |
| అ. | శ్యామధామన్ భూమన్ | సామాదిసర్వనిగమవాసంజానే |
| 1. | పుండరీకపురమధ్య | పురుషభావేనసిద్ధం |
| | చండభానుకోటిప్రకాశం | చిద్ఘనాకాశం |
| | పండితపరిభావితం | పాపసంఘవివర్జితం |
| | ఖండితమాయావిలాసం | కారణమఖండరసం |
| 2. | సత్యకామాదిగుణకం | సర్వహృదయాభాసకం |
| | నిత్యమంగళనివహం | నిర్గతమోహం |
| | ప్రత్యయబాధితశోకం | ప్రతిభాతిసర్వలోకం |
| | మృత్యుజన్మాదివిరహం | సత్యలోకాదిసర్వదేహం |
| 3. | కమలాసనాదిగీతం | కామయానాదిఫలితం |
| | శ్రీమద శేషవిభవం | ధీరానుభావ్యం |
| | సమరసతయా నిత్యం | విమలయోగివిదితం |
| | అమరరమ్యశ్రీగోకుల | కమనీయగోపాలశరీరం |
| 4. | నరకభయవారకం | నామరూపనిర్వాహకం |
| | పరిపూర్ణానందదాయకం | భక్తతారకం |
| | సురగురుగీతమేకం | సూదితాసురనాయకం |
| | వరనారాయణతీర్థ | వందితపాదపద్మకం |

15వ కీర్తన : కళ్యాణిరాగం ఆదితాళం

ప. దామోదర ! = హేకృష్ణమూర్తే; తావక = మీయొక్క; పరభావం = ప్రకృతికి అతీతమైన స్వరూపమును; అహం = నేను, సదాజానే = ఎల్లప్పుడును ఎరుగుదును.

అ ప శ్యామన్, ధామన్ = నీలవర్ణమైన ప్రకాశముగలవాడ; భూమన్ = సర్వవ్యాపకుడా; సామాది సర్వనిగమవాసం = సామవేదము మొదలగు వేదములే నివాసమైనవాడని; జానే = తెలియుచున్నాను.

1. పుండరీకపురమధ్య = హృత్కమల మధ్యమందు; పురుషభావేన సిద్ధం = పరమపురుషరూపముగా సిద్ధముగా నుండువాడ; చండభానుకోటి ప్రకాశం = తీక్షణమైన కోటిసూర్య ప్రకాశముగలవాడనిన్నీ; చిత్, ఘన, ఆకాశం = జ్ఞానముచేత దట్టమైన ప్రకాశముగలవాడనిన్నీ; పండిత పరిభావితం = జ్ఞానులచేత ధ్యానము చేయబడువాడు; పాపసంఘ వివర్జితం = పాప సమూహములు లేనివాడు; ఖండిత మాయావిలాసం = తుంచివేయబడిన ప్రకృతి విలాసముగలవాడ; కారణం = సమస్త జగత్తుకు కారణ స్వరూపుడా; అఖండరసం = తెంపులేని ఆనందముగలవాడు

2. సత్యకామాది గుణకం = సత్యము, కామము మొదలగు గుణములుగలవాడు; సర్వ హృదయభాసకం = సమస్త హృదయములందు ప్రకాశించువాడు; నిత్యమంగళ నివహం = ఎల్లప్పుడు శుభములు గూర్చువాడు; నిర్గతమోహం = మోహమును జయించువాడు; ప్రత్యయబాధితశోకం = జ్ఞానముచేత బాధించబడునట్టి శోకంగలవాడు; ప్రతిభాస సర్వలోకం = సమస్తలోకములను ప్రకాశింపజేయువాడు; మృత్యుజన్మాది విరహం = జనన మరణములు లేనివాడు; సత్యలోకాది సర్వదేహం = సత్యలోకము మొదలగులోకములను దేహముగా గలవాడు.

3. కమలాసనాదిగీతం = బ్రహ్మ మొదలగు వారిచే గానము చేయబడువాడు; కామయానాదిఫలితం = కామగమనం మొదలగు ఫలములు యిచ్చువాడు; శ్రీమత్ అశేషవిభవం = శ్రీమంతమైనటువంటి సమస్త వైభవములుగలవాడు; ధీరానుభావ్యం (ధీర అనుభావ్యం) = ధీరులచేత ధ్యానింపబడదగినవాడు; సమరసతయా = సమత్వబుద్ధి గలవాడగుటచేత; నిత్యం = ఎల్లప్పుడును; విమలయోగి = నిర్మలమైన యోగులయందు; విదితం = తెలియబడుచుండువాడ; అమరరమ్యం = దేవతలకు శృంగారమైనటువంటి; శ్రీగోకుల = సంపద్యుక్తమైన గోకులమునకు; కమనీయ = మనోహరమైనటువంటి; గోపాలశరీరం = గోవులను పరిపాలించే శరీరముగలవాడు - అని; జానే = తెలిసికొనుచున్నాను.

4. నరక భయవారకం = నరకమనే భయమును తొలగించువాడు; నామరూప నిర్వాహకం = నామరూపముచేత సృష్టిచేయబడినవాడు; పరిపూర్ణానందదాయకం = పరిపూర్ణమైన ఆనందమును యిచ్చువాడు; భక్తతారకం = భక్తులను తరింజేయువాడు; సురగురుగీతం ఏకం = బృహస్పతిచేత గానము చేయబడువాడు; సూదిత అసురనాయకం = రాక్షసప్రముఖులను చంపివేయబడినవాడ; వరనారాయణతీర్థ నందిత = శ్రేష్ఠమైన నారాయణ తీర్థులవారిచే స్తుతింపబడిన; పాదపద్మకం = పాదకమలములుగలవాడవని; జానే = తెలిసికొనుచున్నాను.

ప. ఓశ్రీకృష్ణా! నీవు పరమాత్మరూపుఁడ వగుట నే నెఱుంగుదును.

అ. ఓనీలవర్ణుఁడా! ఋక్సామయజు ర్వేదములచేఁ జెప్పఁబడు సర్వవ్యాపకుఁడవు నీవే యని యెఱుంగుదును.

1. దహరాకాశమధ్యమున పురుషరూపముతో నున్నవాఁడవుగాను, కోటిసూర్యసమానకాంతి గలవాఁడవుగాను, చిన్మయాకాశముగాను, ఏదోషములతోను సంబంధములేనివాఁడవుగాను, మాయాశక్తిని జయించినవాఁడవుగాను, ఆత్మజ్ఞానము కలవారలు నిను భావింపుచుందురు.

2. నీవు సత్యకామత్వము (కోరినకోర్కి తత్ క్షణ మేఫలించుట) మొదలగు కల్యాణగుణములు కలవాఁడవు. బ్రహ్మాండమే శరీరముగాఁ గలవాఁడవు, సర్వజనులచిత్తములను బ్రకాశింపఁజేయుసాక్షివి. సర్వజ్ఞుఁడవు. అజ్ఞానము, జననమరణములు మొదలగువికారములు లేనివాఁడవు. సమస్తమంగళములకును ఆశ్రయభూతుఁడవు. నీస్వరూపమును యథార్థముగఁ దెలిసికొనినయెడల సంసారదుఃఖము సంపూర్ణముగ విడిచిపోవును.

3. సర్వసంపదలు గలవాఁడవై ధ్యానమొనర్చు భక్తులకు కామగమనము మొదలగు నష్టైశ్వరముల నొసంగువాడవయ్యు. సర్వపరిపూర్ణుఁడవగుటచే జ్ఞానులకు సర్వప్రదేశములయందును బ్రత్యక్షమగుచున్న సర్వవ్యాపకుండవయ్యును, దేవతలకుఁ బ్రియము నొనర్చుటకై యాగోకులమునందు మనోహరమగ గోపబాలశరీరముతో జనించినవాడవనియు, బ్రహ్మదులు నిన్ను నుతించుచుందురు.

4. నరకమువలనిభయమును నివారించువాఁడవనియు, నామరూపాత్మకమగు నీప్రపంచమునంతయు నడుపువాఁడ వనియు, లేక యే పేరును జెప్పినను నేరూపమును జూచినను, అంతర్యామివగు నిన్నే చెప్పినట్లు, చూచినటును నేర్పడుననియు, భక్తులగువారికి సంపూర్ణ మగునానంము నొసంగి కాపాడువాఁడవనియు, నేకస్వరూపుఁడ వనియు, రక్కసులంద్రుంచి లోకమునకు మేలు సేయువాఁడవనియు, నారాయణతీర్థులచే సేవింపఁబడిన పాదపద్మములు గలవాఁడ వనియు, దేవగురు వగుబృహస్పతి నిన్నుఁ గీర్తించుచుండును.

శ్లో. దేవం బ్రహ్మపురాంతస్థ్సం పుండరీకాంతరస్థితం,
చిదాకాశం జగద్బీజం వాసుదేవం తమాశ్రయే.

35. శ్లో॥ దేవం = దేవపురం; బ్రహ్మపురాం = బ్రహ్మపురం; అంతస్థం = అంతర్యామిగా యుండువాడు; పుండరీకాంతర స్థితం = హృదయకమలమందు వేంచేసియుండువాడు; చిదాకాశం = చైతన్యములను ప్రకాశింపజేయువాడు; జగద్బీజం = జగత్తుకు బీజప్రభుడున్నూ (కారణభూతుడున్నూ); వాసుదేవం = అన్నిటియందు వసియించియుండునట్టి; తం = అటువంటి (ప్రభువును); ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను.

స్వప్రకాశుఁడును, జ్ఞానస్వరూపుండును, హృదయకమలమమునందుండువాఁడును, ప్రపంచమునకు కారణభూతుఁడును, సకలప్రపంచములును దనయందుగలవాఁడు నగునిన్ను నారాయణు నాశ్రయించెదను.

శ్లో. భగవతి యమళార్జునస్య భంగం
కృతవతి గోకులవాసిభిర్యశోదా
సపది నిజకృపావిముక్తబంధం
హృది పరిరభ్య చకార మంగళాని

36. శ్లో॥ భగవతి = స్వామివారు; యమళార్జున స్యభంగం = యమళార్జునులు అను మద్దిమానులను పడవేసినపనిని; కృతవతి = చేయగానే; నిజకృపా విముక్తబంధం = తనకృపచేత (యమళార్జున భంజనము చేసినట్టి స్వామివారిని); యశోదా = యశోదా అమ్మవారు; హృది = హృదయమునందు; సపది = తక్షణమే, పరిరభ్య = అలింగనముచేసికొని; గోకులవాసిభిః = గోకులమందు కాపురముండువారితో కలిసి; మంగళాని = ఆశీర్వచనమును; చకార = చేసెను.

ఇట్లాభగవంతుఁడు జంటగా నున్న మద్దిచెట్ల భగ్నములం జేసినపిదప నాపల్లి యయం దుండువార లాబాలుని బంధమునుండి విడిచి పుచ్చిరి. అయశోదయుఁ దనపుత్రుని గౌగిలించుకొని ప్రేమతో మంగళముల నాచరించెను

గ. అథ కదాచి దరవిందలోచనే భగవతి వాసుదేవే సబలే గోపబాలబృందపరానంద సుధామహోదధిపూర్ణశశాంకబింబే స్వకుక్షిపరిరక్షితానేకకోటి బ్రహ్మాండనా యకేకృత్రిమమాను షబాలచాపలేన సందర్శితమృద్భక్షణాదిచరితే సుచరితే విహరతి - తదీయలీలావిలసితతచ్చరితం - బలభద్రముఖాదాకర్ణ్య స్వకీయబాలహితైషిణీ దండోద్యతకరా సంతాడయంతీవ తత్సవిధ మాగతా యశోదా భయా దివ ముఖవిదారణం కుర్వతి తస్మిన్ - సకలమపి జగదండమాత్మానం సవిస్మయ మాలోకయామాస.

37. గద్య:- అథ = అనంతరం; కదాచిత్ = ఒకానొకప్పుడు; అరవిందలోచనే = తామర కమలనేత్రుడున్నూ; భగవతి = షాడ్గుణ్య పరిపూర్తిగలవాడున్నూ; సబలే = బలరామసహితుడున్నూ; గోపబాలబృంద = గోపాలకుల సమూహములయొక్క; పరానంద = శ్రేష్ఠమైన ఆనంద మనునట్టి; సుధామహోదధి = పాలసముద్రమునకు; పూర్ణశశాంకబింబే = పూర్ణచంద్రుడు అయినట్టిన్నీ; స్వ, కుక్షే = తన కుక్షియందు; పరిరక్షిత = కాపుదారి చేయబడుచుండు; అనేకకోటి బ్రహ్మాండ నాయకే = అనంత కోటిబ్రహ్మాండములకు నాయకుడైనటువంటిన్నీ; కృత్రిమ మానుషబాలచాపలేన = తాను ధరించిన మనుష్యబాలవేషానుగుణ్యమైన చాపల్యముచేత; సందర్శిత = చూపించబడుచుండు; మృద్భక్షణాదిచరితే = మట్టితినుట మొదలగు ఆటలు కలిగినట్టిన్నీ; విహరతి = మంచినడవడిక కలిగినట్టిన్నీ; తదీయ = ఆయనయొక్క; లీలావిలసిత = లీలచేతయొప్పుచున్న; తచ్చరితం = ఆయన నడవడిని (యశోదఅమ్మవారు); బలభద్రముఖాత్ + ఆకర్ణ్య = బలభద్రస్వామివారివల్ల

విన్నటువంటిదై; స్వకీయ బాలహితైషిణీ = తనో పిల్లవాడికి బుద్ధిచెప్పకోరినదై, దండ, ఉద్యత, కరా = బెత్తమును ధరించిన హస్తముగలదై; సంతాడయంతి ఇవ = కొట్టునట్టి దానవలె; తత్సవిధం = అట్లా కొట్టుటకు తగిన సన్నివేశముతో; ఆగతా = వచ్చినటువంటి; యశోదాభయాత్ : ఇవ = యశోదను చూచి భయపడినవానివలె; ముఖ విదారణం కుర్వతి = నోరు తెఱచి చూపించగా; తస్మిన్ = ఆనోటియందు; సకలజగదండం = బ్రహ్మాండములనంతయును; అభ్యాసం = తన రూపమునున్నూ; స, విస్మయా = ఆశ్చర్యము తోడి, ఆలోకయామాస = చూచెను

మఱియొకప్పుడు సకలప్రపంచమును దనగర్భమునందే యుంచుకొని రక్షించు శ్రీమన్నారాయణుండయ్యును, కపటబాలకవేషముతో విహరించుచుండు నాశ్రీకృష్ణుడు బలరామునితోడను, గోపబాలకులతోడను గూడి గ్రీడింపుచు మంటిం దినెను. దానిని బాలరాముడు మొదలగువారలు చెప్పఁగా విని తనపుత్రునకు మేలు చేయవలయు ననుతలంపున బెత్తము నొకదానిని బట్టుకొని దండింపుదానివలె యశోద కృష్ణునియొద్దకుఁ బోయెను. అప్పుడబ్బాలుండును భయముఁ జెందినవానివలె వెడలిచూచుచుఁ దననోటిం దెరువంగా నందు సకలబ్రహ్మాండములను ఆయశోదకుఁ గానవచ్చెను. తనరూపము కూడ మఱియొకటి యబ్బాలునియుదరమునఁ గాన నయ్యెను.

శ్లో. కర్తారం సర్వలోకానాం మాయామానుషబాలకమ్,
కుక్షౌ సంరక్షితాశేష ముచ్చైః స్తౌ తీతి సాదరమ్.

38. శ్లో॥ సర్వలోకానాం = సమస్తలోకములయొక్క; కర్తారం = సృష్టికర్త అయినటువంటిన్నీ; మాయామానుషబాలకం = తన దివ్య సంకల్పముచేత మనుష్యబాలరూపమును ధరించి నటువంటిన్నీ; కుక్షౌ = తన ఉదరమునందు; సంరక్షిత అశేషం = సంరక్షణ చేయబడుచుండినటి సర్వజగత్తును కలిగినవాడున్నూ అగునట్టి శ్రీకృష్ణస్వామివారిని; ఉచ్చైః = ఎలుగెత్తి, సాదరం = భక్తిపూర్వకముగా; ఇతి = ఇట్లని ఈక్రింద చెప్పినవిధముగా; స్తౌతి = స్తోత్రము చేయుచున్నది.

ఇట్లు చూచి సకలలోకమునకు గారణభూతుఁడును, తనగర్భమునందే సమస్తలోకములను నిలుపుకొని రక్షించువాఁడు నగునారాయణుఁడే గోపబాలవేషమున నున్నాఁడని యెఱింగి యిట్లు స్తోత్రముఁ జేయుచున్నది.

శంకరాభరణము - త్రిపుటతాళము

ప. హరి మీడే శ్రీహరి మీడే దేవం - హరి మీడే

అ. గురుతరాసురభారహర మహ మీడే

1. అఖిలాండకోటి బ్రహ్మాండనాయక మిహ నిఖిలభువనకర్తారం
ప్రకటితనిజవిశ్వరూప మనామయ మఘటితఘటనాకారం

2. స్వర్ధామమ స్తకసూర్యచంద్రనయనవిధ్వస్తమోహ మహం
వర్ధితాఖిలవేదవాచ మాశాశ్రుతి మనిలాను మఖిలదేహం

3. విశ్వహృదయదేశవిపులమహీచరణ శాశ్వతానందఘనం
నిశ్వసితాగమనిర్మలవిజ్ఞాననిత్యకల్యాణనిదానం

4. భక్తజనసమూహభద్రదం భవభయము క్తమమరమృదుగీతం
ముక్తసంగమునీంద్రము క్తిదాననిపుణమూలమాగమబోధితం

5. తరణిశశిమండలకోటికోటి భాస్వరమరవిందభవకారణం
హరిభక్తశివనారాయణతీర్థకృత మిద మఖిలపాతకహరణం

16వ కీర్తన - శంకరాభరణరాగం - త్రిపుటతాళం

హరిం = శ్రీకృష్ణుడైన హరిని, ఈడె = స్తోత్రము చేయుచున్నాను; గురుతర = అమితగొప్పదైన; అసురభార = రాక్షసభారమును; హరం = తీసివేయునట్టి (శ్రీహరిని); ఈడె = నేను

1. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకం = సమస్తబ్రహ్మాండకోట్లకు నాయకుడైనటువంటి; నిఖిలభువన కర్తారం = సమస్తలోకములను నిర్మించినట్టిన్ని; దేవం = దేవుడైనటువంటిన్ని; హరిం = శ్రీమన్నారాయణుని; ఇహ = ఇప్పుడు; ఈడె = స్తోత్రముచేయుచున్నాను; నిజవిశ్వరూపం = తనయొక్క స్వభావసిద్ధమైన విశ్వరూపమును కలిగినట్టివాడున్నూ; ప్రకటిత = ప్రకటించబడినటువంటి; అనామయం = ఆరోగ్యప్రదము గలవాడున్నూ; అఘటిత = జరుగదు అని నిశ్చయించుకున్న కార్యమును; ఘటనాకారం = జరుగునటుల చేయగలవాడున్నూ; అగు; దేవం = శ్రీహరిని; ఈడే = స్తోత్రము చేయుచున్నాను.

2. స్వర్ధామ = స్వర్గలోకము; మస్తక = శిరస్సుగా గల్గియు; సూర్యచంద్ర = సూర్యచంద్రులు; నయన = నేత్రములుగా గలిగియు; విధ్వస్త = నశించునట్టి; మోహం = మోహం గలవారున్నూ; వర్ధిత = వృద్ధిచేయబడిన అనగా శాశ్వతముగా అధ్యయనము చేయించబడుచుండునట్టి; అఖిలవేద, వాచం = సమస్త వేదవాక్యములుగలవాడున్నూ; ఆశా, శ్రుతిం = దిక్కులే, చెవులుగా గలవాడును; అనిల + అసు = వాయువు ప్రాణముగా గలవాడున్నూ; అఖిల, దేహం = సమస్తము దేహముగా గలవాడున్నూ; దేవం హరిం ఈడె = దేవుడైన హరిని స్తోత్రము చేయుచున్నాను.

3. విశ్వహృదయదేశం = సమస్త ప్రపంచమును తన హృదయ ప్రదేశమందుగలవాడున్నూ; విపుల, మహీ, చరణం = విస్తారమైన భూమండలముఅంతపాదములుగా గలవాడు; శాశ్వత, ఆనంద, ఘనం = శాశ్వతమైన ఆనందము దట్టముగా గలవాడున్నూ; నిశ్వసిత, ఆగమం = వేదములే నిశ్వాసముగా గలవాడున్నూ; నిర్మల, విజ్ఞానం = మాలిన్యములేని విశేషజ్ఞానము గలవాడున్నూ; నిత్య కల్యాణనిధానం = మోక్షమునకు అధికారమైనటువంటి - అగు; హరిం, ఈడె = శ్రీకృష్ణుని స్తోత్రము చేయుచున్నాను.

4. భక్తజన సమూహ = భక్తజన సమూహములకు; భద్రదం = మంగళములు యిచ్చువాడున్నూ, భవ భయముక్తం = భవభయములు లేనివాడు; అమరమృదుగీతం = దేవతలనల్ల శ్రావ్యముగా గానము చేయబడుచుండువాడున్నూ; ముక్త = విడువబడిన; సంగ = సంగముగల; మునీంద్ర = మునిశ్రేష్ఠులకు; ముక్తి = మోక్షము; దాన = ఇచ్చుటయందు; నిపుణ మూలం = నేర్పుగల మూలమున్నూ; ఆగమబోధితం = వేదవేద్యుడున్నూ; శ్రీ, హరిం, ఈడె = అయిన శ్రీహరినిగూర్చి నమస్కరించుచున్నాను; తరణి = సూర్యుడున్నూ; శశి = చంద్రుడున్నూ, మండల = వీరి మండలములయొక్క; కోటికోటి భాస్వరం = కోటికోట్ల ప్రకాశముగలవాడున్నూ, అరవిందభవకారణం = బ్రహ్మదేవునికి కారణభూతుడు అగు నిన్ను; ఇదం గీతం = ఈ గీతము, అనగా, హరిభక్త శివనారాయణ తీర్థ = హరిభక్త శివ నారాయణ తీర్థులవల్ల చెప్పబడి; అఖిల పాతకహరణం = సమస్త పాతకములను పోగొట్టబడినటువంటిది. కనుక; శ్రీహరిం ఈడె = శ్రీహరికి నమస్కరింతును.

ప. స్వప్రకాశుఁడగు శ్రీమన్నారాయణుని స్తోత్రముఁ జేయుచున్నాను.

అ. భూమికి భారముగా నున్నరక్కసుల వధించు శ్రీమన్నారాయణుని నుతించుచున్నాను.

1. వికారము లేవియులేనివాఁడును, సృష్టికర్తయును, బొత్తుగా సంబంధమే లేనివానికిఁ గూడ సంబంధమును గలిగింప సమర్థుఁడును అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును అగు నారాయణుఁడిప్పుడు స్వయముగనే తనవిశ్వరూపమును బ్రకటించెను.

2. స్వర్గము శిరముగాను, సూర్యచంద్రులు నేత్రములుగాను, వేదములు వాక్కులుగాను, దిక్కులు శ్రోత్రములుగాను, వాయువు ప్రాణముగాను, బ్రహ్మాండమయముగుశరీరమును దాల్చియు, మోహాదివికారములఁజెందని యానారాయణుని నుతించెదను.

3. భూమియే పాదములుగాఁ గలవాఁడ వనియు, ఆనందమయుఁడ వనియు, సకలవేదములను నిశ్వాసప్రాయములనుగా నుచ్చరించినవాఁడవనియు, జ్ఞానస్వరూపుఁడ వనియు, మంగళకరుఁడ వనియు, సర్వజనులను నినుభావింపుచుందురు.

4. భక్తులగువారలకు నిహపరసౌఖ్యముల నొసంగుచు సర్వకాలముల యందును దేవతలచే మనోహర మగురీతిఁ గీర్తింపఁబడుచుందువు. వేదాంత వేద్యుఁడవై మూలకారణంబవై సంసారవికారములతో సంబంధములేని వాఁడవై సంపూర్ణవైరాగ్యవంతులై నినుఁ దెలిసికొనుయోగులకు మోక్షము నిచ్చువాఁడవై యున్నావు.

5. నీవు అనేకకోట్ల సూర్యచంద్ర బింబములకాంతి గలవాఁడవు. బ్రహ్మదేవునకు జనకుండవు. సకలపాపములం బోఁగొట్టఁజాలు నీపవిత్ర మగుగీతము నారాయణతీర్థునిచే రచియింపఁబడినది.

శ్లో. గోవింద ఘటయానందం పరమామ్నాయగోచర,
శ్రీనందతనయా శేషయోగి ధ్యేయపదాంబుజ

39. శ్లో॥ హే పరమ! = హే సర్వాతిశయుడ; ఆమ్నాయగోచర = వేదములవల్ల గోచరించువాడ; శ్రీనందతనయ = సంపద్యుక్తుడైన నందునియొక్క కుమారుడ; అశేషయోగిధ్యేయ పదాంబుజ = సమస్తయోగులవల్ల ధ్యానింపబడుచుండు పాదపద్మములుగలవాడ; గోవింద! = శ్రీకృష్ణస్వామి; ఆనందం = సంతోషమును; ఘటయ = ఒనగూర్చుమా

ఓవేదవేద్యా! సమస్తయోగులచేతను ధ్యానింపబడుచున్న యో నారాయణా! నీవు నందునకుఁ బుత్రుడవైతివి. నాకానందమునుఁ గలిగింపుము.

17వ కీర్తన - కాంబోధి - జంపెతాళం

| | | |
|---|---|---|
| ప. | గోవింద ఘటయ | పరమానంద మమృత మిహ |
| అ. | శ్రీనందతనయ బహు | యోగీంద్రసురవినుత |

| | | |
|---|---|---|
| 1. | అగణితగుణగ్రామ | అపరిమితనిజకామ |
| | నిగమపరమారామ | నిఖిలమోహవిరామ |
| | నగధర ఘనశ్యామ | నతజనకుముదసోమ |
| | అఘహరణ సర్వసమ | అసురమండలభీమ |
| 2. | పరమపురుషాశేష | పాలపరిజనతోష |
| | పరిహృతాఖిలదోష | పతగవాహన శేష |
| | పర్యంక మృదుభాష | పరమమంగళవేష |
| | నిరపద్యగోపపురి | నియత వరమణిభూష |
| 3. | నవమౌక్తికాహార | నందగోపకుమార |
| | భవబంధనవిదూర | భద్రద సుఖాకార |
| | అవనతజనాధార | అపరిమితశుభచార |
| | నవనీతచోర నర | నారాయణావతార |
| 4. | శరదిందుసమవదన | శతమన్మథసమాన |
| | గురుతరానందఘన | కుందసుందరరదన |
| | పరిపంథిగణదళన | పాలితాఖిలభువన |
| | నరసనారాయణతీర్థ | సత్యఫలదాన |

ప॥ హేగోవింద! = ఓ గోవిందుడా!; శ్రీనందతనయా సంపద్యుక్తుడైన నందుని కుమారుడ; బహుయోగీంద్ర = అనేకమంది యోగిశ్రేష్ఠులవల్లను; సుర వినుత! = దేవతలవల్ల స్తోత్రముచేయబడువాడ; ఇహ, అమృతం = ఇక్కడ, నిత్యమైన (నశింపులేని) పరమానందం = శ్రేష్ఠమైన ఆనందమును; ఘటయ = సమకూర్చుమా

1. అగణిత గుణగ్రామ = లెక్కపెట్టుటకు అలవికాని గుణసమూహములుగలవాడ; అపరిమితనిజకామ = పరిమితములేని స్వకీయమైనటువంటి కామ్యమాన పదార్థములుగలవాడ, నిగమపరమ ఆరామ = వేదములనునట్టిశ్రేష్ఠమైన విహారస్థానములు (ఉద్యానవనములు) గలవాడా; నిఖిల మోహ విరామ = సమస్త మోహముల నశింపజేయువాడ; నగధర = మందర పర్వతమును మోసినవాడ; ఘనశ్యామ = మేఘమువలె శ్యామలవర్ణముగలవాడ; నతజనకుముద సోమ = నమస్కరించు జనులనే కలువలకు చంద్రుని వంటివాడ; అఘహరణ = పాపములను నశింపజేయువాడ; సర్వసమ = సర్వసమత్వముగలవాడ; అసుర మండలభీమ = రాక్షస సమూహములకు భయమును యిచ్చువాడ.

2. పరమపురుష! = ప్రకృతికి అతీతమైన పురుషుడా; అశేషపాల = సమస్త జనులను పాలించువాడ; పరిజనతోష = భక్తులకు సంతోషమును యిచ్చువాడ; పరిహృతఅఖిలదోష = సమస్తదోషములను పోగొట్టువాడ; పతగవాహన! = గరుత్మంతుని వాహనముగాగలవాడ; శేషపర్యంక! = శేషమూర్తినే పాన్పుగా గలవాడ; మృదుభాష! = లాలిత్యముగా భాషించువాడ; పరమమంగళవేష = శ్రేష్ఠమైన శుభప్రదమగు రూపముగలవాడ; నిరవద్య = దోషరహితమైన గోపపురి = రేపల్లెయందు; నియత వరమణిభూష = శ్రేష్ఠమైన మణిభూషణములుగలవాడ

3. నవమౌక్తికాహార = నవీనమైన ముత్యాల హారములుగలవాడ; నందగోపకుమార = నందగోపుని కుమారుడ; భవబంధన, విదూర = కర్మబంధములకు దూరమైనవాడ; భద్రద = మంగళములు ఇచ్చువాడ; సుఖాకార = సుఖములనిచ్చు ఆకారముగలవాడ; అవనతజనాధార = నమ్రులైన జనులకు ఆధారమైనవాడ; అపరిమిత శుభదార = పరిమితములేని శుభములైన చర్యలుగలవాడ; నవనీతచోర = వెన్నను దొంగిలించువాడ; నరనారాయణ అవతార = శ్రీమన్నారాయణ మూర్తియొక్క అవతారస్వరూపుడా

4. శరత్ ఇందుసమవదన = శరత్కాల చంద్రునితో సమమైన ముఖముగలవాడా; శతమన్మథ సమాన = అనేకులైన మన్మథులతో సమానమైన; గురుతర ఆనందఘన = శ్రేష్ఠమైన ఆనందముచేత దట్టమైనవాడ; కుంద మందరరదన = మల్లెమొగ్గలవలె మందరమైన పలువరుసగలవాడ; పరిపంథి గణదళన = శత్రువులయొక్క సమూహములను చీల్చివేయువాడ; పాలితాఖిల భువన = పాలింపబడుచుండు సమస్తమైన లోకములుగలవాడ; సరస, నారాయణతీర్థ = రసగ్రాహియగు నారాయణతీర్థులు అనుకవికి; సత్యఫల దాన = చేతమునికి ఫలమును (శాశ్వతపదవిని) ఇచ్చువాడ

వ. ఓవేదవేద్యుఁడ వగునారాయణా! నాకు పరమానందరూప మగు మోక్షమును గల్గింపుము.

అ. అనేకు లగుయోగులచేతను, దేవతలచేతను నుతింపఁబడుచుండువో మహాత్మా! నీవు నందునకుఁ బుత్రుఁడ వైతివి.

1. సమస్తకల్యాణగుణములకు నాశ్రయుండవును, సర్వసమృద్ధులు గలవాఁడవును, (ఇచ్చట కామపదమునకు 'కోరఁబడుపదార్థము' అని యర్థము) వేదమే విహారస్థానముగాఁగలవాఁడవును, అజ్ఞానమును బోఁగొట్టువాఁడవును, మందరపర్వతమును ధరించినవాఁడవును, నీలమేఘశ్యాముండవును, భక్తులని యెడుకలువలకు చంద్రునివంటివాఁడవును, పాపములఁ బోఁగొట్టువాఁడవును అగు నోమాధవా! నీవందఱియెడను సమానుండవయ్యును దుష్టులగుటచే రాక్షసుల దండించుచుందువు.

2. దోషరహితుఁడగు నోగరుడవాహనా! శేషశయనా! నీవు పరమాత్ముండవయ్యును, సకలలోకరక్షకుండ వగుటచే భృత్యులమగుమ మ్మానందింపఁజేయ నీవ్రేపల్లెయందు మనోహరాకా రుండ వై జనించి మే మొసంగిన రత్నభూషణాదులగ్రహించి ముద్దుపల్కుల పల్కుచు విహరింపుచున్నావు.

3. ఓమాధవా! నీవు నరనారాయణరూపముతో భూమికి మేలుసేయ నందపుత్రుండవై యవతరించితివి. పరమానందస్వరూపుండవయ్యును, అతి నిర్మలము లగు చరిత్రలు గలవాఁడ వయ్యును సంసారబంధము లేనివాఁడ వయ్యును, భక్తులను సంతోషింపఁజేయుటకై ముత్యాలహారములు మొదలగు భూషణములతోను, (ముక్త అనుపదమే ముక్తిక అని యుపయోగింపఁబడియున్నది) వెన్నను దొంగలించుట మొదలగులీలలతోడను సంచరింపుచున్నాఁడవు.

4. శరత్కాలచంద్రునితో సమానమగుముఖముతోడను, మల్లెమొగ్గలవలె సుందరములగు దంతములతోడను, మనోహరమై మన్మథునిమించు సౌందర్యముతో సకలజనులకు నానందము గల్గింపుచు శత్రులగువారిని సంహరించి లోకము నుద్ధరింపుచు, నారాయణతీర్థుని యభీష్టము నీడేర్చుచు నున్నావు.

శ్లో. ఇత్యేవం ప్రార్థయంతీం తాం యశోదాం నందనందనః,
భూయ స్సందర్శయామాస బాలభావం స్వలీలయా.

40. శ్లో॥ ఇతి + ఏవం = ఈప్రకారముగా; ప్రార్థయంతీం = ప్రార్థించుచున్నట్టి; తాం యశోదాం = ఆ యశోద అమ్మవారిని గూర్చి; నందనందనః = నందుని పుత్రుడైన శ్రీకృష్ణుడు; భూయః = మరల; స్వ,లీలయా = తన లీలచేత; బాలభావం = బాల స్వరూపమును; సందర్శయామాస = చూపించెను.

ఈ విధముగా నాయశోద ప్రార్థింపుచుండఁగనే ఆ నందకుమారుఁడు తనలీలచే సామాన్య మగు బాలరూపమును మఱలఁజూపెను.

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం

శ్రీకృష్ణబాలలీలావర్ణనం నామ ద్వితీయతరఙ్గః

# తృతీయ తరంగము ప్రారంభము

## కథానుక్రమణిక

## వత్సపాలనావర్ణనము

శ్లో. అథాభినీయతే కృష్ణకృతం గోవత్సపాలనమ్,
అదౌ నంద స్తతో గోప్యో బలభద్రస్తతో హరిః
బలేన సహ కృష్ణేన వత్సానాం పాలనం కృతమ్,
కృతే వత్సాపహారే చ బ్రహ్మణా కృతసంస్తుతిః
యజ్ఞపత్నీ స్తుతి శ్చాత్ర సంగ్రహస్తు తృతీయకే,
నందాద్యాగమనం పూర్వం గోపబాలై ర్బ లేనచ.
సహైవాగమనం బాలకృష్ణ స్యాథానుగీయతే.

కథానుక్రమణిక : - వత్సపాలనా వర్ణనము

శ్లో॥ అథ కృష్ణకృతం = అనంతరము కృష్ణునివల్ల ఆచరించబడిన; గోవత్సపాలనం = ఆవుదూడలను పాలించుటను; అభినీయతే = వర్ణింపబడుచున్నది; అదౌ నందః = మొట్టమొదట నందుడున్నూ; తతః, గోప్యః = అనంతరం గోపీ అమ్మవారున్నూ; బలభద్రః = బలరాముడున్నూ; తతః = అనంతరమందు; హరిః = శ్రీకృష్ణస్వామిన్నీ; (ఈపాత్రలు యీ తరంగములో రాబోవుచున్నవి); బలేనసః కృష్ణేన = బలరామునితోకూడుకొనిన కృష్ణునిచేత; వత్సానాం పాలనం కృతం = దూడలను మేపునట్టి చేయబడినది; కృతే వత్సాపహారేచ = దూడలు హరించబడగా ; బ్రహ్మణా కృత సంస్తుతిః = బ్రహ్మదేవునిచేత చేయబడిన స్తోత్రమున్నూ; యజ్ఞపత్నీ స్తుతిః = విప్రభార్యలు స్తోత్రము చేయుటయున్నూ; అత్ర, తృతీయకే = ఈ మూడవ తరంగమునందు; సంగ్రహం = సంక్షిప్తముగా చెప్పబడుచున్నది; పూర్వం నందాది ఆగమనం = మొట్టమొదట నందుడు మొదలగువారు వచ్చుటయున్నూ; అథ గోపబాలైః = అనంతరము గోపబాలకులతో గూడాను; బలేనచ = బలరామునితో గూడాను; సహైవ = వాండ్లతో గూడాను; బాలకృష్ణస్య = బాలకృష్ణునియొక్క; ఆగమనం అనుగీయతే = వచ్చుటను చెప్పబడుచున్నది; నందగోపస్యఆగమనం = నందుడు ప్రవేశించడము; అథ, బలరామస్య, ఆగమనం = అనంతరం బలరాముడు ప్రవేశించబడమున్నూ

**వత్సపాలనావర్ణన మనునీమూఁడవతరంగమున కృష్ణుఁడు లేఁగలను పరిపాలించుట వర్ణింపఁబడును. అందు మొదట నందుఁడును, గోపికలును, బలరాముఁడును, శ్రీకృష్ణుఁడును వచ్చుటయు, బలరామునితోఁ**

గూడి శ్రీ కృష్ణుడు గోవత్సములను బరిపాలించుటయు, అట్లు పరిపాలించుచుండఁగా బ్రహ్మదేవుఁ డాలేఁగల నపహరించి, కృష్ణునిప్రభావమున కాశ్చర్యపడి యాయనను వినుతించుటయు యజ్ఞము చేయుచున్న బ్రాహ్మణులయొక్క పత్నులాహరిని గీర్తించుటయు ననునది యీతరంగమునందలి కథాసంగ్రహము. మొట్టమొదట నందాదులు వచ్చుటనుగూర్చియు, తర్వాత గోపబాలకులతోడను, బలరామునితోడనుం గూడి శ్రీకృష్ణుఁడు గోవత్సములతో వచ్చుటను గూర్చియు గానము సేయఁబడును.

## రామకృష్ణులు గోవులఁ గాచుట

*నందగోపస్యాగమనమ్*

మధ్యమావతీరాగము - ఆదితాళము

| | |
|---|---|
| గోపైరనుగతోనిత్యం | గోబృందాని విచారయన్ |
| గోపాలకస్వామీ నంద | గోపో మహా న్విరాజతే |

నందగోపో = గొప్పవాడైన నందగోపుడు; గోపాలస్వామి; గోపాలురకు ప్రభువైనవాడు; నిత్యం = అనుదినము; గోపః అనుగతః = గోపాలురతో కలిసి; గోబృందాని విచారయన్ = గోవులను మేపుచు (అనుచరులతో) నందగోపో విరాజితే = నందగోపుడు విరాజిల్లుచున్నాడు.

సకలసద్గుణసంపన్నుండును, గోకులమునకుఁ బ్రభువును అగు నందగోపుఁడు తనయనుచరులతోఁ గూడి గోవులను మేపుచుండును.

*అథ గోపీనా మాగమనమ్*

మధ్యమావతీరాగము - ఆదితాళము

| | |
|---|---|
| వల్లవయువతికదంబం అయాతి | వరమరుణాధరబింబం |
| శృంగారవిలసితపృథులనితంబం | విఖ్యాతవివిధవిలాసవిడంబం |
| కరధృతదధిదుగ్ధకమనీయఫలజాతం | నిరుపమసంతోషనీలకుంతలమిహ |

ఆగోకులమునందుండు గోపికలును మిగుల సౌందర్యవంతులు ఎఱ్ఱనగు పెదవులతోడను, విస్తారములగు పిఱుఁదులతోడను, బహువిధములగు విలాసములతోడను, నల్లని తలవెంద్రుకలతోడను వారియాకారములు మిగుల రమణీయము లై యుండును. పెరుఁగును, పాలును, బహువిధము లగుఫలంబులును, వారిహస్తముల నెప్పుడు అలంకరించి యుండును. మిగుల సమృద్ధిగలవారగుటచే వారలకు దుఃఖ మనునదియే లేదు.

*అథ బలరామ స్యాగమనమ్*

నాదనామక్రియారాగము - ఆదితాళము

| | |
|---|---|
| హలీ బలీ చ ముసలీ | లలితాంగద[illegible] |
| నీలాంబరీ శ్వేతరూపీ | బలభద్రో [illegible]జతే |

హలి = నాగలిని ధరించినవాడు; బలి = బలముగలవాడు[illegible] రోకలి ధరించి[illegible]

లలిత = ఒప్పుచున్నట్టి; అంగద, కుండలి = భుజకీర్తులున్నూ, కుండలములు గలవాడున్నూ; నీల అంబరి = నల్లని వస్త్రములు ధరించినవాడున్నూ; శ్వేతరూపి = తెల్లనిరూపము గలవాడున్నూ, అగు; బలభద్రః = బలరాములవారున్నూ; విరాజితే = ప్రకాశించుచున్నాడు; అథకృష్ణస్య ఆగమనమ్ = ఇప్పుడు శ్రీకృష్ణుని రాకను గురించి; దేవాంగ నాభిః గీయతే = దేవతాస్త్రీలు పాడుచున్నారు.

తెల్లనివర్ణము గలయాబలరాముఁడును, నల్లనివస్త్రములధరింపుచు భుజకీర్తులు కుండలములు మొదలగు ననేకభూషణములచే నలంకృతుఁడై నాఁగలియొకటియు, ముసల మొక్కటియు నాయుధములుగా ధరించి సంచరించుచుండును.

అథ శ్రీకృష్ణస్యాగమనం దేవాంగనాభిర్గీయతే

హుశేనిరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | ఆలోకయే శ్రీ | బాలకృష్ణం సఖి |
| | ఆనందసుందర | తాండవకృష్ణం |
| 1. | నవనీతఖండ | దధిచోరకృష్ణం భక్త |
| | భవపాశబంధ | మోచనకృష్ణం |
| 2. | నీలమేఘశ్యామ | సుందరకృష్ణం - నిత్య |
| | నిర్మలానందబోధ | లక్షణకృష్ణం |
| 3. | చరణనిక్వణిత | నూపురకృష్ణం - కర |
| | సంగతకనక | కంకణకృష్ణం |
| 4. | కింకిణీజాల | ఘణఘణితకృష్ణం లోక |
| | శంకితతారావళి | మౌక్తికకృష్ణం |
| 5. | సుందరనాసామౌక్తిక | శోభితకృష్ణం - నంద |
| | నందన మఖండవి | భూతికృష్ణం |
| 6. | కంఠోపకంఠశోభి | కౌస్తుభకృష్ణం - కలి |
| | కల్మషతిమిర | భాస్కరకృష్ణం |
| 7. | వంశనాదవినోద | సుందరకృష్ణం - పరమ |
| | హంసకులశంసిత | చరితకృష్ణం |
| 8. | గోవత్స బృంద | పాలకకృష్ణం - కృత |
| | గోపికాజాల | ఖేలనకృష్ణం |
| 9. | నందసునందాది | వందితకృష్ణం - శ్రీ |
| | నారాయణతీర్థ | వరదకృష్ణం |

4వ కీర్తన - హుశేనిరాగం ఆదితాళం

ప॥ సఖి! = ఓ చెలికత్తె

అ॥ శ్రీబాలకృష్ణః = సంపద్యుక్తుడైన బాలకృష్ణుని; ఆలోకయే = సేవించుచున్నారు; ఆనంద సుందర = ఆనందము కలిగినటువంటి, సౌందర్యము కలిగినటువంటి; తాండవ కృష్ణం = నృత్యము చేయుచున్నటువంటి కృష్ణుని; ఆలోకయే = సేవింపుమా

1. నవనీతఖండ = వెన్నముద్ద; దధి = పెరుగు; చోరకృష్ణం = దొంగతనముచేయు కృష్ణుడు; భక్త = భక్తులయొక్క; భవపాశబంధ = సంసారబంధమును, జనన మరణరూపమైన సంసారబంధమును; మోచన కృష్ణం = విముక్తిచేయబడుకృష్ణుడు

2. నీలమేఘశ్యామ = నీలమేఘముతో సమానమైన, శ్యామలవర్ణము కలిగినటువంటివాడు; సుందరకృష్ణం = సుందరమైన కృష్ణుని; నిత్య, నిర్మల = శాశ్వతమైన, మాలిన్యములేని; ఆనంద బోధ = ఆనందము, జ్ఞానము; లక్షణ కృష్ణం = ఇవియే లక్షణముగా గల్గిన కృష్ణస్వామిని - ఆలోకయే.

3. చరణనిక్వణిత = పాదములందు మ్రోయబడుచుండు; నూపురకృష్ణం = అందెలు ధరించినటువంటివారున్నూ; కరసంగత = చేతులయందు ధరింపబడిన; కనక కంకణ = బంగారు కడియములు ధరించిన; కృష్ణం, ఆలోకయే = శ్రీకృష్ణస్వామిని సేవించుచున్నాము.

4. కింకిణీ, జాల = గజ్జెల యొక్క సమూహముచేత; ఘణ ఘణిత కృష్ణం = మ్రోయుచున్న కృష్ణస్వామిని; లోక = జనులచేత; తారావళి = నక్షత్రసమూహము అని (పంక్తి అని); శంకిత = అనుమానింపబడుచుండునట్టి; మౌక్తిక కృష్ణం = ముత్యాల హారము ధరించినట్టి కృష్ణస్వామివారిని; ఆలోకయే = సేవింపుమా.

5. సుందర = సౌందర్యమైనటువంటి; నాసామౌక్తిక = ముక్కునందుండు ముత్యముచేత (బులాకిచేత); శోభితకృష్ణం = ప్రకాశించుచుండు కౌస్తుభమణిని గలిగిన కృష్ణస్వామిని; నందనందనం = నందకుమారుడు అయిన; అఖండవిభూతి = ఖండములేని ఐశ్వర్యము మొదలగునవిగల; కృష్ణం, ఆలోకయే = కృష్ణస్వామివారిని చూడవలసినదినుమా.

6. కంఠోపకంఠ = కంఠమునకు సమీపమందు; శోభికౌస్తుభకృష్ణం = ప్రకాశించుచుండు కౌస్తుభమణిని గలిగిన కృష్ణస్వామివారిని; కలి కల్మష = కలియుగసంబంధమైన పాపమువలనెడు; తిమిరభాస్కర = చీకట్లకు సూర్యునివంటి; కృష్ణం ఆలోకయే = కృష్ణస్వామివారిని తిలకించుమా

7. వంశనాద = పిల్లనగ్రోవి శబ్దముయొక్క; వినోద, సుందర, కృష్ణం = వినోదము గలిగిన సౌందర్యమైనట్టి కృష్ణుని; పరమహంస = పరమహంసలయొక్క (గొప్పయోగులయొక్క); కుల = సమూహములచేత; శంశిత = కొనియాడబడుచున్న; చరిత, కృష్ణం = నడవడిగలిగిన కృష్ణస్వామిని - ఆలోకయే.

8. గోవత్సబృంద = ఆవుదూడ సమూహమును; పాలిత కృష్ణం = పాలించునట్టి కృష్ణుని; కృత = చేయబడిన; గోపికాజాల = గోపికా సమూహముల సంబంధమైన; ఖేలన కృష్ణం = ఆటగలిగిన కృష్ణస్వామివారిని - ఆలోకయే.

9. నంద, సునంద = నందుడు సునందుడు మొదలైనవారిచేత, పండిత కృష్ణం = నమస్కరింప బడుచుండు కృష్ణస్వామిని; నారాయణతీర్థ = నారాయణతీర్థులకు; వరద కృష్ణం = వరములిచ్చు కృష్ణుని; ఆలోకయే = సేవించుమా

అవ. ఆగోకుల ప్రాంతములయందు శ్రీకృష్ణుఁడు సంచరించుచుండు నప్పుడు దేవాంగనలు సహిత మాకసమునుండి చూచి యాయన నిట్లని వర్ణింపుచుండురు

ప. ఓచెలీ! వాఁడుగో కృష్ణుఁడు, తాండవము సేయుచు వచ్చు చున్నాఁడు

1. భక్తుల సంసారబంధముక్తులఁ జేయునారాయణుఁడు వెన్నదొంగయై గోకులమునఁ గానవచ్చుచున్నాఁడు.

2. సచ్చిదానందస్వరూపుఁ డగునాపరమాత్ముఁడు నీలమేఘశ్యామల మగుసుందరరూపముతో కృష్ణుఁడై యున్నాఁడు.

3. గలు, గలు మనునందియలతోను బంగరు చేతికడియములతోను అలంకరింపఁబడి యున్నాఁడు.

4. మొలకుగట్టియున్న గజ్జలు ఘణ, ఘణయని మ్రోగుచున్నవి. మెడనున్న ముత్యాలహారమునుజూడ నాతని సేవింపవచ్చిన నక్షత్రమాలికయో యనునట్లున్నది.

5. ఒక ముత్యము (బులాకి) నాసికము నలంకరించుచున్నది. ఈనందకుమారుఁడు సర్వపరిపూర్ణుఁడగు శ్రీమన్నారాయణుఁడే.

6. అదిగో! కంఠమునందుఁ గౌస్తుభరత్నము ప్రకాశించుచున్నది. ఈ కృష్ణుఁడే కలికల్మషములనియెడు గాఢాంధకారమునకు ప్రచండ మార్తాండుఁడు.

7. పరమహంసలగు (వీరు సన్యాసులలో నుత్తమ మగుతెగలోని వారు) మహాత్ములచే సర్వకాలములయందును వర్ణింపఁబడుచుండునామహాత్ముండు వేణుగానముఁ జేయుచు వచ్చుచున్నాఁడు.

8. గోపకన్యలతో నాడుకొనుచు గోవత్సములవెంబడివచ్చుచున్నాఁడు.

9. నారాయణతీర్థయతికి వరము లిచ్చువాఁడని నందుఁడు, సనందుఁడు మొదలగువా రెప్పుడు నీయనను వినుతించుచుందురు.

శ్లో. నందసూనురథ గోపసూనుభి
ర్మండితేందువదన శ్శనైశ్శనైః,
ఖ్యాపయన్నఖిలదీనబంధుతాం
వత్సపాలనవిధౌ స దీక్షితః

4శ్లో॥ అథ నందసూనుః = అనంతరము నందపుత్రుడు; మండిత, ఇందువదనః = అలంకారముగల, చంద్రునితో సమానమైన మోముగలవాడై; గోపసూనుభిః = గోపాలకుల పిల్లలతోగూడా; శనైః శనైః = మెల్లమెల్లగా; అఖిలదీన బంధుతాం = సమస్త దీనజనులకు తాను బంధువుగా నుండు సంగతిని; ఖ్యాపయన్ = వెల్లడిచేయుచూ; సః = ఆకృష్ణుడు; వత్సపాలనవిధౌ = దూడలను మేపే కార్యమునందు; దీక్షితః = దీక్షవహించెను.

ఇట్లు అతిబాల్యము గడచినపిదపఁ గ్రమక్రమముగా నతిసుందరుఁడగు నానందకుమారుఁడు గోపబాలకులతోఁ గూడి లేఁగలను బరిపాలింప నారంభించెను. దీనివలన నామహాత్ముని దయాళుత్వము వెల్లడి యగుచుండెను.

గ. అసౌ ఖలు భగవా న్ - అపరిమితకరుణారసాలవాలో భూమాఖ్యో నిజజనసంతాపహరణ ప్రవీణః -పరిగృహీతగోపకుమార భావో వేణువిషాణనినాదవి శేషైః - ఉపవనపరిమిళితా న్ అగమభాగవచోవిలాసై రివ వరతత్త్వ వరిమిళితా నశేషయోగి చిత్తవృత్తి విశేషానివాశేషగోవత్సా న్ - నిజకరకలిత వేత్రసంచారవిలాసైర్నియమేన సంచారయ న్ - సముదితమహో త్సాహసహసావలోకన భాషణాదిభిః - అఖిలానపిగోపబాలా నానందయ న్ - వైమానికబృందనయనమహోత్సవో మోహాతీత విశుద్ధబోధమూర్తిరపి - విహరతి హరిరిహ దీనబంధుః.

5. గద్య:- అసౌ = ఈకృష్ణుడు; భగవాన్ ఖలు = షాడ్గుణ్యపూర్తిగల - అనగా జ్ఞాన, బల, వీర్య, ఐశ్వర్య తేజః శక్తిః ఈ ఆరు గుణములుగలవాడు గదా భగవంతుడు; అపరిమిత = పరిమితములేనటువంటి; కరుణారస = దయారసమునకు; ఆలవాలః = పాదివంటివాడు; భూమాఖ్య = భూమియనుపేరట పిలువబడువాడు; నిజ జన సంతాప హరణ ప్రవీణః = తన భక్తులయొక్క దుఃఖములను హరించుట యందు నేర్పుగలవాడున్నూ; పరిగృహీత = అంగీకరించబడిన; గోపకుమార = గోపాలక కుమారునియొక్క; భావః = స్వరూపముగలవాడున్నూ; వేణు = పిల్లనగ్రోవి; విషాణ = కొమ్ముబూరయొక్క; నినాద విశేషైః = ధ్వని విశేషముచేత; ఉపవన పరిమిళితాన్ = సమీప వనములందు చేరియుండునటువంటి; అశేష గోవత్సాన్ = సమస్త ఆల దూడలను; అశేషయోగి చిత్తవృత్తి విశేషాన్ = సమస్తయోగులయొక్క చిత్తవృత్తి విశేషములను; ఆగమభాగ = వేదభాగములయొక్క; వచోవిలాసైః ఇవ = వాగ్విలాసములతచేత వలె; నిజకర కలిత = తన హస్తమందు ధరించబడిన; వేత్ర = బెత్తములయొక్క; సంచార విలాసైః = ఆడించుటలచేత; నియమేన = క్రమము తప్పక; సంచాయన్ = సంచరింపజేయుచును (మేపుచును); సముదిత = తనయందు కలుగుచున్న; మహోత్సాహ = గొప్పఉత్సాహమున్నూ; సహస అవలోకన = నవ్వుతోగూడిన చూపులన్నూ; భాషణాదిభిః = మాటలు మొదలైన క్రియలచేత; అఖిలా నపి గోపబాలాన్ = సమస్త గోపబాలకులకున్నూ; అనందయన్ = సంతోషపఱచుచు; వైమానికబృంద నయన మహోత్సవః = దేవతా సమూహములకన్నులకు గొప్ప ఆనందము కలిగించుచున్నవారై; మోహ అతీత శుద్ధ బోధమూర్తి రపి = మోహమునకు అతీతమైన జ్ఞాన స్వరూపుడయ్యును; ఇహ = బృందావనమందు; దీన బంధుః = దీనులకు బంధువై; హరిః విహరతి = శ్రీకృష్ణుడు విహరించుచున్నాడు.

సర్వవ్యాపకుఁ డగునాభగవంతుఁడే అపరిమిత దయామయుఁడు కావున భక్తజనులపరితాపములఁ దొలఁగింప గోపబాలుఁడై జన్మించెను. ఆ మహాత్ముండు లేఁగల కాపరితనమునకు వలసినంతవయసు రాఁగానే వనమున కేగుచు, వేదమునందలి యుపదేశవాక్యములచే యోగిజనుల చిత్తములన్నియుఁ

బరమాత్మరూపుఁ డగుతనయందుఁ జేరుభంగిఁ దా నొసర్చినపిల్లనగోవిధ్వనులను, కొమ్ముబూరలచప్పుడులను విన లేఁగ లన్నియుఁ దా నున్నవనమునకు రాఁగా వానిని బాగుగ మేపుచు, తనచేత నున్న బెత్తముతో నదలించి వానిందొలంగి పోనీక గాచుచు, అధిక మగునుత్సాహముతోడను, మందహాసముతోఁ గూడిన చూపులతోడను, మనోహరమగుసంభాషణములతోడను, సహచరులకు గోపబాలురకు సంతసము నొనర్చుచు, దేవతలకుఁ గూడఁ గనులపండువుగా విహరింపు చుండెను. అజ్ఞానాదివికారములు లేక శుద్ధజ్ఞానస్వరూపుఁ డైయుండు నారాయణుఁ డైనను, సామాన్య మనుష్యబాలునివిధమున సంచరింపుచుండెను.

శ్లో. వైమానికాః పరం తత్వం మత్వా గోపాలనందనం,
పరస్పరం జగుర్భక్త్యా గోవత్సానుచరం హరిమ్

6. శ్లో॥ వైమానికాః = దేవతలు; గోపాలనందనం= శ్రీకృష్ణస్వామివారిని; పరం తత్వం = పరతత్వముగా; మత్వా = తలంచినవారై; గోవత్సానుచరం = ఆలదూడల వెంబడి వచ్చుచుండు, హరిః = శ్రీకృష్ణ భగవానులను; భక్త్యా = భక్తిచేత; పరస్పరం జగుః = అన్యోన్యముగా గానము చేసిరి.

అప్పుడు విమానములపై నాకసమున సంచరించుదేవత లాకృష్ణుని పరమాత్మునిగా నెఱింగి, యమ్మహాత్ముఁ డొనర్చుగోవత్సపాలనమునుగూర్చి తమలో నిట్లని గానము చేసిరి.

పంతువరాళిరాగము - రూపకతాళము

ప. కలయత గోపికా కారుణ్యరసపూర కాలమేఘాభిరామం
అ. చలదధరాంచిత చారుమురళీనాద కలితకైవల్య కామం
1. కుత్సితాసురతిమిరకోటి సూర్య మమరకుముదకుముదబాంధవం
మత్స్యకూర్మాది శ్రీమహనీయా విర్భావమా యోల్లసితవైభవం
సత్సుఖామృతజలధి సతతఖేలననిరతం సాధుజనాత్మ దేవం
వత్సనంరక్షణ వాత్సల్యపరిపూర్ణవల్లవబాలభావం

2. అక్షీణసంపదా మాశ్రయమఖిలసం రక్షణదీక్షాధరం
పక్షీశవాహనం పంకజభవభవ భావితభద్రాకారం
కుక్షిస్థబ్రహ్మాండ కోటివిరాజితం కుటిలకుంతలసుందరం
వీక్షణసముదిత వివిధవిశ్వాకారం విమలవిజ్ఞానసారం
3. కరసరోరుహగత కనకనిర్మితవలయ కమనీయతరవిగ్రహం
గురుతరమౌక్తిక గుణమణిగణభారంగోపీసంతాపాపహం
సురరాజరిపువత్సాసురసూదనచరిత సులలితమతినుగ్రహం
నరనారాయణతీర్థవరణీయపరమార్థావరణమోహావి నిగ్రహం

5వ కీర్తన : పంతువరాళి - రూపకతాళం

గోపికా = గోపికలయందు; కారుణ్యరస = కరుణారసమును; పూరం = నిండించునట్టి (కురియునట్టి); కాలమేఘాభిరామం = నీలమేఘమువలె మనోహరుడైనటువంటి గోపబాలుని; కలయత = సేవించండి; చలత్ = చలించుచుండునట్టి; అధర అంచిత = పెదవులయందు ఒప్పుచున్నటువంటి; చారు = శృంగారమైన; మురళీనాద = వేణునాదముచేత; కలిత = తెలియజేయబడుచున్నటువంటి; కైవల్య = మోక్ష స్వరూపమనెడు; కామం = కోరబడుచుండు స్వరూపముగలవానిని; కలయత = సేవించండి; కుత్సిత = కపటముగల; అసుర = అసురులనెడు; తిమిర = చీకట్లకు; కోటిసూర్య = కోటి సూర్యులతో సమానుడున్నూ; అమర = దేవతలనెడు; కుముద = కలువలకు; కుముదబాంధవం = చంద్రునివంటివాడు; మత్స్య కూర్మాది = మత్స్యము, కూర్మము మొదలగు; శ్రీ మహనీయ = సంపద్యుక్తమైన, పూజ్యమైన; ఆవిర్భావం = అవతారములుగలవాడున్నూ; మాయ = ప్రకృతి అనే మాయచేత; ఉల్లసిత = బయలుపడిన; వైభవం = విభవముగలవాడున్నూ; సత్సుఖా = సదా ఆనందమనే; అమృతజలధి = అమృత సముద్రములో; సతత, ఖేలన = ఎల్లప్పుడు ఆడుటయందు; నిరతం = ఆసక్తిగలవాడున్నూ; సాధుజన = సాధుజనులయందు; ఆత్మదేవం = ఆత్మదైవతగా ఉపాసింపబడునట్టి దైవ స్వరూపుడున్నూ; వత్స సంరక్షణం = దూడలను కాపుదారి చేయుచుండునట్టిన్నీ; వాత్సల్య పరిపూర్ణం = వాత్సల్యభావముతో నిండియుండునట్టిన్నీ; వల్లవబాలభావం = గొల్లపిల్లల రూపముతో వుండునట్టిన్నీ; కృష్ణం కలయత = కృష్ణస్వామిని, సేవించండి.

2. అక్షీణ సంపదాం = తరగని సంపదలకు; ఆశ్రయం = ఉనికిపట్టు అయినట్టిన్నీ; అఖిల సంరక్షణ = సమస్త విశ్వమును కాపాడుచుండునట్టి; దీక్షాధరం = దీక్షను ధరించియుండువాడున్నూ; పక్షీశవాహనం = గరుత్మంతుని వాహనముగా గలవాడున్నూ; పంకజభవ భవ = బ్రహ్మ రుద్రులచేత; భావిత = కోరబడుచుండు; భద్రాకారం = మంగళకరమైన అకారముగలవాడున్నూ కుక్షిస్థ = తన కుక్షియందు ఉన్నటువంటి; బ్రహ్మాండకోటి = బ్రహ్మాండకోట్లచేత; విరాజితం = ప్రకాశించుచుండువాడున్నూ; కుటిల కుంతల = వంకర ముంగురులచేత; సుందరం = సౌందర్యముగలవాడున్నూ; వీక్షణ = చూచుటచేతనే; సముదిత = పుట్టించబడిన; వివిధ = అనేకవిధములైన; విశ్వాకారం = విశ్వమే ఆకారముగా గలవాడున్నూ; విమల విజ్ఞాన సారం = నిర్మలమైన విజ్ఞానముయొక్క సారముగలవాడున్నూ, అగు; కృష్ణం = శ్రీకృష్ణస్వామిని; కలయత = సేవింపుమా

3. కర సరోరుహగత = హస్త కమలమందు వున్నటువంటి; కనక నిర్మిత వలయ = బంగారముచే చేయబడిన మురుకులు కలవాడును; కమనీయతర = విశేష మనోహరమైన; విగ్రహం = స్వరూపముగలవాడున్నూ; గురుతర = శ్రేష్ఠమైన; మౌక్తిక = ముత్యములయొక్క; గుణ మణి గణ = గుణములనే మణులయొక్క సమూహములచేత; భారం = బరువుగలవాడున్నూ; గోపీ = గోపికలయొక్క; సంతాప = పరితాపములను; ఆపహం = పోగొట్టునట్టివాడున్నూ; సురరాజరిపు = దేవేంద్రుని యొక్క శత్రువులు అగు; వత్సాసుర = వత్సాసురుడు మొదలగువారిని; సూదన చరితం = సంహరించినటువంటి చర్యగలవాడున్నూ; సు లలిత = సరసమైన; మతి = మనస్సుగలవారిచేత; సుగ్రహం = సులభముగా గ్రహింపబడదతగినవాడున్నూ; వరనారాయణతీర్థ = శ్రేష్ఠమైన నారాయణ తీర్థులవారిచేత; వరణీయ =

కోరబడదగిన; పరమార్థ = మోక్షమునకు; ఆవరణ = చుట్టుకొనియుండు మాయను; మోహ = అట్టి మాయను; వినిగ్రహం = కొట్టివేయునటువంటి శ్రీకృష్ణుని, కలయత = సేవించండి.

ప. గోపికలయందు మిక్కిలి దయగలిగినవాఁడును మేఘమువంటి వర్ణముగలిగి, మనోహరుఁడైనవాఁడునగు నా శ్రీకృష్ణునిఁ జూడుఁడు.

అ. కదలుచున్న తనపెదవిపై వేఁణువు నిడి మనోహరముగఁ బాడుచున్నాఁడు. దానిని వినిన మోక్ష సామ్రాజ్యమునుఁ బొందినట్లున్నది

1. దుష్టరాక్షసులను చీఁకటులకుఁ గోటిసూర్యులవంటివాఁడును, మునులను కలువలకు సంపూర్ణ చంద్రుండును, తనమాయచే మత్స్యము, కూర్మము మొదలగు ననేకావతారములు ధరించినవాఁడును, నిత్యమగు పరమానందసముద్రమున నోలలాడువాఁడును, సత్పురుషులచే నాత్మగా ధ్యానింపఁబడువాఁడును, అగునారాయణుఁడు గోపాలబాలుఁడై లేఁగలఁ గాచుచున్నాఁడు.

2. సకంల్పమాత్రముచేతనే సర్వలోకములను సృష్టించి వానిని తన గర్భమునందే యుంచుకొని సకలసంపదల నొసంగి రక్షించుచుండువాఁడును, బ్రహ్మరుద్రాదులచే నెల్లప్పుడును ధ్యానముచేయఁబడుచుండువాఁడును, జ్ఞాన స్వరూపుఁడు నగు నాగరుడవాహనుఁడే లోకములను రక్షింప సుందరాకారుఁడై యిట్లవతరించి యున్నాఁడు.

3. బంగరు చేతికడియములును, ముత్యాలహారములను, ఆమహాత్ముని శరీరమునకు నందమునుఁ గలిగించుచున్నవి. ఆయన మనోహర మగునాకారముతో గోపికలసంతాపమును హరించుచున్నాఁడు. దేవేంద్రునినహితముజయించిన వత్సాసురుని సంహరించి దేవతలయెడ కరుణజూపినాఁడు. (వత్సాసురుఁ డనురాక్షసుఁడు లేఁగయై సమయమైనప్పుడు కృష్ణునిఁ జంపవచ్చునని, దూడలమందలలోఁ గలసి దిరుగుచుండ వాని నెఱింగి శ్రీకృష్ణుఁడు వధించెను) నారాయణతీర్థునిచిత్తమును నిర్మలమును జేసినాఁడు.

> శ్లో. యజ్ఞం యజ్ఞభుజం విష్ణుం గోపబాలై స్సమన్వితం,
> దధ్యన్న పూర్ణశిక్యాఢ్యంజగు ర్వైమానికా వనే.

7. శ్లో॥ యజ్ఞం = యజ్ఞ స్వరూపుడున్నూ; యజ్ఞ భుజం = యజ్ఞ భోక్తయున్నూ; విష్ణుం = విష్ణు స్వరూపుడున్నూ; గోపబాలైః = గోపబాలునితో; సమన్వితం = కూడుకొనియున్నటువంటి; దధ్యన్నపూర్ణ = పెరుగు అన్నముతో నిండినటువంటి; శిక్యా, ఆఢ్యం = ఉట్లచేత కూడుకొనియున్నటువంటి; కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; వనే = బృందావనమందు; వైమానికా ః = దేవతలు ఆకాశమునుండి; జగుః = గానముచేసిరి.

యజ్ఞస్వరూపుఁడును, యజ్ఞములయందలి హవిస్సుల భుజించువాఁడు నయ్యు నాశ్రీకృష్ణుఁడు గోపాలబాలురతోఁ గూడి పెరుఁగన్నపు టుట్లను చేఁబూని వనమునందుఁ దిరుగుటఁ జూచి విమానములయందు దేవత లిట్లని వినుతించిరి.

భైరవిరాగము - త్రిపుటతాళము

ప. పశ్యత పశ్యత భగవంతం - గోప
బాలకశిక్య మపహరంతం

అ. రస్యధవళదధిమిళితాన్న పూరిత
రమణీయకలశవిశేషాశ్రితం

1. శరమారుతమానససమవేగవంతం
శతకోటిగోపబాల మపి లాలయంతం
సురుచిరపరిహాససుధా ముద్గిరంతం
సురలోకవనితాగణ మాకర్షయంతం

2. శాఖామృగలంఘనానుకరణచతురం
శ్యామసుందరాకార మతులవిహారం
అఖిలలోకాధార మిహ వత్సానుచరం
అధికసాహసోత్సాహవీర్య ముదారం

3. ప్రణయకలహకోలాహల మతిసరసం
ప్రకటితనిజపరమానందవిలాసం
క్వణితకింకిణీఘుణం ఘణలలితలాస్యం
క్వాపి మధుమధురగీతరసాస్యం

4. సరసమసృణకబళ మిహ తు భుంజానం
సబలసకలగోప మఖిలనిదానం
తరళకుండలహార మతినర్మహాసం
వరనారాయణతీర్థహృదయవిలాసం

6వ కీర్తన భైరవిరాగం - త్రిపుటతాళం

ప॥ భగవవంతం = శ్రీకృష్ణస్వామిని; పశ్యత పశ్యత = చూడండి చూడండి; గోపబాలకశిక్యం = గోపబాలకులయొక్క ఉట్లను; అపహరంతం = అపహరించుచున్నటువంటి భగవంతుని - పశ్యత పశ్యత

అ. రస్యధవళ = రసవంతమైన, తెల్లనైన; దధి మిళిత = పెరుగుచేత కలపబడిన; అన్నపూరిత = అన్నముచేత నింపబడిన; రమణీయ = సుందరమైన; కలశ విశేష = ఒకవిధమైన కలశమునకు; ఆశ్రితం = స్థానభూతమైన గోపబాలకుల ఉట్లను అపహరించుచున్నట్టి స్వామివారిని; పశ్యత పశ్యత = సేవించండి సేవించండి.

1. శరమారుత = బాణముతోనున్నూ, గాలితోనున్నూ, మానస సమ = మనస్సుతోనున్నూ సరి అయిన, వేగవంతం = వేగముగల్గినట్టిన్నీ, శతకోటి గోపిబాలం అపి = నూరుకోట్ల గోపబాలకులనుగూడ, లాలయంతం = సమాధానపఱచుచున్నట్టి; సురుచిర = మనోహరమైన, పరిహాస = హాస్యమనెడు, సుధాం = అమృతమును; ఉద్గిరంతం = వెలువరించుచున్నట్టి; సురలోక వనితాగణం = దేవతా స్త్రీ సమూహమును, ఆకర్షయంతం = ఆకర్షించుచున్నట్టి, కృష్ణం పశ్యత పశ్యత = కృష్ణస్వామివారిని చూడండి చూడండి.

2. శాఖామృగ, లంఘనం = కోతులయొక్క దుముకులను; అనుకరణచ తురం = అనుసరించుట యందు, నేర్పుగలవాడున్నూ; శ్యామసుందరాకారం = శ్యామల వర్ణము గల్గి - సుందరమైన అందముగలవాడు; అతుల విహారం = అసమానమైన విహారము గలవాడున్నూ, అఖిలలోకాధారం = సమస్తలోకములకు ఆధారుడున్నూ; ఇహ వత్సానుచరం = ఇచ్చట, దూడలవెంబడి తిరుగుచున్నాడు; అధిక = అధికమైన; సాహసం = సాహసమున్నూ; ఉత్సాహం - ఉత్సాహమున్నూ (సంతోషమున్నూ); వీర్యం = వికారహేతువు తటస్థించినను మనస్సుకు వికారము చెందకుండుట; ఉదారం = ఔదార్యముగలవాడున్నూ; త్యాగశీలత్వముగలవాడున్నూ అగు; కృష్ణం పశ్య పశ్య = శ్రీకృష్ణస్వామిని చూడండి చూడండి.

3. ప్రణయ = ప్రేమచేతగలిగిన, కలహ, కోలాహలం = కలహములయొక్క, రొదగలవాడున్నూ; అతి సరసం = అమిత సరసత్వముగలవాడున్నూ; ప్రకటిత = వెల్లడిచేయబడుచున్న; నిజ = స్వకీయమైన; పరమానందవిలాసం = పరమానంద విలాసముగలవాడున్నూ; క్వణిత కింకిణీ = ధ్వనించుచున్న చిరుగజ్జెలచేత; ఘణంఘణ = ఘణ ఘణ అనే ధ్వనితో; లలిత = కూడుకున్నటువంటి; లాస్యం = నృత్యము చేయుచున్నటువంటి; క్వాపి క్వాపి = ఒకానొకచోట చేయబడు; మధు = మకరందముతో సమానమైన; మధుర = మధురమైన; గీతరసాస్యం = గానరసముతో కూడుకొనిన ముఖము గలిగినట్టి; కృష్ణం పశ్యత పశ్యత = శ్రీకృష్ణస్వామివారిని చూడండి చూడండి.

4. సరస = రసయుక్తమైన; మసృణ కబళ = చిక్కగా కల్పిన చద్దిముద్దను; ఇహతు, భుంజానం = ఇక్కడనై తేనో భుజించుచున్నారు; సబల = బలరామునితోనున్నూ; సకలగోపం = సకల గోపాలకులతో కూడుకున్నటువంటివాడున్నూ; అఖిలనిదానం = సమస్తజగములకు ఆదికారణమైనటువంటివాడున్నూ; తరళకుండలహారం = చలించుచున్న, కుండలములు హారములుగలవాడున్నూ; అతి నర్మహాసం = బహు హాస్యకరమైన నవ్వుగలవాడు; వరనారాయణతీర్థ = శ్రేష్ఠమైన నారాయణతీర్థులయొక్క; హృదయవిలాసం = మనస్సును ఆనందపఱచునట్టి; భగవంతం పశ్య పశ్య = పరమాత్మను చూడండి చూడండి.

వ. అభగవంతుని: జూడుండు. గోపబాలకుల యన్నపుటుట్టుల నపహరించుచున్నాఁడు.

అ. రుచి గలశుభ్రమగు పెరుఁగుఁ గలిపినయన్నముతో నిండినపాత్ర మొక్కటి యాయనయొద్ద నున్నది.

1. బాణముకంటెను, వాయువునకంటెను, మనసుకంటెను, వేగముగఁ బరుగిడుచున్నాఁడు. అసంఖ్యాకులగు నాగోపబాలకులఁ దనపరిహాసవాక్యములచే లాలింపుచున్నాఁడు. అపరిమిత మగుతనసౌందర్యముచే దేవతాస్త్రీలను గూడ నాకర్షించుచున్నాఁడు.

2. అత్యద్భుత మగుసాహసము, విడువనిపట్టుదల మొదలగునవి గలిగి గంభీరుఁడై నీల మేఘశ్యామలమగు సుందరశరీరము గలిగి యున్న సర్వలోకాధారుఁ డగు నీకృష్ణుఁడు యథేష్టముగ విహరింపుచు, నొక్కొక్కచోటఁ గోఁతి దుమికినట్లు దుముకుచు, లేఁగలం బరిపాలించుచున్నఁడు.

3. తన పరమానందస్వరూపమునుఁ బ్రకటించువాఁడునుం బోలె మిక్కిలి రసికుఁడై కొన్నికొన్ని చోట్ల వినోదకలహముల నధికముగఁ జేయుచు, మఱి కొన్నిచోట్ల గజ్జెలు మ్రోయునట్లు నృత్యము సేయుచు, వేఱొకకొన్ని చోట్ల మనోహరముగా వేణుగానము సేయుచు విహరింపు చున్నాఁడు.

4. కుండలములు, హారములును గదలుచుండఁ బ్రక్కనున్నవారినిఁ బరిహాసముఁజేసి నవ్వుచు గోపాలబాలకులతోడను, బలరామునితోడనుగూడి యాజగత్కారణుం డిచట దధ్యన్నమును భుజింపుచున్నాఁడు. నారాయణ తీర్థుని హృదయమునం దీయన యెప్పుడును నివసింపుచుండును.

శ్లో. ఆనీతం శిక్యభాండస్థం దధ్యన్నం గోపబాలకైః,
భుక్త్వా వనేచరన్ కృష్ణస్త్వఘాసురముఖం యయౌ.

8. శ్లో॥ ఆనీతం = ఇంటినుండి తేబడునటువంటిన్నీ; శిక్యభాండస్థం = ఉట్లయందలి దుత్తలలో వున్నటువంటి; ధధ్యన్నం = పెరుగు అన్నమును; కృష్ణః = శ్రీకృష్ణస్వామివారు; గోపబాలకైః = గోపబాలకులతోగూడ; భుక్త్వా = భుజించి; వనేచరన్ = వనమునందు తిరుగుచూ సంచరించుచుండెను; అఘాసుర ముఖం = అఘాసురుడు అను పాములరూపము ధరించిన రాక్షసుని ముఖములో; యయౌ = ప్రవేశించెను.

ఇట్లు ఉట్టియందలి పాత్రములోనున్న దధ్యన్నమును గోపబాలురతోఁ గూడి భుజించి శ్రీకృష్ణుఁడు వనమున నిటునటు సంచరించుచు నిచ్చట కొండచిలువరూపమునఁ బడియున్న యఘాసురునికడకుఁ జేరెను.

శ్లో. అఘాసురముఖావిష్టా స్సవత్సా గోపబాలకాః,
ప్రాప్తమోహాపనుత్త్యర్థం ప్రార్థయంతో జగుర్హరిమ్

9. శ్లో॥ అఘాసుర = పాములరూపమున వున్న అఘాసురునియొక్క; ముఖ = నోటియందు; అవిష్టాః = ప్రవేశించినట్టి; సవత్స = దూడలతో చేరియుండు; గోపబాలకాః = గోపబాలకులు; ప్రాప్త = తమకుగల్గిన; మోహ = మోహమును; అపనుత్యర్థం = తొలగించుటకై; హరిః = శ్రీకృష్ణులను; ప్రార్థయంతః = ప్రార్థించినవారై; జగుః = గానముచేసిరి.

ఆరాక్షసునినోరు పెద్దకొండగుహలెఁ దెరువఁబడియుండుటచే దాని నిది యని గుఱుతింలేక లేఁగలును, గోపబాలకులును ఆనోటిలోఁ బ్రవేశించిరి. కొంతసేపటికది పర్వతకుక్షి కాదని నిశ్చయించుకొని తమకుఁగల యజ్ఞానమును దొలఁగించి తమ్ము రక్షించుటకు శ్రీకృష్ణుని వినుతించిరి.

శ్లో. పరమకరుణయా మాం పాలయ త్వాం ప్రపన్నం
నిజపరిజన కామం పూరయాచింత్యకీర్తే,
నిరవధికకృపాబ్ధే నిర్మలానందమూర్తే
భయజలనిధిమగ్నం దీన ముత్తారయేశ

10 శ్లో॥ పరమప్రసన్నం = , త్వాం = మిమ్ములను గూర్చి, ప్రపన్నం = శరణాగతిచేసిన వారమైన, మాం = మమ్ములను; పరమకరుణయా = మిక్కిలికృపతో, పాలయ = రక్షింపుమా. నిజపరి...కీర్తే, అచింత్యకర్తే = చింతించుటకు సాధ్యముగాని కీర్తిగలస్వామి. నిజపరిజనకామం = నిజపరిజనులయొక్క కోరికను; పూరయం = నింపింపుమా (తీర్చుమా). నిరవధిక = సర్వాతిశయమైనటువంటి (అంతులేనటువంటి); కృపాబ్ధే = దయాసముద్రుడా; నిర్మలానందమూర్తే = నిర్మలమైన అనందస్వరూపముగలవాడా; భయజలధి నిమగ్నం = భయమను సముద్రమునందు మునిగియున్నటువంటి; దీనం = దీనులమైనట్టినీ మమ్ము; ఈశ ఉత్తారయ హే కృష్ణా! కడతేర్పుమా.

ఓయపరిమిత మగుకీర్తిగలపరమేశ్వరుఁడా! దయాసముద్రుఁడా! పరమానందరూపా! సంసార (అజ్ఞాన) సముద్రమునందు మునిఁగి దీనుఁడ నైనిను శరణుఁ జొచ్చితిని. దయతోరక్షింపుము. ఈయాపదనుండి యుద్ధరింపుము.

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

1. పరమకరుణయా మాం పాలయ భక్తమనోరథం పూరయ
పరిపంథిగణమిహ వారయ భవసాగరపతితంతారయ

2. మధుకైటభాదివిజయాదర మత్స్యకూర్మాదిరూపసాదర
అధికదయావలోకసుందర అపరిమితానందసాగర

3. అఖిలాండకోటిపరిపాలక అనవద్యగోకులనాయక
అఘహరణ దుష్టనివారక ఆశ్రితజనసముద్ధారక

4. తరళమణిమకరకుండల తాండవనటనకృతమండల
సరసపరిపాలితాఖండల సాధుగోకులవరస్థండిల

5. అవనిమండలభారఖండన ఆశ్రితజనహృదయమండన
ధ్రువవిభూతిదానవిచక్షణ శివనారాయణతీర్థరక్షణ

ప॥ మాం = (నన్ను) మమ్ములను; పరమకరుణయా = శ్రేష్ఠమైన కరుణచేత; పాలయ = రక్షింపుమా; భక్త మనోరథం = భక్తులయొక్క కోరికను; పూరయ = నిండించుమమా

అ. పరిపంథిగణం = శత్రుసమూహములను; ఇహ వారయ = ఇక్కడ, నివారణచేయుమా; భవసాగర పతితం = సంసారమను సముద్రమున పడియున్నట్టి మమ్ము; తారయ = తరింపచేయుమా

1. మధుకైటభాది = మధుకైటభులు మొదలగువారిని; విజయాదర = జయించినవాడ; మత్స్య కూర్మాదిరూప = మత్స్యము కూర్మము మొదలగు రూపములను; సాదర = ధరించినవాడ; అధికదయ = గొప్పదయతోగూడినవాడా; అవలోకన = వీక్షణముచేతనే; సుందర = సుందరుడైనవాడ; అపరిమిత = పరిమితములేని; ఆనందసాగర = ఆనందమే సముద్రముగా గలవాడా.

2. అఖిలాండకోటి = సమస్తమైన బ్రహ్మాండములను; పరిపాలక = పరిపాలించువాడ; అనవద్య = దోషరహితుడా; గోకులనాయక = గోకులమునకు నాయకుడైనవాడా; అఘహరణ = పాపమును పోగొట్టువాడ (అఘాసురుని చంపువాడ); దుష్టనివారక = దుర్మార్గులను నివారించువాడ; ఆశ్రితజన = పరిజనులను (భక్తులను); సముద్ధారక = లెస్సగా రక్షించువాడ

3. తరళ = చలించుచున్నట్టి; మణిమకర కుండల = మణులచే చేయబడిన మకర కుండలములుగలవాడా; తాండవ నటన = నృత్యముతోను, నాట్యముతోను; కృత = చేయబడిన; మండల = గోపికా సమూహములుగలవాడ; సరస పరిపాలిత = సరసముగా పాలింపబడిన; ఆఖండల = ఇంద్రునిగలవాడ; సాధుగోకుల = చక్కగా గోకులమే; వరస్థండిల = శ్రేష్ఠమైన నివాసప్రదేశముగలవాడు.

4. అవనిమండల = భూమండలముయొక్క; భార = బరువును (దుర్మార్గులను); ఖండన = ఖండించినవాడ, తీసివేసినవాడ; ఆశ్రితజన = దాసజనులయొక్క; హృదయ = మనస్సులను; మండన = అలంకరింపజేయువాడ; ధృవ, విభూతి = స్థిరమైన, స్థానమును; దాన విచక్షణ = ఇచ్చుటయందు నేర్పుగలవాడు; శివ నారాయణతీర్థ = శివనారాయణతీర్థులను; రక్షణ = రక్షించువాడ.

1. మిగుల కరుణతో నను రక్షింపుము. భక్తుని కోర్కె నీడేర్పుము. నాశత్రువులఁ బోఁగొట్టుము. సంసారసముద్రమునుండి నన్నుద్ధరింపుము.

2. నీవు మధుకైటభాదిరాక్షసులను వధించి, మత్స్యము, కూర్మము మొదలగు నవతారముల ధరించి యనేకకష్టములఁ దీర్చి పరిపూర్ణ మగుకరుణచే లోకము నుద్ధరించుచున్న పరమానందస్వరూపుఁడవు.

3. గోకులమునకుఁ బ్రభువవగునోకృష్ణా! నీవు దుష్టులనుసంహరించుచు సకలలోకముల రక్షించువాఁడవు. ఆశ్రితులగువారు దోషయుక్తులైనను వారి దోషములఁ బోఁగొట్టి యుద్ధరింతువు.

4. మణిఖచితములగుకుండలము లల్లలనాడుచుండ విచిత్రగతులసంచరించి నృత్యము సేయుచు నానందమును గల్గించుచున్నావు. నీవు దేవేంద్రునకుఁ గూడ రక్షకుఁడవు. ఈగోకులమునకు నీకంటె నితరమగునాధార మేమియును లేదు. (స్థండిలము = భూమి, అనఁగా ఆధారము)

5. నీవు భూభారమును హరించుటకును, ఆశ్రితులను రక్షించుటకును అవతరించి యున్నాఁడవు. నీవిచ్చుసంపదలు స్థిరములైనవి. నారాయణతీర్థుని రక్షించు నోకృష్ణా! మమ్ముఁ బ్రోవుము

> శ్లో. ఏవం స్తుతస్స గోవిందః ప్రవృద్ధ స్తమఘాసురం,
> ఆస్ఫొట్య బాలైర్గోవత్సైస్సహ గోకులమాయయౌ

11 శ్లో॥ సఃగోవిందః = ఆ కృష్ణుడు; ఏవం = ఈప్రకారముగా; స్తుతః = స్తోత్రముచేయఁబడినవాడై; ప్రవృద్ధః = శరీరమును పెంచినవాడై; తం....అఘాసురం = ఆ అఘాసురుడను రాక్షసుని; ఆస్ఫొట్య = చీల్చివేసినవాడై; బాలైః = బాలురతోనున్నూ; గోవత్సైః = ఆవుదూడలతోనున్నూ; సహ = కూడుకొనినవాడై; గోకులం = గోకులమునుగూర్చి; ఆయయౌ వచ్చెను

ఇట్లు గోపబాలకులు తన్ను స్తుతింపఁగా శ్రీకృష్ణుఁడుగూడ యఘాసురుని నోటను బ్రవేశించి వానిశరీరము పగిలిపోవునంతయధికముగా నభివృద్ధిఁ జెంది వాని సంహరించి గోవత్సములతోడను, గోపబాలకులతోడను గోకులమును జేరెను.

> శ్లో. కదాచి ద్గోవిందే కలితమురళీనాదలలితే
> సరామే గోవత్సా న్వనభువి సుఖం చారయతిప్రై,
> విధిస్తత్సౌభాగ్యం నిరవధిక మాలోక్య కుతుకాత
> ముహుర్వత్సా బాలా నహర, దజమాయాపరవశః

12. శ్లో॥ కదాచిత్ = ఒకానొక సమయమందు; గోవిందే = శ్రీకృష్ణుడు, కలిత [illegible] నప్పుడు; మురళీనాదలలితే = వేణుగానము చేయుచున్నవాడై; విరామే = బలరామునితోగూడ; గోవత్సాన్ = అవుదూడలను; వనభువి = బృందావనమందు; సుఖం = సౌఖ్యముగా; చారయతి = మేపుచుండగా; విధిః = బ్రహ్మదేవుడు; తత్ సౌభాగ్యం = వారి మహిమను; నిరవధికం = పూర్తిగా; ఆలోక్య = చూడకోరికవాడై; కుతుకాత్ = కుతూహలముచేత అనగా వాడు చేయుబోవు మాయను శ్రీకృష్ణుడు తెలిసికొనగలడా అను విషయమును పరీక్షించుటకై; అజ మాయా పరవశః = సర్వేశ్వరుని మాయకు లోబడినవాడు అగుటచేత; వత్సాన్ = అవుదూడలనున్నూ; బాలాన్ = గోపబాలకులనున్నూ, ముహుర్ముహుః = మాటిమాటికి; అహరత్ = దాచిపెట్టెను.

ఒకప్పుడు శ్రీకృష్ణుడు బలరామునితోఁ గూడి మనోహరముగా వేణుగానము సేయుచు గోవత్సములఁ బరిపాలించుచుండెను. అపరిమితమగు నమ్మహాత్ముని ప్రభావము నెఱింగినవాఁడయ్యును, బ్రహ్మదేవుఁడు విష్ణుమాయా పరవశుఁడై "మఱియొకమారు ఈకృష్ణుని ప్రభావమును చూడవలయును. అను వేడుకచే గోవత్సములను, గోపబాలకులనుగూడ నపహరించెను.

శ్లో. హృతేషు వత్సబాలేషు జ్ఞాత్వా విధివిచేష్టితమ్,
తన్మాతౄస్తోషయామాస స్వయం వత్సాదిదేహభాక్.

13. శ్లో॥ వత్సబాలేషు = దూడలున్నూ, గోపబాలులున్నూ; హృతేషు = అపహరింపబడగా; విధివిచేష్టితం = ఈపని బ్రహ్మదేవునివల్ల జరిగించబడినదని; జ్ఞాత్వా = తెలిసినవాడై; స్వయం = తాను స్వయముగానే; వత్సాది = దూడలు మొదలైనవాటి యొక్క; దేహభాక్ = రూపములను పొందినవాడై; తన్మాతాః = వారి వారి తల్లులను; తోషయామాస = సంతోషింపజేసెను.

ఇట్లు బ్రహ్మదేవుడు చేశిన పని నెఱింగి యాభగవంతుడు తానొక్కఁడే గోపబాలకుల స్వరూపములను, గోవత్స స్వరూపములనుగూడ గైకొని విహరింపుచు, గోపికలకును, గోవులకును గూడ సంతసమును గల్గించుచుండెను. అ చతుర్ముఖుడు చేసిన కార్యమువలన కొఱతయేమియును గలుగలేదు.

*అథ బ్రహ్మాగమనం*

నాదనామ క్రియారాగము - ఆదితాళము

| | |
|---|---|
| ఆయాతిచతురాస్యో | బ్రహ్మాసదసి |
| గాయన్గాయన్ ధ్యాయ న్ధ్యాయన్ | విష్ణుం చేతసి |
| దండకమండలుధారీ | దానవవైరీ |
| అండబ్రహ్మాండవిధా | తా ఖిలజనయితా |

8 దరువు : నాదనామక్రియరాగం - ఆదితాళం

చతురాస్యో = నాలుగు ముఖములుగల బ్రహ్మదేవుడు; సదసి ఆయాతి = సభయందు ప్రవేశించుచున్నాడు; చేతసి విష్ణుం = మనస్సునందు శ్రీమన్నారాయణుని; గాయం గాయం = గానముచేయుచూ చేయుచు; ధ్యాయం ధ్యాయం = ధ్యానము చేయుచూ చేయుచు; దండకమండలధారి = దండకమండలమును ధరించినవాడున్నూ; దానవవైరి = రాక్షసులకు శత్రువున్నూ; అండబ్రహ్మాండ విధాత = వ్యస్తచేతన దేహములు, సకల ప్రపంచము నిర్మించినవాడు; అఖిల జనయితా = అన్నిటిని జనింప జేసినవాడు.

రాక్షసులకు శత్రువును, సకలలోకములకును సృష్టికర్తయు, నాల్గు మోములు గలవాఁడును నగునాబ్రహ్మ దండకమండలముల ధరించి శ్రీకృష్ణుని మనమున భావించుచుఁ దానొనర్చినపనికిఁ గృష్ణుఁ డేమిచేయుచున్నాఁడో యని చూడవచ్చెను.

శ్లో. ఇత్థం భూతం హరిం దృష్ట్వా వత్సరాంతే విధిః స్వయమ్, సందర్శితజగత్కోటిశరీరం స్తౌతి సాదరమ్.

14. శ్లో॥ ఇత్థం భూతం = ఈప్రకారముగా అనేకరూపములను ధరించి, నటించుచున్నటువంటి; హరిం = శ్రీకృష్ణస్వామిని; వత్సరాంతే = సంవత్సరం ఆఖరున; విధిః స్వయం = బ్రహ్మదేవుడు స్వంతముగా; దృష్ట్వా = చూచినటువంటివాడై; సందర్శితా = తనకు చూపించబడిన; జగత్కోటిశరీరం = బ్రహ్మాండకోట్ల శరీరముగా గలిగిన స్వామివారిని; సాదరం స్తౌతి = భక్తిపూర్వకముగా స్తోత్రము చేసెను.

ఇట్లు మరలి వచ్చునప్పటికి మనుష్యమానమున నొక్క సంవత్సరము గడచె అప్పటివఱకును ఈశ్రీకృష్ణుడు గోపాలబాల, గోవత్సరూపములఁ దానే ధరించి విహరించుచుండుటఁ జూచి మిగుల నాశ్చర్యపడెను. మఱియు నాచతుర్ముఖుఁడు వచ్చి చూచునప్పటికిని, గోపాలబాలకులును, గోవత్సములును శ్రీకృష్ణరూపములే కావున సర్వప్రపంచమయము లగునాకారములతోఁ గానవచ్చెను. ఇట్టి మహాద్భుతమును జూచి యాచతురాననుఁ డిట్లని కృష్ణుని నుతించె.

సురంజి (భైరవీ) రాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | జయజయ గోకులబాల | జయసకలాగమమూల |
| | దయయా మాం గోపాల | దీనం పాలయ బాల |
| 1. | దేవ మయా చరిత మిదం | దీనధియా అపరాధం |
| | శ్రీవసుధాధవ కృపయా | కేవల మిహ ధునుహి |
| 2. | ఈక్షే తావకదేహే | ఈశ జగంతి నిరీహే |
| | వీక్షాశిక్షితమోహే | వేదాంతాగమగేహే |
| 3. | జగదండకోటితనో | జగదుదరాంతరసుతనో |
| | అగణితసంజాతమనో హి | అపరిమితా శ్రితధేనో |
| 4. | వితర మయీశ్వర కరుణాం | విఘటయ మోహావరణం |
| | సతతం మే భవ శరణం | సాధయ సంసృతితరణం |
| 5. | ఇతి విధినా పరిగీతం | శ్రుతివచసా హరిచరితం |
| | యతినారాయణకథితం | యదుకులభూషణముదితం |

9వ కీర్తన భైరవిరాగం - ఆదితాళం

ప॥ హే గోకులబాల = హే కృష్ణమూర్తే; జయ జయ = సర్వోత్కృష్టముగా వర్తించుము; సకల ఆగమమూల = సకల వేదములకు మూల స్వరూపుడా

అ॥ హే గోపాల! = హే గోపాలస్వామీ!; మాం = నన్ను; దయయా, దీనం = దయచేత దీనుడనైన నన్ను; బాల, పాలయ = బాలగోపాలస్వామీ! రక్షించుము

1. దేవ! మయా = హే స్వామిన్ నాచేత; దీన, ధియా = స్వల్ప బుద్ధిచేత; ఆచరితం = ఆచరించబడిన; ఇదం, అపరాధం = ఈ తప్పును; శ్రీ, వసుధ = లక్ష్మీదేవికిన్నీ, భూదేవికిన్నీ; ధవ = భర్త అయినటువంటి స్వామీ! కేవలం కృపయా ఏవ = కేవలం కృపచేతనే; ఇహ, ధుహీను = ఇప్పుడు నశింపుచేయండి (క్షమించండి)

2. ఈశ = హేస్వామీ!, నిరీహే = నిర్వ్యాపారుడయినటువంటి అనగా ప్రకృతి సంబంధమైనటువంటి) వ్యాపారములేనివాడనుట; వీక్షా శిక్షిత మోహే = వీక్షణ మాత్రమేచేత మోహమును నశింపజేయునటువంటిన్నీ; వేదాంతాగమగేహే = ఉపనిషద్వాక్యములే, నిలయముగా గలిగినటువంటిన్నీ; తావక, దేహే = ఇటువంటి మాయొక్క శరీరమునందు; జగంతి, ఈక్షే = లోకములన్నిటిని చూచుచున్నాను.

3. జగదండకోటితనో = బ్రహ్మాండకోట్లు అను శరీరముగా గలవాడ; జగదుదరాంతర సుతనో = ఉదరమధ్యమున జగత్తును వుంచుకొని యుండునట్టి శరీరముగలవాడ, అగణిత సంజాతమనో = లెక్కించనలవిగాకుండా పుట్టించబడిన మనువులుగలవాడ; అపరిమిత = పరిమితములేకుండా; ఆశ్రితధేను = ఆశ్రయించినట్టి ధేనువులుగలవాడ.

4. ఈశ్వర = హే కృష్ణస్వామి; మే = నాయందు; కరుణాం = దయను; వితర = విస్తరింపజేయుమా; మోహావరణం = అజ్ఞానమనునట్టి తెరను; విఘటయ = తీసివేయుమా; సతతం = ఎల్లప్పుడున్నూ; మే = నాకు; శరణం = రక్షకుడవు; భవ = కమ్ము; సంసృతి = సంసారముయొక్క; తరణం = దాటుటను; సాధయ = వనకూర్చుమా

5. ఇతి = ఇట్లని; శృతివచనా = వేదవాక్యానుసారముగా; హరిచరితం = శ్రీకృష్ణుని కథను; విధినా = బ్రహ్మదేవునిచేత; పరిగీతం = చక్కగా గానము చేయబడినది; యదుకుల భూషణ ముదితం = శ్రీకృష్ణునకు సంతోషము కలిగించునటుల యతి నారాయణ కథితం = నారాయణ తీర్థుల వల్ల చెప్పబడినది.

ప. గోకులమునందు విహరించు నో యాదవబాలకా! సకలవేదములకును సారభూతుఁడా! నీకు నమస్కారము. (జయశబ్దము అధిక్యమును జెప్పును గావునను నమశ్శబ్దమునకుఁగూడ నదియే యర్థము కావునను ఇట్లు చెప్పఁబడినది.) ఓగోపాలబాలా! దీనుఁడ నగునన్ను దయతో రక్షింపుము.

1. భూదేవికి భర్తవగు నోనారాయణా! నేను తెలివిమాలినవాఁడనై నీయెడ నీమహాపరాధము నొనర్చితివి. నీవు దయామయుఁడవై సర్వమును క్షమింపవలయును.

2. వేదాంతశాస్త్రమున కాధారమై, కామము మొదలగుదోషమును లేనిదైయుండు నీశరీరమున సర్వప్రపంచమునుఁ జూచితిని. ఓపరమేశ్వరా! నీదర్శనము కలిగినతోడనే నా యజ్ఞానము తొలఁగిపోయెను.

3. అనేక బ్రహ్మాండములు శరీరముగాఁగలిగియు, మనువుల కనేకులకు (మనువులనఁగా ప్రపంచదృష్టికర్తలలో నొకతెగవారు) సృష్టికర్త వయ్యు శ్రీప్రపంచమధ్యమున మనోహరాకారమును దాల్చి సంచరించుచున్న యో కృష్ణా! నీవు గోపాలుఁడవు. నిన్నాశ్రయించినవార మగుటచే మే మందరమును గోవులము.

4. ఓపరమేశ్వరా! నాపైఁ గరుణఁజూపి సర్వకాలములందును నాకు శరణంబ వగుము. అజ్ఞానావరణమును దొలంగించి సంసారమునుండి యుద్ధరింపుము.

5. ఈవిధముగా వేదవాక్యములచే శ్రీకృష్ణుని చరిత్రమును బ్రహ్మదేవుఁడు వినుతించెను. దీనిని శ్రీకృష్ణునికి సంతసముగా నారాయణతీర్థుం డను యతివరుఁడు రచించెను

శ్లో. లీలామానుషదేహం లక్ష్మీశం త్వాం ప్రసాదయే దేవమ్,
సంసారార్ణవపతితం కంసరిపో మాం త్వముద్ధర త్వరయా.

15. శ్లో॥ లీలామానుషదేహం = లీలకొఱకు మనుష్యదేహమును అవలంబించినట్టిన్నీ, లక్ష్మీశం = లక్ష్మికి భర్త అయినటువంటిన్నీ, దేవం = దేవుడైనట్టి, త్వాం - నిన్ను, ప్రసాదయే = అనుగ్రహించవలెనని కోరుచున్నాను; కంసరిపో = కంసశత్రువుడైన; సంసారార్ణవ పతితం = సంసారమనే సముద్రమునందు, పతితం = పడియున్న; మాం = నన్ను, త్వరయా = శీఘ్రముగా; త్వం - నీవు, ఉద్ధర - ఉద్ధరింపుము

ఓలక్ష్మీనాథా! నీవు స్వప్రకాశుఁడవయ్యును మాయామనుష్యుఁడవై సంచరించుచున్నావు. నిన్ను వేఁడుకొనుచున్నాను. సంసారసముద్రమునఁబడియున్న నన్నుద్ధరింపుము

మోహనం (రేగుప్తి) రాగము అటతాళము

ప. దేవ దేవ ప్రసీదమే - దేవకీవరబాల ఓసుజనపరిపాల - దే

1. లీలావినోదవిగ్రహ లక్ష్మీపతే
బాల మోహవినిగ్రహ బాలోన్నతే
కలితసేవకానుగ్రహ కామాకృతే
అలఘువీర్యపరిగ్రహ అఖిలాండపతే
(అ) ఖిలమునిబృందానుగ్రహ గోపాలకృష్ణ
బాల ఘననీలాతిసుశీల హేమచేలా సంత
లీలాగమమూల శ్రీలోలాతివిశాలఫాల - బాలగోపాలకృష్ణ

2. శ్రీవత్సలక్షణాంచిత శ్రీభావిత
దేవగంధర్వసేవిత దివ్యాయుధ
గోవత్సగణసంవృత గోపాలవృత
అవ్యయ మునివందిత అచింతిత
భవ్యగోకులనిరత గోపాలకృష్ణ
పీతాంబరవీత విధుశీతాఖిలతాతా - ఘవి
ఘాతార్జున సూతామరగీతాగమజాతభాత - బాలగోపాలకృష్ణ

3. పూర్ణేందుమండలానన పురాతన
పూర్ణసుపర్ణవాహన వరానన
తీర్ణసంసార మోహన ధీరాయన
కర్ణకుండలశోభన కంజానన
వర్ణితవీర్య వామన గోపాలకృష్ణ
నారాయణ ధీరాగమసారాఘవిదూరానమ
భా రారివిదారామరవీరసంసారపార - బాలగోపాలకృష్ణ

10వ కీర్తన. మోహనరాగం - ఆదితాళం

దేవకీవరబాల = దేవకీదేవియొక్క శ్రేష్ఠమైనబాలుడా; దీనజనపరిపాల = దీనజనులను పాలించునట్టివాడా; దేవదేవ = దేవతలకు దేవుడైనవాడ; మే = నన్ను; ప్రసీద = అనుగ్రహించుమా

1. లీలా వినోద విగ్రహ = లీలచేత వినోదించు నిమిత్తమై గ్రహింపబడిన విగ్రహముగలవాడ; లక్ష్మీపతే = లక్ష్మికి భర్త అయినవాడ; బాల = బాలకృష్ణుడు; మోహవినిగ్రహ = మోహమును నిగ్రహించువాడ; బలోన్నతే = బలముచేత అతిశయించినవాడ; కలిత = ఒప్పుచున్నటువంటి ఆశ్రయించినటువంటి; సేవక = దాసజనులను; అనుగ్రహ = అనుగ్రహించుచున్నవాడ; అనుగ్రహించునట్టివాడ; కామాకృతే = కోరిన ఆకారము ధరించువాడ; అలఘు వీర్య పరిగ్రహ = గౌరవముగల పరాక్రమమును పొందినవాడ గౌరవముగల పరాక్రమమును గ్రహించినవాడ; అఖిలాండపతే = బ్రహ్మాండనాయకుడ; అఖిలమునిబృంద అనుగ్రహ = సమస్తమునుల సమూహములను అనుగ్రహించువాడ; బాలా = బాలకృష్ణుడా; గోపాలకృష్ణా = గోవులను పాలించుకృష్ణుడా; బాలా = బాలగోపాలా; ఘననీలా = మేఘమువలె నీలవర్ణముగలవాడ; అతిసుశీలా = అమిత సౌశీల్యముగలవాడ, అనగా గొప్పవారు కొద్దివారితో కలసి మెలసియుండుట; హేమచేలా = బంగారు వస్త్రముగలవాడ; అనంతలీలా = అంతములేని వినోదముగలవాడ; ఆగమమూలా = వేదములకు హేతువైనవాడ; శ్రీలోలా = లక్ష్మీలోలుడా; అతివిశాలఫాల = మిక్కిలివిశాలమైన మోముగలవాడ; బాలా గోపాలకృష్ణ లీలా వినోదవిగ్రహ

2. శ్రీవత్స లక్షణ అంచిత! = శ్రీవత్సమనునట్టి గుర్తుచేత ఒప్పినవాడ; శ్రీభావిత = లక్ష్మి అమ్మవారిచేత ధ్యానింపబడువాడ; దేవ! గంధర్వసేవిత = దేవతలచేత గంధర్వులచేత సేవించబడువాడ; దివ్యాయుధ = శ్రేష్ఠమైన ఆనందముగలవాడ; గోవత్స గణ సంవృత = గోవుల దూడలగుంపులచేత చుట్టబడియుండువాడ; గోపాలవృత = గోపాలకులచేత చుట్టబడియుండువాడ; అవ్యయ = వ్యయముకానివాడ, నాశములేనివాడ; మునివందిత = మునులచేత నమస్కరించబడువాడ; అచింతిత = యోచనకు అతీతమైనవాడ; భవ్యగోకులనిరత = శ్రేష్ఠమైన గోకులమునందు ఆసక్తిగలవాడ; బాలగోపాలకృష్ణ = బాలకృష్ణుడా; పీతాంబరవీత = పీతాంబరమును ధరించినవాడ; విధుశీతా = చంద్రునివలె చల్లబరచువాడ; అఖిలతాత = సమస్తమునకు తండ్రియైనవాడ; అఘవిఘాత = పాపములను పోగొట్టువాడ; అర్జునసూత = అర్జునకు సార్థ్యము చేశినవాడ; అమరగీత = దేవతలచేత గానము చేయబడువాడ; ఆగమజాతభాత = వేదములద్వారా ప్రకాశమును యిచ్చువాడ.

3. పూర్ణేందు మండలాననా = పూర్ణచంద్రమండలమును బోలుముఖముగలవాడ, పురాతన = ప్రళయములందు వుండినవాడ, పూర్ణ = అన్నిటియందు నిండియుండినవాడ, సుపర్ణవాహన = గరుడవాహనుడా; వరానన! తీర్ణసంసార మోహన = శ్రేష్ఠమైన ముఖకమల దర్శనమిచ్చుచు తద్వారా సంసారమోహమును తరింపజేయువాడ; ధీరాయన = ధీరులకు పరమగతి అయినవాడా, కర్ణ కుండలశోభన = చెవులయందు కుండలములయొక్క అలంకారముగలవాడు; కంజాసనసన్నుత = పూర్వము బ్రహ్మలచేతనున్నూ వర్ణించబడిన, వీర్య = పరాక్రమముగలవాడ; వామన = వామన స్వరూపుడా (బాలగోపాలకృష్ణా), నారాయణధీరా = నారాయణతీర్థులయొక్క బుద్ధిని బాగువాడ, అగమసారా = వేదములయొక్క సారాంశస్వరూపుడా; అఘవిదూరా = పాపములను అంటనివాడ, అసమహార = సరిలేని హారములుగలవాడ; అరివిదారా = శత్రువులను చీల్చివేయువాడ; అమరవీరా = దేవతలలో వీరుడా; సంసారసార = సంసారమునకు గట్టి అయినవాడా; బాలగోపాలకృష్ణ! దేవదేవ ప్రసీదమే.

ప. ఓదేవకీపుత్రా! దీనరక్షకా! ననుం గరుణింపుము.

1. సర్వలోకమునకు ప్రభువగు నోనారాయణా! నీవిప్పుడు మన్మథునితో సమానమగు నాకారముతో మాయావిలాసముచే నొకమనుష్య శరీరమును దాల్చియున్నావు. సకలమౌనులను రక్షించుచున్నావు. సేవకు లగువారియెడల నధికమగు కరుణఁజూపి వారలకు మిగుల నభివృద్ధి నొసంగుచున్నావు. నీల మేఘమువలె నల్లనిశరీరముగలవాఁడవును, విశాలమగు ముఖముగలవాఁడవును, పీతాంబరుండవు నగు నోగోపాలకృష్ణా! అజ్ఞానమును హరించుటలో నీకంటె నధికులు లేరు. వీర్యము జ్ఞానము మొదలగు సర్వసద్గుణములును నీయందే కలవు.

2. ఓస్వయంప్రకాశా! పార్థసారథీ, శ్రీవత్సమనియెడు చిహ్నముల తోడను, శంఖము చక్రము మొదలగు దివ్యాయుధములతోడను బ్రకాశించుచు, వేదాంతవేద్యుఁడవై దేవగంధర్వాదులచేఁ గీర్తింపఁబడుచు వైకుంఠముననుండు నోనారాయణా! నీవు పీతాంబరమును విడచి యెట్టియోగులకైనను మనసున భావించుటకుఁగూడ శక్యముగాని యాకారమును విడచి, చంద్రునివలె నతిప్రసన్న మగుగోపాలరూపమును దాల్చి యాగోకులము నివాసముగా నిలచియున్నావు. గోవత్సములతోడను, గోపాలకులతోడను విహరింపుచు చూచినవారల పాపముల హరించుచున్నావు.

3. ఓ అనాదిపురుషుఁడ వగు గరుడవాహనా! పూర్ణచంద్రునిబింబముతో సరియగు సుందరముఖముతోడను, మనోహరములగు కుండలముల తోడను, హారములతోడను జగన్మోహనాకారుఁడవై, సంసారదూరుఁడవై, అద్భుతమగు పరాక్రమముగలవాఁడవై, వేదాంతవేద్యుఁడవై, గోపాలకృష్ణ రూపమున ఆశ్రయించినవారల సంసారములఁ దొలఁగఁద్రోయుచు; జ్ఞానులకు నాశ్రయమొసంగుచున్నావు. దేవతలదెన మిగుల కరుణగలవాఁడవనియు, వేదాంతవేద్యుఁడ వనియు, శత్రువుల సంహరించువాఁడవనియు, నారాయణతీర్థులు నిను నుతింపుచున్నారు.

శ్లో. కర్పూరాభౌ కువలయదళశ్యామలౌ చాభిరామౌ
కల్యాణానాం సకలజగతా మాశ్రయౌ గోపబాలౌ,
భక్తత్రాణాధ్వరవరవిధౌ దీక్షితౌ మోక్షహేతూ
మాయాశక్త్యా విరచితతనూ రామకృష్ణౌ స్మరామి.

16. శ్లో॥ కర్పూరాభః = కర్పూరమువలె తెల్లగానుండు బలరాముడు; కువలయదళ శ్యామలస్య = నల్లకలువ రేకులవలె శ్యామలముగా నుండు కృష్ణుడున్నూ; అభిరామౌ = ఉభయులు మనోహరులున్నూ; కళ్యాణానాం.......అశ్రయౌ, సకలజగతాం = సమస్త జగత్తులయొక్క; కళ్యాణానాం = శుభములకు; ఆశ్రయౌ = ఆధారమైనట్టిన్నీ; గోపబాలౌ = గోపబాలకులైనట్టిన్నీ; భక్త...........దీక్షితౌ; భక్త త్రాణ = భక్తులను రక్షించుటయనెడు; అధ్వర వర = యజ్ఞమున శ్రేష్ఠమైన; విధౌ దీక్షితౌ = విధానమందు దీక్షను వహించినట్టిన్నీ; మోక్షహేతు = మోక్షమునకు కారణభూతుడైనట్టిన్నీ; మాయా.............. తరూ; మాయాశక్త్యా = సంకల్పరూప జ్ఞానశక్తిచేత; విరచిత తనుం = నిర్మింపబడిన దేహములు గలిగినట్టిన్నీ; రామకృష్ణౌ = బలరామకృష్ణులను; స్మరామి = స్మరించుచున్నాను.

కర్పూరమువలెను, నల్లకలువవలెను, తెలుపు నలుపు వర్ణములచే మనోహరులగువారును, సమస్తలోకములయొక్క సుఖములకు నాధారభూతులును (అనఁగా సుఖమునిచ్చువారనుట) 'భక్తరక్షణ' మనియెడు యజ్ఞమునందు దీక్షను బూనినవారును, మాయవశమున గోపబాలకశరీరమును దాల్చియున్న వారునగునాబలరామకృష్ణుల మోక్షముగల్గుటకై ధ్యానించుచున్నాను.

శ్లో. భగవంత మిత స్తుత్వా విధిః స్వం ధామ సత్వరమ్,
హరిణా గురుణా జ్ఞాతో యయౌ కృష్ణో పి గోకులమ్

17. శ్లో॥ భగవంతం = భగవంతుడైన శ్రీకృష్ణస్వామిని; విధిః = బ్రహ్మదేవుడు; ఇతి = ఇట్లని ఈవిధముగా; స్తుత్వా = స్తోత్రముచేసినవాడై; గురుణా = గురువైనటువంటి; హరిణా = శ్రీకృష్ణునివల్ల; అజ్ఞతో = అజ్ఞను పొందినవాడై; సత్వరం = త్వరగా; స్వంధామ = తననివాస స్థానమునకున్నూ; కృష్ణాఅపి = కృష్ణుడు గూడా; గోకులం = గోకులమునకున్నూ; యయౌ = వెళ్ళిరి

ఇట్లా బ్రహ్మదేవుడు భగవంతుఁడగు శ్రీకృష్ణుని నుతించి లోకగురువగు నమ్మహాత్మునివలన నాజ్ఞగైకొని శీఘ్రముగా తన నివాస మగుసత్యలోకమునకు బోయెను. అహరియు వ్రేపల్లెకుఁ జనియెను.

*అథ యాజ్ఞికానా మాగమనమ్*

సౌరాష్ట్ర రాగము - ఆదితాళము

**ఆరణిపాత్రపాలాశకుశ భారం వహంతో**
**ధరణితలే సతతం ధావంతో యాజ్ఞికా ఆయాంతి**
**పవిత్రపాణయో నిత్యం పశులక్షణవిదో**

సవిత్‌ృమండలాంతస్థం ధ్యాయంతో యాజ్ఞికా ఆయాంతి
అహం పూర్వ మహం పూర్వ మితి యజ్ఞకుశలా
గహనకర్మసామాదీని గాయంతో యాజ్ఞికా ఆయాంతి

11 వ కీర్తన - సౌరాష్ట్రరాగము - ఆదితాళం

ఆరణి = అగ్నిమథన కాష్టము, పాత్ర = యజ్ఞపాత్రము; పాలాశ = సమిధలు, కుశ = దర్భలు, భారం = భారమును (బరువును), వహతః = మోయుచున్నవారలై, ఘనవీతలే = ఘనమండలమందు; సతతం = ఎల్లప్పుడు; ధావంతాన్ = పరుగెత్తుచున్నవారలై. యాజ్ఞికా = యజ్ఞముచేయించువారు; ఆయాతి = వచ్చుచున్నారు; పవిత్ర పాణయః = పవిత్రమును హస్తమందు ధరించినవారలై; నిత్యం = ఎల్లప్పుడు; పశులక్షణ విధః = యజ్ఞపశువులయొక్క లక్షణములను తెలిసినవాడును; సవితృమండలాంతస్థం = సూర్యమండల మధ్యవర్తియగు నారాయణుని, ధ్యాయంతః = ధ్యానము చేయుచున్నవారలై; యాజ్ఞికా = యజ్ఞము చేయించువారు; ఆయాంతి = వచ్చుచున్నారు. అహంపూర్వం అహంపూర్వం = నేను ముందు నేను ముందు చేయించగలనని; ఇతి = ఈప్రకారము; యజ్ఞకుశలా = యజ్ఞము చేయించుటయందు నేర్పుగలవారలై; గహన, కర్మ = అడవివలె దుష్ప్రదేశమైన కర్మకాండను ప్రతిపాదించువారలై; సామాదీని గాయంతః = సామాదులను గానము చేయుచున్నవారలై; యాజ్ఞికా = యాజ్ఞికులు. ఆయాంతి = వచ్చుచున్నారు.

లక్షణయుక్తములగు నరణులను, పశువులను సంపాదించి సమిధలు, దర్భలు, యజ్ఞపాత్రలు వీనిని సమకూర్చి చేతులయందు పవిత్రములను ధరించి సామగానము సేయుచు నీకార్యము నేను ముందు సేయుదునని మహోత్సాహముతో పరుగిడుచు సూర్యమండలమునందున్న నారాయణుని మనస్సునందు ధ్యానింపుచు కొందఱు బ్రాహ్మణు లొకచో యజ్ఞముచేయుచుండిరి.

అథ యజ్ఞపత్నీనా మాగమనమ్

యదుకుల కాంభోదీరాగము - ఆదితాళము

యజ్ఞపత్నీ బృందమధునాయాతి యాగశాలామనింద్యకర్మవిధినా
విజ్ఞానపూరిత శుద్ధమనసాసహ విశ్వాసపూర్వకనమ్రశిరసా
దివ్యసుందరం భవ్యకంధరం ధృతనవ్యపీతాంబరమద్భుతహారం
చారుకబరీభారభరితం దివ్యచామికరాభరణగణభాసితం

అధునా = ఇప్పుడు; యజ్ఞపత్నీబృందం = సోమదేవమ్మల సమూహము; అనింద్య కర్మవిధినా = ఆక్షేపణలేని క్రియాకలాపములచేత; యాగశాలాం = యజమణాముచేయుచోటికి; ఆయాతి = వచ్చుచుచున్నారు; విజ్ఞాన = విశేషజ్ఞానముచేత; పూరిత = నిందింపబడిన; శుద్ధమనసా సహ = నిర్మల మనస్సుతోడా కూడుకొని; విశ్వాసపూర్వక నమ్రశిరసా = నమ్మకముతో

గూడినటువంటి వంచబడిన శిరస్సుగలవాడై; చారు, కబరీ, భార, ఫలితం = సుందరమైన కొప్పులు బాగా సవరించుకొని; దివ్యసుందరం = సుందరమైన వారున్నూ; భవ్యకంధరం = శ్రేష్ఠమైన మెడలుగలవారున్నూ; ధృతనవ్యపీతాంబరధరం = క్రొత్త పట్టువస్త్రములు ధరించినవారున్నూ; అద్భుతహారం = ఆశ్చర్యకరమైన హారమును ధరించుకొని; చామీకరాభరణ = బంగారు ఆభరణములు ధరించి; గణ = సమూహములుగా; భాసితం = ప్రకాశించుచున్నారు.

అప్పుడు వారిభార్యలును, మనోహరము లగుపీతాంబరములఁ గట్టి సువర్ణమయము లగుభూషణముల నలంకరించుకొని కంఠమునందు ముత్యాల హారములు మొదలగుభూషణము లొప్పుచుండఁ దలవెంద్రుకలను మనోహరముగ ముడిచి మిగుల నమ్రతతో వారిభర్తల చెంత యజ్ఞశాలయందుండిరి. దేవతాస్త్రీలవలె నతిసుందరము లగువారలచిత్తములు మిగుల జ్ఞానవంతములై యుండెను. (సౌందర్యము గలచోట సద్గుణములు కూడ నుండునని పెద్దలు చెప్పుదురు)

గ. ఏవంయజ్ఞపత్నీ సహితయజమానయాజ్ఞిక ప్రవర్తితేయజ్ఞకర్మణి సాక్షాద్యజ్ఞ స్వరూపీభగవాన్ కందర్పదర్పమహాసర్పగరుడాయ మానదివ్యమూర్తిధరో గోపబాలైస్సహశనైశ్శనైస్సంచరన్ చారయన్నపి గోవత్సాన్ తదుపవనదేశమాజమగామ. తత్ర కదాచి ద్వత్సపాలనసమయే బాలా ఊచుః.

18. గద్య:- ఏవం = ఈప్రకారముగా; యజ్ఞపత్నిసహిత = తమ తమ భార్యలతో కూడుకున్న; యజమాన = యజ్ఞముచేయు విప్రులచేతనున్నూ; యాజ్ఞిక = యజ్ఞములు చేయించువారిచేతనున్నూ; ప్రవర్తితే = జరిగించబడుచున్నట్టి; యజ్ఞకర్మణి = యజ్ఞకలాపమునందు; సాక్షాత్‌యజ్ఞస్వరూపి = ప్రత్యక్షముగావేంచేశిన యజ్ఞస్వరూపుడైన; భగవాన్ = షాడ్గుణ్యపూర్తిగల; కందర్పదర్ప = మన్మధునియొక్క గర్వమనునట్టి; మహాసర్ప = గొప్పసర్పమునకు; గరుడాయమాన = గరుత్మంతుడని చెప్పదగిన; దివ్యమూర్తిధరః = దివ్యమంగళ విగ్రహమును ధరించినట్టి స్వామివార్కి; గోపబాలైఃసహ = గోపబాలకులతోటి; శనైశ్శనైః = మెల్లమెల్లగా; సంచరన్ = సంచారముచేయుచూ; గోవత్సాన్ = ఆవుదూడలను; చారయన్ = తిప్పిమేపుచూ; తత్‌ఉపవనదేశం = అయజ్ఞశాల సమీపప్రదేశమునకు; ఆజగామ = వేంచేశిరి; తత్ర = అక్కడ; కదాచిత్ = ఒకానొక సమయమునందు; వత్సపాలన సమయే = ఆవుదూడలను మేపుచున్నప్పుడు; బాలా = గోపబాలకులు; ఊచుః = ఈక్రిందివిధముగా విన్నవించిరి.

ఇట్లు వారు యజ్ఞముసేయుచుండగా మన్మథుని ధిక్కరించు సౌందర్యముగలిగి యజ్ఞస్వరూపుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు గోపబాలకులతోఁగూడి విహరింపుచు, గోవత్సముల మేపుకొనుచు, నాస్థలమునకు సమీపమునందున్న యొకవనమును జేరెను. ఇట్లావనమున వత్సములను మేపుచుండనొకప్పుడు గోపబాలకులు కృష్ణునితో నిట్లనిరి.

శ్లో. వయ మిహ విచరామో హ్యన్న మాకాంక్షమాణాః
కథ మిహ భగవన్నో బాలకానా మి హాన్నమ్,
ఇతి వనభువి పృష్టో బాలకైర్బాలకృష్ణో
వ్యవద దిహ చ భూయాదన్న మత్యంతమృష్టమ్.

19 వయం = మేము; ఇహ = ఇక్కడ, అన్నం ఆకాంక్షమాణః = అన్నం కోరుచున్నవారలమై, విచరామః = సంచరించుచున్నాము; భగవన్ = హే స్వామీ!; సఃబాలకానాం = బాలసులమైన మాకు; అన్నం కథం ఇవ = అన్నము ఏవిధముగా దొరకును; ఇతి = ఇట్లని, వనభువి = బృందావనమందు; బాలకృష్ణః = శ్రీ స్వామివారు; బాలకైః = గోపబాలకులచేత; పృష్టః = అడుగబడినవారై, అవరతు = జవాబు చెప్పినది ఏమనగా; ఇహ = ఇక్కడ; అత్యంత మృష్టమ్ అన్నం = మిక్కిలి పుష్కలమైన అన్నము; భూయాత్ = కదలదు.

ఓభగవంతుఁడా! మే మిపు డాఁకలిఁ గొనియున్నాము. మా కిటనన్నము దొరకుట యెట్లని యాగోపాలబాలకులు శ్రీకృష్ణుని నడిగిరి. ఆమహాత్ముఁడును మీరుసందేహింపవలదు ఇచటనే మృష్టాన్నము దొరుకఁగలదు. అని సమాధానము చెప్పి యొకగోపబాలకునిఁ బిలిచి యిట్లనియె.

శ్లో. యజ్ఞశాలేయ మస్మాభి రత్రైవాన్నం హి లభ్యతే,
గచ్ఛ పృచ్ఛేజ్య శాలాయాం యజమానం చ యాజ్ఞికాన్

20. శ్లో॥ ఇయం = ఇది; యజ్ఞశాల = యజ్ఞశాలగావున్నది; అత్రేవ = ఇక్కడనే; అస్మాభిః = మనచేత; అన్నం లభ్యతేహి = అన్నం దొఱకునుగదా; గచ్ఛ = వెళ్ళుండి; యజ్ఞశాలాయాం = యజ్ఞశాలయందు; యజమానంచ = యజ్ఞము చేయువారినిన్నీ; యాజ్ఞికాన్ = యజ్ఞము చేయించువారలనున్నూ; పృచ్ఛ = అడగండి.

ఇదిగో యజ్ఞశాల గనుపడుచున్నదీ. అచటికిఁ బోయి యజమానుని, ఋత్విజులను జూచి యన్నము నడిగినయెడల నవశ్యము వార లొసంగుదురు.

శ్లో. యది తేన ప్రయచ్ఛంతి యాచస్వాన్న మశంకితః,
తత్పత్న్యః ప్రతిజానంత్యో దాస్యకంత్యన్నాని తాః స్త్రియః.

21. శ్లో॥ నప్రయచ్ఛంతి యది = ఇవ్వనియడల; తత్పత్న్యః = వారిభార్యలను; అశంకితః = సందేహములేకుండ; అన్నం = అన్నమును; యాచస్వ = అడగండి; తాస్త్రియః = ఆస్త్రీలు; ప్రతిజానంత్యః = విశేషజ్ఞానము కలవారుగనుక; అన్నాని = అన్నములను; దాస్యంతి = ఇచ్చెదరు.

ఆపురుషులు అన్నము నొసంగరేని వారిభార్యలను యాచింపుఁడు. వారు విజ్ఞానవతులు నిస్సంశయముగ నన్నము నిచ్చెదరు.

శ్లో॥ యాజ్ఞికైర్యజమానేన ప్రత్యాఖ్యాతశ్చ తైర్ద్విజైః,
యయాచే యజ్ఞపత్నీస్తాః కృష్ణార్థే గోపబాలకః

22. శ్లో॥ యజమానేన = యజ్ఞముచేయువారిచేతనున్నూ; యాజ్ఞికైః = యజ్ఞము చేయించు అబ్రాహ్మణులచేతనున్నూ; తైర్ద్విజైః = అబ్రాహ్మణులచేతనున్నూ; ప్రత్యాఖ్యాతశ్చ = తిరస్కరింపబడినవారై; తాఃయజ్ఞపత్నీః = అవిప్రభార్యలను; గోపబాలకః = గోపబాలకుడు; కృష్ణార్థే = కృష్ణునికొఱకు; యయాచే = అడిగెను.

అట్లు కృష్ణునిచే నాజ్ఞాపింపఁబడి గోపబాలకుడు యజ్ఞశాలకుఁ జని, కృష్ణునకై యన్నమును యాచించెను, దానికి ఋత్విజులును, యజమానుండును దిరస్కరించిరి. అంత నాబాలకుఁడు వారిభార్యలకడకుఁ బోయి యడిగెను.

శ్లో॥ సకృచ్ఛ్రవణమాత్రేణ స్వాద్వన్నాని బహూ న్యపి,
ఆదాయ తాః పరం కృష్ణం ముక్తసంగాః ప్రదుద్రువుః

23. శ్లో॥ సకృత్ = ఒకేసారి; శ్రవణమాత్రేణ = విన్నమాత్రంచేతనే; తాః = అవిప్రభార్యలు; బహూన్యపి = అనేకములైన; స్వాద్వన్నాని = మధురాహారములను; ఆదాయ = తీసికొన్నవారలై; ముక్తసంగాః = పతి పుత్రాదులయందు అవనియందు అభినివేశములేనివారై; పరం కృష్ణం = పరుడైన శ్రీకృష్ణునియొద్దకు; ప్రదుద్రువుః = పరుగెత్తుకొనివచ్చిరి.

ఆస్త్రీలును "కృష్ణునకు" అనుమాట వినితక్షణమే రుచ్యము లగు నన్నముల నధికముగఁ గైకొని యెవ్వ రాటంకముఁ జేసినను నిలువకుండ యాశ్రీకృష్ణునికడకుఁ బరుగిడి వచ్చిరి.

శ్లో. తత్ర గత్వా తు గోపాలం గోపీజనమనోహరం,
భోజయిత్వా థ సంతుష్టం విహితాఞ్జలయో స్తువన్

24. శ్లో॥ తత్ర = అక్కడ (స్వామివారున్నచోట); గత్వాతు = వెళ్ళినవారై; గోపీజనమనోహరం = గోపీజనమనోహరుడైన; గోపాలం = శ్రీకృష్ణస్వామిని; సంతుష్టం భోజయిత్వా = సంతోషించునట్లుగా భుజింపజేసి; విహితాంజలయః = చేర్చబడిన చేమోడ్పులుగలవారై; అస్తువన్ = స్తోత్రము చేసిరి.

ఇట్లచటికిఁ జని గోపికామనోహరుఁ డగునాగోపాలకృష్ణునకు భోజనము పెట్టి తృప్తిఁ జెందించి పిదప బద్ధాంజలులై యిట్లని వినుతించిరి.

ప. బాలగోపాలకృష్ణ పాహి పాహి
అ. నీలమేఘశరీర నిత్యానందం దేహి

1. కలభసుందరగమన కస్తూరిశోభితానన
నళినదళాయతనయన నందనందన
మిళితగోపవధూజన మీనాంకకోటిమోహన
దళితసంసారబంధన దారుణవైరినాశన

2. యజ్ఞ యజ్ఞ సంరక్షణ యాదవవంశాభరణ
యజ్ఞ ఫలవితరణ యతిజనశరణ
అజ్ఞానఘనసమీరణ అఖిలలోకకారణ
విజ్ఞానదళితావరణ వేదాంతవాక్యప్రమాణ

3. వ్యత్యస్తపాదారవింద విశ్వవందితముకుంద
సత్యాఖండబోధానంద సద్గుణబృంద గోవింద
ప్రత్యస్తమిత భేదకంద పాలితనందసునంద
నిత్యద నారాయణతీర్థనిర్మలానంద గోవింద

13వ కీర్తన - మోహనరాగం - ఆదితాళం

బాలగోపాలకృష్ణ! పాహి పాహి = హే బాలగోపాలకృష్ణస్వామీ! రక్షింపుమా, రక్షింపుమా; నీలమేఘశరీర = నీలమేఘముతో సమానమైన శరీరముగలవాడా; నిత్యానందం = నిత్యానందమును; దేహి = ఇమ్మా!

1. కలభసుందరగమన = ఏనుగు గున్ననడకవంటి సుందరమైన నడకగలవాడా; కస్తూరిశోభితానన = కస్తూరి తిలకముచేత ప్రకాశించుచున్నట్టి ముఖముగలవాడ; నళినదళ = తామరరేకులవలె; ఆయత = విశాలములైన; నయన = నేత్రములుగలవాడ; నందనందన = నందునియొక్క కుమారుడా; మిళిత గోపవధూజన = గోపస్త్రీలతో కలిసియుండువాడ; మీనాంకకోటిమోహన = కోటి మన్మథులతో సమానమైన సౌందర్యముగలిగి మోహింపజేయువాడ; దళిత సంసారబంధన = కొట్టివేయబడిన సంసారబంధముగలవాడ; దారుణవైరి నాశన = భయంకరమైనటువంటి ప్రకృతి అనే శత్రువును నాశనము చేయువాడ.

2. యజ్ఞ ! = యజ్ఞమే స్వరూపముగా గలవాడ; యజ్ఞసంరక్షణా = యజ్ఞమును సంరక్షించువాడ; యాదవ వంశాభరణ = యాదవ వంశమునకు ఆభరణమువంటివాడ; యజ్ఞఫల వితరణ = యజ్ఞము యొక్క ఫలమును యిచ్చువాడ; యతిజన శరణ = యతీశ్వరులకు రక్షకుడైనవాడ; అజ్ఞాన = అజ్ఞానమనెడు; ఘన = మేఘములకు; సమీరణ = వాయువువంటివాడ; అఖిలలోకకారణ = సమస్తలోకములకు కారణభూతుడా; విజ్ఞాన దళిత ఆవరణ = విశేష జ్ఞానముచేత కొట్టివేయబడిన మోక్షముగలవాడ; వేదాంత వాక్యప్రమాణ = ఉపనిషద్వాక్యములే ప్రమాణముగా గలిగిన పరస్వరూపుడా

3. వ్యత్యస్త పాదారవింద = వత్యాసమైన వి ్యాసముగల పాదారవిందములుగలవాడ; విశ్వవందిత ముకుంద = లోకముచేత నమస్కరింపబడువాడ మోక్షమును యిచ్చువాడ; సత్య = నిర్వికారమైనటువంటిన్నీ; అఖండ = తెంపులేనట్టిన్నీ; బోధ = జ్ఞానమున్నూ; ఆనంద = ఆనందమున్నూ స్వరూపముగా గలవాడ; సద్గుణబృంద = సద్గుణ సమూహములుగలవాడ; ప్రత్యస్తమిత భేద కంద = అస్తమింపజేయబడినటువంటి భేదములు (అనగా భేదములు నశింపజేయువాడ); పాలిత నందసునంద = నంద సునందులను పాలించువాడ; నిత్యద = మోక్షమిచ్చువాడ; నారాయణతీర్థ = నారాయణ తీర్థులకు; నిర్మల = మాలిన్యమును తీసివేశి; ఆనంద = సంతోషమునిచ్చునటువంటి; గోవింద = గోవిందుడా.

ప. ఓగోపాలకృష్ణా! మమ్ము రక్షింపుము.

అ. నీలమేఘశ్యామలవర్ణా! పరమానందరూపమగుమోక్షము నిమ్ము.

1. మందగమనముతోడను, గోపాంగనల నాకర్షించు మన్మథకోటి సమాన మగుసౌందర్యముతోడను, కమలమువలె విశాలము లగు నేత్రముల తోడను, కస్తూరీతిలకముచేఁ బ్రకాశించు సుందరముఖారవిందముతోడను భయంకరులగు శత్రువుల మర్దించి లోకోపకారము సేయుచు, ఆశ్రితుల సంసార బంధములఁ దొలఁగించుచు నుండువాఁడ వగుటచే కరుణామయ మగుమనస్సు తోడను నందకుమారుఁడవై విహరింపుచున్నావు.

2. ఓ యదుకులాలంకారా! నీవే యజ్ఞస్వరూపుఁడవు. యజ్ఞములను సంరక్షించువాఁడవు. యజ్ఞఫలముల నొసంగువాఁడవు. సర్వమును సన్యసించిన విరక్తులకుఁగూడ గమ్యస్థాన మనియు, అజ్ఞాన మనుమేఘమునకు ఝంఝా మారుతమువంటివాఁడవనియు, సర్వలోకమునకును సృష్టికర్త వనియు, జ్ఞాన స్వరూపుఁడ వగుటచే అవిద్య మొదలగు నావరణములు లేనివాఁడవనియు వేదాంతవాక్యములు నిన్నుఁగూర్చి చెప్పను.

3. సత్యజ్ఞానానందస్వరూపుఁడ వనియు, సమస్త కల్యాణగుణములకు నాధారభూతుఁడ వనియు, అద్వితీయుఁడ వనియు, ఆశ్రితు లగువారికి మోక్షమునిచ్చువాఁడ వనియు, ఉపనిషత్తులచే వర్ణింపఁబడుచుండువాఁడ వనియు, ప్రపంచము నిన్ను వినుతించుచుండును. సనకసనంద నాదులకును, నారాయణతీర్థులనకు పరమానందము నొసంగిన యోనారాయణా! నీవు పాదములను వ్యత్యస్తములుగా నుంచుకొనుట మొదలగు లీలలచే బాలభావము నభినయించుచున్నావు.

శ్లో. యజ్ఞపత్న్యస్త మీశానం లీలాగోపాలవిగ్రహం,
ప్రసాదయంతి యం వేదా స్తాత్పర్యేణామనంతి తే.

25. శ్లో॥ తే, వేదా = ఆవేదములు; తాత్పర్యేణ = అంతరార్థములచేత; యా = ఏ పరబ్రహ్మమును, ఆమనంతి = తెలియజేయుచున్నవో; తం ఈశానం = ఆ ప్రభువు అయినటువంటి, లీలా గోపాలవిగ్రహం = లీల కొఱకు గోపాల రూపమును ధరించిన స్వామివారిని. యజ్ఞపత్న్యః = విప్రభార్యలు; ప్రసాదయంతి = అనుగ్రహము కలుగజేసుకొను చున్నాము (ప్రార్థించుచున్నాము)

లీలచే గోపాలబాలరూపమును ధరించి యున్న యాపరమేశ్వరు న్నాబ్రాహ్మణభార్యలు మతిసుతి వేడుకొనుచున్నారు. ప్రమాణములలో నుత్తమము లగువేదములు కూడ నాగోపాలకృష్ణుని గూర్చియేకదా చెప్పుచున్నవి.

మోహన (రేగుప్తి) రాగము - అటతాళము

ప. బాలగోపాల మా ముద్ధర-కృష్ణ పరమకల్యాణ గుణాకర

అ. నీరదనీలకళేబర కృష్ణ నిరుపమకౌస్తుభకంధర

1. నందనందన భక్తచందన - సురబృందరచితబహువందన
మందస్మితసుందరానన-కోటి మదనసుందర జగన్మోహన
ఇందిరామందిర-భక్త సుందరహృదయారవింద
భృంగ భక్తిమకరంద నందితగోపికాబృంద

**తాంతాహతధైదత్తత్తాం-తక్కతో ధిమ్మిణాంగిణతో ధిమ్మిరే-తక్కతో ధిమ్మిధిమికిటతో ధిమ్మిరేతక్కతోదిగిణాంగంగిణత్తోం గధిర్గుడు దధిగుడుధత్తోంగ-లోధిగిణంగత్తిరుత్తోంగ - దడిర్గుడు దధికితకిటదధిగిణతోం - బాలగో**

2. యజ్ఞాదికర్మఫలప్రద - కృష్ణ యదుకులజాతసుఖప్రద
యజ్ఞసంరక్షణదీక్షిత -కృష్ణ యతిజనముక్తిదసువ్రత
తాధైయ్యధైయత్తతా - కిటతకతత్కిణ్ణం - తరికిటతరికిటధిమి
ధింధింధిమికిట - తోంగిటకిత్తోంగతాంగిణ - కిణకిణధరిధరి
కుంతకతక - ధిర్గుడుకతకధీర్గుడుతక - గణపతిగురుశ్రీపతిషణ్ము
ఖ-జయజయజయ - ఝుంతరికిటతకతత్తోంగితతోంగ - త్తక
గిణదినుహతధిమితాతాధాం - తకధిర్గుడుతకదధిగిణితోం - దిన
హతధిమితాతాధాం - తకధిర్గుడుతకదధిగిణతోం
చింతతజనచింతామణిగణ సంతతసుఖసంతానప్రద
మందరధరమంజుళమౌక్తిక నందితజన నందాత్మజ వర
బృందావనబృందారకగణ వందితపద వసుదేవాత్మజ
**జయజయజయ-ఝుంతరికిటతకతత్తోంగితతోంగి తొత్తకగిణదినహ**
**తధిమితాతాధాం- తకధిర్గుడుతకదధిగిణతోం-బాలగో**

3. అన్న మయాదిషుపంచసు త్వా - మంతర మానందవిగ్రహం
ఉన్నతఫలమామనంతితే జగ - దుదయనయాదిషు లక్షితం
తద్ధిత్వ మేవాసితద్ధిత్వ మేవాసితత్సర్వ మేతత్త్వ మేవాసినూనం
తదుత్తఙ్గముక్తామణి ప్రస్ఫురద్దివ్య - మత్తేభవద్యోగిచిత్తేస్ఫురంతం
నృత్యంతమత్యంతమానందమీడే - హితంత్వామహంత్వామ
హంత్వామహం - తధితకుదకుకుతతత్తకుకుధికురు - తత్తత్తోంగు
తక్కిటకిటకుధరికిటతతొంగ - కిట్టకితకిటదధిగణతోం - బాలగో

4. సంతత మంత రవస్థితం - హృది సత్యవిజ్ఞానసుఖాకృతిం
అంతర్యామితయోదితం - యోగిచింతిత మాకలయామి తం
త్తధిర్గుడుధత్తాం - తత్తధిర్గుడుదత్తాం - కిటతంత త్తరికిత త్తరికిదోగు
డుదోగుడుతకధోంధోం - కుందకిటకిటధరికుకుంద త్తకుకుంధరికి
దేకుడేకుకుంధరికిడిక్క ప్రభేదమిహ - ఝకుఝకుజఝణజ
యశీలనటనమ్ - సకలజగదాదిం సకలమునిగీతం
సకలనిగమాంతజనితాంతమతివిదితం
తంపరమయోగిగణచింతితమఖండసుఖ
సంపద మపారమహిమాన మణిమాన మిహ
రంగత్తురంగమాతంగవరహంసగతి
మంజీరమంజురటనట మఖిలరంజనం

**తధింతతదింతతకిటధిమిధిమిధిమిత ధీతకిటధిమితకిటధిమితకిటహం**

**తధీం-తాహత్తధీంతాహత్తధిన్నాం - తాహత్తధీం - ధిన్నాధిన్నాహత్తతాంధిన్నా దిన్నధీం - తాతాధిన్నిధీం తధ్ధిన్నతక ధిన్న తాహత్తధిన్నాం - కత్తండిక త్తరిడికాహురెకాహురె - కంజరిడికంజరిడి దేహురేదాహురే**

సంగీతసాహిత్యవిద్యావినోదవరగోవిందగోపాల

గోపీమనోహరే - మతిరస్తు రతిరస్తు మంగళం భవతు మమ తద్ధింతతద్ధింతతకిటధిమిధిమిధిమిత - ధీతకిటధిమితకిటకిత్తకతతకిటదధి గణదోం - బాలగో

5. తారకసమముక్తహారకం భక్త - కారుణ్యరసపూరధారకం
నారదమునిక్షేమ కారకం - ధీరనారాయణతీర్థతారకం
తాంతాహతధణతాంధణాంధణతాం - ధణ్ణాంధణ్ణతాం

తద్ధిమ్మితద్ధిమ్మతాణ్ణవాలోలం - రింఝింరింఝిరింఘుణరాధాలోలం కుందకిటకిటధరికి గోపికాజారం - నగధరంతోధిత్ర నవనీతచోరం త్వామహం కలయామి ధీర - మనామయం నకలకామదంభువి సంతతమానవ్దతాణ్ణవాలోలం - సద్గుణమణిగణభూషణ జాలం సుందరగోకులబాలగోపాలం - సత్యప్రతిజ్ఞ సంతానగోపాలం విఖ్యాతసత్కీ ర్తివిజయగోపాలం - మందస్మి తానన్దమదనగోపాలం కందర్ప కోటికల్యాణగోపాలం - భక్తజనబృంద ప్రసన్న గోపాలం సిద్ధజనసిద్ధాంతసిద్ధగోపాలం - మత్స్యావతారాది మహిమగోపాలం తం త్వా మహం త్వా మహం

తద్ధితకుకుధికుకుతత్తత్తకుకుధికుకుతత్త - తోంగుతక్కిటకిటకుధరికి టతథోంగ - కిడ్తకిటతకిటడధిగణతోం - బాలగో

6. ధైధరికిటతాహంధిత్తా - జేజేఝుంతరిధిగిధిగిదిత్తా 6 దిత్తరిదిగిడర్ఝ డుడిగిడిర్ఝడుడిత్తా - తదిమితోదిమితోంగిటదిత్తాతత్తోంతత్తోం. గక్కిటతక్కిట - ధణధణతదిహహిణ్ణం - ధళంగుతకతకదధిగిణ ప్వామినంవిచిత్ర వనమాలినం - పతత్రి రాజగామినం (ధోం పరిపాలితగోధనం - భుజగపతిశాయినం - పదానందదాయినం పమస్తవేదసాధనం - పనాతనం - బాలగోపాలకం - భజామి.

**రేహం రేహం రేరింఖణరింఖణ - కాహంకాహం రేకంజరికంజరి - ఝేకు ఝేకురోఝుణతజ్ఞగగిణ - ఢేకు ఢేకు రేఢింకుకుఢింకుకు- ఝురుంఝురిహరిటకుము రింఖణ - తక్కిటకిటతకదిక్కిటకిటతక - తొంగిట కిటతకనంగిటకిటతకతహతతహతదిమిత - ధణేకుదధిగిణతోం ॥బాల॥**

14వ కీర్తన - రేగుప్తి - ఆటతాళం

ప॥ బాలగోపాల = శ్రీకృష్ణమూర్తీ; మాం ఉద్ధర = నన్ను ఉద్ధరింపుమా; హే పరమ = సర్వోత్కృష్టుడా; కళ్యాణ గుణాకర = కల్యాణ గుణములకు స్థానభూతుడా

అ॥ నీరద నీలకళేబర = మేఘమువలె నీలవర్ణముగల శరీరము గలవాడా! కృష్ణా!; నిరుపమ = అసమానమైన; కౌస్తుభ = కౌస్తుభమణిని ధరించిన; కంధర = కంఠముగలవాడా

1. నందనందన = నందునియొక్క కుమారుడా; భక్తచందన = భక్తులను ఆహ్లాదపఱచువాడా; సుర బృందరచిత బహు వందన = దేవతా సమూహములచేత చేయబడిన బహువందనములుగలవాడ; మందస్మిత సుందరానన = చిరునగవుగల సుందరమైన మోముగలవాడ; కోటి మదనసుందర = కోటిమన్మథులతో సమానమైన సౌందర్యముగలవాడ; జగన్మోహనా = జగత్తును మోహింపజేయువాడ; ఇందిరామందిరా! = లక్ష్మి అమ్మవారికి మందిరముగా వాన స్థానముగలవాడు; భక్తసుందర హృదయారవింద భృంగ = భక్తులయొక్క సుందరమైన హృదయ కమలములకు భ్రమరమువంటివాడ; భక్తిమకరంద నందిత గోపికా బృంద = భక్తిరసమనే మకరందమును అనగా మధువును యిచ్చుటచేత; గోపికాబృంద నందిత = గోపికా సమూహములను సంతోషమును కలిగించువాడ.

2. యజ్ఞాది కర్మఫలప్రద = యజ్ఞము మొదలగు కర్మలయొక్క ఫలమును కర్తలకు యిచ్చువాడ; యదుకులజాత = యదుకులమందు పుట్టినవాడ; సుఖప్రద = సుఖములను యిచ్చువాడ; యజ్ఞసంరక్షణ = యజ్ఞములను రక్షించుటయందు; దీక్షిత = దీక్ష వహించినవాడ; యతిజన ముక్తిద = యతులచేత కోరబడిన ముక్తినియిచ్చుట యందు; సువ్రత = లెస్స అయిన వ్రతముగలవాడ; గణపతి = భక్త గణములకు పతిన్ని అనగా నాయకుడున్నూ; గురువున్నూ అయినటువంటి శ్రియఃపతి; శ్రీపతి = నారాయణమూర్తి; షణ్ముఖ = ఆరు ముఖములు, ఆరు సంపదలు ఆరు గుణములు గలవాడు; చింతితజన = ధ్యానము చేయుచుండు జనులకు; చింతామణిగణ = చింతామణి సమూహమువలె కోరిన కోరిక లిచ్చువాడవు; సంతత = ఎడతెగని; సుఖసంతాన = సుఖపరంపరలను; ప్రద = ఇచ్చువాడ; మందరధర = మందర పర్వతమును ధరించినవాడ; మంజుళమౌక్తిక = మనోహరమైన ముత్యము ధరించినవాడ; నందితజన = జనులను ఆనందింపజేయువాడ; నందాత్మజ = నందుని కొమారుడా; వర బృందావన = శ్రేష్టమైన బృందావనమందుండు; బృందారకగణ = దేవతా సమూహములచేత; వందితపద = నమస్కరింపబడుచుండు పాదములుగలవాడ; వసుదేవాత్మజ = వసుదేవునియొక్క కొమారుడ.

3. అన్నమయాదిషు = అన్నమయకోశము మొదలగునవి పంచకోశములు అనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయ అనునవి; పంచను = అయిదు కోశములందున్నూ; అంతరం = లోపల; ఆనందవిగ్రహం = ఆనంద స్వరూపుడవుగా నుండు; త్వం = మిమ్ములను; ఉన్నతఫలం = సర్వాతిశయమైన ఫలం; తె = ఆ వేదములు (స్వరూపునిగా); ఆమనంతి = తెలియజేయుచున్నవి; జగత్తు = జగత్తుయొక్క; ఉదయ = సృష్టిని; లయ = ప్రళయము; ఆదిషు = మొదలైన వాటియందు; లక్షితం = ఉన్నట్లు గుర్తించబడుచున్నవాడవు; త్వం = మీరు; (తత్ హి ఏవ) తద్ధిఏవ = ఆ స్వరూపుడవుగానే; అసి = ఉన్నావు; తత్ సర్వం = ఆ సమస్తజగత్తున్నూ; త్వమేవ అసి = నీవుగానే వున్నావు; నూనం = నిశ్చయము; ఉత్తుంగ = సర్వాతిశయ మైనటువంటి; ముక్తామణి = ముత్యములచేత మణులచేతను; ప్రస్ఫురతు = మెఱయుచుండునటువంటి; దివ్యమత్తేభవతు = దివ్యమైనటువంటి మదించిన ఏనుగు మాదిరిగా; యోగిచిత్తేస్ఫురంతం = యోగుల చిత్తములందు స్ఫురించుచుండువాడవు (తలంపుకు వచ్చుచుండు వాడవు); నృత్యంత మత్యంతం = విశేషముగా నృత్యము చేయుచుండు; ఆనందం = ఆనంద స్వరూపుడగు మిమ్ము; ఈడె = స్తోత్రము చేయుచున్నాము; హితం = హితపరుడైనటువంటి; త్వాం = మిమ్ములను; అహం = మేము; త్వాం అహం = మిమ్ములను మేము; ఈడె = స్తోత్రము చేయుచున్నాము.

4. సంతతం = ఎల్లప్పుడున్నూ; అంతః = లోపల; అవస్థితం = ఉన్నటువంటివానిగా; హృది = హృదయమునందు; (సత్య విజ్ఞాన సుఖాకృతిం); సత్య = నిర్వికారమైనటువంటిన్నీ; విజ్ఞాన జ్ఞాన స్వరూపమైనటువంటిన్నీ; సుఖాకృతిం = ఆనందస్వరూపమైనటువంటిన్నీ; అంతర్యామితయా = అంతర్యామి రూపముగా; ఉదితం = ప్రకాశించినటువంటి; యోగిచింతితం = యోగులచేత చింతింపబడుచున్నవానినిగా; తం = అట్టిమిమ్ములను; కలయామి = సేవించుచున్నాము; సకల

నిగమాంత = సమస్త ఉపనిషత్తులచేత; జనిత = పుట్టినటువంటి; అంత = నిశ్చయముగలిగిన; మతి = బుద్ధియందు; విదితం = అనుభవింపబడువాడవు (గోచరించువాడవు); తం = అట్టి; పరమయోగిగణచింతితం = శ్రేష్ఠమైన యోగులచేత చింతింపబడువాడున్నూ; అఖండ సుఖ సంపదం = తెంపులేని ఆనందమనే సంపదగలవాడవు; అపార మహిమానం = అంతులేని మహిమ గలవాడవు; అణిమానం = అణు స్వరూపుడవు; ఇహ = ఇక్కడ; రంగత్ = ప్రకాశించుచున్నటువంటి; తురంగ = గుర్రము; మాతంగ = ఏనుగు; వర, హంసగతి = శ్రేష్ఠమైన హంసయొక్క నడకగలవాడవు; మంజీర = అందెలయొక్క; మంజుల = సొంపైన; ఆరట = ధ్వనితోకూడుకున్న; నటం = నాట్యముగలవాడు; అఖిల రంజితం = అందరిని రంజింపచేయువాడు; సంగీత = సంగీతమునందు; సాహిత్య = సాహిత్యమునందు; విద్యా = విద్యయందు; వినోద = ఉల్లాసమునందు, పర = ఆసక్తిగలిగిన; గోవింద గోపాల గోపీమనోహరే = గోపీమనోహరుడైన (నీయందు); మతిరస్తు = నా మతి యుండునుగాక!; రతిరస్తు = ఆనందమువుండు గాక!; మంగళం భవతు మమ = నాకు మంగళమగుగాక!

5. తారక సమ = నక్షత్రములతో సమానమైన; ముక్తాహారకం = ముత్యాలహారములు గలవానిని; భక్త = భక్తులయందు చూపునట్టి; కారుణ్యరసపూరధారకం = కారుణ్యరసము అను తటాకమును ధరించినవాడు; నారదమునిక్షేమ కారకం = నారదమునికి (క్షేమం) మోక్షమును యిచ్చువాడున్నూ; నారాయణతీర్థ = నారాయణ తీర్థులవారికి; తారకం = తరింపజేయునట్టిన్నీ; త్వాం = మిమ్ములను; అహం కలయామి = నేను సేవించుచున్నాను; ధీరం = ధైర్యముగలవానిని గాను; అనామయం = ఏరోగములేని వానినిగాను; సకల కామదం భువి = ఈ భూలోకమందు సమస్తకోరికలు యిచ్చువాడవు; సతతం = ఎల్లప్పుడున్నూ; ఆనంద తాండవ లోలం = ఆనందముగా నృత్యము చేయుటయందు ఆసక్తిగలవాడవు; సద్గుణమణిగణ భూషణజాలం = సద్గుణములనే మణులచేత ధరించబడిన భూషణములుగలవాడవు; సుందర గోకుల బాలగోపాలం = సుందరమైనటువంటి గొల్లవేషమును ధరించిన బాలగోపాలుడవు; సత్య ప్రతిజ్ఞ సంతాన గోపాలం = వ్యర్థముగాని ప్రతిజ్ఞగల గోపాలమూర్తివి; విఖ్యాత సత్కీర్తి విజయ గోపాలం = ప్రసిద్ధమైన గొప్పకీర్తిచేత జయమును పొందినట్టి గోపాలుడవు; మందస్మితానంద మదనగోపాలం = చిరునగవు గలిగినట్టి గోపాలమూర్తివి; కందర్పకోటి కళ్యాణ గోపాలం = కోటి మన్మధులతో సమానమగు కళ్యాణ గుణములుగలవాడవు; భక్తజన బృంద ప్రసన్నగోపాలం = భక్తజన సమూహములకు ప్రత్యక్షమగు చుండునట్టి గోపాలుడవు; సిద్ధజన సిద్ధాంత సిద్ధ గోపాలం = జ్ఞానసిద్ధిగల జనులచేత నిర్ధారణచేయబడినటువంటి స్థిరమైన పరవస్తువుగలవాడవు; మత్స్యావతారాది మహిమగోపాలం = మత్స్యము మొదలగు దశావతారములు ధరించినట్టి ప్రభావము గలిగినట్టి గోపాలమూర్తివి; తం = అటువంటి గోపాలమూర్తివైన; త్వాం = నిను; అహం = మిమ్ములను- కలయ = సేవించుచున్నాను.

6. స్వామినం = జగత్తునకు స్వామి అయినటువంటివాడున్నూ; విచిత్ర వనమాలినం = చిత్రమైనటువంటి వవనమాలిక అనేహారమును ధరించినవాడున్నూ; పతత్రిరాజగామినం = గరుత్మానులవారి మీద తిరుగుచెండెడివారు; వరిపాలితగోధనం = గోధనమును వరిపాలించుచుండెడివాడు; భుజగపతిశాయినం = ఆదిశేషునియందు పవళించువాడున్నూ; సదానందదాయినం = ఎల్లప్పుడున్నూ శాశ్వత ఆనందమును యిచ్చువాడున్నూ; సమస్తవేద సాధనం = సమస్తవేదములే సాధనముగా చూపించువాడున్నూ; సనాతనం = అనాదిగా నుండువాడున్నూ (ఎల్లప్పుడు వుండువాడున్నూ; బాలగోపాలకం = అయినటువంటి గోపాలకృష్ణుని; భజామి = భజించుచున్నాము.

ప. సమస్త కల్యాణగుణములకు నాధారభూతుఁడవగు నోగోపాల బాలుఁడా! నన్నుద్ధరింపుము.

అ. మేఘమువలె నల్ల నగుశరీమం గలవాఁడవును, కౌస్తుభముచేఁ బ్రకాశించువాఁడవు నగు నోకృష్ణా!

1. భక్తుల హృదయములనియెడు కమలమునకుఁ దుమ్మెదమై యందలి భక్తిరస మనియెడు, మకరందము నాని సంతసించు నోనందకుమారా! నీవు లక్ష్మీనారాయణుండవు. భక్తుల రక్షించుటకై దేవతలు నినుఁ బ్రార్థింప మన్మధునిమించు జగన్మోహనాకారముతో నిట్లు జన్మించి, చిఱునగవులతోఁ గూడిన ప్రసన్నముఖముచే గోపికలకు నానందమును గల్గించుచున్నావు.

2. యజ్ఞాదిపుణ్యకర్మములను రక్షించుటయందు దీక్షగల్గివావికి ఫలంబులను నొసంగుచు, సేవించువారల కిహలోకమున సుఖమును బిదపముక్తియు నొసంగుచు రుద్ర, విష్ణు, షణ్ముఖాది నానాదేవరూపములతోఁ బ్రకాశించుచుండు నోయదురత్నమా! పవిత్ర చరిత్రా! నీకు నమస్కారము. (ఇచ్చట విష్ణురూపుఁడగు శ్రీకృష్ణునిఁ గూర్చి "నీవు విష్ణురూపుఁడవు" అని చెప్పఁబడియున్నది. దీనివలన "బ్రహ్మ విష్ణు రుద్రులకంటె నధికుఁడగునపరిచ్ఛిన్న పురుషుఁడే యిచ్చట కృష్ణరూపుఁడుగాఁ జెప్పఁబడెను." అనియు త్రిమూర్తుల లోనివిష్ణువు ఆపురుషునిలోనిభాగమే యగుటచేత "నీవే విష్ణువు" అని చెప్పఁబడెననియుఁ దెలిసికొనవలయును) ఓనందకుమారా! వాసుదేవా! నీవు చింతా మణియునుబోలె కోరినకోర్కులనెల్ల నొసంగుచు సకలసుఖముల నొడఁగూర్చుచు సాధుజనుల రక్షింపుచుందువు. దేవతల చేతఁగూడ వినుతింపఁబడు నో కూర్మావతారా! నీకు నమస్కారము.

3. ఈప్రపంచము పుట్టుట, నశించుట అనువానివలన నూహింపవలయుననియు (ఈసృష్ట్యాదులకు కారణముగా నూహింవవలయుననుట) అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయముననను నైదుకోశములలోను వ్యాపించి ఆనంద స్వరూపుండైయున్నాఁడనియు (స్థూల శరీరము, అన్నమయకోశము, వంచప్రాణములును కర్మేంద్రియములునుగలిసి ప్రాణమయములు సంకల్పరూప మగుమనస్సుతోఁ జేరినప్పుడు మనోమయ కోశము; నిశ్చయరూప మగుబుద్ధితోఁ జేరినప్పుడు విజ్ఞానమయకోశము, సుషుప్త్యవస్థలో ననుభవించు నానందము ఆనందమయకోశమని తెలిసికొనవలయును) ఆపురుషుఁడే మోక్షస్వరూపుఁడనియును, పూర్వు లెవ్వరిని గూర్చి చెప్పుచున్నారో, సత్పురుషులు, జాతిముత్యములవలె మిగుల నిర్మలములై యున్న తమహృదయములందెవ్వని యెల్లపుడును భావించున్నారో అట్టి పరమాత్ముఁడవు నీవే. ఈసర్వ ప్రపంచమును నీవే. పరమానందస్వరూపుఁడ వగునిన్ను ధ్యానించెదను.

4. సర్వజనులకు నంతార్యామిస్వరూపుఁ డైయుండువాఁడవును, సచ్చిదానందస్వరూపుఁడవును, యోగులచే నెల్లప్పుడును ధ్యానింపఁబడుచుండువాఁడవును, సర్వజనులచిత్తములఁ బ్రేరేపించువాఁడవును, అపరితత్త్వమే స్వరూపము గాఁగలవాఁడవును నగు నిను ధ్యానించెదను. సకలజగత్తులకును సృష్టిస్థితిసంహార కర్తవనియు, పరమానందస్వరూపుఁడవనియు, అద్భుత మగుప్రబావముగలవాఁడవనియు, సుప్రసిద్ధుఁడ వయ్యును మిక్కిలి సూక్ష్మరూపుఁడవగుటచే నీస్వరూపము నెఱుంగుటకు వేదాంతవాక్యములు తప్ప నితరసహాయములు లేవనియును జనులు చెప్పుచుందురు. ఇట్టివాఁడవయ్యును ఈమనుష్యలోకమున నందఱ నానందింపఁజేయుచు, గజ్జెలు గలుగలుమనుచుండ నేనుఁగువలెను, గుఱ్ఱమువలెను మఱియున నేకవిధములుగా నడుచుచు నృత్యముఁజేయుచున్నావు. ఓగోవనాయకా! గోపాలా! సంగీతసాహిత్యాదివినోదములయం దిచ్చగల యోనారాయణా! నా(మా) చిత్తమెల్లప్పుడును నీయందే (నిన్ను ధ్యానించుటయందే) ప్రీతిగలదై యేకాగ్రత నొందుఁ గాత. నాకును (మాకును) సర్వశుభములు గలుగుఁగాత.

5. నక్షత్రహారమువలెనుండు ముక్తాహారముధరించి, రత్న ఖచితములగు బహువిధభూషణములచేఁ బ్రకాశించుచు నారదుఁడు నారాయణతీర్థుఁడు మొదలగు భక్తులయెడఁ గరుణఁ జూపి వారినుద్ధరించు మనోహరములగునృత్యములతోడను, వెన్నెనుదొంగలించుట మొదలగు లీలలచేతి గోపికలయొక్కయు ముఖ్యముగారాధయొక్క యుమనస్సును హరింపఁజాలురూపవైభవముతోడను, గోపాలబాలకుండవై చరించుచుండు నినుధ్యానించెదను (ము) మత్స్యము, కూర్మము మొదలగున నేకరూపములుధరించి, భక్తుల నుద్ధరించిన మందరధరా యోగులందఱును నిన్నేపరమపురుషునిగా సిద్ధాంతముఁ జేసి నీ సంకల్పమున కెందును భంగములేదని, శేషుఁడే పాన్పుగాఁ గలవాఁడవును, విచిత్రమగు తులసీమాలలచే నలంకరింపఁబడియుండువాఁడవును, పరమానందము నొసంగు వాఁడవును, వేదము లన్నియును ప్రవర్తించుటకు నాధారమైనవాఁడవును అగు గోపాలకృష్ణా! నిన్ను సేవించెదను (ము).

శ్లో॥ స్తుత్వా తం యజ్ఞపురుషం యజ్ఞ పత్న్యస్తదాజ్ఞయా,
పునః ప్రవివిశు ర్యజ్ఞశాలాం తద్గతమానసాః

26. శ్లో॥ తంయజ్ఞపురుషం = ఆ యజ్ఞపురుషుని (శ్రీకృష్ణుని); యజ్ఞపత్న్యః స్తుత్వా = విప్రభార్యలు స్తోత్రముచేసినవారై; తత్, ఆజ్ఞయా = ఆయనవల్ల ఆజ్ఞను పొందినవారై; తద్గత మానసాః = స్వామియందు మనస్సుచేర్చినవారలై; యజ్ఞశాలాం = యజ్ఞశాలను గూర్చి; పునః ప్రవివిశుః = తిరిగి ప్రవేశించిరి.

అట్లా బ్రాహ్మణస్త్రీలు యజ్ఞరూపుఁ డగునాభగవంతుని నుతియించి యాయనయందుఁ జెందియున్న చిత్తంబుల మరల్పలేకయున్నను, లోకగురువగు నమ్మహాత్మునియాజ్ఞచే మరల నెట్లెట్లో యజ్ఞశాలఁ బ్రవేశించిరి.

శ్లో. యాజ్ఞికా స్తే పి తాః పత్నీః ప్రశస్య చ పునఃపునః,
అంగీచక్రు ర్భగవతో మాహాత్మ్యా ద్గతకల్మషాః
ఇతి శ్రీనారాయణతీర్థవిచరితాయాం శ్రీకృష్ణలీలాతరంగిణ్యాం
శ్రీకృష్ణగోవత్సపాలనవర్ణనంనామ తృతీయతరఙ్గః.

27 శ్లో॥ తే = ఆ, యాజ్ఞికాః = సోమయాజులైన బ్రాహ్మణులు, అపి = కూడా, తాః = ఆ; పత్నీః = భార్యలను, పునఃపునః = మాటిమాటికి, ప్రశస్య = మెచ్చుకొనుచూ; భగవంతః = భగవంతునియొక్క; మహాత్మ్యాత్ = భగవన్మహిమవలన, గతకల్మషః = కల్మషరహితులై; అంగీచక్రుః = అంగీకరించిరి.

అప్పటియాజ్ఞికులును తమభార్యలను మిగులఁ బ్రశంసించుచు నాదరించిరి. భగవంతు నియనుగ్రహము సంపాదించి దానివలన సమస్తపాపములను నశింపఁ జేజరిల్లువారలఁ దిరస్కరించువారలుఁ గలరే

# చతుర్థతఙ్గము

శ్లో గీయతే రామకృష్ణాభ్యాం కృతం గోపాలనం తతః,
నందాద్యాగమనం పూర్వం తతశ్చ బలకృష్ణ యోః
కాళీయమర్దనం నాగపత్నీస్తోత్రం తతః పరమ్,
ఖరాసురవధ శ్చాధ ప్రలంబస్య చ మర్దనమ్,
దావాగ్ని భక్షణం బాలస్తుతి రత్ర నిగద్యతే.

శ్లో॥ తతః రామకృష్ణాభ్యాం = అనంతరమందు బలరామకృష్ణులచేత; గోపాలనంకృతం = గోవులను మేపేపని చేయబడెను; పూర్వం = మొట్టమొదట; నందాది ఆగమనం = నందుడు మొదలగువారు రావడమున్నూ, తతఃబాలకృష్ణయోః = అనంతరం బలరామకృష్ణులరాకయున్నూ; గీయతే = చెప్పబడుచున్నది; కాళీయమర్ధనం = కాళీయమర్ధనమున్నూ; నాగపత్నీస్తోత్రం = కాళింగుని భార్యలయొక్క స్తోత్రమున్నూ; తతఃపరం = దాని అనంతరం; ఖరాసురవధ = ఖరానురుని వధించడమున్నూ; అధ ప్రలంబస్య చమర్దనం = అనంతరమందు ప్రలంబానురుని హరించుటయున్నూ; దావాగ్ని భక్షణం = కార్చిచ్చుమిగుంటయున్నూ; బాలస్తుతిః = పిల్లకాయలు స్తోత్రము చేయుటయున్నూ, అత్ర నిగద్యతే = ఈ తరఙ్గము నందు చెప్పబడుచున్నది

గోపాలన వర్ణ మనునీనాల్గవతరంగమున శ్రీకృష్ణబలరాములు గోవులపాలించిన క్రమము వర్ణింపఁబడును. ఇందు నందాదులు వచ్చుటయు, రామకృష్ణులు గోవులఁ బాలించుటయు, శ్రీకృష్ణుడు కాళియుని మర్దించుటయు, నా నాగేంద్రుని భార్య లమ్మహాత్ము నుతించుటయు, ఖరప్రలంబాసుర వధయు, దావాగ్నిని భక్షించుటయు, నపుడు బాలకులు నుతించుటయు నను విషయములు క్రమమున వర్ణింపఁబడును.

గమనిక : 1 మొదలు 4 వఱకు అర్థం తెలిసినందున వ్రాయలేదు.

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

అథ నందస్యాగమనమ్

గోపైరనుగతో నిత్యం గోబృందాని విచారయన్
గోపాలకస్వామీ నంద గోపో మహా న్విరాజతే

గోకులమునకు ప్రభువగునందుఁడు తనయనుచరులతోఁ గూడి గోవులఁ బాలింపుచుండెను

అథ బలభద్రస్యాగమనమ్ -

సౌరాష్ట్రరాగము - ఆదితాళము

హలీ బలీ చ ముసలీ లలితాంగదకుండలీ
నీలాంబరీ శ్వేతరూపీ బలభద్రో విరాజతే.

తెల్లనివర్ణముగలిగి నల్లనివస్త్రమును ధరించుచు బహువిధములగు భూషణములచే నలంకరించుకొని, నాఁగలి నొకదానిని రోఁకలి నొకదానిని యాయుధములుఁగా గైకొని బలరాముఁడును అయనను వెంబడించుచుండెను.

అథ శ్రీకృష్ణాగమనమ్

నాదనామక్రియారాగము - ఆదితాళము

శంఖీ చక్రీ గదీ పద్మీ శార్ఙ్గీ కిరీటకుండలీ
శ్రీవత్సకౌస్తుభీ దివ్య పీతాంబరో విరాజతే.

శ్రీకృష్ణుడుకూడ శంఖము, చక్రము, ధనుస్సు మొదలగునాయుధముల ధరించి కిరీటమును, కుండలములును, కౌస్తుభరత్నంబును వీనిచే నలంకృతుఁడై శ్రీవత్స మనుపుట్టుమచ్చ వక్షస్థలమున రాజిలుచుండ మనోహరాకారుఁడై పీతాంబరధారియై తనతండ్రిని వెంబడించెను.

నాదనామక్రియారాగము - చాపు తాళము

| | | | | |
|---|---|---|---|---|
| ప. | పాహి పాహి జగన్మోహన | కృష్ణ | పరమానంద | శ్రీకృష్ణ |
| 1. | దేవకీవసు దేవనందన | కృష్ణ | దివ్యసుందర | శ్రీకృష్ణ |
| 2. | నందయశోదానందన | కృష్ణ | ఇందువదన | శ్రీకృష్ణ |

| | | | | |
|---|---|---|---|---|
| 3. | కుందరదనకుటిలాలఅక | కృష్ణ | మందస్మిత | శ్రీకృష్ణ |
| 4. | కింకిణిరచితఘుణంఘుణ | కృష్ణ | క్రీడాలోల | శ్రీకృష్ణ |
| 5. | కుంకుమపంకవిపంకిల | కృష్ణ | గూఢమహిమ | శ్రీకృష్ణ |
| 6. | చంచలఝుళఝుళనూపుర | కృష్ణ | మంజుళవేష | శ్రీకృష్ణ |
| 7. | తరళితకుండలమండిత | కృష్ణ | తాండవలోల | శ్రీకృష్ణ |
| 8. | ధిక్కృతసురరిపుమండల | కృష్ణ | దీనపాలక | శ్రీకృష్ణ |
| 9. | సాధు సాధు నటవేష | కృష్ణ | సత్యసంధ | శ్రీకృష్ణ |
| 10. | పాలితనారాయణతీర్థ | కృష్ణ | పరమపావన | శ్రీకృష్ణ |

ప. జగన్మోహనాకారా! పరమానందస్వరూపా! కృష్ణా! నన్ను రక్షింపుము.

1. దేవకీవసుదేవులకుఁ బుత్రుండవును, మనోహరాకారుండవు నగు నోకృష్ణా! ననుఁ గావుము.

2. చంద్రునిఁబోలుముద్దుమొగముతో నందయశోదములకు నానందము గల్గించుకృష్ణా! ననుఁగావుము.

3. చిఱునగవుతోను, మల్లె మొగ్గలవంటి పలువరుసలతోను, వక్రములగు ముంగురులతోను, రాజిల్లునోకృష్ణా! ననుఁగావుము.

4. చిరుగంటలు గలు గలు మనుచుండ నెప్పుడును గ్రీడించుచుండు నోబాలకృష్ణా! ననుఁగావుము.

5. కుంకుమపువ్వుతోఁ గలసిన గంధమునుఁ బూసికొని నీసామర్థ్యము నేమియు బయల్పడనీయక విహరించు నోకృష్ణా! ననుఁగావము.

6. మనోహరమగు వేషముతో నందెలు గలు గలు మన సంచరించు చుండునోకృష్ణా! ననుఁగావుము.

7. కుండలము లల్లలనాడ నృత్యము సేయుచుండు నోకృష్ణా! ననుఁ గావుము.

8. రాక్షసజనులను దుష్టులను మర్దించి దీనులగువారిం బరిపాలించు వ్రతముగల యోకృష్ణా! ననుఁగావము.

9. నీవ్రతమునకు భంగము గలిగించునది యేదియును లేదు. నీ నృత్యము నామనస్సును నీవంకకుఁ ద్రిప్పినది. ఓకృష్ణా! ననుఁగావుము.

10. ఓపరమపావనా! నీవు నారాయణతీర్థునిఁ గాచియున్నావు. అట్లే నన్నుఁగూడ రక్షింపుము.

## బలరామకృష్ణులు గోవులను పాలించుట

గ. అథ కదాచిదేతౌ నందకుమారౌ నిర్మలనిరుపమ రజతాంజన శిఖరి శిఖరన ముత్తుంగదివ్యమంగళనందరాంగౌ - దుర్వినయదుర్వార్య గర్వపర్వత విషయవిపినసంచారిమహాసురమత్తమా తంగమహోదార కేసరిణౌ - సంతతసముల్లసిత

కమలకు శేశయ కుముదకల్హారాది కుసుమ సౌరభ్యసౌభాగ్యభోగసమున్మిష దానందానుభవదివ్యదర్శనైః హంసకారండపసారసచక్రవాకాదివివిధ విహంగమై రనుదిన ముదితమహోత్సాహసాహస సమృద్ధసముచ్ఛృంఖలకలర వావబోధిత నిజానందావ ధీరిత బ్రహ్మలోకాదిసుఖై ర్నిజతటసమాగతసురవిటపిబృందైశ్చ సంతతపరిశోభమానాయాః కాళింద్యాస్తటభువి పర్యటంతౌ - కరతలకలిత వేణువిషాణవేత్రౌ - నిరవధికకృపావలోకన హాసపరిహాసవిలాసై ర్నిజపరిజనా - నానందయంతౌ - సకలలోక పాలకా విహ గోపాలౌ బభూవతుః. తేచ గోపబాలాః తదీయవిలాసాపన్న సుధారస మాకంఠ మాపీ యాత్యంతతృప్త తయా సముద్గిరంత ఇవ భగవదనుగ్రహ ప్రతిబోధితసకల కలాస్తదీయకల్యాణగుణగణా నిత్థం గాయంతో వనభువి సుఖం చేరుః.

గద్య:-బలరామ కృష్ణులు గోవులను పాలించుట .

అథ కదాచిత్ = అనంతరము ఒకానొకప్పుడు; ఏతౌ నందకుమారౌ = ఈబలరామకృష్ణులు యిద్దరున్నూ; నిర్మల నిరుపమరజితాంజన = మాలిన్యములేని, అనమానమైన వెండికొండవలెను అంజనాద్రివలెను; (శిఖరి............సుందరాంగౌ); శిఖరి = పర్వతము అనగా రజిత అంజన ఈ రెండు పర్వతములయొక్క; శిఖర ముత్తుంగ = శిఖరమువలె ఎత్తు అయినటువంటి; దివ్యమంగళ = దివ్యమంగళమైన; సుందరాంగౌ = సుందరమైన అవయములు గలవారలై (దేహములుగలవారలై); (దుర్వినయ........ కేసరిణౌ); దుర్వినయ = దుర్మార్గమున్నూ; దుర్వీర్య గర్వ = దుష్టపరాక్రమమైనట్టి, గర్వము అనునట్టి; పర్వత విషయ = పర్వతముల సంబంధ మైనటువంటి; విపిన = అడవులయందు; సంచారి = సంచరించుచుండు; మహా అసుర = గొప్ప రాక్షసులనెడు; మత్తమాతంగ = మదించిన ఏనుగులయొక్క; మహోద్దర = గొప్ప ఔదార్యముగలిగిన; కేసరిణౌ = సింహములైనటువంటి బలరామకృష్ణులు; సంతత...దర్శనైః; సంతత సముల్లసిత = ఎల్లప్పుడునూ వికసించిన; కమల కుశేశయ = కమలమున్నూ, కుశశయపుష్పములున్నూ; కుముద కల్హారాది = కలువలున్నూ, ఎఱ్ఱతామరలున్నూ; సౌరభ్య సౌభాగ్య = పరిమళము, అతిశయమును; భోగ, సమున్మిషత్ = అనుభవించుటవలన, వెల్లడియైన ఆనందమును; ఆనందానుభవ = ఆనందానుభవముచేత; దివ్య దర్శనైః = దివ్యరూపములు గలిగిన

(హంస........................విహంగమై)

హంస కారండవ = హంసలున్నూ, నీటికోళ్ళున్నూ; చక్రవాక ఆది = చక్రవాకపక్షులున్నూ, మొదలైన; వివిధ విహంగమైః = అనేకవిధములైన పక్షులుచేత; అనుదినం ఉదిత = ప్రతిదినమున్నూ కలుగుచున్న; మహోత్సాహ = గొప్పఉత్సాహమున్నూ; సాహస, సమృద్ధ = సాహసముయొక్క, అతిశయముచేత; సముచ్ఛృంఖల = హద్దుమీరిన; కలరవ, అవబోధిత = మదధ్వనులచేత, తెలుపబడుచున్న, నిజానంద = స్వకీయ ఆనందముచేత; అవధీరితబ్రహ్మలోకాదిసుఖైః = తక్కువగా చేయబడిన బ్రహ్మలోకము మొదలైన సుఖములు గలిగిన పక్షులచేత; నిజ తట = తమయొక్క (అనగా నదులుయొక్క) తీరమునకు; సమాగత

= వచ్చియున్న, సుర విటపిబృందైశ్చ = దేవతా వృక్ష సమూహములచేత, సంతత = ఎల్లప్పుడున్నూ; పరిశోభమానాయాః = బాగా ప్రకాశించుచున్న; కాళింద్యాః = యమునా నదియొక్క; తటభువి = తీరభూములయందు; పర్యటంతౌ = సంచరించుచున్నవారై, కరతల, కలిత = అరచేతులతో ఒప్పుచున్న, వేణు, విషాణ, వేత్రౌ = పిల్లనగ్రోవియున్నూ, కొమ్ముయున్నూ బెత్తములు గలవారలై, నిరవధిక కృపావలోకన = సర్వాతిశయమైన కటాక్షవీక్షణములు, హాసపరిహాస విలాసైః = నవ్వున్నూ, ఎగతాళి విలాసములచేత; నిజపరిజనాన్ = తమపరిజనములను, ఆనందయంతౌ = ఆనందింపజేయుచున్నవారలై, సకలలోక పాలకా = సమస్తలోకములనుపాలించుచున్నవారలై, ఇహ గోపాలౌ బభూవతుః = ఇక్కడ యీలోకమునందు గోవులను పరిపాలించువారుగా అయిరి, తే చ గోపబాలాః = ఆ గోపబాలకులు; తదీయ విలాస = వారిద్దరియొక్క విలాసముచేత, ఆపన్న సుధారసం = మిళితమైన అమృతరసమును; ఆకంఠం ఆపీయాత్ = కంఠమువఱకు త్రాగి త్రాగి; అత్యంత తృప్తతయా = తృప్తివిశేషము అగుటచేత; సముద్గిరంత ఇవ = వెళ్ళగక్కుచున్నారా అనునట్టువలె; భగవదనుగ్రహ = స్వామివారి అనుగ్రహముచేత, ప్రబోధిత = బోధింపబడిన; సకలకళా = సమస్త విద్యలుకలవారై, తదీయ కళ్యాణ గుణగణాన్ = స్వామివారియొక్క కళ్యాణగుణ పరంపరలను; ఇత్థం = ఈక్రింద చెప్పబోవు ప్రకారము; గాయంతః = గానము చేయుచున్నవారలై; వనభువి = వనప్రదేశమునందు; సుఖంచేరుః = సుఖముగా సంచరించుచుండిరి.

ఆవనముచెంతనే యమునానది ప్రవహించుచుండెను. అనదియందు తెల్లదామరలు, యెఱ్ఱదామరలు, కలువలు మొదలగు జలపుష్పము లెవ్వడును వికసించియేయుండును. ఆకుసుమగంధముల నాఘ్రాణించుచు నచ్చటితామర తూఁడులు మొదలగువానిని భక్షించుచు, చక్రవాకములు, హంసలు మొదలగు జలపక్షులు తమయత్యానందమును తమయుత్సాహమును బ్రకటించునవియుంబోలె చెవులపండువుగ కలకములు సేయుచుండును. బ్రహ్మలోకమునకంటె నిచ్చట సౌఖ్యము అధికమనుట లోకోత్తరమగువాని (జలపక్షుల) శరీరకాంతి చేతనే ప్రకటింపఁబడుచుండెను. ఇట్టి ప్రభావము నెఱింగి కల్పవృక్షము మొదలగు దేవతావృక్షములు కూడ నానదీతీరము నాశ్రయించియుండెను. కాఠిన్యము, బలమునన్యాయముగ నుపయోగించుట, గర్వము ననుమూఁడూ పర్వతములు గల్గిన విషయారణ్యమునందు (శబ్దము, స్పర్శాదులను విషయములే అరణ్యము) సంచరించురాక్షసు లనుమదపుటేనుఁగులకు శింగంబులై (రాక్షసులను సంహరించిన, వారల యజ్ఞానము తొలంగిపోవుననిభావము) వెండికొండయునంజనశైలంబునువలె మనోహరంబు లగు శ్వేతనీలవర్ణంబులతో నొప్పునారామకృష్ణులు గోవులను మేపునప్పుడు తమచెలికాండ్రతోఁ గూడి వారిని పరిహాసవాక్యములచే నవ్వించుచు, వేణుగానము సేయుచు నా యమునానదీతీరమునందే విహరింపుచుందురు. గోపబాలకులును నారామకృష్ణులలీల లనియెడునమృతమును ద్రావి దృప్తులై భగవంతుని కరుణాకటాక్షమున నప్రయత్నముగ నే సర్వవిద్యలయందును బ్రవీణులై యద్దేవునిగుణముల నిట్లని వినుతింతురు.

ప. కలయత వనభువి కామగతిం - కలభగమన మఖిలాత్మరతిం

1. రజతశైలశిఖరోపమకాయం - రమణీయమిహరామనామ ధేయం
సకలజలదరుచిరం గతమాయం - సకలపల్లవీజనభాగ ధేయం

2. లలితతరమురళీనాదవినోదం - లావణ్యరసపూరసరిదాప్పదం
అళికులమిళితతులసీబృందమోదం - ఆనందనటనసుందరపాదం

3 దివ్యత్రిభంగిలలితతరగాత్రం - దేవాదివిరచితనుతిపాత్రం
భవ్యకరకమలకమనీయవేత్రం - భాస్కరకోటిప్రభంజనసూత్రం

4. సకృదవలోకనకృతజగదండం - సరసకుండలశోభిమ్నుయుగండం
ప్రకటిత బ్రహ్మాణ్డశతకోటితుణ్డం - ప్రాకృతాసురతిమిరమార్తాణ్డం

5. రవితనయాతటసుఘటితఖేలం - రక్షితసకలగోకులబాలం
నవరసపరిపూర్ణగానవిలోలం - నారాయణతీర్థగీతసులీలం.

5వ కీర్తన మధ్యమావతిరాగం ఆటతాళం

పః వనభువి = వనప్రదేశమునందు; కామగతిం = కోరినట్లు నడకనడిచేవారున్నూ, కలభగమనం = ఏనుగుగున్న నడకవంటి నడకగలవారున్నూ; అఖిలాత్మరతిం - సమస్త జీవులకు ఆనందముయిచ్చేవారున్నూ అగు బలరామకృష్ణులను, కలయత - సేవించండి

1 రజితశైల శిఖర = వెండికొండ శిఖరముతో సమానమైన; కాయం = శరీరముగలవారు; రమణీయం = ఆనందమును యిచ్చువారున్నూ; రామనామధేయం = బలరాముడనే పేరుగలవారున్నూ; సకల (సజల) = జలముతో కూడినటువంటి; జలదరుచిరం = మేఘముతో సమానమైనటువంటి; గతమాయం = మాయా సంబంధమైన విషయాదులు వికారములు లేనట్టివి, సకలపల్లవీజన = సమస్తమైన గోప గోపికలకు; భాగ ధేయం - పూర్వపుణ్యఫలం అయినటువంటి బలరామకృష్ణులను, ఇహ ఆకలయ = ఇక్కడ సేవించండి.

2. లలితతర = విశేషముగా చెప్పుచున్నటువంటి; మురళీనాదం = వేణుగానముచే; వినోదం = ఆనందించువారున్నూ; లావణ్యరసపూర = సౌందర్యమనే నీళ్ళచేత నిండింపబడిన, సరిదాస్పదం = నదివంటివారున్నూ; అళికులమిళిత = తుమ్మెదల సమూహముతో చేరియుండే; తులసీబృందమోదం = తులసీవనమాలయొక్క పరిమళముగలవారున్నూ; అనంతనటన = సంతోషముగా నాట్యము చేయుచున్నటువంటి; సుందర పాదం = సౌందర్యపాదపద్మములు గలవారున్నూ అగు బలరామకృష్ణుని; అకలయ = సేవించుమూ

3 దివ్య = దివ్యమైన, త్రిభంగి = మూడు మడతలచేత (మూడువంపులుగా) లలితతర = ఒప్పుచున్నటువంటి, గాత్రం = ఉదరముగలవారు, దేవాదివిరచిత = దేవతలు మొదలగువారి చేత చేయబడిన, నుతిపాత్రం = స్తోత్రమునకు తగినవారున్నూ, భవ్య = ఒప్పొచున్నటువంటి, కరకమల = కమలమువంటి హస్తమునందు, కమనీయవేత్రం = మనోహరమైన బెత్తముగలవారున్నూ; భాస్కరకోటి ప్రభం = కోటిసూర్యకాంతిగలవారున్నూ, జనమిత్రం = జనులకు స్నేహముగలవారున్నూ అగు బలరామకృష్ణులను కలయత

4 సకృదవలోకన = ఒకసారి వీక్షించుటచేతనే, కృత జగదండం = చేయబడిన ప్రపంచముగలవారు, సరసకుండలశోభ = చక్కని కుండలములచేత ప్రకాశించుచున్న, మృదు గండం = మృదువైన చెక్కిళ్ళుగలవాడున్నూ, తుండం = ముఖమునందు, బ్రహ్మాండశతకోటి = నూరుకోట్ల బ్రహ్మాండములను, ప్రకటిత = చూపించినవారున్నూ; ప్రాకృత = సామాన్యులైన, అసుర = రాక్షసులనెడి, తిమిర = చీకట్లకు, మార్తాండం = సూర్యుడంటివాడున్నూ

5. రవితనయా = సూర్యపుత్రికయగు యమునా నదియొక్క, తట = తీరమునందు, సుఘటితఖేలం = లెస్సగా ప్రవర్తించబడిన విహారముగలవాడును, సకల గోకులబాలం = సమస్త గోపాలకులను, రక్షిత = రక్షించినటువంటివారున్నూ, నవరసపరిపూర్ణ = నవరసములతో నిండినటువంటి; గానవిలోలం = గానమునందు ఆసక్తిగలవారున్నూ, నారాయణతీర్థ = నారాయణతీర్థులవారిచేత; గీత సులీలం = గానము చేయబడిన దివ్యలీలలు గలవారున్నూ అగు బలరామకృష్ణుల; ఆకలయ = సేవింపుమా

ప. జీవులకందఱకును విశ్రాంతిస్థానమైనట్టియుఁ మందగమనముతో నీయరణ్యము స్వేచ్ఛగ సంచరించుచున్నట్టియు, నాశ్రీకృష్ణునిఁ జూడుఁడు.

1. వెండికొండవలె శుభ్రమగు శరీరముతో బలభద్రుండును, జలముతోఁ గూడిన మేఘమువలె మనోహరమగు నీలవర్ణముతోనొప్పు శ్రీకృష్ణుఁడును మాయావిరహితులైనను మనభాగ్యమువలన నిట్లు జన్మించియున్నారు

2. అధికమగులావణ్యముగల దివ్యశరీరమునకు (లకు) మిగులనుగంధ వంతమగుతులసీమాల భూషణముగా, మనోహరమగు నృత్యముతోఁ గూడ రమ్యమగు వేణుగానము నొనర్చుచున్నాఁడు (రు)

3. వళిత్రయముచే (పొట్టమీఁదనుండు ముడతలకు వళి అని పేరు) ప్రకాశించుదివ్య దేహముతో లెక్కకు మిక్కిలి యగుసూర్యులకంటెను అగ్నులకంటెను అధికమగు దివ్య తేజములతో నొప్పారు నీమహానుభావుఁడు (లు) చేతనొకబెత్తమునుబూని గోవులఁ బాలించుచుండుటంజూచి దేవతలందఱును వినుతించుచున్నారు.

4 అవివేకులును, క్రూరులును నగు రాక్షసులును మర్దించుచు, జగముంగాచు నీమహాత్ముఁడు, తనదృష్టిమాత్రముచేతనే యీజగముల సృష్టించిన వాఁడయ్యును, మనుష్య బాలుండై కుండలాదులచే నలంకరింపఁబడి విహరింపుచున్నాఁడు. బాల్యవయసునందు తననోటియందే సమస్తప్రపంచమును జూపి యీవిషయమును స్వయముగ నే ప్రకటించియున్నాఁడు గదా

5. శృంగారము మొదలగు తొమ్మిదిరసములతోను నిండు మనోహరములైన గానములఁ బాడుచు నారాయణతీర్థునిచే వినుతింపఁబడుచు మనలనాపదలనుండి యుద్ధరింపుచు నీయమునాతీరమున విహరింపుచున్నాఁడు

శ్లో॥ గోవిందానుచరా స్సర్వే గోవిందాసక్తచేతసః,
గోవింద మనుగాయంతో సానందం ననృతు ర్వనే

4. శ్లో॥ సర్వే = గోపాలకులను అందరున్నూ, గోవిందానుచరః - గోవిందునియందే ఆసక్తిగలిగిన మనస్సుగలవారలై; గోవిందం అనుగాయతః - గోవిందుని అనుసరించి గానము చేయుచున్నవారలై, వనే = వనమునందు; సానందం = ఆనందముతో కూడుకున్నవారలై; ననృతుః - నృత్యము చేసిరి.

ఇట్లు శ్రీకృష్ణున కనుచరులగు గోపకులందఱును ఆమహాత్మునియందే మిగుల భక్తిగలవారగుటచే నాథుని వినుతించుచు నాయనచేయుగానమును తాము నాచరించుచు నానందాతిశయమువలన నృత్యములను గూడ సలుపు చుండిరి.

## కాళీయమర్దనము

శ్లో. వినాతు బలభద్రేణ కృష్ణో గోపాలకై స్సహ,
కాళీయస్య హ్రదం గత్వా న్యపతత్ తజ్జలే బలాత్

5. శ్లో॥ వినాతు బలభద్రేణ = బలభద్రుని విడిచి; కృష్ణోగోపాలకైః సహ - కృష్ణుడు గోపాలకులతో కూడా కలిసి; కాళియస్య = కాళింగుడు వుండునటువంటి; హ్రదం - మడుగువద్దకు; గత్వా = వెళ్ళినవారై; తజ్జలే = ఆ జలమునందు, బలాత్ బలాత్కారముగా; న్యపతత్ దుమికెను

ఒకనాఁ డాకృష్ణుఁడు తానొక్కఁడే గోపాలకులతోఁ గూడ యమునానదియొద్దకుఁ బోయెను. అచ్చట కాళీయుఁడనుసర్పమునకు నివాసమగు నొక్కమడుఁగు గలదు. దానింజూచి యందున్నసర్పమును వధింపఁదలఁచి యాభగవంతుఁడు ఒకవృక్షముపై నుండి యతివేగముగ దానిలోనికి దుమికెను.

శ్లో. కాళీయస్తద్ధ్వనిం శ్రుత్వా క్రోధసంరక్తలోచనః,
బబంధ కృష్ణం భోగేన దదృశుస్తం వ్రజౌకసః

6. శ్లో॥ కాళియః = కాళింగుడనుపాము; తధ్వనిం = ఆమహాధ్వనిని; శృత్వా = విన్నటువంటివాడై; క్రోధ సంరక్తలోచనః = కోపముతో వుండబడిన ఎఱ్ఱని కండ్లుగలవాడై; కృష్ణం = శ్రీకృష్ణస్వామిని, భోగేన = తన శరీరముతో; బబంధ = బంధించెను; తం = ఆకృష్ణస్వామివారిని; వ్రజౌకసః = గోకులమందున్న జనులందరున్నూ; దద్రుశుః = వానిని చూచిరి.

అకాళీయుఁడును ఆమహాధ్వనిని విని మిగులఁ గోపించి తనశరీరముతో నాకృష్ణుని బంధించెను. ప్రక్కనున్న గోపబాలకులందరు దానిఁజూచిరి.

శ్లో. పశ్యత్సునందాదిషుగోపికాసుశ్రీకృష్ణ మేవాఖిలమిత్రభూతం
తుష్టావరామస్సకలాత్మదర్శీ సర్వాత్మకంకృష్ణమనన్యదృష్ట్యా

7. శ్లో॥ అఖిల మిత్రభూతం శ్రీకృష్ణం = సమస్తభూతములకు మిత్రుడైన శ్రీకృష్ణస్వామినే, నందాదిషు = నందుడు మొదలగువారున్నూ; గోపికాసు = గోపికలున్నూ; పశ్యత్సు = చూస్తూవుండగా; సకల ఆత్మదర్శిరామః = సమస్త జీవులను చూస్తూ వుండునట్టి బలరాముడు; సర్వాత్మకం = సర్వ ఆత్మకుడైనటువంటి, కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; అనన్యదృష్ట్యా = అన్యమందు దృష్టిలేనివాడై; రామః తుష్టావ = బలరాముడు స్తోత్రము చేసెను.

మఱియు సమీపముననందే యున్న వారలగుటచే నందుఁడు మొదలగు గోపకులును, గోపికలునుగూడ వానింజూచి యేమియుంజేయనేరక నివ్వెర గందియుండిరి. అప్పుడు సర్వజ్ఞుఁడైనబలరాముఁడు నిశ్చలచిత్తముతో సర్వవ్యాపియగు నాకృష్ణుని వినుతించెను.

కర్ణాటసారంగరాగము - ఆటతాళము

ప. బంధనా న్మోచయ - కాళీయకృత - బంధనా న్మోచయ

అ. బంధనా న్మోచ యాత్మాన మనుపమ
బలమనుస్మర తావక మధునా

1. కారణం జగతా మఘౌఘవి - దారణంహి భవా
దురితా శేషశోకమహీభార
వారణాయ కృతమానుషవేష శ్రీకృష్ణ

2. బాలచాపలతయా తవానఘ - లీలయాల మిహ
కాళియవిష మాశు వినాశయ
కలయ గోకులకల్యాణ మధ భో

3. నందగోపమహిషీ త వేయ మ నిందినీ జననీ
నంద మేన మానందయ తా మపి
నందనందన సుందర శ్రీకృష్ణ
కృష్ణతత్త్వవిదాగీత మితి - వృష్ణిజనముదే
విష్ణుభక్త శివనారాయణతీర్థ
విరచితం విపులానంద ముదితం

ప॥ కాళియకృత = కాళింగునివల్ల చేయబడిన; బంధనాస్ = బంధములవల్లనుండి, మోచయ = విడిపించుకొనుమా

అ॥ అధునా = ఇప్పుడు; తావకం = నీదైన, అనుపమబలం = అసమానపరాక్రమమును, అనుస్మర = జ్ఞాపకము తెచ్చుకొనుమా, ఆత్మానం = నిన్ను, నీవు; బంధనాత్ = కాళింగునిబంధములోనుండి; మోచయ = విడిపించుకొనుమా

1. భవాన్ = మీరు; జగతాం = జగత్తులనన్నింటికి; కారణం = కారణ స్వరూపులుగదా!; అఘౌఘ విదారణం హి = పాప సమూహములనుకొట్టి వేసేవాడవుగదా; దూరితా అశేషశోక = దూరముగా పరిహరింపబడిన సమస్తమైన దుఃఖములుగలవాడా; అనగా శోకమోహములు లేనివాడా, మహీభార వారణాయ = భూభారమును తొలగించుటకుగాను; కృత మానుషవేష = ధరించబడిన మనుష్యరూపముగలవాడ

2. అనఘా = పాపరహితుడా; తవ బాల చాపలతయా = మీయొక్క బాల్య సంబంధమైన చపలస్వభావము కలిగియుండుటయనెడి; లీలయా = వినోదములను; అలం = చాలించుము (చాలును); కాళీయ = కాళియునియొక్క; విషం = విషమును, ఆశు, వినాశయ = శీఘ్రముగా నశింపచేయుమా; అథ, భో = మరియు హేస్వామీ!; గోకుల కల్యాణం = ఈగోకులమునకంతా శుభమును; కలయ = ఆలోచించండి.

3. ఆనందగోప మహిషీ = నందగోపుని పట్టపుదేవిన్నీ అయినట్టి; అనిందిని = నిర్దోషి అయిన; ఇయా = ఈయశోద (ఇక్కడయున్నది చూడము); ఏనం నందం = ఇదిగోమా తండ్రి అయిన నందుని; తా మపి = మా తల్లినిన్నీ; ఆనందయా = సంతోషపరచుమా; నందనందన సుందర శ్రీకృష్ణ = నందుని కుమారుడవైన మనోహరమైన శ్రీకృష్ణస్వామీ!

4. వృష్ణిజనముదే = వృష్ణిజనసంతోషము కొఱకు; కృష్ణ తత్త్వవిదా = శ్రీకృష్ణ తత్త్వమును తెలిసినట్టి బలరామునిచేత; ఇతిగీతం = ఈప్రకారముగా గానము చేయబడినది; విష్ణుభక్త = విష్ణుభక్తుడైన; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులచేత; విరచితం = రచింపబడెను; విపులానందం = విస్తరమైన ఆనందము; ఉదితం = కలిగినది.

ప-అ. ఓకృష్ణా! కాళీయుఁడు నిన్ను బంధించియున్నాఁడు. దానిని విడిపించుకొనుము. అపరిమితమగు నీసామర్థ్యమును దలఁపుము.

1. ఓకృష్ణా! నీవు సమస్తప్రపంచమును సృజించినవాఁడవు. పాపములను పోఁగొట్టువాఁడవు. దుష్టులను సంహరించి భూభారమును దీర్చుటకై మనుష్యరూపమున నవతరించితివి.

2. బాల్యమువలన చపలస్వభావము నభినయించుచున్నావు. ఈవిలాసమే నిఁకఁజాలింపుము. కాళీయునివిషమును శీఘ్రముగ నశింపఁజేయుము. గోకులమును రక్షింపుము.

3. ఇదిగో మనతల్లిదండ్రులగు నందయశోదలు నీకై దుఃఖించుచున్నారు. పుణ్యాత్ములగువారల ననుగ్రహింపుము. శీఘ్రమున వారి కానందమును గల్గింపుము.

4. ఇట్లు యాదవులకు సంతసము గల్గుటకై కృష్ణునియధార్థస్వరూపము నెఱింగిన బలభద్రుఁడు చెప్పెను. భక్తులకు సంతసము గల్గుటకై విష్ణుభక్తుఁడగు నారాయణతీర్థుఁడు దీని రచించెను.

శ్లో. రౌహిణేయకృతం గీతం శ్రుత్వాస్ఫాట్య చ కాళియమ్,
పాతయిత్వా జ.లే నృత్య మకరోత్తస్య మూర్ధని.

8. శ్లో॥ రోహిణేయం = రోహిణి అమ్మవారి కుమారుడు అగు బలరామునిచేత; కృతం గీతం = ఈ చెప్పబడిన గీతమును; శృత్వా = శ్రీకృష్ణస్వామివిన్నవారై; కాళీయం = కాళింగుని బంధమును; స్ఫాట్యంచ = విదిలించివేసెను; జలే = జలమునందు; పాతయిత్వా = పడవేసినవాడై; తస్యమూర్థని = ఆకాళింగునిశిరస్సునందు; నృత్యం అకరోత్ = నాట్యముచేసెను.

ఇట్లు బలభద్రుఁడు చెప్పినదానిని విని శ్రీకృష్ణుఁడు తక్షణమే కాళీయుని విదళించి నీటిలో వానిశిరముపై నృత్యముఁజేసెను.

అథ నాగపత్నీనా మాగమనమ్

నాదనామక్రియారాగము - ఆదితాళము

ఆయాతి నాగదారకదంబం ప్రతి
మాయాకలితలోకకదంబం
నందాదియోగిబృంద చింత్యపాదం పరమా
నందైకకంద మాశ్రితవేదం
ఫణిఫణాసమర్పిత పాదారవిందం నిత్య
మణిమాదిభూతిద మఖండితానందం
కమనీయ కాలమేఘాభిరామం గోప
కామినీబృందకలిత కామం
నానావిచిత్ర లీలావినోదం శ్రీ
నారాయణతీర్థాభయవరదం

అథనాగపత్నీఆ మాగమనమ్ - 7వ కీర్తన - నాదనామక్రియారాగం - ఆదితాళం

మాయాకలిత = మాయచేత నిర్మింపబడిన; లోక కదంబం = బ్రహ్మాండములు గలవాడున్నూ; నందాదియోగిబృంద = నందుడు మొదలగు యోగుల సమూహమువల్ల; చింత్యపాదం = చింతింపబడుచుండు పాదములు గలవాడున్నూ; పరమానందైక కందం = పరమానందవే

ముఖ్యానుభవముగలవారున్నూ; ఆశ్రితవేదం = ఆశ్రయించుచున్న వేదములుగలవాడున్నూ, ఫణిఫణా సమర్పిత పాదారవింద = కాళింగుని పడగలయందు వుంచబడిన పాదారవిందము కలవాడున్నూ, నిత్యం = ఎల్లప్పుడున్నూ; అణిమాది భూతిదం = అణిమాది అష్టసిద్ధులు అనెడి ఐశ్వర్యము యిచ్చునట్టివాడున్నూ, అఖండిత ఆనందం = తెంపులేని ఆనందముగలవాడున్నూ, కమనీయ = మనోహరమైన, కాలమేఘ అభిరామం = కాలమేఘముతో సమానమైన కాంతిగలవాడున్నూ; గోపకామిని = గోపస్త్రీల బృంద = సమూహములకు, కలిత రామం = ఒప్పుచున్న మన్మధుని వంటివాడున్నూ; నానావిచిత్ర లీలావినోదం = నానా విచిత్రములు అనునట్టి లీలలచేత వినోదించువాడున్నూ, శ్రీనారాయణతీర్థ = నారాయణతీర్థులకు; అభయం = మోక్షము అనునట్టి వరమును, వరదం = ఇచ్చువాడున్నూ అగు శ్రీకృష్ణమూర్తిని, ప్రతి = గూర్చి (వద్దకు), నాగ, దార, కదంబం = నాగపత్నీ సమూహములు, ఆయాంతి = వచ్చుచున్నారు.

తనమాయావిలాసముచే ప్రపంచమును నిర్మించునట్టియు, సనకసనందనాదులచే సేవింపఁబడుచున్నట్టియు, వేదములచే నుపదేశింపఁబడు దివ్యస్వరూపము గలిగినట్టియు, అణిమ మొదలగు నష్టైశ్వర్యముల నొసంగునట్టియు, పరమానందస్వరూపుఁడైనట్టియు, శ్రీమన్నారాయణుఁడు నీలమేఘశ్యామల మగుదివ్యసుందరవిగ్రహముతో జన్మించి బహువిధములగు విలాసముల సల్పుచు నారాయణతీర్థునిఁ బ్రోచుచు గోపికలచిత్తముల నాకర్షించుచునుండి దుష్టనిగ్రహోద్యుక్తుఁడై తమభర్తయగు కాళీయుని పడగలపై పాదములనిడి నృత్యము సేయుచుండుటఁ జూచి యానాగేంద్రునిభార్యలు దీనలై యద్దేవుని కడకు వచ్చిరి.

శ్లో. ఫణేషు తస్య నృత్యంతం క్షీణశక్తే ర్ముహు ర్ముహుః,
భర్తృభిక్షాం ప్రార్థయంత్యో నాగపత్న్యో జగుర్హరిమ్.

9. శ్లో॥ క్షీణశక్తేః = శక్తి క్షీణించుచున్నట్టి; తస్య, ఫణేషు = ఆకాళింగుని యొక్క పడగలయందు; ముహుర్ముహుః = మాటిమాటికిన్నీ; నృత్యంతం = నృత్యము చేయునట్టి, హరిం - స్వామివారిని గూర్చి; నాగపత్న్యః = కాళింగుని భార్యలు; భర్తృభిక్షాం = పతిభిక్ష పెట్టుమని; ప్రార్థయంత్యః = ప్రార్థనచేయుచూ; జగుః = గానము చేసిరి.

ఆకాళీయుఁడు శక్తిలేనివాఁడై పడియున్నను, మరలమరల నాతనిశిరములపై కృష్ణుఁడు నృత్యముసేయుచునే యుండెను. దానిఁజూచి యా నాగపత్నులు పతిభిక్షఁబెట్టుమని ప్రార్థింపుచు నామహాత్ముని వినుతించిరి.

ముఖారిరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | దేవ కురు శిక్షాం | దేహి పతిభిక్షాం |
| అ. | దీనపరిపాలనాయ | స్వీకురు దీక్షాం |
| 1. | ఆగమైకశరణ | మశేషలోక కారణం |
| | అహు రాగ మే తత్వా | మానంద మఖండితం |

| | | |
|---|---|---|
| 2. | యోగిమతిభూషణా | ఘౌఘపరిశోషణ |
| | భోగిశయన భువన | భూషపాహి పతితం |
| 3. | జాతికులశరణ మ | శేషజంతుతారణం |
| | జాతం భవతాకృత | మిత్యాగమవిదితం |
| 4. | సర్వజంతుసమతా | సాధు తవ విదితా |
| | సర్వబుద్ధిషు ప్రహితా | సాచ వేదవిదితా |
| 5. | అజ్ఞాతవస్తుకి | మస్తి విజ్ఞానస్య తే |
| | అజ్ఞాపయ యదుచిత | మస్మాకం జగత్ప్రభో |
| 6. | నాగపత్నీ గీత మిదం | వారాయణచరితం |
| | యోగివరనారాయణ | తీర్థయతిఫణితం |

8వ కీర్తన - ముఖారిరాగం - ఆదితాళం

ప॥ దేవ శిక్షాం కురు = హే కృష్ణస్వామీ! దండనను చేయుమా; పతిభిక్షాందేహి = పతిభిక్షను ఇమ్మా!; దీన పరిపాలనాయ = దీనులను పరిరక్షించుటకొఱకు; దీక్షాం స్వీకురు = దీక్షను స్వీకరించుమా, ప్రతిజ్ఞను చేయుమా.

1. అగమైకశరణం = వేదములే ముఖ్యఉపాయముగా ప్రతిపాదించువారు; అశేషలోక కారణం = సర్వలోకములకు ఆధారభూతుడవనిన్నీ; ఆగమేన = వేదములనే ప్రణాములచేత; త్వాం, తత్వం = మిమ్ములను పరతత్త్వముగా; అఖండితం ఆనందం = ఖండములేని ఆనందం కలవారని; అహుః = చెప్పుచున్నారు.

2. యోగిమతి భూషణ = యోగుల మనస్సును అలంకరింపజేయువాడ; అఘౌఘ పరిశోషణ = పాప సమూహములను దహింపజేయువాడ, భోగిశయన = సర్పములయందు పవళించువాడ; భువనభూష = భువనములకు అలంకారమైనవాడ; పతితం పాహి = పాపులను రక్షించుమా

3. జాతికుల శరణం = సమస్త ప్రాణులను రక్షించువాడ; అశేష జంతుతరణం = సమస్తమైనటువంటి జంతువులను తరింపజేయువాడా (మోక్షమును యిచ్చువాడా); జాతం = పుట్టబడినటువంటి సమస్తభూతములు; భవతా కృతం = మీచేత చేయబడినది; ఇతి ఆగమ విదితం = ఈప్రకారముగా వేదములయందు చెప్పబడుచున్నది.

4. సర్వజంతు = సమస్తప్రాణులయందు; సమత = సమత్వమున్నూ; సాధు తవవిదిత = చక్కగా తమకు తెలియబడుచున్నది; సర్వ = సమస్తమైనటువంటి; బుద్ధిషు = బుద్ధులయందు; ప్రహిత = విశేషహితకరమైనది; సాచ = అభావము; వేదవిదిత = వేదములయందు చెప్పబడినది.

5. విజ్ఞానఘనస్య = ఘనమైన విజ్ఞాము కలిగినట్టి; తే, అజ్ఞానతవస్తు = మీకు తెలియని విషయము; కిమస్తు = ఏమియున్నది?; జగత్ప్రభో = హేస్వామీ! హే శ్రీకృష్ణస్వామీ!, అస్మాకం = మాకు; యత్ ఉచితం = ఏది ఉచితమో (దానిని); అజ్ఞాపయా = అజ్ఞ ఇమ్మా!.

6. ఇదం నారాయణచరితం = ఈ కృష్ణకథను; నాగపత్నీగీతం = నాగపత్నులచేత గానము చేయబడినది; యోగివర = యోగశ్రేష్ఠుడైన; నారాయణతీర్థ = నారాయణతీర్థులను పేరుగల; యతి ఫణితం = యతిచేత కీర్తనగా చెప్పబడినది.

ప. ఓమహాత్ముడా! దుష్టులను శిక్షించుటయుచితమే, అయినను మాయందుఁ గరుణించి మాకుఁ బతిభిక్షునిమ్ము.

దీనులగు మమ్ము రక్షించుటయందు దీక్షను గైకొనుము.

1. నీవు వేదవే నివానముగాఁ గలవాఁడవనియు, సృష్టికర్తవనియు, పరమానంద స్వరూపుఁడవనియు వేదవేత్తలు చెప్పుదురు.

2. నీవు పాపములను బోఁగొట్టువాఁడవు. యోగులందఱును తమమనసులు నిర్మలమగుటకై త్రిభువనాలంకృతుండవగు నినుధ్యానించుచుందురు.

3. నీవు సకలజాతులకు రక్షకుఁడవనియు, కారణభూతుఁడవనియు, సర్వజంతువులను ఉద్ధరించువాఁడవనియు వేదములు చెప్పుచున్నవి.

4. నీవు సర్వజంతువులయందును సమానుఁడవని ప్రతివారికిని తెలియుసు వేదముకూడ నట్లే చెప్పుచున్నది.

5. ఓసర్వజ్ఞా! నీవు జ్ఞానరూపుఁడవు. నీకు తెలియని దేది కలదు? కావున నోజగన్నాయకా! మేమిఁక పైనాచరింపవలసినదేదియో యాజ్ఞాపింపుము.

6. ఈగీతము నాగపత్నులు కృష్ణునిస్తోత్రము చేసిన విధమును దెల్పును. ఇది నారాయణ తీర్థుఁడనుయోగిచే రచియింపఁబడినది.

శ్లో. ఏవం స్తుతే జగన్నాథే నాగపత్నీభిరాదరాత్,
నమస్తే దేవదేవేతి ఫణీ ప్రాహ శనై శ్శనైః

10. శ్లో॥ ఏవం = ఈప్రకారము; నాగపత్నీభిః = నాగపత్నులచేత; ఆదరాత్ = భక్తిపూర్వకముగా; జగన్నాథే = శ్రీకృష్ణులు; స్తుతే = స్తోత్రము చేయబడగా; ఫణి = కాళీయుడు; దేవదేవా = ఓ దేవదేవుడా; తే, నమః = నీకు నమస్కారము; ఇతి, శనైఃశనైః = ఇట్లని మెల్లమెల్లగా పలికెను; ప్రాహ = పలికెను.

**ఇట్లు తనభార్యలు శ్రీకృష్ణుని నుతించుట విని యాకాళీయుఁడును ఓదేవ దేవా! నీకు నమస్కారము అని మెల్లఁగ బల్కెను.**

## శ్రీకృష్ణుఁడు కాళీయుని రక్షించుట

శ్లో. శ్రీకృష్ణస్తం పరిత్యజ్య సాగరం గచ్ఛ నిర్భయః,
మత్పాదచిహ్నితఫణై రిత్యుక్త్వా గోకులం యయౌ

11. శ్లో॥ శ్రీకృష్ణః = శ్రీకృష్ణులు; మత్పాద = నాపాదముచేత; చిహ్నిత = గుర్తుగా చేయబడిన; ఫణైః = పడగలచేతకూడుకొని; సాగరం = సముద్రమునుగూర్చి అనగా (రమణకద్వీపమును గూర్చి; నిర్భయః = భయములేనివాడై; గచ్ఛ = వెళ్ళుమా!; ఇతి ఉక్త్వా = ఇట్లని చెప్పి; తం = ఆకాళీయుని; పరిత్యజ్య = వదలిపెట్టి; గోకులం = బృందావనమును గూర్చి; యయౌ = వేంచేసిరి (వెళ్ళిరి)

అంత నాశ్రీకృష్ణుఁడు కాళీయుని వదలి "నీవిఁకసముద్రమునందున్న రమణకద్వీపమునకుఁ బొమ్ము. నాపాదచిహ్నములు నీశిరమునందున్నవి. నీకింక భయములేదు". అని యాజ్ఞాపించి తానును గోకులమునకుఁ బోయెను. (ఈకాళీయుఁడు మొదట రమణకద్వీపమునందె యుండియు, గరుడునకు నొక అపరాధము చేసినందున నాతనికి భయపడి యీమడుగునకుఁ జేరెను. ఒక మునిశాపమువలన నిచటికి గరుడుఁడు రాఁడు. అనునది యిచ్చట పూర్వకథ.)

## శ్రీరామకృష్ణులు ఖరాదిరాక్షసులం జంపుట

శ్లో. పరం గోపబాలై ర్మహత్తాళబృందం
క్రమేణ ప్రవిష్టౌ ఖలా౯ సంహరంతౌ,
ముదా రామకృష్ణౌ సఖేలం చరంతౌ
ఫలైస్తోషయామాసతు ర్గోపబాలాన్.

12. శ్లో॥ రామకృష్ణౌ = బలరామకృష్ణులు; వరం = శ్రేష్ఠమైన; మహత్తాళబృందం = గొప్పదైన తాటిచెట్ల సమూహము; గోపబాలైః = గోపబాలురతో; క్రమేణ = క్రమముగా; ప్రవిష్టౌ = ప్రవేశించినవారై; సఖేలం = విలాసముగా; చరంతౌ = సంచరించుచున్నవారలై; ఖలాన్ = దుర్మార్గులగు రాక్షసులను; సంహరంతౌ = సంహరించువారలై; గోపబాలాన్ = గోపబాలురను; ఫలైః = ఫలభక్షణద్వారా; తోషయామాసః = సంతోషింజేసిరి.

మఱియొకప్పుడు లెక్కకు మిక్కిలియగు తాటిచెట్లతోనిండిన యొక వనమును సహచరులతోఁ గూడ ప్రవేశించి యిచ్చటిపండ్లంగోసి బాలురకిచ్చుచు నారామకృష్ణులు యథేష్టముగ సంచరించుచుండిరి. అప్పుడు వారి విహారమునకు విఘ్నముగా రాక్షసులనేకులు వచ్చినవారలనందఱను దునుమాడిరి.

శ్లో. ఖరాసురవధం కృత్వా ఖగాధిపతివాహనః,
నిరాయాసః పరానందో రమతే నందనందనః,

13. శ్లో॥ ఖగాదిపతివాహనః = గరుడవాహనుడైన, నందనందన = నందపుత్రుడైన కృష్ణుడు; నిరాయాసః = ఏ అయాసము లేకుండ; ఖరాసురవధం = గార్ధభాసుర సంహారమును, కృత్వా = చేసినవారై; పరానందః = శ్రేష్ఠమైన ఆనందముగలవారై; రమతే = క్రీడించెను.

వారిలో ఖరరూపమును ధరించియున్న ధేనుకాసురుఁడు ముఖ్యుఁడు. గరుడవాహనుం డగు నాశ్రీకృష్ణుఁడు వాని ననాయాసమునఁ జంపెను.

గ. తమేవ మసురకులకదళీవనోన్మూలన కేళికలాకుశలకలభమూర్తిధరం
నందకుమారం సర్వేచ గోపబాలాః సంపూర్ణమనో రథా ఇత్థ ప్రార్థయామాసుః.

14. గద్య:- అసుర = రాక్షసులయొక్క; కుల = సమూహమనునట్టి; కదళి = అరటి వనమును; ఉన్మూలన = పెళ్ళగించివేయునట్టి; కేళీకళ = వినోదవిద్యలందు; కుశల = నుర్పుగల్గిన; కలభ = గున్నఏనుగులయొక్క; మూర్తిధరం = రూపమను ధరించినట్టి; తం, ఏవం = నందకుమారుడు; సర్వేచ గోపబాలాః = గోపబాలకులు అందరున్నూ; సంపూర్ణమనోరథ = కోరికలు పూర్ణముగా తీర్చుకున్నవారలై; ఇత్థం = ఈక్రింద చెప్పబోవువిధముగా; ప్రార్థయామాస = ప్రార్థించగోరిరి.

ఇట్లు రాక్షసులనియెడు నరటిచెట్లకు మదగజంబై యావనంబున విహరించుచున్న కృష్ణుని జూచి గోపబాలకు లిట్లని ప్రార్థించిరి.

కాంభోజీరాగము - త్రిపుటతాళము

ప. రామసఖే కృష్ణసఖే రమణీయ గోకులమథయామో

1. కమలబంధురిహకమలమనుపతతి కమలినీ మలి నేన విభాతి
కుముదబంధురపికుముదమనుసరతికుముదినీచపరంపరిహసతి.

2. శశధరం శనకై రనుపశ్యతి శర్వరీ వనితా నిజకాంతం
వశముపై తివనితారుషబృందం వామమన్మథదాశస్యమందం.

3. అళికుం కమలోదరమిళితం అలఘుగీతరసామృతభరితం
కలయ గోధనమిహ సముదితం లలిత వేణురవేన త్వరితం.

4. రక్తచందనలేపనలోలా రాగిణీ పశ్చిమాభాతిబాలా
ముక్తలజ్జేవముహు రతిచపలా ముంచతివీటికారస మబలా.

5. చక్రవాకయుగళంచ విగళితం చారునీరనిరంతరమిళితం
వక్రకంఠవిగళితరవలలితం వనజబృందమధునైవ ముకుళితం

6. వారుణీసేవనా దబ్జమిత్రం వారుణో నీతవాన్నిజగాత్రం
తారకామలనిజదంత కాంత్యా తామసీ హస తీతి విచిత్రం

7. శృణ్వతా గోపబాలకగీతం శ్రీధరేణ గోకులమాయాతం
తృణచరానుసరేణ సముదితం ధీరనారాయణతీర్థసుఫణితం.

9వ కీర్తన - కాంభోజిరాగం - త్రిపుటతాళం

ప॥ రామసఖే = చెలికాడైన బలరాముడా, కృష్ణసఖే = చెలికాడైన కృష్ణుడా; అథరమణీయం = ఇకను మనోహరమైన; గోకులం యామః = గోకులమును గూర్చి వెళ్ళెదము.

1. కమలబంధు = సూర్యుడు; ఇహ = ఇక్కడ, కం = జలమును (పశ్చిమ సముద్రజలములో); అలం, అనుపతతి = పూర్తిగా పడుచున్నాము; కమలిని = తటాకము (కమలములు కలిగినది); మలినివ = మాసినదానివలె; విభాతి = కనబడుచున్నది; కుముద బంధు రపి = చంద్రుడు గూడా; కుముదం అనుసరతి = కలువలను అనుసరింపుచున్నాడు; కుముదీనిచ = కలువలు వుండే తటాకమును; పరిహసతి = ఎగతాళి చేయుచున్నది.

2. శార్వరి, వనితా = రాత్రి అనే స్త్రీ; నిజ మనోకాంతం = తన మనోహరుడుగు; శశధరం = చంద్రుని; శనకైః = మెల్లగా; అనుపశ్యతి = నిరీక్షించుచున్నది (అనగా చూచుచున్నద ఇ); వనితా ఝషబృందం = స్త్రీలు అనునట్టి చేపల సమూహము; వామ, మన్మథ, దాశస్య = సుందరుడైన మన్మథుడనెడు చేపలవానియొక్క; వశం = స్వాధీనములో; మందం = నెమ్మతిగా; ఉపైతి = చేరుచున్నది.

3. అళికులం = తుమ్మెదల యొక్క సమూహములు; కమల, ఉదర, మిళితం = కమలములయొక్క పొట్టలో చేరియున్నవి; అలఘు = గొప్పదైన; గీత, రసామృత = గాన రసామృతముతో; భరితం = నిండియున్నది. (అనగా కమలములలో నుంచి వెడలి పోవలేక రొదను చేయుచున్నవి); గోధనం = గోసమూహములు; ఇహ = ఇక్కడ; లలిత = ఒప్పుచున్న; వేణురవేణ = మీయొక్క వేణుగాన ధ్వనిచేత; త్వరితం = త్వరితముగా; ఇహ = ఇక్కడ; సముదితం = చేరియున్నవి; కలయ = చూడుమా!.

4. పశ్చిమా బాలా = పశ్చిమ దిక్కు అనెడి స్త్రీ; రాగిణీ = రాగము గలది అయి; రక్తచందన లేపన, లోలా = రక్తచందనము పూసుక"నుటయందు ఆసక్తికలదియయి; భాతి = ప్రకాశించుచున్నది; అబల = ఆ పశ్చిమదిశాంగన; ముక్తిలజ్జాఇవ = సిగ్గు విడిచిన దానివలె; ముహుః ముహుః = మాటి మాటికి; అతిచపల = అతి చపలము గలది అయి; వీటికా, రసం = తమ్మరసమును (తాంబూలరసమును) ముంచతి = విడిపించుచున్నది.

5. చారు = చారుతరముగా; నీర = నీటియందు; నిరంతర = తెంపులేకుండా (ఉదయమునుంచి); మిళితం = మేళనమైయుండునట్టి; చక్రవాక, యుగళం = చక్రవాక పక్షులయొక్క జంట; విగళితం = వియోగము అయినవి; వక్ర కంఠ = వంకర మెడగల; విగళితం = వియోగము అయినవి; రవ = ధ్వనులచేత; లలితం = ఒప్పుచున్నది; వనజ బృందం = కమల సమూహములు; అధునా ఏవ = ఇప్పుడే; ముకిళితం = ముడుచుకున్నది.

6. వారుణీ సేవనాత్ = పశ్చిమ దిక్కును పొందినటువంటి (మద్యపానము చేసినందువలన); నతగాత్రం = వంగిపోయిన అవయవములు గలిగినటువంటి; అబ్జమిత్రం = సూర్యుని, వారుణః = పశ్చిమ అధిష్ఠాన దేవతయైన వరుణుడు; నీతవాన్ = తీసికొని పోబడెను; తామసీ = రాత్రియనెడు స్త్రీ; తారక = నక్షత్రములనెడు; అమల = నిర్మలమైన; నిజదంత = తన దంతములయొక్క, కాంత్య = కాంతిచేత; హసతి = నవ్వుచున్నది; ఇతి = ఈ విషయమును; విచిత్ర = ఆశ్చర్యము

7. గోపబాలకా = గోపబాలుర యొక్క; గీతం = పాటను; శృణ్వత = వింటూవచ్చుచున్న; శ్రీధరేణ = స్వామివారిచేత; గోకులం = రేపల్లెను గూర్చి; ఆయాతం = పొందబడెను; తృణచర = గడ్డిపోచలో తిరుగుచుండు అనగా మేయుచుండు పశువులను; అనుసరేణ = పశువులను అనుసరిస్తూ వచ్చినటువంటి స్వామివారిచేత; సముదితం = చక్కగా ప్రవేశించబడినది; ధీరనారాయణతీర్థ = ధైర్యముగల నారాయణతీర్థులవారిచేత; సుఫణితం = లెస్సగా చెప్పబడినది.

ప. ఓ మిత్రుఁడగు బలరామా! శ్రీకృష్ణా! మనము గోకులమునకుఁ బోవుదము.

1. సూర్యుఁడు పశ్చిమసముద్రజలముం బ్రవేశించుచున్నాఁడు. కమలము ముకుళించుకొనుచుండుటచే తేజోహీనమగుచున్నది. చంద్రుఁడును కలువల వికసింపఁజేయుచున్నాఁడు.

2. రాత్రియనుకాంత తనప్రియుఁడగు చంద్రునిరాకకు నిరీక్షించుచున్నది. స్త్రీ లనుమత్స్యములు మన్మథుం డనుజాలరిచేఁ బట్టువడుచున్నవి.

3. తుమ్మెదలన్నియు కమలములగర్భములందుఁ జేరి యచటనుండి వెడలిపోవం దలంచుచు ఝుమ్మని రొదఁజేయుచున్నవి. నీ వేణుగానమును విని గోవులన్నియు నూరికిఁ బోవఁ ద్వరఁజేయుచున్నవి. నీ వేణుగానమును విని గోవులన్నియు నూరికిఁ బోవఁ ద్వరపడుచు గుమిఁగూడుచున్నవి చూడుము.

4. రక్తచందనము నొడల్లెఁ బూసికొని తననోటనున్న తాంబూలరసము నుమియుచు, సిగ్గువిడచి సంచరించుచుండు ననురాగవతియగు కామిని పశ్చిమదిక్కు రాగవతియై (ఎఱుపుగలదియై) రాజిలుచున్నది.

5. ప్రాతఃకాలమునుండియు ఒకదానినొకటి విడువకయున్న చక్రవాకపక్షుల జంట వియోగమును జెందినది. ఇంతవఱకు ధ్వనిచేయుచుండిన తుమ్మెదలన్నియు వెడలిపోవుటచే నిశ్శబ్దమై తమయగ్రములు కొంచెము వక్రములగుచుండ కమలమున్నియు నిప్పుడే ముకుళించినవి.

6. సూర్యుఁడు వారుణిని (పశ్చిమదిక్కును మద్యమును అని రెండర్థములు) సేవించుటవలన తనశరీరమును మఱింత యెఱ్ఱనిదానినిఁగా జేసెను. అయినను తామసియగు (తమోగుణములుగల) నీరాత్రి నక్షత్రములనియెడు దంతములకాంతిచే నాయననుజూచి నవ్వుచున్నది. ఇది యెంత ఆశ్చర్యమో చూచితివా! (ఎఱుపురజోగుణమువలనఁ బుట్టునది. నలుపుతమోగుణములవలనఁ బుట్టునది. కావున తమోగుణమయమగురాత్రి తనకంటె నుత్తమమగు రజోగుణముగల సూర్యునిఁజూచి నగుట యాశ్చర్యకరమని భావము)

7. ఇట్లు గోపాలకులు చేసిన ప్రార్థనను విని శ్రీకృష్ణుఁడు గోవులతోఁగూడ పల్లియకు వచ్చెను. ఇది నారాయణతీర్థునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. ఉషిత్వా గోకులే రాత్రౌ బలేన సహితః సుఖీ,
ఉషస్యుత్థాయ గోవింద శ్చోదయామాస గా వనమ్.

15 శ్లో॥ రాత్రౌ = రాత్రియందు; గోవిందః = శ్రీకృష్ణుడు; గోకులే = గోకులమునందు; బలేన సహిత = బలరామునితోకూడుకొనినవారై; సుఖీ = సుఖముగా; ఉషిత్వా = కాలముగడిపి (నివసించి); ఉషసి = వేకువను; ఉత్థాయ = నిద్రలేచి; గాః = గోవులను; వనమ్ = బాండీరకవనం (బృందా వనమును గూర్చి); చోదయామాస = తోలుక వెళ్ళిరి.

ఇట్లు పల్లియను బ్రవేశించి యచ్చట నారాత్రియంతయు బలభద్రసహితుఁడై సుఖముగ గడపి ప్రాతఃకాలమున నే ఆ శ్రీహరి గోవుల వనమునకుఁదోలెను.

భాణ్డీరకవనవర్ణనము

శ్లో. అద్య భాండీరకం నామ వనం యామో వయం ముదా,
ఇత్యాహ భగవా న్బాలా్ బలం చ బలినాం వరమ్.

16. శ్లో॥ వయం = మనము; అద్య = ఈరోజున; భాండీరకం నామవనం = భాండీరకమనే పేరుగలిగిన వనమునుగూర్చి; ముదా = సంతోషముగా; యామః = వెళ్ళెదము; ఇతి భగవాన్ = ఇట్లని శ్రీకృష్ణుడు; బాలాన్ = బాలకులను గూర్చినీ, బలినాం = బలవంతులలో; వరం = శ్రేష్ఠుడగు; బలంచ = బలరాముని గూర్చినీ; ఆహ = పలికెను

అప్పుడు తనసహచరులగు గోపబాలకులతోను, బలరామునితోడను, ఆశ్రీకృష్ణుఁ డిట్లనియె. ఇప్పుడు మనము భాండీకరమను నరణ్యమునకుఁ బోవుదము.

*సావేరి రాగము - ఆదితాళము*

ప. రామ రామ విచరామోవయం - రమ్యభాండీరకవన మధునా

అ. రామ రవికిరణదూరం - రమణీయసరోవరబహుళం

1. చంద్రకాంతోపలమణివాలుక - చారుతరఝురీసుందరసలిలం
చన్దనచంపకతరుమన్దార - ఛాయాతిమిర సూర్యమణిజాలం

2. ఉన్న తతరుషుసమున్న తబలవ-త్పన్న గరిపుముఖవిహ్వలితవిహగాః
ఉన్మత్తా ఇవసన్నద్ధాయుధి - మన్యన్తేముహురిహఖలు యోద్ధుం

3. నందనం వన మేత దుపమితం - నానారసఫలై రపిమధుసుధయా
మందమారుతస్పన్దనవిగళిత - మందారాది శ్రీచందనకుసుమైః.

4. ముక్తాఫలసమముద్రితవల్లీ - నక్తమధువ్రతశంసితవిభవం
త్యక్తాశంసద్ధివివనమేతత్ - చేతస్స్పృహయతిదివ్యవధూనాం

5. స్వర్గారోహణసోపానపఙ్క్తిరివ - సురలోకావధిసుందరవిటపం
నిర్గళితోపమ మతిరమణీయం - నిహ్ను తసకలసంతాపవిభూతి.

6. బంధుప్రియ ఇవబంధూనయమిహ - సంధత్తేఖలుసాదరమస్మాన్
మందస్మేరసుధామధు సేచన - మంగళపూర్వమహోవనదేశః.

7. నారాయణఫణితం రమణీయం - ధీరోదాత్తగిరా బలభద్రం
ఘోరాఘౌఘనివారణ మేత - న్నారాయణతీర్థార్యసుఘటితం.

10 కీర్తన - సావేరి - ఆదితాళం

ప॥ రామరామ = హే బలరామ; వయం = మనము; అధునా = ఇప్పుడు; రమ్యభాండీరక వనం = సుందరమైన భాండీరకమనేపేరుగల వనమునుగూర్చి; విచరామః = సంచరించెదము; రామా = హే బలరామ; రవికిరణదూరం = సూర్యకిరణములున్ను ప్రవేశించుటకు వీలుకానటువంటిన్నీ; రమణీయ = మంచి సౌందర్యమైనటువంటిన్నీ; సరోవరబహుళం = అనేకతటాకములు కలిగివున్నటువంటిన్నీ; చంద్రకాంత + ఉపల = చంద్రకాంతపు బండలు; మణివాలుక = మణురూపమైన ఇసుక ప్రదేశములుగల; చారుతర = దివ్య సుందరమైనట్టిన్నీ; ఝరి = సెలేళ్ళయందలి; సుందరసలిలం = సుందరమైన ఉదరము గలవారున్నూ; చందన = చందనవృక్షములు; చంపకతరు = సంపెంగవృక్షములు; మందార = మందార వృక్షములు; ఛాయా తిమిర = నీడయను చీకట్లకు; సూర్యమణిజాలం = సూర్యప్రకాశము అని చెప్పదగినటువంటి మణులుగలదియు; వనం = వనమును; విచరామః = సంచరించుచుండెదము.

2. ఉన్నత తరు = ఎత్తు అయిన చెట్లయందు; సమున్నత = విశేష ఎత్తైన; బలవత్ = బలముగల; పన్నగరిపు = గరుత్మంతుడు; ముఖ = ముఖముచేత (మొదలగు); నిహ్నుత = గూళ్ళలోపల వుండెడు; విహగ = పక్షులున్నూ; ఉన్మత్త = మదించినదయి; సన్నద్ధ ఇవ = సన్నాహము కలిగినవాటివలె; యుధి = యుద్ధమునందు; ముహురిహ = మాటిమాటికి యిక్కడ; యోద్ధుం = పోట్లాడుటకు; మన్యం తేఖలు = యెంచుచుండును గదా!

3. నానారసఫలైరపి = నానా రసములుగల ఫలములచేతనున్ను; మధుసుధయా = మకరందముఅను అమృతము చేతనున్ను; మందమారుత = నెమ్మతిగా వీచెడు వాయువుచేత; స్పందన =

కదిలినందుచేత; విగళిత = రాలినట్టి; మందారాది = మందారము మొదలైన; శ్రీచందన కుసుమైః = శ్రీచందన పుష్పములచేతనున్నూ; నందనం వనం = నందనవనము; ఏతతు = ఈవనముతో; ఉపమితం = సరిపోల్చదగియున్నది; (దృష్టాంతము కలిగినదిగా చెప్పబడుచున్నది)

4. ముక్తాఫల = ముత్యాల ఫలముతో; సమ = సమమైన; ముద్రితవల్లీ = తీగెలయందు, సక్త = ఆసక్తిగలిగిన; మధువ్రత = తేనెటీగలచేత; శంశిత = స్తోత్రము చేయబడిన; విభవం = ప్రభావముగలది; దివిత్యక్తాశంసత్ = స్వర్గమందు ఆశను వదలినదియై; దివ్యవధూనాం = దేవతాస్త్రీలయొక్క; చేతః = మనస్సు; ఏతత్ = ఈవనమును; స్పృహయతి = కోరుచున్నది

5. స్వర్గ = స్వర్గమును; ఆరోహణ = ఎక్కుటకుగాను; సోపాన = మెట్లయొక్క; పఙ్క్తిః ఇవ = పంక్తివలె; సురలోక = దేవేంద్రలోక; అవధి = పర్యంతము వరకు వ్యాపించియుండి; సుందర = సుందరమైన కొమ్మలతోగూడిన; విటపం = వృక్షములు కలదిన్ని; నిర్గళిత ఉపమం = ఉపమానరహిత మైనదిన్నీ; అతిరమణీయం = మిక్కిలి మనోహరమైనదిన్నీ; నిహ్నుత = పోగొట్టబడినటువంటిదిన్నీ; సకల సంతాప = సమస్తతాపములు కలిగిన (అనగా సమస్త సంతాపములు తీర్చునట్టి); విభూతి = ఐశ్వర్యము కలిగినట్టిన్నీ

6. అయం వనదేశః = ఈవనప్రదేశము; బంధుప్రియః = బంధువులయందు ప్రేమగలిగిన పురుషుడు; బంధూన్ఇవ = బంధువులనువలె (అనగా బంధువులను ఆదరించువిధమున); అస్మాన్ = మనలను; (మందస్మేర సుధామధుసేచన మంగళపూర్వం); మందస్మేర = చిఱునవ్వుకు పోల్చబడదిన; సుధా = అమృతము; మధు = మకరందము; సేచన = చల్లుటయనెడి; మంగళపూర్వం = శోభనాచారపూర్వకముగా; సాదరం అత్యాదరముగా; సంధత్తేఖలు = సమావేశము చేయుచున్నది; అహో = ఏమి ఆశ్చర్యము!

7. బలభద్రం = బలరామునిగూర్చి; ధీర = దీరత్వముతో; ఉదాత్త = ఎలుగెత్తిన; గిరా = వాక్కుతో; నారాయణ ఫణితం = శ్రీకృష్ణస్వామిచేత చెప్పబడినదిన్ని; రమణీయం = మనోహరమైనదగు; ఇయం = ఈకీర్తన; ఘోర = భయంకరములైన; అఘ = పాపములయొక్క; ఓఘ = సమూహములను; నివారణం = నాశము చేయునటువంటినదిన్ని అగు ఈకీర్తన; నారాయణతీర్థ = నారాయణతీర్థులు అను; ఆర్య = పెద్దలచేత; సుఘటితం = లెస్సగా కూర్చబడినదిగా వున్నది.

ప. ఓ బలభద్రా! మనము రమ్యమగు నీభాండీరకవనమునందు సంచరింతము.

ఆ. ఈయరణ్యమునందు సూర్యకిరణములు గూడ ప్రసరించుటలేదు. మనోహరములగు తటాకము లనేకము లిందున్నవి.

1. ఈయరణ్యమునందలి ప్రవాహములలోని యిసుక మణిమయమైనది. అందలి శిలలు చంద్రకాంతములు. మఱియు నిచటనుండు చందనము, సంపెఁగ, మందారము మొదలగు వృక్షములనీడలు చీఁకట్లుగాను, అచ్చటచ్చట నుండు రత్నములు సూర్యబింబములుగాను బ్రకాశించుచున్నవి.

2. ఇచటి మహోన్నతతరువులపై నివసించుచువాని జొంపములయందు లీనములై యున్న పక్షులు దిగ్భ్రమఁజెంది సర్వకాలములయందునుదేనితోనైనను పోరాడవలయునని తలంచుచుండును.

3. నానారుచులుగలపండ్లనుండి యమృతమును బోలురసము స్రవించుటచేతను, మెల్లనిగాలిచే చందనమందారాదివృక్షములనుండి సుగంధవంతములగు పుష్పములు సర్వకాలములందును వ్రాలుచుండుటచేతను, దేవేంద్రునివనమగు నందనమును దీనితోఁ బోల్పవచ్చును (చందనము, మందారము అను వృక్షములు కల్పవృక్షము లైదింటిలోఁ గూడఁగలవు)

4. ఈవనమునందు తుమ్మెదలు తెల్లనివుష్పములలోనుండి తెలుపై ముత్యములో యననొప్పుచు దీనియైశ్వర్యమును సూచించుచున్నట్లున్నది. మఱియు దేవస్త్రీలుగూడ స్వర్గమునందలి యీవనమునందే విహరింపఁగోరుచున్నారు.

5. స్వర్గలోకమునకుఁ బోవుటకై కట్టఁబడినసోపానములవరుసయోయన క్రిందినుండియుఁ గొమ్మలుగల మహావృక్షములు గలదియు, సమస్త సంతాపముల హరించునదియు, మిగుల మనోహర మైనదియు నగునీభాండీరకవనమునకు సాటిలేదు.

6. బంధువులయం దాదరముగలపురుషునివలె నీవనము మనయెడమిక్కిలియాదరమును జూపుచున్నది. కొంచెము వికసించినపుష్పములనుండి వెడలుమకరందములతోడను, ఫలరసములతోడను భూమిపై కలయంపిఁ జల్లుచున్నది.

7. ఇది గంభీరవాక్యములతో బలభద్రునిగూర్చి శ్రీకృష్ణుఁడు చెప్పినది. నారాయణతీర్థునిచే గీతరూపమున వ్రాయఁబడినది. దీనిని వినిన సకల పాపమును తొలంగును.

శ్లో. గాయన్ గాయన్ వనభువి శనైర్గోపబాలైస్సమేతో
దేయం దేయం కరతల మితి ప్రీతిత స్తాడయం స్తత్,
పాయం పాయం సరసవచనాహ్లాదపీయూషధారాం
సో యం మాయీ విహరతి ముహుర్నాదయన్వేణుమీశః

17. శ్లో॥ (సః + అయం)

సోయం = ఆ, ఈ; మాయి = మాయా అధ్యక్షుడైన; ఈశః =-నియామకుడైన శ్రీకృష్ణుడు; వనభువి = బృంధావనమందు; గోపబాలైః = గోపబాలకులతో; సమేత = కూడుకొన్నవాడై; శనైః = మెల్లగా; గాయన్ గాయన్ = గాయము చేయుచున్నూ; కరతల = గోపబాలకుల అరచేతులను; దేయందేయం = చూపుము చూపుము; ఇతి = అని చెప్పచూ; తతు = ఆ అరచేతను; ప్రీతితః = ప్రేమతో; తాడయన్ = కొట్టుచును (తాళముచేయుచు); సరసవచన = రసయుక్తమైన మాటలచే; ఆహ్లాద = సంతోషపఱచుచున్న; పీయూషధారాం = అమృతధారలను; పాయం పాయం = త్రాపుచూ త్రాపుచూ; ముహుః = పలుమారు; వేణుం = పిల్లనగ్రోవిని; నాదయన్ = పూరించుచూ (ధ్వనింపచేయుచూ); విహరతి = విహరించుచున్నాడు.

అంత మాయావియగు నప్పరమేశ్వరుఁడు గోపబాలకులతో విహరించుచు నొక్కొకచో మనోహరముగ వేణుగానము సేయుచుండెను. మఱియొకచో "నీయరచేతినిఁ జూపుము" అని బాలకుల నడుగుచు అది చూపిన తోడనే తనచేతనున్న బెత్తముతోఁ గొట్టుచుఁ జమత్కారము సేయుచుండెను. వేఱొకచో మనోహరమగు తనవచనామృతముచే నాబాలురకు నానందమును గల్గించుచుండెను.

## ప్రలంబాఘబకాది వధ

శ్లో. క్రీడా మారబ్ధవాన్ కృష్ణో జయశీలాన్ పరాజితాః,
స్కంధే వహంతి యస్యాంతాం బాలకైస్సహ సంభ్రమాత్

18. శ్లో॥ యస్యాం = ఏఆటయందు; పరాజితాః = ఓడిపోయినవారు; జయశీలాన్ = గెలిచినవారిని; స్కంధే = భుజబలమందు, వహంతి = మోయవలెనో; తాంక్రీడాం = అట్టిఆటను; కృష్ణః = శ్రీకృష్ణులు; సంభ్రమాత్ = విలాసముగా; బాలకైస్సహ = గోపబాలకులతోగూడా; ఆరబ్ధవాన్ = ప్రారంభించెను.

అంతట నొకచో శ్రీకృష్ణుఁడు బాలురతోఁగూడి యొకయాట నారభించెను. దానిలో నున్న బాలకులందఱు రెండు తెగలుగా నేర్పడుటయు, ఒక్కొక్కజతగాఁ బోరాడుటయు, అందోడినవాఁడు గెలిచినవానిని తనభుజముపై నెక్కించుకొని కొంతదూరము మోసికొనిపోవుటయునను నియమము లేర్పఱుపఁబడెను.

శ్లో. ప్రలంబో నామ గోపాలవేషధారీ మహాసురః,
పరాజితో రౌహిణేయం స్కంధేనోఢ్వా పలాయితః

19. శ్లో॥ ప్రలంబః = ప్రలంబుడు అను; నామ = పేరుగల; మహా అసురః = గొప్పరాక్షసుడు; గోపాలవేషధారీ = గోపాలకుని వేషమును ధరించినవాడై; పరాజితః = ఓడిపోయి; రౌహిణేయం = తన్ను గెలిచిన బలరాములను; స్కంధేన = భుజాగ్రభాగముచేత; ఓఢ్వా = మో సికొని; పలాయితః = పరుగెత్తుచుండెను.

అప్పుడు ప్రలంబుఁడను నొక్కరాక్షసుఁడు గోపాలరూపమును దాల్చి గోపకులలోఁజేరి పైవర్ణించినఁయాటలో బలరాముని కెదురైపోరాడి యోడిపోయి యాయన తనభుజములపై నెక్కఁగానె యతివేగముతో నెత్తికొని పోయెను.

శ్లో. సంకేతస్థాన ముల్లంఘ్య పలాయనపరో బలః,
మాం నయత్యేష కిం కార్యం వద కృష్ణేత్యభాషత.

20. శ్లో॥ సంకేత స్థానం = దించవలసినచోటును; ఉల్లంఘ్య = మీరిపోయి, అతిక్రమించి; పలాయనపరః = పరుగెత్తిపోవలెనని ఆసగలవాడై; ఏషః = వీడు; మాం = నన్ను; నయతి = తీసికొనిపోవుచున్నాడు; కార్యం కిం = ఏకార్యముకొఱకు; (కృష్ణ ఇతి అభాషతః); కృష్ణా = ఓ శ్రీకృష్ణా; వద = చెప్పుమా; ఇతి = ఇట్లని; బలః = బలరాముడు; అభాషతః = చెప్పెను.

ఇట్లు హద్దు నతిక్రమించి తన్ను మోసికొని యాతఁడు పరుగెత్తుచుండుటచే బలభద్రుఁడు సంశయించి "ఓకృష్ణా! వీఁడు నన్నిట్లూరక యెత్తికొని పోవుచున్నాఁడు. నే నిపుడేమి సేయవలయునో చెప్పుము" అని యడిగెను.

శ్లో. వీర్య మావేదయన్ కృష్ణో బలభద్రస్య ధీమతః
ఇద మాహ మహావీర్య మార్యం బలసమున్నతమ్

21. శ్లో॥ కృష్ణః = కృష్ణుడు; దీమతః = జ్ఞానసంపన్నుడైన; బలభద్రస్య = బలరామునియొక్క; వీర్యం = పరాక్రమమును; ఆవేదయన్ = తెల్పుచూ; బలసమున్నతం = బలముతో కూడుకొన్నటువంటి; మహావీర్యం = గొప్పపరాక్రమము కలిగినటువంటిన్నీ; అర్యం = పెద్దలైన (తన అన్నగారిని గూర్చి); ఇదం = ఈక్రింద చెప్పబోవు విధముగా; ఆహ = పలికెను.

ఇట్లు తన్ను ప్రశ్నింపఁగానే శ్రీకృష్ణుఁడును బలభద్రునకుఁగల సహజ సామర్థ్యమును మరల జ్ఞప్తికిఁదెచ్చి "బుద్ధిమంతుఁడవును మిగుల బలముగల వాఁడవు నగు నోబలభద్రా! గర్వముచే నధికమైయున్న (ఒడలెఱుంగని) వాని శిక్షింపక నుపేక్షింపరాదు" అని మఱియు నిట్లనియె.

## కాపీరాగం - అటతాళం

ప. తావకం పరభావ మనుస్మర - తారకం స్మరతాం
అ. సేవకసంకల్పసిద్ధతనో పర - దైవత నరభావభావనయాలం
1. స్మర తవాతులబల మతివీర్యం సాహ
సంచబలభద్ర గాంభీర్యం
నగవపుర్ధర మసుర మిమం జహి
నరవరాధికధైర్య దుర్వీర్యం
2. ఖేలనే సమయో నాయ మిహ బల
నీలాంబర తవ భో
తాలనికేతన తాడయ కుటిలం తవ
ఖేలనమిత్రమమరశత్రుభృత్యం
3. అఘటితం ఘటయతి తవ మాయా
అఖిలలోకజననీ
విఘటిత భవబంధమూలమోహనిబద్ధ
విపులబోధానందరసఘన జయ భో

4. లోకబంధుఫణిత మేత దాశ్రిత
శోకమూలహరణం
భక్తసంసిద్ధిసాధక శ్రీహరి
భక్తనారాయణతీర్థభరణం

11వ కీర్తన - కాఫీరాగం - అటతాళం

స్మరతాం = స్మరించువారలను, తారకం = తరింపజేయునట్టి, తావకం = మీసంబంధమైన; పరభావం = పరస్వరూపమునందు ఉండునట్టి భక్తిభావమును; అనుస్మర = స్మరించండి; సేవక = భక్తులయొక్క; సకంల్పబుద్ధితనో = సంకల్పములను సిద్ధింపజేయునట్టి మూర్తిగలవాడ; పరదైవత = పరుడే దైవతముగా నమ్మినవాడ; నరభావ భావనయా = మనుష్యభావన అభినయముచేత; అలం = చాలును; బలభద్రా = హే బలరామా!

1. తవ = నీయొక్క; అతులబలం = అసమానమైన బలమునున్నూ; అతి వీర్యం = అతిశయమైన పరాక్రమమున్నూ; సాహసంచ = ధైర్యమున్నూ; గాంభీర్య = గూఢస్వభావమున్నూ; స్మర = జ్ఞాపకమును తెచ్చుకొనుచూ; నగవరాధిక ధైర్య! = హిమవత్పర్వతముకంటె అధికమైన ధైర్యముగల బలరామా!; నరవపుఃధర = మనుష్యరూపమును ధరించినట్టినీ; దుర్వీర్యం = దుష్టవీర్యం కలిగినట్టినీ; ఇమం అసురం = ఈరాక్షసుని; జహి = సంహరించుమా

2. నీలాంబర = నల్లని వస్త్రమును ధరించినట్టి; భో బలరామ! = హే బలరామా!; ఇహ = ఇక్కడ; తవ = నీకు; ఖేలనే = ఆడుటకు; అయం = ఇది; న సమయః = సమయముకాదు; తాల నికేతన = తాటిచెట్టును ధ్వజముగాగలవాడ; తవఖేలన మిత్రం = అట్టి ఆటలో స్నేహితుడు అయినటువంటి; కుటిలం = కుటిలమనస్సు కలిగినటువంటినీ (అమర శత్రు భృత్యం); అమర = దేవతలకు; శత్రు = విరోధి అయిన కంసునకు; భృత్యం = సేవకుడైన (ఈరాక్షసుని); తాడయ = కొట్టిచంపుమా

3. అఖిలలోక జనని = సమస్తలోక ఉత్పత్తికారణమైన; తవమాయ = మీయొక్క సంకల్పరూపమైన జ్ఞానము (విషయములను); అఘటితం = ఘటించరాని ( దుస్సాధ్యమైన); ఘటయతి = ఘటింపచేయుచున్నది; (అనగా నెరవేరుచున్నట్లు చేయుచున్నది); భవబంధమూల = సంసారబంధముకు మూలముగానుండు (అజ్ఞానము); విఘటిత = కొట్టివేయువాడ; మోహనిబద్ధ = మోహముచేత కట్టుబడనివాడ; విపుల = విస్తారమైన; బోధ = జ్ఞానమున్నూ; ఆనంద = ఆనందము యొక్కయున్ను; రస = రసముతో; ఘన = ఘనీభవించినట్టి; భో = బలరామా!; జయ = జయించుమా

4. లోకబంధు ఫణితం = లోకబంధువైన శ్రీకృష్ణస్వామి వారిచేత చెప్పబడినటువంటి; ఏతతు = ఈకీర్తన; ఆశ్రిత శోకమూల హరణం = భక్తుల దుఃఖములకు హేతువైనదానిని హరించునట్టిదిన్నీ; భక్తసంసిద్ధి = భక్తులకు జ్ఞానసిద్ధిని; సాధక = కలుగజేయునట్టి; శ్రీహరి = శ్రీమన్నారాయణునియొక్క; భక్త = భక్తుడైనట్టి; నారాయణతీర్థ = నారాయణతీర్థులను; భరణం = లెస్సగా పోషించునట్టిది.

ప. ధ్యానించువారల నుద్ధరింపఁగల నీపరతత్త్వస్వరూపమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

అ. భక్తులకోరికవలన నిట్లవతరించిన పరదైవతంబవు. "నేను సామాన్య మనుష్యుఁడను" అని తలంపవలదు.

1. హిమవత్పర్వతమువలె మిగుల ధైర్యవంతుఁడవగు నోబలభద్రా! నీ పరాక్రమము, నీగంభీరస్వభావము, నీయద్భుతమగు సాహసము జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. వాఁడు దుష్టుఁడగు రాక్షసుడు. మనుష్యరూపమును దాల్చి మనల మోసపుచ్చ వచ్చినాఁడు. వాని సంహరింపుము.

2. ఆ ఆటలో నీవంతు ఇప్పుడే తీరిపోయినదిగదా! మరల వచ్చునంతలో నారాక్షసుని సంహరించిరమ్ము. ఓతాళధ్వజా! బలరామా! నీతో నాడు కొనుటవలననే యీతఁడు మనమిత్రుఁడని తలంపుకుము.

ఓజ్ఞానానందస్వరూపుడా! నీమాయ సకలలోకమును సృజించునది గావున యెట్టి యద్భుతకార్యమునైనను ఆచరింపఁగలదు. నీవు సంసారబంధము లేనివాఁడవయ్యును ఇప్పుడు అజ్ఞానముగలవానివలె నటింపుచున్నావు. నీకు నమస్కారము.

4. ఇది సకలభక్తులకును మోక్షము నొసంగుటకై, సమస్తదుఃఖములను నివారించుటకై, నారాయణతీర్థునిచే వర్ణింపఁబడిన శ్రీకృష్ణవాక్యము.

శ్లో. జఘాన బలభద్రస్తం శ్రీకృష్ణేన ప్రచోదితః,
ప్రలంబం ముష్టినా మూర్ధ్ని ప్రలంబో పి పపాత చ.

22. శ్లో॥ శ్రీకృష్ణేన = శ్రీకృష్ణునిచేత; ప్రబోధితః = ప్రేరేపించబడినవాడై; బలభద్రః = బలరాములవారు; తం ప్రలంబం = ఆ ప్రలంబాసురుని; మూర్ధ్ని = తలమీద (శిరస్సునందు); ముష్టినా = పిడికిలిచేత; జఘాన = కొట్టెను; ప్రలంబఃఅపి = ప్రలంబాసురుడు అయితేనో; పపాతచ = మృతిజెంది నేలమీద బడెను.

ఇట్లు శ్రీకృష్ణుడు ప్రేరేపింపఁగానే బలరాముఁ డాప్రలంబాసురుని తలపైఁ బిడికిటితోఁ బొడిచెను. వాఁడును అవ్రేటున మృతినొందినేలపైఁ గూలెను.

శ్లో. అఘాసురబకాసురప్రముఖ కంసదూతాసురాః
హతాస్తు హరిణా గుణవ్యతికరప్రసూతాః ఖలాః,
వనే విచరతాఘనే వకుళమంజరీపుంజకే
స్రవన్మధురఘురీచరద్భ్రమరకామవిద్యాగురౌ

23. శ్లో॥ గుణవ్యతికరప్రసూతాః = గుణముల వైపరీత్యముచేత పుట్టినటువంటివిన్నీ; ఖలాః = దుర్మార్గులైనట్టివిన్నీ; అఘాసుర, బకాసుర ప్రముఖ కంసదూతాసురాః = అఘాసురుడు, బకాసురుడు, మొదలగు కంసదూతలగు; అసురాః = రాక్షసులు; స్రవన్............గురౌ; స్రవన్ = స్రవించుచుండునట్టి; మధుఝరీ = మకరంద ప్రవాహమునందు; చరత్ = సంచరించుచుండు; భ్రమర = తుమ్మెదలగు; కామవిద్యాగురౌ = కామవిద్యను నేర్చునట్టి; వకుళమంజరీ పుంజకే = పొగడ చెట్లయొక్క పుష్పగుత్తుల సమూహముగల్గిన; ఘనవనే = దట్టమైన వనమునందు; విచరతా = సంచరించుచుండునట్టి; హరిణా = శ్రీకృష్ణస్వామివారిచేత; హతాః = చంపబడిరి.

ఇట్లు శ్రీకృష్ణుఁడు మకరంద ప్రవాహములలోఁ దిరుగుతుమ్మెదలకు కామవిద్యం గఱపుచు, పొగడలు మొదలగు నానావిధవృక్షములతోడను, సుగంధవంతములగు పూలగుత్తులతోడను రాజిల్లుబృందావనమున సంచరింపుచు బాలుఁడై యుండియే కంసునిదూతలగు నఘాసురుఁడు, బకాసురుఁడు మొదలగు దుష్టులనెల్ల సంహరించెను. వారు శ్రేష్ఠములగు కులములందుఁ బుట్టియు సద్గుణముల విడుచుటచే నిట్లైరి.

*దావా నలభక్షణము*

శ్లో. దృష్ట్వా దావానలం బాలాః కృష్ణ కృష్ణేతి చుక్రుశుః,
గృహీత్వాంజలినా కృష్ణో దావానలమభక్షయత్

24. శ్లో॥ బాలాః = గోపబాలకులు; దావాలనం = కార్చిచ్చును; దృష్ట్వా = చూచి; కృష్ణ కృష్ణ ఇతి = కృష్ణా కృష్ణా అని; చుక్రుశుః = అరచిరి; కృష్ణః = కృష్ణుడు; దావాలనం = కార్చిచ్చును; అంజలినా = దోశలిచే; గృహీత్వా = తీసికొని; అభక్షయతు = భక్షించెను.

అంత నొకప్పుడు కార్చిచ్చు వనమునఁ గ్రమ్ముకొనఁగా దానింజూచి బాలకులు "ఓకృష్ణా! మమ్ముఁ గావుము" అని యాక్రోశించిరి. తక్షణమే యాకృష్ణుఁడును ఆదావానలమును చేతిలోనికిఁ దీసికొని మ్రింగెను.

శ్లో. జీర్ణో దావానలో యస్య జాఠరేణ మహాత్మనః,
బాలా స్తమస్తువ౯ కృష్ణం వేదాంతైర్యస్తు లక్ష్యతే

25. శ్లో॥ మహాత్మనః = మహాత్ముడైనటువంటి; యస్య = ఎవనియొక్క; జఠరేణ = జఠరాగ్నిచేత (ఉదరమందు); దావానలః = కార్చిచ్చు; జీర్ణః = జీర్ణించెనో; వేదాంతైః = ఉపనిషద్వాక్యముచేత; యః +తు (యస్తు) = ఎవరైతే; లక్ష్యతే = తెలియబడుచున్నారో; తం కృష్ణం = అకృష్ణుని; బాలాః = గోపాలకులు; అస్తువన్ = స్తోత్రముచేసిరి; బాలా! = తం (బాలాస్తం) = నిన్ను గోపబాలకులు; తం + అస్తువన్ (తమస్తువన్) = స్తోత్రము చేసిరి.

ఆదావాగ్నియు నాకృష్ణునియుదరమున జీర్ణమయ్యెను. జఠరాగ్ని తనయట్టి మఱియొక్క యగ్నిని జీర్ణముచేసెననుటయెంత విచిత్రము. వేదాంతవాక్యములచే నపరిమితప్రభావము కలవాఁడని కీర్తింపఁబడు పరబ్రహ్మమున కశక్యమేమున్నది? అప్పుడా బాలకులందఱు నాపరమేశ్వరు నిట్లని వినుతించిరి.

శ్లో. శ్రీగోపాలక మేకమేవ పరమం దైవం సదా మానయే
శ్రీవత్సాంకితవక్షసం శ్రితజనాధారం సమారాధయే,
అమ్నా యాంతసరోజహంస మఖిలానందాత్మకం శాశ్వతం
కుక్షిస్థాఖిలలోక రక్షకమముం గీర్వాణగేయం ప్రభుమ్.

26. శ్లో॥ శ్రీవత్సాంకిత వక్షసం = శ్రీవత్సమనే గుర్తుగల వక్షస్థలముగలవారున్నూ; శ్రితజనాధారం = ఆశ్రిత జనులకు అధారుడున్నూ; అమ్నాయాంత సరోజహంసం = వేదాగ్రములైన ఉపనిషత్తులకు హంసవంటివాడున్నూ; అఖిలా నందాత్మకం = పరమానంద స్వరూపుని; అఖిల = ఖిలముగాని (విచ్ఛిన్నముగాని); ఆనంద = ఆనందమే; ఆత్మకం = స్వరూపముగా గలవాడున్నూ; శాశ్వతం = సనాతనుడున్నూ, శాశ్వతమైనవాడున్నూ; కుక్షిస్థాఖిలలోక రక్షకం = తనగర్భముననే సకలలోకములను నిలిపికొని పాలించువాడున్ను; కుక్షి = కుక్షియందు; స్థ = ఉన్నటువంటి; అఖిలలోక = సమస్తలోకములకు; రక్షకం = రక్షకుడున్నూ; గీర్వాణగేయం = దేవతలచేత గానము చేయబడుచుండువాడున్నూ; ప్రభుం = ప్రభువున్నూ; పరమందైవం = సర్వాధిష్టాన దైవమైనటువంటిన్నీ; అముం = ఈ; శ్రీగోపాలకం = శ్రీకృష్ణస్వామిని; ఏకమేవ = ఒక్కనినే; సదా = ఎల్లప్పుడును; మానసే = మనస్సునందు; సమారాధయే = లెస్సగా ఆరాధించెదము.

ఈగోపాలకృష్ణుఁ డొక్కఁడే పరమదైవంబని సన్మానించెదను (ము) ఆశ్రితులగువారలకు నాధారభూతుఁడై, శ్రీవత్సమనియెడు చిహ్నముతో నొప్పు నీ కృష్ణునిఁ బూజించెదను (ము). వేదాంతములనియెడి కమలములకు హంసవంటివాఁడవును, పరమానందస్వరూపుఁడును, నిత్యుఁడగు నీదేవదేవుఁడే తనగర్భమునందు సకలలోకములను నిలిపికొని పరిపాలించుచున్నాఁడని దేవతల చేతఁగూడఁ గొనియాడఁబడుచున్నాఁడు.

కాంభోజీరాగము - ఆదితాళము

ప. శ్రీగోపాలక మేవ దైవతం హృదయే

అ. ఆగమారవిందబృందహంస మాకలయే

1. సర్వలోకైకశరణ్య చరణారవిందం
దుర్వినీతమదభంగదోర్దండబృందం
నిర్వి శేషనిరంతరనిర్మలానందం
గీర్వాణగంధర్వకోటిగీత గోవిందం

2. నిజజనస్వర్గాపవర్గనిత్యదాతారం
అజ మవ్యయ మాదిదేవ మనుపమాచారం
విజయసారథి మశేషవిదుషా మాధారం
భుజబలనిర్జితవైరిభూపాలశూరం

3. లక్షితసర్వభువనలక్షణ మేకం
పక్షిరాజవాహనం విపక్షశిక్షకం
కుక్షిగతజగదండకోటిధారకం
అక్షీణగోకులనివాసలక్ష్మీనాయకం

4. నారదాదిముని గేయనామ ధేయకం
నామరూపనిర్వాహక మామ్నా యమానకం
వారిజాసనాదివినుతవారితశోకం
నారాయణానంద తీర్థానందదాయంకం

12వ కీర్తన - కాంభోజిరాగము - ఆదితాళం

ప॥ అగమ.................హంసం

ఆగమ = వేదములనెడు; అరవింద = కములములయొక్క; బృంద = సమూహమునకు; హంసం = హంసస్వరూపుడైన; శ్రీగోపాలకం = శ్రీకృష్ణుడు అనునట్టి; దైవతం = దైవతమును; ఏకం ఏవ = ఒక్కనినిఏ; హృదయే = హృదయమనందు; ఆకలయే = సేవించుచున్నాను.

సర్వలోకైక శరణ్య.................గీత గోవిందం

సర్వలోక = సమస్త జనులకు; ఏక = ఒక్కడైన (ముఖ్యమై); శరణ్య = రక్షకుడైన; చరణారవిందం = పాదారవిందములు గలవాడున్నూ; దుర్వినీత = దుర్మార్గులయొక్క; మద = గర్వమును; భంగ = అణచెడు; దోర్దండ = భుజములయొక్క; బృందం = సమూహములుగలవాడున్నూ.

నిర్విశేష .................................. అనంతం

నిర్విశేష = ప్రకృతి సంబంధముగానట్టిన్నీ, అప్రాకృతమైనట్టిన్నీ; నిరంతరం = తెంపులేనట్టిన్నీ; నిర్మల = దుఃఖములేనట్టి అనగా మాలిన్యములేనట్టి; అనంతం = ఆనందస్వరూపుని.

గీర్వాణ.................... గోవిందం

గీర్వాణ = దేవతలయొక్కయు; గంధర్వ = గంధర్వులయొక్కయు; కోటి = సమూహముచేత; గీత = గానము చేయబడుచుండెను; గోవిందం = ఆత్మానంద స్వరూపుడు అయినటువంటి స్వామివారిని సేవించుచున్నాము.

2. నిజజన = తన భక్తులకు; స్వర్గ = స్వర్గసుఖమును; అపవర్గ = మోక్షసుఖమును; నిత్య = ఎల్లప్పుడున్నూ; దాతారం = ఇచ్చుచున్నట్టివాడున్న; అజం (న+జం) = కర్మవశమైన జన్మలేనివాడున్నూ; అవ్యయం = వికారములు లేనివాడున్నూ; ఆదిదేవం = ఆది దేవుడున్నూ; అనుపమాచారం = అసమాన నడకగలవాడున్నూ; విజయసారథిం = అర్జునునకు సారథ్యము చేయువాడున్నూ; అశేష విదుషాం = సమస్త విద్వాంసులకున్నూ; ఆధారం = అధారమైనవాడున్నూ

భుజబల నిర్భిత......................వైరిభూపాలశూరం

భుజబలం = భుజబలముచేత; నిర్భిత = జయింపబడిన; వైరిభూపాలశూరం = శూరులగు శత్రురాజులుగల స్వామివారిని; ఆకలయె = సేవించుచున్నాను.

3. రక్షత........... ... ..... ...లక్షణం

రక్షత = తనచేత రక్షింపబడుచుండెడు; సర్వభువన = సమస్త జగత్తు; లక్షణం = తన్ను తెల్పునట్టి గుర్తుగా గలవాడున్నూ, ఏకం = ఏకస్వరూపుడున్నూ, పక్షిరాజవాహనం = గరుడవాహనుడున్నూ, విపక్షశిక్షకం = శత్రువులను శిక్షించువాడున్నూ; కుక్షిగత = తన ఉదరమందు వున్నట్టి; జగదండకొటి = బ్రహ్మాండకోట్లకు, ధారకం = ఆధారుడై ధరించియుండెడువాడున్నూ; అక్షీణ = క్షీణదశలేని; గోకుల = గోకులమునందు, నివాస = నివశించియున్నట్టి; లక్ష్మినారాయణ = శ్రీవిష్ణుస్వరూపుడున్నూ అగు స్వామివారిని సేవించెదను.

4. నారదాది................. ఆనందదాయకం

నారదాది = నారదుడు మొదలైన; ముని = వేదార్థమనన శీలురచేత; గేయ = గానము చేయబడుచుండెను; నామధేయకం = నామధేయము కలవాడున్నూ; నామరూప = రూపమేలేని జీవకోటికి నామరూపములు; నిర్వాహకం = ప్రవర్తించేయుచుండెడివాడున్నూ

(ఆమ్నాయ మానకం)

వారిజాపనాది వినుతం = బ్రహ్మాదులచేత స్తుతులందబడు చుండెడివాడున్నూ; వారితశోకం = నివారించబడీన శోకము గలవాడున్నూ; నారాయణానంద తీర్థ = నారాయణానందతీర్థులకు; ఆనందదాయకం = ఆనందమునిచ్చువాడున్నూ అగుగోపాలకుని; ఆకలయే = సేవించుమా!

ప-అ. వేదాంతవేద్యుఁడగు నీ గోపాలకృష్ణునే పరమదైవముగా మనసున భావించెదను.

1. సకలలోకములకును ఈమహాత్ముని పాదపద్మములే శరణములనియు, అపరిచ్ఛిన్నమగు పరమానందమే స్వరూపముగా గలిగిన యాపరమేశ్వరుఁడే దుష్టుల సంహరించి, శిష్టులఁ బ్రోచుననియు దేవతలును, గంధర్వులును గానములు సేయుచుందురు.

2. జన్మనాశములులేక యనాదియై బహువిధములగు విచిత్రములఁ జేయుచునుండు నీపార్థసారథియే తనభుజబలముచే లోకములకు శత్రువులగు దుష్టరాజులసంహరించి, తనవారలకు స్వర్గ మోక్షముల నీఁగలడు. భక్తులకెల్లరకు నిమ్మహాత్ముఁడే కదా యాధారము.

3. గరుడవాహనుండగు నీనారాయణుండే దుష్టులశిక్షించి (శ్రీకృష్ణునకు శత్రువులు అధర్మపరు లగుదుష్టులే గావున నిట్లు చెప్పఁబడెను) లోకములఁ బ్రోచువాఁడు. ఈయన తనగర్భమునందే సర్వలోకములనుంచు కొనియున్నవాఁడైనను, గోకులమున సామాన్యబాలరూపముతో నివసించుచున్నాఁడు.

4. నారదాదులగు యోగులును, బ్రహ్మాదిదేవతలును, వేదములును "ఈదేవదేవుని నామమమును స్మరించుటయే సకలసుఖముల నొసంగును. ఈమహాత్మునిచేతనే ప్రపంచమునందలి నామరూపములు నిర్వహింపఁబడుచున్నవి" అని చెప్పుచున్నవి. ఈభగవంతుఁడే నారాయణతీర్థమునికి నానందము నొసంగుచున్నాఁడు.

శ్లో. ఇత్థం గోపాలకై ర్గీతో భగవా న్ భక్తకామదః,
గోభిర్గోపాలకైః కృష్ణో గోకులం పున రాగతః
ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణగోపాలవర్ణనంనామ - చతుర్థతరఙ్గః.

27. శ్లో॥ భక్తకాముదః = భక్తులకు కోరికల నొసంగెడు; భగవాన్ = కృష్ణస్వామివారు; గోపాలకైః = గోపాలకులచేత; ఇత్థం = ఈప్రకారము; గీతః = స్తోత్రము చేయబడినవారై; గోభిః = గోవులతోనున్నూ; గోపాలకైః = గోపాలకులతోనున్నూ; కృష్ణః = శ్రీకృష్ణస్వామివారు; గోకులం = గోకులమును గూర్చి; పునరాగతః = తిరిగివచ్చిరి.

ఇట్లు భక్తుల యభీష్టములనొసంగు నాహరి గోపబాలకులు తన్నుస్తుతించుచుండ గోవులతోఁగూడి మరల గోకులమునకు వచ్చెను.

## శ్రీకృష్ణలీలా తరఙ్గణిలో చతుర్థ తరఙ్గమునకు

ప్రతిపదార్థము పరిపూర్తి.

# పఞ్చమ తరఙ్గము

శ్లో. గోపీవస్త్రాపహారాఖ్యం చరిత్ర మభినీయతే.
గోవర్ధనాద్రే రుద్ధార శ్చరితం హరిణా కృతమ్.
పాత్రప్రవేశ స్తుపునర్నందో గోప్య స్తతః పరం,
బలకృష్ణౌ తతః కృష్ణకృతం వస్త్రాపహారణమ్.
ఉద్ధృత్య రక్షితే చాస్మి న్ గోకులే ద్రిం కృతా స్తుతిః,
ఇంద్రేణ కామధేన్వా చ కృష్ణ స్యా త్రైవ సంగ్రహః.

*కథా సంగ్రహము*

1వ శ్లో॥ హరిణాకృతం = శ్రీకృష్ణస్వామివారివల్ల చేయబడినటువంటి; గోపీవస్త్రాపహరణ చరిత్రం = గోపీవస్త్రావహరణము అనుపేరుగల కథయున్నూ; గోవర్ధనాద్రేః ఉద్ధారః చరితం = గోపీవస్త్రాపహరణము అనుపేరుగల కథయున్నూ; అభినీయతే = వర్ణింపబడుచున్నది.

2వ శ్లో॥ పునః = తిరిగి; నందః = నందుడున్నూ; తతఃపరం = దానికితర్వాత; గోప్యః = గోపికయున్నూ, గోపికలున్నూ; తతః = అనంతరమందు; బాలకృష్ణౌ = బలరామకృష్ణులును; పాత్రప్రవేశః = పాత్రలు ప్రవేశించుటయున్నూ; కృష్ణకృతం = కృష్ణునిచేత చేయబడిన; వస్త్రాపహారణం = వస్త్రములు దొంగిలించుటయందు

3వ శ్లో॥ అద్రిం ఉద్ధృత్య = పర్వతమును ఎత్తుటయున్నూ; అస్మిన్ గోకులే రక్షణేచ = ఈ గోకులమురక్షింపబడగానున్నూ; ఇంద్రేణ = ఇంద్రునిచేతనున్నూ; కామధేన్వాచ = కామధేనువుచేతనున్నూ; అత్రైవ = ఈ తరంగమునందే; కృష్ణస్య స్తుతిఃకృత = కృష్ణుని గూర్చిన స్తోత్రము చేయబడినది; ఇతి సంగ్రహః = ఈవిధముగా సంక్షిప్తముగా చెప్పబడినది.

ఈ అయిదవతరంగమున గోపీవస్త్రముల నపహరించుటయు, గోవర్ధన పర్వతమునెత్తుటయు ననురెండు చరిత్రములు వర్ణింపఁబడును. ఇందు నందుఁడును, గోపికలును, బలరామకృష్ణులును, వనమునకుఁబోవుటయు, అప్పుడు కృష్ణుఁడు గోపికలవస్త్రముల నపహరించుటయు, మఱియొకప్పుడు గోవర్ధన పర్వతమునెత్తి గోకులమును రక్షింపఁగా నాశ్చర్యపడి యింద్రుఁడును, కామధేనువును వచ్చి యాఘనుని వినుతించుటయు ననునది కథాసంగ్రహము.

*గోపీవస్త్రాపహరణము*

శ్లో. నితంబినీగణం హ్రదే దిగంబరం విలోక్య తత్
వరాంబరం బహిఃస్థితం కరాంబుజే సముద్వహన్,
బహూన్న తేతటద్రుమే మహోన్నతో హరిః స్థితో
వదన్ విచిత్రనర్మ తం హసన్నగాయతే భృశమ్.

4. శ్లో॥ హరిః = శ్రీకృష్ణుడు; హ్రదే = మడుగునందు; దిగంబరం = వివస్త్రలైన; నితంబినీగణం = స్త్రీసమూహమును; విలోక్య = చూచి; బహిఃస్థితం = వెలుపల వున్నటువంటి; తద్వరాంబరం = ఆగోపికలయొక్క శ్రేష్ఠమైన వస్త్రములను; కరాంబుజే = హస్తకమలములయందు; సముద్వహన్ = వుంచుకొని; బహూన్నతే = మిక్కిలి ఎత్తైన; తటద్రుమే = తీరవృక్షములందు; మహోన్నతః = పూజ్యులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు; స్థితః = ఉన్నటువంటివాడై; తం = ఆ స్త్రీగణమునుగూర్చి; హసన్ = నవ్వుచూ; విచిత్ర = అద్భుతమైన; నర్మ = పరిహాసవాక్యములను; వదన్ = చెప్పుచూ; సః = ఆశ్రీకృష్ణుడు; భృశం = మిక్కిలి; గాయతే = గానము చేయుచున్నారు.

గోపికలందఱును తమవస్త్రముల గట్టుననుంచి మడుగలోనికిదిగంబరులై ప్రవేశించి స్నానము చేయుచుండిరి. అప్పుడు కృష్ణుఁడు వచ్చి గట్టుననున్న వస్త్రములఁ దీసికొని అత్యున్నతమగు నొకవృక్షము ప్రక్కనుండఁగా దానిపై నెక్కి నగుచు, నద్భుతములగు పరిహాసవాక్యములఁ బల్కుచుండెను. ఈవిషయము నొకరు గోపికలతోఁ జెప్పిరి.

శ్లో. బధ్వా దుకూలం శాఖాగ్రే కుతూహలతయా హరిః,
వల్లవీవల్లభః కృష్ణో హసన్నిదమువాచ తాః

5. శ్లో॥ వల్లవీ వల్లభః = గోపికలకు భర్తఅయినటువంటిన్నీ; హరిః = శ్రీమన్నారాయణుడు అయినటువంటిన్నీ; కృష్ణః = శ్రీకృష్ణస్వామినారు; కుతూహలతయా = కోరిక కలవారై; దుకూలం = వస్త్రములను; శాఖాగ్రే = కొమ్మల కొనభాగములందు; బధ్వా = కట్టినటువంటివాడై; తాః = ఆ స్త్రీలనుగూర్చి; హసన్ = పరిహాసముగా; ఇదం = ఈక్రింద చెప్పబోవు వాక్యములను; ఉవాచ = చెప్పెను (పలికెను)

ఆ శ్రీకృష్ణుఁడును అట్లు వృక్షముపై కెక్కి తనచేతనున్న వస్త్రములనొకమూఁటగాఁగట్టి యొకకొమ్మకు వ్రేలవైచి నవ్వుచు నాగోపికలతో న్వయముగా నిట్లనియె. (వారల కీహరియందు మిగుల ననురాగముండుటచే నాయన చేసిన కార్యము వారలకు వేడుకగా నుండెను.

కేదారగౌళరాగము - త్రిపుటతాళము

ప. ఆయాహి వ్రజయువతిబృంద త్వరయా
మాయాహి సలిలే దూరం

అ. ఆయాసో మా భవతు అల మధునా తవ
తోయక్రీడయా పరయా

1. పరిణామవిరసఫలోదయకర్మణి - పాటవ మతివితథం
పరిణామవిరహిత పరమపురుష మేవ - భజ జగదేకనాథం

2. పరిగృహాణ భువనబాహ్యదృగావరణం - పరిహరసి వృథాకథం
పరమబాంధవస్తవ ప్రకటమేవ వదతి - పరిహర ఖేలనబంధం

3. ఆనందమయభవనే తవ జననీ - సానందమనుసరతి
మాయాతీతవపుషం మాధవమేవ జనకం - మానయమాన యసతి

4. హరివిరచితపరిహాసకథారసగౌరవసంస్మరణం
గురుభక్త శివనారాయణతీర్థకృతమిదం - గోవిందజనభూషణం

1వ - కీర్తన - కేదారగౌళ - త్రిపుటతాళం

వ్రజయువతీబృంద = ఓ గోపికాసమూహమా; త్వరయా = తొందరగా; ఆయాహి = రండి (రావలసినది); సలిలే = నీళ్ళయందు; దూరం = దూరముగా; మాయాహి = పోవద్దు; ఆయాసః = ఆయాసము; మా భవతు = పొందవద్దు; తవ = మీయొక్క; పరయా = శ్రేష్ఠమైన; తోయక్రీడయా = జలక్రీడచేయుట; అధునా = ఇప్పుడు; అలం = చాలును

1. పరిణామ = పర్యవసానమందు; విరస = రసహీనమైన (సుఖహీనమైన); ఫల = ఫలములను; ఉదయ = ఉదయించెడు (కలిగించెడు; కర్మణి = వ్యాపారములయందు; పాటవం = అభినివేశము (అత్యంతశక్తి); అతివితథం = కేవలం వ్యర్థము, పరిణామవిరహిత = ఏమార్పు లేనటువంటి; పరమపురుషం = పరమపురుషుడైనటువంటివాన్ని; జగదేకనాథం ఏవ = జగత్తుకు ఒక్కడే నాధుడైనటువంటి స్వామివారిని, భజ = భజింపుమా

2. భువన = లోకులయొక్క (లోకములయొక్క); బాహ్యదృక్ = బాహ్యదృష్టికి, ఆవరణం = అడ్డముగా నుండునట్టి వస్త్రములు; పరిగృహాణ = స్వీకరింపుము; వృధాకథం = వృధాగా యెందుకు; పరిహరసి = విడిపించెదరు; తవ పరమబాంధవ = నీయొక్క పరమబంధువగు పరమపురుషుడు నేను, ప్రకటమేవ = సత్యమునే; వదతి = చెప్పుచున్నాను; ఖేలన బంధం = బంధరూపమైన క్రీడను: పరిహర = విడచిపెట్టుడు.

3. ఆనందమయ భవనే = ఆనందమయ కోశమునందు; తవజననీ = మీకుజన్మస్థానమైన మూలప్రకృతి, సానందం = ఆనందస్వరూపుడైనట్టివాన్ని; మాయాతీతవపుషీం = మాయకులోబడని శరీరము గలిగినటువంటివాన్ని; జనకం = తండ్రి అయినట్టివాన్ని; మాధవం + ఏవ = శ్రీకృష్ణుడినే; అనుసరతి = అనుసరించుచున్నది; మానయమానయ = గౌరవించండి, గౌరవించండి.

4. హరివిరచిత = శ్రీకృష్ణస్వామివారిచేత రచింపబడిన; పరిహస = చౌర్య సంభాషణరూపమైన, కథా = వృత్తాంతమందలి; రస = ఆనందముయొక్క; గౌరవ = శ్రేష్ఠమును; సంస్మరణ = జ్ఞాపకము చేయునట్టిదిన్నీ; గురుభక్తి = ఆచార్యభక్తిగలిగిన; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులచేత; కృతం = చేయబడినట్టి; ఇదం = ఈకీర్తన; గోవిందజనభూషణం = హరిదాసులకు ఆనందముగానున్నది.

ప. ఓగోపికలారా! త్వరగా నిటు రండు నీటిలో దూరమునకుఁ బోవకుఁడు.

అ. శ్రమపడవలదు. ఇంతవఱకు నొనర్చిన జలక్రీడ చాలును.

1. ఏపనిఁజేసినను దానివలనఁ గలుగుఫలము అంతమునకు నీరసమైపోవును. కావున నట్టికర్మలయందు సామర్థ్యమును సంపాదించుకొనుట మిగుల వ్యర్థము. ఇట్లగుటచే అంత మెన్నటికినిలేక యేమార్పును జెందక నుండుసకల లోకేశ్వరుఁడగు పరమపురుషుని (నన్ను) సేవింపుఁడు.

2. నీటియొడ్డునఁ బెట్టిపోయినవస్త్రములఁ గైకొనుఁడు. ఇట్లేల నూరకున్నారు. నేను మీకు ముఖ్యబంధుఁడను. నామాట వినుఁడు ఇఁక నాటఁజాలింపుడు.

3. ఆనందపరిపూర్ణములగు గృహములయందున్న మీతల్లులు వెనుకనే వచ్చుచున్నారు. సకలలోకములకును కారణభూతుఁడనై, మాయ నతిక్రమించినవాఁడనైయున్న నను శ్రీఘ్రముగఁ బూజింపుఁడు.

4. భక్తులకు సంతసముగలుగునట్లుగా నారాయణతీర్థులు కృష్ణుఁడు గోపికలతో నాడిన పరిహాసవాక్యము లనియెడునమృతము నీగీతమునందుఁ బొందుపఱచె.

శ్లో. గోవిందం గోపికానందం వదంతం నర్మశర్మదం,
పున్నాగవిటపాగ్రస్థం పుణ్యపుంజఫలోదయమ్.
భక్తానుగ్రహసువ్యగ్రగృహీతాద్భుతవిగ్రహం,
ఇత్థం గోప్యో జగుః కృష్ణం కంఠదఘ్నజలే స్థితాః.

7. శ్లో॥ కంఠదఘ్నజలే స్థితా = కుత్తుకబంటినీళ్ళలో నిలిచివుండునటువంటి; గోప్యః = గోపికలు; శర్మదం = సుఖప్రదమైన; నర్మ = పరిహాస వాక్యములను; వదంతం = పలుకుచున్నటువంటిన్నీ; గోపికానందం = గోపికలకు ఆనందము కలిగించుచున్నటువంటిన్నీ; గోవిందం = గోవిందుడైనటువంటిన్నీ; పున్నాగవిటపాగ్రస్థం = పున్నాగచెట్టుకొనయందు కూర్చున్నటువంటిన్నీ; పుణ్యపుంజఫలోదయం = పుణ్యకర్మసమూహములకు ఫలమును యిచ్చినటువంటిన్నీ

భక్త................................. విగ్రహం

భక్త = భక్తులయందు; అనుగ్రహ = దయజూపుటకు; సువ్యగ్ర = తొట్రుబాటుతో; గృహీతా = గ్రహించబడిన; విగ్రహం = మూర్తిగలిగినట్టి; కృష్ణం శ్రీకృష్ణునిగూర్చి; ఇత్థం = ఈచెప్పబోవు విధముగా; జగుః = గానముచేసిరి.

భక్తులననుగ్రహించుటకై మనుష్యరూపమును ధరించి గోపికల పూర్వపుణ్యఫలమున విహరింపుచుండు నామానవుఁడు పున్నాగవృక్షముపై నెక్కి కూర్చుండి తమతోఁ బరిహాసములాడుట విని యాగోపికలు కంఠములోఁతు నీటియందు నిలిచి యిట్లని గానము చేసిరి.

పునాగవరాళిరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | శ్రీకృష్ణ తావకమహిమా | కేన వర్ణ్యతే |
| అ. | లోకాలోకనావరణం | లోకేశ దేహి నౌమి తే |
| 1. | పున్నాగరాజాధిరూఢ | పురుషోత్తమ |
| | ఉన్నతవంశవిస్తార | ఛిన్నపాపాఖండిత |
| 2. | శాఖాగ్రలక్ష్యసద్విగ్రహ | శం విధేహి భో |
| | శోకసాగరా దుద్ధర మాం | శుద్ధభావం సందర్శయ భో |
| 3. | నందయశోదానందన | నళిననాభ |
| | సుందరహాసవిలాస | సూచితై రలం విమలాభ |

4. సర్వకామాదిగుణాకర సర్వపాలక
శర్వరీనాయకానన శాతకుంభవర్ణవసన
5. గోవింద కిం కరవామ గోపబాలక
నవ్యగోపీగీతమిదం నారాయణతీర్థరచితం

2వ కీర్తన - పున్నాగవరాళి - ఆదితాళం

ప॥ శ్రీకృష్ణ! = శ్రీకృష్ణమూర్తీ; తావక మహిమ = నీయొక్క మహిమను; కేన = ఎవనిచేత; వర్ణ్యతే? = వర్ణించబడగల్గును?

అ॥ లోకాలోకనా వరణం = ; లోక = జనులయొక్క; ఆలోకన = చూపును; అవరణం = అవరించునట్టిదానిని (అనగా వస్త్రమును); లోకేశ = హేస్వామీ! (లోకనాధా!), దేహి = ఇవ్వండి; తే = మీకు; నౌమి = నమస్కరించుచున్నాము.

1. పున్నాగరాజాధిరూఢ =; పున్నాగ = పున్నాగచెట్లలో; రాజా = శ్రేష్ఠమైనదానిని; అధిరూఢ = ఎక్కివున్నటువంటి; పురుషోత్తమా = పురుషశ్రేష్ఠుడా; ఉన్నతవంశవిస్తార = శ్రేష్ఠమైన వంశమును విస్తరింపజేసినవాడా; ఛిన్నపాప = పాపమును ఛేదించినవాడా (పాపములులేనివాడా); అఖండిత = ఇతరులవల్ల ఆక్షేపించబడుటకు వీలులేనివాడా.

2. శాఖ అగ్ర = కొమ్మకొనయందు; లక్ష్య = కనుబడుచుండు; సద్విగ్రహ = దివ్యమంగళమైన మూర్తిగల; భో = హే స్వామీ!; శం = సుఖమును; విధేహి = కలుగజేయుము (విధించుము); మాం = మమ్ములను; శోకసాగరాత్ = దుఃఖసముద్రమునుండి; ఉద్ధర = ఉద్ధరించుమా; భో = హే ప్రభో! (హే స్వామీ!); శుద్ధభావం = అప్రాకృత స్వరూపమును; సందర్శయ = చూపించుమా

3. నందయశోదానందన = నందయశోదలకు కుమారుడా; నళిననాభ = హే పద్మనాభా!; విమలాభ = నిర్మలమైన ప్రకాశముగలవాడా!; సుందర = సుందరమైన; హాస = నవ్వుయొక్క; మాస = వైఖరిచేత; సూచితైః = సూచింపబడు విషయములు; అలం = చాలును.

4. సత్యకామాదిగుణ = సత్యకామత్వము మొదలగు గుణములుగలవాడు వ్యర్థముగాని కోరికలు గలవాడా; సర్వపాలక = సమస్తమును పరిపాలించువాడ; శర్వరీనాయక = రాత్రికి నాయకాధిపతి (చంద్రుడు); అనన = ముఖముగలవాడా; శాతకుంభవర్ణ = బంగారువర్ణముగలిగిన; వసన = వస్త్రములు గలవాడా (పీతాంబరధరుడా)

5. గోపబాలక = గోపబాలకుడైన; గోవింద = ఓ కృష్ణా; కిం కరవామ = ఏమిచేయుదము; నవ్య = వినోదమైన (చిత్రమైన); గోపీగీతం = గోపికలవల్ల గానము చేయబడినట్టి; ఇదం = ఈకీర్తన; నారాయణతీర్థ = నారాయణతీర్థులచేత; రచితం = రచింపబడినది.

ప. ఓకృష్ణా! నీప్రభావము నెవ్వఁడు వర్ణింపగలఁడు?

అ. లోకులకుఁ గానరాకుండ శరీరము నావరించియుండు వస్త్రములు మాకిమ్ము. నీకు నమస్కరించెదము.

1. ఓపున్నాగవృక్షముపైనున్న కృష్ణా! నీవు పురుషులలో నుత్తముఁడవు. సద్వంశమునందు జనించినవాఁడవు. దోషము లేవియును లేనివాఁడవు. ఇదివఱ కెవ్వరిచేతను నాక్షేపింపబడనివాఁడవు.

2. చెట్టుపై నేలదాఁగియుండెదవు. మాదుఃఖమును నివారించి సుఖముం గల్గింపుము. నీవు సద్గుణవంతుఁడగుటను నిదర్శనపూర్వకముగఁ జూపుము.

3. మనోహరములగు చిఱునగవులతోను, నిర్మలమగు దేహకాంతితోను బ్రకాశించు నోకృష్ణా! నీవు ఆదినారాయణుండవు. నందయశోదలకుఁ బుత్రుఁడవైతివి. మమ్మిఁకం గష్టపెట్టకుము.

4. పీతాంబరముతోను, చంద్రునివంటి ముఖముతోను రాజిల్లు నో కృష్ణా! నీ కేకొఱఁతయు లేదు. సకలజగత్తులను పరిపాలించుచుందువు.

5. ఓగోపాలకా! నారాయణా! మేమిప్పుడేమి సేయవలయును? ("ఏమి చేసిన మావస్త్రముల నిచ్చెదవు" అనుట) గోపికలు చెప్పిన వాక్యములను నారాయణతీర్థయతి గీతముగా రచించెను.

## శ్రీకృష్ణగోపీ సంవాదము

శ్లో. గోపీభిః ప్రార్థితః కృష్ణో గోవిందో భూర్యనుగ్రహం,
కుర్వాణ స్తాసు సంవాదం భూయో ప్యకృత సాదరమ్.

8వ శ్లో॥ గోవిందః = గోవిందుడైన; కృష్ణః = శ్రీకృష్ణస్వామివారు; గోపీభిః = గోపికా అమ్మవార్లచేత; ప్రార్థితః = ప్రార్థింపబడినవారై; తాసు = ఆ గోపికలయందు; భూర్యనుగ్రహం = గొప్ప కటాక్షమును; కుర్వాణః = చూపించుచున్నవారై; భూయఃఅపి = మరలగూడ; సాదరం = ఆదరముతో; సంవాదం = సంభాషణను; అకృత = చేసినవారైరి.

ఇట్లు గోపికలు ప్రార్థింపఁగానే, ఆశ్రీకృష్ణుఁడును వారియెడల నధికాను గ్రహముఁ జూపువాఁడై, మఱియొకమా రాదరపూర్వకముగా వారలతో నిట్లనియె.

ధన్యాసీరాగము - ఆటతాళము

కృష్ణః ఆవరణం మమన హితే దాతుం
భావయ గోపవధూజన బృంద

గోప్యః దేవ యదావరణం మమ నీతం
దేహి విభో భవతా తదనంత

కృష్ణః నీతం నైవ మయా పరకీయం
నైవ మమావరణం నిజదృష్ట్యా
గోప్యః ఆహ గృహాణ భవానితి పూర్వం
దేహి తదావరణం మమ బంధో
కృష్ణః అక్షినిమీలన మేవ మయోక్తం
సాక్షా దిహ తు గృహాణా వరణం
గోప్యః లోకాలోకనవిహితావరణం
లోకేశ్వర మమ దేహి సముదితం
కృష్ణ లోకస్యావరణం న విధాతుం
లోకే కో పి సమర్థః పురుషః
గోప్యః కశ్చన నాలోకయతి యథా స్మాన్
కలయ తథావిధ మేవావరణం
కృష్ణః లోక్యోనాలోకయతి హి లోకే
లోకం కశ్చన కమపి విరోధాత్
గోప్యః లోక్యా ఏవ వయం పరభోగ్యాః
లోకేశావరణం తు విధేహి
కృష్ణః తర్హి తదావరణై రల మల్పైః
తస్య న కించి దలోక్య మిహాస్తి
గోప్యః కి మిద మలౌకికసిద్ధావరణం
కే వా వయ మిహ లజ్జాభరణాః
కృష్ణః యుక్తిసహం నహి భవదావరణం
యోగిభి రితి మీమాంసిత మబలాః
గోప్యః అస్మాభిర్న విధేయం కి మపి
హ్యవగత మచ్చ్యుత తద్వద భగవన్
శివనారాయణతీర్థనుగీతం
శ్రీహరిగోపీజనసంవాదం

ప॥ తే = నీకు; దాతుం = ఇచ్చుటకు; మమ = నాకు

1. కృష్ణ:- ఆవరణం = వస్త్రము; నహి = లేదుకదా!; గోపవధూజనబృంద = ఓ గోపికా సమూహమా; భావయ = ఈ సంగతి ఆలోచించండి.

2. గోప్య:- దేవ = హేస్వామీ!; మమ యదావరణం = నాయొక్క ఏ వస్త్రము; భవతా = మీచేత; నీతం = తీసుకరాబడెనో; విభో! = ప్రభువు అయినట్టి; అనంతా! = హే అనంతుడా; తతు = దానిని; దేహి = ఇమ్ము

3. కృష్ణ :- మయా = నాచేత; పరకీయం = ఇతరులవస్తువు; న నీతం ఏవ = తీసుక పోబడనే లేదు; నిజ దృష్ట్యా = జ్ఞాన దృష్టిచేత చూచినచో; మమ = నాకు; ఆవరణం = వస్త్రము (అజ్ఞానం); న + ఏవ (నైవ) = లేనేలేదు.

4. గోప్య:- పూర్వం = ముందు; భవాన్ = మీరు; యత్, గృహాణ ఇతి = దీనిని తీసికొనుమని; అహ = పలికితిరో; తదావరణం = ఆ వస్త్రములను; మమబంధో! = నా బంధువైన ఓ కృష్ణా!; దేహి = ఇమ్మా!

5. కృష్ణ:- అక్షనిమీలనం ఏవ = కండ్లు మూసికొనుట మాత్రమే; మయ = నాచేత; ఉక్తం = చెప్పబడినది; ఇహతు = ఇక్కడైతేనో; సాక్షాత్ = ప్రత్యక్షముగా; ఆవరణం = వస్త్రములను; గృహాణ = తీసికొనుము.

6. గోప్య:- సముదితం = బాగాఏర్పడినటువంటిన్నీ; లోక ఆలోకన = లోకులచేత చూడబడుటకు వీలులేకుండా; విహిత = ఏర్పఱచబడిన; ఆవరణం = వస్త్రమును; లోకేశ్వర = హే జగన్నాథా!; మమ = నాకు (మాకు); దేహి = ఇమ్మా

7. కృష్ణ:- లోకస్య = చూచునట్టి ఎఱుకకు; ఆవరణం = అజ్ఞానము (వస్త్రము); విధాతుం = కలిగించుటకు; లోకే = లోకమునందు; కో + అపి పురుషః = ఏ పురుషుడున్నూ; న సమర్థః = సమర్థుడు కాడు

8. గోప్య:- కశ్చన = ఒకానొకప్పుడున్నూ; అస్మాన్ = మమ్ములను; యథా = ఏ ప్రకారముగా; న ఆలోకయతి = చూడజాలకయుండునో; తథావిధం = ఆవిధమైన; ఏవ + ఆవరణం = అటువంటి వస్త్రమునే; కలయ = ఇవ్వండి (ఇచ్చునటుల ఆలోచించండి)

9. కృష్ణ:- కశ్చన లోక్యః = ఒకానొక చూడబడుచుండునట్టి వస్తువు (దృశ్యము); లోకే = లోకమునందు; కమపిలోకం = ఏలోకమునున్నూ అనగా చేతనమునుగానీ, అచేతనమునుగాని; ఆలోకయతిః = చూడజాలడుకదా; విరోధాత్ = స్వభావవిరోధమగుటచే.

10. గోప్య:- వయం = మేము; లోక్యాఏవ = చూడబడుచునేయున్నాము; పరభోగ్యాః = ఇతరులచేత అనుభవింపబడుచూ వున్నాము; అతః = కావున; లోకేశ = లోకనాథా! శ్రీకృష్ణా!; ఆవరణంతు = వస్త్రములనైతేనో; విదేహి = ఇవ్వండి.

11. కృష్ణ:- తర్హి = అట్లయితే; అల్పైః = అల్పములైన; తదావరణైః = ఆ వస్త్రములచేత; అలం = చాలును; తస్య = ఆభగవంతునికి; ఇహ = ఇక్కడ; అలోక్యం (న+లోక్యం) = చూచుటకు వీలుకానిది; కించిత్ = కొంచమైనను; నాస్తి = లేదు.

12. గోప్య:- ఇదం = ఈ (మేముకోరిన వస్త్రములు)
అలౌకిక సిద్ధావరణం ............కిం? = లోకాకీతీతులకు తెలియదగినటువంటి అజ్ఞానమాయేమి? = కాదు (వస్త్రములు విషయములు గురించికదాః); వయం, ఇహ = మేము, ఇక్కడ; కేవా = ఎవరము (లోకాతీతులముకాము) స్త్రీలము; లజ్జా భరణాః = సిగ్గే అభరణములుగా గలిగిన స్త్రీలమైయున్నాము.

13. కృష్ణ:- భవదావరణం = మీయొక్క ఆవరణం (మీరుకోరే ఆవరణము); యుక్తినహం = యుక్తివాదములో స్థిరపడునది; నహి = కాదుగదా!; అబలాః = ఓ గోపికలారా; అత్ర = ఈ విషయమందు; యోగిభిః = యోగులచేత; మీమాంసితం = చర్చించబడియున్నది.

14. గోప్య:- అచ్యుత = నాశములేని; భగవాన్ = భగవంతుడా; అస్మాభిః = మాచేత; విధేయం = చేయదగినది; కిమపి (కిం+అపి) = ఏదియును; న అవగతం హి = గోచరించ లేదుకదా!; తత్......వద = అట్టి, కర్తవ్యమును చెప్పుము; శ్రీహరి గోపీజన, సంవాదం = శ్రీకృష్ణమూర్తికిని గోపికలకును జరిగిన సంభాషణను; శివ నారాయణతీర్థ = శివనారాయణ తీర్థులవారిచేత; సు గీతం = లెస్సగా గానము చేయబడినది.

కృష్ణ:- ఓ గోపికలారా! మీకిచ్చుటకు నాయొద్ద నావరణమే వస్త్రమే మాయావరణమే, అని రెండర్థములు ఈసంవాదమునం దంతయును ఈ ఆవరణశబ్దమునకుఁ గలవు) లేదు బాగుగ నాలోచింపుఁడు.

గోప్య:- ఓ అనంతుఁడా! నీవిప్పుడు మాయావరణముఁ గొనిపోయితివి గదా. దానిని మాకు మరల నిమ్ము.

కృ. నేను ఇతరుల యావరణము నెప్పుడును గొనిపోలేదు. బాగుగ విచారించిన లేక ఆత్మ నెఱింగియుండుటచే, నాకును ఆవరణములేదు.

గో. ఓయార్తశరణ్యా! మొట్టమొదట "యాయావరణములను దీసి కొనుఁడు" అని నీవు చెప్పయుంటివిగదా. కావున నాయావరణముల మాకిమ్ము.

కృ. నేనిప్పుడు "కన్నులుమూసికొని నీటిలోనుండి వెలుపలికి రండు అనిచెప్పితినిఁగాని వేరేమియునుఁ జెప్పలేదు. ఇప్పటికైనను అట్లుచేయుఁడు. దీనికంటె చక్కనియావరణము వేఱొకటిలేదు.

గో. ఓలోకనాయకా! అట్లుగాదు. లోకులదృష్టులకు గప్పుఁజాలు (ఇచ్చట లోకశబ్దమునకు సాక్షియనియుఁ బ్రపంచమనియు రెండర్థములు. ఇచ్చటనుండు సంవాదమునందంతయు నిట్లే గ్రహింపవలయును) నావరణమును మాకొసంగుము

కృ. లోకునికి (సాక్షిస్వరూపునకు) ఆవరణమును గల్గించుట యే పురుషుకును శక్యముగాదు. (లోకమున కావరణము గల్గించుట అనికూడ అర్థము)

గో. ఓస్వామీ! మమ్మెవ్వరును జూడకుండునట్లుగాఁ జేయఁగలయావరణమును దయచేయుము.

కృ. సాక్షిచే నెఱుంగఁబడు పదార్థ మేదియును సాక్షినిఁజూడనేరదు. అట్లచూచుననిన ప్రత్యక్షమునకు విరోధము వచ్చునుగదా! (లోక్యమనఁగా దృశ్యము) "గోపికలారా! మీరు పరమాత్మ స్వరూపులే గావునను. సాక్షియగు పరమాత్మ నేదియును జూడనేరదు గావునను, మమ్ముఁజూచువారు లేరు. కావున మీకు వస్త్రము లక్కఱలేదు" అని కృష్ణుఁడు చెప్పెను. ఈ యర్థము దెలిసికొననేరక యాగోపిక లీవాక్యమునకు వేరొకయర్థముచేసి కొనిరి. "చూపఁబడువస్తువులు తమనుజూచువస్తువులను మరలి చూడనేరవు. ఇట్లగుటచే మీరు పరులను జూచుచున్నారు గావున మిముఁ బరులుజూడనేవరరు" అనునది గోపికలు చేసికొనిన యర్థము.

గో. ఓలోకేశ్వరా! అట్లుగాదు. మేము పరులచేఁ జూడఁబడుచున్నాము. (ఇంద్రియములు చేయుపనులు చూచుట, వినుట మొదలగునవి యనుభవము లనఁబడును) కావున మాకు నావరణము నొసంగుము. ఇచట పరభోగ్య అనుశబ్దమునకు "పరమాత్మునిచేఁ జూడఁబడుచున్నాము" అని కృష్ణుఁడర్థముఁ జేసికొనియెను.

కృ. సరియే మీరాపరబ్రహ్మముచేఁ జూడఁబడువారేయైనచో నాతనికిఁ గానరాని పదార్థమేలేదు. కావున నీయావరణముతోనే పనిలేదు.

గో. నీవు లోకములోలేని యావరణమునుగూర్చి మాటలాడుచున్నావు మాకు సిగ్గుపోవుచున్నది.

కృ. ఓగోపికలారా! మీకావరణము గలదనుమాట వాదమున నిలువదు. (ఈవిషయమునుగూర్చి మాయావరణముగలదా లేదా యనువిషయమును గూర్చి) యోగులుగూడ విచారింపుచుందుము.

గో. ఓభగవంతుఁడా! నీవాక్యములవలన మీకేమియును తెలియలేదు. మేమేమి చేయవలయునో చెప్పుము. కృష్ణునకును, గోపికలకును జరిగిన యీ సంవాదము నారాయణతీర్థునిచే వ్రాయఁబడినది.

శ్లో. ఆబాల్య మేత ద్వ్యష్మాక మబలాః కేవలం మతం,
ఉభాభ్యా మేవ హస్తాభ్యాం గృహ్ణంతు వసనాని వః

9. శ్లో॥ అబలాః యుష్మాకం = స్త్రీలారా మీకు; ఏతత్ = ఇది, ఆబాల్యం = పుట్టినప్పటినుండియు, కేవలం మతమ్ = ఆచారముగా వున్నది; వః = మీరు; ఉభాభ్యామ్ - హస్తాభ్యామ్ - ఏవ = రెండైన చేతులతోనే; వసనాని - గృహ్ణంతు = వస్త్రములను తీసికొందురుగాక

ఓగోపికలారా! మీరెండు చేతులను పైకెత్తి మీవస్త్రముల నందికొనుఁడు. ఇది మీకు బాల్యమునుండియు తెలిసినవిషయమే కదా.

శ్లో. ఇత్యుక్త్వా వసనాన్యాసాం దత్వా గోపాలకైస్సహ,
అవరుహ్య తరోః కృష్ణః ప్రయయౌ స్వగృహం ముదా

10. శ్లో॥ వసనాని + ఆసాం (వసనాన్యాసాం); కృష్ణః = శ్రీకృష్ణస్వామివారు; ఇతి ఉక్త్వా = ఈవిధముగా చెప్పి; ఆసాం = వారలకు (ఆస్త్రీలకు); వసనాని దత్వా = వస్త్రములను యిచ్చి; ముదా = సంతోషముతో; తరోః అవరుహ్య = చెట్టునుండి దిగి; గోపాలకైః సహ = గోపాలకులతోగూడా; స్వగృహం ప్రయయౌ = తనయింటికి వెళ్ళెను.

ఇట్లు చెప్పి వారివస్త్రముల వారికందిచ్చి చెట్టుమీఁది నుండి దిగి యా కృష్ణుఁడు మిత్రులతోఁ గలసి గృహమునకు బోయెను.

*గోవర్ధనోద్ధరణము*

శ్లో. ఇంద్రయాగసమారంభం నందాదీనాం విలోక్య సః,
ఐశ్వర్యం ఖ్యాపయన్ స్వీయం నందమాహేదమచ్యుతః

11. శ్లో॥ నందం + ఆహ (నందమాహ) - గోవర్ధనోద్ధరణం

నందమాహ = నందునితో పలికెను; ఆహ = ఇదం (మాహేదం); ఇదం = అచ్యుతః (నందమాహేద మచ్యుతః); సః అచ్చుతః = అశ్రీకృష్ణుడు; నందాదీనాం = నందుడు మొదలైనవారల యొక్క; ఇంద్రయాగ సమారంభం = ఇంద్రయాగ నిమిత్తమై కూర్చిన సంభారములను (సన్నాహములను); విలోక్య = చూచి; స్వీయం ఐశ్వర్యం = తనదైన ఈశ్వరత్వమును; ఖ్యాపయన్ = ప్రకటించుచు; నందం = నందునిగూర్చి; ఇదం = ఈక్రింద చెప్పబోవు దానిని; ఆహ = చెప్పెను.

అంత నొకప్పుడు నందుఁడు మొదలగు గోపకులు ఇంద్రయాగమునకై (ఇది సంవత్సరమున కొకమారు ఇంద్రునుద్దేశించి చేయు నుత్సవము) సంభారములఁ గూర్చుటఁ జూచి యాశ్రీకృష్ణుడు తనపరమేశ్వరత్వముఁ బ్రకటించుచు వారలతో నిట్లనియె.

కాంభోజీరాగము - ఆటతాళము

ప. ఇంద్రయాగసమారంభసంభ్రమ - మిహ తు ముధా మన్యే

అ. చంద్రరవిపావకముఖసురవర - పరిగణితవిభూతిరయంహితాత

1. సకలలోకజనకం సకలాగమ - సంబోధితమహిమానమనింద్రం ప్రకటితజగదణ్డకోటివదనమిహ - సాక్షా దేవవిహాయ మహేంద్రం

2. వనచరాహివయంవనపర్వత - వర్ధితభువి వన మేత దధునా (ధినా అనుపమాన్న రసాదిభిరచలేంద్ర - మనుపమమమారాధయామోవిధినా

3 గిరివనసరిదమరనరఖగాదిషు - పరిపూర్ణ బోధరసమాగమవిదితం

హరిమిహగోవర్ధనగిరివరయుత - మచ్యుతమేవభజామోనిరతం

4. నందనందనగీత మిదం భువి - నందగోపహితం ముహు రధునా నందయోగివిచింతితమనుశివ - నారాయణతీర్థకృతమితి విధినా

4వ కీర్తన - కాంభోజిరాగం - ఆటతాళం

ప॥ ఇంద్రయాగ సమారంభసంభ్రమ = ఇంద్రయాగ సన్నాహ సంతోషము; ఇహతు = ఇక్కడనైతేనో; ముధా మన్యే = వ్యర్థమని తలచుచున్నాను

అ॥ చంద్ర విభూతి

చంద్ర, రవి = చంద్రుడు, సూర్యుడు; పావక ముఖ = అగ్నిహోత్రుడు మొదలగునటువంటి; సురవర = దేవతాశ్రేష్టులచేత; పరిగణిత = గౌరవింపబడుచుండు; విభూతి = ఐశ్వర్యము (మహిమగలపదార్థము); తాత! = నాయనా!; అయంహి = ఈ చెప్పబోవునదేగదా!

1. మహేంద్రం విహాయ = దేవేంద్రునివిడిచి; సకలలోక జనకం = సమస్తలోకములకు తండ్రి అయినటువంటిన్నీ; సకలలోక ................మహిమానం; సకలాగమ = సమస్తవేదములచేత; సంబోధిత = బోధింవబడుచుండు - ప్రతిపాదింవబడుచుండు; మహిమానం = మహాత్తు గలిగినటువంటివాడున్నూ; అనింద్రం = తనకన్నపైఅధికారి లేనివాడున్నూ; ప్రకటిత................వదనం; ప్రకటిత = అందరికి చూపబడిన; జగదండకోటి = బ్రహ్మాండ కోట్లుగలిగిన, వదనం = ముఖముగలవాడున్నూ (ఇటువంటి సర్వేశ్వరుని); సాక్షాత్ + ఏవ (సాక్షాదేవ) = నేరుగావే; ఇహ భజిత = ఇక్కడ పూజించుడు.

2. వయం = మనము; వన చరాహి = వనమునందు సంచరించుచుండు వారముగదా; ఏతతు, వనం = ఈ అరణ్యము, వన, పర్వత = వనములచేతను, పర్వతములచేతను; వర్థిత = వృద్ధిపొందిన (నిండిన); భువి = ప్రదేశమునందు (భూమియందు); అనుపమం = అసమానమైన; అచలేంద్రం = గోవర్ధన పర్వతమును; అధునా = ఇప్పుడు; అనుపమాన్నరసాదిభిః = అనమానమైన అన్నరసాదులచేత; విధినా = విద్యుక్తముగా; ఆరాధయామః = పూజించెదము

3. గిరివన........దిషు; గిరివన సరిత్ = పర్వతములు, తోపులు (వనములు), నదులు; అమర నరఖగ = దేవతలు మనుష్యులు పక్షులు; అదిషు = మొదలగువాటియందు; పరిపూర్ణ = నిండియుండు; బోధరసం = జ్ఞానానందస్వరూపుడైనటువంటిన్నీ; ఆగమవిదితం = వేదవేద్యుడైనటువంటిన్నీ; హరిః = ఆశ్రిత దురిత హరుడైనటువంటిన్నీ; అచ్యుతంఏవ = జారిపడనివాడైన శ్రీమహావిష్ణువునే; ఇహ = ఇక్కడ; గోవర్ధన గిరి వరయుతం = గోవర్ధన గిరిశ్రేష్టమునందు వున్నవానినిగా; నిరతం = అవిచ్ఛిన్నముగా (తెంపులేకుండా); భజామః భజించుదము.

4. భువి = భూమియందు; నందగోపహితం = నందగోపునకు హితముగా చెప్పబడిన; ఇదం = ఈ ఉపదేశమును; ముహుర్ముహుః = మాటిమాటికి (పలుమారు); అధునా = ఇప్పుడు; నందనందన గీతం = శ్రీకృష్ణస్వామివారిచే గానము చేయబడినది

(అను ఈ ఉపదేశమును అనుసరించి)

నందయోగివిచింతితం సనకాదులచే ధ్యానింపబడినది; ఇతి = ఇట్లని; విధినా = విద్యుక్తముగా; శివనారాయణ తీర్థం = శివనారాయణతీర్థులచేత; కృతం = రచింపబడినది.

ప. గోపలకులారా! ఇంద్రయాగము చేయుటకై మీరు త్వరపడుచుండుట యంతయు నిరర్థకమని తలంచెదరు.

అ. ఓ తండ్రీ! చంద్రుఁడు సూర్యుఁడు, అగ్ని మొదలగు దేవతలందఱును ఈపరమేశ్వరుఁడగు నారాయణుని రూపభేదములే గదా. (ఇచట "అయం" అనుశబ్దమునకు నీగీతముయొక్క తాత్పర్యము ననుసరించి యిట్లర్థము చెప్పఁబడినది.)

1. కావున నింద్రునిడిచి, సకలలోకములకు సృష్టికర్తయును, వేదాంతవేద్యుఁడును, తనపై మరియొక ప్రభువులేని స్వతంత్రుఁడును, ప్రపంచమునంతయును నోటియందుఁ జూపినవాఁడును, అగు నారాయణుని బూజింపుఁడు. (ఇచ్చట "ప్రకటితజగదణ్డకోటివదనం" అనువిశేషణమువలన తానే నారాయణుఁడని సూచించెను.

2. మనమరణ్యములందు సంచరించువారలముగదా! ఇప్పుడు మనము సంచరించుచున్న యరణ్యము విశేషతటాకములతోను, పర్వతములతోను నిండియున్న భూమియందున్నది. కావున శ్రేష్ఠములగు నన్నపానాదులతో నిచటిపర్వతములలో మత్తమగుగోవర్ధనమును శాస్త్రోక్తవిధులఁ బూజింతము.

3. పర్వతములు, అరణ్యములు, నదులు, దేవతలు, మనుష్యులు పక్షులు మొదలగు సర్వప్రపంచమునందును జ్ఞానానందస్వరూపుఁడై వ్యాపించి యున్నాఁడని వేదవాక్యమువలనఁ దెలియవచ్చుచున్న యానారాయణుని గోవర్ధనపర్వతమునం దావాహనఁజేసి పూజింతము. ఇచ్చటినుండియు నీవిష్ణువునందే భక్తినిలుపుదము.

4. ఇది నందాదిగోపకులకు మేలుసేయుటకై కృష్ణునిచేఁ జెప్పఁబడిన వాక్యము. సనకసనందనాదులచే సదాభావింపఁబడుచుండునది. నారాయణతీర్థునిచే శాస్త్రోక్తమార్గము నవలంబించి వర్ణింపఁబడినది.

శ్లో. గోవర్ధనగిరేః పూజాం గోవిందవచనాదరాత్,
చక్రుర్నందాదయస్తూర్ణం సవనస్య గవాం తథా

12వ శ్లో॥ నందాదయః = నందుడు మొదలగువారు; గోవింద = శ్రీకృష్ణస్వామివారియొక్క; వచనా = వాక్యమునందు; ఆదరాత్ = గౌరవమువలన; సవనస్య = అరణ్యసహితమైన; గోవర్ధనగిరేః = గోవర్ధన పర్వతమునకున్నూ; తథా = అప్రకారముగానే; గవాం = గోవులకున్నూ; తూర్ణం = శీఘ్రముగా; పూజాం చక్రుః = పూజను చేసిరి.

ఇట్లు కృష్ణుఁడు చెప్పినమాటల నాదరించి యాగోపకులు గోవర్ధన పర్వతమునకును, దాని సమీపముననున్న యరణ్యమునకును, గోవులకును, పూజచేసి యింద్రయాగము సేయుటను దక్షణమే మానుకొనిరి.

శ్లో॥ క్రుద్ధస్య తస్మాదింద్రస్య వవృషుస్సతతం ఘనాః,
గోకులం వ్యాకులం తస్మాద్విలోక్య ధృతవాన్గిరిమ్

13వ శ్లో॥ తస్మాత్ = ఆకారణమువలన; క్రుద్ధస్య = కోపముచెందినటువంటి; ఇంద్రస్య = దేవేంద్రునియొక్క; ఘనాః = మేఘములు; సతతం వవృషుః = అవిచ్ఛిన్నముగా (తెంపులేకుండా) వర్షించినది; తస్మాత్ = ఆకారణమువలన; వ్యాకులం = చీకాకుపడినటువంటి; గోకులం = గోవులను, గోపాలురను; విలోక్య = (స్వామివారు) చూచి; గిరిం = గోవర్ధన పర్వతమును; ధృతవాన్ = ధరించెను (ఎత్తిపట్టుకొనెను)

దానికి కోపించి యింద్రుఁడును మేఘంబులఁ బంపి గోకులమంతయు చీకాకగునట్లు ప్రబలమగు వర్షమును గురివించెను. ఆవర్షమువలన గోకులమునకుఁ గల్గినభయమును నివారింప నాగోపాకృష్ణుఁడు గోవర్ధనపర్వతమును పైకెత్తి దానియడుగున నందఱకును నిలుచుసన్నివేశ మేర్పఱచెను.

శ్లో॥ ఛత్రీకృతగిరిరాజే రక్షితగోపాలగోధనసమాజే,
గోవిందే తమనంతం భక్త్యా గోప్యా జగుః పరం తుష్టాః

14. శ్లో॥ గోవిందే = శ్రీకృష్ణులు; ఛత్రకృత గిరిరాజే = గొడుగుగా చేయబడిన పర్వతశ్రేష్ఠము కలవాడుకాగా; రక్షిత గోపాల గోధన సమాజే = రక్షించబడినట్టి గోపాలురయొక్కయు, గోవులయొక్కయు, సమూహములుకలవారుకాగా (అనగా పర్వతమును గొడుగుగాబట్టి గోవులను, గోపాలురను రక్షించగా); గోప్యః = గోపికలు; పరం తుష్టా = మిక్కిలి సంతోషించినవారై; తం అనంతం = ఆ స్వామివారిని; జగుః = గానము చేసిరి.

ఇట్లా కృష్ణుఁడు గొడుగువలె గోవర్ధనపర్వతము నెత్తి దానిక్రింద గోకులమునందలి మనుష్యులను, గోవులను రక్షింపఁగానే మిగుల సంతసించి గోపిక లమ్మహాత్ము నిట్లని వినుతించిరి.

ముఖరీరాగము - ఆటతాళము

ప. గోవర్ధనగిరిధర గోవింద
గోకులపాలక పరమానంద

అ. శ్రీవత్సాంకిత శ్రీకౌస్తుభధర
భావకభయహర పాహి ముకుంద

1. పురుహూతమఖవి ఘాతసుచతుర
పురుషోత్తమ పూరితజగదుదర
మేరుభూరిధై ర్యాఘవిదూర
మీనకేతుశత కోటిశరీర

2. అమితకల్యాణగుణ అగణితలీల
అపరిమితానంద ఘన నందబాల
శమితదైత్యదంభ శాంత్యాదిమూల
విమలమానసవృత్తి విలసితశాల

3. వహతోజదండ కోటీ స్త వేదం
వరద కి మద్భుత మచలేంద్రవహనం
మహనీయకీర్తి మావహసి దేహి ముదం
మాఘవనం మద మపనయసి కథం

4. ఆనందామృత వారిధిఖేల
అలఘుపరాక్రమ అనుపమలీల
శ్రీనందాత్మజ శ్రితజనపాల
శ్రీకరకిసలయ లాలనలోల

5. పాటితసురరిపు పాదపబృంద
పావనచరిత పరామృతకంద
నాట్యరసోత్కట నానాభరణ
నారాయణతీ ర్థార్చితచరణ

5వ కీర్తన ముఖారి - అటతాళం

ప॥ గోవర్ధన గిరిధర = గోవర్ధపర్వతమును ధరించినవాడ; గోవింద = గోవిందుడా; గోకులపాలక = గోకులమును పాలించువాడ; పరమానంద = శ్రేష్ఠమైన ఆనందముగలవాడ (ఆశ్రితముగలవాడ)

అ॥ శ్రీవత్సాంకిత = శ్రీవత్సమనే గుర్తుగలవాడ; శ్రీకౌస్తుభధర = శ్రీకౌస్తుభమును ధరించినవాడ; భావక భవహర = ధ్యానముచేయువారి సంసార తాపమును హరించువాడ; పాహి ముకుందా = ముకుందా రక్షింపుమా

1. పురుహూత = దేవేంద్రునియొక్క; మఖ = యాగమును; విఘాత = చెరుచుటయందు; సు చతుర = మంచి నేర్పుగలాడా; పురుషోత్తమా = పురుషశ్రేష్ఠుడా; పూరిత జగదుదర = జగములచే నిండింపబడిన ఉదరముగలవాడ; మేరు భూరి ధైర్య = మేరు పర్వతముతో సమానమైన గొప్ప ధైర్యముగలవాడ; అఘ విదూర = పాపమును పోగొట్టువాడ; మీనకేతు శతకోటి శరీర = నూరుకోట్ల మన్మథులతో సమానమైన శరీరకాంతిగలవాడ

2. అమిత కళ్యాణగుణ = మితములేని కళ్యాణ గుణములుగలవాడ; అగణితలీల = గణించుటకు సాధ్యముకాని లీలలుగలవాడ; అపరిమిత = పరిమితములేని; ఆనందఘన = దట్టమైన ఆనందముగలవాడ; నందబాల = నందుని కొమరుడా; శమితదైత్యదంభ = దానవులయొక్క గర్వమును అడచినవాడ; దానవులు - దైత్యులు = దేవేంద్రలోకములోనుండువారు; రాక్షసులు = భూలోకములోనుండువారు; శాంత్యాదిమూల = శాంతి మొదలగు గుణములకు ఉనికిపట్టు అయినవాడ; విమల, మానసవృత్తి = నిర్మలమైన మనోవృత్తులచేత; విలసిత, శీల = శ్లాఘింపబడిన ఆచారముగలవాడ

3. జగదండకోటి = బ్రహ్మాండ కోట్లను; వహతః = మోయుచుండెడి; తవ = మీకు; వరదా = వరదుడా; ఇదం = ఈ; అచలేంద్ర వహనం = పర్వతరాజమును మోయుట; కిం అద్భుతం? = ఏమి వింత?; మాఘ వనం = ఇంద్ర సంబంధమగు; మదం = గర్వమును; కథం అపనయసి? = ఎట్లుపోగొట్టితివి?; ముదందేహి = సంతోషమును ఇండు; మహనీయకీర్తిం = గొప్పకీర్తిని; అవహసి = పొందితివి.

4. ఆనందామృత = ఆనంద అమృతమనే; వారిధిఖేల = సముద్రమునందు ఆడుకొనువాడ; అలఘుపరాక్రమ = అల్పముగాని వీర్యముగలవాడ; అనుపమలీల = అసమానమైన ఆటలుగలవాడ; శ్రీనందాత్మజ = సంపత్కరమైన కృష్ణుడ; శ్రితజనపాల = ఆశ్రయించిన జనులను పాలించువాడ; శ్రీకర = లక్ష్మీఅమ్మవారియొక్క చేతులనెడి; కిసలయ = చిగుళ్ళతో; లాలనలోల = ఆడుటయందు ఆసక్తిగలవాడ

5. సురరిపు = దేవతలకు శత్రువులను; పాదప = చెట్లయొక్క; బృంద = సమూహములను; పాటిత = కొట్టివేసినవాడ; పావన చరిత = పవిత్రమైన చరిత్రముగలవాడ; పరామృత కంద = ముక్తికి ఆధారుడ; నాట్యరసోత్కట = నాట్యమునందు ఆసక్తిగలవాడ; నానాభరణ = అనేక ఆభరణములుగలవాడ; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారిచేత; అర్చిత చరణ = అర్చింపబడిన పాదములుగలవాడ.

ప. ఓ శ్రీకృష్ణా! నీవు పరమానందస్వరూపుఁడవు. గోవర్ధనపర్వతమునెత్తి గోకులమును బరిపాలించితివి.

అ. శ్రీవత్సముతోడను, కౌస్తుభరత్నముతోడను, అలంకరింపఁబడియున్న ఓనారాయణా! భక్తులభయమును దీర్చి రక్షింపుము.

1. అనఘా ! నీవు ప్రపంచమునంతయును గర్భమునందుంచుకొని ప్రోచుచుండు పురుషోత్తముఁడవగుటచే మాకు హితముగోరి నిరర్థకమగు నింద్రయాగమును నిలుపునట్లు చేసితివి నిన్నేపూజించునట్లును బోధించితివి. పిదప మనోహరమగు నాకారము గలవాఁడవయ్యును, మేరువునకంటె నధికమగు ధైర్యముఁజూపి మిగులఁ జమత్కారముతో మముఁబ్రోచితివి.

2. సమస్తకల్యాణగుణ సంపూర్ణుఁడవగు నో పరమానందస్వరూపా! నీవు శమదమాదుల కాధారభూతుఁడవయ్యును, నిర్మలమగు మనోవృత్తిగలిగియును, రాక్షసులసంహరించుచు గోపాలవేషమునర సంచరించుచున్నావు. ప్రభు వెట్టిశాంతుఁడైనను క్రూరుల శిక్షింపకదప్పదు. నీ కిది యంతయునొక క్రీడ

3. కోరినకోర్కెల నొసంగు నో భగవంతుడా! వరాహరూపమున నీసకలప్రపంచమును మోసిన నీకు నీగోవర్ధనమునెత్తుట యన నెంత? మాకు సంతసముగలుగునట్లుగా నింద్రుని గర్వమునడఁచి గోకులమునకును, గోవర్ధనమునకుఁ గీర్తిని గల్గించితివి.

4. ఆశ్రితులరక్షించు నోనందకుమారా! నీవు ఎట్టి యమానుష కృత్యముల నాచరించినను, చేతనున్న చిగురాకైనను వాడకుండున ట్లవలీలగ నాచరింతువు. సర్వకాలములయందును ఆనందసముద్రమున లోలలాడు చుందువు.

5. రాక్షసులనియెడు వృక్షములఁ బెకలించినవాఁడ వనియు, పరిశుద్ధమగు దివ్యచారిత్రముఁ గలవాఁడవనియు మోక్షమున కాధారభూతుఁడవనియు, నృత్యమునందు మిగుల నిచ్ఛగలవాఁడవనియు, నారాయణతీర్థుఁడు నీపాదముల పూజించుచున్నాఁడు.

### ఇంద్రకామధేనువులు శ్రీకృష్ణుని నుతించుట

*అథ దేవేంద్రాగమనమ్*

నాదనామ క్రియారాగము - ఆదితాళము

సహస్రామరసేవిత స్సహస్రాక్ష శ్శతక్రతుః

సహస్రగోత్రభి ద్వజ్రీ శచినాథో విరాజతే

అథ = అనంతరం; దేవేంద్రః = దేవేంద్రుడు; అగమనం = వచ్చుట

సహస్ర అమర సేవితః = వేలకొలది సురులచేత సేవింపబడువాడ; సహస్ర అక్షః = వే కన్నులుగలవాడ; శతక్రతుః = నూఱు యజ్ఞములుచేసినవాడ; సహస్ర గోత్రభిః = వేయినామములుగలవాడ; శచీనాథః = శచీదేవికి నాథుడైనవాడ; విరాజితే = ప్రకాశించువాడ

అంత వేయిగన్నులుగలవాఁడును, వజ్రాయుధమునుధరించి పర్వతముల రెక్కల ఖండించినవాఁడును, శచీపతియు నగు నాయింద్రుఁడు అనేకులగు దేవతలతోఁ గూడి కృష్ణునియొద్దకు వచ్చెను.

శ్లో. రక్షితే గోకులజనే హరిణా గిరిధారిణా.
లజ్జాభరానతశిరాస్సురరాజో భవత్తదా.

15 శ్లో॥గిరిధరణా = పర్వతమును ధరించినటువంటి; హరిణా = హరిచేత; గోకులజనే = గోకులమునందు జనులు అందరున్నూ; రక్షితే = రక్షింపబడగా; సురరాజః = దేవేంద్రుడు; తధా = అప్పుడు; లజ్జాభరాత్ = లజ్జా భారముచేత; నతశిరాః = తలవంచుకున్నవాడు; అభవతు = అయెను.

అట్లు శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతమునెత్తి, గోకులమును రక్షింపఁగానే దేవేంద్రుఁడు లజ్జచేఁ దలవంచుకొనెను.

శ్లో. నివృత్తే మేఘసంఘాతే స్వస్థే గోకులవాసిని,
స్థాపితే చ గిరౌ కృష్ణ మింద్రః స్తౌతీతి సాదరమ్

16. శ్లో॥ మేఘసంఘాతే = మేఘసమూహములు; నివర్తే = నివర్తికాగా (చెదిరిపోగా); గోకులవాసిని = గోకులమునందలి జనులు; స్వస్థే = స్వస్థచిత్తులుకాగా; గిరౌ = పర్వతము; స్థాపితేచ = యధాస్థానములో వుంచబడగా; కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; ఇంద్రః = ఇంద్రుడు; సాదరం = భక్తిపూర్వకముగా; ఇతి = ఇట్లని; స్తౌతిః = స్తోత్రము చేయుచున్నారు.

తానుపంపిన మేఘములు నిరర్థకములై తిరిగివచ్చుటయు, వర్షమెంత కురిసిన గోకులమున కేమియు నపాయము గలుగకుండటయుఁజూచి, యా యింద్రుఁడు మిగుల నాశ్చర్యపడెను. అకృష్ణుఁడు తానెత్తియున్న గోవర్ధనమును మరల దానిస్థలమునందు నిలిపినపిదప నాతఁ డాహరిని సమీపించి యిట్లని వినుతించెను.

శ్లో. శ్రీగోపాల కృపానిధే కరుణయా స్వామిన్ మయానుష్ఠితం
క్షంతవ్యం భవతాపరాధశతకం యద్యత్ క్షణే తత్తదా,
ఆదిత్యాదిసమస్త దేవనివహో యస్యాజ్ఞయా వర్తతే
సత్వం సాత్వతపుంగవః శ్రుతిశిరోవాగ్గోపికావల్లభః

17. శ్లో॥ శ్రీగోపాల = సంపద్యుక్తమైన గోపాలమూర్తే; కృపానిధే = దయాసముద్రుడా; స్వామిన్ = స్వామీ; యద్యత్ క్షణే = ఏ ఏ క్షణమందు; మయా = నాచేత; అనుష్ఠితం = చేయబడినటువంటి; అపరాధశతకం = తప్పులనూరింటిని; తత్తథా = అప్పటికప్పుడే; కరుణయా = కరుణచేత; భవత = మీచేత; క్షంతవ్యం = మన్నింపబడుగాక; ఆదిత్యాది సర్వదేవ నివహః = సూర్యుడు మొదలుగాగల దేవతా సమూహములు; యస్య = ఎవనియొక్క; అజ్ఞయా = అజ్ఞచేత; వర్తతే = వర్తించుచున్నదో; సత్ = అట్టి; సాత్వతపుంగవః = సాత్విక పురుషులలో శ్రేష్ఠుడును; శ్రుతిశిరోవాక్ = వేదాంతవాక్యములనెడు ఉపనిషత్తులలో చెప్పబడినవాడవు; గోపికా = గోపికలకు; వల్లభ = భర్త అయినట్టివాడవు; త్వం = మీరేను.

ఓస్వామీ! గోపికావల్లభుండవగు శ్రీకృష్ణా! వేదాంతవాక్యములచేఁ జెప్పఁబడునట్టియు, ఆజ్ఞామాత్రముచే సూర్యుఁడు మొదలగుసర్వదేవతలను నడుపునట్టియు, పరమేశ్వరుఁడవు నీవే! ఓభక్తరక్షకా! నేనుచేసిన యపరాధమును దయతో క్షమింపవలయును. ఒకయపరాధమనియేకాదు. ఎన్నికోట్ల యపరాధములు చేసియుండినను నప్పటిదాని నప్పుడేక్షమించి నను రక్షింపవలయును.

తోడీ (శంకరాభరణ) రాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | మామకాపరాధశతం | క్షమ్యతాం త్వయా |
| అ. | మామకాపరాధశతం | మాగణ యాధ వాయుతం |
| | శ్యామవర్ణ శమాన్విత | శాశ్వతానందసందోహ |
| 1. | అత్యంతకృపాసాగర | ఆదిపురుషానాధార |
| | నిత్యదజగదాధార | నిహ్నుతాసుర |
| | శ్రుత్యంతవనసంచార | శోభనఫలదాచార |
| | భృత్యదయాధృతాకార | భ్రమకారణవిదార |
| 2. | కామశతకోటివేష | ఖండితనిఖిలదోష |
| | దామోదరోదారభాష | దాసపోష |
| | కమలాకృతాభిలాష | కామనాకలితాశేష |
| | సామగీతా శ్రితాశేష | సాధుజనసంతోష |
| 3. | ఆదిత్యచంద్రమండలా | భ్యంత రాధార నిర్మల |
| | బోధరూపానం దాచల | పోషితాఖిల |
| | వేదపురాణాదిమూల | వేణుగానక్రీడాలోల |
| | సుందరతరగోకుల | శ్రీధరనాథగోపాల |
| 4. | ధారాధరాకార ధీర | ఘోరారిసంహారశూర |
| | నీరజనాభ నిరుపమ | నిర్మలానంద |
| | పారావార శ్రీవిహార | పాపతిమిరభాస్కర |
| | నారాయణతీర్థసంతార | నానాగమాంతసంచార |

7వ కీర్తన - శంకరాభరణ రాగం - ఆదితాళం

**ప॥ త్వయా = నీచేత; మామక = నాయొక్క; అపరాధశతం = నూఱుతప్పులు; క్షమ్యతాం = క్షమింపబడుగాక**

**అ॥ మామక = నాయొక్క; అపరాధశతం = నూఱుతప్పులు; అథవా అయుతం = పదివేలుగాని అయినప్పటికి; మా గణయ = లెక్కింపవద్దు; శ్యామవర్ణ! = నీలవర్ణుడా; శమాన్విత = అంతరేంద్రియ నిగ్రహముకలవాడ**

1. అత్యంత కృపాసాగర = కరుణాతిశయమునకు సముద్రమువంటివాడా; ఆదిపురుషా = మొట్టమొదటి పురుషుడా; అనాధార = ఆధారములేనివాడా; నిత్యదా = శాశ్వత పదవిని యిచ్చువాడ; జగదాధార = జగత్తుకు ఆధారభూతుడా, నిహ్నుతాసుర = నాశముచేయబడిన రాక్షసులుకలవాడా; శ్రుత్యంతవన సంచారా = వేదాంతము అనువనమున సంచరించువాడ; శోభనఫలదా = శుభకరమైన ఫలమును యిచ్చు; ఆచార = వాడుకగలవాడా; భృత్య = సేవకులయందు; దయా = కృపచేత; ధృత = ధరింపబడిన; ఆకారా = రూపముగలవాడ (కృష్ణా), భ్రమ = మోహమునకు; కారణ = మూలమైనట్టి అజ్ఞానమును; విదార = పోగొట్టువాడ

2. కామశతకోటివేష = నూఱుకోట్ల మన్మధులతో సమానమైన అలంకరాముగలవాడ; ఖండిత నిఖిలదోష = ఖండింపబడిన సమస్తదోషములు కలవా; దామోదర = ఉదరమునందు కట్టివేయబడిన త్రాడుకలవాడ; ఉదార భాష = ఔదార్యమైన మాటలు కలవాడ; దాసపోష = భక్తులను రక్షించువాడ; కమలా కృతాభిలాష = లక్ష్మీఅమ్మవారిచేత అభిలంషించబడినవాడ; కామనా = సంకల్పముచేత; అశేష = సమస్తజగత్తును; కల్పిత = సృష్టించబడినవాడ; సామగీత ఆశ్రిత = సామవేదమును ఆశ్రయించినవాడ; అశేష = సమస్తమైన; సాధుజన = సత్పురుషులను; సంతోష = సంతోషింపచేయువాడా

3. ఆదిత్య చంద్రమండలా = సూర్య, చంద్ర మండలములకు; అభ్యంతర = అంతర్యామివిగావుండి; ఆధారనిర్మలా = ఆధారముగా నిర్మలముగా ఉండేస్వామీ!; బోధరూప = జ్ఞానరూపముగా నుండునట్టినీ; ఆనంద = ఆనందముగా నుండువాడ; అచల = చలించనివాడ; పోషితాఖిలా = సమస్తమును పోషించువాడా; వేద పురాణాదిమూల = వేదములకు పురాణములకు మూలస్వరూపుడా; వేణుగానక్రీడాలోల = వేణునాద విహారమునందు ఆసక్తిగలవాడ; సుందరతర = విశేషసౌందర్యముగలవాడా; గోకుల = గోకులమునకున్నూ; శ్రీ = లక్ష్మీ అమ్మవారికిన్నీ; ధర = భూదేవికిన్నీ; నాథ = భర్తగానుండువాడా; గోపాల = గోపాలుడా.

4. ధారా, ధరా = ఉదకధారలను ధరించియున్న అనగా మేఘముతో సమమగు; ఆకార = రూపముగలవాడా; ధీర = ధైర్యముగలవాడా; ఘోర అరి సంహార = భయంకరమైన శత్రువులను ఖండించువాడ; శూర = పరాక్రమవంతుడా; నీరజనాభ = కమలనాభ (పద్మనాభ); నిరుపమ = అనమానమైన; నిర్మల ఆనంద = నిర్మలమైన ఆనందము కలవాడ; పారావారశ్రీవిహార = పాలసముద్రమునందు లక్ష్మితో విహరించువాడ; పాపతిమిరభాస్కర = పాపమనే చీకట్లకు సూర్యునివంటివాడ; నారాయణతీర్థ సంతార = నారాయణతీర్థులను తరింపజేయువాడ; నానా ఆగమాంత సంచార = అనేకవిధములైన వేదముల అంతమందు సంచరించువాడ

ప. ఓకృష్ణా! నేను చేసిప యపరాధముల నన్నింటిని క్షమింపుము.

అ. నీల మేఘశ్యామలా! పరమానందస్వరూపా! శాంతస్వభావా! నేను చేసినయపరాధములు నూర్లకొలఁదిగనున్నను వేలకొలఁదిగనున్నను వానిని సరకుచేయవలదు.

1. ఓ అనాదిపురుషా! నీకు నాధారమగువస్తువు మఱియొకటిలేదు. దయామయా! వేందాంతవేద్యా! మోక్షమనియెడు శుభఫలమునిచ్చు దైత్యవైరీ! నీవే అజ్ఞానమునడంచి యాశ్రితులకాపాడుచున్న వాఁడవు. ఈప్రపంచమునకు వేరుది క్కెవ్వరున్నారు?

2. సంకల్పముచేతనే యీ సమస్తప్రపంచమును నిర్మించి సాధువులగు వారిఁ బ్రోచుచుండునోదామోదరా! నీవు దోషరహితుఁడవు, మన్మథకోటి సమానరూపుఁడవై, లక్ష్మీనాయకుండవై విహరించు నారాయణుండవు. ఓ సామగానలోలా! దాసుని రక్షింపుము.

3. నీవు సూర్యచంద్రమండలములో నిలచి వారలకాధారమైయుండు వాఁడవు సచ్చిదానంద స్వరూపుఁడవు. సకలవేదములకును, పురాణములకును, మఱియు సర్వశాస్త్రములకును మూలమగువాఁడవు. (నిన్నుగూర్చియే వేదాదులు చెప్పుచున్నవట) ఈసకలలోకములను రక్షించుటకై మనోహరమగు నాకారముతో గోపాలబాలుఁడవై వేణుగానాది క్రీడలచే గోకులమున విహరింపుచున్నావు.

4. నీల మేఘశ్యామలుండవగు నోపద్మనాభో! వేదాంతవేద్యా! పరమానందస్వరూపా! క్షీరసాగరశయనా! లక్ష్మీనివాసా! నారాయణతీర్థరక్షణా! నీవు గొప్పధైర్యముతో, నతిపరాక్రమముతో లోకశత్రువు లగుదుష్టుల సంహరించియు, పాపచింతలఁ దొలంగించియు లోకమును కాపాడెదవు.

గ. ఇంద్రసహాయార్థమాగతా కామధేనుః స్వకీయ క్షీరాభిషేకపూర్వకం శ్రీకృష్ణ మిద మాహ.

18. గద్య:- ఇంద్రసహాయార్థం = ఇంద్రునికి సహాయము చేయుటకొఱకు; ఆగతం = వచ్చినటువంటి, కామధేనుః = కామధేనువు; స్వకీయ = తనయొక్క; క్షీరాభిషేకపూర్వకం = క్షీరములను స్వామివారికి అభిషేకముచేసి; శ్రీకృష్ణం = శ్రీకృష్ణస్వామినిగూర్చి; ఇదం = ఈక్రింద చెప్పబోవు వాక్యములను; అహ = పలికెను.

ఇంద్రునికిసహాయముగా కామధేనువుకూడ వచ్చియుండెను. అది తన క్షీరములతో కృష్ణు నభిషేకించి యిట్లని వినుతించెను.

శ్లో. నందకుమారక మనఘం నౌమిపరానందఘనమఖిలవంద్యమ్,
సుందరసరసిజనేత్రం మందస్మితసాంద్ర చంద్రికాచంద్రమ్.

19. శ్లో॥ అనఘం = పాపరహితుడు అయినట్టి; పరానందఘనం = పరమానందము ఘనీభవించిన వాడున్నూ; అఖిలవంద్యం = అందరిచేత నమస్కరింపబడువాడున్నూ; సుందర సరసిజనేత్రం = సౌందర్యమైన తామరకమలములతో సమమగు నేత్రములు గలవాడున్నూ; మందస్మిత = చిరునవ్వు అనునటువంటి; సాంద్ర = దట్టమైన; చంద్రిక = వెన్నెలతో కూడుకొన్న; చంద్రం = శ్రీకృష్ణస్వామివారు అనే చంద్రుడున్నూ అగు; నందకుమారం = నందకుమారుడైన శ్రీకృష్ణునిగూర్చి; నౌమి = నమస్కరించుచున్నాను.

కమలములవలె విశాలమగు నేత్రములు గలిగినట్టియు, చిఱునగవులనియెడు వెన్నెలలఁ బ్రసరింపఁజేయుచు చంద్రునియట్లు లోకమున కాహ్లాదమును గల్గించునట్టియు, పరమానందస్వరూపుఁడైనట్టియు నా నందకుమారుని నమస్కరించెదను. పాపవిదూరుఁడగు నామహాత్ముఁ డందఱకును నమస్కారార్హుఁడేకదా.

సావేరీరాగము - త్రిపుటతాళము

| | | |
|---|---|---|
| ప. | నందనందన గోవింద | నౌమి తే పదం |
| అ. | మందరభూధరోద్ధార | మధురగోపాలకృష్ణ |
| 1. | సరససుందరహాస | సముదితనిజభాస |
| | నిరసితాంధతమస | నిత్యానందరస |
| 2. | అపరిమితకరుణ | అసురబృందనిర్హరణ |
| | తపనీయాంబరభరణ | దాసపోషణ |
| 3. | కలితకస్తూరీతిలక | కమనీయఫాలఫలక |
| | లలితత్రివళిపులక | లక్ష్మీపాలక |
| 4. | కౌస్తుభశోభితకంఠ | కలితశ్రీవైకుంఠ |
| | విస్తీర్ణదయోత్కంఠ | వినతశ్రీకంఠ |
| 5. | హరిహయమణినీల | హాటకమణికుండల |
| | నరనారాయణలీల | నందితాఖిల |
| 6. | గోపరమణీనయన | కుముదచంద్రవదన |
| | తాపసమానసాయన | తాపనాశన |
| 7. | శరణాగతహితార్థ | శంసితనతపార్థ |
| | వరనారాయణతీర్థ | వర్యపురుషార్థ |

8వ కీర్తన - సావేరీరాగం - త్రిపుటతాళము

ప॥ నంద నందన! గోవింద = నందతనయుడవైన శ్రీకృష్ణా!; తే, పదం = నీయొక్క; పాదములకు; నౌమి = నమస్కరింపుచున్నాను.

అ॥ మందరభూధరోద్ధార = మందర పర్వతమును ధరించినవాడా; మధుర గోపాలకృష్ణా! = సౌందర్యమైన గోపాలకృష్ణా!

1. సరస సుందరహాస = రసయుక్తమైన సుందరమగు చిరునగవుగలవాడ; సముదిత నిజభాస = లెస్సగా పుట్టబడినటువంటి స్వకీయ ప్రకాశముగలవాడ; నిరసిత అంధతమస = పోగొట్టబడినటువంటి అంధ తమస్సుగలవాడ; నిత్యానందరస = తెంపులేని నిత్యానందమె రసముగాగలవాడా.

2. అపరిమిత కరుణ = పరిమితములేని కరుణగలవాడ; అసుర బృంద నిర్వారణ = రాక్షస సమూహములను సంహారము చేయువాడ, తపనీయాంబర భరణ = బంగారు వస్త్రము ఆభరణముగా గలవాడ; దాస పోషణ = దాసులను రక్షించువాడ.

3. కలిత కస్తూరితిలక = ఒప్పుచున్నటువంటి కస్తూరి తిలకముగలవాడా, కమనీయ ఫాల ఫలక = సుందరమైన నొసటి ప్రదేశము గలవాడ; లలిత త్రివళిపులక =ఉదరమందు ఒప్పుచున్న మూడు మడతలుగలవాడ; లక్ష్మిపాలక = లక్ష్మి అమ్మవారిని పాలించువాడ.

4. కౌస్తుభశోభిత కంఠ = కౌస్తుభమణిచేత శోభిల్లుచుండు కంఠముగలవాడ; కలితశ్రీవైకుంఠ = సంపద్యుక్తమైన వైకుంఠముగలవాడ; విస్తీర్ణ దయోత్కంఠ = విస్తరించినటువంటి దయాతిశయముగలవాడ; వినుతశ్రీకంఠ = నమస్కరించుచుండు సాంబమూర్తిగలవాడ.

5. హరి, హయ = పచ్చని గుర్రముగలవాడ (అనగా ఇంద్రుడు); మణినీల = ఇంద్రనీలమణితో సమానమైన నీలవర్ణముగలవాడ; హాటకమణి కుండల = బంగారుతో చేయబడిన కుండలములుగలవాడ; నరనారాయణలీలా = నరనారాయణ అవతారములతో లీలగా విహరించినస్వామి; నందితాఖిల = సమస్తమును సంతోషపెట్టినవాడ.

6. గోపరమణి = గోపీస్త్రీలయొక్క; నయన = నేత్రములనే; కుముద = కలువలకు; చంద్రవదన = చంద్రునివంటి ముఖముగలవాడ; తాపస = తపస్సుచేయువారి; మనసా = మనస్సులే; అయిన = స్థానముగాగలవాడ; తాపనాశన = సంసారతాపమును నశింపజేయువాడా

7. శరణాగత హితార్థశంసిత = శరణాగతులకు మేలు చేయువాడా; నతపార్థ = అర్జునునిచేత నమస్కరింపబడుచుండువాడ; వరనారాయణతీర్థ = శ్రేష్ఠమైన నారాయణతీర్థులవారిచేత; వర్యపురుషార్థ వరింపబడుచుండు పురుషార్థముగలవాడ

ప. ఓనందకుమారా! నారాయణా! నీకు నమస్కారము.

అ. మందరపర్వతమును ధరించిన యానారాయణుండవే నీవు.

1. ఓపరమానందస్వరూపా! నీవు మనోహరములగు చిరునగవులతోడను, అద్భుతమగు శరీరకాంతితోడను, గాఢాంధకారమును తొలగించుచున్నావు.

2. మనోహరమగు పీతాంబరమును ధరించిన యోమహాత్మా! నీవు రాక్షసుల సంహరించి మిగులదయచే దాసులరక్షింతువు.

3. ఓలక్ష్మీనారాయణా! మనోహరమగు ముఖమునందు కస్తూరీతిలకము రంజిల, వళిత్రయముచేఁ (వళులనఁగా కడుపుపైనుండుమడతలు) ప్రకాశించుచు ఆనందాతిశయమువలన పులకాంకితశరీరముతో సంచరించుచుందువు.

4. ఓకౌస్తుభాలంకారా! నారాయణా! శంకరుఁడుగూడ నీదయను గోరుచుండును.

5. ఇంద్రనీలసమానమగు వర్ణముగలశరీరముతోను, రత్నకుండలములు మొదలగు భూషణములతోను, రాజిల్లు నోమహాత్మా! నీవు విలాసార్థముగా నరనారాయణరూపమునుఁ దాల్చి సకలలోకములను రక్షించుచుందువు.

6. ఋషులమనసులయందు నివసించుచు, లోకులపరితాపములహరించు నోనారాయణా! నీవిప్పుడు గోపికల నేత్రములనియెడు కలువలకు చంద్రునివలె నాహ్లాదముఁ గల్గించు మోముతో విహరించుచున్నావు.

7. నారాయణతీర్థునకు మోక్షమునిచ్చుచు, భక్తుడగునర్జునునకు సకల శుభములఁ గూర్చునట్టియు నోకృష్ణా! నీవు శరణాగతులగువారలకు నెప్పుడును మేలుసేయుచుందువుగాని, వారల నిధారులనుగా విడుచువాఁడవు గాదు.

శ్లో. స్తుత్వా సురేంద్రశ్శ్రీకృష్ణం విజ్ఞాప్యజ్ఞాతకౌశలమ్,

ఆజ్ఞాతో లోకగురుణా ధేన్వా సహ దివం గతః

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం

శ్రీకృష్ణగోపీవస్త్రాపహారగోవర్ధనోద్ధారవర్ణనం నామ

పఞ్చమస్తరఙ్గః

20. శ్లో॥ జ్ఞాతకౌశలం = సమస్తనేర్పులు తెలిసినటువంటి; శ్రీకృష్ణం = శ్రీకృష్ణునిగూర్చి; సురేంద్రః = దేవేంద్రుడు; స్తుత్వా = స్తోత్రము చేసినవాడై; విజ్ఞాప్య = మనవిచేసుకున్నవాడై; లోకగురుణా = శ్రీకృష్ణునిచేత; ఆజ్ఞాతః = ఉత్తరువును పొందినవాడై; సహధేన్వా = కామధేనువుతోకూడున్నవాడై; దివం,గతః = స్వర్గమును గూర్చి, వెళ్ళెను; ఇతి = ఇది; శ్రీనారాయణతీర్థవిరచితాయాం = శ్రీనారాయణతీర్థులు రచించినటువంటి; శ్రీకృష్ణలీలా తరఙ్గణ్యాం = శ్రీకృష్ణలీలా తరఙ్గములందు; శ్రీకృష్ణ-గోపీవస్త్రాపహార = శ్రీకృష్ణుడు గోపికలవస్త్రములు దొంగిలించుటయును; గోవర్ధనోద్ధార = గోవర్ధన పర్వతమును శ్రీకృష్ణస్వామివారు ఎత్తుటయున్నూ; వర్ణనం నామ = వర్ణించుపేరుతో; పంచమతరఙ్గము = పఞ్చమ తరఙ్గము

పంచమ తరంగ ప్రతిపదార్థము సంపూర్ణము

ఇట్లు దేవేంద్రుఁడు శ్రీకృష్ణుని ప్రభావమును బాగుగ గురుతెఱిఁగిన వాఁడగుటచే నమ్మహాత్ముని పెక్కువిధముల వినుతించి యవ్విభునివలన నాజ్ఞఁగైకొని కామధేనువుతోఁ గూడి సురలోకమునకుఁ జనియెను.

ఇది పఞ్చమతరఙ్గము

# షష్ఠ తరఙ్గము

కథాసంగ్రహము

శ్లో. బృందావనే థ శ్రీకృష్ణగోపీసంగో భినీయతే,
ఆదౌ గోప్యస్తతః కృష్ణో గోపీనాం కృష్ణసంగమః
గోపీశ్రీకృష్ణసంవాదస్తతో గోపీపరిగ్రహః,
షష్ఠేస్మిన్ సంగ్ర హేణైవం రాసారంభో నిగద్యతే

శ్రీనారాయణతీర్థ విరచిత

## షష్ఠతరఙ్గ ప్రతి పదార్థము ప్రారంభము

కథా సంగ్రహము

1. శ్లో॥ అథ = అనంతరము; బృందావనే = బృందావనమందు; శ్రీకృష్ణ గోపీసంగః = శ్రీకృష్ణునియొక్క గోపికలయొక్క సమావేశము; అభినీయతే = వర్ణింపబడుచున్నది; అథా-గోప్యః = మొట్టమొదట గోపికలున్నూ; తతః - కృష్ణః = తర్వాత కృష్ణుడున్నూ; గోపీనాం-కృష్ణసంగమః = గోపికలు శ్రీకృష్ణునితో చేరడమును; గోపీ కృష్ణసంవాదః = గోపికలయొక్క శ్రీకృష్ణునియొక్క పరస్పర సంవాదమున్నూ

2. శ్లో॥ తతః = అనంతరము; గోపీపరిగ్రహః = గోపికలను స్వీకరించుటయున్నూ; అస్మిన్ షష్ఠే = ఈషష్ఠ తరంగమునందు; రాసారంభః = రాసక్రీడ ప్రారంభమున్నూ; సంగ్రహేణ = సంక్షేపముగా (క్లుప్తంగా); ఏవం = ఈక్రిందిరీతిని; నిగద్యతే = బాగా చెప్పబడుచున్నది.

శ్రీకృష్ణగోపీసమాగమవర్ణనమును నీషష్ఠతరఙ్గమును బృందావనమునందు గోపికలకును, కృష్ణునకు గల్గినసమాగమము వర్ణింపఁబడును. ఇందు మొదట గోపికలును పిదప కృష్ణుఁడును బృందావనమునందుఁ బ్రవేశించుటయు, అచ్చట వారలు కలసికొనుటయు, ఒకరితో నొకరు సంభాషించుకొనుటయు, కృష్ణుఁడు వారిం బరిగ్రహించుటయు ననునది కథాసంగ్రహము.

### శ్రీకృష్ణగోపీసమాగమవర్ణనమ్

శ్లో. శారదేవ శరదాగతా స్వయం తారకోదయవిశేషభాసురా,
వారిదేషు సలిలేషు ధీమతాం స్మారితార్థమవభాసయంత్యసౌ

3. శ్లో॥ శరత్ = శరత్కాలము; స్వయం = సాక్షాత్తుగా; శారదా, ఇవ = సరస్వతీదేవి, వలె (తెల్లగా); ఆగతా = వచ్చినదై; తారక = నక్షత్రములయొక్క; ఉదయ = గోచరమును (అగుపడుటను); విశేష = విశేషముగా; భాసుర = ప్రకాశింపచేయుచున్నది. మరియు; సలిలేషు వారితేషు = వర్షము నివారణకాగా; ధీమతాం = బుద్ధిమంతులవల్ల; స్మారితార్థం = జ్ఞావకము చేసుకొనబడిన

కార్యకలాపమును; అసౌ = ఈశరత్కాలము; అవభాసయతి = విశేషముగా ప్రకాశింపచేయుచున్నది.

ఇట్లు కొంతకాలము గడచినపిదప సరస్వతియునుబోలె నతినిర్మలమైన శరదృతువువచ్చెను. వర్షములుకురిసి ముగియుటచేత నాకాశమంతయు శుభ్రమైనక్షత్ర కాంతులను మిగుల నిర్మలములఁ జేయుచు నాఋతువునకు వన్నెఁబెట్టుచుండెను. బుద్ధిమంతులగువారు తాము వర్షఋతువునందు చేయుటకు వీలులేక నిలిపియుంచిన కార్యశేషముల స్మరణకుఁ దెచ్చుకొని పనిచేయు చుండిరి.

గ. తత్ర భగవతి శ్రీనివాసే పరిపాలితనిజదాసే సంతతానంత కల్యాణగుణగణనవరత్న రత్నాకరే సరళమురళీనాదసముదం చితవివిధగీత సముద్ఘోషమందగమనోల్లాసవివిధ విలాసబహుతరకల్లోలజాలే భువనసుందరే శ్రీకృష్ణే విహరతి తస్మిన్ వ్రజ యువతీమనోనద్యః స్యందమానాః సమభివ్య క్తశారదవిమలీకృతవృత్తివిశేషాను భవరసాఢ్యాఃతథైకరస్యమభిలషంత్యస్సత్వ రమావివిశుః ఇత్థంచతాసాంవచో విలాసాః ప్రాదుర్బభూవుః.

గద్య:- తత్ర = అక్కడ (అబృందావనమందు); భగవతి = షాడ్గుణ్యపూర్తిగలిగినటువంటిన్నీ; శ్రీనివాసే = లక్ష్మీభర్త అయినటువంటిన్నీ లక్ష్మీఅమ్మవారికి ఉనికిపట్టు అయినటువంటిన్నీ; పరిపాలితనిజదాసే = నిజదాసులను పరిపాలించుచున్నట్టిన్నీ; సంతతం = ఎల్లప్పుడు ఉండునటువంటిన్నీ, శాశ్వతమైనట్టిన్నీ; అనంతం = అంతములేని; కల్యాణగుణగణ = మంగళప్రదమైన గుణసమూహములనెడు; నవరత్న = నవవిధములైన రత్నములకు; రత్నాకరే = సముద్రుడైనట్టిన్నీ; సరళ = శ్రావ్యమైన; మురళినాద = వేణునాదముతో; సముదంచిత = బాగా ఒప్పుచున్న; వివిధగీత = అనేకవిధములైన గానములయొక్క; సముద్ఘోష = గొప్పధ్వనియున్నూ; మందగమన = నెమ్మతియైన విహారమున్నూ; ఉల్లాస = ఉత్సాహము; వివిధ విలాస = అనేకవిధములైన శృంగారాది విలాసములున్నూ (ఇవి అన్నియు); బహుతర = అనేకములైన; కల్లోలజాలే = తరంగములయొక్క సమూహము కలిగిన సముద్ర స్వరూపుడున్నూ; భువనసుందరే = సమస్తలోకములను మోహింపజేయునట్టి, సుందరుడున్నూ అయినటువంటి; తస్మిన్ శ్రీకృష్ణే = ఆ శ్రీకృష్ణస్వామివారు; విహరతి = విహరించుచుండగా; వ్రజయువతీ మనో నద్యః = గోకులమందు నివసించు స్త్రీలయొక్క మనస్సులనే నదులు; స్యందమానాః = ప్రవహించుచున్నవియై; సమభివ్యక్త = చక్కగా గోచరించుచున్నట్టి; శారద విమలీకృత = శరత్కాలముచేత నిర్మలముగా చేయబడినటువంటి; వృత్తివిశేషానుభవ = వ్యాపారవిశేషములయొక్క అనుభవమనెడు; రసాఢ్యాః = నీళ్ళతోకూడుకున్నవి అయి; తతు = ఆశ్రీకృష్ణస్వామితో, ఐకరస్యం = సమమగు ఆనందముతో (సమానమైన ఆనందరసమును కలిగివుండుటను); అభిలషంత్యః = కోరుచున్నవారలై; సత్వరం = శ్రీఘ్రముగా; అవివిశుః = ప్రవేశించిరి (మానసికముగా ప్రవేశించిరి); ఇత్థంచ = ఈప్రకారము; తాసాం = ఆగోపికా అమ్మవాళ్ళయొక్క; వచోవిలాసః = వాగ్విలాసములు; ప్రాదుర్బభూవుః = వెలుపలికి ప్రవేశించినవి. (అనగా వాగ్విలాసములు బయలుదేరినవి ఆయెను)

అకాములమునందు భక్తరక్షకుండును, శ్రీనివాసుండును అగు నాభగవంతుఁడు బృందావనమున విహరించుచుండెను. అప్పుడు తన కల్యాణగుణములు రత్నములుగా, నానావిధములగు విలాసములును, మందగమనంబును, మధురంబగు వేణుగానంబును తరఙ్గములుగా నమ్మహాత్ముఁడు మహాసముద్రముతోఁ బోల్ప ననువైయుండెను. మఱియు శరదృతువు విజృంభించుటచే జనించియివి, యవి యనరాక ననిర్దేశ్యములై యనుభవమాత్రగోచరములై యుండు నిర్మలసంకల్పములే జలములుగాఁ గలిగి, గోపికాచిత్తనదులు తక్షణమే శ్రీకృష్ణ సముద్రమున కభిముఖములై ప్రవహించి యందుఁగలసెను. జగన్మోహనుఁడగు నాకృష్ణునియం దెవ్వని కనురాగము జనింపదు? ఇట్లు కృష్ణునియం దనురక్తులై యాగోపికలు తమలో నిట్లని సంభాషించుకొనిరి.

కేదారగౌళ (తోడీ) రాగము - ఆదితాళము

ప. పరమపురుష మనుయామవయంసఖి - పరమపురుషమనుయామ

అ. సురుచిరహాసం సుందరవాసం తరుణారుణకి రణాధరసరసం

1. నందకుమారం నగవరధీరం బృందావనభువి వివిధవిహారం
బృందారకగణవందితచరణా రవిందమిళితమణిమధుకరనికరం

2. భావుకచరణం భవసంతరణం భవ్యసేవకజనభాగ్య వితరణం
అవ్యయవిమలవిభూతివిజృంభితదివ్యమణిరచితవివిధాభరణం

3. పరమోదారం పాపవిదూరం స్మరసహస్ర సమానముదారం
విరచితమురళీగీతరసామృత భరితఘనంఘనకౌస్తుభహారం

4. యువతీగీతం యోగిసులలితం కవిజనమానసకమలవిలసితం
శివనారాయణతీర్థవిరచితం శ్రీగోపాలదయారసమిళితం

# షష్ఠ తరఙ్గము

### 1వ కీర్తన - కేదారగౌళ - ఆదితాళం

ప॥ సఖి! వయం = ఓ చెలికత్తియా! మనము; పరమపురుషం = అప్రాకృతమైన; పురుషుడైన కృష్ణుని; అనుయామ = అనుసరింతమా!

అ॥ సురుచిరహాసం = మనోహరమైన చిఱునవ్వుతోనున్నూ; సుందరనాసం = అందమైన నాసికతోనున్నూ; తరుణ = లేత; అరుణకిరణ = సూర్యకిరణములవంటి; అధర సరసం = పెదవిచేత ఒప్పువారున్నూ అయిన శ్రీకృష్ణమూర్తిని; అనుయామ = అనుసరింతమా!

1. నందకుమారం = నందునియొక్క కొమారుడున్నూ; నగవరధీరం = మహామ్మేరువుతో సమానమైన ధైర్యముగలవాడున్నూ; బృందావనభువి = బృందావన భూమియందు; వివిధ విహారం = అనేకవిధములైన విహారములుగలవారున్నూ; బృందారక గణ = దేవతలయొక్క సమూహములచేత;

వందిత = నమస్కరింపబడుచున్న; చరణ = పాదములనెడు; అరవింద = కమలములయందు; మిళిత = చేరియుండు; మణి = మణులు అనునట్టి; మధుకర = తుమ్మెదలయొక్క; నికరం = సమూహములుగలవారున్నూ అగు పరమ పురుషం అనుయామ!

2. భావుకచరణం = శుభప్రదమైన పాదములుగలవాడున్నూ, భవసంతరణం = సంసారమును తరింపజేయువాడున్నూ, భవ్య = శుభప్రదులగు; సేవకజన = దాసజనులకు; భాగ్య వితరణం = బ్రహ్మానందమును యిచ్చునట్టివాడున్నూ; అవ్యయ విమల = శాశ్వతమైనట్టిన్నీ, ప్రకృతి మాలిన్యములేనట్టిన్నీ; విభూతి విజృంభిత = విశ్వర్యముతో పుష్కలముగా నుండునట్టి; దివ్యమణి ఖచిత = అప్రాకృతమైన మణులచేత పొదగబడినట్టి; వివిధ ఆభరణం = అనేకవిధములైన ఆభరణముఖుగలవారున్నూ - అగు పరమపురుషం అనుయామ

3. పరమ ఉదారం = శ్రేష్ఠమైన ఔదార్యముగలవాడున్నూ, పాప విదూరం = పాపమునకు దూరముగా నుండువాడున్నూ; స్మరసాయక = మన్మథబాణములగు పుష్పములను గూర్చిన; స్రక్ + ధరం (స్రగ్ధరం) = మాలికలనుధరించినటువంటివాడున్నూ; అతి చతురం = గొప్పనేర్పుగలవాడున్నూ; విరచిత = చేయబడుచుండు, మురళీగీత = వేణుగానముయొక్క; రస అమృత = రసమనెడు అమృతముచేత; భరిత = నిండింపబడుచున్నటువంటి; ఘణంఘణ = ఘణఘణ శబ్దముతో మెఱయుచున్నటువంటి; కౌస్తుభహారం = కౌస్తుభమణి సహితమైన హారముగలవాడున్నూ - అగు పరమపురుషం

4. యువతీగీతం = గోపికలవల్ల గానము చేయబడినట్టిన్నీ; యోగి సులలితం = యోగులకు మిక్కిలి మనోహరమైనట్టిన్నీ; కవిజనమానస = విద్వాంసులయొక్క మనస్సులనే; కమల విలసితం = కమలములయందు ప్రకాశించుచుండునట్టివి; శ్రీగోపాలదయారస మిళితం = శ్రీకృష్ణునిదయతో గూడుకున్నట్టిన్నీ అగు ఈకీర్తన; శివనారాయణ తీర్థవిరచితం = శివనారాయణతీర్థులవల్ల చెప్పబడినది.

ప. ఓచెలీ! మనమాకృష్ణు ననుసరింతము.

అ. ఎఱ్ఱని పెదవితోడను, చక్కని నాసికతోడను, నగుమొగముతోడను బ్రకాశించు నా సరసుని అనుసరింతము.

1. దేవతలందఱును తమ కిరీటములయందున్న యింద్రనీలమణులు తుమ్మెదలంబోలె నెవ్వని పాదపద్మముల సోఁకునట్లు నమస్కరించుచున్నారో, అట్టినందకుమారుఁడు మిగుల ధైర్యముతో నిపుడు బృందావనమున విహరించుచున్నాఁడు. (ఇచ్చట ధైర్యమనఁగా మన్మథునకు లోఁబడకుండుట).

2. నిర్మలమగు నీకృష్ణావతరామును బూని నానావిధరత్నభూషణములచే నలంకృతుఁడై విహరించు నయ్యనంతునిపాదము నాశ్రయించిన నన్నివిధములగు సౌఖ్యములును గల్గును. సంసారనివృత్తియై మోక్షముకూడ దొరకును.

3. పాపరహితుఁడగు నామహాత్ముఁడు కౌస్తుభరత్నంబును, నానావిధ పుష్పమాలికలను గంఠమునధరించి (ఇచట "స్మరసాయక=పువ్వు" అను పదము ప్రయోగించుటవలన గోపికలకుగల మదనతాపము స్పష్టమగుచున్నది) మిగుల చమత్కారముగా వేణుగానము సేయుచు వీనులయం దమృతరసమును వర్షింపుచున్నాఁడు.

4. యోగులకుఁకూడ మనోహరమై, కవుల మానసముల రంజింపఁజేయునదియై, శ్రీకృష్ణుని దయను గల్గించునదియై యున్న యీ గోపికా వాక్యమును నారాయణతీర్థులు గీతముగా రచియించెను.

శ్లో. భోభోవ్రజపురనార్యః శారదసమయం పరం శివం మత్వా,
కృపయాతస్యభజామో గోవిందం ప్రాహురితిసదాన్యోన్యమ్.

5. శ్లో॥ భోభో వ్రజపుర నార్యః = రేపల్లెలోని ఓ గోపికలారా; శారదా సమయం = ఈ శరత్కాలమును; పరంశివం మత్వా = పరశివునివలె తలచినవారమై; తస్య కృపయా = ఆ పరశివుని దయచేత; గోవిందం భజామో = శ్రీకృష్ణుని భజించెదము; ఇతి సదా = ఇట్లని ఎల్లప్పుడు; అన్యోన్యం ప్రాహుః = ఒకరితోనొకరు చెప్పుకొనిరి.

ఓ వ్రేపల్లెలోని వనితలారా! ఈశరత్కాలము ప్రత్యక్షముగా పరమశివుఁడు. దీనిని బాగుగదెలిసికొని మనమిపుడే శ్రీకృష్ణునియొద్దకుఁ బోవుదము. ఆసర్వేశ్వరునికృప మనకిప్పుడు కలిగినది. అని యాగోపిక లొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి.

శరదృతువర్ణనమ్

కళ్యాణీ (సారంగ) రాగము - త్రిపుటతాళము

ప. శంకే శంకరం శారదసమయం
పంకేరుహపరాగవిభూతిధవళం

1. పాపపంకశోషణపటుతరరవికిరణం
పరిహృతాపరిమితఘనావరణం
కపట కేతకకుసుమభారవిరహిణం
కలితతారకగణస్ఫటికాక్షాభరణం

2. పరపురుషసురతిపతి కామవిదూరం
పండితమండలపరమాహ్లాదకరం
వరహంసగతివిఘ్న పాటనచతురం
వాంఛితసముదితఫలవిధాతారం

3. నిర్మలరసపూరనిరుపమగంగం
నిఖిలమానినీజనమానవిభంగం
శర్మదశిఖరసరసోత్తమాంగం
సముదిత గోవింద కృత బహుసంగం

4. ఇతి గోపవధూగీత మిద మతిలలితం
ఈశోపమశారదసమయవిలసితం
యతివరశివనారాయణతీర్థఫణితం
యాదవాబ్ధిజరత్న సమ్మిళితం

ప॥ శారద సమయం = ఈ శరత్కాలమును; శంకరం శంకే = సాంబమూర్తిగా భావించుచున్నాము; పంకేరుహ పరాగ = కమలములలోని పుప్పొడి అనునట్టి; విభూతి ధవళం = విభూతిచేత తెల్లగా ఒప్పుచున్నది

1. పాప పంక = పాపమనెడు బురదను; శోషణ = ఎండింపచేయుటకు; పటుతర = మిక్కిలి ధృఢమైన; రవికిరణం = సూర్యకిరణములు కలదిన్నీ; పరిహృత = తీసివేయబడినట్టి; అపరిమిత = మతిలేని; ఘన = మేఘములను; అవరణం = అజ్ఞానముగలవారున్నూ; కపటి కేతకికుసుమం = కపటము గలిగిన మొగలిపువ్వుయొక్క; భారం విహరణం = భారమును లేనట్టిన్నీ; కలిత = ఒప్పుచున్నటువంటిన్నీ లేక కూడుకున్నటువంటిన్నీ; తారకగణం = నక్షత్ర సమూహములనెడి; స్ఫటికాక్షి = స్ఫటికజపమాలను; ఆభరణం = అభరణముగా గలిగినట్టిన్నీ.

2. పరపురుష = పురుషోత్తమునియందు; సురతి = భక్తిచేత; పతి = భర్తలయందువున్నట్టి; కామ = మోహమును; విదూరం దూరీకృతము చేయనట్టివారున్నూ; పండిత మండలం = జ్ఞానుల సమూహమునకు; పరమ = శ్రేష్ఠమైన; అహ్లాద = సంతోషముఉ; కరం = చేయునట్టివారున్నూ; వరహంస = శ్రేష్ఠమైన హంసలయొక్క (అవధూతలయొక్క); గతి = సంచారములకు; విఘ్న = వర్షరూపమైన విఘ్నములను లేక, కామక్రోధాది రూపమైన విఘ్నములను; పాటన = నశింపజేయుటయందు; చతురం = నేర్పుగలది (నేర్పుగలట్టివారున్నూ అగు); వాంఛిత = కోరికలయందు; సముదిత ఫల = పుట్టుచుండు ప్రయోజనములను; విధాతారం = కలుగజేయునందు (కలుగజేయువారున్నూ).

3. నిర్మల = స్వచ్ఛమైన (మాలిన్యరహితమైన), రసపూత = నీళ్ళతోనిండిన; నిరుపమ = అసమానమైన; గంగం = గంగను ధరించినవారున్నూ; నిఖిల = సమస్తమైన; మాననీజన = పతివ్రతా జనములయొక్క; మాన = అభిమానములను; విభంగం = విశేషముగా భంగపఱచునట్టిదిన్నీ; శర్మద = సుఖమును యిచ్చునట్టిన్నీ; శశిధర = చంద్రుని ధరించునటువంటి; సరస = శ్రేష్ఠమైన; ఉత్తమాంగం = అకాశముగలదిన్నీ (శిరస్సుగలవారున్నూ); సముదిత = లెస్సగా అవతరించినటువంటి; గోవిందం = శ్రీమహావిష్ణువుతో; కృత = చేయబడిన; బహుసంగం = విశేషముగా సాంగత్యముగలదిన్నీ (సాంగత్యము చేసినవారున్నూ) అగు

4. ఇతి = ఈప్రకారముగా; గోపవధూగీతం = గోపస్త్రీలచేత గానము చేయబడినది; ఇదం = ఈగానము; అతి లలితం = మిక్కిలి శ్రావ్యమైనది; ఈశ = సాంబమూర్తికి; ఉపమ = పోల్చబడినది; శారద సమయం = శరత్సమయముగా; విలసితం = ఒప్పుచున్నఇ (ప్రకాశించుచున్నది); యాదవాబ్ధి = యదువంశమనే సముద్రమునందు; జా = పుట్టినటువంటి (శ్రీకృష్ణుడు అనునట్టి); రత్న = రత్నముతో; సమ్మిళితం = చేరియుండునది యగు ఈ కీర్తనను; యతివర = యతిశ్రేష్ఠమైన; శివనారాయణతీర్థ = శివనారాయణ తీర్థులవారిచేత; ఫణితం = చెప్పబడినది.

ఈ శరత్కాలము ప్రత్యక్షముగా నీశ్వరుడే. ఈశ్వరునివలె నీఋతువుకూడ కమలరజమను భస్మమును ధరించి తెల్లగనున్నది.

1. మఱియుఁ బాపములను బురద నెండింప సూర్యకిరణజాలమువలె నొప్పునదియు, మేఘావరణము లేనిదియు, కపటకేతకీకుసుమభారంబుల విరహితమగునదియు, నక్షత్రమాలయను స్ఫటికమాలను ధరించునదియు

2. మన్మథవికారములకు విదూరమయినదియు, పండితమండలిని సంతోషపఱచునదియు, శ్రేష్ఠములగుహంసల (వరమహంస) యొక్క విఘ్నములఁ బోఁగొట్టుచున్నదియు, గోరినకోరికలనెల్ల నొడఁగూర్చునదియు;

3. నిర్మలమగు నీటిచేఁ బ్రకాశించు గంగానదిగలదియు, సకలయువతుల యభిమానమును బోఁగొట్టునదియు, శుభకరమగు చంద్రకలను ధరించినదియు, గోవిందునితో సంబంధముఁ జేసినదియునగు నీశరదృతువు శివునివలెఁ బ్రకాశించుచున్నది.

4. ఈశ్వరునకు శరత్కాలమునకుఁ బోల్చబడినదియు, శ్రీకృష్ణరత్నముచేఁ గూర్పఁబడిన యీగోపవధూగీతము శివనారాయణతీర్థునిచేఁ బాడఁబడినది.

శ్లో. ఇతిప్రలపతి వ్రజే శరది గోపికామండలే
సుధాకిరణమండలే పరిహృతాంధకారే నిశి,
పరాక్ప్రవణమానసాస్సఖిలు కృష్ణ సారాఃస్ఫుటం
మురారిమురళీరవస్సపది తాస్సమాకర్షతి.

వ్రజే = గోకులమునందు; శరది = శరత్సమయమునందు; నిశి = రాత్రియందు; పరిహృతఅంధకారే = చీకటినిపోగొట్టునట్టి; సుధాకిరణముండలే = చంద్రమండలము ప్రకాశించునప్పుడు; గోపికామండలే = గోపికల సమూహము; ఇతి = ఈవిధముగా (లోగడి విధముగా) ప్రలపతి = విలపించుచుండగా; సఃమురారి = ఆ శ్రీకృష్ణుని యొక్క; మురళీరవ = వేణునాదము; పరాక్ = ప్రపంచాతీతమైన పరమాత్ముని యందు; ప్రవణ మానసాః = చేరిన మనస్సులుగలవారైనట్టి; కృష్ణసారాః = జింకలకు పోల్చబడదగిన; తాః = ఆ గోపికలకు; సపది = తక్షణమే; స్ఫుటం = దృఢముగా; సమాకర్షితఖిలు = చక్కగా ఆకర్షించుచున్నదిగదా.

ఇట్లు గోకులమునందు గోపికలు విలపించుచుండఁగా రాత్రియయ్యెను. చంద్రుఁడును తనయమృతములగు కిరణములచే చీఁకటిం బోఁగొట్టి ప్రకాశించుచుండెను. ఆసమయమున శ్రీకృష్ణుఁడు చేయుచుండిన మధురమగు వేణుగానముచే నాకర్షింపబడి, యాగోపికలందఱును తమకు నివారింపనలవిగాని చిత్తవికారములతో బృందావనమునకుఁ బోయిరి. అప్పుడు వారిదృష్టులు కామవికారమువలన జెదరుచు, కనుగ్రుడ్లుయొక్క నీలకాంతిని వెదఁజల్లుచుండెను.

శ్లో. కాపిగోపీ పరం కాంతం కామచారఫలోదయం
గంతుకామేతరాం గోపీం త్వరయంతీదమాహ తామ్.

7వ శ్లో॥ కాపీ గోపీ = ఒకానొక గోపికా అమ్మవారు; కామచార = ఇంద్రియములకు లోబడకుండా స్వేచ్ఛావిహారమనునట్టి; ఫల ఉదయం = ఫలమును కలుగజేయునట్టి; కాంతం = ప్రియుడైన, పరం = పరమపురుషుడైన శ్రీకృష్ణస్వామివారిని; గంతుకామా = పొందగోరినది అయి; ఇతరాం గోపిం = మరియొక గోపికను గూర్చి; త్వరయంతి = త్వరచేయుచున్నదియై; తాం = ఆ గోపికనుగూర్చి; ఇదం ఆహ = ఈక్రింద చెప్పబోవు ప్రకారము పలికెను.

అప్పుడొకానొకగోపిక కామవిహారమునందు మిగుల నిపుణుఁడగు శ్రీకృష్ణునికడకుఁ ద్వరతోఁ బోవుచు రెండదానింజూచి యిట్లనియెె. ఓ చెలీ! మనకు ప్రియుఁడగువాఁడు మిక్కిలి యుత్తముఁడు. (పరమాత్ముఁడనియు నర్థము)

## గోపిక లన్యోన్యము సరససల్లాపంబు లాడుట

**ముఖారీ (పున్నాగవరాళి) రాగము - త్రిపుటతాళము**

ప. బృందావన మధునా మన్యే సఖి
బృహదారణ్య మహం

అ. సుందరతరవంశనాదసంసూచితస్వా
నందబోధామృతమయపురుషం

1. ఉన్నతశాఖాగ్రపరానంద
నిర్ఝరరసపూరఫలభారం
పుణ్యవతా మతిరమణీయ మమరేంద్ర
వర్ణితభూమపదం భవపారం

2. మునివరపరిసేవితం మోహవిరామ
మూల మశేషవిశేషాస్పదం
అనికేతనికేతన మఖిలశోకహర
మనుదయలయపరతరసిద్ధఫలదం

3. సక్ృ దిదమవలోకితంసమ్యగిహ
స్వసుతకళత్రాదిధరవిరసం
ప్రకటయతిపరమహంసనసమాకుల
మమలమానసవృత్తివిలసితసరసం

4. పరిహృతరిపువర్గం పరమయోగి
పరిపూర్ణభావవి శేషోదయం
హరిపరభావనయాగోపికాగీత
మితిఫణితం నారాయణతీర్థయతినా

3వ కీర్తన ముఖారి (పున్నాగవరాళి) - త్రిపుట

ప॥ సఖి! = ఓ చెలీ!; అధునా = ఇప్పుడు; అహం = నేను; బృందావనం = బృందావనమును; బృహదారణ్యం = బృహదారణ్య ఉపనిషత్తుగా; మన్యే = తలచుచున్నాను.

అ॥ సుందరతర = అత్యంతసుందరమైన; వంశనాద = వేణునాదముచేత (సద్వంశములైన యోగులయొక్క వాక్యములచేత); సంసూచిత = లెస్సగా సూచింపజేయబడిన; స్వానంద = స్వరూపానందమున్నూ; బోధ = జ్ఞానమున్నూ; అమృత, మయ = శాశ్వతత్వమున్నూ, నిండిన; పురుషం = పరమ పురుషుని కలిగిన బృందావనం అను బృహదారణ్య ఉపనిషత్తుగా; మన్యే = తలచుచున్నాను.

1. పరానంద = నిర్విషయానంద; నిర్ణయ = నిర్ణయమనునట్టి; రసపూర = రసముతోనిండినట్టి; ఫల.......భారం = ఫలములయొక్క బరువుగల్గినట్టి; ఉన్నతశాఖాగ్రం = ఎత్తైన కొమ్మకొనలుగలదిన్నీ; పుణ్యవతాం = పుణ్యవంతులకు; అతిరమణీయం = మిక్కిలిమనోహరమైనదిన్నీ; అమరేంద్ర వర్ణితం = దేవేంద్రునివల్ల వర్ణింపబడుచున్న; భూమ = సర్వవ్యాపక బ్రహ్మమునకు; పదం = స్థానభూతమైనదిన్నీ; భవపారం = సంసారసముద్రమునకు గట్టైనది అగు; బృందావనం = ఈ బృందావనమును బృహదారణ్య ఉపనిషత్తుగా; మన్యే = ఎంచుచున్నాను.

2. మునివరవరిసేవితం = వేదార్థమును మననసాచేయువారిలో శ్రేష్ఠులచేత చక్కగా సేవించబడుచున్నదియు; మోహ విరామమూలం = అజ్ఞానమును నశింపజేయుటకు మూలకారణమైనట్టియు; అశేష = సమస్తమైన; విశేషాస్పదం = విశేషములకు స్థానమైనదియు; అనికేత నికేతనం = ఉండచోటులేనివారికి స్థానమైనదియు; అఖిలశోకహరం = సమస్తదుఃఖములను హరించునదిన్నీ; అనుదయలయ = జనన మరణరహితమై; పరతర = సర్వశ్రేష్ఠమైన; సిద్ధి = అనుభవరూపమైన; ఫలదం = ఫలమును ఇచ్చునట్టిదయు అగు - బృందావనం మన్యే.

3. ఇదం = ఈ బృందావనమును అనగా బృహదారణ్య ఉపనిషత్తును; ఇహ = ఇక్కడ; సకృత్ = ఒక్కసారి అయినా; సమ్యక్ = జ్ఞానముతో; అవలోకితం = చూడబడినయడల; స్వ సుత = తనయొక్క బిడ్డలయ్యందున్నూ; కళత్ర = భార్యలయందున్నూ; ఆది = మొదలుగువారినిమిత్తమై; కృత = చేయబడిన (సంపాదించబడిన); ధన = ద్రవ్యములయందున్నూ; విరసం = వైరాగ్యము కలుగజేయునదియు; ప్రకటిత = ప్రసిద్ధమైన; యతి = సన్యాసుల చేతనున్నూ; పరమహంస = అవధూతలచేతనున్నూ; సమాకులం = నిండినదియు; అమల = నిర్మలమైన; మానస =

మనస్సులయొక్క; వృత్తి = ప్రవర్తనచేత; విలసిత = ఒప్పుచున్నట్టి; సరసం = రసప్రదమైనట్టిదిన్ని అగు ఈ బృందావనమును బృహదారణ్య ఉపనిషత్తుగా తలచుచున్నాను - అని

4. పరిహృతరిపువర్గం = పరిహరింపబడిన శత్రుసమూహములు కలదిన్నీ; పరమయోగి = యోగిశ్రేష్ఠులకు; పరిపూర్ణ = పూర్ణబ్రహ్మమునందలి; భావవిశేష = భక్తియోగ విశేషమును;ఉదయం = కలిగించునదియు - అగు, ఈ బృందావనమును బృహదారణ్య ఉపనిషత్తుగా తలచుచున్నాను; హరి = శ్రీహరియే; పర = పరాత్పరుడనుట్టి; భావనయా = అభిప్రాయముచేత; గోపికాగీతం = గోపికలవల్ల గానము చేయబడినదిన్నీ; ఇదం = ఈకీర్తన; నారాయణతీర్థయతినా = నారాయణతీర్థులనట్టి యతిశ్రేష్ఠులచేత; ఫణితం = చెప్పబడినది.

ప. ఓచెలీ! ఈబృందావనము బృహదారణ్యోపనిషత్తురూపమని తలంచుచున్నాను.

అ. ఆవనమునందు వేణుగానముచే సత్యజ్ఞానానందస్వరూపుఁడగు పరమపురుషుఁడు సూచింపఁబడుచున్నాఁడు. (ఉపనిషత్తునందు శ్రేష్ఠమగువంశములగలవారియొక్క యాజ్ఞవల్క్యుండు మొదలగు మహాపురుషులయొక్క వాక్యములచే పరబ్రహ్మము సూచింపఁబడెనని భావము)

1. పరబ్రహ్మానుభవమువలన కలుగునానందముతో సమానమగు రుచిగలపండ్లు అవనమునందలి వృక్షశాఖలలోఁగలవు (రెండవపక్షమునందు) బృహదారణ్యకోపనిషత్తు మిగుల నుత్తమమగు వాజసనేయశాఖాంతమున నిలిచి పరమానందస్వరూపుఁడగు బ్రహ్మమును నిర్ణయించుటయే ఫలముగ ప్రవర్తించుచు నానందమును గల్గించుచున్నది. దేవేంద్రుఁడుకూడ స్తోత్రముచేయునట్టి యాపరమాత్మునకు (కృష్ణునకు) నివాసమగుటచే సంసారమును దరింపఁజేయుచు నీవనము పుణ్యాత్ములకు మిగులమనోహరమైయున్నది. (రెండవపక్షమునందును ఈ అర్థము సమానమే)

2. ఈవనము (ఉపనిషత్తు) ఇదియాశ్రయమని, లేక సర్వవ్యాపియగు పరమేశ్వరునకు (కృష్ణునకు, లేక పరమాత్మునకు) నివాసస్థానమగుటచే శోక మోహములఁ బోఁగొట్టుననియు, ఉత్పత్తియును నాశనమునులేక అన్నిటిలోన నుత్తమమై స్వతస్సిద్ధమైయుండు (ఒకపనిచేయుటవలనఁ గలుగక, సర్వకాలములందు నొకటేవిధముగ నుండునది) మోక్షమునొసంగుననియు, సకలవిధములగు విచిత్రములకును (సర్వప్రపంచమునకును) ఆశ్రయమనియు, మునీశ్వరులు దీనిని సేవించుచున్నారు. (ఉపనిషత్తు ప్రపంచవికారములఁగూర్చి చెప్పనుగావున "సకలప్రపంచములకాశ్రయము" అని చెప్పఁబడియున్నది)

3. దీని నొక్కమారు చూచిన నీప్రపంచమునందలి పుత్రులు, మిత్రులు ధనము మొదలగువానియందుండు విరక్తిభావము బాగుగబయల్పడును. మఱియు శ్రేష్ఠములగు హంసలకు (పరమహంసలను సన్న్యాసులకు, లేక పరమాత్మజీవులకు అని ఉపనిషత్పక్షమునందర్థము) నాశ్రయమగుటచే మానససరస్సుతోఁ గూడియున్నట్లు (పరిశుద్ధమగుచిత్తవృత్తిగలవారితో కూడియున్నదియు, లేక పరిశుద్ధమగు మనస్సుగలవారికి) మిగుల నానందకరమై యున్నది.

4. ఇందు ప్రవేశించిన శత్రువుల (కామక్రోధాదుల) బాధయుండదు కావున దీనిఁ జేరినవారందఱును పరమేశ్వరరూపులుగాఁగాని, లోకోత్తరులగు యోగులుగాఁగాని యయ్యెదరు. అని యిట్లు శ్రీకృష్ణుని పరమాత్మగా నెఱింగి యొకగోపిక చెప్పెనని నారాయణతీర్థయతివరుఁడు వ్రాసెను.

గ. ఇత్థమన్యోన్యస్నేహదయారసస్యందన ద్రవీకృతచిత్తవృత్తివిలా సోల్లాసితవాగ్వి లాసవత్యోగోకుల పురవరయువత్యోగోవింద బృందావనసము దంచితవిపులతరలక్ష్మీ విలాసలాస్యరంగ స్థలాయమానరమ్యవక్షో విశాలఫాలాది సుందరసర్వాంగం స్వకాం తమాలక్ష్య మదనమహీపతి కార్ముకమహామేఘనముద్గళితశత వర్షధారాఇవ నిబిడతరబృందారణ్యనిగూఢం నవనీతముషం సమాసాద్య సకలలో కాభీష్టఫలం ఫలయంతం విశ్వంభరా ప్రదేశమివ వర్షధారాశ్రుతయివ శ్రోత్రి యంసమధిగతా స్సత్వర మాజగ్ముః. నయనోత్పలాని చతస్మిన్ శ్రీనివాసే ప్రసారయామాసుః.

గద్య:- ఇత్థం = ఈప్రకారము; అన్యోన్య = ఒండొరులయందుగల; స్నేహ = స్నేహముయొక్క; దయ = దయయొక్క; రసస్యందన = రసప్రవాహముచేత; ద్రవీకృత = ద్రవముగా చేయబడిన; చిత్తవృత్తి విలాస = మనోవృత్తివిలాసముచేత; ఉల్లసిత = ప్రకాశించిన; వాగ్విలాసవత్యః = వాచోవిలాసములుగలవారలై; గోకులపురవర యువత్యః = నందవ్రజమునందుగల శ్రేష్ఠలైన గోపభామలు; బృందావన = బృందావనమందు; సముదంచిత = లెస్సగా ఒప్పుచున్నటువంటి; విపులతర = విస్తారమైన; లక్ష్మీవిలాసస్య = లక్ష్మీక్రీడా విహారమునకు; రంగస్థలాయమాన = నాటకప్రదేశమని చెప్పబడదగిన; రమ్య = మనోహరమైన; వక్షః = వక్షస్థలమున్నూ; విశాలఫాల = విశాలమైన నొసలున్నూ; ఆది = మొదలగు; సుందర సర్వాంగం = సుందరమైన అవయవములు గలిగిన; గోవిందం = శ్రీకృష్ణుని; స్వకాంతం = తమకుప్రియునిగా; ఆలక్ష్య = భావించి; మదన = మన్మథుడనెడు; మహీపతి = రాజుయొక్క; కార్ముక = ధనువనెడు; మహామేఘ = గొప్పమేఘమునుండి; సముద్గళిత = చక్కగా కురిసిన; శతవర్షధారా ఇవ = బాణవర్షధారలవలె; నిబిడతర = అతిదట్టమైన; బృందారణ్య = బృందావనమందు; నిగూఢం = కేవలం తెలియబడక వేంచేసియుండు; నవనీతముషం = నవనీత చోరుడైన శ్రీకృష్ణస్వామివారిని; సమాసాద్య = సమీపించినవారై; సకలలోక అభీష్టఫలం = సమస్తజనులయొక్క కోరికలను; ఫలయుతం = ఫలింపజేయునట్టి; విశ్వంభరా ప్రదేశం = విశ్వమును పోషించునట్టి భూప్రదేశముమీద; వర్షధారా ఇవ = వర్షధారలు కురిసినట్టిన్నీ; శ్రోత్రియం = వేదాధ్యేతను (అనగా అధ్యనము చేయువాని); శృతయివ = వేదములు చేరినట్లు; సమధిగతా = లెస్సగా చేరినవారై; సత్వరం ఆజగ్ముః = త్వరగా, అభిముఖముగా సమాసించిరి; తస్మిన్ శ్రీనివాసే = ఆకృష్ణభగవానులయందు; నయనోత్పలాని = తమనేత్రములనునట్టి కలువను, ప్రసారయామాసుః = ప్రసరింపజేసిరి.

ఇట్లు గోపికలందఱును ఒకరిపైనొకరికిఁగల ప్రేమాతిశయము చేతను, దయచేతను మనసులు కరుగ, బహువిధములగు వాక్యములచే నొండొరుల యుత్సాహము నభివృద్ధిఁజేసికొనుచు

బృందావనమునకుఁబోయిరి. బృందావన లక్ష్మీ నృత్యముసేయు రంగస్థలములోయన మిగుల విశాములై యొప్పు వక్షస్థలము, నుదురు మొదలగు నవయవములతో నతిసుందరుఁడై యుపనిషత్తులచే ప్రతిపాదింపఁబడు పరమపురుషుఁడైయుండు నాకృష్ణునే తమకు భర్తగా వారు మదిలో భావింపుచుండిరి. ఆశ్రీకృష్ణుఁడును దట్ట మగునవ్వనమున నొకచో డాగియుండఁగా వీరలందఱును మన్మధుని ధనువునుండి వచ్చుబాణవర్షమువలె (మన్మధునిబాణములు గురితప్పునవికావు) నతివేగముతో నాయనను సమీపించిరి. మఱియు కోరినఫలముల ఫలించుభూమిపై వర్షధారలుఁపడునట్లు వేదములు ధర్మాత్ముఁడగు శ్రోత్రియునిఁ జెందునట్లు, ఆహరినిఁ జుట్టుకొని తమ నేత్రము లనియెడికలువలచే నాయనను బూజించిరి

శ్లో. జ్ఞాత్వా హరిః స్థిరం భావం పరస్మిన్ పుంసి యోషితాం,
అవిష్కరిష్యన్ గోవిందం స్తాసాం ప్రాహేద మాదరాత్.

8. శ్లో॥ హరిః = ఆశ్రితుల పాపములను హరించునట్టి; గోవిందః = శ్రీకృష్ణస్వామివారు, తాసాం యోషితాం = ఆ గోపభామలక; పరస్మిన్ పుంసి = పరమపురుషుడైన తనయందుగల; స్థిరంభావం = ధృడభక్తిని; జ్ఞాత్వా = తెలిసియు; అవిష్కరిష్యన్ = దానిని వెల్లడింపబోవుచు, ఆదరాత్ = ఆదరణ పూర్వకముగా; ఇద్దంప్రాహ = ఈ చెప్పబోవు వాక్యమును బల్కిరి.

శ్రీహరియు వారలమనను పరమాత్మునియందు (పరమాత్మ రూపుఁడగు తనయందు) స్థిరమైయున్నదని యెఱింగి దానినిఁ బ్రకాశింపఁజేయఁదలఁచి వారలతో నిట్లనియె.

## కృష్ణుఁడు గోపికలకు నీతిమార్గ ముపదేశించుట

శంకరాభరణరాగము - ఆదితాళము

ప. వల్లవాంగనా మా కలయత ధర్మోల్లంఘనం

అ. వల్లవాంగనా నిజవల్లభపదయుగ
పల్లవసేవన మేవ పరో ధర్మో

1. కులశీలకర్మాదికుళీరాదిజాలం
కోపసంతాపాదినిబిడకల్లోలం
అల మిహ సంసారజలధి మాగమకృత
కులధర్మసేతు రథ తారయతి బహుళం

2. రహసి నిశి వనే కిం రమణీయచరణం
మహనీయగృహపతి మపహాయ తరుణం
సహసా పరపురుషానుసరణే నాలమిహ
గృహపతి మిహ యాత గృహిణీ శరణం

3. గురుబంధుజనావజ్ఞా కుత్సితాచారం
పరిహరత కురుత పరిపరిహారం
త్వరయైవ గృహ మనుయాత పాతకబుద్ధి
మరివర్గ మపి పరిహరత నిస్సారం

4. పరిపూర్ణ బోధైకరసమఖిలసారం
పరమపురుష మనుసరత బాలగోపాలం
గురువరకరుణాసుధాసముదంచిత
శివనారాయణతీర్థయతిగీతమతులం.

4వ కీర్తన - శంకరాభరణరాగం - ఆటతాళం

ప॥ వల్లవాంగనా = హే గోపికలారా!; ధర్మోల్లంఘనం = ధర్మమును అతిక్రమించుట అనుపనిని; మా కలయత = చూడవద్దు (అంగీకరించవద్దు).

అ॥ వల్లవాంగనా = హే గోపాంగనలారా!; నిజవల్లభ = తమ భర్తలయొక్క; పదయుగ = పదద్వయమును; పల్లవ = చిగురుటాకులయొక్క; సేవనం ఏవ = సేవించుటయే; పరోధర్మం = శ్రేష్ఠమైన ధర్మముగా వున్నది.

1. కులశీలం = కులశీలమున్నూ, స్వభావమున్నూ; కర్మాది = సదాచారమున్నూ మొదలగునవి; కుళీరాదిజాలం = యండ్రకాయలు మొదలగు జలచరములు కలిగియుండునదిన్నీ; కోప = కోపమున్నూ; సంతాపాది = సంతాపం (వేదన) (తపన) మొదలుగనట్టి; నిబిడ = దట్టమైన; కల్లోలం = అలలుగలదిన్ని అగు; బహుళ = విస్తారమైన (విస్తరమైన); సంసారజలధిం = సంసారమనే సముద్రమును; ఇహ = ఇక్కడ (ఈ లోకమునందు); అథ = మంగళప్రదముగా; ఆగమకృత వేదచోదితమైన; కులధర్మసేతుః = కులము ధర్మమనే వారిధి; అలం = బాగా; తారయతి = తరింపచేయునదిగా యున్నది.

2. ఇహ = ఇక్కడ; వనే = వనమునందు; నిశిరహసి = రాత్రికాలమున, ఏకాంతముగా; కిం రమణీయ చరణం = తిరుగుట సరియగు పనియా; మహనీయ = పూజ్యుడయినట్టి; తరుణం = యుక్త వయస్సుకలిగి నట్టిన్నీ; గృహపతిం = భర్తను; అపహాయ = విడచి; సాహసా = సాహసముచేత; పరపురుష అనుసరణేన = ఇతర పురుషుని అనుసరించుట; అలం = చాలును; ఇహ = ఇచ్చట (ఈలోకములో); గృహిణీశరణం = భార్యకు రక్షకుడైనట్టి; గృహపతిం = భర్తనుగూర్చి; యాత = వెళ్ళండి.

3. గురు = గురువులనున్నూ; బంధుజన = బంధుజనులనున్నూ; అవజ్ఞా = అవమానించుట (నిరాకరించుట అనునట్టి); కుచ్ఛితాచారం = దురాచారమును; పరిహరత = విడిచిపెట్టండి; పర

= ఇతరులను; పరిహారం = విడిచిపెట్టుట అనుపనిని; కురుత = చేయుడు (వదలిపెట్టుడు); త్వరయా + ఏవ (త్వరైవ) = త్వరగానే; గృహం = ఇంటినిగూర్చి; అనుయాత = అనుసరించవలె నను ఉద్దేశ్యముతో వెళ్ళండి; పాతకబుద్ధిం = పాపబుద్ధిని; అరివర్గం అపి = కామక్రోధాది అరిషడ్వర్గములు కూడా, నిస్సారం = సారహీనమైనవి గనుక; పరిహరత = విడచిపెట్టండి

4. పరిపూర్ణ = సంపూర్ణమైనట్టి; బోధ = జ్ఞానమే; ఏకరసం = ముఖ్యమైన స్వరూపముగా గలిగినట్టిన్నీ; అఖిలసారం = సమస్తమునకు సారభూతుడైనట్టిన్నీ, పరమపురుషం = పరమాత్మ స్వరూపమైనట్టిన్నీ; బాలగోపాలం = శ్రీమన్నారాయణుని (శ్రీకృష్ణుని), అనుసరత (మానసికం) = అనుసరింపుడు; ఇతి గురువర = అని, గురుశ్రేష్ఠునియొక్క; కరుణా సుధా = కరుణామృతముచేత; సముదంచిత = ఒప్పుచున్న, శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులను; యతి = సన్యాసిచేత; అతులం = విస్తారముగా; గీతం = గానము చేయబడినది.

ప. ఓ గోపికలారా! మీరు ధర్మము నతిక్రమింపఁబోకుఁడు.

అ. మీమీభర్తల పాదముల సేవించుటయే శ్రేష్ఠమగు ధర్మము.

1. సంసారమనునది యొకసముద్రము. దానియందు కులము, స్వభావము, కర్మలు మొదలగునవి పెద్దయలలు. ఈసముద్రమును దాఁటుటకు వేదోక్తమగు కులధర్మమే యొకసేతువు. ఇంతకంటె (నీసముద్రముదాఁట) వేఱొకయుపాయము లేదు.

2. మీభర్తలను వదలి రాత్రికాలమున వనమున కేకాంతముగా వచ్చుటసరియగుపనియా? ఇట్లు సాహసించి పరపురుషు ననుసరింపఁదలంచుట యుక్తము గాదు. యౌవనవంతుఁడగు భర్త నాశ్రయింపుఁడు. భర్తకంటె మీకు వేఱొక దిక్కులేదు.

3. పరపురుషునాశ్రయించుట దురాచారము. పెద్దలును, బంధువులను దీని దూషింతురు. కావున దీనిని విడువుఁడు. దీనియందు సారమేమియును లేదు. పాపబుద్ధినివదలి కామక్రోధాదుల నిగ్రహించి శీఘ్రముగ గృహమునకుఁ జనుఁడు.

4. పరమగురువు ననుగ్రహముచే జ్ఞానసంపన్నుఁడైయున్న నారాయణ తీర్థునిచే వినుతింపఁబడుచున్నట్టియు, సత్యజ్ఞానానంద స్వరూపుఁడైనట్టియు, సర్వలోకములలోను సారభూతుఁడైనట్టియు, నాపరమాత్ముని గోపాలుననుసరింపుడు.

శ్లో. శ్రవణాంజలిభిర్గోప్యో గోవిందవచనామృతమ్,
పీత్వా పి జాతిస్వాభావ్యాల్లజ్జాభారభరైఃస్థితాః.

10. శ్లో॥ గోప్యః = గోపికలు; గోవింద వచనామృతం = స్వామివారి వాక్యమృతమును; శ్రవణాంజలిభిః = వీను దోయిళ్ళతో; పీత్వా + అపి (పీత్వాపి) = పానము చేసియు; జాతి స్వభావాత్ = స్త్రీ జాతి స్వభావ మనునట్టి; లజ్జా భార భరైః = లజ్జాభార భరమునందు; స్థితా = ఉన్నవారైరి.

ఆగోపికలును శ్రీకృష్ణునివాక్యామృతము నిట్లు వీనుదోయిళ్లతోఁ బానము చేసియు, స్త్రీ జాతిస్వభావమువలన లజ్జ గల్గి మాటలాడక యూరకుండిరి.

శ్లో. పునఃపునర్బోధయంతం ధర్మసారగిరా హరిమ్,
ఊచుర్గోప్యో హరేస్తత్త్వం వ్యంజయంత్యో యథాగమాః

11. శ్లో॥ ధర్మసారగిరా = ధర్మసారమును తెల్పెడు వాక్కుచేత; పునః పునః = మాటి మాటికి; బోధయంతం = బోధించుచుండునట్టి; హరిం = శ్రీకృష్ణస్వామివారినిగూర్చి; గోప్యః = గోపికలు; హరేఃతత్త్వం = శ్రీహరియొక్క స్వరూప యధార్థమును; యథా ఆగమా = వేదములవలెనే; వ్యంజయంత్యః = వివరించుచున్నవారలై; ఊచుః = పలికిరి.

అప్పుడు శ్రీకృష్ణుఁడును ధర్మయుక్తములగు వాక్యముల మరలమరలఁ జెప్పుచుండెను. దానిని విని కొంతసేపటికి వారును వేదములయ ట్లాహరి తత్త్వమును వివరించుచు నిట్లనిరి.

## గోపికలు కృష్ణు నుతించుట

మంగళకాపీరాగము - ఆటతాళము

ప. శరణం భవ కృష్ణ సంసరతాం భవకృష్ణ

అ. కరుణా తవసంసరణ పయోధిసం
తరణీతి వరమునిఫణితి రస్మాకం

1. ఆరంభణ మథ జగతి ఫలావధి
ధీరమునిభి రిహ నిశ్చితమఖిలం
భూరికృపాలయ మాహురి హాగమ -
సారం త్వా మఖిలాత్మక మమలం

2. నూనం త్రిభువనగృహిణీపతి రితి
గానం మహతా మనుసంవిదితం
శ్రీనందాత్మజ శ్రీవసుధాధిపా
నందం త్వా మనుయామో నిరతం

3. కామినీజనసకల కామదుహం పరమ
కారుణికం ప్రాహు రేవ భవంతం
కోమలగిరా గోపికాగణగీతం
గోవింద మితి నారాయణతీర్థభణితం

5వ కీర్తన - మంగళకాపీరాగం - ఆటతాళం

ప॥ కృష్ణ! = హేకృష్ణా!; సంసరతాం = సంసారచక్రమందు తిరుగుచున్నట్టిమాకు; శరణం = రక్షకుడవు; భవ = కమ్ము

అ॥ కరుణాతవ = మీయొక్క కరుణయే; సంసరణపయోధి = సంసార సముద్రమునుండి; సంతరణీతి = దాటించునది యని; అస్మాకం = మాకు, వరముని = శ్రేష్ఠమైనమునులవల్ల; ఫణతి = చెప్పబడినది.

1. అథ ఇతి = ఇట్లుండగా; జగతి = జగత్తునందు; ఆరంభణం = ఏదేని ఒక ప్రయత్నము చేయుట; ఫలావధి = ఫలమే అంత్యముగా గలిగియుండవలెనని లేదా లోకమునందు జరుగున్న వ్యాపారములన్నియు ఫలముతో నశించినవి. మీ ఆశ్రయమైతేనో శాశ్వతముగా నుండునది అని; ఇహ = ఈలోకమునందు; ధీరమునిభిః = ధీరత్వముగల మునులచేత; అఖిలం = సాకల్యముగా (పూర్తిగా); నిశ్చితం = నిశ్చయించబడియున్నది; ఇహ = ఈ విషయములో; త్వాం = మిమ్ములను; భూరి కృపాలయ = విశేషకృపకు స్థానభూతులైనవారిగను; ఆగమసారం = వేదవేద్యులనియు; అఖిలాత్మకం = సర్వము తమకు శరీరముగా గలవారనియు (ఇట్లుగా); అమలం = శరీరగత మలాదులను అంటకుండువారనియు; ఆహుః = పెద్దలు చెప్పెదరు.

2. నూనం = నిశ్చయముగా; త్రిభువన గృహిణీపతిఃఇతి = మూడులోకములు అనునట్టి భార్యకు భర్త యని; మహతాం గానం = మహాత్ములచే గానము చేయుట; అనుసంవిదితం = బాగా తెలియబడుచున్నది; శ్రీనందాత్మజ = నందునిపుత్రుడా; శ్రీవసుధాధవ! = శ్రీభూనాయకా; ఆనందం త్వాం = ఆనంద స్వరూపుడవైన నిన్ను; నిరతం = ఎల్లప్పుడున్నూ; అనుయామః = అనుసరించెదము.

3. భవంతం ఏవ = మిమ్ములనే; సకల కామినీ జనకామదుహం = స్త్రీలకు కోరికలుగలవారికి సమస్తకోరికలనిచ్చు; పరమ కారుణికం = శ్రేష్ఠమైన కరుణయే స్వభావముగా కలవారనిన్నీ; ప్రాహుః = చెప్పెదరు; గోవిందం = గోవిందునిగూర్చి; కోమలగిరా = మృదువగువాక్కులచేత; గోపికాగణగీతం = గోపికలచేత గానము చేయబడినటువంటి; ఇతి = ఈకీర్తన; నారాయణతీర్థ ఫణితం = నారాయణతీర్థులవారివల్ల చెప్పబడినది.

ప. ఓ శ్రీకృష్ణా! సంసారమునందున్న మాకు శరణము నిమ్ము.

అ. మీదయ గల్గిన సంసారసముద్రనుండి తరింపవచ్చునని మహర్షులు మాకుఁ జెప్పిరి.

1. ఫలము గల్గునంతవఱకు నీప్రపంచమును సృజించువాఁడవనియు, ప్రపంచస్వరూపుఁడవనియు, నాప్రపంచమున కంతర్మాత వనియు, వేదసార భూతుఁడవనియు, నిత్యశుద్ధుఁడవనియు, మహామునులు నీస్వరూపమును నిశ్చయించియున్నారు. నీవు కరుణాసముద్రుఁడ వనియుఁ జెప్పుచున్నారు.

2. ఓనందకుమారా! భూనాయకా! నీవు ముల్లోకములును కుటుంబముగాఁ గలయాలక్ష్మికి భర్తవని మహాత్ములు చెప్పకొనుచున్నారు. ఇది మాకు బాగుగా తెలియును. ఇట్లు గావున మాకానందమును గల్గించుటకై సర్వకాలములయందును నిన్నాశ్రయించెదము.

3. నీవు దయామయుఁడవనియు, స్త్రీజనులకు సకలకామముల నొసంగువాఁడవనియుఁ బెద్దలు చెప్పుచున్నారు. ఈవిధముగా కృష్ణునిగూర్చి గోపికలుచెప్పిన మధురవాక్యములను నారాయణతీర్థుఁడు గీతముగా వ్రాసెను.

శ్లో. జన్మాంతరసహస్రేషు కృతపుణ్యఫలోదయా,
ఇద మా హపరా కాంతం కుర్వంతీ ప్రణతీర్ముహుః.

12. శ్లో॥ జన్మాంతర = గడచిన జన్మలయొక్క; సహస్రేషు = అనేకజన్మలయొక్క; కృత = చేయబడిన; పుణ్యఫలోదయం = పుణ్యము యొక్క ఫలప్రాప్తి గలిగినట్టి; అపరా = మరియొక గోపిక; కాంతం = ప్రియుడగు శ్రీకృష్ణునిగూర్చి; ముహుర్ముహుః = మాటిమాటికి; ప్రణతుం = నమస్కారములను; కుర్వంతి = చేసినదియై; ఇదం = ఈ చెప్పబోవువాక్యమును; అహ = పలికెను.

వారలలో నొకగోపిక అనేకజన్మములనుండి సేయుచు వచ్చిన పుణ్యకర్మలు పరిపాకమునకు వచ్చుటచే మిగుల విజ్ఞానవతియై యాకృష్ణునకుఁ బలుమారు నమస్కరించుచు నిట్లనియె.

బిలహరీ (మోహన) రాగము - ఆదితాళము

ప. పూరయ మమ కామం గోపాల-పూరయ మమ కామం

అ. వారంవారం వందన మస్తుతే - వారిజదళనయన గోపాల

1. మన్యే త్వామిహమాధవదైవం-
మాయాస్వీకృతమానుషభావం
ధన్యైరాదృతతత్త్వస్వభావం
ధాతారం జగతా మతివిభవం

2. బృందావనచర బర్హావతంస - బద్ధకుంజవనబహులవిలాస
సాంద్రానందసముద్గీర్ణహాస - సంగతకేయూరసముదితభూష

3. మత్స్యకూర్మాదిదశ మహితావతార
మదనుగ్రహా దవ మదనగోపాల
వాత్సల్యపాలితవరయోగిబృంద
వరనారాయణతీర్థవర్ధితమోద

6వ కీర్తన - బిలహరిరాగము - ఆదితాళము

ప॥ గోపాల = గోపాలకృష్ణా!; మమకామం = మాకోరికను; పూరయ = పూరించుమా (నెరవేర్చుమా)

అ॥ వారిజదళనయనా = తామరకమలములతో సమానమైన, కన్నులుగల కృష్ణా!; తే = నీకొఱకు; వారంవారం = పదేపదే; వందనం = నమస్కారము; అస్తు = అవుగాక (చేయుచున్నాము)

1. మాధవ! = హేకృష్ణా; ఇహ = ఇచ్చట; త్వాం = నిన్ను; దైవం = దైవముగానున్నూ; మాయా = దివ్యసంకల్పముచేత (ప్రకృతిచేత); స్వీకృత = అంగీకరిపంబడిన; మానుషభావం = మనుష్యరూపముకలవానినిగానున్నూ; ధన్యైః = ధన్యాత్ములచేత; ఆదృత = ఆదరించబడిన; తత్త్వస్వభావం = యథార్థరూపము గలవానినిగాను; జగతాం = జగత్తునకు; అతివిభవం = గొప్ప ఐశ్వర్యమును; దాతారం = ఇచ్చువానినిగానున్నూ; మన్యే = తలచుచున్నాము.

2. బృందావనచర = బృందావనమునందు సంచరించువాడ; బర్హావతంసబద్ధ = నెమలిపింఛమును సొమ్ముగా కట్టబడినవాడ; కుంజవన బహుళవిలాస = పొదరిండ్లసమూహమునందు అనేక విలాసములచే ఒప్పువాడ; సాంద్రానంద = దృఢమైన ఆనందముచేత; సముద్గీర్ణహాస = బయలు వెడలిన నవ్వుగలవాడ; సంగత కేయూర = భుజకీర్తులు ధరించినవాడ; సముదిత భూష = లెస్సగా ఒప్పుచున్నట్టి భూషణములుగలవాడ

3. మత్స్యకూర్మాది దశ మహితావతార = మత్స్యము కూర్మము మొదలగు ప్రసిద్ధమైన పది అవతారములు ధరించినవాడ; మదనగోపాల = హేకృష్ణా!; మత్ + అనుగ్రహాత్ = నాయందలి అనుగ్రహముచేత; అవ = రక్షించుమా!; వాత్సల్య = ప్రేమచేత; పాలిత = పాలింపబడిన; వరయోగిబృంద = శ్రేష్ఠమైన యోగి సమూహములుగలవాడ; వరనారాయణతీర్థ = శ్రేష్ఠమైన నారాయణతీర్థులయొక్క; మోద = సంతోషమును; వర్ధిత = వృద్ధిచేయువాడ

ప. ఓశ్రీకృష్ణా! నాయభీష్టమును నెరవేర్పుము.

అ. ఓకమలనేత్రా! నీకుఁ బలమారులు నమస్కారముఁ జేసెదను.

1. ఓమాధవా! నీవు జగత్తులను సృజించుమహాప్రభావముగల పరదేవుండవు. నీవుమాయచే మనుష్యరూపమును దాల్చియున్నావు. ధన్యాత్ములగువారు మీయథార్థస్వరూపము నెఱుఁగుదురు.

2. నీవు భక్తులను రక్షించుటకై బహువిధములగు భూషణములతోను, నెమలిపింఛముతోను అలంకరించుకొని పొదరిండ్లయందును, నీటియందును బహువిధములఁ గ్రీడించుచు ఆనందపూర్ణమగునవ్వు మొగముతో నొప్పుచు, నీబృందావనమున విహరింపుచున్నావు.

3. ఓమదనగోపాలా! మిగులఁబ్రీతితో నారాయణతీర్థుఁడు మొదలగు సకలయోగులకును సంతసమును గల్గించు మహానుభావా! నీవు మత్స్యము కూర్మము మొదలగు పదియవతారములను ధరించి యాశ్రితుల రక్షించితివి. ఇప్పుడు నాపైఁ గరుణఁజూపుము.

శ్లో. నృణాం బంధహతిం కుర్వన్ నృసింహో సి దయాఘన,
ఇతి సంబోధ్య గోవిందం సానందం ప్రాహ గోపికా

13. శ్లో॥ దయాఘన = ఓ గొప్పదయగలవాడా; నృణాం = నరులయొక్క; బంధహాతిం = కర్మబంధనాశరూపమైన కార్యమును; కుర్వన్ = చేయుటవలన; నృసింహో అసి = నృశింహ అను నామధేయముగలవాడవు; ఇతి = ఇట్లని; సానందం = ఆనందరూపుడైన, గోవిందం = శ్రీకృష్ణస్వామి వారినిగూర్చి; సంబోధ్య = సంబోధించి; గోపిక = ఒకానొక గోపిక; ప్రాహ = పలికెను.

ఓదయామయా! శ్రీకృష్ణా! మనుజులకుఁగల సంసారబంధమును హరించుటచే, నీవే నృసింహుఁడవు. (నృసింహుడు మనుష్యులలో శ్రేష్ఠుఁడు - అనగా పరమగురువు) అనిచెప్పుచు పరమానందముతో నాగోపిక మరల నిట్లనియె.

సావేరీరాగము - త్రిపుటతాళము

| | | |
|---|---|---|
| ప. | కరుణయా వలోకయమాం | శ్రీనృసింహ |
| అ. | శూరాసురసంహార | శోభనాద్రి శ్రీనృసింహ |
| 1. | పరిపూర్ణదయారస | పాథోధిబృంహణ |
| | ప్రహ్లాదచంద్రోదయ | శ్రీనృసింహ |
| | నిరసితతామస | నిర్విశేషమానస |
| | గురుతరవీర శ్రీ | గూఢసుగుణాలయ |
| 2. | పాతకమహాటవీ | పజ్ఞికోపానల |
| | భక్తచందనశీతల | శ్రీనృసింహ |
| | ఉత్తుంగసుకిరీట | ఉన్నతకేయూర |
| | మత్తచిత్తమాతంగ | మర్దనమహాబల |
| 3. | త్రైగుణ్యఫలాతీత | తత్త్వఫలాత్మక |
| | తాపజలధితారక | శ్రీనృసింహ |
| | శ్రీగురుకరుణయా | శ్రితభ క్తిసుధారస |
| | శ్రీనారాయణతీర్థ | శ్రేయోవిధాయక |

# షష్ఠ తరఙ్గము

7వ కీర్తన - సావేరిరాగము - త్రిపుటతాళము

శ్రీనృసింహా = హే లక్ష్మీనృసింహా!; మాం = నన్ను; కరుణయా = కృపచేత; అవలోకయ = వీక్షించుమా!; శూర! = పరాక్రమవంతుడా; అసుర సంహారా = రాక్షసులను సంహరించువాడ; శోభనాద్రి = శోభనాద్రియుందుండు; శ్రీనృసింహా! = లక్ష్మీనృసింహా!

1. సంపూర్ణదయారస = సంపూర్ణదయ యనునట్టి నీళ్ళుగల; పాథోధి = సముద్రమును; బృంహణ = వృద్ధింపజేయునట్టి; ప్రహ్లాద, చంద్రోదయ = ప్రహ్లాదునకు చంద్రోదయము వంటివాడ; శ్రీనృసింహ = లక్ష్మీనృసింహ; నిరసిత తామస = నిరసించబడిన తామసులను గలవాడ; నిర్విశేష మానస = ప్రకృతి సంబంధమైన విషయములు లేనట్టి మనస్సుగలవాడ; గురుతర = అజ్ఞానాంధకారమును పూర్తిగా నివర్తింపజేయువాడ; వీర! = వీర్య సంపన్నుడా, శ్రీ = సంపద్యుక్తమైనట్టిన్నీ; గూఢ = ఇతరులకు తెలియరానట్టిన్ని; సుగుణ = కళ్యాణ గుణములకు, ఆలయ = ఉనికిపట్టు అయినవాడ.

2. పాతక = పాపములనుబట్టి; మహాటవీ = గొప్ప అరణ్యములయొక్క; పంక్తి = వరుసకు; కోపానల = కోపమనునట్టి అగ్నిహోత్రమును ప్రయోగించువాడ; భక్తచందనశీతల = భక్తులను ఆహ్లాదింపజేయునట్టి చల్లనిగుణములుగలవాడ; శ్రీనృసింహ = లక్ష్మీనృసింహ; ఉత్తుంగ సుకిరీట = ఎత్తైన లెస్సగావుండు కిరీటముగలవాడ; ఉన్నత కేయూర = ఎత్తైనటువంటి భుజకీర్తులుగలవాడ; మత్తచిత్త = మదించిన చిత్తములనునట్టి; మాతంగ = ఏనుగులను; మర్దన = శిక్షించుటయందు; మహాబల = గొప్పబలముగలవాడ

3. త్రైగుణ్య = త్రిగుణముల (సత్వ, రజస్తమోగుణముల); ఫల = ఫలములకు; అతీత = అతిక్రమించినట్టిగూడ; తత్వ = పరతత్వరూపమైన; ఫల = ఫలమే; ఆత్మక = స్వరూపమైనవాడ; శ్రీనృసింహ = లక్ష్మీనృశింహ; తాప = సంసారతాపములనెడు; జలధి = సముద్రమునుండి; తారక = తరింపజేయువాడ; శ్రీనృసింహ = లక్ష్మీనృసింహ; శ్రీగురు కరుణయా = శ్రీమదాచార్యకటాక్షముద్వారా; శ్రిత = ఆశ్రయించబడిన; భక్తిసుధారస = భక్తిరూపమైన అమృతరసముగల; శ్రీనారాయణతీర్థ = శ్రీనారాయణతీర్థులవారికి; శ్రేయః = మోక్షమును; విధాయక = కృపజేయునట్టివాడవగు శ్రీకృష్ణా! కరుణయా అవలోకయా.

ప. ఓనృసింహమూర్తీ! ననుఁ గరుణఁజూడుము.

అ. ఓపరాక్రమవంతుడా! శోభనాచలమునందుడు నృసింహా రాక్షససంహారా! ననుఁ గరుణఁజూడుము.

1. ఓపరాక్రమవంతుఁడవగు నృసింహా! నీవు సకలసద్గుణములకు నాశ్రయుండవు. తమోగుణమించుకైనను లేనివాఁడవు. ఓలక్ష్మీనాయకా! ప్రహ్లాదుఁ డనుచంద్రుఁడు జనించుటచే భవద్దయారసముద్ర ముప్పొంగి తనయగాధత్వమును ప్రకటించినది.

2. సర్వాలంకారభూషితుఁడవును, మహాబలుఁడవును నగు నోనృసింహా! నీవు గర్వితులనియెడుగజంబుల మర్దింతువు. చందనమువలె భక్తులనానందింపఁ జేయుదువు. నీకోపము దుష్టులను సరణ్యములకు దావానలము.

3. గురువరునియమనుగ్రహమువలన విష్ణుభక్తిని సంపాదించిన నారాయణతీర్థయతికి మోక్షము నొసంగు నోనృసింహా! నీవు భక్తులను పాప సముద్రమునుండి యుద్ధరింతువు. సత్వరజస్తమోగుణమువలన జనించిన నాశయుక్తములగు ఫలమునులగాక శాశ్వతమగు మోక్షఫలమునుగూడ వారికిత్తువు. ఆమోక్షముకూడ నీవే.

శ్లో. అన్యా పి యువతీ కాచి దన్యాదృశగిరా హరిమ్,
ధన్యా సంబోధయంత్యద్ధా సన్యాయం ప్రాహ సాదరమ్.

14. శ్లో॥ ధన్య = ధన్యురాలైనట్టి; కాచిత్ = ఒకానొక, అన్య = మరియొక్క; యువతి = గోపిక, అన్యాదృశ = మరియొక్క విధమైన; గిరా = వాక్యముచేత; హరిం = శ్రీకృష్ణునిగూర్చి; యద్ధా = ప్రత్యక్షముగా; సంబోధయంతి = పిలుచుచు (సంబోధించుచున్నట్టిదియై), సాదరం = ఆదరపూర్వకముగా; సన్యాయం = న్యాయయుక్తముగా; ప్రాహ = పలికెను.

ధన్యురాలుగు మఱియొకగోపికయు, వేఱొకవిధముగా నాకృష్ణునిఁ బిలుచుచు యుక్తియుక్తముగా ఆదరపూర్వకముగా నిట్లనియె.

పున్నాగవరాళీరాగము - ఆటతాళము

ప. భూయో భూయో యాచేంజలినా
భూమన్ త్వయి మే దాస్యం దేహి

1. నిమిషార్ధ మపి తవ దర్శనవిధురా
నింద్యా హి తనురేషా
తామరసేక్షణ తవ పాదకమలే
తనుతాం తనుతాం మమ తనో రతులాం.

2. కాంతం కాంతార మపి తవ యోగే
కమలేక్షణ మన్యే
కాంతారం గృహ మపి తు నియోగే
కరుణా తరుణీ మయి తవ భవతు

3. వరయామి గోపాలవల్లభమధునా
త్వరయా హ మఖిలగురుం
సరసగిరా గోపయువతీకథిత మితి
గురుకృపయా నారాయణతీర్థఫణితం

8వ కీర్తన - పున్నాగరాగము - ఆటతాళము

ప॥ భూయో భూయో = మాటిమాటికి; అంజలినా = దోసిలిచేత; యాచే = ప్రార్థించుచున్నాను; భూమన్ = సర్వవ్యాపకుడవైనట్టి హే స్వామీ!; త్వయి = మీయందు; మే దాస్యం = నాకు సేవను (కింకర భావమును); దేహి = ఇమ్ము (ఇవ్వండి)

1. నిమిషార్ధమపి = ఒక అరనిమిషమైనను; తవదర్శనవిధురా = మీ దర్శనము లేనిది అయినయడల; ఏషా, తనుః = ఈనా దేహము; నింద్యాహి = దోషయుక్తమైనదిగదా! (వ్యర్థమైనదిగదా); తామరస+ఈక్షణా = తామర కమలములతో సమమగు నేత్రములగలవాడ; తవపాదకమలే = మీపాదకమలములు; మమతనోః = నాదేహమునకు; అతులాం = అసమానమైన స్థితిని; తనుతాం తనుతాం = చక్కగా విస్తరింపజేయుగాక!

2. క్షమలేక్షణా = హేకృష్ణా; తవ యోగే = నీ సంబంధము కలిగినప్పుడు; కాంతారమపి = అడవిగూడ; కాంతం = మనోహరముగానుండును అని; వియోగేతు = ఎడబాసినప్పుడు అయితేనో; గృహమపి = ఇల్లుగూడ; కాంతారం = అడవిగానుండునని; మన్యే = తలంచుచున్నాను; తవకరుణా = నీయొక్కదయ; మయి = నాయందు; తరుణీభవతు = కొత్తకొత్తగా నుంచుదురుగాత

3. గోపాల! = హే గోపాలస్వామీ!, అహం = నేను; త్వరయా = శీఘ్రముగా; అఖిలగురుం = సమస్తమునకు గురులైనట్టి మిమ్ములను; వల్లభం = ప్రియునిగా; అధునా = ఇప్పుడు; వరయామ = కోరుచున్నాను. సరసగిరా = మధురవాక్కులచేత; గోపయువతీ = గొల్లభామలచేత; కథితం = చెప్పబడినది; ఇతి = ఇట్లని; గురుకృపయా = గురుకటాక్షముచేత; నారాయణతీర్థ ఫణితం = నారాయణతీర్థులచేత చెప్పబడినది.

ప-అ. ఓపరమానందస్వరూపా! నమస్కారపూర్వకముగా నినుఁ బలుమాఱు యాచించెదను. నాకు నీసేవ నొసంగుము.

1. ఓకమలలోచనా! ఒక యఱనిమిషమైనను నినుఁ జూడ నేరకున్న నాశరీరము నిష్ప్రయోజకమగును. కావున నీపాదకమలములు నాశరీరమును సార్థకముగఁ జేయుఁగాక.

2. ఓకృష్ణా! నీతోసంబంధము గల్గెనేని యరణ్యమైనను నాకు మనోహరమగు రాజభవనము. అట్లుగాదేని సుందరగృహమైనను మహారణ్యము. కావున నోమహాత్మా! ననుఁ గరుణింపుము. నీదయ నాపై క్షణక్షణమునకుఁ గ్రొత్తయగుచుండునుగాత !

3. సకలలోకేశ్వరా! గోపాలా! నిను ప్రియునిఁగా మిక్కిలి యాతురతతోఁ గోరుచున్నాను. ఇట్లు గోపాంగన మనోహరవాక్యములచేఁ బల్కెనని గురువరునిదయచే, లేక పెద్దలయనుగ్రహముచే నారాయణతీర్థుఁడు చెప్పెను.

శ్లో. మురారివచనా వ్యగ్రా వల్లవీ కాపి తత్పరా,
సంబోధయిత్వా స్వసఖీ మితి గాయతి సాదరమ్.

15. శ్లో॥ తత్పరా = శ్రీకృష్ణునియందు అనురాగముగల; కాపి వల్లవీ = ఒకానొకగోపిక; మురారివచన వ్యగ్ర = శ్రీకృష్ణస్వామిలవారి వాక్యములచేత తత్తరపాటు కలదియై; స్వసఖిం = తన చెలికత్తెను; సంబోధయిత్వా = పిలిచినదియై; సాదరం = ఆదరణపూర్వకముగా; ఇతి = ఈ చెప్పబోవు వాక్యమును; గాయతి = పాడుచున్నది.

ఆశ్రీకృష్ణునియం దధికానురాగముగల మఱియొకగోపిక యమ్మహాత్ముఁడు చెప్పినవాక్యములవలన కలఁతనొంది ప్రక్కనున్న తనచెలినిఁబిలిచి మిక్కిలి యాతురయై యిట్లనియె

కల్యాణీరాగము - అటతాళము

ప. వద కిం కరవాణి సఖి హే
వద కోకిలశుకవాణి

అ. బత వనభువి బర్హి బర్హావతంసో
వదతికి మపి కి మపి వక్రతయా లం

1. నిమిషార్ధ మపి యుగసహస్రసమతయా
నీతం మయా దిన మాసాయం
అమితకృపానిధిరయమితి సహసా
అధునా గత మిహ త్యజతి కథమయం

2. గృహపతిపుత్రధనాదిషు మమతా
గ్రహపరిగృహీ తాంతరంగం
మహనీయమురళీసరళగీతమంత్రేణ
మోచిత మపి రచయతి గృహసంగం

3. తపసా కిల మహతా భువి కల్పక
తరు ముపలభ్య కో పి కామితదం
సఫ లేయ మితి గోపికాగణగీతం
విపులం శివనారాయణతీర్థే నేదం

9వ కీర్తన - కళ్యాణిరాగము - ఆటతాళము

ప॥ కోకిల శుకవాణి = కోకిల చిలుక స్వరముతో సమానమైన స్వరముగల; హే సఖీ! వద = ఓచెలియా, చెప్పుమా!; కిం కరవాణీ వద = నేనేమి చేయుదును చెప్పుము.

అ॥ బత = అయ్యో; బర్హిబర్హావతంసః = నెమలిపింఛమే భూషణముగాగలిగిన శ్రీకృష్ణస్వామివారు; వనభువి = ఈ బృందావనమందు; వక్రతయా = పెడత్రోవలుగా; కిమపికిమపి = ఏమేమో ఆటంకములను; వదతి = చెప్పుచున్నారు; అలం = చాలును.

1. మయా = నాచేత; దినం = పగటికాలం; నిమిషార్ధమపి = అరనిమిషముగూడ; యుగసహస్రసమతయా = వేయియుగములతో సమానముగా; ఆసాయం = అస్తమానం వరకు; నీతం = గడపబడినది; అయం = ఈ శ్రీకృష్ణుడు; అమిత కృపానిధి ఇతి = అపార కరుణాసాగరుడనే భావముతో; సహసా = ఆలోచించకుండా; ఇహ ఆగతం = ఇక్కడికి వచ్చిననన్ను; అయం = ఈ, నీ; అధునా = ఇప్పుడు; కథ త్యజతి = ఏవిధముగా విడిపించగలదు?

2. గృహపతిపుత్ర ధన ఆదిషు = ఇల్లు, భర్త, పుత్రులు, ధనము మొదలగు వానియందుగల; మమతా = మమకారమనే; గ్రహ = భూతముచేత; పరిగృహీత = పట్టుకొనబడినది; అంతరంగం = మనస్సు; మహనీయ = పూజ్యమైనట్టి; మురళీసరళ గీత మంత్రేణ = సరసమైనట్టి వేణుగానమను మంత్రముచేత; యోచితం అపి = వదల్చబడినను; గృహసంగం = సంసార సంగమును (సంసారసంబంధమును); రచయతి = పొందింపచేయుచున్నాడు

3. కః అపి (కాపి) = ఒకానొకతే; భువి = భూమియందు; మహతా తపసా = గొప్పతపస్సుచేత; కామితదం = కోరికలనిచ్చునట్టి, కల్పతరుం = కల్పవృక్షమును; ఉపలభ్యకిల = పొందికదా (లభింపచేసికొని కదా), సఫల + ఇయం (సఫలేయం) = ధన్యురాలగుట; ఇతి = ఇట్లని; గోపికా గణగీతం = గోపికల సమూహముచేత గానము చేయబడిన; ఇదం = దీనిని; శివనారాయణతీర్థేన = శివనారాయణతీర్థులవారిచేత; విపులం = విస్తరింపబడినది.

ప. ఓకోకిలవాణీ! చెలీ! ఇఁక నేనేమి సేయుదును? చెప్పుము.

అ. అబ్బా! అరణ్యమునకు వచ్చినను ఈకృష్ణుఁడు వక్రముగా నేదేదో చెప్పుచు నన్ను పరిగ్రహింపకున్నాఁడు.

1. నేను పగలంతయు అరనిమిషము నొకవేయి యుగములుగా గడపి రాత్రియగుటచే నీకృష్ణుఁడు దయాసముద్రుఁడు గదా యని యిచటికి వచ్చితిని. ఈయనయునను పరిత్యజించుచున్నాడు. ఇఁక నాకేదిదిక్కు?

2. భర్త, పుత్రులు, ధనము మొదలగువానియందుండు మమకార మనియెడు (ఇవి నావియనుట మమకారము) భూతముచే నామనసుపీడింపఁబడుచుండెను. ఈకృష్ణుఁ డొనర్చిన వేణుగానమనియెడు మహామంత్ర మాగ్రహమును తొలగించెను. అట్లు గృహముపై ప్రీతి వదలి వచ్చినను ఈ గోపాలుఁడు మరలగృహసంబంధములు కలిగింపుచున్నాఁడు.

3. సకలకామముల నొసంగు నీభూలోకకల్పవృక్షము నేలఁ గల్గిన కాంతయేకదా ధన్యురాలు! అదిపూర్వజన్మములయం దెంతయో తపస్సు చేసినవారికికాని సంభవింపదు. అని గోపికాసమూహము పలికనవాక్యముల నారాయణతీర్థుఁడు మిగుల విస్తారముగా రచించెను.

## శ్రీకృష్ణుఁడు గోపికలం బరిగ్రహించుట

శ్లో. మధ్యే కృష్ణం మరకతమణిచ్ఛాయ మిచ్ఛావిహారం
కృత్వా గోప్యః కువలయదృశో నాయకం వేష్టయంత్యః,
గాయంత్యస్తం సరసవచసా దాస్యభావం భజంతో
బృందారణ్యే మణయ ఇవ తాః పద్మరాగా ఇవాసన్

16. శ్లో॥ కువలయదృశ్యః = కలువలతో సమానమైన నేత్రములు కలిగిన; గోప్యః = గోపికలు; ఇచ్ఛావిహారం = స్వేచ్ఛావిహారము కలిగినట్టిన్నీ; మరకతమణిచ్ఛాయం = మరకతమణితో సమానమైన ఛాయగలిగినట్టిన్నీ; నాయకం = తమకునాయకుడైనట్టిన్నీ; కృష్ణః = శ్రీకృష్ణులను; మధ్యేకృత్వా = తమకు మధ్యయందువుండులాగున; వేష్టయంత్యః = చుట్టుకున్నవారలై; తం = ఆస్వామివారిని; సరసవచసా = సరసయుక్తమగుమాటలచేత; గాయంత్యః = గానము చేయుచున్నవారలై; దాస్యభావం = దాస్యస్వరూపమును; భజంతః = పొందుచున్నవారలై; తాః = అగోపికలు; బృందారణ్యే = బృందావనమునందు; పద్మరాగమణియ ఇవ = పద్మరాగమణులవలె; ఇహ అసన్ = ఇక్కడ వుండిరి.

అంత శ్రీకృష్ణుఁడు వారిఁ బరిగ్రహించెను. అప్పుడు మరకతమణివలె నీలవర్ణుఁడైనతమనాయకుని నడుమనుంచుకొని యాగోపికలందఱు చుట్టును నిలచి యమ్మహాత్మునికీర్తిని గానముచేయుచు, నాయనయిచ్ఛ కనుగుణముగా దాస్యమునల్పుచు మెలఁగుచుండిరి. మరకతమణి చుట్టును బద్మరాగరత్నంబులం బొదిగియొనర్చిన యాభరణములను ధరించిన ట్లాబృందావనము రాజిల్లుచుండెను.

శ్లో. నిగమబృందసరోరుహసంగతం నిఖిలలోకమధుస్వసుఖాత్మకం,
మధురిపుంప్రతిలభ్యచవల్లవీమధుకరాస్సుకరంజగురిత్యలమ్.

17. శ్లో॥ నిగమబృంధ సరోరుహ సంగతం =వేదసమూహములను కమలములయందు వుండునటువంటి; నిఖిలలోక మధు స్వసుఖాత్మకం = సమస్తలోకములను ఆనందింపజేయునట్టి మకరందమనునట్టి; మధురిపుం = శ్రీకృష్ణస్వామిని; ప్రతిలభ్యచ = దొరికింపచేసుకొని; వల్లవీమధుకరాః = గోపికలను తుమ్మెదలు; అలం సుకరం = చాలినంత ఉత్సాహముతో; ఇతి జగుః = ఇట్లని గానము చేసిరి.

ఇట్లు వేదంబులనియెడు కమలములయందుండి సర్వలోకముల నానందింపఁజేయు శ్రీకృష్ణరూపమగు బ్రహ్మానందమకరందము తమకుదొరుకగా, నాగోపికా భ్రమరములు మిగుల నుత్సాహముతో గానము సేయ నారంభించినవి.

కేదారగౌళ (కాంభోజి) రాగము - ఆటతాళము

ప. వనభువిగోపాల విహరంతం

అ. వల్లవయువతీజనవలయభాస్వంతం

1. నిగమసరోరుహనిత్యసంగతమధు
మధుహరాత్మత యేహ సముదితం
అగణితగోధన మపరిమితానందం
ఆనందకర మమరేశితు రపి తం

2. ఇనశశిపావకతారక కాభాసక
మీక్షణసముదితజగదేకనాథం
మునిజనమానససారసవరహంస
మహనీయదైవత మఖిలదేహరథం

3. లావణ్యసరిదేకనాయక మఖిలసం
రక్షణ మమరసంరక్షణ మధునా
సేవకశివనారాయణతీర్థభావిత
శ్రేయోవిధాయక మిహ వేదవిధినా

10వ కీర్తన - కేదారగౌళరాగము - ఆటతాళము

ప॥ ఇహ = ఇక్కడ; వనభువి = బృందావన భూమియందు; విహరంతం = విహరించుచుండునట్టి.

అ॥ వల్లవయువతిజన = గోవభామలయొక్క; వలయు = మండలమందు; భాస్వంతం = ప్రకాశించుచుండువాడును అగు; గోపాలం = శ్రీకృష్ణుని; జగుః = గానము చేసిరి.

1. నిగమ = వేదములు అనునట్టి; సరోరుహ = కమలముల; నిత్య = ఎల్లప్పుడు; సంగత = చేరియుండు; మధు = మకరందమే; ఇహ = ఇక్కడ; మధు = మధువనురాక్షసుని; హర = సంహారము చేసినట్టి శ్రీమహా విష్ణువునే; ఆత్మతయా = మూలస్వరూపముగా గలిగినట్టి కృష్ణుడుగా సముదితం (సమ్యక్ + ఉదితం) = అవతరించినట్టివాడున్ను; అగణిత గోధనం = అసంఖ్యాకమైన గోధనము గలవాడున్ను; అపరిమితానందం = పరిమతములేని ఆనందముగలవాడున్ను; అమరేశితుః = దేవతలకు నియామకుడగు ఇంద్రునకు; అపి = కూడ; ఆనందకరం = ఆనందముయిచ్చునట్టి; తం జగుః = ఆకృష్ణునిగూర్చి గానము చేసిరి.

2. ఇన, శశి = సూర్యుని, చంద్రుని, పావక, తారక = అగ్నిని, నక్షత్రములను; భాసకం = ప్రకాశింపచేయునట్టివాడున్ను; ఈక్షతా = చూచినంతమాత్రముచేతనే; సముదిత = కలిగిన; జగత్తు = లోకములకు; ఏకనాథ = ఒక్కడే ప్రభువైనవాడున్ను; మునిజన = మునిజనులయొక్క; మానససారస = మనస్సులనే సరస్సులకు; వరహంస = శ్రేష్ఠమైన స్వరూపమున్ను; మహనీయ = జగత్తుకు పూజ్యుడైన; దైవత్వం = దేవస్వరూపుడన్ను; అఖిల = సమస్తమైన; దేహ = శరీరముకు రథం = రథంగాగలవాడున్నూ అగు శ్రీకృష్ణుని; జగుః = గానము చేసిరి.

3. లావణ్య = సౌందర్యమును; సరిత్ + ఏకనాయకం = నదులకు ఒకే భర్తయగు సముద్రుని; అఖిల సంరక్షణం = సమస్తమును రక్షించువాడున్నూ; అధునా = ఇప్పుడు; అమరసంరక్షణం = దేవతలను రక్షించువాడున్నూ; సేవక = సేవకుడగు; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులచేత; భావిత = కోరబడుచుండు; శ్రేయః = మోక్షమును; ఇహ = ఇక్కడ; వేదవిధినా = వేదోక్తవిధిచేత; విధాయకం = ఒనకూర్చునట్టివాడున్నూ అగు శ్రీకృష్ణం = శ్రీకృష్ణుని; జగుః = గానము చేసిరి.

ప-అ. ఈగోపాలుఁడు గోపికలమధ్య నిలిచి యాబృందావనమున విహరింపుచు మిగులఁ బ్రకాశించుచున్నాఁడు.

1. వేదములనియెడు కమలములయందుండు పూఁదేనియ (సకలవేదసారమనుట) యాకృష్ణరూపమున నవతరించి గోవులఁ బరిపాలించుచు తాను పరమానందస్వరూపమే కావున దేవేంద్రాదులకుఁ గూడ నానందమును గల్గించుచున్నది.

2. సంకల్పము మాత్రమువలననే సకలలోకములను సృజించి దానిని బరిపాలింపుచున్నాఁడనియు, తన ప్రకాశము చేతనే సూర్య, చంద్ర, నక్షత్రాదులఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడనియు, దేహములనియెడు రథములయందు రథికుఁడై (ఆత్మానంరథినంవిద్ధి = పరమాత్మను రథికునిగా నెఱుంగవలయును అనుశ్రుతిప్రకారము ఇచట శ్రీకృష్ణుఁ డంతర్యామియై యుండుననియేర్పడు చున్నది) యున్నాఁడనియు, యోగులగువారు తమహృదయపద్మములం దీకృష్ణుని ధ్యానించుచున్నారు.

3. దేవతల సంరక్షించు నామహాత్ముఁడు సకలలోకములకు రక్షించుటకై లావణ్యసముద్రుఁడై యవతరించియున్నాఁడు. వేదోక్తప్రకారముగా (పరమాత్మస్వరూపునిగా ననుట) భక్తుఁడగు నారాయణతీర్థునిచే భావింపఁబడి యాయతివరునకు జీవన్ముక్తి నొసంగెను.

శ్లో. గాయంత్యో ననృతుశ్చేత్థం గాయంతం నందనందనం,
వేణునాదసుధాధారా ముద్గిరంతం ముహుర్ముహుః
ఇతి నారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరంగిణ్యాం

శ్రీకృష్ణ గోపీ సమాగమవర్ణనం నామ షష్ఠతరఙ్గః

18వ శ్లో॥ ఇత్థం = ఈప్రకారము; గాయంతం = గానము చేయుచున్నట్టిన్నీ; ముహుర్ముహుః = మాటిమాటికి; వేణునాదసుధారనం = మురళీగానధ్వని యనెడి అమృతధారను; ఉద్గిరంతం = బయలు వెడలించుచున్నట్టిన్నీ; నందనందనం = శ్రీకృష్ణస్వామిని గూర్చి, గాయంత్యః = గాయము చేయుచున్నవారలై; ననృతుశ్చ = నాట్యము చేసిరి.

ఆకృష్ణుఁడును వారిమధ్యనిలచి పలుమారు వేణుగానామృతమును వర్షించుచుండెను. ఈగోపికలు పై నిరూపించినవిధముగా గానముసేయుచు, నృత్యమునుకూడ నాచరించిరి.

శ్రీనారాయణతీర్థులవారిచే రచింపబడిన శ్రీకృష్ణలీలా తరఙ్గిణిలో

షష్ఠతరఙ్గ ప్రతి పదార్థము సంపూర్ణము.

# సప్తమ తరఙ్గము

## కథా సంగ్రహము

శ్లో. అథాభినీయతే రాసక్రీడాఖ్యం చరితం హరేః,
గోపీకదంబసహిత శ్రీకృష్ణాగమనం వనే.
తాసాం తత్త్వోపదేశశ్చ తాభిరానందతాండవం,
తత్కృతం హరిణా సర్వం పుష్పవృష్టి స్సురైః కృతా 2
లాస్యతాండవసంగీతైః గోపీనాం చిత్తరంజనం,
సంగ్రహః కథిత స్త్వేవం సప్తమే స్మిన్ తరంగకే. 3

1వ శ్లో॥ అథ = అనంతరమందు; రానక్రీడాఖ్యం = రానక్రీడ అనుపేరు కలిగిన హరేః; శ్రీకృష్ణస్వామివారియొక్క; చరితం = కథ; అభినీయతే = వర్ణింపబడుచున్నది; వనే = వనమునందు; గోపీకదంబనహిత = గోపికా అమ్మవార్ల నమూహముతో; శ్రీకృష్ణ = శ్రీకృష్ణస్వామివారు; ఆగమనం = రావడమున్నూ

2వ శ్లో॥ తాసాం = వారలకు; తత్త్వోవదేశన్య = తత్త్వోవదేశముచేయుటయున్నూ; తాభిః = ఆగోపికలతోగూడ; ఆనందతాండవం = సంతోషముతో నృత్యము చేయుటయున్నూ; హరిణా = శ్రీకృష్ణస్వామివారివల్ల; తత్కృతం = అదిచేయబడినది; సురైః= దేవతలచేత; పుష్పవృష్టిః = పూలవర్షము; కృతా = చేయబడినది.

3వ శ్లో॥ లాస్య = ఆటలచేతనున్నూ; తాండవ = నాట్యముచేతనున్నూ; నంగీతైః = నంగీముచేతనున్నూ; గోపీనాం = గోపికలకు; చిత్తరంజనం = చిత్తములను రంజింపచేయుటయున్నూ అను కథ; సప్తమే అస్మిన్ తరంగకే = ఈ సప్తమ తరంగమునందు; సంగ్రహః = సంక్షేమముగా; ఏవం కథితం = ఈ ప్రకారము చెప్పబడినది.

రానక్రీడావర్ణనమును నీసప్తమతరఙ్గమునఁ జేయుచున్నాము. గోపికలతోఁగూడి శ్రీకృష్ణుడు బృందావనమునఁ బ్రవేశించుటయు, నచ్చట నాహరి గోపికలకు తత్త్వము నుపదేశించుటయు, పిదప వారలతోఁ గూడి నృత్యము సేయుటయు, గీతములతో వారిచిత్తముల నంతోషపెట్టుటయు, దేవతలు పుష్పవృష్టినిఁ గురియించుటయు ననునది యిందలి కథానంగ్రహము.

## శ్రీకృష్ణుడు గోపిలకలకు తత్త్వోపదేశము సేయుట

శ్లో. అనేకజన్మ సాహస్రతపసా పరితోషితః,
ఆవిర్భూతస్స భగవాన్ తాస్సు గోపీషు జన్మని 4

4వ శ్లో॥ అనేక జన్మసాహస్రతపసా = అనేక జన్మలయందు చేయబడిన తపస్సుచేత; పరితోషితః = సంతోషమును పొందినవారై; సభగవాన్ = శ్రీకృష్ణస్వామివారు; తాసు గోపీషు జన్మని = ఆ గోపికలయొక్క జన్మభూములయందు; ఆవిర్భూతః = ఉద్భవించిరి.

ఎన్నివేలజన్మములనుండియో ఘోరములగు తపములు చేయుచుండుటచే సంతసమునొంది యాశ్రీహరి యాగోపకులములో నవతరించెను (లేక యీ జన్మమునం దాగోపికలకు ప్రత్యక్ష్యమయ్యెను)

గ. తత్ర ఖలు బృందావనే మందారపారిజాతసంతానకల్పకహరి చందనాదితరుబృందానందిత శుకపికశారి కాదిబృందవినిందిత నందనోద్యానే సముత్ఫుల్లశారదమల్లి కాదిమకరందపరిమళ లాలసతయా సంచరచ్చంచరీకఝుణఝుణాత్కార నూపుర రవైః విచిత్రపతత్రివక్త్రోద్గళిత నానావిధవినోదనినాదతాళమృదంగ సంగీతాది కళావిశేషైః అలక్షితా నేకకోటివనదేవతా నాట్యరసోత్కటే కలిందనంది నీపులిందనముల్లసితలవఙ్గలతాది వివిధలతాభవనే క్వాపి క్వాపి శారదసాంద్ర చంద్రికానంగ విలసిత మణీ వాలుకా మౌక్తిక సితసికతా సుధారమణీయ వేదికాజా లేదివ్యవిమానసమారూఢసురకిన్న రాదివరవనితా గణేషు పశ్యత్సు వర్షత్సు చ ముహుర్ముహుః పారిజాతాది దివ్యసుగంధికుసుమాని భక్తసంకల్పసిద్ధి మాతన్వానో గోపరమణీనయనోత్పలారాధిత మదనగోపాలమూర్తి ర్వాసుదేవో గోపీభిస్సహ రాసక్రీడామహోత్సవారంభసంభ్రమ చేతాః గోపీభిః సార్థ మాత్మతత్త్వ ముపదిశ న్నిదమాహ.

గద్య:- తత్రబృందావనే = ఆ బృందావనమునందు; మందార......ఉద్యానే = మందార, పారిజిత, సంతాన, కల్పక, హరిచందనాది మొదలగు; తరుబృంద = చెట్లసమూహములచేత; ఆనందిత = సంతోషపరచబడిన; శుకపిక = చిలుకలు, కోవెలలు; శారిక = గోరువంకపిట్టలు; ఆది = మొదలగు పక్షులయొక్క; బృంద = సమూహము కలిగియుండుటచేత; వినిందిత = తిరస్కరించబడిన; నందనోద్యానే = నందనవనమనునట్టి ఉద్యానవనమును కలిగినట్టియు; ఖలు = కదా!; సముత్ఫుల్ల = లెస్సగా వికసించినట్టి; శారద = శరత్కాలసంబంధమైన; మల్లికాది = మల్లికాది పుష్పములయందలి; మకరంద = పూదేనియయొక్క; పరిమళ = సువాసనయందు; లాలసతయా = అభిలాషచేత; సంచరత్ = ఇటు అటు పరుగిడుచుండు; చంచరీక = తుమ్మెదలచేత చేయబడుచుండిన; ఝుణఝుణత్కార నూపురరవైః = అందియల చప్పుళ్ళుగా ఎంచబడదగిన శబ్దముల చేతనున్నూ; విచిత్ర = విచిత్రములైన; పతత్రి = పక్షులయొక్క; వక్త్ర = ముఖములనుండి; ఉద్గళిత = వెలివచ్చుచున్న; నానావిధ = అనేకములైన; వినోద = చిత్రములైన; నినాద = ధ్వనులనునట్టి; తాళ, మృదంగ, సంగీతాది = తాళము మద్దెల సంగీతము మొదలగు; కళావిశేషైః = విద్యా విశేషములచేత; అలక్షిత = పరికింపబడిన (ఇతరులకు కనుబడని); అనేకకోటివనదేవతా = అనేకకోట్ల వనదేవతతలచేత చేయబడుచుండు; నాట్యరసోత్కటైః = నాట్యరసముచేత అతిశయించినట్లు ఎంచబడదగియున్నట్టియు;

కళిందనందిని = యమునా నదీతీరమునందు తిరుగునట్టి; పుళింద = బోయవాండ్లచేత; పుళిన = ఇసుకదిబ్బలయందు; సముల్లసిత = ఒప్పుచున్న; లవంగలతాది = లవంగతీగలచే అల్లుకొనబడియుండునట్టి; వివిధ లతాభవనే = అనేకవిధములైన పొదరిండ్లయందు; క్వాపిక్వాపి = ఒక్కొక్కచోట; శారద = శరత్కాలసంబంధమైన; సాంద్ర = దట్టమైన; చంద్రిక = వెన్నెలయొక్క; సంగ = కూటమిచేత; విలసిత = ప్రకాశించునట్టి; మణివాలుకః = మణిప్రచురమైన ఇసుక రేణువులచేతనున్నూ; మౌక్తిక = ముత్యములచేతనున్నూ నిండియున్నట్టి; సితసికతా = తెల్లటి ఇసుక అనెడు; సుధా = గచ్చుతో; రమణీయ = మనోహరముగానుండు; వేదికాజాలే = అరుగుల సమూహమునందు; దివ్య = దేవతాసంబంధమైన; విమాన = విమానములయందు; సమారూఢ = ఎక్కి వున్నటువంటి; సురకిన్నెర ఆది = దేవతలు కిన్నెరలు మొదలగువారియొక్క; వరవనితా గణేషు = శ్రేష్ఠమైన స్త్రీ సమూహములు; పశ్యత్సు = చూచుచుండగానున్నూ; ముహుర్ముహుః = మాటిమాటికి; పారిజాతాది = పారిజాతము మొదలైన; దివ్యసుగంధ కుసుమాని = దేవతా సంబంధమైన మంచి పరిమళయుక్తమైన పుష్పములను; వర్షత్సుచ = కురిపించుచుండగానున్నూ; భక్తసంకల్పసిద్ధిం = భక్తులసంకల్పమును సిద్ధిచేయుటకు; ఆతన్వానో = విస్తరింపచేయుచూ; గోపరమణీ = గోపికాస్త్రీలయొక్క; నయన = నేత్రములు అనునట్టి; ఉత్పల = కలువలచేత; ఆరాధిత = పూజింపబడుచుండు; మదనగోపాలమూర్తిః = మదనగోపాలరూపమును ధరించిన; వాసుదేవః = శ్రీవాసుదేవుడు; గోపీభిఃసహ = గోపికాస్త్రీలతోగూడ; రాసక్రీడామహోత్సవమును; ఆరంభః = ఆరంభించుటయందు; సంభ్రమ = ఉత్సాహము కలిగిన; చేతాః = మనస్సుగలవారై; గోపీభిఃసార్థం = గోపస్త్రీలకు; ఆత్మతత్త్వం = యదార్థస్వరూపమును; ఉపదిశన్ = ఉపదేశించుచున్నవారై; ఇదం = ఈక్రింద చెప్పబోవువాక్యమును; ఆహ = పలికిరి.

మఱియు నాబృందావనము మందార, పారిజాత, కల్పక, (అరణ్యపక్షమునందు తెల్లతుమ్మచెట్టు) హరిచందనాదివృక్షములచే రాజిల్లుచు, చిలుకలు, కోయిలలు, గోరువంకలు మొదలగునానావిధ పక్షులకు సంతనమును గల్గింపుచు నందనవనమును దిరస్కరింపుచుండెను. (నందన వనమునందు మందారాది వృక్షములుండుట సుప్రసిద్ధము. మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము నీయైదును క్షీరసముద్రమునందుఁ బుట్టి నందన వనమునందు స్థాపింపఁబడిన దేవతావృక్షములు) అది శరత్కాలమగుటచే విరివిగా వికసించియున్న మల్లికాదిపుష్పములయందలి పూఁదేనియంద్రాగుటకై సత్వరంబునఁ బరుగిడుచుండు తుమ్మెదలొనచర్చు ధ్వను లందియలచప్పుళ్లుగా, ననేకవిధములగు పక్షులొనర్చు నినాదములు తాళమృదంగాదిశబ్దములుగా, పెక్కండ్రు వనదేవతలు నృత్యములుఁ జేయుచున్నారోకో యని తలంచునట్లు సేయుచు, చూచువారలకునానందమును గల్గించుచుండె. యమునానదీతీరమున జనించి మిగుల నభివృద్ధిఁజెంది విశాలములగుపొదరిండ్లుగా నేర్పడియున్న నానావిధలతలు ఆ వనమునకు సొంపుగూర్చుచుండెను. మఱియు నొక్కకచో

శరత్కాలపు వెన్నెలలు ప్రసరించుటచే మిగులఁ దెల్లనై మెరయుముత్తెంపు టిసుకలును, రత్నమయమగు గండిసుకయును, ఈరెంటినింగలిపి పాలగార, చేయఁబడియున్న యరుగులును అవ్వనసౌందర్యమునకు వన్నెఁబెట్టుచుండెను.

ఇట్లు మనోహరమగు నాబృందావనమునందు గోపికలతోఁగూడి వారలు తన్న తిప్రీతితోఁ జూచుచుండ నాశ్రీకృష్ణుఁడు రాసక్రీడామహోత్సవము నారంభింపఁదలంచి, తన యథార్థస్వరూపము నెఱిఁగించుచు వారలతో నిట్లని చెప్ప నారంభించె. దేవతాస్త్రీలును సుగంధవంతములగు మందారపారిజాతాది పుష్పముల నాహరిపై వర్షించుచు విమానములపైనుండి యవ్విభుని వీక్షించుచుండిరి.

శ్లో. బ్రహ్మానుభూతిరసికాం శౌరేర్వా గ్లక్షణాం సుధామ్,
గోప్యః పిబంత్యో మోదంతే కృష్ణబ్రహ్మణి తాః స్థితాః. 6

6వ శ్లో॥ బ్రహ్మానుభూతిరసికాం = బ్రహ్మానుభవమే రసముగా గలిగినటువంటి; శౌరేః = శ్రీకృష్ణస్వామివారియొక్క; వాగ్లక్షణాం = వాక్కునుంచి లక్షణయుక్తముగా రాబడిన; సుధాం = అమృతమును; గోప్యః = గోపికలు; పిబంత్యః = గ్రోలినవారై; మోదంతే = సంతోషించుచున్నారు; తాః = ఆ గోపికలు; కృష్ణబ్రహ్మణి = శ్రీకృష్ణ పరబ్రహ్మమునందు; స్థితాః = చేరిన వారైరి (స్థిరచిత్తముగలవారైరి)

ఆత్మానుభవ మనియెడు మాధుర్యమును జిల్కు శ్రీకృష్ణవాక్యామృతమును బానముచేసి యాగోపికలును పరమానందమునొంది, యాకృష్ణునితో నైక్యమైనట్లుండిరి.

శ్లో. నృత్యంత్య స్తేన తద్గీతం గాయంత్యో రాసమండలే,
తేనోపదిష్ట మద్వైత మనుకుర్వంతి మానతః. 7

7వ శ్లో॥ రాసమండలే = రాసమండలమునందు; తద్గీతం = శ్రీకృష్ణునిచేత చేయబడినగానమును; గాయంత్యః = గానముచేయుచూ; తేన నృత్యంత్యః = వారితో నృత్యము చేయుచూ; తేన ఉపదిష్టం = ఆస్వామివారిచేత ఉపదేశింపబడినట్టి; అద్వైతం = పరబ్రహ్మతత్త్వమును; మానతః = వేదప్రమాణానుసారముగా; అనుకుర్వంతి = అనుకరణ చేయుచున్నారు.

తత్త్వము నుపదేశించుటకై యాహారియొనర్చిన గానమును మరలఁజేయుచు నమ్మహాత్మునితోఁగూడి నృత్యమును సల్పుచు విహరించుచుండిరి. అమ్మహాత్మునిచే నుపదేశింపఁబడిన యభేదమును (జీవబ్రహ్మలొక్కటియనుటను) ప్రత్యక్షముగ నభినయించుచున్నారో యన వారారాసక్రీడ ప్రవర్తిల్లుచుండెను.

1. అద్వయ మఖండిత మశేషజగదాదిం
యత్ర చ జగత్త్రితయ మాస్థిత మనంతే
యత్ర విలయం పున రుపైతి మృది కుంభో
యద్వ దవధారయత సత్య మితి మా మోం

2. యచ్చ నిజశక్తియుత మైక్షత పురస్తాత్
యత్పున రభూ ద్వికృత మైక్షత సుతేజః
యచ్చ క మభూ త్పున రుదైక్షత యదన్నం
జాత మవధారయత సత్య మితి మా మోం

3. యత్పున రభూ త్త్రివిధపూరుషశరీరం
యత్త దనువిశ్వ మఖిలం త్రివృత మాసీత్
జీవకలయా సకలసాక్ష్యవికృతం సత్
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

4. అన్న సలిలే అభవతా మసితపీతే
ప్రాణమాననపరిణతే పరమసూక్ష్మే
వా గభవ దప్యసిత మల్పపరిణామి
జ్యోతి రవధారయత సత్య మితి మా మోం

5. షోడశకలః పురుష ఏష పరిశిష్టః
తాసు విలయం పరిగతాసు నచ వేద
తాను తు సమస్త మనుపశ్యతి తదిత్థం
తత్త్వమవధారయత సత్య మితి మా మోం

6. యేన పురుష స్సమరసత్వ ముపలభ్య
స్వాపసమయే స్వపితి నామ క ఇతి స్యాత్
యత్ర విలయం సమనుయాతి మన ఆది
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

7. యత్ర మధుపాహృతమధూపమిత మేతత్
చిత్రరస మేకరసతాం సమధిగమ్య
నైవ రసభేద మిహ వేద జగదాది
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

8. యత్ర జలధౌ సమరసత్వ మనుయాతాః
తత్పృథ గ శేషసరితో న విదు రేవం
బ్రహ్మణి జనా అనుదినం సమనుయాతాః
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

9. యస్య కలయాయ మఖిలస్య సహి భోక్తా
తత్పరిహృతో మృత ఇతి ప్రతివదంతి
యచ్చ భవమృత్యురహిత సకలసాక్షి
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

10. యత్ర చ విజృంభిత మిదం స్వగతశక్త్యా
స్యా త్పృథ గవస్థిత మశేషజడజాతం
యచ్చ వటబీజసదృశం పరమసూక్ష్మం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

11. సింధుజనితం సలిలమిశ్రిత మివాత్మా
సర్వగత ఏకరసతా మనుగతో యః
వేదశిరసాం పరిచయేన సువివిక్తః
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

12. బద్ధనయనో వనభువి ప్రతివిముక్తః
ప్రశ్న ముపలభ్య నగరం పున రవాప
యద్గురుమతం పునరవాప నిజబుద్ధ్యా
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

13. యత్ర లయ మేతి మన ఆది పరమాత్మ
న్యన్య దనుపశ్యతి న బంధుజన ఏషః
సర్వవిలయే ప్యవిలయం య దవశిష్టం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

14. అక్రియతయా సకలవిక్రియదృశిత్వా
న్నైవ హననాదివిషయో య దవశిష్టం
తప్తపరశుస్పృ గివ సత్యపరిగుప్తం
తత్త్వ మవధారయత సత్యమితి మా మోం

15. కిన్ను కథనీయ మబలా య దనుభూతం
సర్వ మనుభూతి మపహాయ నతు తత్త్వం
నిత్య మనుభూతి సుఖవిగ్రహ మచింత్యం
తత్త్వ మవధారయత సత్య మితి మా మోం

16. సత్స దితి సర్వవిషయే ష్వనుగతం యద్
భాసకతయా ప్రియతయా చ పరిశిష్టం
మానమితిమేయమితిహీన మతిరిక్తం
విద్వదనుభూత మవధారయతసత్యం.

17. నిశ్చిత మశేషనిగ మాంతవచనై ర్యత్
తత్త్వమయ మి త్యఖిలసార మనుభూతేః
తర్కశతకై రపి దృగేకరసమాద్యం
ధీరమతిగమ్య మవధారయత సత్యం

18. పర్యవసితం నిగమవాక్కృతక మీళే
లక్షకతయాస్య విషయే పరిసమాప్తేః
సర్వవిషయస్య చ తదాత్మకతయా తం
శిష్ట మవధారయత సత్య మితి మా మోం

19. శ్రీ మురరిపో ర్వదనపద్మ మకరందం
బ్రహ్మసుఖసారవచనం బహు పిబంతః
గోకులవధూమధుకరాస్తు పరితృప్తాః
రాసభువి మండలకృతో బహు రమంతే

20. సామనిగమాంతవచనార్థ ముపలభ్య
స్వానుభవమేక మఖిలైకరసభూతం
ఏతదమృతం భవభయాపహరమాద్యం
నారాయణానందతీర్థపరిగీతం

## 1వ కీర్తన: ముఖారి ఆదితాళము

1. మాం = నన్ను; అద్వయం = సమాన అధిక రహితునిగను; అఖండితం = విభజించుటకు వీలుకానివానిగను; అశేషజగత్ ఆదిం = సమస్త జగత్తుకు కారణభూతునిగను; అనంతే = త్రివద వరిచ్ఛేదములేనట్టి (అనగా కాలవరిమితముగాని, దేశవరిమితముగాని, వస్తుపరిమితముగాని లేనిది) అనగా అంతులేనిదిగనుక అనంతము, యత్రచ = ఏ వస్తువునందు; జగత్రితయం = త్రివిధ జగత్తున్నూ; అస్థితం = నిలిచివున్నదో, కుంభః = ఘటము (కుండ); మృది = మృత్తునందు; యద్వతు = చేరుటవలెనే; పునః= మరల; యత్రవిలయం = ఏ వస్తువునందు నాశనమునుపొంది; ఉపైతి = చేరుచున్నదో అట్టి; సత్యం = నిర్వికారమైన లేక అబాధితమైన; ఓం = ప్రణవ స్వరూపుడను; ఇతి = ఇట్లని (ఇట్టివానినిగా); అవధారయత = తెలిసికొనుడు; త్రివిధజగత్తు = త్రివిధజగత్తు అనగా (కృతకం, కృతకాకృతకం, అకృతకం) అను మనుప్రళయం, దినప్రళయం, బ్రహ్మాప్రళయం అను మూడు మార్పులు.

2. యచ్చ = ఏ వరబ్రహ్మము; వురస్తాత్ = వెుుట్టవెుుదట; నిజశక్తియుతం = తన శక్తితోకూడుకున్నదానినిగా; ఐక్షత = (సూక్ష్మప్రకృతిని) చూచెనో (తద్వారా ఆకాశముపుట్టెనో); యత్ = ఏ పరబ్రహ్మము; పునః పునః = మరల మరల; వికృతం భూత్ = ఆకాశములోనుంచి, వాయువు అగునట్లుగా, వికారమునొందించెనో, ఐక్షత = తిరిగి వీక్షణద్వారా; సుతేజః = తేజస్సును (అగ్నిని) కలిగించెనో; యచ్చ = ఏవరబ్రహ్మము అట్టి అగ్నిలోనుంచి; కం అభూత్ = నీటిని సృష్టించెనో; పునః = తిరిగి; ఉదైక్షత = వీక్షించి (వీక్షించుటవలన); యత్ అన్నం జాతం = ఏ పృధ్విని కలిగించెనో (అట్టి); సత్యం = త్రైకాలికా అబాధ్యమైన అనగా త్రివిధపరిచ్ఛేదముకాని, అనగా భూత, భవిష్యత్, వర్తమానములలోగల; ఓం = ప్రణవస్వరూపుడను; ఇతి = అని; మాం అవధారయ = నన్ను తెలిసికొనుడు.

3. యత్ = ఏ పరబ్రహ్మము; పునః = మరల; త్రివిధ పూరుషశరీరం అభవతు = మూడు విధములైన పురుషులకు సత్తా నిచ్చువాడుగానున్నాడో; త్రివిధ పూరుషశరీరం అనగా = నిత్యులు, బద్ధులు, ముక్తులు లేదా జాగ్రత్త, స్వప్న, సుషుప్తులు; యత్ = ఏవరబ్రహ్మము; తదను = అప్పుడు అనగా సృష్టిసంకల్పానంతరం; త్రివృతం = త్రివృత్కరణముచేత అనగా (అగ్ని, నీళ్ళు, పృధ్వి, ఈమూడు భూతములను ఒక్కొక్క దానిని మూడుభాగములుచేసి, వాటిలో రెండు భాగములను తక్కిన రెండు భూతములందు చేర్చుటచేత; అఖిలం = సమస్తములైన; విశ్వం = జగత్తును; ఆశీత్ = కల్పించెనో మరియు; సకల సాక్షి = సర్వమునకు సాక్షిగానుండి; అవికృతంసత్ = తనస్వరూపమునకు వికారములేకయే; జీవకలయా = చైతన్యాంశముతో; అను = అనుసరించివున్నదో-అట్టి; సత్యం తత్త్వం = నిర్వికారమైన పరతత్త్వముగానున్నూ; ఓం = ఓంకార వాచ్యునిగాను, మాం అవధారత = నన్ను తెలియుడు.

4. అన్న = పృథ్వీ రూపమగు ఆహారపదార్థముగాను; సలిలే = నీరున్నూ; ఆశిత = భక్షించబడియు; పీతే = త్రాగబడియు; పరమనూక్ష్మే = మిక్కిలి సూక్ష్మములైన; ప్రాణ మానస = మనఃప్రాణములుగా; పరిణతే = పరిణమించినవి; అభవతా = ఆయెను; జ్యోతిః = తేజోరూపమైన పదార్థములు (తైలము మొదలగునవి), అపి = కూడానున్నూ; ఆశిత =భక్షించుటవల్ల; అల్పపరిణామ = స్వల్పకాలములో పరిణమించునది (జీర్ణించునది) అయినట్టి; వాక్కు = వాగింద్రియము; అభవతు = ఆయెను, ఇతి = ఈవిధముగా పరిణమించునని (దీనికి కారణభూతుడైనైన); మాం = నన్ను; సత్యం = అబాధితమైన వానినిగను; ఓం = ప్రణవ స్వరూపునిగను; అవధారయత = తెలిసికొనుడు.

5. ఏషపురుషః = ఈ జీవాత్మ; షోడశ కళః = పదియారు కళలతోకూడుకున్నవారై (అనగా ఇంద్రియాదులైన); పరిశిష్టః = కళలుగాక శేషించినవారై; తాసు = ఆకళలు; విలయం = నాశనమును; పరిగతాసు = పొందగా; నచవేద = (అట్టిమనస్సు) దేనిని తెలిసికొనజాలదు; తాసు తు = ఆ కళలు చక్కగా వుండునప్పుడు; తత్ = అయితేనో; సమస్తం = అన్నివిషయములను; అనుపశ్యతి = చూడగలడు (తెలిసికొనగలడు) ఇత్థం = ఈ ప్రకారము; మాం = నన్ను; సత్యం తత్వం = యథార్థమైన సత్యస్వరూపుడుగాను; ఓం = ఓంకారవాచ్యుడుగాను; అవధారయత = తెలిసికొనుడు.

6. పురుషః = జీవుడు; స్వాపసమయే = సుషుప్తికాలమందు; యేన = ఏ పరబ్రహ్మముతో సంసర్గము; సమరసత్వం = సమానమైన అందమును; ఉపలభ్య = పొందినవారై; స్వపితి ఇతి = స్వరూపమును చెందినాడు అనే; నామకః = పేరుగలవాడు; స్యాత్ = అగుచున్నాడో; యత్ర = ఏ పరబ్రహ్మమునందు; మన ఆది = మనస్సు మొదలుగునవి; విలయం = లీనమును; సమనుయాతి = లెస్సగా పొందుచున్నవో -అట్టి; సత్యం తత్త్వం = నిర్వికార తత్వస్వరూపునిగాను; ఓం = ప్రణవ స్వరూపునిగాను; ఇతి = ఇట్లని; మాం = నన్ను; అవధారయత = తెలిసికొనుడు.

7. (మధుపాహృత మధూపమితి)
మధుప = తేనెటీగలచేత; అపహృతం = కూర్చబడినటువంటి; మధు = మకరందముతో; ఉపమితం = ఉపమానముగా నెంచబడ తగినట్టి; ఏతత్ చిత్రరసం = ఈ అనేకవిధములైన రసములు; యత్ర = ఏ పరబ్రహ్మమునందు; ఏక రసతాం = ఒకే రుచికలిగియుండు స్థితిని అనగా (సుషుప్తి కాలమునందును, మోక్షకాలమునందును); సమధిగమ్య = పొందియున్నవియై; ఇహ = ఈస్థితిలో (జీవుడు); రసభేదం = చిత్ర రసముల భేదస్థితిని; న వేద ఏవ = తెలియజాలకనే వుండునో; సత్యం = నిర్వికారమైనట్టి; జగదాదితత్త్వం = జగత్కారణమైన తత్వముగాను; ఓం = ఓంకార వాచ్యునిగాను; మాం = నన్ను; ఇతి అవధారయ = ఇట్లని తెలిసికొనుడు.

8. జలధౌ = సముద్రమునందు; సమరసత్వం = సమానరసము కలిగియుండుటను; అనుయాతాః = పొందినటువంటి; అశేష సరితః = సమస్తనదులను; తత్పృథక్ = ఆ సముద్రముకంటె వేరుగా; నవిదుః = తెలిసికొనరు (ఎరుగరు); ఏవం = ఈప్రకారము; యత్రబ్రహ్మణి = ఏ పరబ్రహ్మమునందు; జనాః = జనులు; అనుదినం = ప్రతిదినమున్నూ; సమనుయాతాః = లెస్సగా చేరుచున్నదో - అట్టి; సత్యం తత్వం = అట్టి నిర్వికార తత్వముగాను; ఓం = ఓంకార వాచ్యునిగాను; ఇతి = ఇట్లని; మాం = నన్ను; అవధారయత = తెలిసికొనుడు.

9. యస్యకలయా = ఎవనియొక్క అను (ప్రవేశముచేత ప్రకాశముచేత); అయం = ఈ జీవుడు, అఖిలస్య = సమస్తవిషయములయొక్క; భోక్తా = అనుభవించునట్టివాడుగా అగుచున్నాడో, తత్ = ఆ జీవునిచేత లేక ఆపరబ్రహ్మ ప్రకాశముచేత; పరిహృత = విడువబడినదియై; సహి = ఆ దేహధారి; మృతయతి = చచ్చినవాడు అని; ప్రతి వదంతి = అందరు చెప్పెదరు; యచ్ఛ = మరి ఏ పరబ్రహ్మము; భవమృత్యురహితః = జనన మరణములు లేనివాడై; సకలసాక్షి = సర్వసాక్షిగా నున్నాడు; సత్యం సత్యం = అట్టి నిర్వికార తత్వముగానున్నూ; ఓం = ఓంకారవాచ్యునిగాను; మాం = నన్ను; అవధారయత = తెలిసికొనుడు.

10. పృథక్ = వేరుగా; అవస్థితం = ఉన్నటువంటి; ఇదం అశేషజడజాతం = ఈ సమస్తజడవస్తువుల సమూహములు; యత్ర = ఏ పరబ్రహ్మమునందు; స్వగతశక్త్యా = తనయందు ఉండునట్టి శక్తిచేత; విజృంభితస్యాత్ = విస్తరించినది అగుచున్నాడో; యచ్ఛ = మరియు ఏ పరబ్రహ్మము; వటబీజసదృశం = మఱ్ఱి విత్తనముతో సమానముగా; పరమసూక్ష్మం = కేవల సూక్ష్మమై అనగా నామరూప విభాగ అనర్హమై యున్నదో - అట్టి; సత్యం సత్యం = నిర్వికారతత్వముగాను; ఓం = ఓంకారవాచ్యునిగాను; మాం అవధారయత = నన్ను తెలిసికొనుడు.

11. సలిలమిశ్రితం = నీటిలో కలుపబడిన; సింధుజనితంఇవ = లవణమువలెనే; అత్మ = పరమాత్మ; సర్వగతః = నమస్త వస్తువులందు వ్యాపించినవాడై; ఏకరసతాం = వ్యాపించబడిన వస్తువుయొక్క స్థితినీ; అనుగతః = పొందినవాడై; యః = ఏపరమాత్మ; వేదశిరసాం = ఉపనిషత్తులయొక్క; పరిచయేన = అనుభవముచేత; సువివక్తః = లెస్సగా వివేచన చేయబడినవాడగుచున్నాడో - అట్టి; సత్యం తత్వం = నిర్వికార తత్వముగాను; ఇతి = ఇట్లని; మాం = నన్ను; ఓం = ప్రణవస్వరూపునిగా; అవధారయత = తెలిసికొనుడు.

12. బద్ధనయనః = మూయబడిన కన్నులుగలవాడై; వనభువి = అడవియందు; ప్రతివిముక్తః = విడిపించబడినవాడై; ప్రశ్నం ఉపలభ్య = ప్రశ్నద్వారా జవాబుపొంది; నగరం = తన నగరమును; పునః = మరల; అవాప = పొందినట్లు; గురుమతం = ఆచార్య అభిప్రాయము; యత్ = ఏదియో ఆపరబ్రహ్మమును; నీజబుధ్యా = తన బుద్ధియోగముచేత; పునః = మరల; సత్యం తత్వం = నిర్గుణ పరబ్రహ్మముగాను; ఓం = ఓంకారవాచ్యునిగాను; ఇతి = ఇట్లని; మాం = నన్ను; అవధారయత = తెలిసికొనుడు.

13 యత్రపరమాత్మని = ఏ పరమాత్మునియందు; మన ఆది = మనస్సు మొదలైన ఇంద్రియములు; లయం ఏతి = లీనమును పొందుచున్నవో; ఏషఃబంధుజనః = ఈ లోకసంబంధమైన బంధుజనులు; అన్యత్ = ఇంద్రియాదులకంటె వేరైన జీవాత్మను; నఅనుపశ్యతి = చూడజాలదో; సర్వవిలయే అపి = సమస్తము నశించిపోయినను; యత్ = ఏపరమాత్మ; అవిలయం = నాశరహితమై; అవశిష్టం = మిగిలియుండునో - అట్టి; సత్యం తత్వం = నిర్వికారతత్వముగానున్నూ; ఓం = ప్రణవస్వరూపునిగానున్నూ; ఇతి = ఇట్లని; మాం = నన్ను; అవధారయత = తెలిసికొనుడు.

14. అక్రియతయా = ప్రాకృతక్రియలు లేనివాడగుటచేత; సకల విక్రియదృశిత్వాత్ = సమస్తవికారములకు ద్రష్ట అయినందున; నైవ హననాది విషయః = చంపుట మొదలగు కార్యములకు విషయభూతుడుకాని; యత్ = ఏపరమాత్మ మిగిలియుండునో; తప్తపరశుస్పృగివ = బాగా కాల్చబడిన పరశువనే ఆయుధమును తాకినవానివలె; సత్యంపరి = సత్యముచేత (పది) నలుదిక్కులయందు; గుప్తం = రక్షించబడుచున్నవానివలె; సత్యం తత్వం = నిర్వికారమైన పరబ్రహ్మముగాను; ఓం = ఓంకారవాచ్యునిగాను; ఇతి = ఇట్లని; మాంఅవధారయ = నన్నుతెలిసికొనుము.

15. అబలాః = గోపికలారా; యత్ = ఏదైతే; అనుభూతం = అనుభవింపదగిన పరబ్రహ్మము (అట్టివస్తువు); కిన్ను కథనీయం = ఏమని వర్ణించబడగలుగును?; నతుతత్వం = పరతత్వస్వరూపముగాక; సర్వం అనుభూతి = తక్కిన సమస్త విషయములయొక్క అనుభవముయొక్క; అపహాయ = విడిచి; నిత్యం = ఎల్లప్పుడున్నూ; అనుభూతి = అనుభవించబడవలసిన; సుఖవిగ్రహం = అందమైన విగ్రహముగా కలిగినటువంటిన్నీ; అచింత్యం = చింతనాతీత మైనట్టిన్నీ; సత్యం = తత్వము; ఓం = ఓంకార వాచ్యునిగాను (ప్రణవస్వరూపునిగాను); ఇతి మాం = ఇట్లని నన్ను; అవధారయ = తెలిసికొనుము.

16. యత్ = ఏ పరబ్రహ్మము; సత్ సత్ ఇతి = ఎల్లప్పుడు ఒకే రూపముకలదియై; సర్వవిషయేషు = సమస్త వస్తువులయందు; అనుగతం = అనుప్రవేశముకలదై; భాసకతయా = ప్రకాశము యిచ్చునదియగుటచేతనున్నూ; ప్రియతయాచ = ప్రేమాస్పదమగుటచేతనున్నూ; పరిశిష్టం = మిగిలియుండు; మానమతి = ప్రత్యక్ష ప్రమాణములున్నూ; మేయమతి = వాటివల్ల గోచరించు విషయములున్నూ; హీనం = స్వల్పవస్తువులున్నూ; అతిరిక్తం = గొప్పవస్తువులున్నూ (ఇవి మొదలైన భేదములుగలిగి); విద్వత్ = జ్ఞానముచేత; అనుభూతం = అనుభవింపబడుచున్నట్టి; సత్యం = సత్యస్వరూపమును; అవధారయ = తెలిసికొనుడు.

17. యత్ = ఏ పరబ్రహ్మము; అయం = ఇది; తత్వం ఇతి = పరతత్వమనిన్నీ; అనుభూతేః = అనుభవమునకు; అఖిలసారం = ముఖ్యసారమనిన్ని; అశేష నిగమాంతవచనైః = సమస్త ఉపనిషద్వాక్యములచేతనున్నూ; తర్కశతైః అపి = అనేక శక్తియుక్తములైన

వాక్యములచేతనున్నూ; నిశ్చితం = నిశ్చయింపబడియున్నదో (అట్టి); దృగేకరసం = దృష్టులకు ముఖ్యమైన ఆనందరసమును ఇచ్చునదియు; ఆద్యం = జగత్తుయొక్క సృష్టికి పూర్వం వుండునదియు; ధీరమతిగమ్యం = వైరాగ్యయుక్తమైన మనస్సులచేత పొందబడదగినదియు (అట్టి); సత్యం = సత్య స్వరూపునిగాను; అవధారయత = తెలిసికొనుడు.

18. నిగమవాక్యకృతకమీళే = వేదవాక్యములచేత ఏర్పడిన సంబంధము; లక్షకతయా = లక్షణా వృత్తినిబట్టి (అనగా ఒకదానిని ఆధారముచేసుకొని సూచించుట); అన్యవిషయే = ఈ పరబ్రహ్మవిషయమునందు; పరినమాప్తేః = పరిసమాప్తినొందుటవలనున్నూ; సర్వవిషయస్య = సమస్త విషయములు; తథాత్మకతయాచ = ఆ పరబ్రహ్మయే అంతరాత్మగా కలిగియుండుటచేతనున్ను; పర్యవశితం = సమస్త వేదములకున్నూ పర్యవసానమైనటువంటిన్నీ; శిష్టం = శేషించినటువంటిన్నీ; తం సత్యం = ఆ నిర్వికార స్వరూపునిగాను; ఓం = ప్రణవస్వరూపునిగాను; ఇతి = ఇట్లని; మాం అవధారయత = నన్ను తెలిసికొనుడు.

19. గోకుల వధూమధుకరాః = గోపికాస్త్రీలు అనునట్టి భ్రమరములు; బ్రహ్మసుఖసారవచనం = బ్రహ్మానందసారముగల వాక్యములనునట్టి; శ్రీమురరిపోః వదనపద్మమకరందం = శ్రీకృష్ణస్వామివారి యొక్క ముఖకమలమునుండి వెలువడిన మకరందమును; బహుపిబంతం = విశేషముగాత్రాగి; పరిసంతృప్తాః = తృప్తిపొందినవారై; రాసభువి = రాసక్రీడ భూమియందు; మండల కృతః = మండలముగా చేరినవారై; బహు రమంతే = విశేషముగా క్రీడించుచుండిరి.

20. సామ నిగమాంత వచనార్థం = సామవేదమునందలి ఛాందోగ్యోపనిషత్తు యొక్క అర్థమును; ఉపలభ్యతే = తెలిసికొని; స్వానుభవం = స్వరూపానుభవమును తెలియపరచునదిన్నీ; ఏకం = ముఖ్యమైనదిన్ని (అద్వితీయమైనదిన్ని); అఖిలైక రసభూతం = సమస్తరసములను ఏకీభవింపచేసినటువంటి బ్రహ్మానందరసమైనట్టిదిన్ని; భవభయాపహరం = సంసారభయమును నివర్తింపచేయునట్టిదిన్ని; ఆద్యం = జగత్కారణమైనదిన్ని; ఏతత్ అమృతం = ఈ లక్షణములు కలిగిన బ్రహ్మానందామృతమును; నారాయణానందతీర్థ = నారాయణానందతీర్థులవారిచేత; పరిగీతం = బాగా చెప్పబడినది.

**1. (ఈగీతము కృష్ణుడు గోపికలకు చేసిన యుపదేశమును దెల్పును) నేను అద్వితీయుఁడను, సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు లేనివాఁడను. (ఒకరాతికి మఱియొకరాతితోఁగల భేదము -సజాతీయ భేదము. ఒకటేజాతిలో నుండు రెండువస్తువులకుఁగల భేదము; ఒకరాతికి ఒకచెట్టుతోఁగలభేదము; విజాతీయభేదము = వేఱువేఱు జాతులలోనున్న రెండువస్తువులకుఁ గలభేదము; ఒకచెట్టునందే దాని యవయవములగుకొమ్మ, ఆకు మొదలగువానికి పరస్పరముగల భేదము; స్వగతభేదము=తనయందేలేక తన అవయములందే యున్న భేదము) నాశరహితుఁడను. ఒకకుండ తనయుత్పత్తికి ముందును, పుట్టినపిదపను, నశించినప్పుడును తనకు కారణము మృత్తికయే యైనట్లు ఈ ప్రపంచమంతయును, ఉత్పత్తి స్థితి ప్రళయ కాలముయందుకూడ నాకంటె వేరుకాదు. ఏలయనఁగా - ఈప్రపంచమునకు కారణభూతుండను నేనే. కావున నోగోపికలారా! సత్తామాత్రస్వరూపుఁడని (ఉనికియే స్వరూపముగాఁగల వాఁడని) చెప్పఁబడు పరమాత్ముఁడను నేనేయని యెఱుంగుఁడు. ఓంకారము నన్నుఁ గూర్చియే చెప్పును.**

2. అపరబ్రహ్మము తన మాయాశక్తితోఁగూడి సృష్టికై సంకల్పించి మొట్టమొదట నాకాశరూపముగాను పిదప వాయురూపముగాను నేర్పడియెను. ఆవాయురూపుఁడగు బ్రహ్మ తనసంకల్పముచే నగ్నిరూపుఁడయ్యెను. పిదప మఱియొక సంకల్పముచే జలరూపుఁడయ్యెను. అంత నొక్కసంకల్పముచే పృథ్వీరూపుఁడయ్యెను. ఈవిధముగా సకల ప్రపంచరూపుఁడై, సత్తా మాత్రస్వరూపుఁడై ఓంకారముచే నిరూపింపఁబడుచు నున్నాఁడని చెప్పఁబడు పరబ్రహ్మమును నేనే. (పరబ్రహ్మము అకారాదిరూపుఁడయ్యె ననఁగా మట్టికుండయియనట్లు అయారూపములతో పరిణామమును జెందెనని యర్థముగాదు మఱియేమనిన, నామరూపవిభాగములులేక యాయనయందున్న ప్రపంచము క్రమక్రమముగా నామరూపాదివిభాగములతోఁ బ్రకాశించెననియు, అపరబ్రహ్మము సర్వమయుఁడుగావున నాయారూపములఁజెందినట్టు చెప్పుకొనుచుండెననియుఁ దాత్పర్యము) అని తెలిసికొనుడు.

3. సర్వమునకు సాక్షియయ్యును, వికారములేవియులేనిదయ్యును, అపరబ్రహ్మమే అకాశాదిపంచభూతములుశరీరముగాగలదై, యాభూతములను పంచీకరణముచేసి సమస్తలోకములను నిర్మించెను. ఆలోకము లన్నియును తానేయైయుండియును, మరల జీవస్వరూపముతో వానియందుఁ బ్రవేశించి నామరూపాదుల వ్యవహరించుచుండును. అట్టి సత్తాస్వరూపమగు ఓంకార వాచ్యమగుపరబ్రహ్మము నేనే యని తెలిసికొనుఁడు (ఛాందోగ్యోపనిషత్తు నందు అగ్ని మొదలు మూఁడు భూతములను మాత్రమే సృష్టించినట్లును, వాని త్రివృత్కరణముచే, అనఁగా ఒక్కొక్క భూతమును మొదట రెండుభాగములుగాఁజేసి దానిలోని రెండవభాగమును మఱిరెండు భాగములుగాఁజేసి మిగిలిన భూతములలోఁ జేర్చుటచే లోకములు జనించెననియుఁ జెప్పఁబడియున్నది. అట్లైనను భాష్యకర్త మతానుసారముగా నిచట వివరింపఁబడెనని దెలిసికొనవలయును. మఱియు పరబ్రహ్మము లోకములయందు జీవరూపముతో ప్రవేశించుట యనఁగా స్వాభావికమగుసర్వవ్యాపకత్వముచే నుండుటయనిగాని, బుద్ధిలో ప్రతిబింబించుట యనిగాని యర్థము)

4. యోగులు భక్షించుచుండు బహువిధములుగు పదార్థములు భూసంబంధములైనవి. కావున వానికిని భూమికిని భేదములేదు. (అన్నమను శబ్దమునకు నాయుపనిషత్తునందు భూమియనికూడ ప్రత్యక్షముగానే యర్థము చెప్పఁబడియున్నది) ఇట్లగుటచే నాహారపదార్థములద్వారా పృథివి శరీరమునఁ బ్రవేశించి మనస్సగును. ఇట్లే జలములును ప్రాణస్వరూపముగాఁ బరిణమించును. తైలము మొదలగుపదార్థములు తేజోభూతమయములు. కావున వానిద్వారా తేజోభూతములోనికిఁ బ్రవేశించి వాగింద్రియముగాఁ బరిణామమును జెందును, ఈభూతములన్నియును పరబ్రహ్మమే గావున నాయనయే యీస్వరూపములతో నున్నాఁడని చెప్పవలసియున్నది. ఇట్టిపరమాత్ముఁడను, ఓం కారవాచ్యుఁడను నేనేయని తెలిసికొనుఁడు.

5. మనోమయుపురుషుఁడు (మనస్సు) పరబ్రహ్మముకాదు. ఏలయనఁగా నీతనికి పదియాఱుభాగములు గలవు. ఆభాగములు అన్నమువలన నభివృద్ధినొందును. అవి క్షీణించినచో నీతఁడేమియును తెలిసికొననేరఁడు. బాగుగ భుజించుచు నాపదియాఱు అవయవములును

బాగుగానుండినచో సర్వమును తెలిసికొనఁగలఁడు. ఈకారణమువలన నామనస్సు అన్నమువలన జనించునదియే యని స్పష్టమగుచున్నదిగదా. దీనివలన నామనస్సు పరబ్రహ్మకాఁడనియు, సత్తామాత్రస్వరూపుఁడనగు నేనే పరమాత్ముఁడననియు నిశ్చయించుకొనుఁడు. (ఈమనస్సుగాక శరీరమునందెన్నియో యింద్రియములున్నను జ్ఞానశక్తిగలవియగుటచే నీమనసునకును, ఆత్మకును భేదము గ్రహించుట కష్టసాధ్యమైయుండు నని దీనినిగూర్చి విమర్శించియున్నారు.)

6. మఱియు పురుషుఁడునిదురించునపుడు మనసు మొదలగునవియెచ్చట లీనములగునో, నిదురించువాని కప్పుడు గలుగునానంద మెవ్వనిసంసర్గమువలన జనించునో అట్టి పరబ్రహ్మస్వరూపుఁడను, ఓంకారవాచ్యుఁడను నేనేయని తెలిసికొనుఁడు. నిదురించువారలు పరబ్రహ్మమునందుఁ జేరుదురనుటకు లోకమునందలి వ్యవహారమే ఆధారము. 'స్వపితి' అని నిదురించువానినిగూర్చి పల్కుదుము. స్వపితి యనఁగా తనను జెందుచున్నాఁడని యర్థము. తాననఁగా పరబ్రహ్మయేగదా?

7. మఱియు తేనెటీగలు అనేకవిధములగు పుష్పములనుండి యనేక విధములగు రుచులుగల రసములను దెచ్చి యొక్కచోఁగూర్చిన నవియన్నియుం గలసి పిదపనేర్పఱుపరానట్లు, ఈసకలలోకములును సుషుప్తికాలమున వరబ్రహ్మమునందు లీనములై యేర్పరుచుటకు వీలులేక యుండును. అపరబ్రహ్మమును, ఓంకారవాచ్యుడుఁను సత్తామాత్రస్వరూపుఁడును నేనే యని దెలిసికొనుఁడు. (సుషుప్తికాలమునందు జీవుని యుపాధియగుబుద్ధి తన కారణమగునవిద్యయందు లీనమగుటచే నాజీవుఁడును, పరబ్రహ్మయు నొక్కటియుగుదురు. ఈయైక్యము వారికి స్వభావసిద్ధమేకాని వైకల్పికముగాదు. మఱియు బుద్ధిగతమగున జ్ఞానము నశింపలేదుగావున మరల జాగ్రదవస్థయందు జీవుఁడు దానితోఁ గలసి వ్యవహారములఁ జేయుచుండును. అని తెలిసికొనవలయును)

8. సముద్రమునందు నదులన్నియు ప్రవేశించుచున్నను, అందుగలసిన పిదప నిది గంగ, యిది గోదావరియను నామరూపభేదములఁ దెలిసికొనలేనట్లు ఈజీవులును మొదటననేక భేదములతో నున్నవారైనను సుషుప్త్యవస్థయందు పరబ్రహ్మమును జెందినప్పుడు తమభేదములఁ దెలిసికొననేరరు. అట్టిపరబ్రహ్మము నేనే యని తెలిసికొనుఁడు.

9. సకలప్రపంచమునకు సాక్షియై. ఉత్పత్తినాశములేనివాఁడై యుండు పరబ్రహ్మముయొక్క యంశమే యీజీవుఁడు. (అయాత్మకు అవయవములులేవు గావున "జీవుఁడాయనయొక్క యంశము" అని చెప్పుట శిష్యులకు బాగుగఁ దెలియుటకై ఆకాశములో భాగముల నేర్పఱచినట్లని తెలిసికొనవలయును) అనఁగా అపరబ్రహ్మమునకును ఇతనికిని భేదములేదు. అట్టి పరబ్రహ్మము నేనే యని తెలిసికొనుఁడు.

10. మిక్కిలి సూక్ష్మమగు మఱ్ఱివిత్తనమునందు మొదట సూక్ష్మ స్వరూపముతో నుండి పిదప మిగుల విస్తారమునుజెందు వటవృక్షమువలె, నేపరబ్రహ్మమునందు ఈ ప్రపంచమంతయును నామరూపవిభాగములులేని సూక్ష్మావస్థతో నుండి యందున్న మాయాశక్తిచే విజృంభించునో అట్టి................ ఈ ప్రపంచమంతయు అనేకభేదములతోనున్న ఆ పరబ్రహ్మముకంటె వేఱుకాదని తెలిసికొనవలయును.

11. లవణమును నీటిలోఁగలిపిన నది యానీటియందంతయు వ్యాపించి యొకటేవిధముగా (హెచ్చుతక్కువలులేకుండా) నెట్లుండునో, అట్లే యాపరబ్రహ్మము కూడ సర్వప్రపంచమునందును వ్యాపించి యొకటేవిధముగా నున్నాఁడు అయనను వేదాంతవాక్యముల యాధారముచే బాగుగ వివేచనఁజేసి తెలిసికొనవచ్చును. అట్టి పరబ్రహ్మమును......................(జడ రూపమును, చేతనరూపమునగు ప్రపంచమంతయును పరమాత్మయేయైనను, లోకమునందు దృక్‌దృశ్యములు = చూచువాఁడు చూడఁబడునది. అనుభేదముండుటచే దీనినాధారముఁజేసికొని శిష్యులకు సుఖముగఁదెలియుటకై వేదము జ్ఞానస్వరూపమునుగూర్చియే, లేక జీవస్వరూపమునుగూర్చియే బోధించుచున్నది)

12. కన్నులఁగట్టి యరణ్యమున విడచినను 'అయూరెక్కడ" యని యడుగుచు తనయూరికిఁ జేరునట్లు, అవిద్యవలన భ్రాంతుఁడై యెంతకాలమజ్ఞానముతో నున్నను, గురూపదేశమువలన క్రమక్రమముగా స్వానుభవముకలవాఁడు గావచ్చును. ఏ పరబ్రహ్మమును తెలిసికొనినట్లు ముక్తుడగునో యట్టిపరబ్రహ్మమును (తనయూరికిపోవు పురుషుఁడు నడుమ నేది వచ్చినను "అది నాయూరుకాదు" అని విడచిపెట్టుచు తనయూరురాఁగానే అచటికిఁబోవునట్లు, పరబ్రహ్మము నెఱుంగఁదలఁచిన పురుషుండును గురూపదేశమువలన నా బ్రహ్మయొక్క లక్షణములఁ దెలిసికొని నడుమ నెన్నివచ్చినను నిరాకరించుచు ధ్యానబలమువలన అపరోక్షజ్ఞానము, ప్రత్యక్షముగా తానును బ్రహ్మయును యొక్కటియే యను తెలివినిఁ జెందవలయును) నేనేయని తెలిసికొనుఁడు.

13. మఱియు పురుషుఁడు మృతిచెందినప్పుడు సమస్తేంద్రియములును, మనసును ఎచ్చట లీనములగునో, వానిచుట్టునుండు బంధువులు ఇంద్రియములకంటె పరుఁడగు నెవ్వని గనుఁగొననేరరో, సమస్తము లయమునొందినను ఎవ్వఁడు నశింపఁడో అట్టి..............(పురుషుఁడు జ్ఞానియైనచో వాఁడు మరణముఁ జెందినపుడు వానిమనసు మొదలగునవి సంపూర్ణముగ నశించి పరబ్రహ్మతో నైక్యముఁజెందును. అజ్ఞానియైనచో మరల జన్మము నెత్తును. ఎట్లైనను అమరణావస్థయందు ఇంద్రియములు లీనములగుటకు స్థానమగునదియే పరబ్రహ్మతత్వమని భావము)

14. అబ్రహ్మము ఈకార్యమును జేయునదికాదు (అవయవములులేనిదనుట. అవయవము లుండినగాని కార్యముచేయుట సంభవింపదనుటకు ఆకాశము దృష్టాంతము) సమస్తవికారములకును సాక్షి. ఇట్లనుటచే నాపరతత్త్వము స్వయముగా నశింపక, పరులచే నశింపఁజేయఁబడక మఱియు నే వికారములను జెందక సర్వలోకములకు నావల నేకరూపముతో నున్నది. నిర్దోషియగువాఁడు తనపై నారోపింపఁబడినదోషమును తొలఁగించుకొనుటకై ప్రమాణము చేయవలసియుండి కాలినయుక్కుగుండును చేతఁబట్టుకొనినను, తనసత్యప్రభావముచే బాధనొందఁడుకదా! అట్లే యీపరబ్రహ్మముకూడ ప్రపంచముతో సంబంధపడియున్నను తన ప్రభావమువలన దీనియందలి వికారములనొందఁడు. అట్టి.............(ఈపాదమున పరబ్రహ్మమును వర్ణించుట ముక్తుఁడగుజీవుని వర్ణించుటయే యని తెలిసికొనునది. మరణమనునవస్థ జ్ఞానికిని అజ్ఞానికిని సమానమేయైనను, అజ్ఞానిజీవుఁడు బద్ధుఁడగుటచే నా(మరణరూప) వికారమునకు లోఁబడును, కావున జననరూపవికారమునకుఁగూడ లోఁబడును. అనఁగా రెండమాఱు జనించుననుట. ఇఁక జ్ఞానిజీవుఁడన్ననో ముక్తుఁడగుటచే నేవికారమునకుఁగూడ లోఁబడుడు. అని తాత్పర్యము.)

15. ఓగోపికలారా! ఇంతకంటె నధికముగా మీకుఁ జెప్పవలసినదేమున్నది. లోకమున నేత్రము మొదలగు నింద్రియములద్వారా ప్రత్యక్షమునఁగాని కేవల మనోమూలముగా నూహచేఁగాని (యిదియే యనుమానప్రమాణము) మఱియేవిధముగాఁగాని మన మనుభవించుచుండు విషయములన్నియును యథార్థములుగావు. (ఈవిషయములయందు మనము చూచుచుండు బాహ్య రూపము యధార్థముకాదనుట. సర్వప్రపంచమును పరబ్రహ్మదృష్టితోఁ జూడవలయుననియు, అదియే యథార్థమనియు భావము.) ఆవిషయములనన్నిటిని దేనిమూలమున గ్రహించుచున్నామో లేక యనుభవింపుచున్నామో ఆసాక్షి స్వరూపమొక్కటియే సత్యమైనది. ఆనందస్వరూపమైనది. మనసుచే ధ్యానించుట కశక్యమైనది. అట్టి............

16. "ఆకాశమున్నది, భూమియున్నది." అని ప్రతివస్తువునందును వ్యవహరింపఁబడుచుండు భావమే = ఉనికియే స్వరూపముగాఁగలది యగుటచే నాబ్రహ్మమును 'సత్' అను శబ్దముతో చెప్పుదురు. జ్ఞానస్వరూపమగుటచే సర్వమును బ్రకాశింపఁజేయును గావున 'చిత్' అనుశబ్దముతోఁ జెప్పుదురు. లోకమునందలి సర్వవిషయములకంటె నధికముగఁ బ్రేమింపఁబడునది గావున ఆనందము అని చెప్పుదురు. (పురుషుఁడు ఏవస్తువును గోరినను అది తన కానందమును గల్గించుననియే కదా ప్రతివాఁడును సమస్తపదార్థములను దనకొఱకే (ఆత్మకొఱకే) కోరుచున్నాఁడుగాని, ఆయాపదార్థములకొఱకేగాదు. దీనివలన సకల ప్రపంచములకంటె నాత్మయందే (తనయందే) ప్రతివానికిని బ్రేమ యధికమని స్పష్టమగుచున్నది కావున మొదటచూపిన ప్రకారము ఆనందకరముగాని పదార్థముపై ప్రేమయుండదు కావునను, తాను ప్రేమించుచున్న దానికంటె నధికమగు (ఆనందకర) పదార్థముఁ గానవచ్చినచో, మొదటిదానిపైనుండు ప్రేమ నశించును కావునను, ఆత్మవిషయమున నిట్టిమార్పు కనఁబడుటలేదు కావునను, ఆయాత్మయే పరమానందస్వరూపుఁడని తాత్పర్యము) అట్టి సచ్చిదానందస్వరూపుఁడును, సర్వప్రపంచమునకంటె నధికుఁడును ప్రమాణమును, (ప్రత్యక్షము మొదలగు జ్ఞానములు) ప్రమేయమును, (అజ్ఞానముచే నెఱుంగఁబడు విషయములు) హీనమును, అధికమును అనుసర్వ భేదములును తనస్వరూపముగాఁ గలవాడు నగుచు, జ్ఞానుల యనుభవములోనున్న తత్త్వస్వరూపుఁడును. నేనే యని తెలిసికొనుఁడు.

17. సకలశాస్త్రములచేతను, ననేకయుక్తులచేతను, ఎయ్యది తత్త్వ స్వరూపముగా సిద్ధాంతము చేయఁబడియున్నదో, అనాదియై సాక్షిరూపమై, సకలవిధములగు ననుభవములలో నుత్తమమై, (ఇంద్రియాదిమూలమున గల్గు విషయానుభవములు అశాశ్వతములు, అల్పసుఖకరములు, కావున బ్రహ్మా (నందా) నుభవము సర్వోత్తమ మని భావము) జ్ఞానులగువారలకును సులభమైయెయ్యది దనరారుచున్నదో యట్టి సత్యస్వరూపుఁడను నేనే యని తెలిసికొనుఁడు.

18. వేదము లక్షణావృత్తిచే (ఒకదాని నాధారము చేసికొని సూచించుట) నీపరబ్రహ్మమును నిరూపించుచుండును. కావున నాశ్రుతి ఏయే విషయములఁ జెప్పినను దానికి పర్యవసాన మీపరతత్త్వమే యగును. (మేళః=చేరిక, అనఁగా సంబంధము, నిరూపణమని భావము. నిగమ...........మేళ = వేదము సంబంధము గల్గించుకొనిన ప్రతివిషయమునకును ఈపరబ్రహ్మమే పర్యవసానము) "ఏయేవిషయములు'

' అని విషయము లనేకము లున్నట్లు చెప్పనేటికి? సర్వవిషయములును పరబ్రహ్మమును(గూర్చినవియేగదా! (లోకమునందు పరతత్త్వమునుగూర్చి చెప్పినట్లేయగునని భావము) అట్టి పరబ్రహ్మమును, ఓంకారస్వరూపు(డను నేనే యని తెలిసికొనుడు.

19. ఇట్లు బ్రహ్మానందమును బ్రకటించువాక్యము లనుమకరందము శ్రీకృష్ణుని ముఖపద్మమునుండి యనర్గళముగ స్రవించుచుండెను. దానిని యథేచ్ఛముగ( బానముచేసి తృప్తినొంది గోపికా భ్రమరములు మిగుల సంతసించుచు, రాసక్రీడార్థమై నిర్ణయింప( బడియున్న విశాలరమణీయ ప్రదేశమున మండలాకారముగా నిలచియుండిరి.

20. సామవేదమునందలి ఛాందోగ్యోపనిత్తుయొక్క యర్థమును సంగ్రహించి స్వానుభవస్వరూపు(డును, అద్వితీయు(డును అఖండానందమయు(డును. అనాదియు, మోక్షస్వరూపు(డును, సంసారబంధము నశింప(జేయువా(డునగు పరమాత్ముని(గూర్చి నారాయణతీర్థు(డు గానము చేసెను.

## రాసక్రీడా వర్ణనము

శ్లో. సంసారరోగసంతప్తాః కృష్ణబ్రహ్మరసాయనమ్,
గోప్యః పిబంత్య స్తన్ముక్తా రమంతే హ్యభయం గతాః 8

శ్లో. 8 గోప్యః = గోపికామ్మవారలు; సంసారరోగ సంతప్తాః = సంసార = సంసారమనునట్టి; రోగ = రోగములచేత; సంతప్తాః = తాపమునొందినవారలై; కృష్ణబ్రహ్మరసాయనం = శ్రీకృష్ణబ్రహ్మమౌనట్టి దివ్యఔషధమును; పిబంత్యః = పానముచేసినవారలై; తన్ముక్తాః ఆ సంసార రోగమునుండి విడుదల అయిరి.

ఇట్లు గోపికలు సంసారరోగముచే బాధింప(బడుచున్నవారై శ్రీ కృష్ణుని(జేరి యాఘనుని తత్త్వము నెఱుంగుటయను మహౌషధమును సేవించి యారోగ్యవంతులై నిర్భయముగ( గ్రీడించుచుండిరి.

శ్లో॥ ఆత్మారామాః పరానంద నిత్యతృప్తాః పునఃపునః,
ఆత్మానుభూతిం గాయంత్యః కృష్ణైకరసతాం గతాః 9

శ్లో. 9 అభయంగతాః = మోక్షమును పొందినవారై; రమంతేః = ఆనందించుచున్నారుగదా!; ఆత్మారామాః = పరమాత్మయందే రమించున్నవారలై; పరానందాః = శ్రేష్ఠమైన ఆనందముగలవారలై; నిత్యతృప్తాః = ఎల్లప్పటికి తృప్తిగలవారలై; పునః పునః = మాటిమాటికి; ఆత్మానుభూతిం = పరమాత్మ స్వరూపమును తాను అనుభవించుటకు; గాయంత్యః = గానము చేయుచున్నవారలై; కృష్ణైకరసతాం = శ్రీకృష్ణునియొక్క స్వరూప ఆనందములతో సమానమైన స్థితులను; గతాః = పొందినవారైరి.

తా. మఱియువారు కృష్ణునితోన భేదము చెంది యాత్మారాములై (పరమాత్మ స్వరూపమే విహారస్థానముగా గలవారై) పరమానందరసముచే శాశ్వతముగు తృప్తిగల్గియా సుఖమును గానము సేయుచుండిరి.

శ్లో॥ రమంతే పరమానందే కృష్ణబ్రహ్మణి తా భృశమ్,
త్యక్త దేహాద్యహంమానా నిర్వి శేషసుఖే స్థితాః 10

శ్లో.10 తాః = ఆ గోపికలు; పరమానందే = పరమానంద స్వరూపుడైన; కృష్ణబ్రహ్మణి = శ్రీకృష్ణపరబ్రహ్మమునందు; భృశం = మిక్కిలి; రమంతే = ఆనందించుచున్నవారలై; (త్యక్తదేహాద్యహంమానాంః); త్యక్త = త్యజింపబడిన; దేహాది = శరీరములయందలి; అహం మానాః = అహంకారములుగలవారలై (అనగా దేహములయందుగల అహంకారములు (నేను, నాది) అని వదలినవారలై; (నిర్విశేషసుఖే స్థితాః), నిర్విశేష = ప్రకృతి విశేషములు; సుఖే = ఆనందమందు; స్థితాః = ఉన్నవారలైరి.

దేహాభిమానమును సంపూర్ణముగ వదలి అహంకారమును వర్జించి శాశ్వతసుఖము నభిలషించుచు పరమానందస్వరూపుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మమునందు చిత్తము నిల్పియుండిరి.

భైరవి (ఘంటా) రాగము - అటతాళము

ప. పర మిహ పశ్యత పూరుషం స్వీకృతమాయికమానుషం
1. నిజపర భేదరహితదృశ మక్షర మీక్షణకృతభువనం విభుం
ఉపనిషదేకసమధిగత మద్వయ బోధసుఖైకరసం ప్రభుం
2. ఇదమిదమి త్యఖిలేషు సమనుగత సత్యచిదద్వయవిగ్రహం
శ్రుతిశిరసి ప్రవివిక్త మసక్త మభక్తజనై రతిదుర్గ్రహం
3. గగనమరున్ముఖభూతసముదిత సమస్తజగత్ప్రతిభాసకం
తదను తదన్న రసమయ మశేష విశేష మఖండసుఖాత్మకం
4. అధిగతమన్న మయాదితిషు యోగిభిరాంతరమాంతరమవ్యయం
హరి మఖిలైకరసం జననాది . వికారవిహీన మనామయం
5. విదురిహయంనిగమాంతవచోభి రపోహ్యాపరాంచమఖండింతం
అఘటితసంఘటనాఘటితాకృతి మద్భుతకుండలమండితం
6. స్వజనదయాధృత దేహమదేహతయా విహరం తమిహభూతలే
వనభువిరాససమయరసపండితం గోపవధూకృతమండలే
7. అతను మశేషతనుం జగతా మభయంభయకారణతారణం
నిజకలయా పరిబృంహితసర్వ జనాత్మతయా ఘనివారణం
8. సకృదవలోకనిరాకృతగోప వధూజనతాప మరిందమం
నవజలదాభతనుం తటిదాభం పటం నటవేషధరం సమం
9. హరిచరణస్మరణైకపరాయణ జనసుఖదం పరదైవతం
మునినారాయణతీర్థసువిరచితగీత మిదం నిగమాన్వితం

## 2వ కీర్తన: భైరవి రాగము - ఆదితాళము

ప. స్వీకృత మాయిక మానుషం

స్వీకృత = (ధరించబడిన) అంగీకరించబడిన; మాయిక = నిజేచ్ఛా సంకల్పరూపమైన; మానుషం = మనుష్యరూపముతోనుండు; పరంపూరుషం = శ్రీమన్నారాయణునిగా; ఇహ = (ఇక్కడ) ఈ కృష్ణుని; పశ్యత = (చూడండి) సేవించండి.

1 నిజ = తనవాడనిన్ని; పర = ఇతరవాడనిన్ని; భేద = భేదబుద్ధి; రహిత = లేనటువంటి; దృశ్యం = దృష్టిగలాడు (జ్ఞానముగలవాడున్నూ); అక్షరం = నాశరహితుడున్నూ; వీక్షణకృత భువనం = ; వీక్షణ = చూచినంతమాత్రముచేతనే; కృత = చేయబడిన; భువనం = లోకములు గలవాడున్నూ; విభుం = భర్తయున్నూ; ఉపనిషత్ = ఉపనిషత్తులచేతనే; ఏక = ముఖ్యముగా; సమధిగతం (సం+అధిగతం) = లెస్సగా బోధింపబడినట్టిన్నీ (అద్వయబోధసుఖైకరసం); అద్వయ = అసమానమైన; బోధ = జ్ఞానమున్నూ; సుఖ = ఆనందమున్నూ; ఏకరసం = ముఖ్యమైన రసముగలవాడున్నూ (అనగా సారాంశముగా స్థిరాంశముగాగలవారున్నూ; ప్రభుం = సమర్థుడున్నూ - అగు కృష్ణుని; పశ్యత = చూడండి (సేవించండి)

2. ఇదం ఇదం ఇతి = ఈ వస్తువు, ఈవస్తువు - అని ఇట్లు; అఖిలేషు = సమస్త వస్తువులయందు; సమనుగత = లెస్సగా కూడియుండునట్టి, అనగా (అను ప్రవేశము చేసియున్నట్టి); సత్య చిదద్వయ విగ్రహం; సత్య = నిర్వికారమైనట్టి; చిత్ = జ్ఞాన స్వరూపమైనట్టి; అద్వయ = అసమానమైనట్టి; విగ్రహం = దివ్యస్వరూపముగలవారున్నూ; శ్రుతి శిరశి = వేదశిరస్సులైన ఉపనిషత్తులయందు; ప్రవివిక్తం = లెస్సగా వివేచన చేయబడుచున్నట్టిన్నీ; అసక్తం = దేనియందును ఆసక్తిలేనివాడున్నూ (అనురాగములేనివాడున్నూ); అభక్తజనైః = భక్తిలేని జనులచేత; అతిదుర్గ్రహం = గ్రహించబడుటకు కేవలం దుస్సాధ్యుడైనవాడున్నూ; పశ్యత = అగు శ్రీకృష్ణస్వామివారిని చూడండి (సేవించండి)

3. గగన = ఆకాశమున్నూ; మరుత్ = వాయువున్నూ; ముఖ = మొదలగు; భూత = భూతములవల్ల; సముదిత = ఉత్పత్తి అయినట్టి; సమస్తజగత్ = సర్వప్రపంచమున్నూ; తదను = దానిని అనుప్రవేశముచేసి; ప్రతిభాసకం = ప్రకాశింపజేయునట్టిన్ని; తత్ = ఆ జగత్తులో చేరిన; అన్నరసమయం = అన్నమయకోశ స్వరూపుడుగా వున్నట్టి - అనగా అన్నమయకోశము శరీరముగా గలిగినట్టిన్నీ, అశేష విశేషం = సమస్త విశేషములు (తన శరీరముగా) గలిగినట్టిన్నీ; అఖండ = అవిచ్ఛిన్నమైన; సుఖాత్మకం = ఆనందస్వరూపముగలవాడున్నూ -అగు; శ్రీకృష్ణం పశ్యత = శ్రీకృష్ణస్వామివారిని చూడండి (సేవించండి)

4. అంతరం = హృదయాంతరాళమునందు; యోగిభిః = యోగులచేత; అన్నమయాదిషు = అన్నమయాది పంచకోశములయందు; అంతరం = అంతర్యామిగా; అధిగతం = పొందబడినవారు

(తెలుసుకొనబడినవారు); అవ్యయం = (నశించనివారు మార్పులేనివారున్నూ; హరిం = సమస్తమును ప్రళయకాలమందు హరించువాడున్నూ; అఖిలైకరసం = సమస్తమును (ఏకరసముగా) వైషమ్యరహితముగా గ్రహించువాడున్నూ; జననాదివికారవిహీనం = జనన మరణరూపమైన వికారములు లేనివాడున్నూ; అనామయం = ఏ రోగములు లేనివాడున్నూ -అగునట్టి, పరమపూరుషం పశ్యత = పరమాత్మను చూడండి (సేవించండి)

5. యం = ఏ పరబ్రహ్మము; నిగమాంతవచోభిః = వేదాంత వాక్యములచేత; పరాంచ = బాహ్యదృష్టిని ప్రకృతి సంబంధమును; అపోహ్యా = విడిచి; అఖండితం = అపరిచ్ఛిన్నమైన స్వరూపునిగా; ఇహ = ఈలోకమునందు; విదు = తెలిసికొనుచున్నారో - అట్టి; అఘటిత = సాధ్యపడని సంగతిని; సంఘటన = సాధ్యపడునటులచేయు; అఘటితాకృతిం = ఆశ్చర్యమైన ఆకారము (దుర్లభమైన ఆకారము) గలవాడున్నూ; అద్భుతకుండలం = విచిత్రమైన కుండలములతో; మండితం = అలంకరింపబడియుండువాడున్నూ-అగు; పరమపూరుషం పశ్యత = పరమపురుషుని సేవించండి.

6. అదేహతయా = స్వయముగా దేహములేనివాడగుటచేత దేహములేనివాడై యుండిన్ని; స్వజన = స్వభక్తులయందు వుండు; దయా = దయచేత; ధృతదేహా = ధరింపబడిన దేహముగలవాడు; ఇహ భూతలే = ఈ భూతలమునందు; విహరంతం = విహరించుచుండువాడున్నూ; వనభువి = బృందావన భూమియందు; గోపవధూకృతమండలే = గోపికలచేత ఏర్పరచబడిన వలయాకారమునందు; రాసమయరసపండితం = రాసక్రీడానంబంధమైన ఆనంద అనుభవమునందు నిండా సమర్థుడున్నూ -అగు; పరమపూరుషం పశ్యత = శ్రీకృష్ణ పరబ్రహ్మమును చూడండి (సేవించండి)

7. అతనుం = ప్రకృతి సంబంధమైన తనువులేనివాడున్నూ; అశేషతనుం = సమస్తమును తనకు శరీరప్రాయముగా నుండువాడున్నూ, లేక జగద్రక్షణార్థమై అనేక తనువులు స్వీకరించినవాడున్నూ; జగతాం అభయం = సమస్త జనులకు భయనివృత్తి చేయువాడున్నూ; భయకారణ తారణం = భయమునకు కారణముగానుండు మోహమునుంచి తరింపచేయువాడున్నూ; నిజకలయా = తనదైన ఆత్మవిద్యచేత; పరిబృంహిత = వృద్ధిపరచబడిన జ్ఞానముగల; సర్వజన = సమస్త పరిజనములయొక్క; ఆత్మతయా = హృదయమునందు ధ్యేయరూపముగా నుండుటచేత; అఘనివారణం = పాపములను పోగొట్టువాడును-అగు; పరమపురుషం పశ్యత = పరమపురుషుని చూడండి (సేవించండి)

8. సకృత్ = ఒక్కసారి; అవలోక = వీక్షణచేసినందువలన; నిరాకృత = పోగొట్టబడిన; గోపవధూజనతాపం = గోపస్త్రీల తాపంగలవాడున్నూ -అనగా వారలతాపమును పోగొట్టినవాడున్నూ; అరిం దమం = కామాదిశత్రువర్గమును శిక్షించువాడున్నూ; నవజలదాభతనుం = క్రొత్తమేఘముతో సమానమైన ప్రకాశముగలిగిన దివ్యమైన తనువు గలవాడున్నూ 7.

(విగ్రహముగలవాడున్నూ); తటదాభపటం = మేరువుతో సమానమైన ప్రకాశమగు వస్త్రమును ధరించినవాడున్నూ; నటవేషధరం = నాట్యముచేయు వేషమును ధరించినవాడున్నూ; సమం = సర్వసముడున్నూ -అగు; పరమపురుషం పశ్యత = పరమపురుషుని చూడండి (సేవించండి)

9. హరిచరణ = శ్రీమన్నారాయణుని చరణములను, స్మరణ = స్మరించుటయే; ఏక = ముఖ్యమైన; పరాయణ = శ్రేష్ఠమైన గతి అని నమ్మినట్టి, జనసుఖదం = దాసజనులకు సుఖము నిచ్చునట్టిన్నీ; పరదైవతం = పరాత్పరుడుగానుండు దైవమును తెల్పునట్టిదిన్ని; ముని నారాయణతీర్థ = వేదార్థమును మనన చేయునట్టి నారాయణ తీర్థులవారిచేత; సువిరచితం = లెస్సగా రచియింపబడినట్టిదిన్ని -అగు; ఇదం గీతం = ఈ కీర్తన (ఈగీతం); నిగమాన్వితం = వేదానుగుణ్యముగా నున్నది.

ప. (ఇవి (గోపికలవాక్యములు) మాయామనుష్యుఁడైన యీ పరమపురుషునిఁ జూడుఁడు.

1. ఈకృష్ణుఁడు నాశరహితుఁడు. అద్వితీయుఁడు (తాననియు నితరుఁడనియు భేదములేనివాఁడు. దీనికి నద్వితీయుఁడగుటయే కారణము) సంకల్ప మాత్రముచేతనే సకలప్రపంచమును సృష్టించు సర్వశక్తుడు. సత్యజ్ఞానానందస్వరూపముతో నీ సర్వప్రపంచమును వ్యాపించియున్నాఁడని యుపనిషత్తులచే బోధింపఁబడిన పరబ్రహ్మము.

2. సకలపదార్థములయందును "ఇది, యది" యని చెప్పంబడుచుండు వాఁడును, వేదాంతములయందుఁ బ్రత్యేకముగా నిరూపింపఁబడువాఁడును, సత్యజ్ఞానా ద్వితీయస్వరూపుఁడును అగు నీభగవంతుఁడు భక్తివలనంగాని దొరకఁడు.

3. ఆకాశాది పంచభూతములవలనఁ బుట్టినసకలప్రపంచమును బ్రకాశింపఁజేయుచు పరిపూర్ణానందస్వరూపుఁడైయున్నను ఆప్రపంచము నందున్న స్థూలశరీరములు మొదలగు సకల భేదములను తానేయైయున్నాడు.

4. పుట్టుక మొదలగు వికారములేని నిర్మలుఁడనియు, ఆనందస్వరూపుడనియు, సర్వాంతరుఁడనియు (అన్నిటికి లోపలనుండువాఁడు) ధ్యానించుచు యోగులగువా రీ శ్రీకృష్ణుని అన్నమయాది పంచకోశములం గాంచనేర్తురు.

5. బహిర్ముఖత్వమునువదలి వేదాంత వాక్యముల సహాయముచే మహాత్ములే సర్వవ్యాపకునిఁ దెలిసికొనుచున్నారో, ఆయన యీ శ్రీకృష్ణుఁడే; సంబంధించుట కశక్యములగు విషయముల సంబంధింపఁజేయుచు బహువిధములుగ భూషణములచే నలంకరించుకొని మనయెదుట నున్నాఁడు.

6. స్వయముగ శరీరము లేనివాఁడైనను, భక్తుల రక్షించుటకై యొక సుందర శరీరమునుదాల్చి భూమిపై విహరించుచు నిప్పు డీయరణ్యమున మనము (గోపికలు) ఏర్పరచిన మండలమున నిలచి పరమానందకరముగ రాసక్రీడ సల్పుచున్నాడు.

ఈభగవంతుడు స్వయముగ శరీరములేనివాఁడయ్యును, తనయంశముచే సకలజనులఁ గల్పించినవాఁడు గావున ననంతశరీరములు గలవాఁ డనఁబడును. పాపములను దొలఁగించి భయములఁబాపి యీ ప్రపంచమునకు నిమ్మహాత్ముఁడే యభయము నొసంగుచున్నాడు.

8. శత్రువుల సంహరించువాఁడును, సర్వసముఁడు నగు నిమ్మహాత్ముడు నీలమేఘ శ్యామలమగు తనశరీరమునకు వింతచెల్వు ఘటింప పీతాంబరమును ధరించి నృత్యమున కనుకూలమగువేషముతో నున్నాఁడు. ఈభగవంతుని దృష్టి మనపై (గోపికలపై) ప్రసరింపఁగనే సర్వసంతాపములును తొలంగిపోయినవి.

9. ఈపరదైవతము తనపాదముల నాశ్రయించినవారికి సకలసుఖముల నొసంగును. ఈగీతము ఉపనిషదర్థసహితముగా (తైత్తిరీయోపనిషత్తుయొక్క అర్థము నిందుఁగలదు) నారాయణతీర్థునిచే రచియింపఁబడియె.

శ్లో. జగదుదయలయాదే స్సాదరం సాధకై ర్య
ఛ్ఛ్రుతిగురుదృఢభక్త్యా లబ్ధ మద్వైతతత్త్వం,
శ్రుతిశిరసి వివిక్తం పంచకోశా న్తరస్థం
నరభువి విహర న్తం తం తు పశ్యంతి గోప్యః

శ్లో. 11 గోప్యః = గోపికలు; వనభువి = బృందావనమునందు; విహరంతం = విహరించుచుండునట్టి; తం = ఆ కృష్ణభగవానులను; జగదుదయలయాద్యైః -; జగత్ = జగత్తుయొక్క; ఉదయ = సృష్టి; లయ = ప్రళయము; ఆద్యైః = మొదలైనవాటికి; సాధకం = సాధనభూతుడైనవాడున్నూ; సాధకైః = భగవద్విషయుమును ప్రయుత్నమును చేయువారిచేత; శృతిగురు = ఉపనిషత్తులయందు (ఆచార్యులయందు); దృఢభక్త్యా = ధృఢమైన భక్తిద్వారా; యత్ అద్వయిత తత్వం = ఏ అసమానమైన పరతత్వమును; లబ్ధిం = పొందబడుచున్నదో - మరియు; శృతిశిరశి = వేదాగ్రములయందు; వివిక్తం = వివేచన చేయబడుచుండునట్టి; పంచకోశాంతర స్థం = అన్నమయాది పంచకోశముల మధ్యయందు అంతర్యామిగా నుండువానిగా; పశ్యంతి = తెలిసికొనుచున్నారు.

వేదములయందును, గురువులయందును మిగులభక్తిగలిగి ముముక్షువులు, వారల యుపదేశవాక్యముల ననుసరించి "ఈప్రపంచ మెటనుండి పుట్టును? స్థితిసమయమున దీనికాధారము ఏది? లయమైన పిదప నిది యెందుబోవును" అను మొదలగు విషయముల మిగులశ్రద్ధతోఁ జింతింపఁగాఁ జింతింపఁగా నెంతకాలమునకో కాని యీపరబ్రహ్మతత్త్వము గోచరముకాదు. పంచకోశముల మధ్యముననుండి మిగుల సూక్ష్మమై వేదాంతవాక్యములకుఁ దక్క నితర ప్రమాణములకు గోచరము కానిదియై యుండుటచే నీపరబ్రహ్మస్వరూపమును ధ్యానించుటగూడ మిగులఁ గష్టసాధ్యము. ప్రకృత మీగోపికలు తమభాగ్యమువలన సప్పరమాత్మునిఁ గన్నులారఁ జూచుచున్నారు. ఆయనతోఁ గూడి వనమున విహరించుచున్నారు.

శ్లో. ఏవం కృష్ణాత్మతత్త్వజ్ఞాః కృష్ణబ్రహ్మాత్మనా స్థితాః,
సర్వోపనిషదాం సారం గాయంత్యః కృష్ణ మాసతే. 12

శ్లో. 12 ఏవం = ఈ ప్రకారము; కృష్ణాత్మ తత్త్వజ్ఞాః = శ్రీకృష్ణుని పరమార్థ స్వరూపము నెరిగినవారలై; కృష్ణబ్రహ్మాత్మనా = శ్రీకృష్ణపరబ్రహ్మరూపముగలవారుగానై; స్థితాః = ఉన్నవారలై; కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; సర్వోపనిషదాం = సమస్త ఉపనిషత్తులయొక్క; సారం = సారాంశముగాను; గాయంత్యః = గానము చేయుచున్నవారలై; అసతే = ఉండిరి.

ఇట్లు గోపికలు కృష్ణుని పరమార్థస్వరూపము నెఱింగి, తమయథార్థ స్వరూపమునుగూడఁ తెలిసికొని యాహరికిని, తమకును భేదములేదని నిశ్చయించి తత్పరులై యుపనిషదర్థసారమును గానము చేయుచుండిరి.

శ్లో. హృదయనిహితం కాంతం కాచిత్కళిందసుతాతటే
ప్రియతమ మథాలింగ త్యద్ధా నిరంకుశతృప్తితః,
నిజపరభిదాతీతం ధైర్యా చ్ఛ్రుతే శ్శిరసాం బలాత్
ముహు రపి భృశం గాయ త్యేనం చిరం బహు మోదతే.

శ్లో.13 కాచిత్ = ఒకానొకగోపిక; హృదయనియతం = చిరకాలమునుండిన్ని తనహృదయమునందు ధ్యానింపబడుచున్నట్టి; కాంతం = మనోహరుడైన; ప్రియతమం = కేవలం ప్రేమాస్పదుడైనట్టి స్వామివారిని; కళిందసుతాతటే = యమునా తీరమునందు; నిరంకుశతృప్తితః = అడ్డులేని తృప్తిగలదియై; యద్ధ = సాక్షాత్తుగా; అలింగత = అలింగనము చేసికొన్నదియై; అథ = అనంతరము; ధైర్యాత్ = ధీరత్వముచేతనున్నూ; శ్రుతేశ్శిరసాం = ఉపనిషత్తులయొక్క; బలాత్ = ప్రామాణ్యము చేతనున్నూ; నిజపరభేదాతీతం = తన వస్తువు పరవస్తువు అను భేదమునకు అతీతమైనట్టి; ఏనం = ఈకృష్ణస్వామివారి యొక్క స్వరూపమును; ముహురపి = మాటిమాటికి; భృశం = మిక్కిలి; చిరం = చాలకాలము; గాయతీ = గానము చేయుచున్నదియై; బహుమోదతే = విశేషముగా ఆనందించుచున్నది.

అంత నొకానొకగోపిక తాను చిరకాలమునుండియు ధ్యానించుచుండిన ప్రియుఁడు తనకిప్పటికి యమునాతీరమునఁ దటస్థమయ్యెనని మిగుల సంతసముతో, గాఢాలింగనముఁ జేసికొని మిగుల తృప్తినొందెను. అశ్రీకృష్ణుఁడు తాననియు, పరుఁడనియు భేదములేనివాఁ డగుటయు, అట్లే వేదములకూడ వేనోళ్ల వచించుచుండుటయు, నీగోపికకుఁ గల్గిన యానందమునకును, ధైర్యమునకును ముఖ్య కారణములు. ఇట్లాలింగనము జేసికొని యమ్మహాత్ముని కల్యాణగుణముల నిట్లని కొనియాడెను.

## 3వ కీర్తన: (కాంభోజి (పున్నాగ) - ఆదితాళం

ప. కలయే దేవ మిహ సుఖకందం కలయే దేవం

అ. నిగమనిగూఢ మఖిలదృశ మేకరసం వ్రజానందముకుందం

1. యదశనీనయాదివి కారవిహీన మశేష మజరదురంతం
ఇహమున యోమృగయంతిశమాదిభిరాంతరమేన మనంతం

2. ఇహ పరభోగ మమరపదవీ మపి యదధిగ మేన భజంతే
విష మివ ధీరధియో మరమృగ్య పరైకసుఖే విహరంతే

3. నిఖిలతపశ్రుతయో నుసతంతి య మవధితయా పరదేవం
అఖిలషితం మునిభి స్సుతపోభి రశేష భవాంబుధినావం

4. సకలసుధర్మవిధర్మకృతాకృత భూతభవిష్యదతీతం
నిజపరిబృంహీతజగదనుకూల తయా సతతం సువిభాతం

5. ప్రణవతురీయసులక్షిత మక్షర మాత్మతయా య దనన్యం
యదయమనుస్మరతిస్వయమవ్యయ - మాశు సవిందతి ధన్యం

6. యదధిగమాదిహజన్మ మృతీ హననాదిభయాని తరంతి
పునరిహమోహవిజృంభిత మేత దతో మునయో న భజంతి

7. విరతిశమాదివిహీనదురాప మబోధసుబోధసమానం
యదవగతి ప్రతిషిద్ధ మబోధ విజృంభిత మాహురిహైనం

8. విభు మశరీర మశేషశరీర గుహాసు నివిష్టచిదంశం
వ్రజయువతీజనవల్లభ మాత్మతయా పరిశిష్టమధీశం

9. ఫణిత మనంతపరాయణశివ నారాయణతీర్థే నేదం
నిగమశిరోరసభావనయా గతమత్సరహృదయవినోదం

నిగమనిగూఢం = వేదములయందు అత్యంతగూఢముగా తెలియబడుచుండునట్టి వారున్నూ; అఖిలదృశ్యం = సకల సాక్షియున్నూ; ఏకరసం = ఆనందరసస్వరూపుడైనట్టిన్నీ; వ్రజానందు ముకుందం = గోకులమునకు ఆనందమును కలుగజేయునట్టి, విష్ణుస్వరూపినిగానున్నూ; సుఖకందం = సుఖమునకు మూలస్థానభూతుడైనట్టిన్నీ-అట్టి; దేవం = స్వామివారిని; ఇహ కలయే = ఇక్కడ సేవించుచున్నాను.

1. యత్ = ఏవస్తువఅయితే; అశన = ఆహారం (ఆకలి); ఆది = మొదలైనటువంటి వికారములు; వికారవిహీనం = వికారములు లేనటువంటివాడున్నూ; అశేషం = ఇతరులకు దాసభూతుడు కానట్టిన్నీ; అజరం = ముసలితనములేనట్టిన్నీ; దురంతం = అంతములేనివాడున్నూ, ఇహ = ఈ లోకమునందు; మునయః = వేదార్థములను మనన చేయువారలున్నూ, శమాదిభిః = శమము మొదలగువాటిచేత; అంతరం = అంతర్యామిగానుండు, మృగయంతి = వెదకుచుండెదరో (అట్టి); దేవం = సుఖకందం-(కలయె)

2. యత్ అధిగమేన = ఎవనిని తెలిసికొనుటద్వారా; ధీరధియా = వైరాగ్యసంపన్నులు; (అధ్యాహారం÷ = యద్వా = లేనియెడల; యదధిగమేన = ఎవనినితెలిసికొనుటచేత; ధీరిధియా = వైరాగ్యసంపన్నులై; ఇహపరభోగ = ఈలోక దేవేంద్రలోక భోగములు దేవేంద్రపదవి); అపి = అయినను (గూడ); విష = విషతుల్యమనియెంచినవారలై; నభజంతే = కోరరో (ఇష్టపడరో) అనగా విరక్తినొందెదరో (అట్లు విరక్తిచెంది); (అమర, మృగ్య, పరైక, సుఖే); అమర = దేవతలచేతగూడ; మృగ్య = వెదుకబడుచుండు; వరైక నుఖె = ముఖ్యమైన పరమార్థభజనమునందు; విహరంతే = విహరించెదరో అట్టి; దేవం కలయే = పరమాత్మను సేవించెదను.

3. నిఖిల తపశ్శృతయః = సమస్తమైన వేదములన్నూ; యంపరదైవం = ఏ పరదేవతను, అవధితయా = ముఖ్యపర్యవసానముగా; అనుపతంతి = తెలియజేయుచున్నవో (నిరూపించుచున్నవో); మునిభిః = వేదార్థమును మన్ధ చేయువారలచేతనున్నూ; నుతపోబిః = జ్ఞానతపస్సు చేయువారిచేతనున్నూ; అభిలషితం = కోరబడుచున్నట్టి; అశేష భవాంబుధినావం = సమస్త సంసార సముద్రమునకు పడవ అయినట్టిన్నీ-అట్టి; దేవం సుఖకందం కలయే = సుఖమునకు మూలమైనట్టి దేవుని సేవించుచున్నాము.

4. సకల = సమస్తమైన; సుధర్మ = శ్రేష్ఠమైన ధర్మములకున్నూ; విధర్మ = అధర్మములకున్నూ; కృత = కార్యములకున్నూ; అకృత = కారణములకున్నూ; భూత = గడచినదానికిన్ని; భవిష్యత్ = రాబోవుదానికిన్ని; ఆతతం = విలక్షణమైనవాడున్నూ; నిజ = తనచేత; పరిబృంహిత = విస్తరింపజేయబడిన; జగత్ = జగమునందు; అనుకూలతయా = అనుసరించియుండుటచేత (అనుప్రవేశముచేసి అనుసరించి యుండుటచేత); సతతం = ఎల్లప్పుడున్నూ; సువిభాతం = లెస్సగా ప్రకాశించుచుండునట్టివాడున్నూ ప్రకాశింపచేయుచున్నట్టివాడున్నూ-అగు; దేవం సుఖకందం కలయత = సుఖమునకు మూలమైన దేవుని సేవించుమా

5. ప్రణవ తురీయ సులక్షితం; ప్రణవ = ఓంకారముచేతనున్నూ; తురీయ = జాగ్రస్వప్న సుషుప్త్యవస్థలకు అతీతమైనది (తురీయావస్థ) తురీయావస్థచేతనున్నూ; సులక్షితం = చక్కగా గుర్తించబడునట్టిదిన్ని; అక్షరం = నాశములేనట్టిన్నీ; ఆత్మతయా = సమస్తమునకు అంతరాత్మగా నుండుటచేత; యత్ = ఏవరవస్తువు; అనన్యం = చిదచిత్తులతో ఎడబాటులేక అనుసరించియుండు నదియున్నూ; యత్ = ఏవస్తువును; అయం = ఈ జీవాత్మ; అనుస్మరతి

= అనుసరించిస్మరించినయెడల; స్వయం = స్వయముగా; ఆశు = త్వరగా; సః = అట్టిజీవుడు, ధన్యం = కృతార్థతను చెందించునట్టి; అవ్యయం = నాశరహితమైన (పరబ్రహ్మమును); విందతి = పొందుచూన్నడో-అట్టి; దేవం సుఖకందం కలయె = పరమాత్మను సేవించుచున్నాము.

6. ఇహ = ఈలోకమునందు; యదధిగమాత్ = ఎవరిని తెలుసుకున్నయెడల; జనన మృతిహననాది = జననమరణ వధ మొదలైన; భయాని = భయములను; తరంతి = దాటెదరో, పునః=తిరిగి; ఇహ = ఈలోకమునందు; మునయః = వేదార్థమumananaం చేయువారో; మోహ = అజ్ఞాన ఆవరణముచేత; విజృంభితం = విస్తరింపచేయబడినట్టి, ఏతత్ = ఈ దృశ్యమైన దేహేంద్రియాదులను; అతః = జననమరణాదులకు ఆస్పదమగుటవలన; నభజంతి = సేవించరో (పొందరో)-అట్టి; దేవం సుఖకందం కలయె = భగవంతుడై ఆనందము యిచ్చువానిని సేవించుచున్నాను.

7. అబోధ = అజ్ఞానమునకున్నూ; సుబోధ = సుజ్ఞానులచేత తెలియబడినప్పుడున్నూ; సమానం = ఏకవిధమైన స్వరూపము స్వభావము కలిగినట్టివాడున్నూ; విరతి = వైరాగ్యమున్నూ; శమ = అంతరేంద్రియ నిగ్రహమున్నూ; ఆది = మొదలగు గుణములు; విహీన = లేనివారికి; దురాప = పొందబడినవాడున్నూ అనగా లభించనివాడున్నూ; ఏనం = అట్టి అజ్ఞానిని; ఇహ = ఇక్కడ; యత్ అవగతి = ఎవరిని తెలిసికొనుటకు; ప్రతినిషిద్ధం = నిషేధించడినవానిగానున్నూ; అబోధవిజృంభితం = అజ్ఞానము విస్తరించినవానిగానున్నూ; ఆహుః = పెద్దలుచెప్పుచున్నారో-అట్టి; దేవం సుఖకందం కలయే = సేవించుచున్నాను.

8. విభుం = సర్వవ్యాపకుడున్నూ; అశరీరం = శరీరముకానివాడున్నూ ప్రాకృతశరీరము లేనివాడున్నూ; అశేష శరీరగుహాసు = సమస్త శరీరములనునట్టి గుహయందు; నివిష్ఠ = ఉంచబడిన; చిదంశం = జీవాత్మగలవాడు; వ్రజయువతీజనవల్లభం = గోపికాస్త్రీలకు ప్రియుడున్నూ; అత్మతయా పరిశిష్టం = ఆత్మగానుండుటవలన -నేతినేతియను వేదాంతవాక్యమున్నూ, నఇతినఇతి అనువాక్యములచేత; పరిశిష్టం = ఇతరతత్వములనన్నిటిని తీసివేయగా మిగిలినవాడున్నూ; అధిశం = సమస్తభూతములందు అధిష్టించి నియమించువాడున్నూ; దేవం సుఖకందం కలయె = సేవించుచున్నాను.

9. అనంత పరాయణ = అనంతుడే పరమగతిగా నమ్మినట్టి; శివనారాయణతీర్థేన = శివనారాయణ తీర్థులచేత; నిగమశిరోరసభావనయా = ఉపనిషద్వాక్యసారభూతముగా; గతమత్సర హృదయవినోదం = మాత్సర్యములేని హృదయముగలవారలకు సంతోషముగా నుండునటుల; ఇదం భణితం = ఈగీతం చెప్పబడినది.

ప.అ. ఉపనిషత్తులయం దతిరహస్యముగనున్నవాఁడును, (పరబ్రహ్మ తత్త్వమందఱకును స్పష్టముకాదు గావున నిట్లు చెప్పఁబడినది.) ఆనందస్వరూపుఁడును, స్వప్రకాశుఁడును అగునారాయణుండయ్యును, మనభాగ్యమువలన సామాన్య మనుష్యరూపముతో నీగోకులమున జన్మించి కృష్ణుఁడనుపేరుతోఁ బరఁగుచున్న నీపరమేశ్వరునిఁ జూచుచున్నాను. (లేక ధ్యానింపు చున్నాను)

1. అకలి దప్పి మొదలగు వికారములు లేక స్వయముగా నాశనముగాక, పరులచే నశింపజేయు శక్యముగాక, సర్వవ్యాపకముగాక, సర్వవ్యాపకమై యుండు పరబ్రహ్మమే ఈ కృష్ణుడు ధ్యానయోగ నిరతులైన మునులు శమదమాదిసాదనముల నధికముగా నార్జించి యనవరతపరిశ్రమం జేయుచూ నిప్పర మేశ్వరునే వెతుకుచుందురు. ( ప్రత్యక్షమును జేసికొన దలంచుచుండు రనుట.) ఈ యనంతుడు మిగుల సూక్ష్మరూపుడగుటచే వారల శ్రమ బహుకాలమునకుగాని ఫలింపదు ( ఇచ్చట పరబ్రహ్మము అంతరుడు, అన్నింటికిని లోపలనుండువాడు అని చెప్పబడియున్ననూ "మృగయంతి" అని చెప్పబడియుండుచే ం సూక్ష్మముగ్రహించుట కశక్యమైనది" అని యర్థము వ్రాయబడియన్నది)

2. జ్ఞానులగువారు పరబ్రహ్మమును దెలిసికొందురేని, యిహపరలోక సౌఖ్యములను విషముబోలె బరిత్యజింతురు. బ్రహ్మానందసుఖము నొక్కదానినే కోరుచుందురు, అదిదేవతలకు గూడా దొ రకునది కాదుకదా!

3. సంసార సముద్రమునకు నావయై స్వప్రకాశుండై యున్న ఈ శ్రీ కృష్ణుని ( బ్రహ్మమును) మహతపస్సులగు మునులు పరమానందమునుగూర్చి ప్రార్థించుందురు. సకలవేదములలో జ్ఞానమునకును, శ్రుతి వాక్యములకును ఈయనయే తుది.

4. ధర్మముకంటేను, అధర్మముకంటేను కార్యకారణములకంటేను భూతకాలమునందున్న పదార్థముకంటేను భవిష్యత్కాలమునందు గలుగ బోవువానికంటేను అ తిరిక్తుడై తనచే విస్తరింపబడిన ప్రపంచమునందు వ్యాపించి దానిం బ్రకాశింప చేయుచున్నాడు.

5. శ్రీ కృష్ణ డోంకారముచేతను తురీయా వస్థ చేతను (సుషుప్త్యవస్థకంటె నావల కేవల బ్రహ్మానందాత్మకమై యుండు నవస్త తురియావస్థయనబడును.) తెలియ జేయబడుచున్నాడు జీవాభిన్ను నాజగత్పూజ్యుని నెవ్వడు ద్యానించునో వాఁడాయనను జెందును ( జీవుడ పరబ్రహ్మమును

జెందుట యనగా వాని యజ్ఞానమును పొగొట్టుకొని స్వాభావికమగు నైక్యమును దెలిసికోనుటయే ఈ యైక్యము అజ్ఞాన దశయందు లేనిదిగా యుండెను. కావునే జ్ఞానదశయందదు గల్గినది' అని చెప్పబడుచున్నది.)

6. ఆ పరమేశ్వరుని దెలసికొనినవారు జన్మమరణముల నొందరు. ("వాడు నన్ను హింసించును". అను భయమును జెందరు. "ద్వితీయాద్వై భయం = రెండవ వస్తువుండిననేకదా భయముకలుగును" అను శ్రుతిననుసరించి చూచిన నీ బ్రహ్మజ్ఞానులకు భయము కల్గదు. వారు పరబ్రహ్మరూపులే కదాయని భావము.) ధ్యానప్రభావముచే నవిద్యానిర్మితమగు నీ సంపారమును మరలా నాశ్రయింపరు.

7. ఈ పరమాత్ముడు తెలిసినను,తెలియకున్నను ఒకటేవిధముగా నున్నాఁడు.అయినను వైరాగ్యము, ఇంద్రియనిగ్రహము మొదలగునవి గల యధికారికి,నవ్విభునిస్వరూపము గాననగును.అట్లుగాక నజ్ఞానులగువారు ఈయన నెంఱుంగుటకే గాక,యీఘనుని స్వరూపమును గూర్చి యుపదేశించు టకు గూడ నర్హులైయుండరు. (తగిన యధికారము లేనప్పుడు చేయఁబడిన యుపదేశము విషతుల్యమై నానావిధములగు ననర్థములగల్గించుననుట సర్వా నుభవసిద్ధము).

8. సకలేశ్వరుఁడును, సర్వవ్యాపియు,తనకు శరీరము లేకున్నను సర్వశరీరగుహలయందును జీవస్వరూపముతో నిలిచే ఎనేతి నేతి = ఇది యాత్మ కాదు, ఇది యాత్మకాదు ఇతి = ఇది' న= కాదు' ' అను వాక్యమువలన సర్వపదార్థములను నిషేధింపఁగా జ్ఞానస్వరూపముతో మిగులువాఁడును అగు నవ్విభుఁడు మనకుఁ బ్రియుఁడై యున్నవాఁడు.

9. మాత్సర్యరహితులగు మహాత్ముల కానందము గలుగునట్లుగా హరిభక్తాగ్రేసరుఁడగు నారాయణతీర్థుఁడు సకలవేందాతసారభూత మగునీగీత మును రచించెను.

శ్లో. నిర్విశేషచిదానంద మావిర్భూతం నిజేచ్ఛయా,
కృష్ణభావేన బుద్ధ్యాదితత్త్వభూషం జగుశ్చ తాః

శ్లో14. నిర్విశేష చిదానందం = ప్రకృతివిశేషములేని జ్ఞానానంద స్వరూపముగలవాడున్నూ; నిజేచ్ఛయా = స్వేచ్ఛానుసారముగా; కృష్ణభావేన = శ్రీకృష్ణస్వారూపముగా; ఆవిర్భూతం = సాక్షాత్కరించెను; బుద్ధ్యాది తత్వభూతం = మనస్సు, బుద్ధి, ఇంద్రియములు మొదలైన తత్వములరూపమును పొందినట్టి అపరతత్వమును; తాః = ఆగోపికలు; జగుఃచ = గానమున్నూ చేసిరి.

మఱియు జ్ఞానానందస్వరూపుడై, యవయవములు లేనివాడైయున్నను అపరబ్రహ్మము తన మాయచే, మనసు, బుద్ధి ఇంద్రియములు మొదలగు తత్త్వములు (అవయవములు) ధరించే శ్రీకృష్ణరూపమున సగుణుండైయవతరించి యున్నాడు. కావున నాగోపికలా శ్రీకృష్ణుని సగుణభావమునుగూర్చి యిట్లని గానము సేయుచున్నారు.

శ్లో. బుద్ధ్యాదితత్త్వపరిచిహ్నితగోపవేషం
సిద్ధానుభావిత మశేషజగన్నిదానం,
నాసాగ్రలగ్ననవమౌ క్తికచంద్రబింబం
బింబాధరం భవభయప్రశమం నమామి. 15

శ్లో15. బుద్ధి ఆదితత్వ = బుద్ధి మొదలగు తత్వములచేత; పరిచిహ్నిత = చిహ్నముగా చేయబడిన; గోపవేషం = గోపాలరూపం కలవాడున్నూ, అనగా (బుద్ధి, మనస్సు మొదలగు తత్వములను సూచింపజేయు గోపాలరూపమును ధరించినవాడున్నూ); సిద్ధానుభావితం = జ్ఞానసిద్ధిగలవారిచేత అనుభవించబడువాడున్నూ; అశేషజగన్నిదానం = సమస్త జగములకు ఆదికారణమైనవాడున్నూ; నాసాగ్రలగ్న నవమౌక్తిక చంద్రబింబం; నాసాగ్ర = ముక్కుకొనయందు; లగ్న = ధరించబడిన; నవమౌక్తిక = క్రొత్తముత్యము అనే; చంద్రబింబం = చంద్రునితో సమానమగు ఆకారముగలవాడున్నూ; బింబాధరం = దొండపండువంటి పెదవిగలవాడున్నూ; భవభయం = సంసారభయమును నాశనము చేయునట్టిన్నీ; ప్రశమం = శమింపచేయునట్టివాడున్నూ-అగుమీకు; నమామి = నమస్కారముచేయుచున్నాను.

సకలలోకములకు గారణభూతుండవగు నోరారాయణా! నీకుగోపాలరూపము స్వాభావికముకాదు. ఒక పురుషుడు కొన్ని కొన్ని చిహ్నములు ధరించివేఱోకయాకారమును దాల్చునట్లు నిర్విశేషుడవగు నీవును మా యచే బుద్ధి మొదలగుతత్త్వముల స్వీకరించి ఈ వేషమును దాల్చితివి. సంసార భయమును నశింపజేయునట్టి యోమహాత్మా! దొండపండువలె నెఱ్ఱనగు పెదవితోడను, నాశికయందు వ్రేలుచున్న చంద్రబింబమువంటి క్రొత్తముత్యములు తోడను, మఱియు సర్వాభరణములతోడను బ్రకాశించుచు సౌందర్యమునకు నాకరమై నీయాకార మొప్పుచున్నది. నీకు నమస్కారము.

## 4వ కీర్తన: కేదారగౌ (నీలాంబరి) ళరాగము - అటతాళము

ప. మాధవ మామవ దేవ యాదవకృష్ణ యదుకులకృష్ణ

అ. సాధుజనాధార సర్వభావ మాధవ మా మవ దేవ

1. అంబుజలోచన కంబుశుభగ్రీవ బింబాధర చంద్రబింబానన
చాంపేయనాసాగ్రలగ్నసుమౌ క్తి కశారదచంద్ర జనితమదన

2. కపటమానుష దేహకల్పితజగదణ్డ కోటిమోహితభారతీరమణ
అపగతమోహతదుద్భవనిజజనకరుణయా ధృతదేహసులక్షణ

3. తరళకుండలరవిమండలవికసిత నిజజనమానసపం కేరుహ
కరుణాహాసనుధానిధికిరణ శమితభవతాపసజనమోహ

4. మురళీగానరసామృతపూరిత వ్రజయువతీమానసార్ణవభో
సరసగుణార్ణవతీర్ణభవార్ణవ సతతగీతకీర్తిమండల భో

5. శంఖచక్రపద్మశార్ జ్గగదాఖడ్గ వైజయంతీకౌస్తుభాదిభూష
స్వీకృతబుద్ధ్యాదితత్త్వసమన్వితదివ్యమంగళగోపబాలకవేష

6. ఆగమగిరిశిఖరోదితసత్యచి దద్వయలక్షణసుఖభానో
భోగికులోత్తమభోగశయన దుగ్ధసాగరజాలక్షణాఢ్యతనో

7. ఇందిరయా సహ సుందరకృష్ణపురందరాదివంద్యపదకమల
నందనందనయోగివర్యధురంధరనారాయణతీర్థమతివిహార

ప॥ మాధవ = హేస్వామీ!; దేవ = దేవుడా (దివి=క్రీడాయాం) క్రీడించేవాడ, ప్రకాశించేవాడ; యాదవకృష్ణ = యదుకులమునందు అతరించినవాడ; యదుకుల కృష్ణ = యదువంశమునకు శుభమును యిచ్చువాడ; మాం అవ = నన్ను రక్షింపుమా; అ.ప॥ సాధుజనాధార = సాధుజనులకు ఆధారుడా; సర్వభావ = అందరికి సత్తాకలుగజేయువాడా; మాధవమాం అవదేవ :-

1. అంబుజలోచన = కమలములతో సమానమైన నేత్రములుకలవాడా; కంబు శుభగ్రీవ = శంఖమువంటి మంగళకరమైన కంఠముగలవాడా; బింబ అధర = దొండపండువంటి పెదవిగలవాడా; చంద్రబింబ ఆననా! = చంద్రబింబముతో సమానమైన ముఖముగలవాడా; చాంపేయ = సంపెంగపుష్పమువంటి; నాసాగ్ర = ముక్కు కొనలయందు; లగ్న = ధరించబడిన (ఉన్నటువంటి); సు = లెస్స అయినటువంటి; మౌక్తిక = ముత్యము అనునట్టి; శారదచంద్ర = శరత్కాలచంద్రుని ధరించినవాడ; జనితమదన! = మన్మథునికనినవాడా

## మాధవ మాం అవదేవ

2. కపటమానుషదేహ = మాయామానుష దేహముకలవాడ; కల్పిత = కల్పింపబడిన (సృష్టిచేయబడిన); జగదండకోటి = బ్రహ్మాండకోట్లుగలవాడ; మోహిత = భ్రమింపజేయబడిన; భారతీరమణ = బ్రహ్మదేవునికలవాడ; అపగతమోహ = తొలగిపోయిన అజ్ఞానముకలవాడ (అజ్ఞానములేనివాడ); తదుద్భవ తత్వ = జ్ఞాన తత్వమేగలవాడ; నిజజన = నిజభక్తులయందు; కరుణా = కరుణచేత; ధృత = ధరింపబడిన; దేహ = దేహముగలవాడ; శుభలక్షణ = మంగళకరమైన లక్షణములుకలవాడా

3. తరళకుండల = చలించుచున్న కర్ణాభరణములుగలవాడా; రవిమండల = సూర్యమండలముచేత; వికశిత = (వికశించుచున్న), ప్రకాశించుచున్న; నిజజన మానస = భక్తులమనస్సులనెడు; పంకేరుహ = కమలములుగలవాడ-అనగా భక్తులమనస్సులను వికశింపచేయునట్టి సూర్యమండలము అని చెప్పదగిన కదలుచున్న కుండలములుగలవాడా; కరుణా = కృపయున్ను; హాస = చిరునవ్వు అనునట్టి; సుధానిధి = చంద్రునియొక్క; కిరణ = కిరణములచేత; శమిత = చల్లార్చబడిన; భవతాప = సంసారతాపమున్నూ; సజ్జనమోహ=సత్పురుషుల అజ్ఞానమును పోగొట్టువాడున్నూ-అనగా మీ కరుణ చిరునవ్వు అనునట్టి చంద్రకిరణముచేత భక్తుల యొక్క అజ్ఞానమునున్నూ, సంసారతాపమును శమింపజేయువాడవనుట.

## మాధవ మాం అవదేవ

4. మురళీగానరస = వేణుగానరసమనునట్టి, అమృత = అమృతముచేత; పూరిత = నింపబడిన; వ్రజయువతీమానస = గోపికలయొక్క మనస్సులనెడు; అర్ణవ = సముద్రముకలవాడ; భో = హేస్వామీ!; సరసగుణ అర్ణవ = సద్గుణములకు సముద్రమువంటివాడా; తీర్ణభవార్ణవ = దాటబడిన సంసారసముద్రముగలవాడ; సతతగీత కీర్తిమండలభో = సంసార సముద్రమునుదాటించే; సతత = ఎల్లప్పుడున్నూ; గీత = గానముచేయబడుచుండెడు; కీర్తిమండల = కీర్తిసమూహముగలవాడ; భో = హేస్వామి!

5. శంఖ, చక్ర, గద, పద్మ, శార్ఙ్గ, ఖడ్గ, వైజయంతి, కౌస్తుభాది భూష; శార్ఙ్గము = ధనస్సు, వైజయంతి = పుష్పమాలిక; కౌస్తుభ = కౌస్తుభము అను మణి, ఆది = మొదలగు; భూష = భూషణములుగలవాడ; స్వీకృత = స్వీకరింపబడిన; బుద్ధ్యాది తత్వ = బుద్ధిమొదలగు తత్త్వములతో; సమన్విత = చేరియుండువాడ; దివ్య= అప్రాకృతమైనట్టి; మంగళ = శుభప్రదమైనట్టి, గోపబాలకవేష = గొల్లపిల్లవానివేషమను ధరించినవాడా, మాధవ మాం అవదేవ = మాధవ! నన్ను రక్షింపుమా

6 ఆగమ = వేదములు అనునట్టి; గిరి = పర్వతములయొక్క; శిఖర = అగ్రములయందు; ఉదిత = పుట్టినటువంటి, సత్య = సత్యమున్నూ (శాశ్తమున్నూ); చిదద్వయ -చిత్ = చైతన్యరూపుడున్నూ అనగా జ్ఞానరూపుడున్నూ, అద్వయ = తనకన్నా వేరులేనివాడున్నూ; లక్షణ = ఈ లక్షణములుగల; సుఖ = ఆనందమనునట్టి; భానో = సూర్యుడంటివాడా, భోగికులోత్తమ = సర్పరాజు అయిన శేషునియొక్క; భోగిశయన = శేషపాన్పుయందు పవళించునట్టి; దుగ్ధసాగరజ = పాల సముద్రమునందు పుట్టిన లక్ష్మి అమ్మవారియొక్క; లక్షణ = గుర్తుచేత; ఆఢ్య = ఒప్పుచున్నట్టి; తనో = దివ్యమంగళ విగ్రహముకలవాడ; మాధవ మాం అవదేవ = మాధవ! నన్ను అనుగ్రహింపుమా

7. ఇందిరయా సహ = లక్ష్మీ అమ్మవారితో చేరియున్నట్టి; సుందరకృష్ణ = సౌందర్యముగల కృష్ణా!; పురందరాది = దేవేంద్రుడు మొదలగువారిచేత; వంద్య = నమస్కరింపబడుచుండు; పదకమల = పాదకమలములు కలిగిన; నందనందన = నందపుత్రుడా; యోగివర్యధురం ధర = యోగిశ్రేష్ఠులయొక్క భారమును వహించువాడ; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారియొక్క; మతి = మనస్సునందు; విహార = విహరించునట్టి స్వామీ!; మాధవ మాం అవదేవ = నన్ను, హే మాధవా! రక్షింపుమా

ప యదువంశభూషణుండవగు నోకృష్ణా! నారాయణా! నను రక్షింపుము.

అ. సాధవులగువారిచే ధ్యానింపబడుచు, వారల రక్షించు నోయదుకులా క్షి ..................

1. కమలమువంటి విశాలనేత్రములతోను. శంఖమువలె రేఖాత్రయముతోనొప్పుచు, గంభీరధ్వనిగలియుండు కంఠముతోను, దొండపండువలె నెఱ్ఱనగు కెమ్మోవితోను, సంపెగ పువ్వువలె నొప్పారుచు, చక్కనిముత్యముతో నలంకరింవబడియున్న నాశికతోను, చంద్రబింబమువలె ప్రసన్నమగుముఖముతోను నీశరీరము మిగిలి మనోహరమైయున్నది. ఇది శరత్కాలమగుట చేతను, ఇప్పటినిర్మల చంద్రోదయము చేతను నిను చూచినంత కామబాధ యధిక మగుచున్నది.

2. మహాపురుషలక్షణములతో నీవు భక్తులను బ్రోచునుద్దేశమున మాయామానుష శరీరమును దాల్చితివి. అజ్ఞానరహితా! యొకక్షణమాత్రమున ననేకకోట్లు బ్రహ్మాండములు గల్పించి నాడు చతుర్ముఖుని భ్రమింవ జేసితివి.

3. చలించుచున్న నీరత్నకుండలములం జూచిన (నీవు నృత్యముంచేయు చున్నప్పుడు చూచినయెడల అనుట) భక్తజనులమనఃపద్మములు సూర్యుని జూచినట్టి వికాసమునుజెందును. దయాసహితమగు నీచిఱునగవు పూర్ణచంద్రునియట్లు తన సంచారముచే మునులయజ్ఞానాంధకారమును బారదోలి వారికిమోక్షము నొసంగును.

4. సంసారదూరుడవనియు కల్యాణగుణ సముద్రుండ వనియునీ కీర్తి సర్వకాలములందును గానము చేయబడుచునే యున్నది. నేడే వేణుగాన మనియెడు నమృత ధారలచే మామనముల నిండించి తృప్తిపరఁచి నీగుణ సంపదను బ్రకటించితివి

5. శంఖము, చక్రము, పద్మము, ధనుస్సు, గద, ఖడ్గము, వనమాల కౌస్తుభము వీనిచే నలంకరింప బడియున్నావు. బుద్ధిమొదలగు తత్త్వముల, స్వీకరించి దివ్యమంగళమగు నీగోపాలరూపమును దాల్చియున్నావు.

6. వేదము లనియెడు పర్వతములశిఖరములపై నుదయించి సత్యజ్ఞానానందరూపములతో బ్రకాశించు సూర్యుండవు. (వేదాంతములయందు బోధింపబడు పరబహ్మమనుట) వక్షస్థలమున లక్ష్మీదేవి శోభిల్లుచుండ శేషశయన ముపై యోగ నిద్రం జెందుచు నధికసుఖము ననుభవించు నారాయణుండవు.

7. సకల యోగుల యోగాక్షేమముల నిర్వహించువాడవు. ( యోగి యనగా నిశ్చలచిత్తముతో భగవంతునాశ్రయించువాడు) ఇంద్రాది దేవతలచే నమస్కరింపబడువాడవును అగు నోనంద కుమార! సుందరాకార! శ్రీ కృష్ణా! నీవు లక్ష్మితో గూడి నారాయణ తీర్థుని హృదయకలమలమున నెప్పుడును విహరింపుచుందువు.

శ్లో . సానందంనంద సూనుంసకలజనిమతాంసార మారాదు పాస్యం
దాస్యోలాస్యం రసాఢ్యాఃకరతల కలితై స్తాళవాద్యైస్సుగీతైః,
కుర్వంత్యోనిర్విశంకాః కువలయసదృశో దివ్యతాటంకవత్యః
బృందారణ్యే భజంతే సురవరవనితా స్తంజగుస్స్యందనస్థాః

శ్లో16,17. కువలయదృశః = కలువలతో సమానమైన నేత్రములు గలిగినటువంటి (గోపికలు); దివ్యతాటంక వత్యః = ప్రకాశించుచున్న తాటంకములు (కమ్మలు) ధరించినవారై; దాస్యః = స్వామివారికి దాస్యము సల్పుచున్నవారలై; కరతలకలితైః = హస్తములయందు ధరించబడిన; తాళవాద్యైః = తాళరూపమైన వాయిద్యములచేత నున్నూ; సుగీతైః = మంచిగానములచేత; లాస్యం = నృత్యమును; కుర్వంత్యః = చేయుచున్నవారలై; నిర్విశంకాః = సందేహమువిడిచినవారలై; సకలజనిమతాం = సమస్తజీవులకు; ఆరాత్ = సమీపముననే (హృదయములలోనే); ఉపాస్యం = సేవించబడదగిన; సానందం = ఆనందస్వరూపుడైనట్టి; సారం = సమస్తవస్తువులలో శ్రేష్ఠుడైనట్టి; నందసూనుం = శ్రీకృష్ణస్వామివారిని గూర్చి; రసాఢ్యాః = మిక్కిలి సంతోషముగా; బృందారణ్యే = బృందావనమందు; భజంతే = భజింపుచుండిరి; సురవనితాః = దేవతాస్త్రీలు; స్యందనస్థాః = విమానములపై నున్నవారలై; తం = అట్టి శ్రీకృష్ణస్వామివారిని గూర్చి; జగుః = గానము చేసిరి.

ఇట్లా పద్మ నేత్రలగు గోపికలు, సకల ప్రాణులకును పూజనీయుడై, సర్వలోకసారభూతుండునైయున్న యాకృష్ణునకు పరమానందముతో దాస్యము సల్పుచుండిరి. చేతులతో తాళముధరించి వాగించుచు, తమ రత్నతాటంకములు కదుల చుండ మహానురాగంతో నృత్యమునొనర్చిరి. సంశయ మొక్కింతైనను తేక నిశ్చల భక్తితో వారిట్లు గోవిందు ననుసరించుటం జూచి విమాన స్థితలగు దేవాంగనలు అభగవంతుని ఇట్లని నుతించిరి.

5వ కీర్తన - మధ్యమావతిరాగం - జంపెతాళము

ప. గోవింద మిహ గోపికానందకందం
సానందమవలోకయా మోముకుందం

1. గోపికాగణనయనకుముదపూర్ణేందుం
గోపాలకులతిలక మఖిలజనబంధుం
శ్రీపతి మనింద్యహరిచందనసుగంధిం
శ్రేయోవిధాయి కరుణారససింధుం

2. సంగీత రసరసిక సరససల్లాపం
సరళ మురళీగళితసాధు సంతాపం
శృంగారరసపూర శ్రీ మదన గోపం
శ్రితజనానంద మఖిలా నంద రూపం

3. అంగనాముఖపద్మ సంగిభృంగాక్షం
ఆలోల మకర కుండల నటనదక్షం
మంగళాకర మఖిలలోకసంరక్షం
మాధవ మ శేషసురరిపుగణవిపక్షం

4. వల్లవీ మాణిక్యమణియుగళఖేలం
మరకతమణిచ్ఛాయ మదన గోపాలం
మల్లి కాజాజిచంప కాదిసుమభారం
మహనీయలావణ్యలలితతరపూరం.

5. స్ఫురదధరకలితమురళీనాదసుధయా
సురసుందరీగణంకర్షయతికృపయా
గురుకరుణయారచిత మేతదతిలలితం
నారాయణానంద తీర్థ సముదితం.

ప॥ ఇహ = ఇక్కడ; గోపికా నందకందం = స్వతఃఆనందస్వరూపుడున్నూ; ముకుందం = మోక్షప్రదుడున్నూ, అయినట్టి; గోవిందం = శ్రీకృష్ణభగవానులను; అవలోకయామః = సేవించుచున్నాము.

1. గోపికాగణ = గోపికాసమూహములయొక్క, నయన = నేత్రములు అనునట్టి; కుముద = కలువలకు; పూర్ణేందుం = పూర్ణచంద్రుడువంటివాడున్నూ; గోపాలకులతిలకం = గోపాలురసమూహములకు బొట్టువంటివాడున్నూ; అఖిలజనబంధుం = సమస్తభూతములకు బంధువు అయిన వాడున్నూ; శ్రీపతిం = లక్ష్మీఅమ్మవారి భర్తయున్నూ; అనింద్య = నిందలేని (దోషరహితమైన); హరిచందన = హరిచందనముయొక్క; సుగంధిం = మంచిపరిమళముగలవారున్నూ; (శ్రేయో) శ్రేయః = శ్రేయస్సులను; విధాయి = ప్రసాదించునట్టి; కరుణారససింధుం = దయాసముద్రుడున్నూ-అయినట్టి; గోవిందం = శ్రీకృష్ణభగవానుని; అవలోకయామ = సేవించుచున్నాము.

2. సంగీతరసరసిక = సంగీరసముయొక్క స్వారస్యమును గ్రహించి; సరససల్లాపం = రసయుక్తమైన సంభాషణలు చేయువాడున్నూ; సరళ = మనోహరమైన; మురళీ = వేణునాదముచేత; గళిత = పోగొట్టబడిన (జార్చబడిన); సాధుసంతాపం = సాధువులసంతాపముగలవాడు - అనగా మురళీనాదముచేత సాధువులయొక్క సంతాపమును పోగొట్టువాడున్నూ; శృంగారరసపూర = సౌందర్యమనునట్టి అమృతరసముచేత నిండియున్న; శ్రీమదనగోపం = శ్రీమదనగోపాలస్వామివారున్నూ; శ్రితజనానంద = ఆశ్రితజనులకు ఆనందము కలుగజేయువాడున్నూ; అఖిల ఆనందరూపం = సమస్త భూతములను సంతోషింపచేయునట్టి రూపముగలవాడున్నూ; రూపం = లక్షణము-అట్టి; గోవిందం అవలోకయామ = గోవిందుని సేవించుచున్నాము.

3. అంగనా = స్త్రీలయొక్క; ముఖపద్మ = ముఖములనెడు కమలములయందు; సంగీభృంగ అక్షం = వ్రాలుచున్నట్టి; తుమ్మెదలకు పోల్చదగిన చూపుగలవాడున్నూ; ఆలోల మకరకుండల = మకరకుండలములు కదలచుండునటుల; నటన = నాట్యముచేయుటయందు; దక్షం = సామర్థ్యముగలవాడున్నూ; మంగళకరం = సమస్త మంగళములకు స్థానభూతుడైనవాడున్నూ; అఖిలలోకసంరక్షం = సమస్తలోకములను రక్షించువాడు; మాధవం = లక్ష్మికిభర్త అయినవాడున్నూ; అశేష సురరిపుగణ విపక్షం = సమస్తరాక్షస సమూహములవలన విరోధుడని ఎంచబడినవాడున్నూ-అగు; గోవిందం అవలోకయ = గోవిందుని సేవించుచున్నాము.

4. వల్లవీ = గోపికలు-అను; మాణిక్యమణియుగళ = మణులవంటి ఇద్దరుగోపికలమధ్య; ఖేలం = విలాసముగా నుండువాడున్నూ; మరకతమణిచ్ఛాయ = మరకతమణియొక్క కాంతికలిగినట్టి; మదనగోపాలం = మన్మథుని సౌందర్యముగలగోపాలమూర్తిని; మల్లిక = మల్లెపుష్పములు; జాజి = జాజి పుష్పములు; చంపక = సంపెంగపుష్పములు; అది = మొదలైనటువంటి; సుమభారం = పూలదండలచేత ఒప్పుచున్నవాడున్నూ (ధరించినవాడున్నూ); మహనీయ = లోకపూజ్యమైనటువంటి; లావణ్య = సౌందర్యముచేత; లలితతర = విశేషముగా ఒప్పుచున్నటువంటి; పూరం = శృంగార సముద్రమువంటివానిని; గోవిందం అవలోకయా = గోపాలకృష్ణ ప్రభువును సేవించుచున్నాము.

5. స్ఫురత్ = ప్రకాశించుచున్నటువంటి; అధర = పెదవియందు, కలిత = కూడుకొన్న; మురళీనాద = వేణుగానమనునట్టి; సుధయా = అమృతముచేత; సుర సుందరీగణ = దేవతాస్త్రీ సమూహమును వారి ఆర్తిని తీర్చుటకై; కృపయా = దయచేత; కర్షయతి = ఆకర్షించుచున్నారు; గురుకరుణయా = ఆచార్యకటాక్షముచేత; ఏతత్ = ఈకీర్తన; అతులిలతం = బహుమనోహరముగా నుండునటుల; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారియొక్క; ఆనంద సముదితం సమ్యక్ ఉదితం = మనస్సునందు పొడగట్టినదై గోచరించినవిధముగా; రచిత = రచింపబడినది.

ప॥ ఓచెలులారా! గోపికలకానందమును గలిగింపుచు, బృందావపమున విహరించు జూచుచున్నాము.మిగుల నానందము గల్గు చున్నది.

1. దయానయుద్రుఁడై సకల జనములకు నత్యంత శుభముల నొడఁ గూర్చు నా నారాయణుఁడు గోపాలకులభూషణుఁడై, చక్కనిసువాసన గలచందనము నొడలెల్ల నలఁదికొని గోపికల కానందమును గల్గింపుచు నిటఁ జరింపుచున్నాఁడు.

2. ఈపరమానంద స్వరూపుఁడు మనోహరమగు తనవేణుగానముచే ఆశ్రితులగు సజ్జనులతాపమును హరించి వారికానందమును గల్గించుచు, శృంగారరసప్రవాహమగు తనమనోహరాకారముతోడను, సంభాషణచమత్కారముతోడను, మన్మథునియట్లు సకల (స్త్రీ) జనుల మోహింపఁజేయుచు సంచరించుచున్నాడు.

3. సమస్తమంగళములకు నాధారభూతుఁడును, దైత్యులమర్ధించి సకల లోకములఁ గాచువాఁడునగు నీనారాయణుఁడు తుమ్మెదలంబోలె తనచూపుల గోపాంగనాముఖపద్మములయందు నిలిపియున్నాఁడు.కర్ణకుడలములు చలించు నట్ల మిగులఁ జమత్కారముగ వారితోఁగూడి నృత్యము సల్పుచున్నాఁడు.

4. తన యపరిమితలావణ్యమునకు మెఱుఁగు పెట్టునట్లు మల్లెలు,జాజులు మొదలగు పుష్పముల ధరించి రెండుపార్శ్వములం దిరువురు గోపికలుండ,నడుమఁ దానునిలచి నృత్యము నేయుచున్నాఁడు.దీనింజాడ రెండు పద్మరాగమణుల నడుమ నొకమరకతమణి పొదుగఁబడినట్లు మిగుల మనోహరముగనున్నది.

5. తనపెదవిపై వేణువునునిచి .గానముచేయుచు, నాగానామృత ముచే మన ( దేవతా స్త్రీల) హృదయములకూడ నాకర్షించుచున్నాడు. ఇది మనకు మహానుగ్రహము. ఈయతిమనోహరమగు గీతము గురుకరుణవలన నారాయణతీర్థయతి రచించెను.

శ్లో. ధ్రువమతముఖము ఖ్యైస్తాళభేదైరటంత్యో
వనభువి వరనార్యో రాసగోష్ఠీగరిష్ఠాః;
అలఘులఘుపదాదిన్యాసభేదైశ్చ నాట్యైః;
సరసమభినయంత్యో నందసూనుం భజంతే. 17

శ్లో 17. వనభువి = బృందావనమందు; రాసగోష్ఠీ గరిష్ఠాః = రాసక్రీడా విహారమునందు శ్రేష్ఠమైన; వరనార్యాః = గోపికామణులు; ధ్రువమఠముఖ ముఖ్యైః = ధ్రువ, మఠ్యతాళములు మొదలుగాగల ముఖ్యమైన; తాళభేదైః = తాళభేదములతోను; అలఘుపద = అలఘుపదములు (దూరపు పదములు); లఘుపద = లఘుపదములు (దగ్గఱ పదములు); అది = మొదలగు; న్యాసభేదైః = అనేక న్యాసభేదమలు కలిగినట్టి; చ, నాట్యైః = నాట్యములతోడనున్నూ; అటంత్యః = విహరింపుచున్నవారలై; సరసం = రసభావములు బాగుగ బయల్పడునటుల; అభినయంత్యః = అభినయించుచు; నందసూనుం = శ్రీకృష్ణుని; భజంతే = భజించుచున్నారు.

ధ్రువతాళము, మఠ్యతాళము మొదలగు ననేక తాళభేదములతోను, ఆలఘుపదము , లఘుపదము మొదలగు ననేకభేదములుగల నాట్యములతోను విహరింపుచు, రసభావములు బాగుగ బయల్పడునట్లు అభినయించుచు నా గోపికలు కృష్ణుని, సేవించుచుండిరి. ఇట్లు సకలమనోహరముగ రాసక్రీడ ప్రవర్తిల్లుచుండెను.

శ్లో. ముహురపి సురనార్యో రాసలీలావిలాసం
జగురితి దివి దివ్యస్యందనానందవత్యః
అభినయమపి తాసాం వల్లవీనాం మురారే
రధికమభినయంత్యః పుష్పవృష్ట్యార్చయంత్యః 18

శ్లో 18. దివి = ఆకాశమునందు; దివ్య స్యందనానంద వత్యః = దేవతా సంబంధమైన విమానములయందు సంతోషముగా నుండిన; సురనార్యః = దేవతాస్త్రీలు; రాసలీలా విలాసం = రాసక్రీడా విలాసమును; ముహురపి = పలుమారు; ఇతి = ఈక్రింద చెప్పబోవు విధముగా; జగుః = వర్ణించిరి (గానముచేసిరి); తాసాం వల్లవీనాం = ఆ గోపస్త్రీలయొక్కయున్నూ; మురారేః = శ్రీకృష్ణునియొక్కయున్నూ; అభినయ = అభినయములను; అధికం = విశేషముగా; అభినయంత్యః = అభినయము చేయుచున్నవారలై; అపి = మరియు; పుష్పవృష్ట్యా = పుష్పవర్షముచేత; అర్చయంత్యః = పూజించినవారైరి.

ఆకాశమునందు విమానములపైనుండి పరమానందముతోఁ జూచుచుండిన దేవతా స్త్రీలును, అరాసక్రీడామహోత్సవమును వర్ణించిరి. గోపిక లును, శ్రీకృష్ణుడును జేసిన యభినయములఁ దామును మరల నొనర్చిరి. పలుమారు పుష్పవృష్టులఁ గురిపించిరి.

## 6వ కీర్తన: నాటరాగం - ధ్రువతాళము

ధ్రువమండలమండిత వధూజనమండల మహోన్నతం
భవసాగరతారకగిరాం పరిభావుకసులక్షితం
ధ్రుతమధ్యమమంధరగతిం అవలోకనసుందరం
కృతపుణ్యఫలాత్మకనృహరిం పరిపశ్యత వ్రజౌకసాం.
త్రిపతాకపతాకసుకరైః కటకాముఖశిలీముఖైః

పరభావరసోత్కటపరై రపి వీక్షణసుశిక్షితైః
తనుమధ్యనియోజితకరై రపి నాట్యరసోత్కటాః
నారాయణతీర్థకృతం హరి రితి యతిజనతోషం.
తాంతకకిణతధిమితకిటతఝుణుతకిటత - తకధరికిటజణు తాహతధ
ణధిమిధిమినుతకిటతధిమితకిటతక - ఝుణుతాకిటతకధణతా
తకధణాంతకిట ఝుంతరికిటతకఝుం - ణంతరికిటతక - ధణం
తకిటతఝుంతకిట - రిగ్గుడుతధైయ్యత్తక - ధాకిటతకఝుం-
తరికిటతకధళంగుతకఝుంకిత - తకధిమితకిట ధణధిమిధరితక-
తతకిటతకతకఝుణుతధణతద్ధిమి-తకదధిగిణధోం.

ధ్రువమండల = వలయాకారమువంటి మండలముచేత; మండిత = అలంకరించబడిన; వధూజనమండల = గోపస్త్రీల సమూహమునుండి; మహోన్నతం = మహో ఉన్నతుడై వుండునట్టి; భవసాగర = సంసారసముద్రమును; తారక =తరింపజేయునట్టి; గిరాం = వేదవాక్యములయొక్క; పరిభావుక = పరిశీలనచేత; సులక్షితం = చక్కగా గోచరించువాడున్నూ; ధ్రుత మధ్యమ మందర గతిం = ధృత మధ్యమ మందర గతులతో నృత్యముచేయుచున్నట్టిన్నీ-అనగా ప్రథమ, ద్వితీ, తృతీయ కాలములనడకతో నృత్యము చేయునట్టిన్నీ; అవలోకన = చూచువారలకు; సుందరం = సౌందర్యముగా నుండువాడున్నూ; వ్రజౌకసాం = గోకులనివాసులచేత; కృత = పూర్వముచేయబడిన; పుణ్యఫలాత్మక = పుణ్యకర్మలయొక్క ఫలస్వరూపుడున్నూ-అగు; నృహరిం = నరశ్రేష్ఠుడైన శ్రీకృష్ణస్వామివారిని; పరిపశ్యత = బాగుగా సేవించండి; త్రిపతాక = పతాక, కటకాముఖ, శిలీముఖలను అభినయ భేదములుగల; నం కరైరపి = మంచి హస్తములచేతనున్నూ; పరభావరసోత్కటపరైః = బ్రహ్మానందరస అతిశయమును తెలియజేయుచున్నట్టిన్నీ; వీక్షణ సుశిక్షితైః = స్వామివారి చూపులచేత చక్కగా నేర్పబడినట్టిన్నీ; తనుమధ్య నియోజిత కరైఃఅపి = నడుములయందు చేర్చబడిన హస్తములచేతనున్నూ; నాట్యరసోత్కటాః = నటనానంద అతిశయముగలవారైరి; హరేఃఇతి = శ్రీహరి సంబంధమైన ఈకీర్తన; యతిజనతోషం = యతిజనులకు సంతోషకరముగా; నారాయణతీర్థకృతం = నారాయణతీర్థులవలన రచింపబడినది.

(మనుష్యులలో శ్రేష్ఠుఁడగు) నాశ్రీకృష్ణుని బాగుగ నాలోకింపుఁడు. గోపికలందరును బహువిధములగు గానములంజేయుచు, తాళముల ప్రయోగించుచుఁ దనచుట్టును మండలాకారముగ నిలువ వారిమధ్యనిలుచుండి మంథర, మధ్యమ, ద్రుతగతులలో నృత్యము సేయుచున్నాఁడు. ఆగోపికలభాగ్యము నేమని వర్ణింపఁగలము.సంసారసముద్రమును తరింపఁజేయు వేదాంత వాక్యములఁ బలుమాఱు విచారించినవారికైనను సూక్ష్మముగ గోచరించు నమ్మహాత్ముఁడు మనోహరాకారముతో వీరి

కనులయెదుట నిలిచియున్నాఁడు.త్రిపతాక,పతాక,కటికాముఖ,శిలీముఖాదిహస్తముల నేర్పుచు (ఈత్రిపతాకా దులు అభినయించునప్పుడుపయోగించు హస్తభేదములు) బ్రహ్మానందరూపమగు భావమును మిగుల నధికముగ వీరలచే నభినయింపజేయుచున్నాడు. ఆగోపికలును కృష్ణుని దృష్టులవలన సర్వవిషయముల నెఱింగి, సన్నని తమ నడుములయందు హస్తములనుంచుకొని యధికానందముతో నృత్యముంజేయుచున్నారు.శ్రీకృష్ణుఁ డిట్లు మహోన్నతుండై యున్నాడని వర్ణించి నారాయణతీర్థుఁడు యతిజనులకుం దృష్టి గావించెను.

## 7వవ కీర్తన మధ్యమావతి - మఠ్యతాళము

జగతీశం పశ్యత సురవనితా
వ్రజాంగనాభి రిహ నవనవమణిదివ్య
కుండలతరణినిచయశశిగణసంజాత
శ్రీ జితసత్యలోకవిచిత్రభూతి రయం
లీలామయదివ్యసుందరమదన
కోటివిలసితతను ర్వసుధారాశి ర్నృత్యతి భవి నిజదాసవర్గసుకకరకృపాంబురాశి రేసం
తకదీనుతజక కిణణక ధిధణకిణణకధికిత ధిమిత -ఝుణుతద్ధణతద్ధిమితకిటతకతోం-
ధరికిటధింధిగ్గడుతద్ధెయ్యతదధీనుతధీ - తకణకఝుంతరికుంతరి -
తకిటఝుంతతధణంతరికిట - ధాకిటతకఝుంతరికిటతకతాహతధికితక - తధిమితకిట-
తకఝుణుతక-ధిమితధిమితతకదధిగినధోం.

ప॥ సురవనితా = దేవతాస్త్రీలారా!; వ్రజాంగనాభిః = గోపస్త్రీలతోగూడ వేంచేసియుండు; జగతీశం = జగన్నాథుడైన శ్రీకృష్ణస్వామివారిని; ఇహపశ్యత = ఇక్కడ సేవించుడు; అయం = ఈయన; నవనవమణి = నూతనమైన నవరత్నములచేత స్థగితమైన; దివ్యకుండల = దేవతా సంబంధమైన కుండలములనెడు; తరణి నిచయు = సూర్యసమూహముచేతనున్నూ; శశిగణ = చంద్రసమూహములచేతనున్నూ; సంజాతశ్రీ = కలిగినట్టి కాంతులచేత; జిత = జయింపబడిన; సత్యలోక = బ్రహ్మలోక సంబంధమైన; విచిత్ర విభూతి = చిత్రమైన ఐశ్వర్యముగలవారు, మరియు ఈ శ్రీకృష్ణులు; లీలామయ = లీలయే విశేషముగా నుండునట్టి; దివ్యసుందరమదనకోటి = కోటి మన్మథులతో సమమగు అద్భుత సౌందర్యముచేత; విలసిత = ప్రకాశించుచున్నట్టి; తనుః = దివ్యమంగళ విగ్రహముగలవాడు; వసుధాః = భూమియందు వున్నట్టి; సుధారాశి = అమృత సముద్రమోయనబడ తగినట్టి శ్రీకృష్ణుండు; భువి నృత్యంతం = భూలోకమందు నాట్యము చేయుచున్నాడు; నిజదాసవర్గ = తనభక్తులకు; సుఖకర = సుఖము ఇచ్చునట్టి; కృపాంబురాశి = కరుణా సముద్రుడగు; ఏనం పశ్యత = ఈస్వామివారిని చూడండి

ఓ దేవతా స్త్రీలారా ! జగదీశ్వరుఁడు నీకృష్ణునిఁ జూడుఁడు. గోపికా స్త్రీలతోఁగూడి యాడుచున్నాడు. ఈమహాత్ముని మణిమయకర్ణకుండలములు చలించుచు నీవల నావలఁ బ్రసరించుతమకాంతులచే లెక్కకు మిక్కిలియగు చంద్రసూర్యబింబములఁ గల్పించుచు,ఒక్కచంద్రునితోను ,ఒక్కసూర్యుని తోను అలంకరింపఁబడియున్న సత్యలోకముయొక్క శోభను దిరస్కరింపఁజాలు సౌందర్యము (కృష్ణుని) ముఖంబున కొనంగుచున్నవి.దయామయుఁడగు నీనాదాయణుఁడు భూమిపైకి దిగివచ్చిన యమృతకలశమోయన భక్తుల కానందముగల్గించు నిమిత్తమున మన్మధకోటి సదృశమగు మాయామానుష విగ్రహమునుదాల్చి భూమిపై విహరింపుచున్నాఁడు.

### 8వ కీర్తన - తోడిరాగం - రూపకతాళము

నిత్యానంద మిహ పశ్యత నరసింహం
వ్రజవధూభి రధిలాస్యకృతం
భక్తానా మభయదం - భవబంధనవిదళనం
మునివర్యమో క్షైక ఫలవేదవిదితం
ఇంగితలింగిదయాసుధయా పరిమితముదా
గోపీజనమనసిజా నేకరూపధర మిహ
పరిపాలితనిజజనం నిరవధికకరుణారసం
తఝంతకఝణుతక - తధిమితకిటధణదిమితకధరికిటఝణు-తఝంతధీ-
తకగధిమిత - కిణఝంతరిధణతా-కిణఝంతరిధణతా - ఝణుతాహత-
తధిమితకిటఝణు - ధికథకధణధిమితధణతతధిమికిటధా
ణుంధనంతధణంతఝణుంతకఝంతరి- తద్ధళంగుతకఝణు-
తకధియమితతకితతకఝణుత - తధిమితకిటదిమయిత - ధణధిమితకదధిగణధోం.

వ్రజవధూభిః = గోపస్త్రీలచేత; అధిలాన్యకృతం = నాట్యమునకు అధ్యక్షుడుగా చేయబడినటువంటి; పరిజన హితచరితం = భక్తులకు హితమైన చరిత్రగలవారున్నూ; భక్తానామ భయదం = భక్తులకు అభయమును ఇచ్చువాడున్నూ; భవబంధన విదళనం = సంసారబంధమును కొట్టివేయువారు; మునివర్య = మునిశ్రేష్ఠులచేతనున్నూ; మోక్షైకఫలవేద = మోక్షమే ముఖ్యమైనటువంటి ఫలముగా గల్గిన ఉపనిషత్ భాగములచేతను; విదితం = తెలియబడువాడున్నూ; ఇంగిత = సౌజ్ఞలచేతనున్నూ; లింగిత = ఆకారచేష్టలచేతనున్నూ; దయా సుధయా = కరుణామృతము చేతనున్నూ; అపరిమితముదా = విశేషసంతోషమును యిచ్చుచూ; గోపీజన = గోపికాస్త్రీలయొక్క; మనసిజ అనేకరూపధరం = అనేక మన్మథుల రూపమును ధరించినటువంటినీ; ఇహ = ఇక్కడ; పరిపాలిత నిజజనం = స్వజనులను పరిపాలించుచునట్టివాడున్నూ; నిరవధిక కరుణారసం = పరిమితములేని దయారస సముద్రుడున్నూ; నిత్యానందం = నిత్యానందరూపుడైన; నరసింహం ఇహపశ్యత = శ్రీకృష్ణస్వామివారిని ఇక్కడ సేవించండి.

పరమానందస్వరూపమగు నీపురుషోత్తముని( జూడు(డు.ఈమహాత్ము(డు వేదవేద్యు(డగు నారాయణు(డు.ఈయన చేయుకార్యమువలన నే(యీఘనుని) దయారనమపరిమితమని యూహింపవచ్చును.ఇట్లుకరుణానసముద్రు(డుగుటచే భక్తుల రక్షించి వారిసంసారబంధముల( దొలంగించుటకై యిట జనించి యున్నాడు . ఈగోపికాసమూహములో నెవ్వరెవ్వరి కెట్టెట్టిరూపముపై నాశయుండునో యట్టి మనోహరాకారమును ధరించి వారలకు నంతనమును గల్గించుచు విహరించుచున్నా(డు.

## 9వ కీర్తన - వరాళిరాగం - జంపెతాళము

సురలోకవనితా స్సమవలోకయతదేవ
మఖిలలోకాధార మధికతరలీలం
శరణాగత త్రాణకలిత సంకల్ప మిహ
వనభువి మహోల్లాసరాసరసరసికం
వ్రజపురవధూకలితవివిధతాళమృదంగ
సంగీతరసవిజ్ఞ మఖిలసారజ్ఞం
ఉదయవిలయాతీతరసఘన మచింత్యం
సదయహృదయాలోకకలిత కైవల్యం
అధికతరసాహసోత్సాహగాంభీర్యం
విధిముఖవిమృగ్యపదవిమలవిజ్ఞానం
కనకకటిసూత్రవలయాంగదపటీరం
కలితకౌస్తుభశోభికమనీయకంఠం
శ్రీవత్సలక్షణ మశేషసురరక్షం
శ్రేయసా మాస్పద మశేషభువనానాం
నారాయణానందతీర్థ
యతిపణితం
సారతలారసిక సరసతర ఫలితం.
తందిరినాదిరినా ధ్రింధ్రింనుతక - తధిమితకిటతకఝణం-
తగణంతద్ధిక్కిటతకనధిక్కిటతక- ధింధింతత్తాది- తత్తాది- గిణగణాంకిణ- తోదిగిదిగీ-
ధాదుగుదుగుజంజంతజం- తద్ధిమితఝంతరితధణాం- ధాణాధణఝణుతాహంత-
తధిమితకిటఝంతకఝం- జణుతాహతజంతరి తధిమితకిటతక - ధణధిమిఝణుత
క దధిగిణధోం.

సురలోకవనితాః = దేవతాస్త్రీలారా; సమ్యక్ అవలోకయత = బాగాసేవింపుడు; అఖిలలోకాధారం = నమస్తలోకములకు ఆధారుడున్నూ; అధికతరలీలం = అత్యధికమగు క్రీడావిహారముగలవాడున్నూ; శరణాగతత్రాణ కలిత సంకల్పం = శరణుజొచ్చినవారిని రక్షించుటయందు చేయబడిన సంకల్పముగలవాడున్నూ; ఇహ వనభువి = ఇక్కడ బృందావనమందు; మహోల్లాస = గొప్పసంతోషముతోగూడిన; రాసరసం = రాసక్రీడానందము యొక్క; రసికం = ప్రవీణులున్నూ; వ్రజపురవధూకలిత = గోపస్త్రీలచేత మ్రోయింపబడుచున్న; వివిధతాళమృదంగ = అనేక తాళములు మృదంగములయొక్క; సంగీత రసవిజ్ఞం = సంగీత రసమును చక్కగా తెలిసినవారున్నూ, అఖిలసారజ్ఞం = సమస్తసారమును గ్రహించువాడున్నూ, ఉదయ విలయ అతీత రసఘనం = ఉత్పత్తినాశనములేని బ్రహ్మానందముచేత నిండియుండువారున్నూ; అచింత్య = చింతనాతీతుడున్నూ (వర్ణనాతీతుడున్నూ); సదయ హృదయాలోక కలిత కైవల్యం - సదయ = దయతోగూడిన; హృదయ = అనురాగముతోనున్నూ; ఆలోక = వీక్షణములచేతనున్నూ; కలిత = ఒప్పుచున్న; కైవల్యం = మోక్షప్రదుడున్నూ; అధికతర సాహసోత్సాహ - అధికతర = సర్వాతిశయమైన; సాహస = పట్టుదలయున్నూ; ఉత్సాహ = కార్యోత్సాహమున్నూ; గాంభీర్యం = తనభావమును ఇతరులకు తెలియకుండునటుల నటించుటయున్నూ, ఇట్టి గుణములుగలవాడున్నూ; విధిముఖ = బ్రహ్మమొదలగువారిచేత; విమృగ్య = లెస్సగా వెదుకబడుచుండెడు; పద = స్థానమున్నూ; విమలవిజ్ఞానం = నిర్మలమైన విజ్ఞానముగలవాడున్నూ; కనకకటిసూత్రం = బంగారు మొలత్రాడు చేతనున్నూ; వలయ = కంకణములున్నూ; అంగద = భుజబందులున్నూ; పటీరం = వీటిని ధృడముగా ధరించినవాడున్నూ; కలిత = ఒప్పుచున్నట్టి; కౌస్తుభ = కౌస్తుభమణియొక్క; శోభ = ప్రకాశంగలిగిన; కమనీయ = సొగసైన; కంఠం = కంఠముగలవాడున్నూ; శ్రీవత్సలక్షణం = శ్రీవత్సమనే గుర్తుగలవాడున్నూ; అశేషసురరక్షం = సమస్తదేవతలను రక్షించువాడున్నూ; అశేష భువనానాం = సమస్తలోకములయొక్క; శ్రేయసాం = శుభములకు; ఆస్పదం = స్థానభూతుడున్నూ - అయినటువంటి స్వామివారిని; అవలోకయత = సేవించండి.

ఓదేవతా స్త్రీలారా ! విలాసములకు నిధియు, సకలలోకములకు నాధారభూతుఁడునగు శ్రీకృష్ణు నిరీక్షింపుడు శరణాగతుల రక్షింపవలయునని నిశ్చయించి మహోల్లాసముతో నీబృందావనమున రాసక్రీడ సల్పుచున్నాఁడు. సారభూతములగు సకలవిషయముల నెఱింగిన యమ్మహాత్ము నానందపఱచుటకై గోపికలు గానములఁజేయుచున్నారు.తాళమృదంగాది వాద్యముల మనోహరముగ మ్రోగించుచున్నారు. ఉత్పత్తినాశములులేనివాఁడును, పరమానంద స్వరూపుఁడును, మనసునందు ధ్యానించుటకుకూడ నలవికానివాఁడు నగు నీజ్ఞాన స్వరూపుఁడు కరుణించి చూచెనేని మోక్షము కరతలామలకంబగును. లోకములకు శ్రేయములనొసంగ నింతకంటె నధికుఁడు లేఁడు.బ్రహ్మాదులకుఁగూడ లభింపని యీసురరక్షకుఁడు పరిపూర్ణములగు ఉత్సాహ, సాహస,గాంభీర్య ములచే ( ఉత్సాహమనఁ గాపట్టు దల ; సాహసమనఁ గా చొరవ;గాంభీర్యమనంగా తనకుఁగల సుఖ దుఃఖ కోపహర్షాదుల వెలికిఁ దోపనీకుండుట) నొప్పుచు

తనదివ్యదేహమున సుగంధచందనంబును,సువర్ణరత్న చయములగు మొలత్రాడు, కంకణములు, భుజకీర్తులు, మఱియు ననేకభూషణములును, సర్వకాలములయందును తనవక్షస్థలమునకు ముఖ్యాలంకారములై రాజిల్లు శ్రీవత్సకౌస్తుభములును ప్రకాశించుచుండ సకలలోకములకును గనులపండువు సేయుచున్నాఁడు.

## 10వ కీర్తన: శ్రీరాగం - త్రిపుటతాళం

గోపాల మాకలయ సఖి హే గోపికాయుతమండలి
చండభానుసమాగ్రమండల నియత దేవనిత్యబోధ
మఖిలసారమాదిదేవ మతులలీల మమరగీత
మప్రమేయపరాక్రమనిత్యశుద్ధసుఖైకవిగ్రహ మచ్యుతం
తత్తగ్ధినుత ఝుంతరితధిమితకిట-తధిమితఝుం-తఝుం-
ధణాంఝణుంధణాంధిమితధీదణతకతధిమితకిటఝణుతతకిట-దికితకఝణు-
ధణధిమి-
తధిమితతకధణత - ఝణుతాహతధిమితజణుత-తకధరికిటజణుతతద్ధిమితకిట-
ధికితకజణుతక -తకతధిగణధోం.

హేసఖి! = ఓ చెలికత్తె!; గోపాలం ఆకలయ = శ్రీకృష్ణస్వామిని సేవింపుడు; గోపికాయుతమండలి = గోపికా సహస్రముల సమూహములుగలవారై యున్నారు; చండ = తీక్ష్ణ కిరణములగలిగిన; భాను = సూర్యుని; సమగ్రమండల = సంపూర్ణమండలమునందు; నియతదేవం = నియతముగా వేంచేసియుండు దేవుడున్నూ; నిత్యబోధం = సంకోచములేక ఎల్లప్పుడు ప్రకాశించుచుండు జ్ఞానముగలవాడున్నూ; అఖిలసారం = స్థిరాంశమైనవాడున్నూ; ఆదిదేవం = దేవతలలో ఆది పురుషుడున్నూ; అతులలీలం = అనమానమైన అనాయాసమైన వ్యాపారముగలవాడు; అమరగీతం = దేవతలవల్ల గానము చేయబడుచుండెడువాడు; అప్రమేయ పరాక్రమం = గణనాతీతమైన పరాక్రమము గలవాడున్నూ; నిత్యశుద్ధ = ఎప్పుడున్నూ పరిశుద్ధమైన రజస్తమోగుణ స్పర్శలేని; సుఖ = ఆనందమైన; ఏక = ముఖ్యమైన; విగ్రహం = మూర్తిగలవాడున్నూ, ఈ గుణములగల; న+చ్యుతం (అచ్యుతం) = జారనటువంటి (నశింపుకానటువంటి); గోపాలకృష్ణం = గోపాలకృష్ణుని; ఆకలయ = సేవించండి.

ఓ చెలీ! ఈగోపికాసమూహమునందు సూర్యునివలెఁ బ్రకాశించు నా గోపాలకృష్ణునిఁజూడుము.సత్యజ్ఞానస్వరూపుండనియు, సర్వప్రపంచమున కును ఆదికారణుండనియు, స్వప్రకాశస్వరూపుఁడనియు,లీలార్థమై కృష్ణ రూపమున నవతరించెననియు, దేవత లీయనను వినుతించుచున్నారు.నిత్యశుద్ధ పరమానందస్వరూపుఁడగు నారాయణుఁడే యిపుడు బహువిధములగు పరాక్రమములఁ జూపుచున్నాఁడు.ఇది నిశ్చయము.

## 11వ కీర్తన - ఆనందభైరవిరాగము - విళంబతాళము

కలయతసురవనితామదనగోపాల
మనుపమలావణ్యసరిదేకనాథం
వనభువిరవితనయాతటినీతట
హరిచందనలవంగలతాదివిలసితం
నిరుపమరాగరసోల్లసితవల్లవ
యువతీజనమానసకుముదపూర్ణేందుం
మృగమదతిలకక లిత ఫాలసుందర
శ్రమజలకణము క్తాఫలజాలరసం
చరణకమలగతమణిమయనూపుర
మధుకరమదనిచయశిక్షాగురుం
మంద్రమధ్యమలఘుతరగతి భేద
సుందరాస్యనందితయువతీబృందం
హరిచందనతులసీకమల కేతకీకుంద
కుముదపారిజాతాదికుసుమసుగంధిం
తాం-తక్కిణకిణతకజం-తకజంతకుం తరి- ఆద్ధణాంఅద్ధనుత- ధణతద్ధిమితకజంత-
తకజంత తద్ధణాంతధిమితక- తాహుజంతరిధణాంజణుతా-తకిటజంతకజంతధిమితక
- జణుతధణధిమి-తజంతకిటతకజంకిణజం - తకధిత్తకజం-జణుతాహుత-ధణధినుత-
తజణంతతధణత-తద్ధిమితకిటతకజణుతకరేతకదధిగిణధోం.

సురవరవనితాః = ఓ దేవతాస్త్రీలారా!; మదనగోపాలం = శ్రీకృష్ణస్వామివారిని; కలయిత = సేవించండి; అనుపమ = ఉపమానరహితమైన; లావణ్య = శృంగారమునకు; సరిత్ ఏకనాథం = నదులకు సముద్రుడు ఎటులనో అటుల శృంగారము సముద్రుడంటివాడు; వనభువి = బృందావనమందు; రవితనయా = యమునా అనునట్టి; తటినీతట = నదియొక్క ఒడ్డునందు; హరిచందన లవంగ లత = లవంగతీగలు మొదలుగా గలిగిన; ఆది = మొదలుగాగలిగిన; విలసితం = శోభించునట్టిఇ; నిరుపమ =అనమానమైన; రాగరస = అనురాగరసముచేత; ఉల్లసిత = ప్రకాశించునట్టి; వల్లవయుతీజన = గొల్లస్త్రీజనములయొక్క; మానసకుముద = మనస్సులనెడు కలువలకు; పూర్ణేందుం = పూర్ణచంద్రుడంటివాడున్నూ; మృగమదతిలక = కస్తూరిబొట్టుచేత; కలిత = ఒప్పుచున్నటువంటి; ఫాలసుందరం = చక్కని నొసలుగలవాడున్నూ; శ్రమజలకణ = చమటబిందువువలె; ముక్తాఫలజాలరసం = ముత్యములవలె

ఒప్పుచున్నవాడున్నూ; చరణకమల = పాదపద్మములయందు; గత = ఉన్నట్టి, మణిమయ = మణులచే పొదగబడిన; నూపుర = అందెలు అనునట్టి; మధుకర = తుమ్మెదలయొక్క, మదనిచయ = మత్తాఅవస్థలను; శిక్షాగురుం = తన నాట్యముచే గురువుగా నుండి శిక్షించుచు నృత్యముద్వారా విశేషధ్వనులు కలుగునట్లు చేయుచుండువాడున్నూ; మంద్ర, మధ్య, లఘుతర - అనునట్టి; గతిభేద = వివిధ గతులు గలిగిన; సుందరలాస్య = సొగసైన నృత్యముచేత, నందిత = సంతోషపరచబడిన; యువతీబృందం = గోపికా సమూహములు గలవాడున్నూ; హరిచందన = హరిచందన, తులశి, కమల, కేతకీ, కుంద, కుముద, పారిజాత; ఆది = మొదలైన; కేతకీ = మొగలి; కుంద = మల్లెమొగ్గ; కుముద = కలువలు; కుసుమ = పుష్పములయొక్క; సుగంధి = మంచి పరిమళము గలవారున్నూ -అగు శ్రీకృష్ణస్వామివారిని; కలయత = సేవించండి.

నిరుపమ మగులావణ్యమునకు సముద్రమువంటివాఁడై తనసౌందర్య ముచేగోపికల మోహపరవవులం గావించి పూర్ణచంద్రుంబోలె వారిహృదయకుముదంబులకు సంతసమును గల్గించుచుండు మదనగోపాలుని. చూడుఁడు.ఓదేవతా స్త్రీలారా! ఆమహాత్ముఁడు చందనము, మల్లెలు, మొల్లలు, పారిజాతములు మొదలగు ననేకపుష్పములధరించి , కస్తూరీతిలకముచే దనరారు ముఖమున చెమ్మట బిందువులు ముత్యములట్లు శోభిల్లపాదములందలి మణిమయములగు నందియలు మదించిన తుమ్మెదలుంబోలె, ఝంకారము సేయుచుండ.మంద్ర మద్యమ తీవ్ర భేదములచే నృత్యము నాచరించుచు న్నాఁడు.ఇట్లు నాయనతోఁ గూడి యాగోపికలును పరమానందము నొందుచున్నారు. (మంద్ర. మధ్యమ, తీవ్రములనంగా మెల్లఁగగను, మధ్యవిధముగను, మిగుల, వేగముగను అచరింపఁబడు కార్యములు.)

## 12వ కీర్తన - సౌరాష్ట్రరాగము - ఏకతాళము

కలయత వనభువి కమలేక్షణ మిహ
కలితలలితమురళీకలనినదం
కల్పితబహువిధకామవిశేషం
కరుణారసఘనమనుపమ వేషం
శ్రీగోపాలకరాసక్రీడా
సిద్ధమహోత్సవవర్ధన మధునా
శివనారాయణతీర్థసుఘటితం
స్థూలాదిక మితి హరిగురుకృపయా
తకజం-తకధీధినుతజం-తద్ధిమితక్కిట-జణుదణతాం- తకకిణ
జంతరి- ధణధిమితధిమిత- తకధరికిటజణుతద్ధిమితద్ధిన్నాంతక
జణుతతకిటతధిమిత - ధికితఃజణుతాహతధిమితకిటజంతరి-
తనజణుతకతకదధిగిణధోం

వనభువి = బృందావనమందు; కమలేక్షణం = శ్రీకృష్ణస్వామివారిని, కలయత = సేవింపుడు; కలిత = ఒప్పుచున్నటువంటి, లలిత = దివ్యమైన, మురళి = వేణువుయొక్క; కల = అవ్యక్తమధురమైన; నినదం = ధ్వనిచేయుచున్నవాడును, కల్పిత = కల్పించబడిన; బహువిధ = అనేకవిధములైన; కామవిశేషం = శృంగారవిశేషములుగలవాడున్నూ; కరుణారసఘనం = దయారసముతో నిండినవాడున్నూ; అనుపమవేషం = అనమానమైన రూపమును ధరించినవాడున్నూ; కళ్యాణాకృతి = శుభస్కరమైన ఆకారముగలిగి; కృతబహుఖేలం = ఆచరించబడిన విస్తారమైన విహారముగలవాడున్నూ-అగు; కమలేక్షణం = విశాలపత్రనేత్రుని; కలయత = సేవించండి; అధునా = ఇప్పుడు; శ్రీగోపాలక = శ్రీకృష్ణస్వామివారియొక్క; రాసక్రీడా = రాసక్రీడయందు; సిద్ధ సకలజన గోచరమైన; మహోత్సవ = గొప్పఉత్సవమును; వర్ణనం = వర్ణించుట; సూలాదికం = సూలాదులతోడ (అనగా భరతశాస్త్రసంబంధమైన); ఇతి = ఈవిధముగా; హరి గురుకృపయా = శ్రీహరియొక్కయు ఆచార్యునియొక్కయు అనుగ్రహముచేత; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవల్ల; సుఘటితం = లెస్సగా రచింపబడినది.

**వేణుగానమేసేయుచున్న యాపుండరీకాక్షుని వీక్షింపుండు ఈకరు ణాసముద్రుఁడు మనోహరమగు వేషములను ( దాల్చి ) మనోహరములగు ననేక ఆకారములంబూని. క్రొత్తక్రొత్తవింతల గల్గింపుచు, ననేక విధములుగా క్రీడించుచున్నాఁడు.(కామవి శేష = భోగ్య పదార్థములలోని, లేక సందర్భములోని భేదములు , అనఁగా అపూర్వములగు విసయములు , వింతలు) ఇట్లు గోపాలకృష్ణుఁ డొనర్చిన రాసక్రీడామహోత్సవమును, నారాయణ తీర్థుండు శ్రీహరియను పేరుగల కృష్ణుఁడనియెడు గురువు ననుగ్రహంబున వర్ణించెను.**

**శ్లో.** **అఙ్గప్రత్యఙ్గగౌణస్ఫుటసమవిషమ**
**వ్యంజకవ్యక్తిసిద్ధైః**
**శృంగారాద్యైరనింద్యైరధికమభినయం**
**వ్యంజయంత్యోయువత్యః**
**రాసక్రీడావిలాసైర్వనభువి నితరాం**
**మాధవం తోషయంత్యః**
**తుష్టాః స్వైరం రమంతే చిరమిహ గురుణా**
**శ్రీధరేణా ప్తకామాః**
**ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం-శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం**
**శ్రీకృష్ణరాసక్రీడా వర్ణనంనామసప్తమతరఙ్గః**

శ్లో 19. అఙ్గ = పెద్ద అవయవములు (కరచరదులున్నూ); ప్రత్యఙ్గ = చిన్న అంగములు (వ్రేళ్ళు మొదలుగునవి); వ్యంజన = అభినయములయొక్క; వ్యక్తిసిద్ధైః = స్పష్టముగా కనబరచుటచేత (ఏర్పడిన); అనింద్యైః = శాస్త్రచోదితములైన; శృంగారాద్యైః= శృంగారాది భావములచేత; అభినయం = అభినయమును; అధికం = మిక్కుటముగా, వ్యంజ్యయంత్యః = కనబరచుచున్నవారలై; యువత్యః = గోపభామలు; రాసక్రీడా విలాసైః = రాసక్రీడావిలాసముచేత, వనభువి = బృందావనమందు; మాధవం = శ్రీకృష్ణస్వామివారిని; నితరాం = విశేషముగా; తోషయంత్యః = సంతోషింపచేయుచున్నవారలై; తుష్టాః = తాముసంతుష్టినొందినవారలై; గురుణా = తమఅజ్ఞాన అంధకారమును పోగొట్టినట్టి; శ్రీధరేణ = లక్ష్మిని ధరించిన శ్రీకృష్ణస్వామివారిద్వారా; ఆప్త = పొందబడిన; కామాః = కోరికలుగలవారై; ఇహ = ఈ వనభువియందు; చిరం = చాలాకాలమువఱకు; స్వైరం = స్వేచ్ఛగా; రమంతే = ఆనందింపుచున్నారు

శ్రీకృష్ణలీలా తరఙ్గణిలో శ్రీకృష్ణరాసక్రీడా వర్ణనము అనుపేరుగల సప్తమ తరఙ్గము సమాప్తి.

ఇట్లాగోపికలు అంగ ప్రత్యంగములచేతను, గౌణ ముఖ్య భేదముల చేతను సమ విషమ ప్రకారములచేతను, వ్యంజకముల ( అభినయముల) నుపయోగించి, వానిమూలమున శృంగారాది నవరసములను బాగుగ నభినయించుచుండిరి. దీనిచే నారాసక్రీడా మహోత్సవమున శ్రీకృష్ణుఁడు మిగుల సంతసించె. వారును ( ఆగోపాంగనలును) తమకోర్కులునిండ తత్త్వోపదేశకుఁ డగు నా నారాయణునిగూడి మిగుల సంతోషమును జెందుచుండిరి.

ఇది సప్తమతరంగము.

## అష్టమ తరఙ్గము ప్రారంభము

శ్లో. అష్టమే గోపికాగీతం ఆదరేణాభినీయతే,
గోపీభిస్సహ కృష్ణస్య రహస్యగమనం వనే.
అంతర్ధానం చ కృష్ణస్య తతో గోపీప్రలాపనం,
కృష్ణస్యాన్వేషణం భూయస్తాసాం శ్రీకృష్ణదర్శనం
ఏతచ్చరిత్ర మధునా సంగృహీతం హరేః కృతమ్

శ్లో. 1-2. అష్టమే = అష్టమ తరంగమునందు; గోపికాగీతం = గోపికలుచేశిన శ్రీకృష్ణగానము; ఆదరేణ = భక్తిపూర్వకముగా; అభినీయతే = వర్ణింపబడుచున్నది; వనే = వనమునందు; గోపీభిః సహ = గోపికలతోగూడా; శ్రీకృష్ణస్య = శ్రీకృష్ణస్వామివారు; రహస్య ఆగమనం = ఇతరులకు తెలియకుండా వచ్చుటయున్నూ; అంతర్ధానం చ కృష్ణస్య = స్వామివారు కనపడక పోవుటయున్నూ; తతః = అనంతరం; గోపికా ప్రలాపనం = గోపికలు విలపించుటయున్నూ; భూయః = మాటిమాటికి; కృష్ణస్య అన్వేషణం = శ్రీకృష్ణస్వామివారిని (గోపికలు)( వెదుకుటయున్నూ; తాసాం = ఆగోపికలకు; భూయః = మరల; శ్రీకృష్ణదర్శనం = శ్రీకృష్ణస్వామివారు దర్శనమిచ్చుటయున్నూ; ఏతత్ హరేః చరిత్రం = శ్రీకృష్ణస్వామివారియొక్క ఈ కథను; అధునా = ఇప్పుడు; సంగృహీతం = సంగ్రహము అగునట్లుగా; కృతం = చేయబడినది.

ఈ యెనిమిదవతరంగమున గోపీకాగీతలు వర్ణింపఁబడుచుండును. శ్రీ కృష్ణుఁడు గోపికలతోఁగూడి రహస్యముగ బృందావనమునకు వచ్చుటయు, కొంతసేపు వారలతో విహరించి యంతర్ధానము నొందుటయు, గోపికలు, విలపించుటయు, శ్రీకృష్ణుని వెదకుటయు , మరల నొక్కచో నమ్మహాత్ముఁడు పొడగాంచుటయు అనునది ఇందలి కథాసంగ్రహము.

శ్లో. ఆనందంనందయంతం హృదయగతమవిద్యాశ్రయంనాదగమ్యం
ప్రాణాదీన్ షోడశారాన్వితరథచరణస్యార్పితన్నాభిదేశే,
ఆకాశాదీంశ్చసర్వాన్నిజపరికలయాజృంభితాన్మాయయా తం
గోపీమ ధ్యేముకుందంవ్రజపురవనితా కాపిగాయత్యుదారం.

శ్లో3. ఆనందం = ఆనంద స్వరూపుఁడున్నూ; హృదయగతం = హృదయస్థమై; అవిద్యా ఆశ్రయం = అజ్ఞానముతో (ప్రకృతి) కూడుకున్నట్టి (జీవస్వరూపము); నన్దయంతం = ఆనందింపజేయువాడున్నూ; నాదగమ్యం = నాదములచేత పొందబడదగినవాడున్నూ; మాయయా = తనదివ్య సంకల్పరూపజ్ఞానముచేత; నిజపరికలయా = తనయొక్క తేజరూపమగు కళచేతనున్నూ, షోడశ అర = పదహారు ఆకులు - అనగా దశవిధేంద్రియములు అనగా త్వక్కు, చక్షు, శ్రోత, జిహ్వా అఘ్రాణములు; వాక్కు, పాద, పాణి, పాయు, ఉపస్థలు పంచతన్మాత్రలు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు మనస్సు ఇవన్నియు కలిసి - 16 దళములతో; అన్విత = కూడియుంటున్నటువంటి; రథ చరణస్య = చక్రముయొక్క; నాభిదేశే = మధ్యభాగమునందు; అర్పితాన్ = చేర్చబడిన; ప్రాణాదీన్ = పంచప్రాణములున్నూ; ఆకాశాదీంశ్చ = ఆకాశాది పంచభూతములున్నూ; సర్వాన్ = ఈ అన్నింటిని; జృంభితాన్ = విస్తరింపజేసినట్టి; తం ముకుందం = ఆశ్రీకృష్ణస్వామివారిని; గోపీమధ్యే = గోపికలమధ్య భాగమునందు; కాపి = ఒకానొక; వ్రజపురవనితా = గోపికాస్త్రీ; ఉదారం = అడ్డులేకుండా; గాయతి = గానము చేయుచున్నది.

పరమానందస్వరూపుఁడై, హృదయకమలమునందున్న వాఁడును, అవిద్య నాధారముగఁ జేసికొని హిరణ్యగర్భుఁడు ( ఈతఁడే సమష్టిజీవుఁడు) మొదలగు సూక్ష్మపదార్థములను స్థూలభూతములు, ఇంద్రియములు మొదలగు భోగ సాధనములను నిర్మించెను. ఈ పదియాఱుకళలును హిరణ్యగర్భుఁడు , శ్రద్ధ, భూతములైదు, జ్ఞాన, కర్మరూపమగు ఇంద్రియము, ( ఇందు పది ఇంద్రియము లును జేర్పఁబడియున్నను సామాన్యమగు యింద్రియశబ్దము ప్రయోగింపబడి యుండుటచే ఒక కళక్రిందనే లెక్కించుకొనవలయును.) మనస్సు, ( వేదాంతమతములో నిది ఇంద్రియముగాదు. అని కూడ నొకపక్షముగలదు.) అన్నము,వీర్యము,తపస్సు,వేదములు, కర్మ,పుణ్య పాపఫలముల ననుభవించుటకు లోకములు, సర్వలోకములందుండువారలకును నామధేయములు. ఈ పదియాఱును, పాపకర్మఫలముల నధోలోకములందును, మిశ్రకర్మఫలముల మనుష్యలోకమునందును అనుభవితురని తెలిసికొనవలయును ) మాయాప్రభావమువలన శ్రీకృష్ణునియందే నిలుపఁబడి, ఒక చక్రముయొక్క బొడ్డు నందు ఇముడ్పఁబడిన పదియారాకులవలె నున్నవి.వాని కన్నిటికిని అభివృద్ధిని గల్గింపుచునుండు సర్వపరిపాలకుఁడుగూడ నీయనయే. ఇట్లు షోడశకలాత్మకమగు సకలప్రపంచమునకును, సృష్టి , స్థితి, సంహారకర్తయగు నారాయణుఁడు మన ( గోపికల) మధ్యమున నిలిచి విహరించుచున్నాఁడుగదా, యని యొకగోపిక పరమానందముతో గానము చేసెను.

## 1వ కీర్తన - ఆహిరీరాగము - ఆదితాళము

ప॥ భావయే సఖి హే
భావయే సఖి భావదృశమీశం

అ॥ మధురిపు మిహ రాసభువి విహరంతం
మాధవ మింద్రియాదిషు వసంతం

1. దినకరమండలగం సుతపంతం
విశ్వతనుం విషయాదిషు సంతం

2. సకలవిషయ మనుభవతి య దేకం
యత్ర తదా నిజ మేతి సదా కం

3. పవనగత మఖిలకారణ మాదిం
ప్రాణతయా పరిపీత మనాధిం

4. య మవధి లయ మనుయాతి తు తారం
తం పర మవ్యయ మాగమసారం

5. అర మివ రథచరణస్య పినద్ధం
యత్రకలానియమేన సుసిద్ధం

6. నిగమవిచారజనిత మతిగమ్యం
జన్మలయాదివిహిత మతిరమ్యం

7. అభినవజలధరసుందర దేహం
వారితగోపవధూజనమోహం

8. హరిగురుపరిజ.నహృదయవినోదం
నారాయణ తీర్థ ఫణితమి హేదం

ప. హేసఖీ = ఓ చెలీ!; భావదృశం = జ్ఞాననేత్రము కలిగినటువంటిన్నీ అగుకృష్ణుని; భావయే = ధ్యానము చేయుచున్నాను.

అ.ప. ఇహ = ఇక్కడ; రాసభువి = రాసమండల ప్రదేశమునందు; విహరంతం = విహరించుచున్నట్టి; మధురిపుం = మధుసూదనుడైనట్టి; ఇంద్రియాదిషు = ఇంద్రియములయందు; వసంతం = వేంచేసియున్నట్టి; మాధవం = శ్రీకృష్ణస్వామిని; భావయే = ధ్యానము చేయుచున్నాను.

1. దినకరమండలగం = సూర్యమండలమధ్యగతమై; సు తపంతం = బాగా ప్రకాశముగలిగినట్టిన్నీ (తపింపచేయునట్టిన్నీ); విశ్వతనుం = విశ్వము యావత్తు తన శరీరముగా నుండువాడున్నూ; విషయాదిషువసంతం = శబ్దాది విషయములయందు అంతర్యామిగా నుండునట్టి శ్రీకృష్ణస్వామివారిని; భావయే = ధ్యానము చేయుచున్నాను.

2. యత్ ఏకం = ఏవస్తువు అయితే ఏకస్వరూపముగావుండి, జ్ఞానస్వరూపముగానుండి; యత్ర = ఏపరబ్రహ్మమునందు వున్నదియై; సకల విషయం = అన్నివిషయములను; అనుభవతి = అనుభవించుచున్నదో; తదా = ఆప్రకారముగానే - పారాంతరము తథా = సుషుప్తికాలమునందు; నిజంకం = స్వరూప ఆనందమను; సదా = ఎల్లప్పుడు; ఏతి = పొందుచున్నాడో - అట్టి శ్రీకృష్ణుని; భావయే = ధ్యానము చేయుచున్నాము.

3. పవనగతం = వాయువుకు అంతర్యామిగా నుండువాడున్నూ; అఖిలకారణం = సకల జగత్తుకు కారణముగా నుండువాడున్నూ; ఆదిం = ఆదిపురుషుడున్నూ; ప్రాణతయా పరిపీతం = ప్రాణస్వరూపుడుగా శరీరమంతటను వ్యాపించియుండువాడున్నూ; అనాదిం = ఆదిలేనివాడున్నూ అగు శ్రీకృష్ణస్వామిని; భావయే = ధ్యానము చేయుచున్నాను.

4. తారం = నాదరూపమైనధ్వని; యం అవధి = ఏ పరబ్రహ్మమును అవధిగా జేసుకొని; లయం అనుయాతి = లీనత్వమును పొందున్నవో; తు = పాదపూరణం; పరం = సమస్త జగత్తుకు విలక్షణమైన (అతీతమన); అవ్యయం = ఏమార్పులేనట్టి; ఆగమసారం = సమస్తవేదసారమైనట్టిన్నీ; తం = ఆ శ్రీకృష్ణుని; భావయే = ధ్యానించుచున్నాను.

5. రథచరణస్య = రథచక్రముయొక్క; అరం ఇవ = ఆకువలెనే; యత్ర = ఏ పరబ్రహ్మమునందు; కళా = పదహారు కళలను (అనగా దశవిధ ఇంద్రియములున్నూ పంచన్మాత్రలు, మనస్సు కలసిపదువారున్నూ); నియమేన = చెదిరిపోకుండా; పినద్ధం = బిగింపబడియున్నవో; సుసిద్ధం = అట్టి ప్రత్యక్ష స్వరూపుడైన స్వామివారిని; భావయే = ధ్యానింపుచున్నాను.

6. నిగమ = వేదార్థముయొక్క; విచార = విచారణచేత (పరామర్శచేత); జనిత = కలిగినట్టి; మతి = బుద్ధి నిశ్చయముచేత; గమ్యం = పొందబడదగినట్టిన్నీ; జన్మ = జన్మయున్నూ; లయ = మరణమున్నూ; ఆది = మొదలైనట్టి; రహితం = లేనట్టిన్ని; అతిరమ్యం = విశేష ఆనందప్రదమైనట్టిన్నీ (శ్రీకృష్ణస్వామివారిని); భావయే = ధ్యానింపుచున్నాను.

7. అభినవ = కేవలం నూతనమైన; జలధర = మేఘములవంటి; సుందరదేహం = సౌందర్యమైన శరీరము ధరించినవారున్నూ; వారిత = నివారింపబడిన; గోపవధూజన = గోపకాంతలయొక్క; మోహం = అజ్ఞానముగలవారున్నూ -అనగా వారి అజ్ఞానమును నివర్తిచేసిన వారున్నూ; భావయే = ధ్యానింపుచున్నాము.

8. హరి = హరియొక్కయున్నూ; గురు = గురువులయొక్కయున్నూ; హృదయ = మనస్సులను; పరిజన = శ్రీవారియొక్క పరివారముయొక్కయున్నూ (హరిదాసులయొక్కయున్నూ); వినోదం = సంతోషింపజేయునట్టి; ఇదం = ఈకీర్తన; ఇహ = ఇక్కడ; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారిచేత; ఫణితం = చెప్పబడినది

ప. ఓచెలీ ! జ్ఞానస్వరూపుఁడును , సర్వసాక్షియు నగు పరమేశ్వరుని ధ్యానించెదను.

అ. ఇంద్రియములు మొదలగువానియందు అంతర్యామి స్వరూపుఁడై యున్న శ్రీమన్నారాయణుఁడే, యిచట మనతో రాసక్రీడలు సల్పుచున్నాఁడు.

1 శబ్దము మొదలగు సకలవిషయములందును నిలిచి, సర్వజగన్మయుఁడయ్యు ప్రత్య క్షముగ సూర్యబింబమునందు ననిలిచి ప్రకాశించుచున్నాఁడు.

2. ఈ శ్రీకృష్ణుఁడే జీవాభిన్నుఁడగుటచే సకలవిషయముల ననుభవించు చున్నాఁడు. ఈ మహాత్ము నాశ్రయించినవారలకు గాని సర్వోత్తమమగు నాత్మానందము దొరకదు

3. ఈ హరియే సకలమునకు కారణభూతుఁడు. అనాదిస్వరూపుఁడు. ఈమహాత్ముఁడు వాయురూపుఁడై నిట్టూర్పుమూలమున సకల జీవుల చేతను ఆకర్షింపఁబడుచున్నాఁడు.

4. సకల వేదసారభూతుఁడగు నీనాశరహితుని గూర్చియే ఓంకారము చెప్పుచున్నది. ఈయన యందే లయమగుచున్నది.

5. ఎప్పటికిని ఏవిధమగుమార్పునుగాని చెందక ఏకస్వరూపముతో నుండు నీగోవిందునియందు పదియాఱుకళలును నిలుపఁబడి చక్రముయొక్క నాభియందు స్థాపింపఁబడిన పదియాఱాకులవలె నున్నవి. ( ఆకులకు కుండ యెట్లాధారమో అట్లే ఈ పదియాఱుకలలకును అనగా సకల ప్రపంచమునకును పరబ్రహ్మమే యాధారమనుట.

6. జన్మ, మృత్యువులు లేని యీ మనోహరస్వరూపుఁడు ( చిత్తశాంతి నొసంగువాఁడనుట) వేదాంతవాక్యములఁ బలుమాఱు విమర్శించిన ( మననము చేసిన యనుట ) వారలకుఁగాని గోచరింపఁడు.

7. అట్టి ఈ భగవంతుఁడు నీల మేఘశ్యామలమగు సుందరాకారముతో విహరించుచు మన ( గోపికల ) యజ్ఞానము నెల్లస్వయముగఁ బోఁగొట్టినాఁడు.

8. శ్రీహరియను పేరుగల గురువరుని నాశ్రయించిన వారలకు సంతసము నొసంగుచున్నాఁడు. ( దీనిచే నారాయణ తీర్థయతికి గురువగు హరితీర్థుల ప్రభావము దెల్పఁబడినది) ఈగీతమును నారాయణతీర్థుఁడు రచించెను.

శ్లో. సర్వప్రత్యంచమేకంప్రకృతి మఖిలభావంస్వయంభాసయన్తం
నిత్యానందస్వభావంసకల హృదయగంవ్యోమవన్ని ర్వికారం,
ఆచార్యస్యప్రసాదాద్విదురిహమున యోవేదభాగేముకుస్దం
నృత్యంతీ గాయతీతి వ్రజపురవనితాభక్తసంకల్పసిద్ధమ్.

శ్లో.4 సర్వ ప్రత్యంచ = సర్వప్రపంచమునకు అతీతుడైనట్టిన్నీ; ఏకం = అద్వితీయుడైనట్టిన్నీ; అఖిలభావం = అనేకరూపములుగా పరిణమించినట్టిన్నీ; ప్రకృతిం = ప్రకృతిని; స్వయంభాస యంతం = తాను స్వయముగా ప్రకాశింపచేయునట్టిన్నీ; నిత్యానందస్వభావం = ఎల్లప్పుడున్నూ ఆనందమే స్వభావముగా గల్గినట్టిన్నీ; సకల హృదయగం = సర్వభూతహృదయములను; వ్యో = పొందియున్నట్టిన్నీ; వ్యోమవత్ = ఆకాశమువలె; నిర్వికారం = వికారరహితుడు అయినట్టిన్నీ; ముకుందం = స్వామివారిని; మునయః = మహామునులు; అచార్యప్రసాదాత్ = ఆచార్య కటాక్షము వల్లనున్నూ; వేదభాగే = వేదాంతముయొక్క ప్రమాణమునుబట్టి; విదుః = తెలుసుకొనుచున్నారు; వ్రజపురవనితా = గోకులస్త్రీలు; భక్త = భక్తులయొక్క; సంకల్ప = సంకల్పములను; సిద్ధం = సిద్ధింపచేయునట్టి స్వామివారినిగూర్చి; ఇహ = ఈ బృందావనమందు; నృత్యంతి = నృత్యము చేయుచున్నాడు; ఇతి = ఈక్రింద చెప్పబోవు విధముగా; గాయంతి = గానము చేయుచున్నారు.

మౌనులుకూడ వేదాంతశాస్త్రమును బాగుగ విమర్శించి,సద్గురుని యనుగ్రహమును బడసినఁగాని, ఈశ్రీకృష్ణుని యథార్థతత్వమును గాన లేరు. ఈయన యద్వితీయుఁడు . సకల ప్రపంచమునకును ఉపాదానకారణము.( మట్టి కుండయైనట్లు కార్యరూపమున పరిణామమును చెందుకారణ ముపా దానకారణమనఁబడును.) సకలపదార్థములను ప్రకాశింపఁజేయు జ్ఞానంబును, ఆనందంబును ఇమ్మహాత్ముని స్వరూపములు. వికారమలు గలవారివలెఁ గాన వచ్చు నీ జీవులందఱును ఈయనకంటె వేఱుకాదు. ఇట్లుసకలప్రపంచ మయుండైనను , సకలజనుల హృదయములందు నివసించుచున్నను ఈయనకుఁ బ్రపంచసంబంధములగు వికారము లేవియు నంటవు. సర్వపదార్థములయందు నుండియు నందలి వికారములతో సంబంధపడక వాకాశ మెట్లు నిర్మలముగ నిలచియుండునో యట్లే యీభక్తరక్షకుండును నిలిచియుండును. అనియొక గోపిక నృత్యపూర్వకముగ గానముచేసెను

## 2వ కీర్తన (వరాళి) ముఖారి - ఆదితాళము

ప. శ్రీనిలయం సఖి శ్రీనిలయం
దీమహీ గోపీమానసనిలయం

1. గగనపవనముఖభూతనిధానం
ప్రియతమ మాగమమృగిత మిహైనం

2. యదభిసృజతి జగ దవతి పునాతి
గ్రసతి చిదాత్మతయా సువిభాతి

3. దివ్యతను మజర మమర మసంగం
అంతర్బాహ్యతతం జగదంగం

4. అనుకలిత శ్రుతివాచ మధీశం
దినకరశశధరలోచన దేశం

5. విశ్వహృదయ మవనీపద మాదిం
ప్రాణతయా పరిపీత మనాది

6. విశ్వనగరవరరాజ మరాజం
వివిధకలాకృతజీవసమాజం

7. ముహు రపరపరం బృంహితభావం
నిజకలయాపరిహృతభవభావం

8. వ్రజయువతీజనకృతపరిహాసం
వనభువి మునివరహృదయనివాసం

9. బుధజనమానసమండనభూతం
ఇదమిహ నారాయణతీర్థగీతం

ప. సఖీ!; గోపీమానస నిలయం
శ్రీనిలయం = (సమస్త సంపదలకు ఉనికిపట్టు అయినటువంటి) లక్ష్మి అమ్మవారికి ఉనికిపట్టు అయినటువంటి శ్రీకృష్ణస్వామివారిని; ధీమహి = ధ్యానము చేయుచున్నాము.

1. గగన = ఆకాశము; పవన = గాలి; ముఖ = మొదలగు; భూత = పంచభూతములకు; నిధానం = ఆధారముగా నుండునట్టి స్థానముగా నుండువాడున్నూ; ప్రియతమం = ప్రేమాస్పదుడైనట్టిన్నీ; అగమ మృగితం = వేదములచేత వెదకబడుచుండునట్టి; ఏనం = ఈస్వామివారిని; ఇహ = ఇక్కడ; ధీమహి = ధ్యానముచేయుచున్నాను.

2. యత్ = ఏపరతత్త్వము; జగత్తు = జగత్తును; అభిసృజతి = సృష్టించుచున్నదో; అవతి = పాలించుచున్నదో; పునాతి = పవిత్రముచేయుచున్నదో; గ్రసతి = లయము చేయుచున్నదో; చిత్ = జీవాత్మయందు; ఆత్మతయా = అంతర్యామిగా; సువిభాతి = లెస్సగా ప్రకాశించుచున్నదో - అట్టిస్వామిని; ధీమహి = ధ్యానము చేయుచున్నాను.

3. దివ్యతనుం = లీలార్థముగా ధరించబడిన శరీరముగలవారున్నూ; అజరం = ముదిమిలేనివారును; అమరం = మృత్యువులేనివారును; అనంగం = విషయలోలత్వములేనివారున్నూ; అంతర్బాహ్యతతం = లోపల వెలుపల నిండియుండువాడున్నూ; జగదంగం = జగత్తు శరీరముగాగలవాడున్నూ -అగుస్వామివారిని; ధీమహి = ధ్యానము చేయుచున్నాను.

4. అనుకలిత = తనను ప్రతిపాదించునట్టి; శ్రుతివాచం = వేదవాక్యములు కలవారున్నూ; అధీశం = సర్వజగత్తును అధిష్ఠించి నియమించువారున్నూ; దినకర, శశిధర, లోచనదేశం = సూర్యచంద్రులు నేత్రములుగా గలవారున్నూ -అగు స్వామివారిని; ధీమహి = ధ్యానము చేయుచున్నాను.

5. విశ్వహృదయం = జగత్తుకు తల్లివంటివాడున్నూ; అవని వరం = భూమికిభర్త అయినటువంటివాడున్నూ; ఆదిం = ఆదిపురుషుడున్నూ-అనగా సృష్టికి పూర్వమునుండియున్నవాడున్నూ; ప్రాణతయాపరివీతం = సమస్త భూతములయందు ప్రాణస్వరూపుడుగా వ్యాపించి యున్నవాడున్నూ (సమస్త ఇంద్రియములందు వ్యాపించి యుండువాడున్నూ; అనాదిం = పుట్టువులేనివాడున్నూ -అగు; శ్రీనిలయం = శ్రీకృష్ణస్వామివారిని; ధీమహి = ధ్యానము చేయుచున్నాను.

6. విశ్వ నగరవరరాజం = ప్రపంచమనునట్టి శ్రేష్టమైన పట్టణమును రంజింపచేయువాడున్నూ (అధ్యక్షుడున్నూ); అరాజం = తనపై ప్రభువు లేనివాడున్నూ; వివిధ = అనేకములైన; కలా = తేజస్సు మొదలైన తన అంశముచేత; కృత = జ్ఞానప్రసరణకలవారిని చేయబడినట్టి; జీవసమాజం = జీవాత్మ సముదాయముగలవారున్నూ-అగు; శ్రీనిలయం ధీమహి = శ్రీకృష్ణుని ధ్యానము చేయుచున్నాను.

7. ముహుర్ముహుః = మాటిమాటికి; అపర = అపర ప్రకృతినిన్ని; బృంహిత = విస్తరింపచేసినట్టి; భావం = స్వభావముగలవారున్నూ; అపరప్రకృతి = పంచభూతములు (పృధివి, ఆపః,తేజో, వాయు, ఆకాశాత్ ఈ అయిదు మనో, బుద్ధి, అహంకారము - ఈ మూడును కలిసి ఎనిమిది అష్టప్రకృతియగును.

*ఉదాహరణకు భగవత్ గీత శ్లోకము :-*

శ్లో॥ భూమి రాపోనలోవాయుః
ఖంబుద్ధి మనోరేవచ
అహంకార ఇతీయమ్మే
భిన్నా ప్రకృతి రష్టథా ॥

పరప్రకృతి = జీవాత్మ (భ.గీ.శ్లో॥ 'అపరేయం ఇతి'); నిజకలనయా = తన స్వకీయమైన ఆధ్యాత్మిక విద్యచేత; పరిహృత = పోగొట్టబడిన; భవ భావం = సంసార బంధముగలవాడున్నూ - అగు; శ్రీనిలయం ధీమహి = శ్రీకృష్ణుని ధ్యానము చేయుచున్నాను.

8. వ్రజయువతీజన = గోకుల స్త్రీజనముచేత; కృత = చేయబడిన; పరిహాసం = అపహాస్య హేళనాదులు కలవారున్నూ; వనభువి = గోకులబృందావనమందుండు; మునివర = మునిశ్రేష్ఠులయొక్క; హృదయ = హృదయములయందు; నివాసం = నివశించియుండువాడున్నూ - అగు; శ్రీనిలయంధీమహి = శ్రీకృష్ణుని ధ్యానము చేయుచున్నాను.

9. బుధజన = విద్వాంసులయొక్క; మానస = మనస్సులను; మండనభూతం = అలంకరింపజేయువాడున్నూ (మనస్సులకు అలంకారముగా నుండువాడున్నూ); ఇదం = ఈ కీర్తన; ఇహ = ఇక్కడ (ఈసందర్భమునందు); నారాయణతీర్థగీతం = (నారాయణతీర్థులవారిచేత గానము చేయబడినది)

ప. ఓచెలీ ! లక్ష్మీనివాసుఁడయ్యును మన ( గోపికల ) హృదయ పద్మము లందు విహరించుచుండు నీ సంపత్కరుని ధ్యానింతము

1 వేదాంతవేద్యుఁడై, ఆకాశాదిపంచభూతముల కాధారమైయున్న యీశ్రీకృష్ణుఁడు మనలకు ప్రియుఁడైనాఁడు

2 జ్ఞానస్వరూపముతోఁ బ్రకాశించుచున్న ఈ భగవంతుఁడే సకల ప్రపంచముల సృజించును రక్షించును. కష్టములనుండి యుద్ధరించును .పవిత్రము చేయును ప్రళయకాలమున సకలమును సంహరించును.

3. జరామరణములు లేనివాఁడయ్యును, దేనితోను సంబంధపడనివాఁ డయ్యును, ఈకృష్ణుఁడు ప్రపంచమయమగు దివ్యమంగళవిగ్రహముతో రాజిల్లుచున్నాఁడు.

4. చంద్రసూర్యులే నేత్రములుగాఁ గల యీ సకలేశ్వరుఁడు మొట్ట మొదట వేదములను వచించెను.

5. సకలమునకును తాను మొదలై, తనకు మొదలు లేక రాజిల్లువాఁడును వాయురూపుఁడై సర్వజనులచేతను శ్వాసరూపమున నాకర్షింపఁబడుచు, కరుణారసముచే సకలలోకములను తల్లివలెఁ గాపాడుచున్నాఁడు. (హృదయ= తల్లీం హృదయం జీవితే చిత్తే వక్షస్యపిచ మాతరి." అని నిఘంటువ.)

6. ఈ ఘనుఁడు తన యంశముచే జీవులను నిర్మించి, ప్రపంచమును విస్తరింపజేసి, యా జగద్రాజ్యమునకు ప్రభువై పరిపాలించుచున్నాడు. ఈయన ప్రభు వెవ్వఁడును లేఁడు.

7. ఈ హరి సర్వవ్యాపకుఁ డగుటచే పరబ్రహ్మమనియు, ఈ సమస్త మునకంటె నుత్తముఁడుగుటే పరాత్పరుండనియుఁ జెప్పింపబడుచున్నాడు. ఇమ్మహాత్ముని యనుగ్రహలేశము గలిగిన సకలసంసారబంధములును తొలిగించి పోవును.

8. మునలహృదయములందు నివచించు నామాధవుండు బృందావనమున మనలతో జేరి విహరించుచు, పరిహారవాక్యములచే (మనల) నానందింప జేయుచేన్నాఁడు.

9. ఈయన జ్ఞానులమనంబులకు నలంకారభూతుడై యున్నాడు. (శరీరమునకు సౌందర్యము కలుగుటకై భూషణములు నెట్లు ధరింతురో, అట్లే తమ మనుస్సులకు సౌందర్యము, అనంగా నిర్మలత్వము కలుగుటకై వారినిధ్యా నించుచున్నారు, అని భావము.) ఈ గీతమును నారాయణతీర్థుఁడు రచించెను.

శ్లో. ఇతి గోప్యః పరానందం గాయాంత్యస్తాః పృథక్ పృథక్.
అపరాః శ్రుతయో భూయోభూయ స్తత్రైవ సంగితాః

శ్లో 5. ఇతి = ఈవిధముగా; తాఃగోప్యః = ఆగోపికలు; పరానందం = శ్రీకృష్ణస్వామివారినిగూర్చి; అపరా శృతయః = రెండవ వేదములా యనునట్లుగా ; పృథక్ పృథక్ = వేరువేరుగా; గాయంత్యః = గానము చేసినవారై; భూయః భూయః = మాటిమాటికి; తత్రైవ = ఆస్వామివారియందే; సంగతాః = చేర్చబడిన మనస్సుగలవారైరి.

ఇట్లుగోపికలు పరామానందస్వరూపుండుగునాశ్రీకృష్ణునిఁ బ్రత్యేకముగ బాడుచు స్త్రీరూపమును దాల్చి క్రొత్త వేదములవలె పలుమారాయననే జుట్టుకొనుచుండిరి. (వేదములపక్షమున ఆ హరినిగూర్చి చెప్పుటయే యాయానను జుట్టుకొనుచుండిరి.)

## శ్రీకృష్ణుని అంతర్ధానము

శ్లో. కదాచి ద్గోవిందే గతవతి పరానందసదనం
నిరాకారం ధామ స్వకమితి చ విజ్ఞాపయతి తాః
తదాకారం సాక్షా త్పర మధిగతాః కృష్ణరసికాః
పునస్తం గాయంత్యో రహసి మృగయంతి ప్రియతమమ్.

శ్లో 6. కదాచిత్ = ఒకానొకప్పుడు; గోవిందే = శ్రీకృష్ణస్వామివారు; పరానంద సదనం = బ్రహ్మానంద స్థానమైన స్వరూపమను; గతవతి =పొంది (అంతర్ధానమునొంది); స్వకం ధామ = తన స్వకీయ స్థానము; నిరాకారం-ఇతి = ప్రకృతి ఆకారంలేనిది అని; తాః = ఆ గోపికలను గూర్చి; విజ్ఞాపయతి చ= సూచనయున్నూ చేయగా; తదాకారం = సాక్షాత్పరం; పరం = ప్రకృతికి అతీతమైన; సాక్షాత్ = స్వకీయమైన; తదాకారం = అస్వామియొక్క స్వరూపమును; అధిగతాః = పొందినవారై; కృష్ణరసికాః = శ్రీకృష్ణుని దివ్యమంగళరూప ధ్యానరసమును అనుభవించినవారు గనుక; పునః = మరల; తంప్రియతమం = ఆ ప్రేమాస్పదుడైన శ్రీకృష్ణస్వామిని గూర్చి; రహసి = ఏకాంతమునందు; గాయంత్యః = గానముచేయుచూ; మృగయంతి = వెదకుచుండిరి.

ఇట్లు విహరించుచుండ నొకప్పుడు" "ఓ గోపికలారా నానివాసస్థానమున కాకారములేదు. నేనును నిరాకారుడను" అని ప్రకటించుచున్నాఁడో యన, నాశ్రీకృష్ణుఁడు బ్రహ్మానందమున లీనుఁడై యదృశ్యం డయ్యెను. అప్పుడు వారు ఆయనందు పరమానురాగముగలవా రగుటచే నించుకకలతనొంది యమ్మహాత్మరూపమును నొకరికొకరు ప్రకటించుకొనుచు వెదక నారంభించిరి. అప్పుడు వారిట్లని గానము చేసిరి.

## శ్రీకృష్ణ అన్వేషణము

### 3వ కీర్తన - శంకరాభరణము - ఆటతాళము

ప. మృగయత రాధామాధవం ముహురిహనిగమవనేధవం

1 అనుపద మఖిలఫల ప్రదశాఖిషు మృగిత మదృష్ట మనంతం
క్వచిదపిగూఢతయా నిజధామని కృతసుకృతైరనుభూతం

2. యదఖిలదూరతరేపి యదంతిక మాత్మతయా వియదాదిం
అనుగత మధిగత మామపార మనన్య మనోభి రనాదిం

3. స్వయమవగతిరవగంతృనియంతృయదఖిలజనస్య నిరీహం
శ్రవణనయనవచ్చనాదిదురాప మపుణ్యవతాతి దురూహం

4. యదనుమనసిప్రరిధావతిధావతి దూరతయేహ దురంతం
విభుతర మఖిలజనాంతర బాహ్యమఖండచిదాత్మతయా తం

5. యదఖిలభూతనిదాన మద్వైతి తదాత్మత యాత్మని సర్వం
సతతరతిశోకమహోదధిమాశు వివర్జితమానుషగర్వం
6. చలతి జగతియదచంచలమాతత ముపవినిహితజగదండం
ప్రభవతి భవతి పినద్ధ మిదం నిజ మాయిక మేక మఖండం
7. అసురధియామతిదుర్గమమప్రియ మాత్మహనో హి పరం తే
ఇతి నిగమా జగు రేన మపార సుఖైకరసం న భజంతే
8. కువలయదళరుచిరాకృతి మన్య మనోభిరుపాహృతదేహం
గురుకృపయాహృతగోపవధూజనశోక మపాకృతమోహం
9. శ్రుతిశిరసామనుభూషణమద్వయమాత్మరతి ప్రియశేషం
పురరిపుభావరసికవరనారాయణతీర్థఫణిత మదోషం

ముహుర్ముహుః = పలుమారు; ఇహ = ఇక్కడ; నిగమవనే = వేదములనునట్టి వనములయందు; ధవం = మనభర్త అయినటువంటి; రాధామాధవం = రాధాకృష్ణమూర్తిని; మృగయత = వెదకండి.

1. అఖిల = సమస్తములైన; ఫలప్రద = ఫలములనిచ్చునట్టి; శాఖిషు = వేదశాఖలయందు; అనుపదం = ప్రతిపదమును అనుసరించి; మృగితం = వెదకబడుచుండునట్టిన్నీ; అదృష్టం = ఇంద్రియములకు గోచరముకానట్టిన్నీ; అనంతం = అంతములేని స్వరూపము కలిగినట్టిన్నీ; క్వచిదపి = ఒకానొకస్థలమునొందే; గూఢతయా = ఎవ్వరికిన్నీ తెలియబడకుండా; నిజధామని = స్వకీయమైన స్థానమునందుంటూ; కృతసుకృతైః = సుకృతము చేసినవారిచేత; అనుభూతం = అనుభవింపబడుచున్నట్టిన్నీ-అట్టి; రాధామాధవం = రాధకుభర్తయైన మాధవుని; మృగయత = వెదకండి.

2. యత్ = ఏ పరబ్రహ్మము; అఖిలదూరతరేపి = సమస్తమునకు దూరముగా నన్నప్పటికిన్ని; ఆత్మతయా = అంతరాత్మగానుండుటచేత; అంతికం = సమీపమునందే వున్నదే; వియదాదిం = ఆకాశాదిపంచ భూతములను; యత్ = ఏపరవస్తువు; అనుగతం = అనుప్రవేశంగలదైయున్నదో (అధిష్టించియున్నదో); ఆగమసారం = వేదములకు సారభూతమైయున్నదో; అనన్యమనోభిః = అన్యమునందు చేరని మనస్సుగలవారిచేత; అనుగతం = పొందబడునట్టివాడున్నూ; అనాదిం = ఆదిలేనివాడున్నూ అగు; రాధామాధవంమృగయత = రాధారమణుడైన వాసుదేవుని వెతకండి.

3. యత్ = ఏ పరబ్రహ్మము; అఖిలజనస్య = సమస్తజనులయొక్క; అవగతి = జ్ఞానమునున్నూ; అవగంతౄ = జ్ఞాతనున్నూ (అనగా తెలిసికొనువానినిన్ని); నయంతౄ = నియమించునట్టిదిగావున్నదో; స్వయంనిరీహ = స్వయముగా ప్రాకృత వ్యాపారములు లేనివాడున్నూ; శ్రవణ = వినుటచేతను; నయన = నేత్రములచేతనున్నూ; వచనాది = వాక్కుచేతనున్నూ; ఆది = మొదలైనవాటికి; దురాపం = లభించనివాడున్నూ; అపుణ్యతా = పుణ్యములేనివారికి; అతిదురూహాం =అందనివాడున్నూ-అగునట్టి; రాధామాధవం = రాధామరణుని; మృగయత = వెదకండి.

4. యత్ = ఏపరవస్తువ; మనసిపరిధావతి = మనసుపరువెత్తుచుండగా (విషయాసక్తతకాగా); అను = అట్టిమనస్సు ననుసరించి, దూరతయా = మనస్సును అంటక దూరముగానే; ధావతి = పరుగెత్తుచుండునో; ఇహ = ఇక్కడ; దురంతం = అంతములేని వస్తువుగానున్నదో; అఖిలజనా = నవమన్తజనులయొక్క; అంతర = అంతస్సనందు (లోపల), బాహ్యా = వెలుపలనుండువాడున్నూ, అఖండ = తెంపులేని; చిత్ = జీవాత్మయు; ఆత్మతయా = అంతరాత్మగానుండుటచేత, విభుతరం = అన్నిటిని శాసించువాడున్నూ-అయినట్టి; తం = ఆరాధామాధవుని; మృగయత = వెదకండి.

5. యత్ = ఏపరబ్రహ్మము; అఖిలభూతనిధానం = సమస్తభూతములకు ఆదికారణమనిన్నీ; ఆత్మని = తనహృదయమునందు; సర్వం = సర్వజగత్తున్నూ; తదాత్మయా = ఆపరబ్రహ్మయే అంతరాత్మగా నుంటున్నాడని; అవయితి = ఎవరైతే తెలుసుకొనుచున్నారో; సః = అట్టిజ్ఞాని; వివర్జిత మానుషగర్వం = నేను మనుష్యుడను అను గర్వమును వర్జించినవాడై; శోకమహోదధిం = దుఃఖసముద్రమును; ఆశు = తొందరగా; తరతి = దాటుచున్నాడో - అట్టిరాధా మాధవుని; మృగయత = వెదకండి.

6. జగత్ = జగత్తు; చలతి = చలించుచుండగా; యత్ = ఏపరబ్రహ్మ; అచంచలం = చంచలములేనిదై; అతతం = జగత్తునందు వ్యాపించినదై; ఉపవినిహిత = తనయందే వుంచుకొనబడిన; జగదండం = బ్రహ్మాండముగలవాడున్నూ; ప్రభవతి = పుట్టుచున్నది; భవతి = వృద్ధియగుచున్నట్టి; పినద్ధం = మూయుచున్నట్టి; ఇదం = ఈజగత్తు; నిజమాయికం = తన మాయవల్ల ఉత్పత్తిచేయువాడున్నూ; ఏకం = ఏకస్వరూపుడున్నూ; అఖండం = అఖండస్వరూపుడున్నూ-అయినటువంటిరాధామాధవుని; మృగయత = వెదకండి.

7. అసురధియాం = రాక్షసస్వభావముగలవారలకు - ఆస్వామివారు; అతి దుర్గమం = కేవలం పొందబడ నశక్యులు; అప్రియం = ప్రేమ విషభూతులుకానివారు (ప్రేమలేనివారు); తే = అట్టివారలకు; పరం = మిక్కిలి; ఆత్మహనోహి = ఆత్మహత్య చేసుకున్నవారుగావున్నారు; ఇతి = ఇట్లని; నిగమ = వేదములు; జగుః = చెప్పుచున్నవి; అపార సుఖైకరసం = అంతులేని సుఖమే ముఖ్యమైన రసముగా గలిగినట్టి; ఏనం = ఈస్వామివారిని; నభజంతే = అట్టివారు భజించరు -అట్టి రాధామాధవం; కలయత (మృగయత) = సేవించండి (వెదకండి)

8. కువలయదళరుచిరాకృతి - కువలయదళ = కలువరేకులవంటి; రుచిర = మనోహరమైన; అకృతిం = రూపముగలవారున్నూ; అనన్యమనోభిః = ఏకమనస్సుచేత; ఉపాహృత = ధ్యానము చేయబడుచుండు; దేహం = దివ్యమంగళ విగ్రహముగలవారున్నూ; గురుకృపయా = శ్రేష్ఠమైన దయచేత; హృత = హరింపబడిన; గోపవధూజనశోకం = గోపికా అమ్మవారలయొక్క దుఃఖముగలవారున్నూ (గోపికలయొక్క శోకమును హరించేవారున్నూ); అప్రాకృత మోహం = మోహమును కొట్టివేసేవారున్నూ (అట్టిరాధాకృష్ణుని); మృగయత = వెదకండి.

9. శ్రుతిసారం = సర్వఉపనిషత్తులకు; అనుభూషణం = అనురూపమైన భూషణమువంటివాడున్నూ; అద్వయం = అసమానుడున్నూ; ఆత్మరతి = ఆత్మానందమునందు; క్రియ = ఇష్టము కలిగిన భక్తులకు; శేషం = పరాధీనముగా నుండువాడున్నూ; మురరిపుభావ = విష్ణుభక్తి భావముయొక్క; రసికవర = రసములు తెలిసినవారిలో శ్రేష్ఠుడైన; నారాయణతీర్థం = నారాయణతీర్థులవారిచేత, ఫణితం = చెప్పబడినకీర్తన; అదోషం = దోషరహితమై యున్నది. కాబట్టి; రాధామాధవం = రాధాకృష్ణుని; మృగయత = వెదకుదము.

ప. ఓ చెలురాలా! వేదములని యెడు నరణ్యమున పరబ్రహ్మమగు కష్ణుఁడు విహరించుచుండుచే, వేదత్యులమైన యీబృందావనమున అనియు నర్థము చెప్పవలెను) మన ప్రియుండగు రాధాకృష్ణుని వెదుకుఁడు.

1. ఆయన అంతర్థానమునొందిన తక్షణమే యీఫలవృక్షముల చెంత వెదకితిమి కదా. అచ్చట గానరాలేదు. ఇక నేస్థలమున దాగియున్నాఁడో భాగ్యవంతులైన వారులకుంగాని దొరకడు. (కర్మలు మొదలగువానిని బోధించి నానా విధములగు ఫలముల గలిగించి వేదశాఖల నెంత విమర్శించినను లేక బహువిధ శాఖలుగల వేదముల నెంత విమర్శించిన బ్రాహ్మమును దెలిసికొనుటకు వీలు లేదు. అయన ఇదియుదియని చెప్పరానివరపదమున లీనుఁడై యుండుటచే, అనగా మాయవలనం బ్రకాశింపకుండుటచే పూర్వపుణ్యపరి పాకమువలన నొకానొకనికి ననుభవగోచరుండగును. అని పరమాత్మ పక్షము నందర్థము..

2. ఆ కృష్ణ పరబ్రహ్మముమిగుల దూరమునందున్నను సమీపమునందున్న వాడే. (సర్వాత్మకుండగుటచేత) ఆత్మస్వరూపుడు గావున ఆకాశాది సర్వ ప్రపంచములందునను నిండియున్నాడు. అయినను ఆయనాదిస్వరూపుని, సకల వేదసారభూతుని నిశ్చల చిత్తములతో పరిశీలించువారులుగాని కనుగోనజాలరు"(మనము శ్రద్ధతో వేదికినగాని కానరాడు" అని కృష్ణపక్షమున దాత్పర్యము.)

3. ఏసంకృములును లేవాఁడయ్యును ఆమహాత్ముడు సకల జనుల నియమించుచున్నాడు. తానొక్కడే జ్ఞానస్వరూపముతోను. దానిచే తెలియబడు విషయస్వరూపముతోను, తెలిసికొను పురుషుని స్వరూపముతోను గూడా నున్నాడు. (తెలిసికొనువాడు, తెలియబడునది, తెలివి, చేయువాడు, చేయబడునది,చేయుట; అను త్రిపుటిచే లోకమంతయును నిండియున్నది కావున నీ భేదములన్నియును కల్పితములేగాని వాస్తవములు గావని తెలియజేయుటకై ఈ వాక్యము చెప్పబడియున్నది.)

4. ఈ విభుడు చెవులు, కన్నులు మొదలగు నింద్రియములకు గోచర మగువాడు కాడు తగినంత పుణ్యపరిపాకము లేకున్న ( ఈ పుణ్య పరిపాకమే భగవదను గ్రహమని కూడా చెప్పబడును.) మనస్సుతో నూహించుటకైనా నలవియగువాడుకాడు. (మనభక్తికి మెచ్చి యాయన స్వయముగా దర్శనమిచ్చిన నీవలయునేకాని, మనము వెదకి చూడగలమనుట ఎప్పటికినీ లేదు. మనయదృష్ట మెట్లున్నదో' అని కృష్ణ పక్షమున దాత్పర్యము.)

5. అఖండ విజ్ఞాన స్వరూపుడగుటచే నాయనంతుడు సకల జనులకును లోపల, వెలుపల నిండియుండియును, వ్యాపకములగు నాకాశాదులకంటెఁ గూడా వ్యాపకుండయ్యును, మిగుల దూరమున నున్నాడు. పరుగెత్తిపోవుచున్నాడోయన, మన కెంతదూరముపోయినను దానికి చిక్కడు. (మనసున కగోచరుఁడు అని బ్రహ్మపక్షమునుండు భావము. మనమెంత దూరము వెతికినను కానరాలేదు.

6. సకలభూతములకును కారణభూతుడగు నా మహాత్ముని దెలిసికొని ఈ ప్రపంచమంతయు నాయనకంటే వేఱుకాదని నిశ్చయించినవాడు. సంసార రూపమనే దుఃఖసముద్రమును దాఁటును. నేను మనుష్యుఁడను' అని మొదలగు సహంకారమును విడును. ( మనము విశ్చలమగు చిత్తముతో నాయనను ధ్యానించుచుండిన లేక వెతుకుచుండిన మనదుఃఖము నశింపకుండదు. "అన కృష్ణపక్షమునందు బావము?)

7. అద్వితీయుండును అవయవములు లేనివాఁడును అగు నీ శ్రీకృష్ణపరబ్రహ్మము సర్వజగత్తులను తనయందే నిలిపికొనియున్నాఁడు.. ప్రళయావస్థ యందది చలించినను, (నశించునను) దాఁజలింపఁడు. సృష్టిసమయమున దానిని నిర్మించి, యందు వ్యాపించియుండునుగాని మాయావరణము గలుగుటచే స్పష్టముగఁ బ్రకాశింపడు "ఈ మహారణ్యమున నెందు డాఁగియున్నాఁడో తెలియకున్నది. అని పినర్థశబ్దముచే, కృష్ణపక్షమునందలితాత్పర్య మించుక సూచింపఁడు చున్నది.

8. ఈ బ్రహ్మము అపరిమితానంతస్వరూపుఁడైనను, అసురసంపదయందు (మంచిగుణములు బొత్తుగలేని చిత్తవృత్తిగలవారు అనురనంపదయందు జనించిన వారనబడుదురు.) జనించినవారలకు నప్రియుండుగును. అట్టివారాత్మఘ్నులని (తనయదార్థస్వరూపము నెఱుంగనివారు అత్మఘ్నులు, ఆత్మహత్మఁజేసి కొనినవారు). చెప్పబడుదురు. ఎంతకాలమునకైనను వారలకాపరమేశ్వరుడు గోచరించుటయబద్ధము అని వేదములు చెప్పుచున్నవి. ("మన కా శ్రీహరియం దింతయనురాగము గలుగుటయే మహాభాగ్యము. దీనికే నంతసింపవలయును. అని కృష్ణపక్షమునందు భావము. అమోహదూరుడు కలువవలె నీలవర్ణమగు దేహముతో బ్రత్యక్షమై మనపై (గోపికలపై) మిగులగరుణజూపి సకలదుఃఖములను తొలగించియున్నాడు.

9. వేదాంతవాక్యము లిమ్మహాత్ముని(గూర్చి చెప్పుచుండటవలననే సర్వోత్తమము లనిపించుకొనుచున్నవి. మఱియు నాత్మజ్ఞానులగు మహాత్ములు ఈయనకు శేషభూతులు,. (అంశములనుట. సకల జీవులును అబ్రహ్మయొక్కఅంశములేయైనను జ్ఞానీ త్వాత్మైవ మే మతం= జ్ఞానియగు జీవునకును, నాకును భేదములేదు." అని భగవంతునిచే ప్రత్యేకముగ చెప్పబడియుండుటవలన నిట్లు చెప్పియున్నాము.) ఈ గీతము నిర్దోషుఁడగు నాశ్రీహరిని సర్వకాలము లందున భావింపుచుండు నారాయణతీర్థ యతి వరునిచే రచియుంపబడెను. ('మనయందాహరికి దయలేదేమో యని నంశయింప నక్కఱలేదు" అని కృష్ణునిపక్షమున భావము.)

శ్లో. ఇత్థం గోపీజనా శ్శౌరేః పరభావవిదః పునః,
భువి శిక్షాం వితన్వంత్యో మృగయంత్యాదికారణమ్.

శ్లో7. ఇత్థం = ఈప్రకారముగా; గోపీజనాః = గోపికాస్త్రీలు; శౌరేః = శ్రీకృష్ణస్వామివారియొక్క; పరభావ విధః = పరస్వరూపమును తెలిసికొన్న వారుగనుక; పరభావవిధః = పరస్వరూపమును తెలిసికొన్నవారు గనుక; పునః = మరల్ప; భువి = భూలోకమునందు; శిక్షాం = భగవంతుని ఇట్లు వెదుకవలెను అనే హితోపదేశమును; వితన్వంత్యః = విస్తరింపజేయుచున్నవారలై; ఆదికారణం = ఆదికారణమైన పరబ్రహ్మమును; మృగయంతి = వెదకుచున్నారు.

ఆగోపికలు కృష్ణుని పరమార్థతత్త్వమును బాగుగ నెఱింగిన వారయ్యు, లోకులకు నావిషయమును స్పష్టముచేయుటకై, ప్రేమ నొక విమిత్తముగాఁ గైకొనిపైన పర్ణించినవిధముగా కృష్ణుని వెదుకుచుండిరి.

శ్లో. సర్వాంతఃకరణాంతస్థం మాధవం ప్రాణవల్లభం,
మృగయంతీ ర్వనే పుష్పైః హసంత ఇవ పాదపాః 8

శ్లో. మల్లికాదిలతా స్తద్వదోషథోషధ్యోన్యాశ్చ తద్వనే,
సంబోధ్య నామభిస్తేషాం తానాహుర్వల్లవాంగాః 9

శ్లో 8-9. ఏకాన్వయం - సర్వ = సమస్తభూతములయొక్క; అంతఃకరణ = హృదయముల; అంతస్థం = లోపలవశించునట్టి; మాధవం = లక్ష్మీభర్త అయినటువంటిన్నీ; ప్రాణవల్లభం = తమప్రాణములకు ప్రియులైనట్టిన్నీ (శ్రీకృష్ణస్వామివారిని); వనే = వనమునందు; మృగయంతి = వెదకుచుండిరి; తద్వనే = ఆవనమందు; అన్యాశ్చ = ఇతరమైన; పుష్పైః = పుష్పములతోకూడుకొని; హసంత ఇవ = నవ్వుచున్నవాటివలె; పాదపాః = చెట్లనున్నూ; మల్లికాదిలతాః = మల్లెమొదలగు తీగలనున్నూ; తద్వత్ = ఆవిధముననే; అన్యాశ్చ = ఇతరమైన; ఓషధః = ఓషధులు అను వనమూలికలున్నూ; తేషాం = వాటివాటియొక్క; నామభిః = పేర్లచేత; సంబోధ్యః = పిలిచి; పల్లవాంగనః = గోపాంగనలు; తాన్ = ఆచెట్లనుగూర్చి; ఆహుః = చెప్పుచున్నారు (పిల్చుచున్నారు)

తమ ప్రాణేశ్వరుఁడు సర్వజనుల హృదయము అందుండగా వెలుపల వెదుకుచున్నారే. తెలిసియుండినను వీరలకెంతయజ్ఞానము కలిగెను అనియా బృందావనమునందలి వృక్షములు తమపుష్పసంపదచే నవ్వుచున్నట్లుండెను.

అంత నిలవకవారు మల్లెలు, మొల్లలు మెదలగుతీఁ గెలను అనేక విధములగు నోషధులను, మృగాదులనుఁ గూడ వానివాని పేర్లతోఁ బిలచి కృష్ణునిజాడ నెఱింగింపు మనివేఁడుచు, మఱియుం గొంతదూర మవ్వనమునం దిరుగ నారంభించిరి.

## 4వ కీర్తన - కాంభోదిరాగం - ఆదితాళము

ప. మాధవందర్శయహేమందార మాధవందర్శయ

అ. మాధవమిహరాధికారాధితమథసాధకజనఫల సాధకమధునా

1. రేరేమందారసంతానకల్పక పారిజాతచందన
రేరే చంపకనాగపున్నా గశ్రీ పూగపనసనారికేళరసాల

2. సరసకదంబకపలాశ కురవకవటసమూహ
విలసదశోకకపిత్థకదళీవన లలితదేవదారుబృన్దపిచుమన్ద

3. బృందేబృదావనచరమహర్ని శినందనందన మతులం
కుందలవంగలతే కుటిలాలక మిందుసుందరాననమీశమతిబలం

4. పుల్లకుసుమమల్లికే జాజి మాలతీవల్లి వనజలతికే
కల్లోలశ్రీకమలకేతకీ కుముదకల్హారాదికుసుమ చయపం క్తిలలితే

5. శుకకోకిలశారికాబృంద శకుంత శోభనహంసకుల
ప్రకటాకాశానిలానలజలధరణిసకలదేవగణ సరసగుణగణ

6. సకలనిగమగూఢమఖిలలోకా ధారమచ్యుత మఖిలగురుం
సరసగోపీగణపరిగీతమనుశివ నారాయణతీర్థఫణితముదారం

ప. హేమందారా! = ఓ మందారవృక్షమా; మాధవం దర్శయ = శ్రీకృష్ణస్వామివారిని చూపింపుమా.

అ.ప. ఇహ= ఇక్కడ; అధునా = ఇప్పుడు; రాధికారాధిత మధుం = రాధికామ్మవారిచేత పూజింపబడుచుండు మకరంద స్వరూపుడున్నూ; సాధకజన ఫలసాధకం = భగవద్విషయమును సాధనము చేయుచుండు జనులకు ఫలమును యిచ్చునట్టివాడున్నూ-అగు; మాధవం = శ్రీకృష్ణుని; దర్శయ = చూపింపుమా.

1. రేరే = ఓసీ!; మందార, సంతాన, కల్ప, పారిజాత, చందన వృక్షములారా!; రేరే = ఓసీ!; చంపక = సంపెంగ; నాగ = నారింజచెట్టు; పున్నాగ = శ్రీమారేడుచెట్టు; పూగి = పోకచెట్టు; పనస = పనసచెట్టు; నారికేళ = టెంకాయచెట్టు; రసాల = తియ్యమామిడిచెట్టు -వృక్షములారా!; మాధవం దర్శయ = శ్రీకృష్ణుని చూపించండి.

2. సరస = రసయుక్తమైన; కదంబ = పెద్దకడిమిచెట్టు; కదంబక = చిన్నకడిమిచెట్టు; పాలాశ = మోదుగచెట్టు; కురువక = గోరింటచెట్టు; వట సమూహా = మఱ్ఱి వృక్షసముదాయమా!; విలసత్ = ప్రకాశించుచున్నట్టి; అశోక = కటకరోహిణిచెట్టు; కపిత్థ = వెలగచెట్టు; కదళీవన = అరటిచెట్లగుంపులారా!; లలిత = మనోహరమైన; దేవదారుబృంద = దేవదారు సమూహమా!; పిచుమంద = వేపవృక్షమా; మాధవం దర్శయ = శ్రీకృష్ణుని చూపించండి.

3. బృందే! = ఓతులసీ చెట్టులారా (ఓ తులసీమొక్కలారా!); అహర్నిశి = రాత్రింబవళ్ళు, బృందావనచరం = బృందావనమందు సంచరించునట్టి; అతులం = అసమానమైన; నందనందనం = శ్రీకృష్ణస్వామివారిని; కుంద = మల్లె; లవంగ లతే = లవంగతీగలారా!; కుటిల = వంకరలైన; అలకం = ముంగురులు కలిగినట్టి; ఇందు = చంద్రునితో సమానమగు; సుందరం = సౌందర్యముగల; ఆననం = ముఖము కలిగినట్టి; ఈశం = నియామకుడైనట్టి; అతిబలం = మిక్కిలి బలశాలియగునట్టి; మాధవం దర్శయా = శ్రీకృష్ణుని చూపించండి.

4. పుల్ల = వికసించిన; కుసుమ = పుష్పములు కలిగినటువంటి; మల్లికే = ఓ మల్లెతీగా!; జాజి = జాజి; మాలతి వల్లీ! = ఓ విరజాజితీగా; వనజలతికె = వనమునందు పుట్టిన తీగలారా!; కల్లోల, శ్రీ = అలలకు కాంతి నిచ్చుచున్నట్టి; కమలా = కమలములారా!; కేతకీ! = మొగలి చెట్లలారా!; కుముద = కలువలారా!; కల్హార = ఎఱ్రకలువలు మొదలుగాగల; కుసుమచయ = పుష్పసమూహములయొక్క; పంక్తి లలితే!; వరుసలచే ఒప్పుచుండు వృక్షములారా!; మాధవం దర్శయ = శ్రీకృష్ణుని చూపించండి.

5. శుక = చిలుకలారా!; కోకిల = కోకిలములారా! శారిక = గోరువంకపిట్టలారా!; శకుంత = శాకుంత పక్షులారా!; శోభన, హంసకులా! = మంగళప్రదమైన హంసలారా!; ప్రకట = ప్రసిద్ధమైన; ఆకాశ = గగనము; అనిల = వాయువు; అనల = అగ్ని; జల = నీళ్ళు; ధరణి = పృధ్వి; సరస గుణగణ = రసయుక్తమైన గుణములుగల; సకలదేవగణ = సమస్తదేవతా సమూహములారా!, మాధవం దర్శయ = శ్రీకృష్ణుని చూచినారా!

6. సకలనిగమగూఢ = సకల వదేములయందు గూఢముగా తెలియబడుచుండునట్టి; అఖిలలోకాధారం = సమస్తలోకములకు ఆధారుడైనట్టిన్నీ; అచ్యుతం = నాశరహితుడైనట్టిన్నీ; అఖిలగురుం = సమస్తజనులయొక్క అజ్ఞానమును పోగొట్టునట్టిన్నీ; సరస గోపీగణపరిగీతం = ఆనందయుక్తలైన గోపికా సమూహములచేత చక్కగా చేయబడుచుండుగానమును; అను = అనుసరించి; శివనారాయణతీర్థ భణితం = శివనారాయణ తీర్థులవల్ల స్తోత్రము చేయబడుచుండునట్టివాడున్నూ; ఉదారం = ఔదార్యముగలవాడున్నూ-అగు; మాధవం దర్శయ = శ్రీకృష్ణుని చూపించండి.

ప. ఓ మందారవృక్షమా! మాకు శ్రీకృష్ణునిచూపుము.

ఆ. భక్తజనులను కోరిక వరములొసంగునట్టియు, రాధాలోలుఁడైనట్టియు, శ్రీ కృష్ణ నిప్పుడు మాకు జూపుము.

1. ఓమందార, సంతాన, కల్పక, పారిజాత, చందనవృక్షములారాః శ్రీ కృష్ణునిఁ జూపుఁడు. ఓ చంపక. (సంపెం) నాగ (నారింజిచెట్లు), వున్నాగ, శ్రీ (మారేడుచెట్లు). వృక్షములారా! శ్రీకృష్ణునిం జూపుఁడు.

2. మనోహరములై యున్న కదంబక (కఁడిమిచెట్టు), పలాశ (మోదుగజెట్టు) కురువక (గోరంటచెట్టు), వటసమూహములారా! మిగుల ప్రకాశించుచున్న అశోక, కపిత్థ (వెలగ), కదళీవనములారా మనోహరమగు దేవదారువృక్షసమూహమా! ఓ వేపవృక్షములారా! మాప్రియుండగు శ్రీ కృష్ణుని జూపుండు.

3. ఓ తులసీ! ఆనందకుమారుడు, రాత్రింబగలు ఈ బృందావనము ననే సంచరించుండును. (బృందయనంగా బృందావనదేవత యనికూడ నర్థము చెప్పవచ్చు) ఆలోకొత్తరుని మాకుం జూపుము.

4. వికసించిన పూలతోనొప్పుమల్లికా, జాజి, మాలతీ (ఇది జాజిలో నొకభేదము.) లతలారా! శ్రీ కృష్ణునిఁజూపుఁడు. మనోహరమగు కాంతిచే నొప్పుచుండు కమలములు, కలువలు, కాల్హారములు (ఇవి విక్కిలి సుగంధ ముగల యొకవిధమగు కమలములు) మొదలగు పుష్పములసమూహముచే మనోహరములై యుండు తామర, కలువతీవియలారా! కేతకీవృక్షములారా! శ్రీ కృష్ణునిం జూపుండు.

5. ఓ చిలుకలారా! కోయిలలారా! గోరువంకలారా! ఆకాశమున సంచరించు ననేకవిధములగు పక్షిసమూహములారా! సరసులందు నివసించు హంససమూహములారా! శ్రీకృష్ణునిఁ జూపుడు. ఆకాశాదిపంచభూతములారా! సుగుణవంతులగు దేవతా సమూహములారా! మాకు శ్రీకృష్ణునిఁ జూపుఁడు.

౯. ఇట్లు సకలలోకములకు నాధారభూతుఁడును, నాశరహితుఁడును, గంభీరుఁడును, పరమగురువునగు నాకృష్ణునిఁగూర్చి గోపిక లిట్లు గానముచేసిరని నారాయణతీర్థుఁడు గీతము రచించెను.

శ్లో. గోపీషు మృగయంతీషు వనే గోపాలనందనం,
ఆత్మానం దర్శయామాస చికీర్షుర్భూర్యనుగ్రహమ్ 10

శ్లో 10. వనే = వనమునందు; గోపాలనందనం = శ్రీకృష్ణస్వామివారిని; గోపీషు = గోపికా అమ్మవారలు; మృగయంతీషు = వెదకుచుండగా; భూరి అనుగ్రహం = విశేషకృపను; చికీర్షుః = చూపించదలచినవారై; ఆత్మానం = తనస్వరూపమును; దర్శయామాస = చూపించినవారైరి.

ఇట్లు ఆ శ్రీకృష్ణుని వెదకులాడుచు నా గోపికలు వనమునఁ దిరుగుచుండ భగవదనుగ్రహముచే వారిమనసున పరబ్రహ్మరూపము ప్రకాశించెను.

౧. **అథ ఖలు వల్లవయువత్యో నిజవల్లభవిరహనంతావదు రంతచింతా సంతాపమందీకృతబాహ్య విషయవివేకవృత్తిమ చ్చిత్తవత్యో ముహుర్ముహు స్తదీయలాలావినోద నవరసావిష్కరణ ప్రవీణాః గోపాంగ ప్రత్యంగ గుణగణసమ విషమబలాబలనమబలవిలానవిలసిత గ్రీవాశిరఃకంపత్రిభంగీలలితదివ్యగాత్ర భ్రూనేత్రహస్త విశేషాద్యావిష్కృత నవరసాలంకారాలం కృతవివిధలాస్యవిశేషం స్ఫురదధరమణిపరిమిళితమురళీకలర వసుధాద్రవధీరితసురసుధా ఖండమండలం స్మారంస్మారంస్వస్వాం తఃకరణానపాయేన నర్వాంతరంగం మదనశతకోటి సుందరాంగం ధ్యాయంత్యో మనసా ప్రణమంత్య శ్శిరసావచసాచ పురఃస్థితి మివ సంబోధ్య ప్రత్యేకం గోపాలమగాయంత.**

11. **అథ = అనంతరమందు; వల్లవయువత్యః = గోపస్త్రీలు; నిజవల్లభ = తమభర్త అయిన స్వామివారియొక్క; విరహసంతాపజనిత = వియోగ వేదనవల్ల కలిగినట్టి; దురంత = అంతములేని; చింతా = దుఃఖముతోకూడుకొన్న; సంతాప = సంతాపముచేత (అవేదనచేత); మందీకృత = క్షీణించినట్టి; బాహ్యవిషయ = వెలుపలి విషయ సంబంధమైన; వివేక = జ్ఞానసంబంధమైన; వృత్తిమత్ = వృత్తులను కలిగిన; చిత్తవత్యః = మనస్సులు కలవారలై; ముహుర్ముహుః = మాటిమాటికి; తదీయ = అస్వామివారియొక్క; లీలావినోద = లీలా వినోదములను; నవరస = శృంగారాది నవరసముల యొక్క మాధుర్యమును; అవిష్కరణ = వారి మనస్సులకు జ్ఞాపకము వచ్చునట్లు; ప్రవీణాః = నేర్పుగలవారలై; గోపా = స్వామివారియొక్క; అంగ = చేతులు, కాళ్ళు మొదలగు అంగములచేతను; ప్రత్యంగ = వ్రేళ్ళుమొదలగు ప్రత్యంగములచేతను; గుణగణ = గుణ నమూహములచేతను; బలాబలసమబల =**

అధికబలములను, సమబలములను, అల్పబలములు-అగు; విలాస = నానావిధ విలాసములచేత; విలసిత = మనోహరముగా ఒప్పుచున్నటువంటి; గ్రీవ = కంఠము; శిరః = శిరస్సు; కంపము = వణుకుచుండుటచేత; త్రిభంగి లలిత = త్రివళులచేత ఒప్పుచున్న; దివ్యగాత్ర = మనోహరమైన శరీరముతో; భ్రూ = కనుబొమ్మలు; నేత్ర = కండ్లు; హస్త ఆది = చేతులు మొదలగు; విశేష = విశేషములచేత; అవిష్కృత = పలుతెరంగుల మార్పులచేత బయలుపరచబడిన; నవరసాలంకార = శృంగారాది నవరసముల; అలంకృత = అభినయించుచు (శ్రీహరియొనర్చిన); వివిధలాస్యవిశేషం = అనేకవిధములైన నృత్యవిశేషములు కలదియున్నూ; స్ఫురత్ = కదలుచున్నటువంటి; అధరమణి = శ్రేష్ఠమైన అధరముతో; పరిమిళిత = చేర్చబడిన; మురళీ = వేణువుయొక్క; కలరవ = అవ్యక్త మధురములైనటువంటి; రవ = ధ్వనియనెడు; సుధ = అమృతముచేత; అవీరిత = తిరస్కరింపబడుచున్న; సురసుధా = దేవతల అమృతమును కలిగినట్టి; అఖండమండలం = పూర్ణచంద్ర మండలమువలెనున్నట్టి (ప్రకాశించుచున్నటువంటి); మదనశతకోటి సుందరాంగం = కోటి మన్మధులతో సమమగు సౌందర్యరూపమును; సర్వాంతరంగం = నిండుమనస్సులతో; ధ్యాయంత్యః = ధ్యానము చేయుచున్నవారలై; స్మారం స్మారం = స్వామివారిని మాటిమాటికి స్మరించి; స్వస్వాంతఃకరణ అపాయేన = వారివారి మనోవ్యాపారములను నిలిచిపోవునట్లుగా; మనసా = మనస్సుచేతను; శిరసా = సిరస్సుచేతను; ప్రణమంత్యః = నమస్కరించుచున్నవారలై; వచసాచ = వాక్కులచేతనున్నూ; పురస్థితం ఇవ = ఎదుట నిలిచియున్నవారినివలె; సంబోధ్య = పిలిచి; ప్రత్యేకం = వేరువేరుగా; గోపాలం = స్వామివారినిగూర్చి; అగాయంతఖలు = గానముచేసిరిగదా!

వారు విరహతాపముచే చాలకాలము నుండియు బాధింపఁబడుచున్న వారు కావున నాతాపవేగముచే బాహ్యవిషయములపై ప్రజ్ఞయేలేక, యెల్లప్పుడును తనప్రియునే ధ్యానించుచుండిరి. అకృష్ణుఁడు చేసిననానావిధములగు వినోదములును, ఆయన యభినయించిన శృంగారాదినవరసముల మాధుర్యములును, పలుమాఱు వారిమనసునకు వచ్చుచుండెను. వానినన్నిటిని పరస్పరము వర్ణించి చెప్పకొనుచుండిరి. చేతులుకాళ్లు మొదలగునంగములచేతను, వ్రేళ్లు మొదలగు ప్రత్యంగములచేతను, గుణసమూహముచేతను, (చెమ్మట, గగ్గురుపాటు మొదలగు సాత్వికభావముచేతను లేక గౌణాభినయముచేతను) సమవిషమప్రకారములచేతను, అధికబలములును అల్పబలములును సమబలములునగు నానావిలాసములచే మనోహరములగుచున్న కంఠశిరఃకంపములచేతను, త్రివళులచే నొప్పుచున్న మనోహరశరీరము, క్రుబొమలు, కనులు, హస్తములు (హస్తములనఁగా అభినయముకొఱకు కొన్నిమార్పులతో, అనఁగా త్రిపతాక పతాకాదిరూపములతో నుంచఁబడిన చేతులు) వీని పలుతెఱంగుల మార్పుటచేతను శృంగారాదినవరసముల స్పష్టముగ నభినయించుచు నాహరియొనర్చి నృత్యము వారికనులఁగట్టినట్లుండెను. తనపెదవిపై వేణువు నుంచుకొని యమృతమునుగూడ దిరస్కరించునట్లు ఆమాధవుడుఁడొనర్చిన మధురగానము లప్పటికిని వారిచెవుల నింపుచున్నట్లుండెను. ఇట్లు మన్మథశతకోటి సమానసుందరాంగుఁడగు నాహరిని, సకలజనమనోహారిని వారు తమమనంబులఁ బాయక నిల్పి

ధ్యానించుచు, మదిలోన నమస్కరించుచు నుండ, హరియు వారికభిముఖమున నిలిచినట్లుండె. అప్పుడు సాష్టాంగముగ నమస్కరించి సత్యముగ నెదుటనున్నవాఁడ కాఁదలంచి "ఓకృష్ణా!" యని పిలిచివారలు ప్రత్యేకముగ నిట్లని గానముచేసిరి.

శ్లో. మదనశతకోటివేషం మాధవ మాధాయ మామకే మనసి,
విదళితసురరిపుబృందం విష్ణుం గాయామి విశ్వభర్తారమ్. 12

శ్లో.12. విదళిత సురరిపుబృందం = రాక్షసమూహములను నాశనము చేయునట్టిన్నీ; విశ్వభర్తారం = సమస్తజగత్తుపోషకుడైనట్టిన్నీ; మదన శతకోటివేషం = నూరుకోట్ల మన్మథుల సౌందర్యము గలిగినట్టిన్నీ; విష్ణుం = సర్వవ్యాపకుడైనట్టిన్నీ; మాధవం = శ్రీకృష్ణస్వామివారిని; మామకేమనసి = నాయొక్క మనస్సునందు; ఆధాయ = ఉంచుకొని; గాయామి = పాడుచున్నాను.

సకల రాక్షసులను సంహరించి జగమును బోషించునట్టియు, మన్మథకోటి సమానలావణ్యము గల్గినట్టియు, సర్వవ్యాపకుఁడైనట్టియు, నారాయణ నా హృదయమునందు నిలిపి గానము సేయుదును. (పైగ్యమున "ప్రత్యేకముగా" అని చెప్పుటచే నిచ్చటనేకవచనము ప్రయోగింపఁబడియున్నది.)

## 5వ కీర్తన - సురట (సౌరాష్ట్ర) మోహనరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | నందనందన గోపాల జయ | నవనీతచోరగోపాల |
| 1. | కందర్పశతకోటిసుందర సుఖకర | మందహాస శ్రీగోపాల |
| 2. | బృందావనగో బృందఘనానంద | చంద్రానన శ్రీగోపాల |
| 3. | లీలామానుషబాలకవేష | బలానుజవిగ్రహగోపాల |
| 4. | మురళీధర మునిబృందవిచింతిత | ముక్తజనాశ్రయ గోపాల |
| 5. | నందసునఁదాదివందితచరణార | విందమహోన్నతగోపాల |
| 6. | బాధితరిపుబృంద బోధరసానంద | సాధితజగదండ గోపాల |
| 7. | గోపీమన్మథ గోపరిపాలక | గోవర్ధనోద్ధర గోపాల |
| 8. | రాసమండలనట దాసజనావన | వాసవాదినుత గోపాల |
| 9. | మూలకారణమోహవారకలక్ష్మీ | పాల పరాధీశ గోపాల |
| 10. | ఘోరభవార్ణవతారకపాలిత | నారాయణతీర్థ గోపాల |

ప॥ నందనందన గోపాలా = నందునికుమారుడవగు గోపాలుడా; జయ = సర్వోత్కర్షముగా వర్తించుమూ; నవనీతచోరా! గోపాలా! = వెన్నముద్దలను దొంగిలించుగోపాలుడా

1. కందర్పశతకోటి సుందర = నూరుకోట్ల మన్మథులతో సమానమైన సౌందర్యముగలవాడా; సుఖకర = సౌఖ్యమునుయిచ్చువాడా; మందహాసశ్రీ = లేనగవు అనెడి కాంతితో ఒప్పుచుండెడి; గోపాలా! = గోపాలుడా.

2. బృందావన = బృందావనమందలి; గో బృంద = గోసమూహములను; ఘన = విశేషముగా, ఆనంద = ఆనందిపజేయువాడా; చంద్రానన = చంద్రునితో సమానమైన మోముగలవాడా; శ్రీగోపాలా = లక్ష్మీసహితుడైన గోపాలుడా

3. లీలామానన బాలకవేష = లీలకొఱకు మనుష్యబాలక వేషమును ధరించిన స్వామీ; బలానుజవిగ్రహ = బలరాముడికి తమ్ముడవైపుట్టినట్టి దివ్యమంగళ విగ్రహముగలవాడా; శ్రీగోపాలా! = గోవులను పాలించేవాడా.

4. మురళీధరా! = వేణువును ధరించినవాడా; మునిబృంద విచింతిత = వేదార్థమును మననము చేయునట్టి; యోగుల సమూహముచేత, విశేషముగా ధ్యానము చేయబడుచుండువాడ; ముక్తజన ఆశ్రయ = ముక్తిపొందిన జీవాత్మలకు ఆధారమైనవాడా; గోపాలా = గోపాలుడా.

5. నందసునందాది = నందుడు సునందుడు మొదలగువారిచేత; వందిత = నమస్కరింపబడుచుండు; చరణారవింద = చరణ కమలములుగలవాడా; మహోన్నత గోపాలా = అత్యున్నతమైనటువంటి పదమునందుండువాడా గోపాలుడా

6. బాధితరిపుబృంద = శత్రు సమూహములను బాధించువాడా!; బోధరసానంద = జ్ఞానానందరసముగలవాడా; సాధిత జగదండ గోపాలా = బ్రహ్మాండములను నిర్మించిన ఓగోపాలుడా

7. గోపీమన్మథ! = గోపికలమనస్సులను మథించువాడా; మన్ = మనస్సును, మథ = మథించువాడ- అని నిర్వచము; గో పరిపాలక = గోవులను పాలించువాడా!

8. రాసమండలనట = రాసభూమియందు నాట్యముచేయువాడ; దాసజనావన = దాసజనులను రక్షించువాడ; అవన = రక్షించుట; వాసవాదినుత = దేవేంద్రుడు మొదలగువారివల్ల స్తోత్రము చేయబడువాడ; గోపాల! = గోపాలుడా!

9. మూలకారణ = సమస్త జగత్తునకు ఆదికారణమైనట్టివాడ; మోహవారక = మోహమును తొలగించువాడ; లక్ష్మీపాల = లక్ష్మిని పరిపాలించువాడ; పరాధీశ = మోక్షస్థానమునకు అధ్యక్షుడా; గోపాలా! = గోపాలుడా (గాం పాలతీతి గోపాలః) -అని

10. ఘోర = భయంకరమైన; భవార్ణవ = సంసార సముద్రమును; తారక! = దాటించువాడ (తరింపజేయువాడ); నారాయణతీర్థ = నారాయణతీర్థులవారిని; పాలిత = పాలించువాడ; గోపాల! = గోపాలుడ.

ప. ఓనవనీతచోరా! నందకుమారా! గోపాలా! నీకు నమస్కారము.

1. కోటిమన్మథులతో సమానమగు సౌందర్యముగలవాడా! నీచిఱునగవు దొరకిన చాలును. సకలదుఃఖములును నివారణమగును.

2. ఓచంద్రునివంటి ముఖముగల గోపాలకృష్ణా! నీవీబృందావనమునందు విహరింపుచు గోవులకు మిగుల నానందమును గల్గించుచుందువు.

3. లీలచే మనుష్యరూపమును ధరించి, బలరామునకు తమ్ముఁడవై జనించియున్నావు.

4. వేణుగానలోలా! నీవు మునులచే ధ్యానింపఁబడుచు, మోక్షమును జెందినవారి కాశ్రయుఁడవై (ఐక్యమునకు స్థానమై) యుందువు.

5. లోకోత్తరుండవగు నిన్ను సనకసనందనాది మహాయోగులుకూడ వినుతించుచున్నారు.

6. సత్యజ్ఞానానందస్వరూపుఁడవగునీవే బ్రహ్మాండముల నిర్మించి, శత్రుసంహారముచేసి దానిం బరిపాలించుచున్నావు. (శత్రువు లనఁగా ధర్మశత్రువులగువారే యని యూహించునది)

7. గోపికలకు మన్మథతుల్యుండవై, గోవులఁ బరిపాలించువాఁడవై గోవర్ధనపర్వతము నవలీలగ నెత్తిన యో గోపాలకృష్ణా!

8. ఇంద్రాదులు వినుతింప రాసమండలమునందు (రాసక్రీడకై మండలాకారముగ నిలచియున్న గోపికల నడుమ) నిలిచి నృత్యముసేయుచు భక్తులపరిపాలించిన యోకృష్ణా!

9. నీవు, సకలప్రపంచమునకు కారణభూతుడై, పరమపదమునకు నాయకుఁడై, తనయను గ్రహముచే అజ్ఞానమును నశింపఁజేయులక్ష్మీనాథుండవు,

10. ఓగోపాలకృష్ణా! నారాయణతీర్థుఁడను యతిని సంసారసముద్రమునుండి యుద్ధరించి రక్షించితివి.

శ్లో. మాధవచరణసరోజే వనభువి సికతాసురేఖయా నుమితే.
దృష్ట్వా తదను చ తన్వ్యాశ్చరణౌ కస్యాఇతీతరాః ప్రాహుః

శ్లో. 13 అనుమితే = ఊహించబడదగిన; వనభువి = బృందావనమందు; సికతా = ఇసుకమీద; సురేఖయా = మంచిరేఖలతోకూడినట్టి; అనుమితె = ఊహించబడతగిన; మాధవ చరణసరోజే = స్వామివారి పాదారవిందముల జాడలనున్నూ; తదను = అప్పుడే; తన్వ్యాః = స్త్రీలయొక్క; చరణౌ = పాదములజాడలనున్నూ; దృష్ట్వా = చూచినవారై; కస్యాఇతి = ఎవరిపాదములా అని; ఇతరాః = ఇతరగోపికలు; ప్రాహుః = చెప్పుకొనిరి; ముకుందే = శ్రీకృష్ణులవారిని; మృగ్యమాణే = వెదుకబడుచుండగా

ఇట్లు తిరుగుచుండ వారల కావనమున నొకచోట మహాపురుషలక్షణములతోఁ గూడిన యడుగు లిసుకపైఁ గానవచ్చెను. వానిం జూచి యివి శ్రీకృష్ణునిపాదము లని నిశ్చయించుకొనిరి. బాగుగ విమర్శించి చూచినప్పటి కాయడుగులప్రక్కన నొక్కయువతి యడుగులుకూడఁ గానవచ్చుటం జూచి "ఈ యడుగు లెవ్వరివి? కృష్ణునితోఁగూడ నేస్త్రీ యాత్రోవనడచెను" అని యొకరితో నొకరు చెప్పుకొనిరి.

శ్లో. కాచి ద్గోపీ కనకలతికాకాంతి రంతాదిహీనం
కాంతం స్వాంతఃస్థితమనుగతం కామకామం శ్రయంతీ,
లక్షీకృత్య శ్రుతి రివ పరానందమూర్తిం ప్రగల్భా
నృత్యం తీగాయతీతిప్రకృతిపరతరంమృగ్యమాణేముకుందే

శ్లో 14. ప్రగల్భా = నేర్పుగలిగినటువంటి; కాచిద్గోపి = ఒకానొక గోపిక; కనక లతికా కాంతిః = బంగారుతీగతో సమమగు కాంతి గలది అయి; అంత అదిహీనం = ఆద్యంతములులేనివాడున్నూ; స్వాంతస్థితిం = తనయొక్క అంతరంగమునందు; అనుగతం = ఆత్మను అనుసరించి ఉన్నట్టిన్నీ; కాంతం = తనభర్త అయిన శ్రీకృష్ణుని; కామకామాశ్రయంతి = కామ్యకోరికతో ఆశ్రయించినదై; పరానందమూర్తిం = పరమానంద స్వరూపుడైన స్వామివారిని; శ్రుతిఇవ = వేదశృతివలెనే; లక్షీకృత్య = బాగాచూచి; ప్రకృతి పరతరం = ప్రకృతికి విలక్షణమైనస్వామివారిని; గాయంతి = పాడుచున్నది; నృత్యంతి = నాట్యము చేయుచున్నది.

మఱియు శ్రీకృష్ణుని వెదకుచుండునానమయమున సువర్ణచ్ఛాయగల యొక గోపసుందరి మన్మథమన్మథుండగు తనప్రియుని, అవ్యయుని ధ్యానించుచుండెను. ఆపాదములు గానరాఁగానే వేదమునుంబోలె మిగుల చమత్కారవాక్యములచే ప్రపంచాతీతుఁడవనియు, పరమానంద స్వరూపుఁడనియు, గానము నాచరించెను. తదనుగుణముగ నృత్యమునుగూడ సల్పెను.

## 6వ కీర్తన - కేదారగౌళరాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | నందముకుందే పరమానందే | వయమిహకిముమృగయామ |
| 1. | విహరతి గోపే గతభవతాపే | కా మనుసరతి దురాపే |
| | క్వచి దపి నీతే హృతనవనీతే | నిజకలయా సువిభాతే |
| 2. | అమృతకలాయామతివిమలాయా | మచలవిభూతినిదానే |
| | స్వసుఖరతాయామతితరళాయా | మనుపదమహమనుమానే |
| 3. | కృతజగదండే సుఖచిదఖండే | సకలజగత్ప్రతిభానే |
| | శ్రుతిపరిగీతే మహదనుభూతే | నిజసుఖసాధిత మానే |
| 4. | నభసి సందం శే మనసి చిదంశే | పశ్యతి వితత మశేషం |
| | ప్రకృతికృతాదింరథతురగాదిం | భానుసదృశకృతవేషం |
| 5. | మనసి విలీనే గతవతి మానే | కలయతి రతి మిహ దేవే |
| | నిజపదగతయా సుకృదభిమతయా | సహగతనిజపరభావే |
| 6. | అపగతకామే జగదభిరామే | జడజనసమస్తవిరామే |
| | అనుకృతవామే విగళితభీమే | భీతపవనరవిసోమే |
| 7. | వ్యవహృతిహీనేమహదభిధానే | బోధలయాదిసమానే |
| | ప్రణవతురీయే శివపదమేయే | నాదలయావధిమానే |

8. విగతకళంకే పరిహృతశంకే గళితపరాపరభేదే
వినిహతశోకే కృతపరిపాకే గోపవధూజనమోదే

9. సదసదతీతం సతతవిభాతం కేశవపరతరభావం
అనుపరిగీతం నిగమసమేతం నారాయణతీర్థే నేదం

ప॥ నందముకుందే = నందునికుమారుడైనటువంటి నారాయణుడు; పరమానందే = (సర్వవ్యాపకుడై) ఆనందస్వరూపుడై నిండియుండగా; వయం = మనము; ఇహ = ఈ బృందావనమందు; కిము మృగయామ = ఏమని వెదకెదము?

1. నిజకలయా = తనయొక్క ఆధ్యాత్మ జ్ఞానముచేత; సువిభాతే = లెస్సగా ప్రకాశించుచుండునట్టిన్నీ; హృతనవనీతే = నవనీత చోరుడైనట్టిన్ని; గత భవతాపే = సంసారతాపములేనట్టిన్నీ; దురాపే = దుర్లభమైనట్టిన్నీ; గోపే = గోపాలుడైన శ్రీకృష్ణుడు; కాం అనుసరతి = ఒకానొక గోపికను అనుసరించినవాడై; క్వచిదపి = ఒకానొక చోటికి; నీతే = తీసుకపోబడినవాడై; విహరతయా = విహరించుచుండగా; వయం = మనము; కిం మృగయామ = ఎక్కడ వెదకెదము?

2. అతి తరళాయాం = ఇతరులకు అమిత చంచలమైనట్టిన్నీ; అమృత కలాయాం = నిత్యమైన జ్ఞాన స్వరూపమైనట్టిన్నీ; అతి విమలాయాం = అతి నిర్మలమైనట్టిన్నీ; అచల విభూతి నిదాం = స్థిరమైన ఐశ్వర్యమునకు ఆదికారణమైనట్టిన్నీ స్వసుఖరతాయాం = స్వఆత్మసుఖమునందు విహరించునట్టి ఒక గోపికను; అనుపదం = ప్రతి అడుగునందు స్వామివారు అనుసరించు చున్నట్లుగా; అహం = నేను; అనుమానె = ఊహించుచున్నాను.

3. కృత జగదండె = బ్రహ్మాండములను నిర్మించినట్టిన్నీ; సుఖజిత్ అఖండె = ఖండములేని ఆనందము జ్ఞానము కలిగినట్టిన్నీ; శ్రుతి పరిగీతే = వేదములచేత చక్కగా గానము చేయబడు చుండునట్టిన్నీ; మహదనుభూతే = మహాత్ములచేత చక్కగా అనుభవింపబడుచున్నట్టిన్నీ; నిజసుఖ సాధిత మానె = బ్రహ్మానంద ప్రాప్తిచేతనే సాధింపబడుచున్న ప్రమాణ స్వరూపుడున్నూ -అగు; నందముకుందే = నందకుమారుని; కిము మృగయామ = ఎక్కడని వెదకుదము?

4. సదంశే = సద్రూపముయొక్క అంశమైనట్టి; నభసి = ఆకాశమునందు; చిద్అంశే = జ్ఞానానందమగునట్టి; మనసి = మనస్సునందున్నూ; ప్రకృతికృత ఆదిం = ప్రకృతిచేత కల్పించబడినటువంటి మొదలు గల్గినట్టిన్నీ; భానుసదృశ = సూర్యునితో సమానమగు ప్రకాశమును గలిగినవిగా; కృత = చేయబడిన; వేషం = రూపము కలిగినట్టి; అశేషం = సమస్తములైన రథ తురగాదిం = రథము గుర్రములు మొదలగు వస్తు జాతమును వితతం = సవిస్తరముగా పశ్యతి = పరమాత్మను (సాక్షీ, రూపముగా) చూచు చూన్నారు (స్వామివారు ఈ విధముగా నుండగా) కిముమృగయామ = ఎక్కడని వెదకుదము

5. మనసి విలీనే = మనస్సులయముకాగా గతవతిమానె = అభిమానము తొలగిపోగా ఇహ = ఈ జన్మమునందే దేవె = సర్వేశ్వరునియందు రతిం = ఆనందమును కలయతి = అనుభవింపల్గును నిజపదగతయా = తనపాదములను అను సరించినట్టిన్నీ సుకృతభిమతయా = పుణ్యాత్ములకు శ్లాఘ్యురాలగునట్టిన్నీ సహ = ఇటువంటి గోపికలతోగూడా గత = ఎక్కడికోవేంచేసినట్టి నిజ = స్వకీయమగు పరభావే = పరాత్పర స్వరూపుడైట్టి దేవే = స్వామివారి యందు రతిం కలయతి = ఏమని వెదకుదము

6. అపగతకామె = కామరహితుడున్నూ జగదభిరామె = లోకాభిరాముడున్నూ జడజ = జడమైన ప్రపంచ పదార్థముల ద్వారా కలిగినట్టి సమస్త = సమస్త వికారములను విరామే = నశింపజేయువాడున్నూ భీత పవన రవి సోమే =

భీత = తనకు భయపడి ప్రసరించునట్టిన్నీ పవన్న = వాయువు రవి = సూర్యుడు సోమె = చంద్రుడు - అనువారలను కలిగినట్టి విగళిత భీమే = (ప్రకృతము) అట్టిభయంకర స్వరూపమును విడచినవాడున్నూ అనుకృత వామె = తన్నుఅనుసరించుచున్నట్టి గో పస్త్రీలు గల వారున్నా అగునట్టి స్వామి వారిని మనము ఏమని వెదకుదము

7. వ్యవ హృతి హీనే = కేవల వ్యవహరార్థక మైనట్టిన్నీ - అనగా నిరర్థక మైనట్టిన్నీ నామధేయములు లేనివాడున్నూ మహదభిధానె = మహాత్ములచేత పూజింపబునట్టి - అనగా సార్థకమైనట్టి నామధేయములు గలవారున్నూ బోధలయాదిసమానే = జీవులయొక్క జాగ్రత, సుషుప్తి అవస్థలయందు సమానమైన నిర్వికారమైనట్టి స్వభావముగలవాడు ప్రణవతురీయే = ఓంకార వాచ్యుడైన ఆనంద స్వరూపుడున్నా శివపదమేయే = మంగళకరమైనట్టి స్థానముగలవాడని ఎంచదగిన వాడు సాదలయావధి మానె = సమస్త నాదములు లయించునట్టి చేరుగడస్థానమైన వాడున్నూ - ఇట్టివాడై యుండగా మనము ఏమని వెదకుదము;

8. విగళిత కళంకే = కళంకములు లేనివాడున్నూ; పరిహృత శంకే = సందేహములు లేనివాడును ; గళితపరాపరభేదే = స్వీయుడు, పరకీయుడు - అనుభేదములలేనివాడున్నూ ; వినిహతశోకే = దు:ఖములు నివర్తింప,ఏయువాడున్నూ ; కృత పరిపాకె = (1) కర్మను పరిపాకము నొందించి ఫలమిచ్చువాడున్నూ (2) సమస్త సుకర్మలకు పర్యవసానమందు ఫలముగా ననుభవింపబడువాడున్నూ ; గోప వధూ జన మోదే = గోపకాంతలకు సంతోషము కలుగజేయువాడు న్నూ- అగు స్వామివారిని ఏమని వెదకెదము?

9. సత్ = జీవ స్వరూపము; అసత్ = జడస్వరూపము; సదసదతీతం = జీవ, జడస్వరూపములకు అతీతమైన వాడున్నూ విలక్షణమైనవాడున్నూ ; సతతవిభాతం = ఎల్లప్పుడూ ప్రకాశించువాడున్నూ; నిగమనమేతం = వేదానుగుణ్యమైనట్టి; కేశవ పరతరభావం = కేశవుడేపరాత్పరుడు అనుభావమున్నూ; అను = అనుసరించి; ఇదం = ఈ కీర్తన; నారాయణతీర్థేన = నారాయణతీర్థుల వారిచేత; పరిగీతం = చక్కగా గానము చేయబడినది;

ప. నందకుమారుఁడగు నయ్యాదినారాయణుండు పరమానంద స్వరూపుఁడైయుండ మన మిచ్చట నేమి వెదుకవలయును. (అహరి సర్వవ్యాపకుఁడగుటచే నాయనను వెదుకవలసిన పనియే లేదని భావము).

1. తనజ్ఞానశక్తిచే ప్రకాశించుచుండు నా నవనీతచోరుఁడు సంసారసూరుఁడు. ఎవ్వతెనో యనుసరించి తిరుగుచు నెటకోపోయినాఁడు.

2. మఱియొకవిధముగఁ జూచినను శ్రీకృష్ణుని మనము వెదుకనక్కరలేదు. ఏలయనిన, నీహరి సకలమృద్ధులకును ఆదికారణభూతుఁడును, ఆత్మానందముచేఁ దృప్తినొందునదియు (తనకంటె నితరమగు వస్తువేలేదు కావునను, తా నానందస్వరూపము కావునను, అపరబ్రహ్మ తనయందు తానే తృప్తి చెందుచుండు ననుట) సర్వజనసామాన్యముగా లభించునదిగాక లభించునట్లున్నను స్థిరముగాక నుండుటచే చంచలమైనట్లు కనఁబడునదియు నైన మోక్షము స్వరూపముగాఁ గలవాఁడును అయియున్నాఁడు. అనుమాన ప్రమాణముచే నాయనయే మనయాత్మ యగును.

3. ఈకృష్ణుఁడు సకల జగత్తులకు కర్త. సత్యజ్ఞానానందస్వరూపుఁడు. సర్వజగత్తుల ప్రకాశింపఁజేయువాఁడు. ఈయనను గుర్తించు ప్రమాణము బ్రహ్మానందమే. అదియు మహాత్ములయనుభవములో నున్నది. శ్రుతులు నట్లు చెప్పుచున్నవి.

4. ఈకృష్ణుఁడు సదంశమున నాకాశమును బోలియున్నాఁడు. (సర్వవ్యాపకుఁ డయ్యు దేనితో సంబంధపడక యున్నాఁడనుట) జ్ఞానాంశమున నంతఃకరణమును బోలియున్నాఁడు. (సర్వమునకు సాక్షియై యున్నాఁడునుట) ఈసాక్షియే మాయాకల్పితమగురథము, తురగము మొదలగు ననేక భేదములతో నుండు నీసర్వప్రపంచమును జూచుచున్నాడు. సూర్యుని బోలిన తేజోవంతములగు పదార్థములను గూడ ప్రకాశింపజేయుచున్నాడు.

5. మనోవృత్తులు నశించినయెడల, నభిమానము తొలంగినయెడల నాపరమేశ్వరుఁడు పరమానుగ్రహ మొనంగును, పుణ్యాత్ములగువారు మెచ్చ నాహరిపాదముల నమ్మియుండినయువతి యొక్కతె యుండనోపు. కాకున్ననిచట స్త్రీలయడుగు లేల యుండును? నిశ్చయముగ నాకృష్ణునియుత్తము మానసము నెవ్వతెయో హరించినది.

6. అయినను ఆలోకాభిరాముఁడు కామరహితుఁడు. పరమశాంతుఁడు. జడమగు నీప్రపంచమువలనఁ గల్గిన సర్వవికారములను నశింపఁజేయువాఁడు. ఈయనయాజ్ఞవలననే చంద్రుఁడు, సూర్యుఁడు, వాయువు మొదలగు దేవతలు వారివారి కార్యములయందుఁ బ్రవర్తిల్లుచున్నారు. ఇట్టివాఁ డయ్యును స్త్రీల ననుకరించుచున్నాఁడనుట (కామపరతంత్రునివలెఁ గనఁబడుచున్నాఁడనుట) యొకలీలయే కాని వేఱుకాదు.

7. ఈయునకు నామధేయములే లేవు. అయినను సర్వప్రపంచమయుఁడు గావున ప్రపంచమునందున్న నామము లన్నియు నిమ్మహాత్మునివే యగుచున్నవి. మఱియు, ఓంకారము తురీయావస్థయందలి యానందము అనునవి స్వరూపముగాఁగల్గి, ప్రణవనాదము లయము నొందుచోటి కావలనిలచియుండు నీభగవంతునకు జాగ్రదవస్థవలనంగాని, సుషుప్త్యవస్థవలనం గాని మార్పేమియును గలుగదు.

8. జీవేశ్వరాది భేదములు లేనట్టియు, కళంకరహితుఁ డైనట్టియు నీ భగవంతుఁడు పూర్వపుణ్యపరిపాకవశమువలన మనదుఃకములం బోఁగొట్టుచు సంచరించుచూన్నాఁడు.

9. సర్వకాలములందు ప్రకాశించున్నదైను, కలదనిగాని లేదనిగాని చెప్పుటకు వీలులేని ఈనారాయణుని యథార్థస్వరూపమును గూర్చి వేదవాక్యానుసారముగా నారాయణతీర్థుఁడు వర్ణించెను.

శ్లో. పాణావాధాయపాణిం వ్రజపురవనితా కాపికాస్యాః ప్రగల్భాగ్రాహ్యాంగృష్టాంత మంతర్బహిరపివితతంస్వానుభూతి ప్రసిద్ధిం, సిద్ధం వేదాగ్రభాగే తదనుగుణనయైః బ్రహ్మవిత్సుప్రసిద్ధం నృత్యంతీ గాయతీతి ప్రకృతిపరతరం మానతో దర్శయంతీ.

శో॥ 16-17 ప్రగల్భ = నేర్పుగలిగినట్టి; కాపివ్రజపురవనితా = ఒకానొక గోపస్త్రీ; పాణిం = తనహస్తమును; కస్యాఃపాణౌ (పాణౌ+ఆదాయ) = ఒకానొక గోపిక హస్తమునందు; ఆదాయ = ఉంచినదై; గ్రాహ్యం = (చేరదీయ) గ్రహించబడతగినటు వంటి భక్తులను; గృష్టాంతం = చేరదీయు చుండునట్టిన్నీ; అంతర్బహివితతం = సర్వ వస్తువుల అంతర్బాహ్యములందు వ్యాపించివున్నట్టిన్నీ; స్వాను భూతి ప్రసిద్ధం = స్వంత అనుభవమందు గోచరించు నట్టిన్నీ; వేదాగ్రభాగే = ఉపనిషత్ భాగములందు; శిద్ధం = నిరూపించబడు చుండునట్టిన్నీ; తదానుగుణ = అట్టి ఉపనిషదర్థములకు అనుకూలమైన; నయైః ఆచారములచేత; బ్రహ్మవిత్సు = బ్రహ్మవేత్తలయందు; ప్రసిద్ధం = గోచరించుచుండునట్టిన్నీ; ప్రకృతి = పరాపర ప్రకృతులకు చేతన అచేతనములకు; పరతరం = విలక్షణడై నట్టిన్నీ (శ్రీకృష్ణస్వామిని); మానత: = శృత్యాది ప్రమాణము లపూర్వముగా; దర్శయంతి = శిద్ధాంతము చేయుచున్నది యై; గాయతి ఇతి = గానము చేయబడుచున్నది; నృత్యంతి = నృత్యముచేయబడుచున్నది.

"వేదవేద్యుఁడగు నా పరాత్పరుఁడు సకలలోకములయొుక్క లోపలను, వెలుపలను నిండి నకలవిషయముల నెఱుంగుచున్నాఁడు. ఇట్టి శుద్ధజ్ఞానస్వరూపుఁడైనను మాయాగుణములగు నత్వరజన్తమన్సులవలన విష్ణు బ్రహ్మ రుద్రరూపములతో ప్రసిద్ధిఁ జెందియున్నాఁడు. స్వానుభవమువలనఁగాని గోచరింపఁడు". అని మఱియొక గోపిక తన చెలియగు నొకదానిచేతిలో చేతి నుంచి గానముసేయుచు నృత్యముచేసెను. ప్రమాణపూర్వకముగ తనప్రౌఢ వాక్యములచే నామహాత్మ్యనిరూపమును బ్రకటించుచుండెను.

## 7వ కీర్తన - మధ్యమావతి రాగం - అటతాళము

ప. దేవ దేవం క్వేతి తం  మృగయామ వయమిహ

1. దృశ్యవస్తుషు దృక్తయా  సతతం సతి ప్రతిభాతి
ప్రత్యగాత్మతయా పి బుద్ధిషు  నిత్యమేవ పునాతివయమిహ

| | | |
|---|---|---|
| 2 | ప్రాణబుద్ధిలయోదయా దపి | భాసయ త్యమలేన |
| | స్వప్రకాశ సుఖాత్మనోదయ | హానిధీరహితేన వయ మిహ |
| 3. | యేన విశ్వపదాభిధాన | ఇహైకతా మనుయాతి |
| | తత్ర సర్వసుఖైకరసే | పరాత్మని భాతి వయ మిహ |
| 4. | చింత్యతే యదచింత్యరూప | తయైవ యోగివరేణ |
| | సంతతం హృదయాంతరం | సఖిభాతిధీరవరేణవయమిహ |
| 5. | నందయత్యఖిలం జనం | నిజనిత్యబోధసుఖేన |
| | ఛందసా మఖిలాగ్రభాగవిని | శ్చితేన సమేన వయ మిహ |
| 6. | పౌరజానపదానుగో రమతే | నృపో హి యథైవ |
| | ప్రాణబుద్ధ్యనుగ స్తనౌవికృతిం | విభాతి వినైవ వయ మిహ |
| 7. | రాజవత్ఫలమాత్ర భోగితయా | తనౌ సువిభాతి |
| | బాలవద్విగతానురాగ తయపి | యోసబిభేతి వయ మిహ |
| 8. | గోపనీయతయా పిగోప | వధూభి రాభి రమాని |
| | శ్రీమదాత్మకభావభావనయా | స ఏవ భవాని వయ మిహ |
| 9. | వేదభాగవిచారజాతమతి | ప్రియప్రణయేన |
| | వర్ణితం శివరామతీర్థపదాంబుజభ్రమరేణ వయమిహ | |

ప. ఇహ = ఇక్కడ; వయం = మనము; తందేవదేవం = ఆ దేవదేవుడైన స్వామివారిని; క్వేతి = ఎక్కడనని; మృగయామ = వెదకెదము?; దృశ్యవస్తుషు = కనబడుచుండు పదార్థములందు; దృక్తయా = దృక్కు స్వరూపముగా; నతతం = ఎల్లప్పుడున్నూ; ప్రతిభాతినతి = ప్రకాశించుచుండగా; ప్రత్యగాత్మతయా అపి = జీవాత్మకు అంతర్యామిగా నుండుటవల్లనున్నూ; బుద్ధిషు = సమస్త బుద్ధులయందున్నూ; నిత్యమేత = ఎల్లప్పుడున్నూ; పునాతి = పవిత్రము చేయుచున్నది - అట్టి శ్రీకృష్ణుని; వయం = మనము; ఇహ = ఇక్కడ; క్వేతి మృగయామ = ఎక్కడని వెదకెదము; మామిడికాయ-కాయలోముట్టె - ముట్టెలో పప్పుఏలాగో కళేబరము - జీవుడు; జీవుడు - పరమాత్మ అట్లు.

2. ప్రాణబుద్ధి = ప్రాణబుద్ధులయొక్క; లయోదయాదతి = ప్రాణబుద్ధులు, లయము, ఉదయము కలుగుచున్నందున అమలేన = నిర్మలముగా; భాసయ = ప్రకాశింపజేయుచున్నది;.స్వప్రకాశ సుఖాత్మనా = స్వకీయ ప్రకాశము ఆనందము కలిగియుండ; ఉదయ హాని ధీ రహితేన = ఆ పరవస్తువు ఉత్పత్తి నాశములులేక యుండగా వయం = మనము; ఇహ = ఇక్కడ; క్వేతి మృగయామ = ఏమని వెదకెదము.

3. యేవ = ఏ పరమాత్మచేత; విశ్వపదాభిధాన = జాగ్రత్త అవస్థయందు 'విశ్వుడు' అను నామధేయముగలవాడు; ఇహ = ఇక్కడ, ఏకతాం = కూడుకొని, అనుయాతి = పొందుచున్నాడో; తత్ర = అటువంటి; సర్వసుఖైకరసే = సమస్తసుఖములకు ఏక స్వరూపుడుగా నున్న, పరమాత్మనిభాతి = పరమాత్మ ప్రకాశించుచుండగా; ఇహ = ఇక్కడ, వయం = మనము, క్వేతి మృగయామ = ఏమని వెదకెదము?

4. ధీర వరేణ = శ్రేష్ఠమైన ధైర్యము కలిగినటువంటి, యోగివరేణ = ఉత్తమయోగిచేత, సతతం = ఎల్లప్పుడున్నూ; హృదయాంతరం = హృదయ మధ్యమందు; యత్ = ఏ పరవస్తువు; అచింత్య రూపతయాఏవ = చింతనా తీతమైనటువంటి వస్తువుగానే; చింత్య = ధ్యానము చేయబడుచున్నవాడో - అట్టివస్తువు; భాతి = ప్రకాశించుచుండగా; సఖి! = ఓచెలీ!; వయం = మనము; ఇహ = ఇక్కడ; తం = ఆస్వామివారిని; క్వేతి మృగయామ = ఏమని వెదకెదము?

5. చందసాం = వేదములయొక్క; అఖిలాగ్రభాగ = సమస్త అగ్రభాగములైన ఉపనిషత్తులచేత, వినిశ్చితేన = నిశ్చయించబడిన; సమేన = సమత్వము గలిగినట్టిన్నీ (అనారోపితమైనట్టిన్నీ), నిజ = స్వకీయమైనట్టి; నిత్య = శాశ్వతమైనట్టి; బోధ సుఖేన = జ్ఞానసుఖముచేత; అఖిలంజనం సమస్తజనులను; నందయంతి = సంతోషపెట్టుచున్నారు. - ఇట్లుండగా; వయం = మనము; ఇహ = ఇక్కడ; తం = ఆకృష్ణుని; క్వేతి మృగయామ = ఏమని వెదకెదము?

6. యద్వైవ = ఏ ప్రకారముగనైతే; నృపః = రాజు; పౌర జానపదా = పురజనులను పల్లెటూళ్ళయందుండు వాండ్లను; అనుగః = పరివారముగలవాడై; రమతే = ఆనందించునో - అవిధముగా; తనౌ= ఈ శరీరమునందు; ప్రాణబుధ్య = ప్రాణ బుద్ధులను; అనుగ = పరివారముగాగలవాడై; వికృతిం వినా ఏవ = వికారము నొందకనే; విభాతి = ప్రకాశించుచుండగా; వయం = మనము; ఇహ = ఇక్కడ; తం = ఆకృష్ణుని, క్వేతి మృగయామ = ఎక్కడ అని వెదకెదము?

7. రాజవత్ = రాజువలెనే; ఫలమాత్ర భోగితయా = ఫలమును మాత్రమే అనుభవించుచున్నవారై; తనౌ = దేహమునందు; సువిభాతి = చక్కగా ప్రకాశించుచున్నారు - మరియు; యః = ఏపరమాత్మ; బాలవతు = బాలునివలెనే; విగతానురాగతయా అపి = అనురాగ రహితుడైయుండుచూ; నబిభేతి = ఎవరి వలనను భయపడడో; వయం = మనము; ఇహ = ఇక్కడ; తం = ఆ శ్రీకృష్ణపరమాత్మను; క్వేతి మృగయామ = ఎక్కడునని వెదకెదము?

8. అభిః గోపవధూభిః = ఈ గోపస్త్రీలచేత; గోపనీయతయా = రహస్యముగా వుంచుకోబడవలసినట్లు; అమాని అపి = ఎంచబడుచున్నాను; శ్రీమదాత్మక భావ భావనయా - శ్రీమత్ = లక్ష్మీవిశిష్ఠుడైన; ఆత్మక = పరమాత్మయందు; భావ = భక్తిభావమును; భావనయా = భావించుటచేత; సేవ = ఆ స్వరూపులమే; భవాని = కాగలము (అయ్యెదము) కనుక; వయం = మనము; ఇహ = ఇక్కడ; తం = ఆకృష్ణుని; క్వేతి మృగయామ = ఏమని వెదకెదము?

9. వేదభాగ = వేదభాగములను; విచార = విచారించుటచేత; జాత = కలిగినట్టి; మతి = జ్ఞానమునందు; ప్రియ = ప్రీతికలిగిన; ప్రణయేన = భక్తుడైనట్టిన్ని; శివరామతీర్థ = శివరామ తీర్థులవారియొక్క, పదాంబుజ = పాదారవిందముల యందు తిరుగుచుండెడు; భ్రమరేణ = భృంగస్వరూపుడైన తుమ్మెదగా శ్రీనారాయణతీర్థుల వారిచేత; వర్ణితం = వర్ణింపబడుచున్న శ్రీకృష్ణస్వామివారిని; వయం = మనము; ఇహ = ఇక్కడ, క్వేతి మృగయామ = ఏమని వెదకెదమం

ప ఆదేవదేవుఁ డెచట నున్నాఁడని మనము వెదకుదము (ఆయన సర్వవ్యాపకుఁడై యుండ నివనమున వెదుక నేల) అని భావము.

1. అమహాత్ముఁడు మన మేపస్తువును జూచుచున్నను, దేనిని వినుచున్నను, ఏవిషయము నెట్లు గ్రహింపుచున్నను, అచ్చట నెల్ల సాక్షిస్వరూపముతోఁ బ్రకాశించుచున్నాఁడు జ్ఞానరూపుఁడగు పరబ్రహ్మమే మనసును ప్రవేశించి సంకల్పము చేయును. ఇంద్రియములం జెంది చూచుట మొదలగు కార్యములఁజేయును. ఆకాశమువలె నామహాత్ముఁడు సర్వస్థలములందును వ్యాపించియే యున్నను స్వచ్ఛములగు నద్దములలో నుంపఁబడినదీపమువలె, మనసు మొదలగువానియందుమాత్రము స్పష్టముగఁ బ్రకాశించుచున్నాఁడు. అని తాత్పర్యము (గ్రహించునది) మఱియు నకల బుద్ధి వృత్తులయందును జీవన్వరూపముతోఁ బ్రకాశించుచున్నాఁడు. "ప్రతిబోధివిదితం మతం" అనుశ్రుతియం దీయభిప్రాయము బోధింపఁబడియున్నది. నాచేత వివరింపఁబడిన (బ్రహ్మగీత, అధ్యా. శ్లో) ఇట్లు సర్వము పవిత్రముఁజేయుచున్న అమహాత్ముని మనము వెలుపల నెచ్చట వెదకుదము.

2. ప్రాణము, బుద్ధి మొదలగునవి నాశము నొందినను, ఉత్పత్తిఁ చెందినను (ప్రాణ, బుద్ధివృత్తులు ఒకప్పుడు గానవచ్చును, మఱియొకప్పు డడంగియుండును. (ప్రాణవృత్తియడంగుట యనఁగా మృతిఁ జెందుటయే÷ కావున నిట్లు చెప్పఁబడినది. అనఁగా జన్మమరణమువలనఁగాని, జాగ్రత్, సుషుప్త్య వస్థలవలనఁగాని యని భావము) అమహాత్ముని స్వయంప్రకాశానందస్వరూపమునకు నాశముగాని, రూపమునకు నాశముగాని, యుత్పత్తిగాని లేదు. (ఒకగృహమునందు నివసించుపురుషుఁడు అగృహనాశముతోఁ గూడ తాను నశింపఁడుకదా? అట్లే యీపరమాత్మయు తనకు నుపాధులగు (ఆవరణములగు) బుద్ధ్యాదులు వినాశమునొందినంతమాత్రమునతాను వినాశము నొందఁడని భావము) అట్టి నిర్మలమగు ప్రకాశముతో నీనర్వమును ప్రకాశింపఁజేయుచునేయుండు, ఆయనను మనమెచ్చట వెదకవలయును.

3. స్థూలశరీరము నభిమానించు విశ్వుఁడనుజీవుఁ డెవ్వనికంటె వేఱుకాఁడో, అట్టిపరమానంద స్వరూపుఁడు స్పష్టముగఁ బ్రకాశించుచుండఁగా ఆయనను మనమెచట వెదకఁగలము? స్థూలశరీరము నభిమానించుట యనఁగా స్థూలశరీరావరణములో నుండుట. ఇది సర్వవ్యాపకునకు స్వతస్సిద్ధమేయని తెలిసికొనవలయును.)

4. ఓచెలీ! అమహాత్ముని స్వరూపము దెలిసికొనుట కెవ్వరికిని సామర్థ్యములేదు. అయినను (మార్పుచెందనిది) విజ్ఞానవంతులగు యోగులు "ఓమహాత్మా! నీస్వరూపము మనసునకగోచరము" అనియే (అలంబ మేమియులేకయే) ధ్యానించుచుందురు. సకలహృదయగతుఁడగుటచే నాసర్వవ్యాపకుఁడు స్పష్టముగఁ బ్రకాశించుచునే యున్నాడు. ఆయనను మన మెచట వెదుకఁగలము?

5. వేదాంతముందు నిర్ణయింపఁబడి సర్వజనసాధారణమై (బాహ్యములగువర్ణ, ఆశ్రమాది భేదములు బ్రహ్మజ్ఞానమునం దాటంకములు కావని తాత్పర్యము) యున్నయాత్మజ్ఞానానందముచే సకలభక్తజనుల నానందింపఁజేయుచు నమ్మహాత్ముఁడు ప్రకాశించుచున్నాఁడు. అయనను మన మెచట వెదుకఁగలము?

6. ప్రభువగువాఁడు తనరాజ్యమునందలి పురవాసులతోను, గ్రామవాసులతోను గలసియెట్లు క్రీడించునో, అట్లే యీపరమాత్ముఁడు ప్రాణము బుద్ధి మొదలగుదానితోఁ గలసియు నిర్వికారుఁడై ప్రతిశరీరమునందును విహరించుచున్నాఁడు. అయనను మనమెచట వెదుకఁగలము?

7. మఱియు నాకృష్ణుఁడు ఫలములనుమాత్ర మనుభవించుచు (ఇచట యనుభవమనఁగా గ్రహించుటయే) రాజువలె (రాజుకూడ పంటలు మొదలగువానినే యనుభవించువాఁడుకాని యితరులవలె విత్తనములఁ జల్లి కృషిచేయువాఁడుకాడు) నీశరీరమునఁ బ్రకాశించుచున్నాఁడు. మఱియు నా ఫలములయం (శరీరవక్షమున ఫలములనఁగా సుఖదుఃఖములు) దిచ్ఛలేనివాఁడగుటచే బాలునియట్లు నిర్భయుఁడైయున్నాఁడు (రాగద్వేషములు లేకుండుటచే నొకరి ననుసరించుటయు, నొకరితో విరోధముచేసికొనుటయు నాయనకులేవు. ఈ కారణమువలన పరులవలని భయ మాయనకు లేదని భావము) ఆయనను మన మెచట వెదుకఁగలము?

8. ఆపరమేశ్వరుఁడు మనహృదయములందు నిలిచి మిగులరహస్యముగాఁగూడఁ బూజింపఁబడు చున్నాఁడు. అభగవంతుని తత్త్వమునకును, మనకును భేదములేదను విషయమును బాగుగ ధ్యానింతుమేని మనము కృష్ణులమే యగుదుము. ఇట్లుండ అయనను మనమెచట వెదుకఁగలము?

9. ఇట్లు వేదాంతజ్ఞానముచే పరమార్థము నిశ్చయించియున్న రామతీర్థుని శిష్యుఁడగు నారాయణతీర్థునిచే కృష్ణచరితము వర్ణింపఁబడెను. (ఇంతకు ముందు నారాయణతీర్థునిగురువు హరితీర్థుఁడని చెప్పఁబడియున్నది. ఆయనకే రామతీర్థుఁడని రెండవపేరుగా నుండవచ్చును.)

శ్లో. మూర్తామూర్తే యదనువితతే మాయయా యస్య రూపే
సచ్చత్యచ్ఛే త్యుభయరస ఇత్యాగమోక్తో య ఆత్మా
నేతీ త్యేవం యదవధి జగద్బాధ్యతే యస్య దృష్ట్యా
సర్వోత్కృష్టం తమిహ మృగయంత్యాహ గోపీముకుందమ్.

శ్లో 18-19. యస్యమాయయా = ఏపరమాత్మునియొక్క సంకల్పరూపజ్ఞానముచేత; మూర్తామూర్తే = సాకారములు నిరాకారములు అయినట్టి; రూపే = రూపములు; యదనువితతే = ఏ స్వామివారిచేత వ్యాపించబడి యున్నవో; య ఆత్మ = ఏ పరమాత్మ; సచ్చ = సద్రూపమనిన్నీ త్యచ్ఛే = అసద్రూపమనిన్ని; (మార్పుగలది అనిన్ని); ఇతి = ఇట్లని; ఉభయరసితి = రెండురూపములుగలవానినిగా (రెండురూపములుగా వుండువానినిగా); ఆగమ ఉక్తః = వేదములయందు చెప్పబడుచున్నారో; యత్ అవధి = ఏ స్వరూప పర్యంతము ఉండునట్టి;

జగత్తు = ప్రపంచము; యస్యదృష్ట్యా = ఎవనియందు దృష్టినిలుపుటవలన; నితి (నేతి) = ఇదికాదు. ఇదికాదు. అని (నిత్యముకాదు)-అని; ఇత్యేవం = ఈప్రకారము; బాధ్యతే = బాధింపబడుచున్నదో (అనగా నిషేధింపబడుచున్నదో); తం = అట్టి; సర్వోత్కృష్టం = సర్వాతిశయుడు అయినట్టి; ముకుందం = శ్రీకృష్ణస్వామివారిని; గోపి = ఒకానొకగోపిక; మృగయంతం = వెదకుచున్నదియై; ఇహ = ఇక్కడ; ఆహ = పలికెను.

ఆపరమేశ్వరునకు మాయావశమువలన సాకారములు నిరాకారములునగు రూపములుగలవు. (అనఁగా మనకు కనఁబడు పదార్థములును, కనఁబడని పదార్థములునుగూడ బ్రహ్మమేయనుట) ఆయాకారములకే వేదమున సత్, (మనకు కనఁబడు అగ్ని మొదలగు మూఁడుభూతములు) త్యత్ (మనకగోచరములగు ఆకాశవాయుభూతములు) అనునామధేయములు వ్యవహరింపఁబడుచున్నవి. ఇట్టివాఁడగుటచేతనే, ఉభయాత్మకుండని యవ్విభుఁడు వర్ణింపఁబడు చున్నాఁడు ఆమహాత్ముని చక్కఁగ నెఱింగిన యాసకలప్రపంచంబును 'నేతి, నేతి' అను శ్రుతివాక్యముచొప్పున నధిష్ఠానావశేషముగ (సర్వాధిష్ఠానమగు పరబ్రహ్మము మిగులువఱకు) బాధనొందును. (పరబ్రహ్మము నెఱింగిన నాయనకంటె వేఱుగా నేదియును గానరాదనుట) అట్టి లోకోత్తరుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మమును వెదకునప్పుడు మఱియొక గోపిక యిట్లనియె.

### 8వ- కీర్తన - కాంభోజి (హుసేని) రాగము - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | సహచరి సమరస | మిహ మృగయంతే |
| అ. | సజ్జనసంగరతా మునయో భువి | నిగమశిరస్సుఖదంతే |
| 1. | గిరితరుసాగరసరిదపరాత్మతయా | సతి భాతిముకుందం |
| | సురనరమృగఖగరూపతయా పి | విభాతి చిరం సుఖకందం |
| 2. | ఇహ మధుమాధవముఖర్తువత్సర | రూపతయా పి విభాతి |
| | దినకరతా నిశాకరపావకభూజల | భావముపైతి |
| 3. | గగనమరుద్ద్వివిధాత్మతయా పి | పరాత్మని సర్వదృగంశే |
| | అహమహమిత్యనుభూతివిశేషణ | భూతతయా నుభవాంశే |
| 4. | ఇదమిహదృశ్యమదృశ్యతయా | త్మని భాసయతి స్వవిభాతే |
| | అపహతశోకభయే గగనోపమ | దేహతయా ఖిలభూతే |
| 5. | జగదుపమర్దిత మాగమభాగ | విచారధియాపునరేతం |
| | చిర మవివేకసమర్పిత మాత్మని | యత్రజనై రనుభూతం |
| 6. | ధనపశుపుత్రకళత్రఫలాని | యదర్థతయా భువిసంతి |
| | స్వయ మపరోక్షతయా సకలస్య | మహ త్యుపలబ్ధరిభాతి |
| 7. | సకలజగ న్మధుని స్వయ మవ్యయ | బోధతయా సువిభాతె |
| | అమృతర్తే జగతి వ్యయ మేతి | సదాత్మతయా ప్యనుభూత్నా ల |

8. ప్రజయువతీజనవల్లభభావ — ముపేయుషి నవజలదాభే
నవరసశాలిని శుభవనమాలినివ — కామిని కనకలతాభే

9. మురరిపుభావరసాభినివేశ — జనాంతరభూషణభూతం
అధిగతబోధనిదాన మిదం — శివనారాయణయతిగీతం

ప. సహచరి! = ఓ చెలీ!; భువి = ఈ భువియందు; సజ్జనసంగరతా = సత్పురుషుల సాంగత్యమునందు అసక్తిగలిగినట్టి; మునయః = వేదార్థ మననము చేయునట్టివారు ఎవరో; తే = అట్టివారలు; నిగమ శిరస్సుఖదం = ఉపనిషత్ ప్రతిపాద్యమైన సుఖము నిచ్చునట్టి, సమరసం = సర్వసముడైనట్టి స్వామివారిని; ఇహ మృగయంతే = ఇక్కడ వెదకుచున్నారు.

1. గిరి = పర్వతములు; తరు = వృక్షములు; సాగర = సముద్రములు; సరిత్ = నదులు (ఈరూపములగు); అపర = అపర ప్రకృతికి; అత్మతయా = అంతర్యామిగా; భాతి = ప్రకాశించుచున్నాడు (మరియు, అస్వామివారు); సతి! = ఓచెలీ!; సుర = దేవతలు; నర = మనుష్యులు; ఖగ = పక్షులు; మృగ = మృగములు; రూపతయా అపి = ఈ రూపములుగానున్నూ; చిరం విభాతి = చాలాకాలమునుండి ప్రకాశించుచున్నారు - అటువంటి; సుఖకందం = సుఖస్వరూపుడైనట్టి; ముకుందం = శ్రీకృష్ణస్వామివారిని; ఇహ మృగయంతం = ఇక్కడ వెదకుచున్నాము - మరియు

2. ఇహ = ఇక్కడ; మధు = చైత్రమాసము; మాధవ = వైశాఖమాసము; ముఖ = మొదలైన (12 మాసములును); ఋతు = వసంతాది ఋతువులయొక్క; వత్సర = ప్రభవాది సంవత్సరములయొక్క; రూపతయా అపి = రూపముతోగూడా నున్నూ; విభాతి = ప్రకాశించుచున్నారు - మరియును; దినకర = సూర్యునియొక్కయు; తార = నక్షత్రములయొక్కయు; నిశాకర = చంద్రునియొక్కయు; పావక = అగ్నియొక్కయు; భూ = భూమియొక్కయు; జల = జలముయొక్కయు; భావం = స్వరూపమును; ఉపయతి = పొందుచున్నారో - అట్టిస్వామివారిని మౌనులుసహా వెదకుచున్నారు

3. గగన = ఆకాశము; మరుత్ = వాయువు (మొదలగు); వివిధ = అనేకవిధములైన; అత్మతయా అపి = రూపములుగానున్నూ; విభాతి = ప్రకాశించుచున్నారు; సర్వ = సర్వభూతములయొక్క; దృగంశే = జ్ఞానానందమైనట్టి; పరమాత్మని = పరమాత్మ స్వరూపమునందు; అహం అహం ఇతి = 'నేను' 'నేను' అనునట్టి; అనుభూతి = అనుభవమునకు; విశేషణ భూతతయా = విషయరూపముగా; అనుభవాంసే = అనుభూతమగుచుండు వస్తువుగా; విభాతి = ప్రకాశించుచున్నాడో; తే = అట్టి శ్రీకృష్ణుని; మునయః = మౌనులు; ఇహ మృగయంతే = ఇక్కడ వెదకుచున్నారు.

4. ఇహ = ఈలోకమునందు; ఇదం దృశ్యం = ఈ దృశ్యప్రపంచమును; ఆత్మని = తనయందు (ఉంచుకొని); అదృశ్యతయా = తాను ఇతరులకు కనబడకుండా, భానయతి = ప్రకాశింపజేయుచున్నాడో; అపహత శోకభయః = శోకభయములులేనివాడై; అఖిలభూతే = సమస్త భూతములయందు; గగనోపమదేవతయా = ఆకాశముతో సమానమైనట్టి రూపముగలవాడై; విభాతి = ప్రకాశించుచున్నాడో; తె = అట్టి శ్రీకృష్ణుని, మునయః = మౌనులు; ఇహ మృగయంతే = ఇక్కడ వెదకుచున్నారు.

5. చిరం = చిరకాలమునుండి; అవివేక సమర్పితం = అజ్ఞానమునకు వశముగా చేసుకొనబడినదై; జగత్తు = ఈ జగదంతరమైన సకలజీవులయొక్క జ్ఞానము; ఉపమర్దితం = కలుషీకృతమైనది (అజ్ఞానముతో కూడియున్నది); ఏతం = అట్టి ఈ జ్ఞానము; యత్ర ఆత్మని = ఏపరమాత్మయందు; జనైః = జనులచేత; ఆగమభాగ విచారధియా = వేదభాగములను విచారించునట్టి బుద్ధిచేత; పునః = మరల; అనుభూతం = అనుభవమునకు తెచ్చుకొనబడియున్నదో; తె = అట్టి శ్రీకృష్ణస్వామివారిని; ఇహ = ఇక్కడ; మునయః మృగయంతే = మునులుగూడా వెదకుచున్నారు.

6. ధన = ధనములు; పశు = పశువులు; పుత్ర = పుత్రులు; కళత్ర = భార్య-ఈరూపములైన; ఫలాని = ప్రయోజనములన్నియు; యదర్థతయా = ఏపరమాత్మనిమిత్తమై; భువి = ఈలోకమునందు; సంతి = ఉంటున్నవో; సకలస్య = ఈ సకల పదార్థములు; స్వయం = స్వయముగానే; అపరోక్షతయా = ప్రత్యక్షముగా (అనగా దృశ్యములైనవియై); మహతి = మహాత్ముడైన; ఉపలబ్ధిం = సర్వద్రష్టయైన భగవంతునియందు; భాతి = ప్రకాశించుచున్నాడో; తే = అట్టి సర్వేశ్వరుని; మునయః ఇహ మృగయంతే మునులు ఇక్కడ వెదకుచున్నారు.

7. సకలజగన్నాథుని = సకలజగత్తునకు ఆనందమునుగల్గించు పరమాత్మ; స్వయం = స్వయముగా; అవ్యయబోధతయా = సంకోచముగలుగని జ్ఞానస్వరూపుడుగా; సువిభాతే = లెస్సగా ప్రకాశించుచున్నాడు-అయినను; సదాత్మతయా = ఎల్లప్పుడు ఏకవిధమైన ఆత్మస్వరూపముగా; అనుభూతేఅపి = అనుభవింపబడదగినవాడుగా; జగతి = ఈ జగత్తునందు (అజ్ఞానిగా వుండువాడు); అమృతమతె = మోక్షస్వరూపుడగు పరమాత్మను విడిచినవాడై; వ్యయం ఏతి = శోక మోహాది వికారభావములనొందుచుండునో; తే = అట్టిశ్రీకృష్ణుని; మునయః మృగయంతే = మునులు వెదకుచున్నారు.

8. కనక లతాభే = బంగారు తీగతో సమానమైన ప్రకాశమానము గలిగినట్టి; కామినీ! = ఓచెలీ!; వ్రజయువతీ జన వల్లభ భావం -వ్రజయువతీజన = గోపస్త్రీలకు; వల్లభభావం = ప్రియముగానుండు స్వరూపమును; ఉపేయుషి = పొందినటువంటిన్నీ; నవజలదాభే = నూతనమేఘముతో సమానమైన ప్రకాశముకలిగినట్టిన్నీ; నవరసశాలిని = నవరసములతో ఒప్పుచున్నట్టిన్నీ; శుభవనమాలిని = మంగళప్రదమైన వనమాలధరించినట్టిన్నీ; తే = అట్టిస్వామివారిని; మునయః మృగయంతే = మునులు వెదకుచున్నారు.

9. మురరిపుభావరస = విష్ణుభక్తి రూపమైన రసమునందు; అభినివేశజ = అత్యంత ఆసక్తిగల భాగవతులయొక్క; అంతర = మనస్సులకు; భూషణభూతం = అలంకారముగా నుండునట్టిన్నీ; అధిగత బోధనిదానం = ఆధ్యాత్మజ్ఞానమునకు హేతువైనట్టిన్నీ; అధికారణమైనట్టిన్నీ; ఇదం = ఈకీర్తన; శివనారాయణయతిగీతం = శివనారాయణతీర్థులవరిచేత గానము చేయబడినది.

ప.అ. ఓ చెలీ! మన మొక్కరమేకాము. సజ్జనసహవాసమున పరిశుద్ధచిత్తులగు నమ్మహామునులుకూడ పరమానందస్వరూపుఁడగు నవ్వేదాంతవేద్యుని వెదకుచుందురు.

1. జ్ఞానస్వరూపుఁడగు నీనారాయణుఁడు పర్వత, వృక్ష, సముద్రనదీరూపములతోను, జీవరూపముతోను, దేవ, మనుష్య, పక్షి, మృగరూపములతోను స్పష్టముగఁ బ్రకాశించుచున్నను మహామునులు ఆయనను చాలు కాలమునుండియు వెదకుచునేయున్నారు.

2. ఆపరమేశ్వరుఁడే చైత్రము మొదలగు ద్వాదశ మాసములరూపముతోను, వసంతాది షడృతువుల యాకారముతోను, సంవత్సరాకృతితోను ప్రకాశించుచున్నాఁడు. సూర్య, నక్షత్ర, చంద్రాగ్ని, భూ, జలరూపములకు జెంది ప్రపంచమున విహరించున్నాఁడు.

3. మఱియు, ఆకాశ వాయ్వాదిరూపములతోఁ గూడి ప్రకాశించుచున్నాఁడు. ఇదియునుగాక లోకమునంది సకలపదార్థములను అనుభవించునప్పుడు (ఇంద్రియాదులచే గ్రహించునప్పుడు) ఆ యనుభవమునకు విశేషణ రూపుఁడై "నేను ధీని ననుభవించుచున్నాను" అని చెప్పునప్పుడు నేను అను పదము అనుభవమునకు విశేషణమగును. విశేషణమనఁగా నొకవిధమగు భేదమును కల్పించునది. "నేను, నేను" అని సాక్షిస్వరూపముతోఁ బ్రకాశించున్నాఁడు. విషయానుభవము ముగిసినపిదప నీయనయే పరబ్రహ్మస్వరూపమున నిలచుచున్నాఁడు. లేక యీ పరబ్రహ్మమునందే సకలానుభవములకు వ్యాఖ్యానము.)

4. దుఃఖభయాదులు లేక ఆకాశమునుబోలె సర్వవ్యాపకుఁడై, లేక స్వరూపుఁడై (ఇచ్చట ఆకాశోపమానము నిర్వికారత్వమును దెల్పుటకై మాత్రమే యుపయోగింపఁబడెనని తెలిసికొనవలయును) యుండు నాస్వయంప్రకాశుఁడు తా నెవ్వరికిని దృశ్యుఁడుగాక యీ సకలదృశ్యపదార్థములను తనయందే నిల్పుకొని ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

5. అయినను ఈప్రపంచము మిగుల విస్తరించి యుండుటవలన దానిచేఁగప్పఁబడి యెవ్వరికిని తెలియఁబడదు. బహుకాలము వేదాంతవాక్య విచారముఁజేసి మనస్సు నిర్మలమును జేసికొనినచో నప్పుడనుభవగోచరుండగును.

6. లోకమునందు ధనము, పశువులు, పుత్రులు, భార్య మొదలగు విషయములన్నియు ఆత్మార్థముగానే (బ్రహ్మకొఱకే) కోరఁబడుచున్నవి. అవి యెల్లనుదృశ్యములే కావున సర్వసాక్షియగు నమ్మహాత్ముని ప్రకాశమునాధారము చేసికొనియే ప్రకాశించుచున్నవి.

7. నిత్యజ్ఞానస్వరూపుఁడగుటచే నాపరమేశ్వరుఁడు స్పష్టముగఁ బ్రకాశించుచున్నను మోక్షరూపుఁడై, సకలలోకములకు నానందమును కలిగించుచున్నను, సత్తామాత్రస్వరూపుఁడని (ఉనికియే స్వరూపముగాఁ గలవాఁడని) ప్రత్యక్షముగ ననుభవింపఁబడుచున్న 'ఆయనకు, జీవునకు భేదము లేదను విషయము అనుభవసిద్ధమైనను, లోకమునందు జనులు నాశమునొందుచున్నారు. (నశించుచున్నారని లోకులు భావింపుచున్నారనుట) ఇదియేటి చిత్రము?

8. సువర్ణచ్ఛాయగల ఓచెలీ! ఆ పరబ్రహ్మరూపుఁడు నేఁడు నీలమేఘశ్యావర్ణముతో దివ్యశరీరముఁదాల్చి మనకు ప్రియుఁడై విహరించుచున్నాఁడు.

9. శ్రీకృష్ణ భక్తులగుమహాత్ముల హృదయములంకలంకారముగా వేదాంత తత్త్వమును బాగుగాఁ దెలియఁజేయునట్టి యీగీతమును నారాయణతీర్థుఁడు రచించెను

శ్లో. మధుత్వేన చ యిత్సిద్ధం భూతభౌతికవర్గయోః,
సో యం సాక్షాత్పరానందం సహచర్యా నువర్తతే

శ్లో 17 భూత భౌతిక వర్గయోః భూత = పంచభూతములయొక్కయున్నూ; బౌతిక = వాటివల్ల ఉత్పత్తి అయిన జంతువులయొక్కయున్నూ; వర్గయోః = సమూహములయందు: మధుత్వేనచ = ఆనందరూపముగా నుండుటచేత; యత్ = ఏ పరబ్రహ్మ; సిద్ధం = సిద్ధంగా వేంచేసియున్నారో; సః+అయం (సోయం) = అట్టి శ్రీకృష్ణస్వామివారు; సాక్షాత్పరానందం = ప్రత్యక్షముగానుండు ఆనందమూర్తి; సహచర్యా = ఒకగోపికతోటి; అనువర్తతే = కూడా విహరించుచున్నారు

పంచభూతములకును, వానివలన జనించిన సకల పదార్థములకును, మధువై (మధువువలె నానందపఱచువాఁడై) యుండు నేపరబ్రహ్మముగలఁడో ఆయనయే యీకృష్ణుఁడు ఒక చెలితోఁగూడి విహరింపుచుండెను. (కవి యచటికి గోపికలవృత్తాంతమును విడచి కృష్ణుని వృత్తాంతమును జెప్ప నారంభించుచున్నాఁడు. కృష్ణుని యడుగలుకు పార్శ్వమున నొకయువతి యడుగులు గూడ గానవచ్చెనని యిదినఱకు చెప్పఁబడియున్నది. ఆ స్త్రీనిగూర్చి చెప్పుటకై యీ సందర్భ మారంభింపఁబడినది.)

అవతారిక :-

ఇచట గోపికలు స్వామివారిని వెదకుట కథను నిలిపి -శ్రీకృష్ణ అంతర్ధానము మొదలు రాధా కృష్ణులకు జరిగిన కథను వర్ణించుచున్నారు

రాధాకృష్ణసంవాదము

## అథ రాథా మాధవ సంవాదం - (రాధాకృష్ణ సంవాదము)

మధ్యమావతీరాగం (నాదనామక్రియ) - జంపెతాళము

| | | | |
|---|---|---|---|
| 1. | రాధా. | కలభగతికలిత ఘన | కాలమేఘాభ |
| | | కలయ మమ రహసి | కుతుకాని సుబహూని |
| 2. | కృష్ణః | కలహంసగామిని | తథైవ కరవాణి |
| | | కథయసి యథా సపది | కథయ పర మద్య |
| 3. | రాధా. | విమలకల్యాణగుణ | వివిధవిశ్వాత్మ్ |
| | | విగళితదుకూలమథ | రచయ మమ సుదృఢం |

| | | | |
|---|---|---|---|
| 4. | కృష్ణః | బాధ మబలే తవ | దృఢం విరచయామి |
| | | హాటకదుకూల | మాయాహి తరుమూలం |
| 5. | రాధా. | రచయ మృగమదతిలక | మతిలలిత మద్య |
| | | కుచకలశయుతమపి | సకుంకుమవిలేపం |
| 6. | కృష్ణః | రచయామి తిలకమపి | తవ లలితఫాలే |
| | | కుచకుంభ యుగళేపి | కుంకుమవిలేపం |
| 7. | రాధా. | గళితకచనిచయ మథ | ఘటయ మమకృష్ణ |
| | | గమయ మామిహ రహసి | కేశవ కృపాళో |
| 8. | కృష్ణః | ఏహి మమ హృదయ | కుతుకం కలయరాధే |
| | | ఇహ సముపవిశ రహసి | దేహి ముద మద్య |
| 9. | రాధా | కుసుమనిచయాపచయ | మద్య కురుకృష్ణ |
| | | కుంతలభరం ఘటయ | మమ కుసుమభారైః |
| 10. | కృష్ణః | మమ రమణి కుసుమ | భారై రలంకుర్వే |
| | | సుమశరశరానన | సమంతు కచనిచయం |
| 11. | రాధా సరసవరగంధి సుర | | సాలఫలవర్గం |
| | | నిరవధిసుఖం దేహి | నియత మపవర్గం |
| 12. | కృష్ణః | నిరుపమఫలాని చ | గృహాణ సరసాని |
| | | నిర్విశంకం విహర | మమ హృదయరమణి |
| 13. | రాధా | పానీయ మానీయ | తాంత్వయ్యా మహ్యాం |
| | | పాతుం పిపాసా హి | భూయసీ మమ భో |
| 14. | కృష్ణః | మధురం పయః పిబ | మధూని బహూని |
| | | మమ వల్లభే తృప్తి | రస్తుతవ సుతరాం |
| 15. | రాధా | అధరసుధయా మమ | మనోరథపయోధిం |
| | | అధిక మిహ పూరయ | కృపాపారజలధే |
| 16. | కృష్ణః | కలయ వరవర్ణిని | తథైవ కలయామి |
| | | మిళతు తవ హృదయం | మదీయహృదయేన |
| 17. | రాధా | కథమనుసరామి | వనభూమిషు భవంతం |
| | | కథయ సుభగా హ | మబలాతీవ కాంతం |
| 18. | కృష్ణః | అహ మిహ వహామి తు | రమామి చ సుశీలే |
| | | విహితసరసాలాప | గతమదనతాపే |
| | | ఇతికలిత మిహ | రాధికాకృష్ణచరితం |
| | | రహసి శివనారాయ | ణానందరచితం |

రాథా! కలభగతి కలిత = ఏనుగు గున్న నడకతో ఒప్పుచున్నటువంటి; ఘన = దట్టమైన; కాలమేఘాభ = నీలమేఘముతో సమానమైనట్టి ప్రకాశమానముగలవాడ; మమ = నాకు; సుబహూని = అనేకములైన; కుతుకాని = ఆనందవిహారములను; రహసి = ఏకాంతమునందు; కలయ = కలుగునట్లు చేయుమా (కలుగజేయుమా)

కృష్ణుడు 2. కలహంసగామిని = రాజహంసతో సమానమైన నడకలుగలదానా; యథాకథయసి = ఏవిధముగా చెప్పెదవో; తథైవ = అప్రకారమే; కరవాణి = చేసెదను; వరమధ్య = శ్రేష్ఠమైన నడుముగలదానా; సపది = తక్షణమే; కథయ = చెప్పుమా; అథ =మరియు

రాధా 3 విమలకళ్యాణగుణ = నిర్మలమైన కళ్యాణ గుణములుగలవాడా; వివిధ విశ్వాత్మన్ = అనేకవిధములగు విశ్వమునకు అంతర్యామిగా నుండువాడ; విగళిత, మమ, దుకూలం = జారిపోవుచున్న నావస్త్రమును; సు ధృఢం = గట్టిగా వుండునట్టుగా; రచయ = బిగించుమా

కృష్ణుడు 4 అబలే = ఓ చిన్నదానా!; బాఢం = అంగీకరించుచున్నాను; తరుమూలం = చెట్టుక్రిందికి; ఆయాహి = రమ్మా; తవ = నీయొక్క; హాటక దుకూలం = బంగారుమయమైన సన్నని వస్త్రమును; దృఢం = గట్టిగా; విరచయామి = బిగించెదను; అద్య = ఇప్పుడు.

రాధా 5 అతి లలితం = బహు సొగసుగా నుండునట్టి; మృగమదతిలకం = కస్తూరి తిలకమును; రచయ = దిద్దుమా (ధరింపచేయుమా); కుచ కలశయుగం = రెండు స్తనములకు; సకుంకుమవిలేపం = కుంకుమపువ్వు సంబంధమైన విలేపనముగలదానినిగా; అపి రచయ = దానినిగూడ చేయుమా; విలేపనము = పూత.

కృ 6 తవలలితఫాలే = నీయొక్క అందమైన నొసటియందు; తిలకం = బొట్టునున్నూ; కుచకుంభయుగళే = కలశములవంటి సనద్వయమునందు; కుంకుమవిలేపనం అపి = కుంకుమపువ్వుకు సంబంధమైన (విలేపనమునుగూడా); రచయామి = ధరింపజేయుచున్నాను.

రా 7 కృష్ణ = హేకృష్ణా!; మమ = నాకు; గళిత = జారిపోవుచున్న; కచనిచయం = కొప్పువెంట్రుకల సమూహమును; ఘటయ = ఘటింపచేయుమా! (కొప్పుపెట్టుమా); అథ = మరియు; కేశవ! = హేకృష్ణా!; కృపాళో! = హేదయానిథే; రహసి = ఏకాంతస్థలమునందు; ఇహ = ఇక్కడ; మాం = నన్ను; గమయ = పొందుమా!

కృ 8 హేరాథా = హేరాథా!; ఏహి = రమ్మా!; ఇహ = ఇక్కడ; మమహ్లాదయకుతుకం = నామనోల్లాసమును; కలయ = చూడుమా; రహసి = ఏకాంతస్థలమునందు; సముపవిశ = చేరుమా; అద్య = ఇప్పుడు; ముదం = సంతోషమును; దేహి = ఇమ్మా!

రా 9. కృష్ణా! = హేకృష్ణా!; కుసుమనిచయాపచయం = పుష్పసమూహమును కోయుపనిని; అద్య = ఇప్పుడు; కురు = చేయుమా!; కుసుమభారైః = పుష్పభారముచేత (పుష్పములను కొప్పులో తురుముటచేత); మమకుంతలభరం = నాయొక్క కుంతలమును; ఘటయ = నాడింపజేయుమా

కృ 10 మమరమణి = నన్ను సంతోషపెట్టుదానా (నాప్రియురాలా!); సుమశర = మన్మథునియొక్క; శరాసన = ధనుస్సుతో; సమం = సమానమైనట్టి; కచనిచయం = నీయొక్క కొప్పును; కుసుమభారైః = విశేషపుష్పములచేత దట్టముగా; అలంకుర్వే = అలంకారము చేసెదను.

రా.11 సరస = రసయుక్తమైనటువంటి; వరగంధి = శ్రేష్ఠమైన పరిమళముగలిగినటువంటిన్నీ; సురసాలఫల = మంచి తియ్యమామిడిపండ్లయొక్క; వర్గం = సమూహమునున్నూ; నిరవధిసుఖం = అంతములేని సుఖస్వరూపమైనట్టి; నియతం = వేదములచేత విధింపబడినట్టి; అపవర్గం = మోక్షమునున్నూ; దేహి = ఇమ్మా!

కృ 12. మమ హృదయరమణి = నా మనస్సును ఆనందింపచేయునట్టి హేరాధా; సరసాని = రసవంతములైనట్టిన్నీ; నిరుపమ = అసమానమైనట్టిన్నీ; ఫలానిచ = ఫలములనున్నూ; గృహాణ = తీసికొనుమా; నిర్విశంకం = నిస్సందేహముగా; విహార = విహరించుమా

రా.13. భో = హేకృష్ణా!; పాతుం = త్రాగుటకుగాను; పిపాసా = పానేచ్ఛ; మమభూయసీహి = నాకు విశేషముగా నున్నదిగదా! కనుక; మహ్యం = నాకొఱకు; త్వయా = నీచేత; పానీయం = పానద్రవ్యమును; ఆనీయతాం = తేబడుగాక, (నీవుతీసుకరావలసినది)

కృ 14. మధురం పయః = మధురమైన క్షీరములనున్నూ; సుబహూని మధూని = అనేకమైన తేనెరసములనున్నూ; పిబ = పానముచేయుమా; మమవల్లభే =నా ప్రియురాలా!; తవ = నీకు; సుతరాం = కేవలము పూర్తిగా; తృప్తిరస్తు = తృప్తిగా యుండునుగాక!

రా 15. కృపాపారజలధే = అపార కృపాసముద్రుడా!; అధర సుధయా = అధరామృతముచేత; మమ మనోరథపయోధిం = నా కోరికలనే సముద్రమును; ఇహ = ఇక్కడ; అధికం = విశేషముగా; పూరయ = నిండించుమా

కృ 16. వరవర్ణిని! = హే శ్రేష్ఠమైన సౌందర్యముగలదానా!; కథయ = చెప్పుమా; తథైవ = నీవుకోరిన ప్రకారమే; కలయామి = చూపించెదను; తవ హృదయం = నీయొక్క మనస్సు; మదీయ హృదయేన = నామనస్సుతోగూడా; మిళితం = మేళనమగుగాక

రా. 17 అహం = నేను; అతీవఅబల = మిక్కిలి బలహీనురాలను; సుభగా = సౌభాగ్యవతిని (సౌకుమార్యముగలదానను); కాంతం భవంతం = మనోహరునైన మమ్ములను; వనభూమిషు = వనభూములయందు; కథం అనుసరామ = ఎట్లు అనుసరించగలనో; కథయ = చెప్పుమా

కృ 18. నంశీలే = మంచిశీలవముగలదానా; శీలము = నత్స్వభావము; విహిత = చేయబడుచుండునట్టి; సరసాలాప = సరస సల్లాపములచేత; గత = పోగొట్టబడిన; మదనతాపే = మన్మథరూపముగలదానా; ఇహ = ఇక్కడ; అహం = నేను; రమాంఇవ = లక్ష్మీదేవినివలెనే; వహామి తు = మోసెదనుగూడా; ఇతి = ఈవిధముగా; ఇహ = ఈబృందావనమందు; రహసి = ఏకాంత స్థలమందు; రాధాకృష్ణచరితం = రాధాకృష్ణులయొక్క చర్యలను; కలితం = జరిగించబడినదిగా; శివనారాయణతీర్థం = శివనారాయణతీర్థులవారి వల్ల కీర్తనగా చెప్పబడినది

1. ఓ గజగమనా! నీలమేఘశ్యామా! శ్రీకృష్ణా! ఈ రహస్యస్థలమున నాకోర్కులం దీర్చి యానందింపఁజేయుము.

2. ఓ హంసగమనా! నీవెట్లు చెప్పిన నట్లే చేయుదును. ఇప్పుడేమి సేయుమనియెదవు?

3. సకల కల్యాణగుణసముద్రా! జగన్మయా! నిర్మలాకారా! నావస్త్రము సడలియున్నది. బిగియింపుము.

4. ఓ యువతీమణీ! అట్లే నీ సువర్ణ చేలమును దృఢము గావించెదను. ఈ వృక్షసమీపమునకు రమ్ము.

5. ఓకృష్ణా! ముఖమును కస్తూరీతిలకముచే నలంకరింపుము. కుచములకుంకుమవిలేపనము గావింపుము.

6. సుందరమగు నీముఖమున కస్తూరీతిలకమును బెట్టెదను. కుచకలశములందును కుంకుమపువ్వుతోఁ గలసిన యాచందనమును బూసెదను.

7. దయామయా! శ్రీకృష్ణా! నాముడి వీడియున్నది. సవరింపుము. ఇది యేకాంతస్థలము నన్నుఁ గొంతదూర మెత్తికొని పొమ్ము.

8. ఓరాధా! రమ్ము. ఇటఁ గూర్చుండుము. నామనసునకు సంతసమును గల్గింపుము.

9. ఓకృష్ణా! అపుష్పములం గోసి తెచ్చి నాకొప్పున ముడువుము.

10. ఓ హృదయప్రియా! అట్లే పూలంగోసి దెచ్చి మన్మథుని ధనువుతో (అల్లెత్రాటితో అనుట) సమములగు నీకురుల నలంకరించెదను. మన్మథునియల్లెత్రాడు తుమ్మెదచాలు కావున నిట్లు చెప్పఁబడెను.

11. ఓకృష్ణా! బాగుగ పండి మంచిసువాసనతోఁ గూడియున్న యామామిడిపండ్లఁ గోసియిమ్ము. సదానందరూపమగు మోక్షసుఖము నిమ్ము.

12. ఓమనోహారిణీ! ఇదిగో ఫలములు; వీనిం గైకొనుము. నిర్భయముగ నాతో విహరింపుము.

13. ఓకృష్ణా! నాకు మిగులఁదప్పి జనించుచున్నది, త్రాగుటకునీరుఁదెమ్ము.

14. ఓప్రియా! ఇదిగో నీరు దెచ్చితిని. నానావిధములగు తేనియలనుగూడ దెచ్చియున్నాను. వీనిని ద్రావుము. తృప్తిఁజెందుము.

15. ఓకరుణాసముద్రా! నీ యధరామృతమునిచ్చి నామనోరథమునీడేర్పుము.

16. ఓనారీతర్పమా! అట్లే చేయుదును. నీహృదయము నాహృదయముతో నేకీభవించుఁగాత.

17. ఓమనోహరా! నేను సుకుమారిని. బలము లేనిదానను, ఈయరణ్యమున నీతో నెట్లు నడువఁగలను?

18. చక్కనిస్వభావము గలిగినట్టియు, మనోహరములగు సంభాషణములచే మదనతాపమును జల్లార్చునట్టి, నోరాధా! నీవునడువలేక పోయిననేనే యెత్తికొనిపోయెదను. అని యిట్లు రాధాకృష్ణుల యేకాంతచరిత్ర నారాయణతీర్థునిచే రచియింపఁబడెను.

## గోపికలు కృష్ణుని గూర్చి రాధ నడుగుట

గ. కదాచిదథ బృందావనే శారదచంద్ర చంద్రి కాధవళిత కాళిందీపుళినవళినాభ చరణనళినాంకరమణీయభాగే విస్మృతపతి పుత్ర బాంధవా స్తత్ర గాయంగాయం సంచరంత్యో మధుకరాఇవ మాధవ మభిలషంత్యో విలపంత్యశ్చ రహస్యారాధి తమాధవాం రాధాం క్వాప్యుప కుంజం మాధవవిరహవ్యా కులాంతరతయా చోన్మాదావస్థాయాం స్థితాం సర్వాగోప యువత్యో దదృశుః, ఇత్థం చ తాం పప్రచ్ఛుః.

గద్య 18 అథ = అనంతరము; ఒకానొకప్పుడు = కదాచిత్; బృందావనే = బృందావనమందు; శారదచంద్ర = శరత్కాలిక చంద్రునియొక్క; చంద్రికా = వెన్నెలచేత; ధవళిత = తెల్లగాచేయబడిన; కాళిందిపులినే = యమునానదీతీరమునందలి ఇనుక దిబ్బలమీద; నళినవాభ = శ్రీకృష్ణస్వామివారియొక్క; చరణనళినాంక = చరణకమలములచేత గుర్తులుగా చేయబడినటువంటి; రమణీయభాగే = సుందరమైన ప్రదేశమునందు; విస్మృత పతిపుత్ర బాంధవ = మరచిపోబడినట్టి పతి, పుత్ర, బాంధవులుగలవారై; తత్ర = అక్కడ; మధుకరా ఇవ = తుమ్మెదలవలె; గాయం గాయం సంచరంత్యః = గానముచేయుచూ తిరుగుచున్నవారలై; మాధవం అభిలషంత్యః = శ్రీకృష్ణస్వామివారిని కోరుచున్నవారలై; విలపంత్యశ్చ = విలపించుచున్నవారలై; రహస్య ఆరాధితమాధవాం = ఏకాంతమునందు శ్రీకృష్ణుని ఆరాధించుచున్నట్టి; రాధాం = రాధా అమ్మవారిని; క్వాప్యుప పంజం = ఒకపొదరింటి సమీపమునందు; మాధవ = శ్రీకృష్ణస్వామివారియొక్క; విరహ వ్యాకులాంతరతయాచ = శ్రీకృష్ణ వియోగముచేత కలిగిన వ్యాకులముగల మనసు కలిగినందున; ఉన్మాదావస్థాయాం = పిచ్చితోకూడుకొని; స్థితాం = ఉన్నటువంటి రాధను; సర్వాగోపయువత్యః = యావన్మంది గోపికాస్త్రీలు; దదృశుః = చూచిరి; ఇత్థం = ఈప్రకారముగా; తాం! పప్రచ్ఛుః చ = ఆమెనుగూర్చి; అడగనుగూడా అడిగిరి.

అట్లా గోపికలు పతులను, పుత్రులను, బంధువులను విడచి యనేక ప్రకారముల నాకృష్ణుఁని బాడుచు (తుమ్మెదలనుంబోలె తమచిత్తముల నమ్మాధవునియందు నిలిపి, తుమ్మెదలపక్షమున మాధవుఁ డనఁగా వైశాఖమాసము) బృందావనమునం దంతట వెదకుచుండి యొక్కచో కృష్ణునియడుగులఁ జూచిరిగదా. అస్థలము, యమునానదీతీరమునందలి యిసుకదిన్నె. ఆశరత్కాలపు వెన్నెలలచే మిగుల శుభ్రమైయున్న యచ్చోట శ్రీకృష్ణునిపాదములు గానరాఁగానే, వానిననుసరించి వారును గొంతదూరము నడచిరి. అచట నొకపొదరింటియొద్ద నారాధము, కృష్ణవిరహమున మిగుల బాధ నొందుచు నున్మాదావస్థను జెందికూర్చుండియుండెను. దానిం జూచి వారిట్లని ప్రశ్నింప నారంభించిరి.

## 10వ కీర్తన - (ఆహిరి) రాగం - అటతాళము

ప. కథయ కథయ మాధవం హే రాధే
కథయ కథయ మాధవం

అ. అథ సఖి కథయ శ్రీమధుసూదన మశేష
విధినా వర్ణితవీర్య మమితవిభవం

1. వనభువి రహసి సమారాధితో భగవా
ననవద్యసుందరాంగి హే రాధే
ఘనజఘనయా త్వయా ఘననీలకుంతలశ్రీ
వనమాలీ పీతవాసా వసతి క్వవా జగతి

2. మృగమదకలితతిలక ఫాలసుందరం
అగణితసుగుణమణిరత్నాకరం
విగతమోహ మఖిలవేదభాగవిదితం
భగవంత మాశ్రితభావుకవిధాతారం

3. సరసహాసరసనరళతరళ
మురళీమిళితగోపవధుజనం
అరవిందలోచన మరివర్గసూదనం
వరనారాయణతీర్థవాంఛితఫలనిదానం

ప. హేరాధే! = ఓ రాధా!; కథయ కథయ మాధవం - మాధం = శ్రీకృష్ణునిగూర్చి; కథయ కథయ = ఎచ్చటవున్నది చెపుమా; సఖి = ఓచెలీ!; అథ = మరియు; శ్రీమధుసూదనం = 'మధువు' అనురాక్షసుని సంహరించినటువంటిన్నీ; అశేష = పూర్ణముగా; విధినా = బ్రహ్మదేవునిచేత; వర్ణిత = వర్ణించబడిన; వీర్యం = పరాక్రమము గలిగినటువంటిన్నీ; అమితవిభవం = మితములేని ఐశ్వర్యము కలిగినటువంటిన్ని శ్రీకృష్ణుని గూర్చి; కథయ = చెప్పుమా

1. అనవద్యసుందరాంగి! = దోషరహితమైన సౌందర్యముగల అవయవములుగలదానా; హేరాధా! = ఓ రాధా!; ఘన జఘనయా = ఘనమైన కటిప్రదేశముగలిగినటువంటి; త్వయా = నీచేత; వనభువి = బృందావనమందు; రహసి = ఏకాంతస్థలమునందు; సమారాధితః = ఆరాధించబడినట్టి; భగవాన్ = షాడ్గుణ్య పరిపూర్తి గలిగినటువంటిన్నీ; ఘననీలకుంతలశ్రీ = ఘనములైన నీలములైనట్టి కుంతలములకాంతి గలిగినటువంటిన్ని; వనమాలి = వనమాలధరించి నటువంటిన్నీ; పీతవాసా = పీతాంబరము ధరించినటువంటిన్నీ (శ్రీకృష్ణస్వామివారు); జగతి = ప్రపంచమునందు; క్వవా వసతి = ఎక్కడ ఉన్నారు?

2. మృగమదకలిత = కస్తూరి మిళితమైన; తిలక = బొట్టుచేత ఒప్పుచున్నటువంటి; ఫాల = నొసల సంబంధమైన; సుందరం = సౌందర్యముగలిగినట్టిన్నీ; అగణిత = గణనాతీతములైన; సుగుణమణి = కల్యాణ గుణములకు; రత్నాకరం = సముద్రమువంటివాడున్నూ; విగళితమోహం = జారిపోయిన మోహముగలవాడున్నూ (అనగా మోహములేనివాడున్నూ); అఖిలవేదభాగవిదితం = సమస్తవేదభాగములయందు పరాత్పరుడని తెలియబడుచుండువాడున్నూ; ఆశ్రిత = భక్తులకు; భావుక = మంగళములను; విధాతారం = ఇచ్చునటువంటివాడున్నూ; భగవంతం = భగవంతుడైన శ్రీకృష్ణుడు; కథయ, కథయ = ఎక్కడవున్నది, చెపుమా

3. సరస = రసయుక్తమైనటువంటి; హసన = నవ్వుతోగూడిన; సరళ = లాలిత్యమైన; తరళ = చలించుచున్నట్టి; మురళి = వేణునాదమనే నెపముచేత; మిళిత = మేళనమైన (తనవద్దచేరినటువంటి); గోపవధూజనం = గోపస్త్రీలను గలవారున్నూ; అరవిందలోచనం = తామరకమలములవంటి నేత్రములుగలవారున్నూ; అరివర్గ సూదనం = శత్రుసమూహ మర్దనమును; వర, నారాయణతీర్థ = శ్రేష్ఠమైనటువంటి మరియు పవిత్రమైనటువంటి నారాయణతీర్థులచేత; వాంఛిత = కోరబడిన; ఫల = ప్రయోజనమునకు; నిదానం = ఆదికారణమైనటువంటి శ్రీకృష్ణస్వామివారిని కథయ, కథయ మాధవం = ఆశ్రీకృష్ణుని ఎక్కడ ఉన్నాడో చెపుమా

ప. ఓరాధా! కృష్ణుఁ డెచ్చటమనున్నాఁడో చెప్పుము.

అ. అపరిమితసామర్థ్యముగల్గి బ్రహ్మచే స్తోత్రము చేయఁబడుచున్న యా మధుసూదనుని వృత్తాంతము నోచెలీ! మాకుఁ దెలిఁయజేయుము.

1. ఓ సుందరాంగీ! నల్లనివెంద్రులకతోను, వనమాలతోను, పీతాంబరముతోను బ్రకాశించు నాశ్రీకృష్ణుని నీ వీయేకాంతస్థలమున నారాధించితివి. అయిన యిపు డెచటనున్నాఁడో తెలియజేయుము.

2. ఆభగవంతుఁడు మోహరహితుండు, వేదవేద్యుడు, కస్తూరీ తిలకముచే మనోహరమగు తన సుందరాననముతోడను, లెక్కకు మిక్కిలియగు తన కల్యాణగుణములతోడను, ఆనందముఁ గలిగింపుచు, ఆశ్రితులగువారికి కోరిన శుభముల నొసంగుచుండును.

3. ఆపుండరీకాక్షుఁడు తన మందహాసములతోడను, మనోహరములగు వేణుగానములతోడను, మనమనసుల నాకర్షించి యిప్పుడెటకో పోయినాఁడు. నారాయణతీర్థునకు సకల కామముల నొసంగుచునుండు నాశత్రునాశకుని వృత్తాంతము నెఱింగింపుము.

శ్లో. అథ చిరపరిభుక్తా శౌరిణా ఖండరూపా
నిజసుఖపరితృప్తా బ్రహ్మవిద్యేవ గోపీ,
వ్రజయువతిభి రుచ్చైః ప్రార్థితా సాభిలాషం
హరిపరతరభావం దర్శయంతీదమాహ

శ్లో 19. అథ = అనంతరమందు; శౌరిణా = స్వామివారిచేత;ఛ చిరపరిభుక్త = చాలకాలమునుంచి పాలించబడుచూ వచ్చినటువంటిన్నీ; అఖండరూప = అవిచ్ఛిన్నమైన భక్తరూపమైన యోగము కలిగినటువంటిన్నీ; నిజసుఖపరితృప్త = బ్రహ్మానందానుభవముచేత విశేష తృప్తికలిగినటువంటిన్నీ; గోపీ = 'రాధా' అనునట్టి ; వ్రజయువతిభిః = గోపస్త్రీలచేత; సాభిలాషం = అభిలాష పూర్వకముగా; ఉచ్చైః = గొప్పస్వరముతో; ప్రార్థిత = ప్రార్థించబడినదియై; బ్రహ్మవిద్యాయివ = పరబ్రహ్మ ప్రతిపాదితమైన శృతివలెనే; హరి పరతర భావం = శ్రీకృష్ణస్వామివారియొక్క పరతత్వ స్వరూపముగా నుండు స్థితిని; దర్శయంతి = గోపికలకు చూపించుచూ (అనగా సిద్ధాంతము చేయుచూ); ఇదం ఆహ = ఈక్రింది విధముగా పలికెను.

కృష్ణుని నేకాంతస్థలమున వారాధించి బ్రహ్మజ్ఞానియునుంబోలెమిగుల నానందమును జెందియున్న యాత్రిలోకసుందరి రాధ, శ్రీకృష్ణుని పరతత్వమును బ్రకటించుచు నిట్లని వారి ప్రశ్నమున కుత్తరమిచ్చెను. (ఈశ్లోకము నందలి బ్రహ్మవిద్యాపదము 'బ్రహ్మజ్ఞానముఁగలవాఁడు' అనునర్థమున నుపయోగింపఁబడినది. అట్లు గాకున్నను "ఆరాధ బ్రహ్మవిద్యవలె శ్రీకృష్ణునిపరతత్వమును బ్రకటించుచు' ' అని యర్థము చెప్పవచ్చును.)

## రాధ గోపికలకు శ్రీకృష్ణుని పరతత్త్వము చెప్పుట
## 11వ కీర్తన - రేగుప్తి (ధన్యాసి) రాగము - ఆటతాళము

ప. హరి మేకరసా కృతి మధునా అవధారయతాగమవిధినా

1. చిరతరపురుషం ప్రతిభావపుషం పర మిహ వియ దాతతం
ప్రశమితకలుషంభవరోగభయముషం ప్రత్యగభేదమనంతం

2. ఇద మితి సకలం జగ దతిచపలం మాయిక మధునాతనం
పరిణతివికలం ఫల మివ విపులం కలయత పరిశోధనం

3. విలసిత మఖిలం గురుతరలీలం యద్వ దబోధవిధం
క్షణ మిహ విదితం సత్పున రుదితం పశ్యతపురతోహితం

4. అనుదయవిలయం ప్రియతమమభయం జగదుదయాదిదృశం
యదవధివిదితం సకల మభిహితం నియత మబోధవశం

5. అనుకృతదురితం ఫలయుగరహితం కేవలబోధాత్మ కం
చిర మిహ మృగితం మునిజనవిదితం నిరవధికసుఖాత్మకం

6. యదపృథ గఖిలం నిగమభాగఫలం భాతి హి పరదైవతం
నభవతి భూతం నచభావి సతతం సుకృతిభిరభిభావితం

7. నిరవధివిభవం నియతానుభవం భూమపదేనేరితం
ఫల మివ కరగం సకలహృదయగం తత్త్వధియాఖండితం

8. అవచన మమతిం గతలోభరతిం నిరతనిస్తారఖిలం
ప్రజపురవనితా గతతనుమమతాః స్వాత్మతయైవామలం

9. ఇద మిహ ఫణితం నిగమైరనుగతం కృష్ణరసైకాత్మనా
హరిగురుకృపయానిగమజసుధియా నారాయణతీర్థేన

ప. అథునా = ఇప్పుడు; హరిం = శ్రీకృష్ణస్వామివారిని; ఏక రసాకృతిం = ఆనందవే ముఖ్యస్వరూపముగా గలిగినవానినిగా; అగమవిధినా = శాస్త్రోక్తప్రకారం (వేదోక్త ప్రకారం); అవధారయత = తెలుసుకోండి.

1. చిరతరవపురుషం = అనాది పురుషుని గానున్నూ; ప్రతిభా వపుషం = జ్ఞానవే శరీరముగాగలవాడినిగాను; ఇహ = ఇక్కడ; పరం = ప్రకృతి పురుష విలక్షణునిగా నున్నూ; వియత్ + అతీతం (వియదతీతం) = ఆకాశమువలె అన్నిటిని వ్యాపించియుండు వానినిగానున్నూ; ప్రశమితకలుషం = సమస్తదోషములను నివారణ చేయువారినిగా నున్నూ; భవరోగభయ ముషం = సంసారరోగ భయమును పోగొట్టువానినిగా నున్నూ; ప్రత్యక్ అభేదం = జీవాత్మను ఎన్నడు విడచివుండని వాడుగానున్నూ; అనంతం = అపరిచ్ఛిన్న స్వరూపునిగానున్నూ; అవధారయత = తెలిసికొనుడు.

2. ఇదం ఇతి సకల జగత్ = ఈ దృశ్యమానమైన జత్తుఅంతయు; అతి చపలం = కేవలం అస్థిరమైనది (మార్పుకలది); మాయికం = భగవన్మాయచేత నిర్మింపబడినది; అధునాతునం = ఇప్పుడు అనగా (అజ్ఞాన దశలో మాత్రం గోచరించునది); విపులం ఫలం = విస్తారమైన కర్మఫలము; వికలం ఇవ = నిస్సారమైన దానివలె; పరిణతి = పర్యవసానము చెందుచున్నది; పరిశోధనం = పరామర్శపూర్వకముగా; కలయత = చూడుడు.

3. గురుతరలీలం = గొప్పలీలా విలాసముగా నుండునట్టి; అఖిలం = సర్వప్రపంచమున్నూ; అబోధవిధిం = తెలియబడకుండుదాని యద్వత్ = వలెనే; విలసితం = ప్రకాశించుచున్నది; పునః = మరల; ఉదితం సత్ = గోచరించినదై; ఇహ = ఇప్పుడు; క్షణం = శీఘ్రముగానే; విదితం = చక్కగా తెలియబడుచున్నది గనుక; పురతః = మనకు ప్రత్యక్షముగానే; హితం = మెలగుదానిని - అనగా (భగవత్ జ్ఞానమును); పశ్యత = విమర్శించి తెలిసికొనుడు.

4. ప్రియతమం = మనకు ప్రియమైనట్టిస్వామివారు; అనుదయ విలయం = జన్మ నాశములు లేనివారున్నూ; అభయం = భయమును పోగొట్టువారున్నూ; జగదుదయాది దృశ్యం = ఈ జగత్తుయొక్క సృష్ట్యాదులకు సాక్షీభూతుడున్నూ అయివున్నాడు; యదవధి = ఏ పరమాత్మవరకు వుండునట్టి; సకలం = సమస్త ప్రపంచమున్నూ; నియతం = నిశ్చయముగాని; అబోధవశం = జ్ఞానమునకు గోచరముగాకుండా; అభిహితం = ఏర్పాటు చేయబడినదో (అట్టి పరమాత్మను); అవధారయత = తెలిసికొనుడు.

5. అసుకృతదురితం = సుఖ దుఃఖరహితమైనదిన్ని; ఫలయుగరహితం = సుఖదుఃఖరహితమున్నూ; కేవల బోధాత్మకం = జ్ఞానమే స్వరూపముగా గలదియు - (అట్టిపరమాత్మవస్తువును); ఇహ = ఇక్కడ; చిరం = చాలాకాలమునుంచి; మృగితం = వెదుకబడినదియై; నిరవధిక సుఖాత్మకం = అఖండ ఆనంద స్వరూపముగ గలిగియున్నదని; ముని జనవిదితం = వేదార్థ మననము చేయువారికి స్పష్టముగా గోచరించియున్నది.

6. యత్ పరదైవతం = ఏ పరతత్త్వ స్వరూపుడు; అఖిలం = సమస్త జగత్తుకు; అపృధక్ = వేరుగానుండక అనగా అన్నిటియందు అను ప్రవేశముగలిగి, అంతర్యామిగా నుండువాడు; నిగమభాగఫలం = వేదభాగములయందు ఫలస్వరూపుడుగా; భాతిహి = ప్రకాశించుచున్నాడుగదా!; భూతం నభవతి = కేవలం గడచిన కాలమునందే వుండినవాడుకాడు; నచ భావి = భవిష్యత్కాలమందే వుండబోవువాడుకాడు; సతతం = సమస్తములయందున్నూ; సుకృతిభిః = సుకర్మ చేసినవారలచేత; అభిభావితం = ధ్యానము చేయబడుచుండువాడుగా నున్నాడు.

7. నిరవధి విభవం = అమితమైన మహిమగలవారున్నూ; నియతానుభవం = నియమించబడుచున్న జీవాత్మలజ్ఞానముగలవాడున్నూ (అనగా సకలజీవుల బుద్ధి వృత్తులను నియమించువాడనుట); భూమపదేన = 'భూమి' అనుశబ్దముచేత (భూమి అనగా సర్వవ్యాపకుడు); ఈరితం = చెప్పబడుచున్నవాడు; కరగం ఫలమివ = హస్తమునందున్నట్టి ఫలమువలె; సకల హృదయగం = సమస్త హృదయములందు వుండువాడున్నూ; తత్వధియా అఖండితం = పరతత్వమునందు చేర్చబడిన బుద్ధికి అఖండ స్వరూపుడుగా గోచరించువాడున్నూ అయివున్నాడు.

8. గత తను మమతాః = దేహాభిమానమును వదలినట్టి; వ్రజపుర వనితాః = ఓ గోపాంగనలారా! (మనకృష్ణస్వామివారిని); అవచనం = మనవాక్కులచేత వర్ణింపబడుటకు వీలుకానివాడున్నూ (లేక, ప్రాకృతమైన వాక్కులు లేనివారున్నూ); అమతిం = ప్రకృతి సంబంధమైన మనస్సులేని వాడున్నూ; గతలోభరతిం = లోభగుణమునూ - విషయాసక్తిలేనివాడున్నూ; నిరత నిరస్తాఖిలం = విరక్తిచేత సర్వమును నిరసించువాడున్నూ; స్వాత్మతయా = మన జీవాత్మలకు అంతర్యామిగా నుండుటనుబట్టి; అమలం ఏవ = నిర్మలముగానే వుంటున్నారు; హరి గురుకృపయా = శ్రీహరి ఆచార్యులున్నూ-వీరి యిద్దరి కృపచేతనున్నూ నిగమజనుధియా = వేదజన్యమైన, దివ్యజ్ఞానపూర్వకముగా; కృష్ణరసైక ఆత్మనా = శ్రీకృష్ణ భక్తియోగమే ముఖ్యమైన ఆశ్రయముగానున్నట్టి; నారాయణతీర్థేన = నారాయణతీర్థులచేత; ఇదం = ఈకీర్తన; ఇహ = ఇప్పుడు; నిగమైః = వేదతాత్పర్యమును; అనుగతం = అనుసరించిన పక్షముగా; ఫణితం = చెప్పబడినది.

ప. ఓ గోపికలారా! అఖండానందస్వరూపుఁడగు నా శ్రీకృష్ణుని వేదోక్తప్రకారమున నెఱుఁగుఁడు.

1. అయ్యనాదిపురుషుఁడు జ్ఞానస్వరూపుఁడు. సమస్తపాపములన హరించి సంసారరోగమును శాంతిఁజేయువాఁడు. నాశరహితుఁడు పరమాకాశస్వరూపుఁడు. ఆయనయును ఈ జీవుఁడును భిన్నులుగారు.

2. ఇది, యిది యని వ్యవహరింపఁబడు నీసకలప్రపంచము మిగుల నస్థిరమైనది. మాయవలనఁ గల్పింపఁబడినది. పుణ్యకర్మములవలన గల్గుసుఖము లెట్లు అంతమునకు నీరసములగునో, యీప్రపంచము కూడా (సంసారము కూడ) అంతమునకు నిస్సారమగును. అది గలపదార్థములన్నియు అంతమొందవలయును గదా. కావున నీ ప్రపంచమునుగూర్చి బాగుగ విమర్శింపుఁడు.

3. ఏపదార్థము (ప్రపంచము) నానావిధములగు కార్యములతోడఁగూడి యుండుటచే "దీని యథార్థస్వరూప మిది" అని తెలిసికొనుటకు వీలుగాక యుండునో, ఆపదార్థమునే జ్ఞానముతో కొంచెము విమర్శించినయొక్క క్షణములో రహస్యమంతయును ప్రకటమగును. కావు నోగోపికలారా! మీకు మేలగువిషయమును (బ్రహ్మస్వరూపజ్ఞానమును) శ్రీఘ్రముగఁ జూచుకొనుఁడు.

4. మనప్రియుఁడు ఈప్రపంచోత్పత్తిలయములకు సాక్షి, ఆనంద స్వరూపుఁడగు నవ్విభునకు జన్మనాశములేవు. ఆయనదక్కఁ దక్కినవేవిగానవచ్చినను పైచెప్పఁబడినట్లు నిశ్చయముగ అజ్ఞానవిలాసమే. ("అజ్ఞానము వలననే రెండవపదార్థమున్నదనితోఁచుట" అని భావము)

5. ఆకృష్ణునకు పుణ్యపాపములుగాని వానివలనఁ గల్గునుఖదుఃఖములుగాని లేవు. జ్ఞానానందస్వరూపుఁ డగునమ్మహాత్ముని బహుకాలము వెదకి (వేదాంతవాక్యములచే విచారించి యనుట) కాని మౌనులైనను దెలిసికొనలేరు.

6. ఆపరదైవ మీప్రపంచమున కతిరిక్తుఁడుగాఁగాని, ప్రపంచరూపుఁడుగాఁగాని యున్నాఁడనుటకు వీలులేదు. ఈవేదవేద్యుఁడు భూతకాలమునఁగాని, వర్తమానకాలమునఁగాని భవిష్యత్కాలమునఁగాని, యుండువాఁడుకాఁడు. (పుట్టువాఁడుగాఁడు. ఈయనకు మొదలుగాని, తుదిగాని లేవనుట) సర్వవ్యాపకుఁడు. నిత్యుఁడు. పుణ్యాత్ములచే నెపుడును ధ్యానింపఁబడుచుండువాఁడు.

7. ఈమహాత్ముని సామర్థ్యమునకు మితిలేదు. అనుభవము లన్నియు నీయనయందే యంత మొందుచున్నవి. (బ్రహ్మానందమే విషయానందరూపముతో నుండి మనల నానందింపఁజేయుచున్నదనుట) అఖండస్వరూపుఁడై, భూమపదముచేఁ జెప్పంబడుచున్న (భూమ = సర్వవ్యాపకుఁడు) యామహాత్ముఁడు బాగుగ విమర్శించినయెడల కరతలామలకముగ సర్వజనుల హృదయములందును (గానవచ్చుచునే) యున్నాఁడు.

8. శరీరాభిమానములేని యో గోపాలంగనలారా! జీవుస్వరూపుఁడై, నిత్యశుద్ధుఁడై యున్న యీపరబ్రహ్మమునకు వాక్కు, మనస్సు మొదలగు వేయింద్రియములును లేవు. కామక్రోధాదివికారములును లేవు.

9. కృష్ణునియందు మిగుల భక్తిగలిగినట్టియు, శాస్త్రాభ్యాసమువలన చక్కనిజ్ఞానము గలిగినట్టియు, హరితీర్థునకు శిష్యుఁడైనట్టియు నారాయణ తీర్థునిచే నీ గీతము రచింపఁబడెను.

శ్లో ఏవం గోప్యస్తతః శ్రుత్వా సమాధాయ పరాత్మని,
కృష్ణే చిత్తం తదాకారాకారితం మౌనమాస్థితాః. 20

శ్లో. 20 ఏవం = ఈప్రకారముగా; గోప్యః = గోపికా అమ్మవారలు, తతః = అరాధా అమ్మవారివలన; శృత్వా = వినినవారై; పరమాత్మని కృష్ణే = పరమాత్మయైన శ్రీకృష్ణభగవానులయందు; తదాకారాకారితం = ఆ పరమాత్మ అకారమును ధ్యానించునట్టిదిగా చేయబడిన మనస్సును; సమాధాయ = బాగావుంచినవారై; మౌనం అస్థితాః = మౌనము కలిగియుండిరి.

ఇట్లూరాధ చెప్పినమాటలను విని గోపికలు పరమాత్మునియందు మననును నిలిపిరి. పరమాత్ముఁడన నాకృష్ణుఁడేకదా. ఈరాధ చేసిన యుపదేశము నిమిత్తమాత్రమేకాని యంతకు మునుపే వారల చిత్తములు శ్రీకృష్ణరూపమయములై యుండెను. ఇట్లు శాంతినిఁ జెంది కృష్ణుని వెదుకవలయునను ప్రయత్నమునేకాక సర్వప్రయత్నములను వదలి మౌనమును ధరించిరి.

శ్లో. విస్మరంత్యః స్వకం దేహ మాత్మమాత్రావశేషితం,
బాలోన్మత్తాదయో యద్వదాత్మన్యేవ సమాహితాః 21

శ్లో 21. స్వకందేహం, స్వకం = స్వకీయం = తమయొక్క దేహమును; విస్మరంత్యః = మరచినవారలై; అత్మమాత్ర అవశేషతం = జీవాత్మమాత్రము తమదేహమందు శేషించి యుండగా; బాలోన్మత్తాదయః = బాలురు, పిచ్చివారలు మొదలగువారివలెనే; యద్వత్ = వలెనే; అత్మన్యేవ సమాహితాః = పరమాత్మయందే ఏకాగ్రచిత్తలైరి.

క్రమ క్రమముగా పరమాత్మానుభవము అధికమగుటయు, తమశరీరములను మఱచి బాలురవలె, నున్మత్తులవలె నిలిచియుండిరి.

శ్లో. కృతకృత్యాస్తదా దృష్ట్వా సర్వయోగేశ్వరో హరిః,
తాసాం తు పురతః కుర్వన్నాస్తే మాయావిడంబనమ్. 22

శ్లో 22. సర్వయోగీశ్వరోహరిః = సర్వయోగులకు నియామకుడైన శ్రీకృష్ణస్వామివారు; తదా = అప్పుడు; కృతకృత్యాః = కృతార్థులైన గోపికలను; దృష్ట్వా = చూచి; తాసాంతు పురతః = వాండ్లయెదుట; మాయావిడంబనం = మాయను ఉపసంహారమును; కుర్వన్ = చేయుచూ; అస్తె = ఉండెను.

అంత నకలయోగేశ్వరుండగునా శ్రీకృష్ణుఁడు ఆగోపిక లిట్లు కృతార్థులగుట నెఱింగి లీలామానుషరూపముతో వారికిఁ బ్రత్యక్షమయ్యెను.

శ్లో. ముగ్ధాఃస్నిగ్ధాంతరఙ్గఃమురనరకరిపుంమూర్తిమత్తార్తిహంతం
కామానాంకామరూపం కలితనవరసం కాలమేఘాభిరామం,
దృష్ట్వాహృష్టాస్సుపుష్టాఝటితిమురభిదం వేష్టయన్త్యోయథేష్టం
త్వాలింగన్తో నురక్తాశ్శృతయఇవపర బ్రహ్మగోప్యోజగు స్తం.

శ్లో 23. ముగ్ధాః = తమదేహములనుగూడా మరచి ఊరకే వుండినట్టివీ; స్నిగ్ధాంతరంగాః = స్వామివారియందు స్నేహభావము కలిగినట్టివీ (గోపికలు); మురనరకరిపుం = మురాసురుడికి, నరకాంతకుడికి శత్రువున్నూ; మూర్తిమత్తార్తి హేతుం = భక్తుల దుఃఖములను పోగొట్టుటకు మూర్తీభవించినవాడున్నూ; కామానాం కామరూపం = కోరబడతగిన పదార్థముల చేత గూడా కోరబడతగిన రూపముగలవాడున్నూ, కవితనవరసం = నవరసములు అభినయించుటయందు నేర్పరియు; కాలమేఘాభిరామం = నీలమేఘశ్యాముడున్నూ; మురబిదం = మురాంతకుడు అయినట్టి స్వామివారిని; దృష్ట్వా = చూచిన వార్తై; హృష్టాః = సంతోషించిన వారలై; సుపుష్టాః = పుష్టి చెందిన వారలై; ఝటతి = తక్షణమే; వేష్టయంతః = స్వామి వారిని చుట్టుకున్న వారలై; యథేష్టంతు = స్వేచ్ఛాను సారముగా; ఆలింగంత్యః = ఆతింగనము చేసుకున్న వారలై, అనురక్తాః = స్వామి వారియందు ప్రేమగలవారలై; గోప్యః = గోపికలు; శృతయ ఇవ = వేదశృతులవలెనే; పరబ్రహ్మ = పరబ్రహ్మయైన స్వామి వారిని; జగుః = గానము చేసిరి,

నీల మేఘశ్యాముండును, కోరదగిన సకలపదార్థములచేతంగూడఁ గోరుబడఁబడదగినవాఁడును, (మన మేయేపదార్థములను గోరుచున్నామో యా పదార్థములుకూడ నీకృష్ణునిఁ గోరుననుట) నవసరములనభినయించుటయందు మిగుల నేర్పరియు నగుమురనరకాంతకుఁడు దమకుఁ బ్రత్యక్షము కాఁగానే యాగోపికలు పరమానందభరితలైరి. అభగవంతునియందు మిగుల ప్రేమగలవారగుటచే నా శ్రీకృష్ణునిచే నాశ్రీకృష్ణునిచుట్టు నిలచుచు, యథేష్టముగ నాలింగనముఁ జేసికొనుచు కొంతకాలముఁ గడపి, పిదప వేదములునుం బోలె వా రాశ్రీకృష్ణ పరబ్రహ్మము నిట్లని వినుతించిరి.

12 వ - కీర్తన - కాంభోధిరాగము - ఆదితాళము :

ప. నాథనాథ మాకలయ నందనం

అ. మాధవ మఖిలగోపీమదనకోటిమోహనం

1. పాదపల్లవకలితపద్మ కులిశాదిరేఖం
వేదవేదాంతవిదితం విపులసుఖం
సాదర మఖిలలోకసాధనకతయా భువన
నాథ మమరేంద్రవంద్యనటవినోదం

2. బృందావనభువి గోపీబృందానందసందోహశ్రీ
కుందసుందరరదనమందహసనం
ఇందిరాసేవ్యపాదారవిందభక్తిమకరంద
నందితామరభూసురనందనందనం-సఖి

3. కుటిలాలకశై వాలభ్రుకుటిభుజగనయనశఫరి
పటుతరలావణ్య రసతటినీనాయకం
నిటలసుందరకస్తూరిచటులతిలకనందిత శ్రీ
ఘటితనారాయణతీర్థఘనపరిపాలకం

ప॥ నాథ నాథం = నాథులకు నాథుడును; నంద నందనం = నందపుత్రుడున్నూ (అయినట్టి స్వామివారు); అకలయా = సేవింపుమా,

అ॥ మాధవం = లక్ష్మీ భర్త అయినటువంటిన్నీ, అఖిలగోపి = సమస్త గోపికలకు, మదనకోటి = కోటి మన్మథ రూపముచేత, మోహనం = మోహమును కలుగజేయునట్టిన్నీ (స్వామివారిని సేవించుమా)

1 పాదపల్లవ = చిగురుటాకులవంటి పాదముల యందు; కలిత = ఒప్పుచున్నట్టి, పద్మకులిశ ఆదిరేఖం = పద్మము వజ్రము మొదలైన రేఖలు కలిగినట్టిన్నీ వేద వేదాంత విదితం = వేదములుయొక్క - కర్మభాగముల యందున్నూ; వేదాంత = జ్ఞానప్రతి పాదయములైన ఉపనిషత్ భాగముల యందును; విదితం = తెలియబడు చుండు వాడును, విపుల సుఖదం = అఖండ ఆనందము నిచ్చువాడున్నూ; సాదరం = భక్తులను ఆనందించు వాడున్నూ; అఖిలలోక సాధకతయా = సమస్త లోకములను ఉత్పత్తి చేసిన; భువన నాథం = లోక నాథుడున్నూ; అమరేంద్ర వంద్య = దేవేంద్రుని చేత నమస్కరింపబడుచున్న; నటనవినోదం = నాట్యవిలాసము కలిగినటువంటి స్వామి వారిని సేవింపుడు.

2 బృందావనభువి = బృందావన ప్రదేశమునందు; గోపీబృంద = గోపికలబృందమునకు; ఆనందసందోహం = ఆనందమునుయిచ్చునట్టి; శ్రీ = లక్ష్మీప్రదమైన; కుంద = మల్లెమొగ్గలవలెనుండునట్టి; సుందర రదన = సుందరములైన, పలువురుతోకూడుకొని; మందహాసం = చిరునవ్వుగలవారున్నూ; ఇందిరా= లక్ష్మీఅమ్మవారిచేత; సేవ్య = సేవించబడుచుండునట్టి; పాదారవింద = చరణారవిందములయందు చేయబడు, భక్తమకరంద = భక్తిరూపమైన మకరందముచేత; నందిత = సంతోషపరచబడిన; అమరభూసుర = దేవతలు బ్రాహ్మణులను గలిగినట్టి; నంద నందనం = నందపుత్రుడైనట్టి స్వామివారిని; అకలయ = సేవింపుడు

3. కుటిలాలక = వంకరముంగురులే; శైవాల = పొలితీగలుగానున్నూ; భ్రుకుటి = కనుబొమలే; భుజగ = పాములుగానున్నూ; నయన = నేత్రములే; శఫరి = మధ్యముగానున్ను (మత్స్యములుగానున్నూ); పటుతర = ఘనమైన; లావణ్య = సౌందర్యమే; రస = నీళ్ళుగానున్నూ (ఈ ప్రకారముగా ఒప్పుచుండె); తటని = నదికి; నాయకం = నాథుడుగా వుండునట్టిన్నీ; నిటలా = శ్రీముఖమునందు (అనగా నొసటియందు); సుందర = సుందరమైన; కస్తూరి = కస్తూరి మొదలగు అనేక పరిమళద్రవ్యములచేత; చటుల = దిద్దబడిన; తిలక = బొట్టుచేత; నందిత = సంతోషరచబడినట్టిన్నీ; శ్రీ = జ్ఞానసంపద; ఘటిత = ఇవ్వబడిన; నారాయణతీర్థఘన = నారాయణతీర్థులనునట్టి సాధువును; పరిపాలకం = కాపాడుచుండునట్టి శ్రీకృష్ణస్వామివారిని; అకలయ = సేవింపుడు.

ప-అ. ఓ చెలీ! సకలలోకనాథుఁడగు నీనందకుమారునిఁ జూడుము.

1. పద్మము, వజ్రము మొదలగు నుత్తమములగు రేఖలు పాదముల యందుఁ గల్గి దేవేంద్రాదులు గూడ వినుతించునట్లు మనోహరముగ నృత్యము నాచరించుచున్నాఁడు సకలలోకములను సృజించినవానికి ప్రభువై వరమప్రీతితో సకలసౌఖ్యము లొసఁగుచుఁ గాపాడుచున్న యీ వేదవేద్యునిఁగన్నులారఁ జూడుఁడు.

2. ఓచెలీ! తనయందు పరమభక్తినొసంగి దేవబ్రాహ్మణుల రక్షించుచు, లక్ష్మీసేవితుఁడై యుండు నానారాయణుఁడు మొల్ల మొగ్గలవంటి పలువరుస గలిగిన సుందరాననము చిఱునగవుతో నొప్పుచుండ నీబృందావనమున మన కెల్లరకు నానందమును గలిగించుచున్నాఁడు.

3. వక్రములగు ముంగురులు నాచుతీఁ గెలుగా, కనుబొమలు సర్పములుగా, నేత్రములు మత్స్యములుగా, అపరిమితమగులావణ్యము జలముగా ప్రవహించుచుండు సౌందర్యనదికి నాయకుండును, (లావణ్యసముద్రుఁడనుట) సుందరమగు కస్తూరీతిలకముచే నొప్పు ముఖపద్మము కలవాఁడును, సకలసంపదలిచ్చి నారాయణతీర్థుని బ్రోచువాఁడు నగు నీకృష్ణునిఁజూడుము.

గోపికలు శ్రీకృష్ణస్వామివారిని

శ్లో. ఉరసా మనసా దృష్ట్వా పరిష్వజ్య ముహుర్ముహుః,
కృతకృత్యా స్తదాత్మానం కృష్ణం మత్వా సమాస్థితాః 24

శ్లో 24. ఉరసా = వక్షస్థలముచేతను; మనసా = సంకల్పముచేతను; దృష్ట్వా = చూపులచేతను; ముహుర్ముహుః = మాటిమాటికి; పరిష్వజ్య = అలింగనముచేసికొన్నవారలై; తదా = అప్పుడు; కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; ఆత్మానం = పరమాత్మనుగా; మత్వా = ఎంచినవారలై; కృతకృత్యా = కృతార్థురాండ్రై; సమాస్థితాః = నిలువబడిరి.

ఇట్లొకరి కొకరు చెప్పుకొనుచు, వక్షస్థలముతోను, మనస్సుతోను, చూపుతోను, పలుమా ఱాకృష్ణు నాలింగనముఁ జేసికొనుచు, కృష్ణునకును తమకును భేదములేదని నిశ్చయించుకొని యానందము నొందుచు నాగోపికలు కృతార్థలైరి.

శ్లో. ఆత్మారామో పి భగవా ఆత్మానం దర్శయన్పరం,
తతః ప్రభాతే గోపీభిః సహ గోకులమాగతః
ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
రాసక్రీడావర్ణనం నామ అష్టమతరఙ్గః.

శ్లో 25. ఆత్మారామోపి = ఆత్మయందు రమించువారైనను; ఆత్మానం = తనను; పరం = పరబ్రహ్మస్వరూపునిగా; దర్శయన్ = కనుగొనుచూ (సకలజనులకు నేత్రానందముగావింపుచు); తతః = అనంతరమందు; ప్రభాత = తెల్లవారడంతోనే; గోపీభిఃసహ = గోపికా అమ్మవార్లతో గూడా; గోకులం = గోకులమునుగూర్చి; ఆగతః = వేంచేసిరి.

అంత సూర్యోదయ మగుటయు, నాభగవంతుఁడు ఆత్మతృప్తుండయ్యును తన దివ్యరూపముచే సకల జనులకు నేత్రానందముఁ గావించుచు, గోపికాసహితుఁడై గోకులమునఁ బ్రవేశించెను.

నారాయణతీర్థరచిత తరఙ్గములందు అష్టమతరఙ్గము ప్రతి పదార్థముతో సమాప్తము.

# నవమ తరఙ్గము ప్రారంభము

కథాసంగ్రహము

శ్లో. శ్రీకృష్ణలీలా మధురాప్రవేశాఖ్యాత్ర వర్ణ్యతే,
కంసస్యాగమనం పూర్వం దేవకీవసుదేవయోః 1
బృందావనే థ శ్రీరామకృష్ణయో స్తదనంతరం,
నారదాగమనం పశ్చాదక్రూరాగమనం తతః 2
కంసస్యానుజ్ఞయా క్రూరాగమనం కృష్ణసన్ని ధౌ,
శ్రీకృష్ణదర్శనం తస్య విశ్వరూపప్రదర్శనమ్. 3
మధురాయాం ప్రవేశశ్చ సంగ్రహో యం ప్రకీర్తితః

శ్లో1. మధురాప్రవేశాఖ్య = మధురాప్రవేశము అనుపేరుగల; శ్రీకృష్ణలీలా = శ్రీకృష్ణస్వామివారియొక్క లీల; అత్ర = ఈ తరంగమునందు; వర్ణ్యతే = చెప్పబడుచున్నది; పూర్వం = మొట్టమొదట; కంసస్యాగమనం = కంసుడు ప్రవేశించడమున్నూ; దేవకీ వసుదేవయో = దేవకీ వసుదేవుల రాకయున్నూ; అథ = అనంతరం

శ్లో 2. బృందావనే = బృందావనమునందు; శ్రీరామకృష్ణయోః = బలరామకృష్ణులు వుండుటయున్నూ; పశ్చాత్ = అనంతరం; నారదాగమనం = మధురకునారదుడు రావడమున్నూ; అక్రూరాగమనం = అక్రూరులవారు ప్రవేశించడమున్నూ; తతః = అనంతరమందు

శ్లో 3. కంసస్య అనుజ్ఞాయ = కంసుడి వుత్తర్వు ప్రకారం, కృష్ణసన్నిధౌ = శ్రీకృష్ణులవారి సాన్నిధ్యమునకు; అక్రూరాగమనం = అక్రూరులవారు రావడమున్నూ; శ్రీకృష్ణదర్శనం = స్వామివారి దర్శనమున్నూ; తస్య = తర్వాత; విశ్వరూప ప్రదర్శనం = విశ్వరూపదర్శనం చూపించడమున్నూ; మధురాయాం ప్రవేశశ్చ = మధురా పట్టణము ప్రవేశించడమున్నూ; సంగ్రహో = సంక్షేపముగా; అయం = ఈ తరంగమునందు; ప్రకీర్తితః = చెప్పబడుచున్నది.

ఈ తొమ్మిదవతరంగమున శ్రీకృష్ణుఁడు మధురాపట్టణమును బ్రవేశించుట యభివర్ణింపఁబడును. కంసుఁడు సభకు వచ్చుటయు, దేవకీవసుదేవులు తమగృహమున కృష్ణునిఁగూర్చి విచారించుటయు, నిట బలరామకృష్ణులు బృందావనమునకుఁ బోవుటయు, నారదమహాముని మధురకు వచ్చుటయు, కంససభ కక్రూరుఁడువచ్చుటయు, ఆకంసునియాజ్ఞచే నక్రూరుఁడు గోకులమునకు వచ్చుటయు కృష్ణునిఁ జూచుటయు, మధురాపురికిఁ బోవుమార్గమున కృష్ణుఁడాయక్రూరునికిఁ దనదివ్యరూపమును జూపుటయు, అంత నందఱును మధురలోఁ బ్రవేశించుటయు ననునది యిందలి కథాసంగ్రహము.

## కంసాక్రూరసంవాదము

### కంసాగమనమ్ - నారదాగమనమ్.

శ్లో. అథ నివసతి తస్మిన్ గోకులే వాసుదేవే
వ్రజయువతిచకోరీబృందరాకాశశాంకే,
ఇతి కథయతి కంసం నారదే కృష్ణవృత్తం
భయవికలితచేతాః ప్రాహ కంసో పి దూతాన్.

శ్లో 4. అథ = అనంతరమందు; వ్రజయువతీ = గోపస్త్రీలు అనునట్టి; చకోర బృంద = చాతకపక్షుల సమూహమునకు; రాకా శశాంకే = పూర్ణచంద్రుడని చెప్పబడదగిన; వాసుదేవే = శ్రీకృష్ణస్వామివారు; తస్మిన్‌గోకులే = ఆ రేపల్లెయందు; నివసతి = నివశించియున్నారు; ఇతి = ఇట్లని; నారదె = నారదుడు; శ్రీకృష్ణవృత్తం = శ్రీకృష్ణస్వామివారి సమాచారమును; కంసప్రతి = కంసప్రతి=కంసునిగూర్చి; కథయతి = చెప్పగా; (భయవికలిత చేతాః) భయ = భయముచేత; వికలిత = వ్యాకులమునొందిన; చేతాః = మనస్సుగలవాడై; కంసఃఅపి = కంసుడున్నూ; మాతాన్ = భటులనుగూర్చి; ప్రాహ = పలికెను; అథ = అనంతరమందు

ఇట్లా శ్రీకృష్ణుడు గోపికానయనచకోరములకు పూర్ణచంద్రుఁడై గోకులమున నివసించుచుండ, మధురకు నారదుం డొకనాఁడు వచ్చి యవ్విభునివృంత్తాంతమంతయు (వసుదేవుడు తనపుత్రుని గోకులమునదాఁచెననియు కంసుని యొద్దనుండి పోవుచుండిన రాక్షసుల నందఱ నావిభుఁడే వధించెననియు) కంసుని కెఱింగించెను. అతఁడును అమ్మునివాక్యములను విని భయవిహ్వలుండై, తనదూతలతో భయకారణమునుగూర్చి చెప్పెను.

శ్లో. మంత్రిభిర్మంత్రయిత్వా థ ధనుర్యాగచికీర్షయా,
అక్రూరం చోదయామాస కంసస్వానయనే తయోః 5

శ్లో 5. ధనుర్యాగ చికీర్షయా = ధనుర్యాగము చేయునట్టి కోరికతో; మంత్రిభిఃమంత్రయిత్వా = మంత్రులతో ఆలోచించి; తయోఃఆనైనంప్రతి = వారియిద్దరిని (బలరామకృష్ణులను) రప్పించు విషయములో; కంసః = కంసుడు; అక్రూరం చోదయోమాస = అక్రూరుని ప్రేరేపించెను; అథ అక్రూరం ప్రతి కంసవచనం = అక్రూరుని గురించి కంసుడు చెప్పడము.

“ఈభయమును తీర్చుకొనుటెట్లు?” అని మంత్రులతోఁగూడి యాలోచించి “యేదైన నొక యజ్ఞము పేరుఁబెట్టి యారామకృష్ణుల నిచటికిఁ బిలిపించి మనయొద్దనున్న వీరాగ్రేసరులచే వారినిఁ జంపవలయును. ఇదియే చక్కనియుపాయము” అని నిశ్చయించెను. అంతట ధనుర్యాగము సేయుదునని ప్రకటించి దానిం జూచుటకై రామకృష్ణులఁ గొనిరమ్మని యక్రూరునకాజ్ఞనొసంగెను.

అక్రూరాగమనమ్

నాదనామక్రియారాగము - ఆటతాళము

ఏకాంతభక్తిసంయుక్తః శ్రీకాంతే దేవకీసుతే
లోకానుగ్రహాయ సర్వ లోకాక్రూరో విరాజతే

శ్లో 6. సఖే = స్నేహితుడా; సుమతే = బుద్ధిమంతుడవైన; అక్రూరా = అక్రూరుడా; జగతి = లోకమునందు; మద్వేషో = నాయందు పగవుంచడం; ఖలజుషాం = దుర్మార్గులతట్టు చేరినట్టి; తేషాం = వారలకు; దోషఃఖలు = దుఃఖకారణముగదా! (వారలమీద); మే = నాకు; అద్య = ఇప్పుడు; మహాన్‌రోషం = గొప్పకోపము; ప్రసరతి = కలుగుచున్నది; త్వంతు = నీవైతేనో; అస్మత్ సందేశాత్ = నా ఆజ్ఞానుసారముగా; ఝటతి = తత్ క్షణమే; సర = వెళ్ళినవాడై; అథ = అనంతరము; రామసహితం = బలరామసహితుడై; మధురిపుం = శ్రీకృష్ణుని; ధనుర్యాగవ్యాజాత్ = ధనుర్యాగము జరుగుచున్నదనే నెపం చెప్పి; ఇహ = ఇక్కడికి; అనయ = తీసికొనిరమ్ము; అథ = అనంతరము; కంసంప్రతి = కంసునికొఱకు; అక్రూరవచనం = అక్రూరుడు మాట్లాడుట.

అయక్రూరుఁడు దేవకీపుత్రుఁడగు నారాయణునియందు మిగుల భక్తిగలవాఁడు. సకలజనుల యెడలను మిగుల ననుగ్రహముఁ జూపుచు తననామధేయమును సార్థకపఱచుకొనుచుండువాఁడు.

*అథ అక్రూరంప్రతి కంసవచనమ్ -*

శ్లో. మయి ద్వేషో దోషః ఖలు జగతి తేషాం ఖలజుషాం
మహాన్రోషో మే ద్య ప్రసరతి సరత్వం తు ఝటితి,
ధనుర్యాగవ్యాజా దథ మధురిపుం రామసహితం
నయాస్మత్సందేశా దిహ మమ సఖే క్రూర సుమతే. 6

*అథ కంసంప్రతి అక్రూరవచనమ్*

శ్లో. మహారాజ శ్రీమన్ జగతి మహిమా తే విజయతే
తథా కుర్వే హం త్వం వదసి తు మహారాజతనయ,
అమోఘం తద్వీర్యం బల మపి చ లోకే సువిదితం
విధే స్సంకల్పః కిం ఫలయతి న జానే త్వయి పరమ్. 7

శ్లో 7. శ్రీమత్ మహారాజా! = శ్రీమంతుడవైన ఓ కంసమహారాజా!; జగతి = ఈలోకమునందు; తే మహిమ విజయతె = నీయొక్క మహిమ మిక్కిలి విజయకరముగా నున్నది; త్వం వదసి యథా = మీరు చెప్పిన ప్రకారము; అహం తథా కుర్వే = నేను ఆప్రకారము చేసెదను; మహారాజ తనయా = మహారాజపుత్రుడా; తత్‌వీర్యం = ఆ బలరామకృష్ణుల పరాక్రమమున్నూ; బలమపి = బలమున్నూ; పరం = కేవలం; అమోఘం = వ్యర్థముకానిది (అనగా-పనిచేసేతీరును) అని; లోకే = లోకమునందందరికి; సు విదితం = బాగా తెలిసిన సంగతేను; విధేః యస్సంకల్పః =

దైవ సంకల్పము; త్వయి = నీయందు; కిం ఫలయతి = ఏవిధముగా పరిణమించునో, నజానె = నాకు తెలియదు; అక్రూరం ప్రతి = అక్రూరుని కొఱకు; కంస వచనం = కంసుని మాటలు

అట్టియక్రూరుని తనసభకుఁ బిలిపించి కంసుం డిట్లనియె. ఓ మిత్రమా! సుమతీ! అక్రూరా! నీకొకపనిగల్గెను. ఆబలరామకృష్ణులు నన్ను మిగుల ద్వేషించుచున్నారనుట నీవెఱింగినదేకదా! దుష్టులతోఁజేరి నావిషయమున నిట్లుండుట వారలకు గొప్ప తప్పు. ఈకారణమువలన నాకు వారలపై రోషమధికమైయున్నది. వారినిట కెట్లైనను బిలిపింపవలయుననియే నే నీ ధనుర్యాగము నకుపక్రమించితిని. కావున నీవు శీఘ్రముగఁ బోయి వారల నిటకుఁ గొనిరమ్ము.

ఆవాక్యముల విని యక్రూరుం డిట్లని యుత్తరమిచ్చె. శ్రీమంతుఁడవగు నోమహారాజా! నీప్రభావము లోకమునం దంతయు మహదభివృద్ధితోనున్నది. మీరు చెప్పినట్లొనర్చెదను. ఆబలరామకృష్ణులపరాక్రమము మాత్రమపరిమితము. ఇప్పటికి వారెవ్వరికిని కొంచెమైనను లోఁబడలేదు. దీని నెఱుంగనివా రెవ్వరును లేరు. అట్టి యావసుదేవపుత్రుల మీరిటకుఁ గొనిరమ్మని చెప్పుచున్నారు. దైవసంకల్పము పిదప నెట్లుండునో తెలియకున్నది.

*అథ అక్రూరంప్రతి కంసవచనమ్*

అనిన కంసుండిట్లనియె. అక్రూరుఁడా! నీవు శీఘ్రముగ బృందావనమునకుం బోయి ధనుర్యాగ మనుమిషచే నారామకృష్ణుల నిచటికిఁ గొనిరమ్ము. వారిద్దరును నాకు శత్రువులు. వారలఁగూర్చి యేమియుఁజెప్పకుము.

శ్లో. అక్రూర త్వరయా గత్వా రామకృష్ణౌ విహానయ,
బృందావనం ధనుర్యాగచ్ఛలేన మమ తౌ రిపూ.

శ్లో 8. అక్రూరా! = అక్రూరుడా; బృందావనం = బృందావనమునకు; త్వరయా = తొందరగా; గత్వా = నీవు వెళ్ళి; మమ = నాయొక్క; తౌరిపుః = ఆ శత్రులైనట్టి; రామకృష్ణౌ = బలరామకృష్ణులను; ధనుర్యాగచ్ఛలేన = ధనుర్యాగముఅనే సాకుచెప్పినవాడవై; ఇహానయ = ఇక్కడికి పిల్చుకొనిరమ్మా

అనిన కంసుండిట్లనియె. అక్రూరుడా! నీవు శీఘ్రముగ బృందావనమునకుం బోయి ధనుర్యాగ మనుమిషచే నారామకృష్ణుల నిచటికిఁ గొనిరమ్ము నారిద్దరును నాకు శత్రువులు. వారలఁగూర్చి యేమియుఁ జెప్పకుము.

శ్లో. అక్రూరో గోకులం గచ్ఛన్ మధ్యేమార్గం ముహుః స్మరన్,
కృష్ణస్య గుణరత్నాని గాయంగాయం యయౌ వితి.

శ్లో 9 అక్రూరః = అక్రూరులవారు; గోకులం = గోకులమును గూర్చి; గచ్ఛన్ = వెళ్ళుచూ; మధ్యేమార్గం = మార్గమధ్యమునందు; శ్రీకృష్ణస్య = శ్రీకృష్ణులవారియొక్క; గుణరత్నాన్ని = గుణశ్రేష్ఠములను; ముహుర్ముహుః = మాటిమాటికి; స్మరన్ = జ్ఞాపకమునకు తెచ్చుకొనుచు; ఇతి = ఈక్రింద చెప్పబోవువిధముగా; గాయన్ గాయన్ = పలుమారు గానముచేయుచూ; యయౌ = వెళ్ళెను.

ఇట్లు కంసునిచే నాజ్ఞప్తుఁడై యాయక్రూరుఁడు గోపకులమునకు ప్రయాణమయ్యెను. మార్గమధ్యమున శ్రీకృష్ణునిగుణముల నిట్లనిగానముచేసెను.

## అక్రూరుడు బృందావనమున కేతెంచుట

### మధ్యమావతీరాగము - ఆదితాళము

ప. ద్రక్ష్యామి గోకులనిలయం గోపీమాధవం
అ. ప్రక్షీణకల్మషయోగిప్ర త్యక్షదైవం నూనం
1. పాతకారణ్యకుఠార పాదపంకజం - శుద్ధ
పాదజసలిలపూత భక్తసమాజం
కేతకీచంపకతులసీల లితవారిజం-శ్రిత
కేవలానందైకభావం గళితమోహజం-నూనం

2. పక్షిమృగబృంద మిహ యాతి దక్షిణే పథి
పశ్యామి పూర్ణకలశం భద్రలక్షణం
అక్షీణశంఖవీణాది-నాద మోక్షణం-పర
మద్యైవ శృణోమి మధుర మఖిలరక్షణం-నూనం

3. చంద్రవదనసుందరం మందహసనం-చారు
చంపకనాస మరుణార విందలోచనం
నందనందన మమరరచిత వందనం-భూరి
నందితనారాయణతీర్థా నందరసఘనం-నూనం

ప. గోకులనిలయం = గోకులమునున్నూ; గోపీ = గోపికీ అమ్మవారలనున్నూ; మాధవం = లక్ష్మికి భర్త అయిన శ్రీకృష్ణుని; ద్రక్ష్యామి = దర్శనము చేయబోవుచున్నాను

అ. ప్రక్షీణకల్మష = పాపములు క్షీణించినటువంటి; యోగి = యోగులకు; ప్రత్యక్షదైవం = సాక్షాత్తు గోచరించునటువంటి శ్రీకృష్ణులవారిని; నూనం = నిశ్చయముగా; ద్రక్ష్యామి = చూడబోవుచున్నాను; ముదా = సంతోషముచేత; దదృశే = చూచెను; ఇహ = ఇక్కడ.

1. పాతక = పాపములనే; అరణ్య = వనములకు; కుఠారం = గొడ్డలివంటి; పాదపంకజం = పాదారవిందములుగలవాడు; శుద్ధ = నిర్మలమైనట్టి; పాదజ = పాదములయందు పుట్టిన; సలిల = గంగచేత; పూత = పవిత్రము చేయబడిన; భక్తసమాజం = భక్తుల సమూహములుగలవారున్నూ; కేతకి = మొగలి పుష్పములు; చంపక = సంపెంగ పుష్పములు; తులసి = తులసి; లలితవారిజం= ఒప్పుచున్నటువంటి కమలములనున్నూ; శ్రిత = ఆశ్రయించుచచున్నటువంటి; కేవలానందైకభావం = కేవలము ఆనందమే స్వరూపముగా గలవారున్నూ; గళిత మోహజం = విడిపోబడిన మోహజన్యము-అనగా విడిపోయిన అజ్ఞానముగలవారున్నూ అగు స్వామివారిని; నూనం = నిశ్చయముగా; ద్రక్ష్యామి = చూడబోవుచున్నాను.

2. ఇహ = ఇక్కడ; పక్షిమృగబృందం = పక్షులయొక్క మృగములయొక్క సమూహము; దక్షిణేపధి = కుడిమార్గముగా; యాతి = పొందుచున్నవి; పూర్ణకలశం = నీళ్ళతోనిండిన పాత్రను; పశ్యామి = చూచుచున్నాను; భద్రలక్షణం = ఇన్ని మంగళసూచకములు; అక్షీణ = క్షీణములేని; శంఖవీణాది = శంఖము, వీణ మొదలగువాటియొక్క; మధురం = మధురమైనట్టిదియు; వరం = శ్రేష్ఠమైనట్టిదియు; నాదమోక్షణం = ధ్వనులయొక్క ప్రసరణమును; అద్యైవ = ఇప్పుడే; శృణోమి = వినుచున్నాను; అఖిలరక్షణం = సమస్తమునకు రక్షకుడైనట్టి స్వామివారిని; నూనం = నిశ్చయముగా; ద్రక్ష్యామి = చూడబోవుచున్నాను.

3. చంద్ర = చంద్రునివంటి; వదన = ముఖమునందు; సుందర = సుందరమైన; మందహసనం = చిరునగవుగలవారున్నూ; చారు = శృంగారమైన; చంపక = సంపెంగపుష్పమువంటి; నాసం = ముక్కుగలవారున్నూ; అరుణ = ఎర్రనైన; అరవింద = కమలములవంటి; లోచనం = నేత్రములుగలవారున్నూ; నందనందనం = నందునికొమారుడున్నూ; అమర రచితం వందనం = దేవాదులచేత చేయబడిన వందనములుగలవారున్నూ; భూరి = విశేషముగా; నందిత = సంతోషపరచబడిన; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారియొక్క; ఆనందరసఘనం = ఆనందరసమును ఘనీభవింపచేసినవారున్నూ - అగు శ్రీకృష్ణస్వామివారిని; నూనం = నిశ్చయముగా; ద్రక్ష్యామి = చూడబోవుచున్నాను.

ప. గోకులమున నున్న యాగోపీనాథునిఁ జూచెదను.

అ. పాపరహితు లగుయోగులకు ప్రత్యక్షమగు నాదేవునిఁ జూచెదను.

1. ఆమహాత్ముని పాదములు పాపములనియెడు నరణ్యములకు కుఠారములు. ఆపాదముల నుండివుట్టిన గంగ భక్తజనుల పవిత్రులఁ జేయుచున్నది. అజ్ఞానమువలనఁ బుట్టినవికారము లేవియును లేనివాఁడును, మొగలి సంపెఁగ తులసీకమలపుష్పములచే మనోహరుఁడై యాశ్రితులకు పరమానంద మొసంగు వాఁడును అగునాహరిని నిశ్చయముగఁజూడఁగలను.

2. ఈపక్షులన్నియు దక్షిణపార్శ్వముగా (ఎడమనుండి కుడికిఁ) బోవుచున్నవి. శుభశకునముగా జలపూర్ణకలశ మెదురైనది. ఇప్పుడే శంఖవీణాది మంగళవాద్యములధ్వని యారంభమై వినవచ్చుచున్నది. ఈశుభశకునములవలన నాహరిని నిశ్చయముగఁ జూడఁగలను.

3. చంద్రునివంటిముఖము, సంపెఁగపువ్వువంటి నాసికయు, నెఱ్ఱని పెదవియు, రక్తకమలమువంటి విశాలనేత్రములును గల్గి చిఱునగవుతో రాజిల్లుచుండ నారాయణతీర్థుని పరమానందసముద్రమునం దేల్చుచు, దేవతలచే మ్రొక్కులఁ గొనుచునుండు నానందకుమారుని నిశ్చయముగఁ జూడఁగలను.

శ్లో. గత్వాథ యమునాం తస్యాః పుళినం దదృశే ముదా,
శ్రీహరే శ్చరణాంభోజధ్వజవజ్రాదిచిహ్నితమ్. 10

శ్లో. కళిందకన్యాలహరీహధన్యాకళిందజాయాః పుళినంచధన్యం,
మిళన్ముకుందస్య పదారవింద ప్రసారభాగ్యోదయతఃప్రసన్నే. 11

శ్లో. అహం చ ధన్యో యమిబృందమాన్యో
యదూద్వహస్యాం ఘ్రిసరోజచిహ్నాం,
పశ్యామి యస్మా దితి తత్త్వదర్శీ
గాయత్యథాక్రూరపదాభిధేయః. 12

శ్లో 10. అథ = అనంతరము; యమునాం = యమునానదియొద్దకు; గత్వా = వెళ్ళి; తస్యాః = ఆ యమునా సంబంధమైనట్టిన్నీ; శ్రీహరేః = శ్రీకృష్ణస్వామివారియొక్క; చరణాంభోజే = చరణకమలముల యందున్నట్టిన్నీ; ధ్వజ వజ్రాది = ధ్వజము, వజ్రము, శంఖము, చక్రము మొదలగు రేఖలచేత; చిహ్నితం = గుర్తులు గలిగినట్టిన్నీ; పుళినం = ఇసుక దిబ్బలను; ముదా = సంతోషముచేత; దదృశే = చూచెను; ఇహ = ఇక్కడ.

శ్లో 11. కళింది కన్యాలహరి = యమునా నదీ ప్రవాహము; ధన్య = ధన్యురాలు; కళింద జాయః = యమునయొక్క; పులినంచ = ఇసుక దిబ్బలు; ధన్యం = పవిత్రమైనవి; మిళన్ తమతోచేరియుండు; ముకుందస్య = శ్రీకృష్ణస్వామివారియొక్క; పదారవింద = పాదకమలములయందు; ప్రసార = ప్రసరణరూపమున; భాగ్యోదయతః = భాగ్యము కలిగినందువలన; ప్రసన్నే = నిర్మలముగా ప్రకాశించుచున్నవి.

శ్లో 12. యదూద్వహస్య = యదువంశశ్రేష్ఠుడైన స్వామివారియొక్క; అంఘ్రిసరోజ చిహ్నాం = పాదకమలములయొక్క గుర్తులను; యస్మాత్ పశ్యామి = ఏకారణముచేత నేను సేవించున్నానో (అకారణమువల్ల); యమి బృందమాన్యః = ముని బృందములచేత సేవింపబడుచుండు పాదారవిందములను చూచి; అహంచ ధన్యః = నేనున్నూ ధన్యుడను; ఇతి = ఇట్లని; అక్రూర పద అభిధేయః = 'అక్రూరుడు' అను నామధేయము వహించినట్టి; తత్వదర్శి = తత్త్వవేత్త అయిన అక్రూరులవారు; అథ = ఈక్రింద చెప్పబోవువిధముగా; గాయతి = గానము చేయుచున్నాడు.

ఇట్లుచనుచుయమునానదిం జేరి దానితీర్థంబున శ్రీకృష్ణ పాదాంకితంబులగు నిసుకతిన్ని యలంజూచి యిట్లనియె.

అహో ఈయమునానదీతరంగములును, ఇనుకదిన్నెలును మిగులధన్యములైనవి. ఆనారాయణుఁడు వీని సమీపమునకుం జేరి సంచరించుచుండును గదా. అమ్మహాత్ముని పాదస్పర్శములు గలుగుటకై యివి యెట్టి తపము నాచరించెనో? ఇవి మిగులఁ బ్రసన్నములై యుండుటకుఁ గూడ నిదియే (శ్రీకృష్ణపాదస్పర్శమే) కారణమైయుండును.

ధ్వజము, వజ్రము మొదలగు సకలలక్షణములతోఁ గూడిన శ్రీకృష్ణపాదమును జూడఁగలుగుటచే నేను ధన్యుఁడనైతిని. మహామునులకుంగూడ పూజనీయుఁడ నైతిని. అని గానము సేయుటకుఁగూడ నారంభించెను.

## 3వ కీర్తన - సావేరీ రాగము - ఆటతాళము

*పంతువళీరాగము - ఆటతాళము*

| | | |
|---|---|---|
| ప. | ధన్యధన్యో హం ధరణీతలే | ధన్య ధన్యో హం |
| అ. | ధన్యధన్యేయం కాళిందీ | ధన్యం కాళిందీపుళినం |
| 1. | శ్రీహరిచరణాంభోజ | శ్రీవిలసిత మతులం |
| | దేహధారిణా మతీవ | దృష్టిరమణీయం |
| | గేహబాంధవపశ్వాది | గేహినీపుత్రధనాదౌ |
| | మోహపాపవినాశనం | ముహ రపి దృశ్యతే |
| 2. | గోపగోపీజనబృందం | గోకులజంతుకదంబం |
| | పాపతాపాదివిహీనం | పరమపావనం |
| | శ్రీపతిదృగ్విలాసితం | శ్రేయసా మమితాస్పదం |
| | రూపయౌవనసంయుతం | రుచిర మిహ పశ్యామి |
| 3. | శంఖచక్రవజ్రపద్మ | చారుపతాకాదిరే |
| | ఖాంకితాని భువి దృశ్యంతే | అద్యనూనం |
| | పంకజనాభస్య యదు | పుంగవస్య చిహ్నాని |
| | శంకరనారాయణతీర్థ | శంసితం హరిగుకృపయా |

ప.	ధరణీతలే = భూమియందు; అహం = నేను; ధన్యధన్యః = ధన్యుడను ధన్యుడను.

అ.	ఇయం కాళింది = ఈయమునా నదియున్నూ; ధన్యధన్యా = ధన్యురాలు ధన్యురాలు; కాళిందీ పుళినం = యమునా నదీతీరమునందలి ఇసుక దిబ్బలున్నూ; ధన్యం = ధన్యమైనవి.

1.	శ్రీహరి = శ్రీకృష్ణస్వామివారియొక్క; చరణాంభోజశ్రీలలితం = పాదకములముల కాంతులచేత ఒప్పుచున్నటువంటిన్నీ; అతులం = అసమానమైనట్టిన్నీ; దేహధారిణాం = దేహధారులకు; అతీవ = మిక్కిలి; దృష్టిరమణీయం = చూచుటకు సుందరముగానుండునట్టిన్నీ; గేహ = గృహములయందున్నూ; బాంధవ = బంధువులయందున్నూ, పశ్వాది = పశువులు మొదలగు వాటియందున్నూ; గేహిని = భార్యయందును; పుత్ర = కుమాళ్ళయందున్నూ; ధన ఆదౌ = ధనాదులయందున్నూ (వుండు); మోహపాశవినాశం = భ్రాంతి అనే పాశమును నశింపజేయునదిన్నీ -అగునటువంటి; పుళినం = ఇసుకతిన్నెలు; ముహురపి = మాటిమాటికిన్నీ; దృశ్యతే = కనబడుచున్నవి.

2	పాప = పాపము; తాపము = తాపత్రయములు; ఆది = మొదలగువానిని; విహీనం = నశింపజేయుచున్నదిన్నీ; పరమపావనం = పవిత్రమైనటువంటివిన్ని; రూపయౌవన సంయుతం = సౌందర్యము యౌవ్వనముతో కూడినవిన్ని; రుచిరం = మనోహరమైనవిన్ని; శ్రేయసాం = సమస్తశ్రేయములకు; అమిత అస్పదం = మిక్కిలి ఉనికిపట్టు అయినటువంటిదిన్ని; శ్రీపతి దృగ్విలాసితం = శ్రీకృష్ణుని కటాక్ష వీక్షణముచేత ఒప్పుచున్నటువంటిన్నీ; గోప గోపీజనబృందం = గోపాల, గోపికల జనసమూహములనున్నూ; గోకులజంతుకదంబం = గోవులు మొదలగు జంతుసమూహములనున్నూ; ఇహ = ఇక్కడ; పశ్యామి = చూచుచున్నాను.

3.	శంఖము చక్రము వజ్రము - పద్మము - మొదలగు
చారు = శృంగారమైన; పతాకాది = ధ్వజము మొదలగు; రేఖాని = గుర్తులు గలిగినట్టి; పంకజనాభస్య = శ్రీమన్నారాయణమూర్తియగు; యదుపుంగవస్య చిహ్నాని = శ్రీకృష్ణునియొక్క పాద చిహ్నములను; శ్రీహరికృపయా = శ్రీహరి కటాక్షముచేత; శంకరనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవారిచేత; సేవితం = సేవింపబడుచుండునట్టి (శ్రీహరిపాద చిహ్నములు); భువి = ఈప్రదేశమునందు; అద్య = ఇప్పుడు; నూనం దృశ్యంతే = నిశ్చయముగా కనబడుచున్నది.

ప.	భూలోకమున ధన్యులగు నందఱిలోపల నేనే ధన్యుఁడను.

అ.	ఈయమునయు, నిచటి యిసుకతిన్ని యలును మిగుల ధన్యములు.

1.	ప్రాణులకనులకు మిగుల రమణీయమై, గృహము, బంధువులు, పశువులు, భార్య, పుత్రులు, ధనము మొదలగు సకలపదార్థములయందును గల ప్రేమపాశమును నశింపఁ జేయునట్టియు, నాశ్రీకృష్ణపాదపద్మవిలాసము (అడుగు) పలుమాఱు దృష్టిగోచర మగుచున్నది.

2. శ్రీకృష్ణుఁడు దృష్టివిలాసములకు పాత్రములగుటచే సకలదోషములను సంతాపములును లేక మిగులఁ బవిత్రులై, సకలవిధములగు సమృద్ధులకు నాధారులై, రూపయౌవనసంపత్తులతో కనుపండువు సేయుచు లెక్కకు మిక్కిలిగ గోకుల నివాసులగుగోపగోపీజనులు గోవులమందలతోఁ గూడియీ సమీపముననే తిరుగుచున్నారు

3. శంఖ, వజ్ర, పద్మ, చక్ర, పతాకాది దివ్యరేఖలతో నొప్పు నా శ్రీకృష్ణునియడుగు లీనేలఁ గానవచ్చుచున్నవి. ఇవి యదుపుంగవుఁడగునప్పద్మ నాభునిపాదచిహ్నములే యని హరితీర్థశిష్యుఁడగు నారాయణతీర్థయతి నిశ్చయించినాడు (లేక యూహించినాఁడు)

శ్లో. శ్రీహరిచరణసరోజే హృదయసరోజే నిధాయభూయో పి,
గాయతి నందకుమారం సంబోధ్యానన్యభ క్తియుక్తాత్మా.

శ్లో 13. అనన్య భక్తియుక్తాత్మా
అనన్య = అన్యములు చేయకుండా భగవంతునియందే; భక్తియుక్తా = భక్తితో కూడుకున్న; ఆత్మ = మనస్సు కలిగిన (అక్రూరులు); శ్రీహరిచరణ సరోజే = శ్రీహరి పాదకమలములను; హృదయ సరోజే = తనయొక్క హృదయకమలమునందు; నిధాయ = ఉంచుకొని; నందకుమారం = శ్రీస్వామివారిని; భూయోఅపి = మాటిమాటికి కూడా; సంబోధ్య = మనస్సులోపిలిచి; గాయతి = గానము చేయుచున్నాడు.

అంత నిలువక యాయక్రూరుఁడు భక్తివరవశుఁడై యాకృష్ణునిపాదపద్మములు తనహృదయకమలమునందు నిలిపి "ఓకృష్ణా" యని పిలుచుచు మరల నిట్లని గానము చేసెను.

4వ కీర్తన - బిలహరి - ఆదితాళం

| | | |
|---|---|---|
| ప. | భావయే హృదయారవిందే | తావకపాదారవిందే |
| అ. | దేవగంధర్వాదిబృంద | సేవిత మా మవ ముకుంద |
| 1. | సకలలోకనాయక | సాధుజనతారక |
| | మకరకేతుజనక | మాయాధారక |
| | వికటారివిదారక | వేదసముద్ధారక |
| | వికృతభయవారక | విపులసుఖదాయక |
| 2. | కనకమయదుకూల | కలితకల్యాణజాల |
| | మునిమానసానుకూల | మురళీలోల |
| | వినయాదిగుణశీల | వేదపురాణాదిమూల |
| | వీరవిజయగోపాల | విగతశోకాదిమూల |

3. కాళిందీతటవిహార కరుణారససాగర
మేళితగోపీనికర మేరుసమధీర
కాళియమదహార కంసాదిభయంకర
గోకులశ్రీమందార కోటికామసుందర

4. భక్తజనసంరక్ష పరమకరుణావీక్ష
సక్తజనసుశిక్ష సాధుజనపక్ష
రక్తకమలపత్రాక్ష రమణీయచరణదక్ష
భక్తనారాయణతీర్థ భవబంధనమోక్ష

ప. హృదయారవిందే = నాయొక్క హృదయ కమలమందు; తావక పాదారవిందే = దేవరవారి పాదారవిందములను; భావయే = ఆరాధించుచున్నాను.

అ. దేవ గంధర్వాది బృంద సేవిత = దేవతలు గంధర్వులు మొదలగు సమూహములచేత, సేవించబడుచుండువాడు; ముకుంద! = హేకృష్ణా; మాం = నన్ను; అవ = రక్షించుమా

1. సకల లోకనాయకా! = సమస్త లోకములకు నాయకుడైనవాడా; సాధుజనతారకా! = సాధుజనులను తరింపజేయువాడా; మకరకేతు జనక! = మన్మధునకు తండ్రి అయినవాడా; మాయా ధారక = మాయను ధరించియుండువాడా; వికటారి విదారక = వికటాసురుడు అనుశత్రువును చీల్చివేయువాడా; వేద సముద్ధారక = వేదములను ఉద్ధరించినవాడా; వికృత భయవారక = వికారసంబంధమైన భయములను నివారణము చేయువాడా; విపులసుఖదాయక = విస్తారమైన సుఖములను యిచ్చువాడా.

2. కనకమయదుకూల = బంగారుమయమైన వస్త్రమును ధరించినవాడా; కలిత కళ్యాణజాల = శుభముల సమూహముతో ఒప్పుచుండువాడా; ముని మానసానుకూల = వేదార్థములను మననము చేయువారియొక్క మనస్సులకు అనుకూలముగా నుండువాడా; మురళీలోల = వేణుగానమునందు ఆసక్తిగలవాడా; వినయాది సద్గుణశీల = వినయము మొదలగు సద్గుణములే స్వభావములుగా, గలవాడా; వేద పురాణాదిమూల = వేదములకు పురాణములకు ఆదిమూల స్వరూపుడా; వీరవిజయగోపాల = వీరులను జయించునట్టి గోపాలుడా; విగతశోక = శోకములేనివాడా; ఆదిమూల = అన్నిటికి మూలకారణమైనవాడా.

3. కాళిందీతట విహార = కాళిందీనదీ తీరమునందు విహరించు స్వామి; కరుణారససాగరా = కరుణా సముద్రుడా; మిళిత గోపీనికర = గోపికా సమూహములతోచేరినవాడా; మేరు సమధీర = మేరు పర్వతముతో సమానమైన ధైర్యముగలవాడా; కంసాది భయంకర = కంసాదులకు భయమును కలుగజేయువాడ; గోకులశ్రీమందార = గోకులమున కంతయు మందారవృక్షమువలె సర్వాభీష్టమును యిచ్చువాడా; కోటికామసుందర! = కోటిమన్మథ సౌందర్యముగలవాడా

4 భక్తజన రక్షణ = భక్తులను రక్షించువాడా; పరమకరుణావీక్షణ = శ్రేష్ఠమైన కరుణతోకూడుకున్న వీక్షణముకలవాడా; సక్తజన = విషయాసక్తి కలిగినవారలను, సుశిక్ష = చక్కగా శిక్షించువాడా; సాధుజనపక్ష = సాధుజనముల పక్షము వహించినవాడా; రక్త కమల పత్రాక్ష = ఎర్రటి కమలములయొక్క ఆకులతో సమానమైన నేత్రములకలవాడా; రమణీయాచరణదక్ష = మంచి పనులను ఆచరించుటయందు నేర్పుగలవాడా; భక్త నారాయణతీర్థ = భక్తుడైన నారాయణతీర్థులయొక్క; భవ బంధ మోక్ష = సంసారబంధమును విడిపించువాడా

ప. ఓకృష్ణా! నాహృదయకమలమున నీపాదపద్మముల ధ్యానించెదను.

అ. దేవగంధర్వాదులచే సేవింపఁబడు నోనారాయణా! నన్నుబ్రోవుము.

1. ఓసర్వలోకేశ్వరా! మాయావీ! నీవుసత్పురుషులభయములనివారించి వారలకు సంపూర్ణ సౌఖ్యము నిచ్చెదవు. ఓమదనజనకా! నీ వేదుష్టులగువారల నంహరింతువు. సోమకాసురునిచే నపహరింపఁబడిన వేదముల నుద్ధరించితివి.

2. ఓవరాక్రమశాలీ! గోపాలా! నీవు వేదపురాణాదులకన్నిటికి నాధారభూతుఁడవై, సుఖదుఃఖాదులు లేనివాఁడవై, సమస్తకల్యాణగుణములకాధారుఁడవై యుండు పీతాంబరుండవు. ఓ వేణుగానలోలా! మహామునులు నిన్నెప్పుడు భావించుచు నీయనుగ్రహమువలన సకలశుభముల నొందుచున్నారు.

3. కోటిమన్మథసమానసుందరాకారా! కరుణాసముద్రా! నీవు యమునానదీతీరమున విహరించుగోపికలనందఱ నెచ్చటికిఁ జేర్చి యనుగ్రహించితివి. ఓమహాధైర్యసంపన్నా! గోకులకల్పవృక్షమా! నీవు కాళీయుని మర్దించుటవలన కంసాదులకు భీతి గల్గినది.

4. రక్తకమలపత్రములవంటి నేత్రములుగల యోసజ్జనపక్షపాతీ! నీవు దయాదృష్టిచే భక్తుల వీక్షింపుచు, నీశుభచరిత్రను నిదర్శనముగఁజూపి వారల ధర్మమార్గమున నడపించుచుందువు. ఆనారాయణతీర్థునకు సంసార బంధ మోక్షమును గావించితివి.

అక్రూరుఁడు కృష్ణుని సేవించుట

శ్లో. బృందావనే గవాం మధ్యే గోపమండలమధ్యగం,
దృష్ట్వా క్రూరః ప్రణమ్యాథ భక్త్యా ప్రార్థయతే హరిమ్.

శ్లో. శ్రీనందగోపతనయాఖిలవిశ్వమూర్తే
శ్రీమత్పయోధితనయాధవ కృష్ణమూర్తే,
ఆనందయాఖిల మశేషజగన్నివాస
మీనాంకకోటిసమసుందర శుద్ధకీర్తే.

శ్లో 14. అక్రూరః = అక్రూరులవారు; బృందావనే = బృందావనమందు; గవాంమధ్యే = గోవులమధ్య; గోపమండలమధ్యగం = గోపాలకుల సమూహములనడుమ వేంచేసియుండు; హరిం = శ్రీకృష్ణస్వామివారిని; దృష్ట్వా = దర్శనముచేసి; ప్రణమ్య = నమస్కరించి; అధ = అనంతరము, భక్త్యా = భక్తిచేత; ప్రార్థయతే = ప్రార్థించుచున్నాడు.

శ్లో 15 శ్రీనందగోపతనయా = శ్రీనందగోపునియొక్క కుమారుడైన హేస్వామి; అఖిల విశ్వమూర్తే = సకల ప్రపంచమును శరీరముగాగలవాడ; శ్రీమత్ = సంపద్యుక్తుడైన, పయోధి = పాలసముద్రునియొక్క; తనయ = కుమార్తె అయిన లక్ష్మీఅమ్మవారికి; ధవ = భర్త అయినటువంటి కృష్ణమూర్తీ; అశేష జగన్నివాసా = సమస్త జగములయందు నివసించువాడా; మీనాంక కోటి సమసుందర = కోటిమన్మధులతో సమానమైన సౌందర్యముగలవాడా; శుద్ధకీర్తే = పవిత్రమైన కీర్తిగలవాడా; అఖిల = సమస్తమైనవారిని; ఆనందయ = ఆనందింపజేయుమా.

పిదప నాబృందావనమునం దొకయావులమందవెనుక ననేక గోపబాలకులచేఁ బరివేష్టింపఁబడి వచ్చుచు, శ్రీకృష్ణుం డాయనకుఁ గానవచ్చెను. ఇట్లు వచ్చువారింజూచి యాయక్రూరుండును భక్తిపరవశుండై ప్రార్థించెను.

మన్మథకోటి సమానసుందరుఁడవును, జగన్మయుండవు నగు నోనందకుమారా! నీవు లక్ష్మీనాయకుండగు నీవర్ణుండవు. నీకీర్తి సకలలోకముల వ్యాపించియున్నది. నీకరుణాదృష్టిచే నీసకలలోకముల నానందింపఁ జేయుము.

*కాంభోజీరాగము - ఆదితాళము*

| | | |
|---|---|---|
| ప. | నందగోపబాల కృష్ణ | నందయాఖిలం |
| అ. | శ్రీచందనకుంకుమతులసీ | చాంపేయాదిసుగంధితాంగ |
| 1. | అజయ్యరమణీయలోక | ఆగమబృందమానక |
| | భజదార్తినివారక | భద్రదాయక |
| | అజిత లోకనాయక | ఆదిత్యాదిశాసక |
| | విజితాసురనాయక | విశ్వమంగళదాయక |
| 2. | గోపాంగనామండల | గోగోపపరిపాల |
| | తాపసజనలోల | తార కాగమమూల |
| | శ్రీపతే నంతలీల | శృంగారకృపాలవాల |
| | శ్రీవత్సచిహ్నాదిమూల | కారణమూర్తే |

3. ఆతులకరుణాసార అఖిలజగదాధార
ధృతదివ్యపీతాంబర దివ్యసుందర
హృతనవనీ తోదార హృదయనిహితేందిర
శ్రితభక్తమందార శ్రీలసత్కౌస్తుభోదార

4. సంతతానందకర సాధుజననికర
చింతితార్థదోదార చిన్మయామరవీర
సత్యకామచతుర సంసారపరాపర
నిత్యనిగమశిఖర నియతవిహార

5. వ్యత్యస్తాంఘ్రికమల విమలమణికుండల
ప్రత్యస్తమోహజాల ప్రత్యక్దృగఖిల
నిత్యముక్తనిర్మల నిఖిలనిగమమూల
భృత్యజనానుకూల భ్రాజద్గోకులలీల

6. వై జయంతీశోభిత వామదేవాదిసేవిత
నిజభక్తసువిదిత నిత్యశుభచరిత
ఋజుమానసలలిత ఋగ్యజుస్సామాదిగీత
వ్రజనారీపరివృత విశ్వవిఖ్యాత

7. దేవాదికృతమోద దివ్యమురళీనాద
భావితాఖిలవేద భవ్యభక్తవరద
శ్రీవసుధావినోద శ్రితజనమోక్షప్రద
శివనారాయణతీర్థ సేవితపాద

ప. నందగోపబాలకృష్ణా = నందగోపునకు బాలుడైన కృష్ణా; అఖిలం = సమస్తమును; నందయ = సంతోషింపజేయుమా; శ్రీచందన కుంకుమ తులసీచాంపేయాది = చందనము, కుంకుమ, తులసీ సంపెంగ మొదలగు పుష్పములయొక్క; సుగంధితాంగ = పరిమళముగల శరీరముగలవాడ.

1. అజయ్య = జయించుటకు వీలుబడనివాడ; రమణీయ = సుందరమైన; అలోక = దృష్టికలవాడ; ఆగమబృందమానక = వేదసమూహములే ప్రమాణములుగాగలవవాడ; భయదార్తినివారక = ఆర్తులభయమును పోగొట్టువాడ; భద్రదాయక = మంగళములను యిచ్చువాడ; అజిత = ఎవరివల్లను జయింపబడనివాడ; లోకనాయక = లోకములకు ప్రభువుగానుండువాడ; ఆదిత్యాదిశాసక = సూర్యుడు మొదలగువారికి ఆజ్ఞనిచ్చువాడ; విజిత అసురనాయక = రాక్షసనాయకులను జయించువాడ; విశ్వమంగళదాయక = సమస్త లోకములకు శుభములనిచ్చువాడ.

2. గోపాంగనా మండల = గోపస్త్రీ సమూహములనున్నూ; గో గోప పరిపాల = గోవులను, గోపాలకులను పరిపాలనచేయువాడ; విశ్వమంగళదాయక = సమస్తలోకముకు శుభములనిచ్చువాడ; తాపసజనలోల = తపస్సంపన్నులయందు ఆసక్తిగలవాడ; తారక ఆగమమూల = తరింపజేయునట్టి వేదభాగములే మూలముగాగలవాడ; శ్రీపతే = లక్ష్మీపతే; అనంతలీల = అంతములేని లీలలుగలవాడ; శృంగార కృపాలవాల = శృంగారమునకు దయకు మూలస్థానమైనవాడా; శ్రీవత్సచిహ్నా = శ్రీవత్సమనే గుర్తుగలవాడ; ఆదిమూలకారణమూర్తే = సమస్త జగత్తుకు ఆదిమూలకారణమైన విగ్రహముగలవాడ

3. అతుల కరుణాసార = అసమానమైన కరుణాసారముగలవాడా; అఖిల జగదాధార = సమస్త జగమునకు ఆధారమైనవాడ; ధృతదివ్య పీతాంబర = ధరించబడిన దేవతా సంబంధమైన పీతాంబరముగలవాడా; దివ్యసుందర = దేదీప్యమానమైన సౌందర్యముగలవాడ; హృత నవనీతోదార = వెన్నముద్దలు దొంగిలించుటయందు, వినియోగపరచుటయందు ఔదార్యముగలవాడ; హృదయ నిహిత ఇందిర = వక్షస్థలమునందు ఉంచుకొనబడిన లక్ష్మిని గలవాడ; శ్రితభక్త మందార = ఆశ్రయించబడిన భక్తులకు కల్పవృక్షము వంటివాడ; శ్రీలసత్ కౌస్తుభ = కాంతియుక్తముచే ప్రకాశించునట్టి కౌస్తుభముగలవాడ; ఉదార = ఔదార్యముగలవాడ.

4. సంతత ఆనందకర = ఎల్లప్పుడు ఆనందము నిచ్చునట్టివాడ; సాధు జననీకర = సాధుజన బృందములుగలవాడ; చింతితార్థద ఉదార = సాధుజనసమూహములచేత చింతించబడుచుండు ప్రయోజనములను యిచ్చుటయందు ఔదార్యముగలవాడ; చిన్మయ = జ్ఞానస్వరూపుడా; అమరవీర = దేవతలలో వీరుడైనవాడ; సత్యకామ = సత్యమైన కామముగలవాడ; అనగా ఫలించుచుండు కోరికలుగలవాడ; చతురసంసార పరాపర = పర, అపర ప్రకృతులే చాతుర్యమైన సంసారముగాగలవాడ; నిత్యనిగమ శిఖర = ఎల్లప్పుడున్నూ వేదాగ్రములె, అనగా ఉపనిషత్ భాగములే; నియత విహార = నియతమైన విహారస్థలముగలవాడ.

5. వ్యత్యస్తాంఘ్రికమల = వ్యత్యస్తముగా నుంచబడిన పాదారవిందములగలవాడ; విమల మణికుండల = నిర్మలమైన మణికుండలములుగలవాడ; ప్రత్యస్త మోహజాల = మోహసమూహమును నశింపజేయువాడ; ప్రత్యక్ దృగఖిల = సమస్తమును ప్రత్యక్షముగా

చూచువాడ; నిత్యముక్త = ఎల్లప్పటికి దేహాభిమానాదులులేనివాడ, నిర్మల = ప్రకృతి సంబంధమైన మాలిన్యము అంటనివాడ; నిఖిలనిగమమూల = సమస్తవేదములకు కారణస్వరూపుడా, భృత్య జనానుకూల = సేవకజనులకు అనుకూలమైనవాడ; భ్రాజిత్ గోకులలీల = గోకులమునందు ప్రకాశింపజేయపడుచుండు లీలలు గలవాడ.

6. వైజయంతీ శోభిత = వైజయంతి (వనమాలను) ధరించి ప్రకాశించువాడ; వామదేవాదిసేవిత = వామదేవాది మహా ఋషులచేత సేవించబడుచుండువాడ; నిజభక్తసువిదిత = నిజమైన భక్తిగలవారియందు చక్కగా తెలియబడుచుండువాడ; నిత్యశుభచరిత = ఎల్లప్పుడూ మంగళకరమగు చరిత్రగలవాడ; ఋజుమానసలలిత = మంచి మనస్సుచేత వొప్పుచుండువాడ; ఋుగ్యజు స్సామాదిగీత = ఋుగ్వేద, సామ, యజుర్వేదములచేత గానము చేయబడుచుండువాడ; వ్రజనారీపరివృత = గోకులమునందుండు స్త్రీలచేత పరివేష్టింపబడువాడ; విశ్వవిఖ్యాత = జగత్తుయందు యశస్సును పొందువాడ.

7. దివ్యమురళీనాద = అప్రాకృతమైన వేణునాదముతో; దేవాదికృతమోద = దేవాదులకు సంతోషమును కలుగజేయువాడ; భావితాఖిలవేద = సమస్తవేదమును భావముగా గలవాడ; భవ్యభక్తవరద = భక్తులకు మంగళమైన వరములు యిచ్చువాడ; శ్రీవసుధావినోద = లక్ష్మి, భూదేవతలతో వినోదముగా నుండువాడ; శ్రితజన మోక్షప్రద = ఆశ్రయించినవారికి మోక్షము నిచ్చువాడ; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులు అనువారిచేత; సేవితపాద = సేవించబడుచుండు పాదారవిందములుగలవాడ.

ప. ఓనందకుమారా! గోపాలా! శ్రీకృష్ణా! ఈసకల ప్రపంచమును ఆనందింపఁజేయుము.

అ. చందనము, కుంకుమపువ్వు, తులసి, సంపెఁగపుష్పములు మొదలగువాసనలతో నొప్పు శరీరముగలవాఁడా!

1. ఓవేదవేద్యా! మనోహరమగునీస్థానము (వైకుంఠము లేక మోక్షము) నెవ్వరును జయింపనేరరు, (పొందనేరరనుట) ఓలోకేశ్వరా! నీవు భక్తులగువారలకు శుభముల నిచ్చి వారికష్టములఁ దొలఁగించెదవు. ఓ అజితా! (అజితుఁడనునది విష్ణువునకు ప్రసిద్ధనామము) నీవు రాక్షసులను మర్దించి ప్రపంచమునకు శుభములఁ గూర్చెదవు.

2. ఆదికారణభూతా! వేదాధారా! నారాయణా! నీవు శ్రీవత్సము మొదలగు చిహ్నములతో గోపాలరూపమును దాల్చి, అపరిమితదయతోఁగో, గోపగోపీకాజనుల నుద్ధరించి రక్షించుచున్నావు. ఓమునిజనలోలా! ఇది యంతయును నీకు లీలామాత్రము.

3. పీతాంబరముతోను, వక్షస్థలమునందు మెఱయులక్ష్మీకౌస్తుభములతోను, ప్రకాశించు సుందరాకారముతో సకలప్రపంచమునకు రక్షణ మొదలగు కరుణారసభావముతో నవనీతచోరుఁడవై యాశ్రితుల కల్పవృక్షమునుంబోలె రక్షించుచున్నావు.

4. ఓచిదానందస్వరూపా! సకలదేవరక్షకా! సత్పురుషులగువారు సకలఫలప్రదాత వగునిను ధ్యానించు శాశ్వతమగు నానందమును బొందుచుందురు. ఓసత్యసంకల్పా! విచిత్రమగు నీసంసారమును, దీనిననుభవించు జీవుఁడును, వానిఁబ్రే రేపించు నీశ్వరుఁడును నీవే. వేదము లనుపర్వతముల శిఖరములపై (వేదాంతములగు ఉపనిషత్తులయందు) సంచరించుచుందువు.

5. వ్యత్యస్తములగు పాదములతో ప్రకాశించుచు, నిర్మలములగు కుండలములు మొదలగు భూషణములఁ దాల్చి మనోహరమగు గోపాలవేషముతో నున్న సర్వసాక్షీ! జగన్మయా! నిత్య, శుద్ధ, ముక్తస్వరూపా! నీవే వేదాంతవేద్యమగు పరబ్రహ్మము. భక్తుల ననుగ్రహింప లీలలచే నీగోకులమున నివసించుచు, క్రీడించుచున్నావు.

6. ఋగ్యజుస్సామవేదములును, పురాణాదులును నినుఁగూర్చి యెంత విమర్శించి చెప్పినను, లోకమునందు నీకీర్తి యెంత యధికమైనను, నీభక్తులు దక్క తక్కినవారలు నీయథార్థస్వరూపము నెఱుంగనేరరు. గోపాంగనలు సర్వకాలములందును పరివేష్టించియుండ వనమాలాలంకృతుండవై యీ బృందావనమున మనోహరముగ సంచరించుచున్నావు.

7. ఓభక్తవరదా! సర్వోత్తమా! నీమురళీగానము సకలవేదార్థములను బ్రకటించుచుండ, దానిని విని దేవతలందఱు సంతసించుచుందురు. ఈభూమికి భూషణమవై జన్మించి యాశ్రితులకు మోక్షము నిచ్చుచు, నారాయణతీర్థునిచే సేవింపఁబడుచున్నావు.

> శ్లో. ముహుర్ముహుర్నమన్నమ్ ముకుంద పాదపద్మయోః,
> మహన్ మహన్ మహీయసాం ప్రభో మమ ప్రబోధయ,
> ఇతి స్వయంప్రభం ప్రభుం హృదా హరిం స్మరన్ గుణాన్
> స గద్గదస్వరేణ తత్సమీపగో స్తు వన్ముదా 16

శ్లో 16. సహ = ఆ అక్రూరులు; ముహుర్ముహుః = మాటిమాటికి; ముకుంద పాదపద్మయోః = స్వామివారి పాదపద్మములకు; నమన్నమన్ = నమస్కరించుచూ; మహీయసాం = గొప్పవారి కందరికి; మహాన్మహాన్ = గొప్పవాడవైనటువంటి; ప్రభో! = "హేస్వామీ!; మమ = నాకు; ప్రబోధయా = జ్ఞానమునుయిమ్మా; ఇతి = ఇట్లని; స్వయంప్రభం = స్వప్రకాశస్వరూపుడున్నూ; ప్రభుం = అన్నిటికి ప్రభువున్నూ అయినటువంటి; హరేః = శ్రీకృష్ణస్వామివారియొక్క; గుణాన్ = కళ్యాణ గుణములను; హృదా = మనస్సునందు; స్మరన్ = స్మరించుచున్నవాడై; గద్గద స్వరేణ = డగ్గుత్తికతో; తత్సమీపగః = స్వామివారిని సమీపించినవారై; ముదా = సంతోషముచేత; అస్తువన్ = స్తోత్రముచేసిరి.

ఇట్లాయక్రూరుఁడు పలుమాఱు శ్రీకృష్ణపాదములకు నమస్కరించుచు, "ఓమహాత్మా! ప్రభువులకు ప్రభువా! పురుషోత్తమా! నాకు జ్ఞానమును గల్గింపుము" అని యిట్లు ప్రార్థించెను. స్వప్రకాశస్వరూపుఁడగు నాహరిని జగన్నాయకుని తనహృదయమున నిలిపి ధ్యానించుచు; వాఘనునిగుణముల గద్గదస్వరముతోఁ గొనియాడుచు నాగోపాలకృష్ణుని సమీపమునకుఁ జేరెను.

శ్లో. మాయామానుష దేహీ మాధవనామాభివాద్యతంసబలః,
తేనాలింగితమూ ర్తిస్సురరిపువృత్తం తదుక్త మథ వేద.
శ్లో. అక్రూరో రామకృష్ణాభ్యాం న్యవస ద్గోకులే సుఖం
అథోత్థితో రాత్రి శేషే సముత్థాపయతి స్వయమ్ 18

శ్లో 17. మాయామానుషదేహి = స్వకీయ దివ్యసంకల్పముచేత మనుష్యదేహము ధరించినటువంటిన్నీ; మాధవనామ = మాధవుడు అనే పేరుగలిగిన స్వామివారు; సబలః = బలరామసహితుడై, తం = ఆఅక్రూరునిగూర్చి; అభివాద్య = నమస్కరించి; తేన = ఆ అక్రూరులవారిచేత; ఆలింగితమూర్తిః = ఆలింగనము చేసుకొనబడిన; మూర్తిః = దివ్యమంగళ విగ్రహముగలవారై; అథ = అనంతరము; తదుక్తం = ఆ అక్రూరులచేత చెప్పబడినటువంటి; సురరిపువృత్తం = కంసునియొక్క నడవడిని; వేద = తెలుసుకొనెను.

శ్లో 18. అక్రూరః = అక్రూరులవారు; రామకృష్ణాభ్యాం = బలరామకృష్ణులతోగూడ; గోకులే = గోకులమందు; సుఖం = సౌఖ్యముగా; న్యవసత్ = నివశించెను (ఉండెను); అథ = అనంతరం; రాత్రిశేషే = వేకువఝామున; ఉద్ధితః = నిదురలేచి; స్వయం = స్వంతముగా; సముద్ధాపయతి = బలరామకృష్ణులను నిద్రలేపుచున్నారు.

ఇట్లా యంక్రూరుఁడు వచ్చుటంగాంచి యాశ్రీకృష్ణుఁడును బలరామసహితుఁడై తనలీలామానుషభావమునకు యుక్తముగ నభినయించుచు నాతనికి నమస్కరించెను. అయనయు నారామకృష్ణుల నాలింగనముఁ జేసికొని పరమానంద పరవశుఁడై కొంతకాలముఁ గడిపి, పిదప తాను వచ్చియున్న కార్యమును వారల కెఱింగించెను. వారును మధురాగమనమున కంగీకరించిరి.

అంత వారందరుఃను గోకులమునకుం జని సుఖముగ నారాత్రింగడపిరి. అంత వేకువ యగుటయు, నాయక్రూరుఁడు మొదట మేల్కాంచి రామకృష్ణుల నిట్లని మెలుకొలిపెను.

## 6వ కీర్తన - దేశాక్షి (మలహరి) జంపెతాళము

*అక్రూరుఁడు రామకృష్ణుల మేల్కొల్పుట*

ప. హే రామ హే కృష్ణ ఇహ సముత్తిష్ఠ

అ. హే రామ హే కృష్ణ హే జగత్త్రయగురో
మహే పుండరీకాక్ష రక్ష నిజపక్షం

1. ప్రాచీదిశాంగనా పరిహసతి హే కృష్ణ
పతియోగపరమసౌభాగ్యమహితా
ప్రాచీనవైరస్య మభినయంత్యథ సా
ప్రతీచీందిశం రామ కామముదితా

2. నళినముకుళో దరవిదళనగళితాళయో
లలితతరరవినిహ్ను తాంధతిమిరాః
మిళితనవనళినపరిమళ బహుళమకరంద
కలనయా విచరంతి కామముఖరాః

3. దధిమథనసంజాతమధురతరసంగీత
బుధజనాగమఘోషరమ్యఘోషం
మధుమథన సంకలయ మాధవ విధీంద్రనుత
పదకమలపద్మాకృతాభిలాషం

4. భూపాళదేశాక్షి దేవగాంధారిశుభ
బిలహరివసంతముఖరాగబృందం
గోపికా గాయంతి గోవింద తవ తు శుభ
గుణరత్న బృంద మానందకందం

5. కలితనవమల్లి కాకుసుమాని విహసంతి
కామ మిహ తారకాబృంద మమితం
లలితవచసా క్రూరకలితమితి గురుభక్త
నారాయణానందతీర్థరచితం.

ప॥ హేరామ = ఓరాముడా! (ఓ బలరాముడా); హే కృష్ణ = ఓ కృష్ణుడా!; ఇహ = ఇక్కడ; సముత్తిష్ఠ = నిద్రబాగా లేవండి.

అ. హేరామా! హేకృష్ణా; హే జగత్రయ గురో = మూడులోకములకు గురువైన ఓస్వామీ!; హే పుండరీకాక్ష! = తామరకమలములతో సమానమైన నేత్రములుగలవాడా; రక్ష నిజపక్షం = నీదాసులను రక్షించువాడా.

1. హేకృష్ణ! = ఓ కృష్ణుడా!; ప్రాచీదిశాంగనా ='తూర్పుదిశ' అను స్త్రీ; పతియోగ పరమసౌభాగ్యమహిత = భర్తఅయిన సూర్యునియొక్క సంయోగ మనునట్టి గొప్పసౌఖ్యముచేత ఒప్పుచున్నదియై; పరిహసతి = నవ్వుచున్నట్టు కనబడుచున్నది; హేరామ! = ఓ బలరాముడా!; సా = ఆ తూర్పుదిక్కు; అథ = ఈ కారణముచేత; కామ ముదితా = కామ విరహముచేత సంతసించుచూ; ప్రతీచీ దిశం = పడమర దిక్కును గూర్చి; ప్రాచీన వైరస్యం = అనాది సిద్ధమైన విరోధమును (విరస భావమును); అభినయంతి = అభినయము చేయుచున్నది (వెల్లడి చేయుచున్నది)

2. లలిత = ఒప్పుచున్నటువంటి; రవి =× సూర్యునిచేత; నిహ్నుత = వెళ్ళగొట్టబడిన; అంధతిమిరాః = చీకట్లకు పోల్చబడతగినటువంటివన్నీ; నళిన = తామర కమలముయొక్క; ముకుళ = ముడుచుకొనియుండిన; ఉదర = పొట్టలలోనుండి; విదళన = వికసించినపుడు, గళిత = జారితప్పించుకొని (ఇవతల వచ్చినటువంటి); అళయః = తుమ్మెదలు; మిళిత = తాముకొత్తగా చేరినటువంటి; నవనళిన = క్రొత్త కమలములయొక్క; పరిమళ = సువాసనలతోకూడిన; బహుళమకరంద = విశేషమకందమునందుండు; కలనయా = ఇష్టముచేత; కామ ముఖరా = స్వేచ్ఛగా గానముచేయుచు; విచరంతి = విహరించుచున్నవి.

3. దధిమధన సంజాత = పెరుగు తరచుటచేత పుట్టిన ధ్వనియున్నూ; మధురతర సంగీత = మధురమైన గానధ్వనియున్నూ; బుధజనాగమఘోష = పెద్దలవేద ఘోషయున్నూ; రమ్యఘోషం = ఈ ధ్వనులుఅన్నీ చేరినటువంటిగోకులము; హే! మధుమధనా = 'మధువు' అను రాక్షసుని చంపిన హే కృష్ణా!; మాధవ! = హేమాధవా! (లక్ష్మీభర్త అయినవాడా); విధీంద్రనుత పదకమలా! = బ్రహ్మేంద్రులచేత కొనియాడబడుచుండు పదకమలములగల హే స్వామీ!; పద్మ కృతాభిలాషం = లక్ష్మీ అమ్మవారిచేత చేయబడుచున్నట్టి అభిలాషనున్నూ; సంకలయ = చిత్తగింపుడు

4. హే గోవిందా = ఓ గోవిందుడా!; గోపికాః = గోపికలు; తవతు = మీయొక్క; ఆనందకందం = ఆనందమే స్వరూపముగా గలిగిన; శుభ గుణరత్నబృందం = మంగళకరమైన గుణరత్నముల సమూహమును; భూపాళ, దేశాక్షి, దేవగాంధారి, శుభబిలహరి, వసంతముఖ ఈ మొదలగునటువంటి; రాగబృందం = రాగముల సమూహములతోటి; గాయంతి = పాడుచున్నారు.

5. కలిత = ఒప్పుచున్న; నవమల్లికా = క్రొత్తమల్లెపొదలయొక్క; కుసుమాని = పుష్పములు; ఇహ = ఇప్పుడు; తారకా బృందం = నక్షత్రముల సమూహమును; కామి = మిక్కిలి; అమితం = విశేషముగా; విహసంతి = పరిహాసము చేయుచున్నవి; లలితవచసా = స్వారస్యముగలవాక్కులచేత; అక్రూరకలితం = అక్రూరులు ఈ కీర్తనను చెప్పియున్నారు; ఇతి = ఇట్లని; గురుభక్త = గురుభక్తి గలిగిన; నారాయణానంద = నారాయణతీర్థులవారిచేత; రచితం = రచియింపబడినది (చెప్పబడినది).

ప. ఓ బలరామా! శ్రీకృష్ణా! మేల్కొనుము.

అ. ముల్లోకములకు గురువులగు నోబలరామ కృష్ణులారా! పుండరీ కాక్షులారా! మీ భక్తులఁ గరుణింపుఁడు.

1. ఓ బలరామకృష్ణులారా! భర్తృసంయోగమువలన (నిచట భర్త = సూర్యుఁడు) అపరిమితమగు సౌభాగ్యముజెంది, కామవిహారముచే సంతసించుచు; "సూర్యోదయముతోఁ గూడి మిగుల ప్రసన్నమై" అని యర్థము) ప్రాగ్దిశ పశ్చిమదిశను పరిహాసము చేయుచున్నది. అదియు, క్షణకాలమునకు పూర్వమువఱకు అప్రాగ్దిశ యనుభవించుచుండిన విరహావస్థ నభినయించి చూపుచు దానిని తిరిగి వెక్కిరించుచున్నది.

2. తుమ్మెదలును, సూర్యునిచేఁ దిరస్కరింపఁబడి రూపాంతరమును దాల్చిన గాఢాంధకారములోయన, వికసించిన కమలములనుండి వెలికివచ్చి క్రొత్తగ వికసించిన పుష్పములలోని సుగంధమకరందముఁ బానముఁ జేయుచు ఝుంకారనాదములతో యథేష్టముగ విహరించుచున్నవి.

3 పెరుఁగు చిల్కుచప్పుళులును. మధురములగు సంగీతవాద్యములును, వేదఘోషంబులు ఈపల్లియయందుఁ జెలంగుచున్నవి. లక్ష్మియు, తనంతన యీగోకులమున నివసింపఁగోరుచున్నదో యని తోఁచుచున్నది. ఓమధు సూదనా! బ్రహ్మేంద్రాది వినుతపాదకమలా! దీనిని జూడుము. మేల్కొనుము.

4. ఓశ్రీకృష్ణా! భూపాల దేశాక్షి, దేవగాంధారి, బిలహరి, వసంత మొదలగు ననేకరాగములతో గోపికలందఱును పరమానందకరములగు నీ సద్గుణముల గానము సేయుచున్నారు.

5. ఇప్పుడు వికసించుచుండుటచే మల్లెపువ్వులు కాంతిహీనములగుచున్న నక్షత్రములఁ బరిహసించుచున్నవి. ఇట్ల క్రూరుఁడు మనోహరవాక్యములచే ప్రభాతము వర్ణించెనని గురుభక్తుఁడగు నారాయణతీర్థుఁడు గీతమును రచించెను.

శ్రీకృష్ణుఁ డక్రూరునితోడ మధురాపురికి వేంచేయుట

శ్లో॥ వ్యతీతాయాం సతద్రాత్రౌ సబలం బలినాం బలం,
ఆరోప్య స్యందనే తూర్ణమక్రూరో శ్వా నచోదయత్.
స్యందనే వసతి నందనందనే చంద్రమండల సమాననే ఘనే,
మందహాసరమణీయచంద్రి కాస్సుందరం జగురిమాహిగోపికాః.

శ్లో 19. సః = ఆ అక్రూరులవారు; తత్ రాత్రౌ = ఆరాత్రి; వ్యతీతాయాం = గడచిపోగానే; సబలం = బలరామునికూడా కూడుకొని యున్నట్టిన్నీ; బలినాంబలం = బలవంతులలోనికి మిక్కిలి బలము గలిగినట్టిన్నీ (అటువంటి స్వామివారిని); స్యందనే = రథమునందు; ఆరోప్య = ఎక్కించి, తూర్ణం = త్వరగా; అక్రూరః = అక్రూరులవారు; అశ్వాన్ = గుఱ్ఱములను; అచోదయత్ = తోలెను.

అంత బాగుగ సూర్యోదయమగుటయు నాయక్రూరుఁడు బలరామకృష్ణుల రథముపైఁ గూర్చుండబెట్టుకొని, తాను సారథియై ప్రయాణమునకు శ్రీఘ్రముగ నారంభించెను. చంద్రబింబముతో సమానమగు ముఖముగల యమ్మహాత్ముండు నందకుమారుడు రథమెక్కి చనుచుండుటఁ జూచి గోపికలందఱును మందస్మిత సుందరముఖములతో నిట్లని గానముచేసిరి.

*కల్యాణీరాగము - ఆదితాళము*

ప. అక్రూరో గమయతి మధురా మచ్యుత మిహ సఖిసుతరాం

అ. స క్రూరో మాయావీ తస్య సాహస మథ సఖి పశ్య

1. సబలం గోపీజనహృదయాంబుజ సవితారం సఖి సహసా
కబళితనవనీతం కలితాగమకారణ మసురవిదారణ మీశం

2. బృన్దావనచంద్రమసం నిజజన చన్దన మింద్రాదినుతం
నందనందన మానందితవిధిముఖబృన్ద మనిందితస్యందననియతం

3. సంసారార్ణవతారకవిజయ గోపాలక మఖిలైకగురుం
కంసరిపుం శివనారాయణతీర్థకలితమిదం కవిహృదయవిహారం

ప. సఖీ! = హే చెలికత్తే!; అక్రూరః = అక్రూరుడు; అచ్యుతం = శ్రీకృష్ణమూర్తిని; సుతరాం = కేవలము; మధురాం = మధురానగరమునుగూర్చి; ఇహ = ఇప్పుడు; గమయతి = చేర్చును.

అ. సఖి = హే చెలికత్తె!; సక్రూరః = క్రూరుడైనటువంటి; మాయావి = మోసగాడు; అథ = ఇప్పుడు; తస్యసాహసం = ఆయనయొక్క ఆలోచనలోని పనిచేయుటను; పశ్య = చూడుము.

1. సబలం = బలరామ సహితుడైనటువంటినీ; గోపీజన హృదయాంబుజ సవితారం = గోపీజనహృదయములను కమలములకు సూర్యుడైనటువంటివాడున్నూ; సాహసా కబళిత నవనీతం = ఆలోచనలేకుండా వెన్నముద్దలు పుచ్చుకున్నవాడున్నూ; కలిత = ఒప్పుచున్నటువంటి; ఆగమకారణం = వేదములకు కారణభూతుడున్నూ; ఈశం = సర్వనియమకుడైన కృష్ణుని; సఖి = హే చెలికత్తె; పశ్య = చూడుము.

2. బృందావన చంద్రమసం = బృందావనమునకు చంద్రుడంటివాడున్నూ; నిజ జనచందనం = తన భక్తులను ఆహ్లాదపరచునట్టివాడున్నూ; ఇంద్రాదినుతం = ఇంద్రాదులచేత స్తోత్రము చేయబడువాడున్నూ; నందనందనం = నందుని కుమారుడున్నూ; ఆనందిత విధిముఖ బృందం = సంతోషపరచబడినట్టి బ్రహ్మ మొదలగు దేవతా సమూహములుగలవాడున్నూ; ఆనిందిత = నిర్దోషమైన; స్యందన = రథమునందు; నియతం = కూర్చున్నటువంటివాడున్నూ (అగుశ్రీకృష్ణుని); పశ్యత = చూడండి

3. సంసారార్ణవ = సంసారమనే సముద్రమునుంచి; తారక = తరింపచేయునట్టి; విజయగోపాలకం = విజయగోపాలకృష్ణమూర్తిని; అఖిలైక గురుం = సమస్తమునకు అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును ఇచ్చు గురువున్నూ; కవిజన హృదయవిహారం = జ్ఞానులయొక్క మనస్సులయందు విహరించువాడున్నూ (అగు స్వామివారిని); కంసరిపుం = కంసునికి శత్రువు అని తెలిసిన్నీ తీసికొనిపోవుచున్నాడు; ఇదం = ఈకీర్తన; శివనారాయణతీర్థ కవితం = శివనారాయణ తీర్థులవల్ల చేయబడినది.

ప. ఓచెలీ! అక్రూరుఁడు కృష్ణుని మధురకుఁ గొనిపోవుచున్నాఁడు.

అ. వాని కక్రూరుఁడని పేరుమాత్రము కలదు గాని ఆయన మహా క్రూరుఁడు. ఇప్పుడొనర్చినసాహసమును జూచితివిగదా. (సాహసము దూరాలోచన సేమక మిగుల త్వరతోఁ జేసినకార్యము. మనకిందఱకు నాయాసము కలుగునని కొంచెమైనను విచారింపలేదుగదా అని భావము)

1. సకలవేదములకు జన్మభూమియు, జగత్కారణుండును, సర్వేశ్వరుండును, దైత్యమర్దనుండును అగు నీ నవనీతచోరుని, మన (గోపికల) చిత్తముల కానందముఁ గలిగించువానిని, శ్రీకృష్ణుని బలరామునితోఁ గూడఁ గొనిపోవుచున్నాఁడు.

2. చంద్రునివలె బృందావనమును (గోకులమును) ఆనందింపఁ జేయువాఁడును, భక్తజనులపాలిటి కల్పవృక్షంబును, లేక చందనమువలె భక్తజనులకు సౌఖ్య మొసంగువాఁడును, బ్రహ్మాదిదేవతలకు నానందమును గల్గించి వారలచే వందనంబులఁ బడయువాఁడునగు నీ నందకుమారుని రథముపై నెక్కించుకొని బలాత్కారముగఁ గొనిపోవుచున్నాఁడు.

3. జగద్గురువై జ్ఞానులచే నెప్పుడును ధ్యానింపఁబడుచు, వారల సంసారమునుండి యుద్ధరించుచునుండు నీకృష్ణునకు కంసుఁడు శత్రువని యెఱింగియు నామధురకే గొనిపోవుచున్నాఁడు. ఈగీతము నారాయణతీర్థునిచే రచియింపఁబడినది.

శ్లో॥ బలేన సహితం కృష్ణ మక్రూరస్యందనస్థితిం,
మధురాభిముఖం దృష్ట్వా గోపికా కాపి గాయతి 20

శ్లో 20. బలేనసహితం = బలరామసహితుడైనట్టిన్నీ; అక్రూరస్యందనస్థితం = అక్రూరుని యొక్క రథమందు వేంచేసియున్నట్టిన్నీ; మధురాభిముఖం = మధురాపట్టణమునకు అభిముఖముగా వేంచేసినట్టిన్నీ; కృష్ణం = శ్రీకృష్ణస్వామివారిని; కాపిగోపి = ఒకానొకగోపిక; దృష్ట్వా = చూచినదై; గాయతి = గానముచేయుచున్నది.

ఆ శ్రీకృష్ణుఁడు బలభద్రునితోఁగూడి యక్రూరుని రథముపై నెక్కి మధురవైపునకుఁ దిరుగఁగానే యొక గోపిక యిట్లని గానముఁ జేసెను.

సావేరిరాగం - ఆటతాళం

ప. స్వామినంవనమాలినం సఖికలయ స్వామినం వనమాలినం

అ. శ్రీమహోన్నత శ్రీవత్సకౌస్తుభ మమల కామదవిజయగోపాలం

1. సుందరం సత్యసుఖబోధరసికం సోమవంశజలనిధిపూర్ణసోమం
నందనందసమిహపరమానంద స్యందనే నందయోగిమతంసఖి
సురనరకిన్న రవరమునిసేవిత - సరసగుణార్ణవసకలగురుంమమ

2. అధరబింబసమర్పితమురళీ మధురగీత రసామృతసరసం
మధురిపుంసఖి మాధవమిహపశ్య మాధురీభాగ్య భరమన్దహాసం
శక్రాదిసురగణసన్ను తపదమిహ - వక్రకున్తలభారవరరత్నాభరణం

3. భద్ర దంకలయసఖిబలభద్రం - భవ్యయోగదళిత మోహనిద్రం
అద్రి రాజధీర మరివర్గరుద్రం అచ్యుతేనసహితంసుఖముద్రం
శివనారాయణతీర్థ సేవితమనుపమ - భవ్యముక్తామణి భవనవిహరణం

8వ కీర్తన-సావేరిరాగం - ఆటతాళము

ప. సఖీ! = ఓచెలికత్తే!; వనమాలినం = వనమాలధరించినటువంటి; స్వామినం = శ్రీకృష్ణస్వామివారిని; కలయ = సేవించుమా

అ. శ్రీమహోన్నత = కాంతిచేత గొప్పవియైన; శ్రీవత్స కౌస్తుభ = శ్రీవత్సమునున్నూ; కౌస్తుభవమునున్నూ ధరియించి; విమల కామదం = భక్తులకు నిర్మలమైన కోరికలనిచ్చునట్టి; విజయగోపాలం = విజయగోపాలస్వామివారిని; సఖీ! కలయ = సఖియా సేవించుమా.

1. సుందరం = సౌందర్యముగలవారున్నూ; సత్యం = త్రికాలములయందు వుండువాడున్నూ; సుఖ బోధ రసికం - సుఖ = ఆనందము యొక్కయు; బోధ = జ్ఞానముయొక్కయు; రసికం = రసముగలవాడున్నూ; సోమవంశం = చంద్రవంశము అనునట్టి; జలనిధి = సముద్రమునకు; పూర్ణసోమం = పూర్ణచంద్రుని వంటివాడున్నూ; పరమానందస్యందనే = మిక్కిలి సంతోషకరమైన రథమునందున్నట్టి; నందనందనం = నందపుత్రుడున్నూ; నందయోగినుతం = నందయోగిచేత స్తోత్రము చేయబడుచుండువాడున్నూ; సుర = దేవతలచేతను; నర = మనుష్యులచేతనున్నూ; కిన్నర = కిన్నరులచేతనున్నూ; వరమునిసేవిత = శ్రేష్ఠమైనమునుల చేతనున్నూ, సేవించబడుచుండునట్టిన్నీ; సరసగుణార్ణవ = సరసమైన గుణములకు సముద్రస్వరూపుడున్నూ; సకల గురుం మమ = నాకు సకలవిధముల గురుస్వరూపుడున్నూ అగుస్వామివారిని; హేసఖి! = ఓ చెలికత్తె; కలయ = సేవించుమా.

2. అధరబింబ = దొండపండువంటి అధరమునందు; సమర్పిత = ఉంచబడిన (చేర్చబడిన); మురళి = వేణువుయొక్క; మధురగీత = మధురగానముయొక్క; రసామృత సరసం =

రసామృతముచేతనిండి సరసుడైయున్నవాడును; మధురిపుం = 'మధువు' అనే రాక్షసునకు విరోధియైనవాడున్నూ; మాథురీ = మధురాపుర స్త్రీలయొక్క; భాగ్య = పూర్వజన్మసుకృతమునకు ఫలమిచ్చుటకుగాను; భర = కలిగియుండెను, మందహాసం = చిరునవ్వుగలవాడున్నూ; మాధవం = స్వామివారిని; శక్రాది సురగణ సన్నుత = ఇంద్రాది దేవతలచేత కొనియాడబడు; పదం = స్థానముగలవాడు; వక్రకుంతల భార = వంకరముంగరులు ధరించిన; వరరత్నాభరణం = శ్రేష్ఠమైన ఆభరణములు ధరించిన స్వామివారు; సఖి! = చెలికత్తియా!; ఇహ = ఇప్పుడు; కలయ = సేవింపుమా

3. భద్రదం = శుభమునిచ్చునటువంటిన్నీ; భవ్య = శ్రేయస్కరమైన; యోగ = భక్తియోగముచేత; దళిత = కొట్టివేయబడిన; మోహనిద్రం = అజ్ఞానరూపమైన తమస్సుగలవారు; అద్రిరాజధీరం = హిమవత్పర్వతముతో సమమైన ధైర్యముగలవారున్నూ; అరివర్గ రుద్రం = శత్రు సమూహములకు రుద్రుడంటివాడున్నూ; అచ్యుతేన సహితం = శ్రీకృష్ణుల వారితోగూడావేంచేసియుండువాడున్నూ; సంఖముద్రం = ఆనందవేం లక్షణముగాగలవారున్నూ; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవల్ల; సేవితం = సేవింపబడువాడున్నూ; అనుపమం = ఉపమానములేనివాడున్నూ (అసమానులున్నూ); భవ్య ముక్తామణిభవన విహరణం - భవ్య = శుభస్కరమైన; ముక్తామణి = ముత్యములు మణులువాటిచే కట్టబడిన; భవన = మేడయందు; విహరణ = విహరించువాడున్నూ అగు; బలభద్రం = బలరాములవారిని; సఖి! = చెలీ!; కలయ = సేవించుమా!

ప-అ. ఓ చెలీ! మిగులకాంతిగల శ్రీవత్సకౌస్తుభములతోను, వనమాలతోను రాజిల్లుచు, భక్తులకు కోరిన కోర్కెల నొసంగుచునుండు నా జగదీశ్వరుని గోపాలునిఁ జూడుము.

1. సత్యజ్ఞానానందస్వరూపుఁడును, సనందనాదియోగులచేతను, దేవకిన్నర మనుష్యాదులచేతను సేవింపఁబడువాఁడును, కల్యాణగుణసముద్రుండును అగు నా సుందరాకారునిఁ జూడము, చంద్రవంశమగు సముద్రమునకుఁ బూర్ణచంద్రుఁడగు నప్పరమగురువు పరమానందరూపమగు రథముపై నెక్కి చనుచున్నాఁడు.

2. వక్రములగు ముంగురులతోడను, నానావిధములగు రత్నభూషణములతోడను ప్రకాశించుచు, అమృతమువలె సకలానందకరముగ వేణుగాన మొనర్చుచుఁ బోవుచున్నాఁడు; చూడము. మధురాపురమునందలి స్త్రీల భాగ్యమువలన వారి కీనారాయణుని మందహాసములు దొరకినవి.

3. ఓ చెలీ! హిమవత్పర్వతమువలె నతిస్థిరుఁడై, శత్రుసమూహమునకు కాలరుద్రుండై ఆశ్రితులగు యోగిజనుల మోహాంధకారమును దొలగించి, వారలకు శాశ్వత సుఖమునిచ్చువాఁడై యుండు నాబలభద్రుఁడును కృష్ణునితోఁ గూడి పోవుచున్నాఁడు; చూడుము. ఆయన, ముక్తామయమగు గృహమున సంచరించుచుండెను. నారాయణతీర్థునిచే సేవింపఁబడుచుండెను.

శ్లో. మధురాగమనోత్సాహం మాధవం వల్లవాంగనాః,
మంగళాన్యాచరంత్యస్తం జగుస్తస్య జయేచ్ఛయా. 21

శ్లో 21. మధురాగమనోత్సాహం = మధురకు వెళ్ళవలెననే ఉత్సాహముతో నుండునటువంటి; మాధవం = శ్రీకృష్ణస్వామివారినిగూర్చి; వల్లవాంగనాః = గోపికాస్త్రీలు; మంగళాని = ఆశీర్వాదములను, ఆచరింత్య = పలుకుచున్నవారలై; తస్య జయేచ్ఛయా = ఆస్వామివారికి జయము కోరుచూ; తం = ఆ స్వామివారిని గూర్చి; జగుః =గానము చేసిరి.

ఇట్లు మధురాపట్టణమునకుఁ బోవలయునని మిగుల నుత్సాహముతోఁ బ్రయాణమైన యాకృష్ణునకు మంగళముల నాచరించి యాగోపికలందఱును నిట్లని జయజయధ్వనులఁ జేసిరి.

సురటీరాగము - ఆటతాళము

| | | |
|---|---|---|
| ప. | విజయగోపాల తే మంగళం జయ | విశ్వంభర తే మంగళం |
| 1. | నందయశోదానందన సుందర | మందస్మిత ధృతమందర |
| | నందసునందాదివందితపాదార | విందగోవిందజయమంగళం |
| 2. | చారుకదంబకతరుమూలాశ్రిత | చంచలమణిమయకుండల |
| | దారుణవైరిసంహరణపరాక్రమ | దాసపోషణతే మంగళం |
| 3. | చందనచంపకతులసీకల్పక శీతలవనసంచారిణే | |
| | వాచామగోచరచరితసదానంద | వాసుదేవాయతే మంగళం |
| 4. | గోపీమండలగూఢ పరాయణ | గోవింద గోకులనాయక |
| | ఆపదుద్ధారక అఖిలజనాధార | తాపహరణతే మంగళం |
| 5. | వర్ధితగోబృంద వనమాలిన్ గో | వర్ధనగిరిధర వామన |
| | తీర్థకృతశివనారాయణతీర్థ మానససారసమందిర | |

9వ కీర్తన - సురటరాగం - ఆటతాళము

ప॥ విజయగోపాల! = సర్వమును జయించే గోపాలమూర్తే!; తే = నీకు; మంగళం = శుభమగుగాక!; జయ = సర్వోత్కర్షముతోటి వర్తించుమా; విశ్వంభర! = విశ్వమును రక్షించే హేస్వామీ!; 'భృంగ్' అనే పదము 'భరణే' అనుధాతువు నుండి పుట్టినది; భరణే = భరింపబడువాడు; భరింపబడువస్తువు అని; తే = నీకొఱకు; మంగళం = శుభమగుగాక!

1. నంద యశోదా నందన = నందునికి యశోదకు కొమారుడైనవాడా; సుందర మందస్మిత = సుందరమైన చిరునగవు గలవాడా; ధృతమందర = ధరించబడిన మందర పర్వతముగలవాడ;

నందసునందాది వందిత పాదారవింద = నందుడు సునందుడు మొదలగువారిచేత నమస్కరింపబడుచుండు పాదారవిందములుగలవాడా, గోవిందా = గోవిందుడా (కృష్ణా); జయమంగళం = సర్వోత్కర్షముగా శుభమగుగాక!.

2. చారు = శృంగారమైన; కదంబక తరు = కడిమిచెట్టుయొక్క; మూల = మొదటిభాగమును; ఆశ్రిత = ఆశ్రయించినవాడా; చంచల = కదలుచున్న; మణిమయకుండల = మణులచే విస్తారముగానుండు కుండలముల ధరించినవాడా; దారుణ = భయంకరములగు; వైరి = శత్రువులకు; సంహారిణి = సంహరించుటకు తగిన; పరాక్రమ = పరాక్రమముగలవాడా; దాసపోషణ = దాసులను పోషించువాడా; తే = నీకు; మంగళం = శుభమగుగాక.

3. చందన, చంపక, తులసీ; కల్పక = వృక్షములయొక్క గాలిచేత; శీతల = చల్లగానుండు; వన = వనములందు; సంచారిణే = సంచరించువాడ; వాచామ = వాక్కులకు; అగోచర = చెప్పనలవిగాని; చరిత = చర్యలుగలవాడా; ఎల్లప్పుడు అనందము అనుభవించువాడ; వాసుదేవ = సర్వభూతములయందు వసించియున్నట్టి; తే = నీకు; మంగళం = శుభమగుగాక

4. గోపీమండల = గోపికా సమూహములందు; గూఢ = ఇతరులకు తెలియకుండా నటించువాడా; పరాయణ = శ్రేష్ఠమైన గతిగా నుండువాడా; గోవిందా! = గోవిందుడా (కృష్ణా); గోకుల నాయకా = గోకులమునకు ప్రభువు; ఆపద+ఉద్ధారకా = అపదలనుండి ఉద్ధరించువాడా; అఖిలజనాధార = సమస్తప్రజలకు ఆధారముగా నుండువాడా; తాపహరణ = తాపత్రయములను హరించువాడా; తే = నీకు; మంగళం = శుభమగుగాక!

5. వర్ధిత గోబృంద = గోపసమూహముల; వనమాలిన్ = వనములమాలగా ధరించినవాడా; గోవర్ధన గిరిధర = గోవర్ధన పర్వతమును ధరించినవాడా; వామన = వామనావతారము ధరించినవాడా; తీర్థీకృత = పవిత్రముగా చేయబడిన; శివనారాయణ తీర్థ = శివనారాయణ తీర్థులయొక్క; మానస సారసమందిర = మనస్సు అనుకమలము అనగా హృత్కమలమే ఇల్లుగా గలవాడా.

ప. ఓ గోపాలా! సకలప్రపంచమును రక్షించువాఁడా! నీకు మంగళమగుఁగాత. నీవు సర్వాధికుండవై వర్ధిల్లుదువు గాత.

1. నంద సునందాదియోగులచే స్తోత్రము చేయఁబడుచుండు నో నారాయణా! మందస్మితసుందర ముఖారవిందా! మందరధారీ! నందకుమారా! నీకు జయమంగళము.

2. రత్నకుండలమును ధరించి సర్వకాలములయందును కదంబవృక్షమూలమున నివసించుచుండు నోకృష్ణా! నీవు మిగులభయంకరు లగు శత్రువుల జయించి భక్తుల రక్షింపుము. నీకు జయమంగళము.

3. వర్ణింప నశక్య మగుచరిత్రముగల యోపరమానందస్వరూపా! నీవు సర్వకాలముయందును చందన, చంపక, తులసీకల్పాదివృక్షములతోఁ గూడిన చల్లనియుద్యానవనములయందు సంచరించువాఁడవు, ఓవసుదేవపుత్రా! నీకు జయమంగళము.

4. ఓనారాయణా! నీవు గోకులమున విహరింపుచుండి మమ్ము (గోపికలను) మిగుల ననుగ్రహించ4ఇతివి. ఓ మోక్షస్వరూపా! నీవు సకలజనుల పాపములను హరించి, యాపదలఁ దొలగించి రక్షింపుము. నీకు జయమంగళము.

5. గోవర్ధనధరా! వామనాద్యవతారముల ధరించి లోకములఁగాపాడితివి. ఈయవతారమున గోనమూహముల రక్షించితివి. ఓతులసీ మాలాలంకార నీవు నారాయణతీర్థుని హృదయకమల ప్రదేశమును తీర్థమును గావించితివి. (మహాత్ములసంచారస్థలము లే తీర్థములు, నదులకుఁగాని పట్టణములకుఁగాని సరస్సులకుగాని తీర్థములనియు, పుణ్యక్షేత్రములనియు పేరువచ్చుట, కొంత ప్రభావముఁ గలుగుట. యిదియంతయు మహాత్ములు ఆయాస్థలములయందు నివసించుచుండుటవలననే కాని యితరకారణములవలనఁ గాదు. ప్రకృతమున నారాయణతీర్థునిచిత్తమునందు ఆపురుషోత్తముఁడు నివసించుచున్నాఁడు; గావుననది తీర్థమని చెప్పఁబడెను)

శ్లో. అక్రూరో రామకృష్ణాభ్యాం మధురాభిముఖో వ్రజన్,
అచరన్ యామునే స్నానం సలిలే దృష్టవాన్ హరిమ్. 22

శ్లో 22. అక్రూర = అక్రూరులవారు; రామకృష్ణాభ్యాం = బలరామకృష్ణులతోగూడా; మధురాభిముఖః = మధురానగరమునకు అభిముఖులై; వ్రజన్ (గచ్ఛన్) = పోవుచుండి; స్నానం అచరన్ = స్నానముచేయుచూ; యామునే సలిలే = యమునానదీ సంబంధ జలమునందు; హరిం = శ్రీకృష్ణస్వామివారిని; దృష్టవాన్ = చూచినవాడాయెను.

అంత నాయక్రూరుఁ డారామకృష్ణులఁ దోడ్కొని మధురానగరమునకుఁ బోవుచు, మార్గమధ్యమున యమునానదివచ్చుటయు, నచ్చట రథమునిలిపి తా నానదియందు స్నానముఁ జేయఁబోయెను. అట్లు చని యానదీజలమున మునుఁగగానే శ్రీకృష్ణునివిశ్వరూపము జలమునఁ గానవచ్చెను.

శ్లో. ముహుర్ముహు స్స్యందనస్థం సలిలస్థం హృది స్థితం,
దృష్ట్వా సర్వాత్మకం కృష్ణం ప్రాహ చేదం సతత్త్వవిత్. 23

శ్లో 23. స్యందనస్థం = రథమునందున్నట్టుగానున్నూ; సలిలస్థం = తిరిగి నీటియందు వున్నట్టుగానున్నూ; హృదిస్థితం = హృదయమునందు వున్నట్టుగానున్నూ; ముహుర్ముహుః = మాటిమాటికి; సర్వాత్మకం కృష్ణం = సర్వవ్యాపకుడైన స్వామివారిని; దృష్ట్వా = చూచినవాడై; సః తత్వవిత్ = ఆతత్వవేత్త అయిన అక్రూరులవారు; ఇదం = ఈక్రింద చెప్పబోవు విధముగా; ప్రాహ = పలికెను.

అప్పుడు రథమునందును, జలమునందును తనహృదయమునందును (ధ్యానింపఁబడుచున్న) కృష్ణుఁడే గానవచ్చుటం జూచి, యాసర్వమయుని యథార్థస్వరూపము నెఱింగినవాఁడగుటచే నిట్లని వినుతించెను.

## 10వ కీర్తన - తోడిరాగము - ఆదితాళము

ప. జానే భువనసృష్టి చాతురీధురీణం
గోనికేతనం విజయ గోపాలమఖిలశరణం

1. సకలహృదయకమల సవితృకోటిప్రకాశం
సలిలాదిభావమధ్య సంగమపూరితాశం
ప్రకటమేవ ఫణీంద్ర ప్రచురశయనదేశం
ప్రత్యగభిన్న మఖిల పరమానందనివేశం

2. నిగమగమసారసనిచయ నిత్యవిదితభావం
సుగుణమణిసమూహ సూత్రసత్త్వభావం
అఖిలజగదంతరాత్మాన మమితవిభవం
ఖగమృగసురనరాది ఘననామరూపమభవం

3. నందితవ్రజజనా నందఘనభాగ ధేయం
కందర్పశతకోటి కలితకాంతికాయం
నందిత యోగినిచయం నారదాదిగేయం
బృందావనవిహారం బద్ధమాయూరవలయం

4. అవనిమండలతిలక మచ్యుత మఖిలజనకం
నవనవనీతరసికం నమదభయదాయకం
భవభయనివారకం భవ్యముక్తినాయకం
శివనారాయణతీర్థ సిద్ధానందదాయకం

ప. విజయగోపాలం = విజయగోపాలస్వామివారిని; భువనసృష్టిచాతురీధురీణం = సమస్తలోకములయొక్క సృష్టి విషయములో గొప్ప నేర్పుగలవానినిగానున్నూ; గో = సర్వదేవతలకుగాని, వేదములకుగాని, భూమికిగాని; నికేతనం = స్థానభూతుడైనట్టివానినిగానున్నూ; అఖిలశరణం = సమస్తభూతములకు రక్షకునిగానున్నూ; జానే = తెల్సుకొనుచున్నాను.

1. సకల హృదయకమల = సమస్తభూతముల హృదయకమలములకు; సవితృకోటిప్రకాశం = కోటిసూర్యప్రకాశమును యిచ్చువాడున్నూ; సలిలాది = పంచభూతములు మొదలైన; భావ =

పదార్థములయొక్క; మధ్యసంగమ = మధ్య ప్రవేశించియుండుటచేత; పూరితాశం = సమస్తదిక్కులు నిండినవాడున్నూ; ప్రకటంఏవ = ప్రసిద్ధముగానుండెడు; ఫణీంద్ర = ఆదిశేషమూర్తియే; ప్రచుర = సర్వవిధములైన; శయనదేశం = శయనప్రదేశముగా గలవాడున్నూ; ప్రత్యక్ = జీవాత్మతోకూడా; అభిన్నం = ఎడబాటులేకుండా వుండి అనుప్రవేశముగలవాడున్నూ; అఖిలపరమానందనివేశం = అవిచ్ఛిన్నమై సర్వాతిశయమైన ఆనందముగలవానినిగాను; జానే = తెలిసికొనుచున్నాను.

2. నిగమ సారసనిచయ = వేదములు అనునట్టి కమలసమూహమునందు; నిత్యవిదిత భావం = ఎల్లప్పుడు తెలియబడుచుండు స్వరూపముగలవాడున్నూ; సుగుణమణి సమూహ = కళ్యాణగుణములు అనుమణుల సమూహములకు (గుచ్ఛబడియుండునట్టి); సూత్రసత్స్వభావం = సూత్రమని ఎంచబడాదగిన మంచి స్వభావముగలవాడున్నూ; అఖిలజగదంతరాత్మానం = సమస్త జగత్తుకు అంతర్యామిగానుండువానినిగానున్నూ; అమిత విభవం = గొప్ప విభవముగలవానినిగాను; ఖగ, మృగ, సుర, నరాది ఘననామరూపం = పక్షులు, మృగములు, దేవతలు, మనుష్యులు మొదలగు గొప్పనామరూప ప్రపంచ స్వరూపుడైవుండువానినిగానున్నూ; అభవం = (ఇన్నిరూపములుగానున్నను) ఆయారూపమైన సంసార బంధములేనివానినిగానున్నూ; జానె = తెలిసికొనుచున్నాను.

3. నందిత = స్వామివారిని సంతోషింపచేసినటువంటి; వ్రజజన = గోకులజనమునకు; ఆనందఘన = గొప్ప ఆనందమునిచ్చెడు; భాగధేయం = పూర్వతపఃఫల స్వరూపుడున్నూ; కందర్పశతకోటికలిత కాంతికాయం = నూరుకోట్ల మన్మథుల సౌందర్యముతో నొప్పుచుండెడు దివ్యమంగళ విగ్రహముగలవాడున్నూ; నందిత యోగి నిచయం = సంతోషపరచబడిన యోగి సమూహములుగలవారున్నూ; నారదాది గేయం = నారదాది మునులచేతగానము చేయబడుచుండువాడున్నూ; బృందావన విహారం = బృందావనమున విహరించువాడున్నూ; బద్ధ మయూరవలయం = నెమిలిపింఛము ధరించినవాడున్నూ-అగు శ్రీకృష్ణస్వామివారిని; జానే= తెలిసికొనుచున్నాను.

4. అవనిమండల తిలకం = భూమండలమునకు తిలకము వంటివాడున్నూ; అచ్యుతం = జననమరణముల లేనివాడున్నూ; యద్వా = అట్లాకాకపోతే; అచ్యుతం = అవతారములకు వచ్చినను తన స్వభావమును విడువనివాడున్నూ; అఖిలజనకం = సమస్తజనులకు తండ్రి స్వరూపుడున్నూ; నవనవనీతరశికం = అప్పుడు తీసినవెన్న యొక్క రుచిని తెలిసినవారున్నూ; నమదభయదాయకం = నమస్కరించుచున్నవారలకు అభయము నిచ్చువాడున్నూ; భవభయనివారకం = సంసారభయమును తొలగించువారున్నూ; భవ్యముక్తినాయకం = శ్రేష్ఠమైన ముక్తినిచ్చునట్టి నాయకుడున్నూ; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులకు; సిద్ధానందదాయకం = సిద్ధమైన ఆనందమును యిచ్చునట్టివాడున్నూ అయినటువంటి శ్రీకృష్ణస్వామివారిని; జానె = తెలిసికొనుచున్నాను.

ప. ఓగోపాలా! నీవు ఉపనిషత్తులచేఁ జెప్పఁబడుపరతత్త్వమనియు, ప్రపంచమునకు సృష్టికర్తవనియు, సర్వలోక రక్షకుఁడవనియు నేనెఱుంగుదును.

1. సకలజనుల హృదయములయందు కోటిసూర్యప్రకాశముతో వెలుఁగు పరమానందస్వరూపుఁడును, ఆకాశాదిసకలప్రపంచమయుఁడును, ఎడమించుకైనను లేక సకలదిక్కుల వ్యాపించియున్నవాఁడును, జీవాభిన్నుఁడును అగు నా శేషశాయి నీవే, సంశయము లేదు.

2. ఓజన్మరహితా! నీవు వేదాంతవిజ్ఞానము గలవారలకు స్పష్టముగఁ బ్రకాశింతువు. సద్గుణరత్నములకు సూత్రముంబోలె నున్నయోమృదు స్వభావా! నీవే సకలలోకములకును అంతరాత్మవు; ఓయపరిమితప్రభావా! అట్టివాఁడవగుటచేతనే యీలోకములోనున్న సమస్తనామధేయములును, సకలరూపములును పక్షులనామరూపములుగాని, మృగముల నామరూపములుగాని, దేవతలనామరూపములుగాని, మనుష్యలనామరూపములుగాని; మఱియు దేనినామరూపములుగాని, యీఅన్నియును నీయవివే. (నీకంటే నితరమగు పదార్థము ప్రపంచముననేలేదు. ఏనామమును జెప్పినను, ఏ రూపమును జూచినను, నిన్ను చెప్పనట్లే యగును. నిన్నుఁ జూచినట్లే యగును అని భావము)

3. నారదాదియోగులకు సకలసుఖముల నొసంగుచు, వారలచే నెప్పుడును నుతింపఁబడుచు నుండు నోనారాయణా! నీవు ఈగోపకుల పూర్వపుణ్యమువలన మన్మథకోటి దివ్యసుందరవిగ్రహుఁడవై నెమలిపింఛముల భూషణములుగా ధరించి బృందావనమునఁ జరించుచు వీరి నానందింపఁజేయుచున్నావు.

4. భూలోకభూషణమా! నీవు సకలప్రపంచమునకు సృష్టికర్తయగు నారాయణుండవు; పరమపదమునకు నాయకుండవు. ఆశ్రయించినవారి సంసారరోగమును భాఱఁదోలి యభయమొసంగెదవు. నారాయణ తీర్థయతివరునకు మోక్ష మొసంగినాఁడవు.

మధురాపురీ వర్ణనము

శ్లో. దృష్ట్వా థ మధురాం రామం నగరీం సురనాగరీం,
అహ చేదం మహోత్సాహో మాధవో మధురం వచః.

24. అథ = అనంతరము; మాధవః = శ్రీకృష్ణస్వామివారు; సురనాగరిం = దేవతా నగరితో సమానమైన; మధురానగరిం = మధురాపట్టణమును; దృష్ట్వా = చూచినవారై; రామం = బలరామునిగూర్చి; మహోత్సాహ = గొప్పఉత్సాహముగలవారై; ఇదం మధురంవచ = ఈక్రింద చెప్పబోవు మధురమైన వాక్యమును; ఆహ = చెప్పెను.

అంతవారందరును మధురను సమీపించిరి. అపుడు అమరావతికి సాటియగు నానగరమునుచూచి శ్రీకృష్ణుడు బలరామునితో నిట్లనియె.

## 11వ కీర్తన - సౌరాష్ట్రరాగము - చాపుతాళము

| | | |
|---|---|---|
| ప. | రామ మధురా నగరీరమ్యా | హేమగోపురప్రాకారకలితా |
| అ. | రామ రయణీయకాభిరామ | రత్నకోటీరసంభారా |
| 1. | సౌధచంద్రశాలాజాల | సోమరవిలీలాలోలా |
| | మాధురీభాగ్యామారఖేలా | మహనీయభూతివిశాలా |
| 2. | నవనవమణిశ్రేణీ | నాకరమణీమనోహారిణీ |
| | అవనీసురభారిణీ | అమరపరివారిణీ |
| 3. | కాళిందీ హేళినందినీ | కల్లోలాలోలపద్మినీ |
| | మిళితహంసమాలినీ | మీనాంకరాజరాజధానీ |
| 4. | అబ్జయోనికృత్యాతీతా | అఖిలసంపదోపేతా |
| | లబ్ధవిద్యావాదాధ్యుషితా | లక్షితలక్షణసహితా |
| 5. | మాధవసుగీతమిదం | మహితబలరామామోదం |
| | బాధితసంసారఖేదం | భవ్యనారాయణతీర్థసుఖదం |

ప. రామా! = హే బలరామా!; మధురానగరీ = ఈకనబడే మధురా పట్టణమును; రమ్యా = రమ్యమైనదియు; హేమ గోపురప్రాకారకలిత = బంగారు గోపురముల కూడియుండునది; రామా = హేబలరామ; రమణీయక = ఆనందప్రదమున్నూ; అభిరామ =× మనోహరములైన; రత్నకోటీర = శ్రేష్ఠమైన నవరత్నములతో; సంభాశ = నిండియుండునట్టిదిన్నీ

1. సౌధ చంద్రశాలజాల

సౌధ = మేడలయొక్కయున్నూ; చంద్రశాల = చంద్రశాలలయొక్కయున్నూ; జాల = సమూహములుగలదియు; సోమరవిలీలాలోల = చంద్రుడుయొక్కయున్నూ; లీలాలోలా = విహారములతో ఒప్పియుండునదిన్నీ; మాధురీభాగ్య = మధురాపుర స్త్రీలయొక్క పూర్వసుకృతమే ఈలాగున పరిణమించినట్టిదిన్నీ; అమరఖేల = దేవతలకున్నూ, విహారస్థలముగా నుండునదిన్నీ; మహనీయభూతి విశాల - మహనీయ = పూజ్యమైన; భూతి = (ఐశ్వర్యముచేత) సంపదతో; విశాల = విస్తరించియుండునదిన్నీ (అగు రామా మధురా)

2. నవనవ మణిశ్రేణి -

నవ = క్రొత్తదైన; నవమణి = నవరత్నములయొక్క; శ్రేణి = సమూహములుగలదిన్నీ (పంక్తులుగలదిన్నీ); నాకరమణీ = దేవతాస్త్రీలయొక్క; మనోహారిణీ = మనస్సులను హరింపజేయునదిన్నీ; అవనీసుర భారిణి = భూసురులను మోయుచుండునదిన్నీ; అమరపరివారిణి = దేవతలే పరివారముగా కలిగియుండు నదిన్నీ - అగు మధురానగరమును.

3. కల్లోలాలోల పద్మినీ = అలలచేత కదలుచున్న పద్మములు గలిగినట్టిన్నీ; మిళిత హంసమాలిని = హంసల పంక్తులతో మేళనము కలిగినటువంటిన్నీ-ఇటువంటి; కాళింది = యమునానదియొక్క; హేళి = విలాసముచేత (అనగా పార్శ్వమునందు ప్రవహించుటచేత); నందినీ = సంతోషము గలిగినట్టిన్నీ; మీనాంకరాజరాజధాని = మన్మధుడు అనునట్టి ప్రభువుకు రాజధాని అయినటువంటిన్నీ (అనగా బహుశృంగారమైనట్టి సమస్త శృంగారమునకు ఉనికిపట్టు అయినటువంటిన్నీ మధురా నగరమును చూడుమా రామా!

4. అఖిల సంపదోపేత = సమస్త సంపదలతోకూడుకున్నదిన్నీ; లబ్ధ విద్యావాదా ధ్యుషితా - లబ్ధ = పొందబడిన; విద్యావాదా = విద్యయున్నూ, వాదశక్తియున్నూ కలిగిన విద్వాంసులచేత; అధ్యుషితా = నిశించబడియున్నట్టియు; లక్షిత = అందరికి కనబడుచున్నట్టి; లక్షణ = సమస్త సులక్షణములతో; సహితా = కూడుకున్నట్టియు; అబ్జయోని = బ్రహ్మదేవునియొక్క; కృత్య = సృష్టిని; అతీత = మించినదియు (అగునట్టి మధురాపురమును చూడుమారామా)

5. మహితబలరామా మోదం = పూజ్యుడైన బలరామునికి సంతోషము కలిగించునట్టిన్నీ; బాధిత సంసార ఖేదం = బాధింపబడిన సంసార దుఃఖముగలది. అనగా సంసార దుఃఖమును పోగొట్టునదిన్నీ; (భవ్య నారాయణతీర్థ సుఖదం - ; నారాయణతీర్థ = నారాయణతీర్థులకు; భవ్య సుఖదం = శ్రేష్ఠమైన సుఖమును యిచ్చునదియు; ఇదం = ఈకీర్తనను; మాధవ సుగీతం = శ్రీకృష్ణస్వామివారిచేత గానము చేయబడినది.

ప-అ. రత్నమయమగు కిరీటమునుదాల్చియున్న యోసుందరాకారా! బలరామా! మధురాపట్టణమును జూడుము. సువర్ణమయములగు గోపురములతోను, ప్రాకారములతోను మిగుల మనోహరముగ నున్నది.

1. ఇచ్చట మేడలయొక్కయు, ఉన్నతభవనములయొక్కయు, గవాక్షముల మార్గమున చంద్రసూర్యులు విహరించుచుందురు. మన్మథసమానరూపా! మధురానగరస్త్రీల భాగ్యమున నీవు (బలరాముఁడు) ఇచటికి వచ్చితివి. నీరాకవలన నిప్పురము సమృద్ధినొందినది.

2. మఱియు నిప్పురము నూతనములగు (మంచికాంతిగల) రత్నతోరణములచేఁ బ్రకాశించుచు, దేవతాస్త్రీలకుఁగూడ నభిలాషఁ గల్గింపుచున్నది. ఇందుండు బ్రాహ్మణసమూహములు దేవసమూహములుం బోలె నొప్పుచున్నారు.

3. తనతరంగములచే కమలములు గదలుచుండ హంసలు మాలికల యట్లు ఆపద్మములపైఁ దిరుగుచు నానందించుచుండ మన్మథునిరాజధాని యునుంబోలె సకలజనమనోహరముగఁ బ్రవహించుచుండు నీసూర్యపుత్రియమునయు నీనగరమునకు పార్శ్వముననే యున్నది.

4. సకలశుభలక్షణములును గలిగి సర్వసంపదలతోఁగూడి విద్యావంతులగు వారలతో నిండియుండు నీపట్టణము బ్రహ్మసృష్టిని మించియున్నది.

5. ఇట్లు బలరామునకు సంతసము గలుగునట్లుగా, వినినవారల సంసారతాప మడంగునట్లుగా, నారాయణతీర్థునకు సుఖముగలుగునట్లుగా, శ్రీకృష్ణుడు పురవర్ణనమును జేసెను.

శ్లో. ఉపవనవనజేషు హంసమాలాః
మునిరివ మానసనిస్పృహాస్తు యస్యాః,
నిరవధిసుఖమాత్రలగ్నచిత్తాః
కథ మపి బాహ్య మనుస్మరంతి నైవ. 25

శ్లో 25. యస్య = ఏమధురా పట్టణముయొక్క; ఉపవన = ఉద్యానవములందుండునట్టి; వనజేషు = కమలములయందు; హంసమాలా = హంసలపంక్తులు; మునిఇవ = మునులవలెనే; నిరవధిక = సర్వాతిశయమైన; సుఖమాత్ర = సుఖమునందే; లగ్న = చేరిన; చిత్తాః = మనస్సుగలవియై; మానస నిస్పృహాస్తు = మానస సరోవరమునందు ఆసక్తి విడచినవియైం; కథమతి = ఏవిధముచేతనున్నూ; బాహ్య అనుస్మరంతినైవ = బాహ్య విషములను స్మరించనే స్మరించవు.

ఈమధురాపురోపవనముల కొలంకులయందు నివసించుచుండు హంసలు తమనివాసమగు మానససరస్సు నొకమాత్రైనను దలంపవు. ఇంతమాత్రమేకాదు, బ్రహ్మానుభవముఁ జేయుచున్న మునులయ ట్లెప్పుడును అపరిమితములగు సౌఖ్యములయందు తమమనసులు దగిలియుండుటచే బాహ్యములగు విషయములన విస్మరించునో లేదో సంశయింపవలసియున్నది.

శ్లో. అవతీర్ణో రథాత్తూర్ణ మక్రూరాధిష్ఠితాత్ప్రభుః,
మధురారాజమార్గేణ పద్భ్యామేవ శనైర్యయౌ 26

ఇతి శ్రీనారాయణతీర్థ విరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
కృష్ణమధురాప్రవేశవర్ణనం నామ-నవమతరఙ్గః.

శ్లో 26. ప్రభు = శ్రీకృష్ణస్వామివారు; అక్రూరాధిష్ఠితాత్ = అక్రూరుడు యెక్కినటువంటి; రథాత్ = రథమునుండి; తూర్ణం = త్వరగా; అవతీర్ణః = దిగినవారై; మధురా రాజమార్గేణ = మధురాపుర వీధులందు; పద్భ్యామేవ = కాలినడకతోనే; శనైః = మెల్లగా; యయౌ = వెళ్ళిరి.

అంత నప్పురమును బ్రవేశించి యాశ్రీకష్ణుడు రథముపైనుండి డిగ్గియామధురాపురి రాజమార్గములయందు మందగమనముతో పాదచారియై నడచెను. బలరాముఁడును ఆయన ననుసరించెను.

ఇది నవమతరఙ్గము

# దశమతరఙ్గము ప్రారంభము

## కథా సంగ్రహము

శ్లో. శ్రీకృష్ణచరితం కంసవధాఖ్య మభినీయతే,
కంసస్యాగమనం పూర్వం దేవకీవసుదేవయోః 1

మధురానగరీవీథ్యాం రజకాదే ర్వినిగ్రహః,
కుబ్జాద్యనుగ్రహశ్చాథ మల్లమాతంగమర్దనమ్ 2

కంసాసురవధ శ్చాథ పిత్రోర్దర్శన మాదరాత్,
సంగ్రహో యం చరిత్రే స్మి న్ కథితః సావధానతః 3

శ్లో 1. కంసవధాఖ్యాం = కంస సంహారము అనుపేరుగల; శ్రీకృష్ణచరితం = శ్రీకృష్ణస్వామివారి కథను; అభినీయతే = వర్ణింపబడుచున్నది; పూర్వం = మొట్టమొదట; కంసస్య = కంసునియొక్క; దేవకీ వసుదేవయోః = దేవకీ వసుదేవులయొక్క; అగమనం = ప్రవేశించుటయున్నూ.

శ్లో 2. మధురానగరీ వీధ్యాం = మధురాపట్టణ వీధియందు; రజకాదేః = చాకలివాడు మొదలుగువారిని - (స్వామివారు); వినిగ్రహః = నిగ్రహించుటయున్నూ (శిక్షించుటయున్నూ); కుబ్జఆది = కుబ్జ మొదలగువారిని; అనుగ్రహశ్చ = అనుగ్రహించుటయున్నూ; అథ = అనంతరమందు; మల్ల = జెట్టిమల్లురనున్నూ; మాతంగ = కువలయాపీడనమను ఏనుగనున్నూ; మర్దనం = సంహరించుటయున్నూ

శ్లో 3. కంసాసురవధశ్చ = కంసుడు మొదలగు రాక్షసులను సంహరించుటయున్నూ; అథ = అనంతరము; ఆదరాత్ = సంతోషపూర్వకముగా; పిత్రోర్దర్శనం = తల్లిదండ్రులను దర్శించుటయున్నూ; అస్మిన్‌చరిత్రే = ఈ కథ; సంగ్రహోయం = సంక్షేపముగా; సావధానతః = చిత్తఏకాగ్రతగలిగి; కథితః = చెప్పబడినది.

ఈ దశమతరంగమునందు కంసవధవృత్తాంతము వర్ణింపఁబడును. కంసుఁడు సభకువచ్చుటయు, దేవకీవసుదేవులు తమగృహమున కృష్ణునిగూర్చి చింతించుటయు, మధురారాజమార్గమునందు నడచుచుండిన శ్రీకృష్ణుఁడు రజకుఁడు మొదలగువారిని నిగ్రహించుటయు, కుబ్జ మొదలగువారి ననుగ్రహించుటయును, కువలయాపీడ మనునేగుంగును, చాణూరముష్టికు లనుమల్లురను వధించుటయు, కంసునిద్రుంచినపిదపఁ దలిదండ్రులఁ జూడఁబోవుటయు ననునది యిందలి కథాసంగ్రహము.

గ. తౌ ఖలు రామకృష్ణౌ - స్ఫుటతరనీలపీతసుందరపరిధానౌ - మధ్య భాగసమభివ్యక్తసరస్వతీవిలసితసితాసితసరిద్వరసంయోగ స ముల్లసితవిచిత్ర కాంతితిరస్కరణ ప్రవీణౌ - సత్పథపథికపరిశ్రాంతివిరామ రమణీయమునివరమనోహంస శ్రేణీసమాశ్రయకరచరణవదననయననాభి సరసీరుహసంపత్సరిద్వరకాంతి కాయౌ - తుఙ్గప్రాసాదశృంగసంగతచంద్ర కాంతమణిగణ శశాంక సంయోగ సముద్గళితలలితత రామృతసంసిక్తరమణీయసైకతమధు రారాజమార్గగామినౌ - విచిత్రవనమాలినౌ - మానినీజనమోహనౌ - సరళమురళీగీతసుధాసముద్బోధితసురకిన్న రాదివరవనితామనోమయరాజహంసగణౌ - సత్యకామాదిగుణౌ - సకల లోకసంరక్షణప్రవీణౌ - మధురాపురినివాసిభాగ్య పరిపాకవిశేషలక్షణౌ - సురనగరీనారీగురుతరగీత సుధాసమారాధనానం దితౌ - ధుర్మదమదవిభఙ్గతుఙ్గధైర్యవీర్య గాంభీర్యభావౌ - పరిహృత గోపకుమారభావౌ - మహానుభావౌ - దృష్ట్వా ముహుర్ముహుః సంతుష్టా స్తత్ర జనా బభూవుః.

గద్య 4. తౌ రామకృష్ణౌ = ఆ బలరామకృష్ణులు యిద్దరున్నూ; స్ఫుటతర = మిక్కిలిస్పష్టముగా; నీల = నీలవర్ణము కలిగినట్టిన్నీ; పీత = పచ్చని దైనట్టిన్నీ; సుందరపరిధానౌ = సుందర వస్త్రములను ధరించినవారై; ఖలు = ఉన్నవారలుగదా! (మరియు); మధ్యభాగ = మధ్యప్రదేశమునందు; సమభివ్యక్త = చక్కగా కనబడుచున్నట్టి; సరస్వతి = సరస్వతీ నదిచేత; విలసిత = ఒప్పుచున్నట్టి; సిత అసిత సరిత్ వర సితాసరిత్ = తెల్లనిది అనగా గంగ; అసిత సరిత్ = నల్లనిది అనగా, యమున; వర = శ్రేష్ఠమైన ఈనదులయొక్క; సంయోగ = కూడికచేత; సముల్లసిత = బాగా ఏర్పడిన; విచిత్రకాంతి = విచిత్రమైన ప్రకాశమును; తిరస్కరణ = ధిక్కరించునట్టి; ప్రవీణౌ = కాంతివిశేషముగలవారౌ; సత్పథ = ధర్మమార్గమునందు; పథిక = సంచరించుచుండెడు బాటసారులయొక్క; పరిశ్రాంతి = బడలికను; విరామ = తీర్చగలిగినటువంటిన్నీ; రమణీయ = సుందరములైనటువంటిన్నీ; మునివర = భగవత్స్వరూప ధ్యానముచేయుచుండునట్టి శ్రేష్ఠులైనవారి; మనోహంస = మనస్సులనెడు హంసలయొక్క; శ్రేణి = గుంపులచేత; సమాశ్రయ = ఆశ్రయించబడుచుండునట్టిన్నీ; కరచరణ = హస్తములు, పాదములు; వదన, నయన = ముఖము, నేత్రములు; నాభి = బొడ్డున్నూ -(అనునట్టి); సరసీరుహ సంపత్తు = కమలములయొక్క సంపదతో కూడుకొనియున్న; సరిద్వర = గంగ యమునలను శ్రేష్ఠమైన నదులయొక్క; కాంతికాయౌ = కాంతి గలిగినట్టి దేహము గలవారున్నూ; తుంగ = ఎత్తైనటువంటి; ప్రాసాద = మేడలయొక్క; శృంగ = శిఖరములయందు; సంగత = ఉన్నట్టి; చంద్రకాంత మణిగణ = చంద్రకాంతమణుల సమూహములతో; శశాంక = చంద్రకిరణములయొక్క; సరియోగ = కూడికచేత; సముద్గళిత = ద్రవించి జారినటువంటి; లలితతర = శ్రేష్ఠమైన; అమృత = నీళ్ళచేత; సంసిక్త = తడిసినట్టిన్నీ; రమణీయ = శృంగారమైన (మృదువైన); సైకత = ఇసుక కలిగినట్టిన్నీ; మధురా రాజమార్గ =

మధురాపుర రాజమార్గములయందు; గామినౌ నడచిపోవునట్టివారున్నూ; విచిత్ర వనమాలినౌ = చిత్రమైన వనమాలను ధరించినవారున్నూ; మానినీజన = సమస్త స్త్రీలకు; మోహనౌ = మోహముకలుగజేయువారున్నూ; సరళ = శ్రావ్యమైనటువంటి, మురళీగీత = వేణుగానమనెడు, సుధా = అమృతముచేత; సముద్బోధిత = చక్కగా మేలుకొలుపబడిన లేక జ్ఞానము ఇవ్వబడినట్టిన్నీ; సుర కిన్నెరాది = సురలు, కిన్నెరలు, మొదలగువారియొక్క; వరవనితా = శ్రేష్ఠమైనస్త్రీలయొక్క; మనోమయ = మనస్సులనెడు, రాజహంసగణౌ = రాజహంస సమూహములుగలవారున్నూ; సత్యకామాదిగుణౌ = సత్యము మొదలగు గుణములు గలవారున్నూ; సకలలోక = సమస్తలోకములను; రక్షణ = రక్షించుటయందు; ప్రవీణౌ = నేర్పుగలవారున్నూ; మధురాపురి = మధురా నగరమునందు; నివాశి = నివశించియున్నట్టి జనులయొక్క, భాగ్యపరిపాక = ఫలోన్ముఖమైన పూర్వజన్మసుకర్మయొక్క; విశేషలక్షణౌ = విశేషలక్షణములుగలవారని చెప్పబడదగినవారున్నూ; నురనగరి = వైకుంఠమునందున్నూ, నాగరి = గొప్పపట్టణములయందున్నూ వుండునట్టి స్త్రీలయొక్క; గురుతరగీత = శ్రేష్ఠమైన గానము అనునట్టి; సుధాసమారాధన = అమృతముచేత ఆరాధింపబడిన ఆనందితౌ = సంతోషించుచుండువారున్నూ; దుర్మద = దుష్టమదముగలవారలయొక్క; మద = గర్వమును; విభంగ = కొట్టివేయుటకుగాను; తుఙ్గ = గొప్పదియైన; ధైర్య = ధైర్యమున్నూ; వీర్య = పరాక్రమమున్నూ; గాంభీర్య = గంభీరత్వమున్నూగల; భావౌ = స్వరూపములుగలవారున్నూ; పరిహృత = తీసివేయబడిన; గోపకుమారభావౌ = గొల్లపిల్లకాయల వేషములుగలవారున్నూ; మహానుభావౌ = మహాత్ములచేత అనుభవింపబడుచుండువారున్నూ-లేక గొప్పమహిమగలవారున్నూ - (అగు బలరామకృష్ణులను), తత్రజనా = మధురాపురజనులందరు; మహుర్ముహుః = మాటిమాటికి; దృష్ట్వా = సేవించినవారై; సంతుష్టాబభూవుః = సంతోషించినవారైరి.

అంత నారామకృష్ణు లిరువురును నలుపు, పసుపువర్ణములుగల వస్త్రములను ధరించి, పచ్చనిసరస్వతీనది మధ్యభాగమునఁ బ్రకాశింప నొకదానితో నొకటి గలయుచున్న గంగా యమునానదీ ప్రవాహమువలె వింత కాంతినిఁ కల్గించుచు, నామధురాపురి రాజమార్గమున నడచుచుండిరి. తెలుపు, నలుపు వర్ణములుగల వారలశరీరములు గంగా, యమునానదులుంబోలెఁ దనరారుచుండెను. సన్మార్గమునఁ దిరిగి తిరిగి (సన్మార్గమున=నక్షత్రమార్గమున, ధర్మమార్గమున) యలసి (కర్మలఁ జేసిచేసి యలసి) విశ్రాంతినిఁ జెందిన చిత్తములని యెడుహంసలకు నాశ్రయములై, వారి పాద, హస్త, నాభి, లోచన పద్మము లానదలులోనిపద్మములయట్లు ప్రకాశించుచుండినవి. అరాజమార్గములును, ఇరుపార్శ్వములయందున్న యున్నతసౌధములయందలి చంద్రకాంతమణులు చంద్రకిరణములకు కరఁగి యమృతధారలు స్రవింప, వానిచేఁ దడుపంబడియుండెను. సత్యము యమమత్వము మొదలగుసమస్తకల్యాణగుణములుగల లోకరక్షకులగు నమ్మహానుభావులిట్లు తామంతకుపూర్వ మభినయించుచున్న గోపబాల భావమును విడనాడి, మధురాపురీనివాసుల భాగ్యదేవతలోయన నప్పురముం

బరిశీలించుచు మెల్లమెల్లనఁ జనుచుండిరి. అజగన్మోహనాకారు లొనరించు వేణుగానామృతమునకు దేవ, కిన్నర, గంధర్వాదుల స్త్రీలుసహితము చిత్తవికారముల నొందుచుండిరి సర్వకాలములయందును దేవాంగనల మనోహర గానములవినుచు వైకుంఠమున సుఖముననుభవించుచుండు నమ్మహాత్ములు దుష్టుల సంహరించుటకై యపరిమితశౌర్య, గాంభీర్య, ధైర్యములఁ జూపుచు, నీభూలోకమున విహరించుచున్నారు. ఆ సర్వేశ్వరులఁ గనులారజూచుట దటస్థించుటచే నామధురాపురీ నివాసులకుఁ గల్గినయానంద మింతయని వర్ణింప నలవిగాకున్నది.

శ్లో. అయాంతం రాజమార్గేణ మధురాపుర యోషితః,
ఆశ్చర్యరూపసంపన్న మాశ్చర్యం సబలం జగుః 5

శ్లో 5. రాజమార్గేణ = రాజమార్గములద్వారా; అయాంతం = వేంచేయుచున్నటువంటిన్ని; ఆశ్చర్యరూప సంపన్నం = ఆశ్చర్యమును కలిగించురూపముతో కూడివున్నట్టిన్నీ; సబలం = బలరామ సహితులైనట్టిన్ని - శ్రీకృష్ణస్వామివారిని; మధురాపురయోషితః = మధురాపురస్త్రీలు; ఆశ్చర్యం = ఆశ్చర్యము గలిగినవారలై; జగుః = గానము చేసిరి.

ఇట్లా శ్రీకృష్ణుడు బలరామసహితుడై రాజమార్గమునందు వచ్చుచుండ నిరుపార్శ్వములయందున్న సౌధములపైనుండి చూచుచు నచటి స్త్రీ లవ్విభునిరూపసంపద కాశ్చర్యపడి యిట్లని గానముఁజేసిరి.

*1వ కీర్తన - యదుకులకాంభోజి (ఆనందభైరవి) - ఆదితాళం*

| | | |
|---|---|---|
| ప. | నందనందనం నిజభక్త | చందన మాకలయ |
| 1. | నందాదిమునీంద్రభావ్యా | నంద మాళికలయ |
| 2. | సుందరాననచంద్రశ్రీ | మందిర మాకలయ |
| 3. | శృంగారరసప్రవాహ | శ్రీనిధి మాకలయ |
| 4. | భ్రూభంగకటాక్షలక్ష్య | భూరికరుణ మాకలయ |
| 5. | సర్వలావణ్యతటినీ | సాగర మాకలయ |
| 6. | కలభసుందరగమన | కలితలలిత మాకలయ |
| 7. | పరిజనరక్షణబద్ధ | పరికర మాకలయ |
| 8. | విజయగోపాల మతుల | విఖ్యాత మాకలయ |
| 9. | బలభద్రభద్రదబాహు | బంధ మిహాకలయ |
| 10. | మధురామానినీజన | మనసిజమాకలయ |
| 11. | శివనారాయణతీర్థసేవ్య | దివ్యపద మాకలయ |

ప॥ అళి = హేసని

1. [illegible] = [illegible]
ఆనందం = ఆనందస్వరూపుడైన స్వామివారిని, నందనందనం = నందకుమారుడున్నూ; నిజభక్తచందనం = తనభక్తులను ఆహ్లాదింపచేయునట్టి స్వామివారిని; ఆకలయ = సేవించుమా.

2. సుందర = సుందరమైన; ఆనన = ముఖసంబంధమైన, చంద్రశ్రీ = చంద్రక్రాంతిచే; మందిరం = నిలయుడైన స్వామివారిని; ఆకలయ = సేవింపుమా!

3. శృంగారరస ప్రవాహ = శృంగారరస ప్రవాహమునకున్నూ; శ్రీ = కాంతికిన్నీ; నిధి = ఆకరమనస్వామి (మొదలి గనియైన స్వామివారిని); ఆకలయ = సేవించుమా

4. భ్రూభంగ = కనుబొమల వైఖరిచేతనున్నూ; కటాక్ష = క్రీగంటి చూపులచేతనున్నూ; లక్ష్య = కనబడుచుండు; భూరికరుణ = గొప్పకరుణగలిగినటువంటి స్వామివారిని; ఆకలయ = సేవింపుమా.

5. సర్వలావణ్య = సమస్త సౌందర్యములు అనునట్టి; తటినీ = నదులకు; సాగరం = సముద్రుడని చెప్పబడదగిన స్వామివారిని; ఆకలయ = సేవింపుమా

6. కలభసుందర = ఏనుగ గున్నవంటి సుందరమైన; గమన = గమనముతో; కలిత = కూడుకున్నట్టిన్నీ, లలితం (గమన శృంగారము)గలవారు అగునట్టిస్వామివారిని; ఆకలయ = సేవింపుమా

7. పరిజన = భక్తజనులను; రక్షణ = రక్షించుటకుగాను; బద్ధ = శిద్ధముగా నుంచుకొనబడిన; పరికరం = సాధనముగలవారును -అగునట్టిస్వామివారిని; ఆకలయ = సేవించుమా

8. అతుల విఖ్యాతం = అనుమానమైన కీర్తిగలిగినటువంటి; విజయ గోపాలం = సర్వోత్కర్షముగా వర్తించునట్టి గోపాలమూర్తిని; ఆకలయ = సేవించుమా

9. బలభద్ర = బలరామునకు; భద్రదం = మంగళకరమగు; బాహుబంధం = భుజమేళనము గలిగినటువంటి; ఇహ = ఇక్కడ; కలయ = సేవించుమా.

10. మధురా = మధురాపురములోని; మానినీజన = స్త్రీలయొక్క; మనసిజం = మన్మథ స్వరూపుడైనస్వామివారిని; ఆకలయ = సేవించుమా

11. శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవారివల్ల; సేవ్య = సేవించబడుచుండు; దివ్యపద = దివ్యపాదారవిందములు గలవాడ (అగునట్టి స్వామివారిని); ఆకలయ = సేవించుమా.

ప. భక్తులకు కల్పవృక్షమగు నానందకుమారునిఁ జూడుము.

1. ఓచెలీ! ఈతఁడే నందాదిమునులచే ధ్యానింపఁబడుచున్న పరమానంద స్వరూపుఁడు. శ్రీఘ్రముగఁ జూడుము.
2. ఈయన నారాయణుఁడు. మనోహకారముతో నిటు వచ్చుచున్నాఁడు. బాగుగఁ జూడుము.
3. శృంగారరసప్రవాహమువలె, సత్యద్భుతకాంతితోఁ బ్రకాశించుచున్నాఁడు.
4. అశ్రీగంటిచూపులవైపుఁ జూచిన నపరిమితమగు దయాబుద్ధి వెల్లివిరియుచున్నది.
5. లావణ్యమనియెడు నదికి మహాసముద్రమువలె నున్నాఁడు.
6. గజమువలె సుందరమగు మందగమనముతో వచ్చుచున్నాడు.
7. సేవకుల రక్షించుటకై యెప్పటికిని సంసిద్ధుఁడయ్యేయున్నాడు.
8. ఈగోపాలుఁడు లోకమునందు మిగులఁ బ్రసిద్ధిఁజెందియున్నాఁడు.
9. శుభకరమగునాబలభద్రునిహస్తమును బట్టుకొని వచ్చుచున్నాఁడు.
10. మధురాపురమునందలి స్త్రీలకు మన్మథుండై యున్నాఁడు.
11. ఈమహాత్ముని పాదములనే నారాయణతీర్థుఁడు సేవించుచున్నాఁడు.

శ్లో. హరంతం రాజవస్త్రాణి చరంతం చారుదర్శనం,
నిరంతరపరానందసరసం కలయాళి తమ్ 6

శ్లో 6. రాజవస్త్రాణి = రాజవస్త్రములను; హరం తం = అపహరించినటువంటిన్నీ; చారు దర్శనం = శృంగారమైన రూపము గలిగిన; చరంతం = సంచరించుచున్నట్టిన్నీ; నిరంతరం = యెడతెగని (తెంపులేని); పరానందం = నిర్విషయ ఆనందముచేత; సరసం = రసయుక్తమైన; తం = అస్వామివారిని; అళీ! = హే చెలికత్తే!; ఆకలయ = సేవింపుమా!; అథ = అనంతరమందు; రజక నిగ్రహ = చాకలివానిని నిగ్రహించుటయున్నూ; వస్త్రావహారశ్చ = వస్త్రములు అవహరించుటయున్నూ; మాలాకారానుగ్రహ = మాలాకారుని అనుగ్రహించుటయున్నూ; కుబ్జాగమనం = కుబ్జ వచ్చుటయున్నూ.

ఓచెలీ! అవైపుఁజూడుము. అయుఖండానందస్వరూపుఁడు అరజకుని యొద్దనుండి కంసమహారాజవస్త్రములఁ గైకొని యీవైపునకే వచ్చుచున్నాఁడు. ఇట్లాకృష్ణుడు రాజవస్త్రములు దెచ్చుచుండినరజకునిఁ బరిమార్చి తన కిష్టమైన వస్త్రములం గట్టికొనియెను మఱియు రాజమార్గమునం బోవుచు కంసునకు పువ్వులఁ గట్టువాని గృహముం జేరరాఁగానే యమ్మాలాకారుఁ డమ్మహాత్ముని సత్కరించి తనయొద్దనున్న పుష్పముల నిచ్చెను. వాని ధరియించి యమ్మాలాకారునకు కోరినవరము లిచ్చి యవలం జనుచున్నాఁడు.

అథ రజకనిగ్రహో వస్త్రాపహారశ్చ మాలాకారానుగ్రహః. కుబ్జాగమనమ్ -

నాదనామక్రియారాగము - ఆదితాళము

కుబ్జా సమాయాతి గోవిందచిత్తా అబ్జయోనిచాతుర్యసర్వస్వ
ఉజ్జ్వలవిచిత్రభూషణోజ్జ్వల కజ్జలనేత్రశోభిత
కస్తూరిఫాలాకరధృత కస్తూరిచందనాది సంభారాభూతా

గోవింద చిత్త = స్వామివారియందు చిత్తముచేర్చినదై; అబ్జయోని = బ్రహ్మదేవునియొక్క; చాతుర్య = నేర్పుయొక్క; సర్వస్వభూత = పూర్ణతచేత సృష్టింపబడినదియు; ఉజ్జ్వల = ప్రకాశించుచున్నట్టి; విచిత్రభూషణః = విచిత్రమైన అభరణములచేతనున్నూ; ఉజ్వల = అలంకారముగానుండు; కజ్జల = కాటుకగల; నేత్ర = కండ్లచేత; శోభిత = శోభించుచున్నట్టిదియు; కస్తూరిఫాల = కస్తూరి బొట్టుదిద్దిన నొసలుగలదియు; కరధృత = చేతియందు ధరింపబడిన; చందనాదిసంభార = చందనము మొదలగు సంభారములు కలదిన్ని అగు; కుబ్జ = 'కుబ్జ' అనే స్త్రీ; సమ్ ఆయాతి = లెస్సగా వచ్చుచున్నది.

అంత చతుర్ముఖుని రూపనిర్మాణచాతుర్యమంతయు నొక్కయెడ నిలిచెనో యన, మనోహరాకారయై నానావిధములగు భూషణములను కస్తూరీ తిలకమును ధరించి, కనులఁ గాటుకఁబెట్టి కంసునికై సిద్ధము చేయఁబడిన సుగంధచందనమును గైకొని వచ్చుచున్న కుబ్జ యనునొక స్త్రీ శ్రీకృష్ణునిగుణముల ధ్యానించుచు, వారి కెదురయ్యెను.

శ్లో. క్వాపి కుబ్జాం సునేత్రాబ్జామబ్జనాభో విలోక్య తాం,
ప్రాతిలోమ్యగిరాం సారైః ప్రహసన్ని దమాహ సః 7

శ్లో 7. సః అబ్జనాభ = ఆకృష్ణమూర్తి; సునేత్రాబ్జాం = మంచినేత్ర కమలములు గలిగినటువంటి; కుబ్జాం = కుబ్జను; క్వాపి = ఒకానొకచోట; విలోక్య = చూచినవారై; ప్రహసన్ = నవ్వుచూ; ప్రాతిలోమ్య గిరాం సారైః = విపరీత లక్షణములు గలిగిన వాక్యములచేత; తాం = అకుబ్జను గూర్చి; ఇదం = ఈక్రింద చెప్పబోవు విధముగా; ఆహ = పలికెను.

కమలములవంటి విశాలనేత్రములుగల యాకుబ్జను దూరమునుండియే చూచి యాకృష్ణుఁడు నవ్వుచు, విపరీతలక్షణాయుక్తములగు వాక్యములతో ఇట్లనియె.

పంతువరాళీరాగము - ఆటతాళము

ప. కామమోహిని కథయ కిన్ను నామ తే పదం

అ. కోమలాధరకరపాదపల్లవ కుముదబంధువనదకుంతలజాలే

1. తన్వఙ్గితావకతనురియమార్జవ
మతివహతిసుత రామానన్దకారిణి
అన్వహమభినవ యౌవనఘనవన
మాచరసిభువన జనమనోహారిణీ

2. చన్దనమృగనాభిచంపకాదికుసుమ
గన్ధసుగన్ధిత గగనదిఙ్మండలే
కందర్పరథిరథకల్పితశుభగాత్రి
కలహంసభాషిణీకల్యాణశీలే

3. తవరూపమన్వర్థనామవిదితమిహ
భువి పౌరజానపదైర్గపి విపులం
శివనారాయణతీర్థశ్గీతమిదమిహ
భవభయభంజన మభయదమతులం

ప. కామమోహిని = మన్మథుని మోహింపజేయుదానా; తే = నీయొక్క; నామం = పేరు; కిన్ను = ఏమి; తే = నీయొక్క; పదం = స్థానము; కిన్ను = ఏమియో; కథయ = చెప్పుమా

అ. కోమల = మృదువైనటువంటి; అధర = పెదవులున్ను; కర = హస్తములున్ను; పాదపల్లవ = చిగుళ్ళవంటి పాదములుగలదానా; కుముదబంధువదన = చంద్రునితో సమానమైన ముఖముగలదానా; కుంతల జాలే = ముంగురులుగలదానా; తన్వంగి (తను+అంగి) = సూక్ష్మమైన శరీరము గలదానా; తావక = నీయొక్క; ఇయంతనుః = ఈ దేహము; ఆర్జవం అతి వహతి = వంకరలేకుండా సరిగా వుంటున్నదిగదా!; సుతరాం ఆనందకారిణి = కేవలం ఆనందపఱచునదిగా వున్నది; అన్వహం = ఎల్లప్పుడున్నూ; భువనజన మనోహారిణి = లోకములో వుండే జనుల మనస్సులను హరింపజేయునట్లుగా; అభినవ యౌవ్వన = క్రొత్త యౌవ్వన మనెడు; ఘనవనం = ఘనమైన ఉద్యావనమునందు; ఆచరసి = సంచరించుచున్నావుగదా!

2. చందన = గంథమున్ను; మృగనాభి = కస్తూరిన్నీ; చంపకాది = సంపెంగపువ్వు మొదలగునట్టివిన్నీ; కుసుమ = పువ్వులచేత; గంధ = సువాసనచేత; సుగంధిత = మంచివాసనతో ఒప్పుచున్నట్టిదిగా

చేయబడిన; గగన దిఙ్మండలే = గగన దిఙ్మండలములు గలదానా; కందర్ప = మన్మథుడనునట్టి; రథి = రథికునకు; రథ = రథముగా; కల్పిత = భావించబడతగినట్టి; శుభగాత్రి = మంగళకరమైన శరీరముగలదానా; కలహంస భాషిణి = హంసవలె అవ్యక్త మధురముగా మాటలాడుదానా; కళ్యాణ శీలే = శుభప్రదమైన నడవడిగలదానా

3. తవరూప = నీయొక్క రూపము; అన్వర్థనామ = సార్థకమైన పేరుగలది అని; ఇహ విదితం = ఈ లోకములో ప్రసిద్ధముగనున్నది; భువి = భూమియందు; పౌర = పురజనులకున్నూ; జానపదైః = పల్లెటూరి జనులకున్నూ; అపి = కూడ; విపులం = స్పష్టము అగుచున్నది; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవారిచేత; శివ = మంగళమగునట్లుగా; గీతం = పాడబడినది; ఇహ = ఇక్కడ; ఇదం = ఈకీర్తన; భవభయభంజనం = సంసారభయమును పోగొట్టునదిన్నీ; అభయదం = అభయమనగా మోక్షము యిచ్చునదిన్నీ; అతులం = అసమానమైనదిన్నీ అయివున్నది.

ప. మన్మథునిగూడ మోహింపఁజేయఁజాలు నోయువతీ! నీపేరేమి? చెప్పుము.

అ. కోమలములగు హస్త, పాద, అధరపల్లవములను, చంద్రబింబము వంటి ముఖమును, విస్తారములగు తలవెంట్రుకలును కలదానా!

1. ఓసుకుమారశరీరా! నీశరీరము మిగులఁ జక్కగ నున్నది. (ఈ కుబ్జ సౌందర్యవతి యైనను మిగుల కురుచశరీరము మూఁడువంకరులుగఁ దిరిగి యుండును. దీనికి త్రివక్రయనియుఁ బేరుగలదు) సకల జనులకును మోహముఁ గలిగించుచున్నావు. నీయౌవనము చూచువారికి నప్పటికప్పటికి క్రొత్త యగుచుండును.

2. గంధము, కస్తూరి, సంపెఁగలు మొదలైన పుష్పములు వీని ధరించి యుండుటచే నీయాకాశమెల్లను పరిమళముచే వ్యాప్తమైయున్నది. ఓ సద్గుణవతీ! హంసవాణీ! మన్మథుఁడను రథికుఁడు నీశరీరమును తనకు రథముగా నేర్పరచికొనినట్లు తోఁచుచున్నది.

3. నీరూపమును జూచినయెడల నేపురవాసికైనను నేగ్రామవాసికైనను నీపేరు స్పష్టముగఁ దెలియును. అని యిట్లు సంసారభయహర మగు కృష్ణువాక్యమును నారాయణతీర్థయతి గీతముగా రచించెను.

శ్లో. హసంతం వదంతం సమీపే వసంతం
ముహుస్సంస్మరంతం తపః ప్రాక్తనం తత్,
పరప్రేమభక్త్యా ప్రభుం ప్రార్థయంతీ
స్వయం ప్రాహ చేదం వచ స్సాధు కుబ్జా 8

శ్లో 8. హసంతం, వదంతం = పరిహాసపూర్వకముగా మాట్లాడుచున్నటువంటిన్నీ; సమీపే వసంతం = తనకు సమీపములో వేంచేసియున్నటువంటిన్నీ; తత్ = ఆకుబ్జయొక్క; ప్రాక్తనం తపః = పూర్వజన్మసంబంధమైన తపస్సును; ముహుర్ముహుః = మాటిమాటికి; సంస్మరంతం = స్మరిస్తూ

వున్నటువంటివన్నీ; ప్రభుః = ఇట్టి శ్రీకృష్ణస్వామివారినిగూర్చి; పరప్రేమభక్త్యా = మిక్కిలి అతిశయమైన ప్రేమతోకూడుకొన్నభక్తిచేత; కుబ్జ = కుబ్జ అనుస్త్రీ; సాధు = లెస్సగా, ప్రార్థయంతి = ప్రార్థన చేయుచున్నదియై; ఇదం వచః = ఈ చెప్పబోవు వాక్యములను; స్వయంప్రాహ = స్వయముగా మనవి చేసుకొనెను.

ఇట్లు నగుచు నేవేవియో మాటలాడుచు, తన సమీపమున నిలుచుండిన కుబ్జయొక్క పూర్వజన్మ సుకృతమును పలుమారు స్మరించుచున్న యాసర్వశక్తుం జూచి, నమస్కరించి తనయందు ప్రీతి నునుపవలయునని ప్రార్థింపుచు నాకుబ్జ యిట్లనియె.

4వ కీర్తన - సౌరాష్ట్రరాగము - ఆటతాళము

ప. ఏహి ఏహి విజయగోపాలబాల
పాహీహ మాం పాలయ లోకపాల

1. భువనసున్దర చారువదనాబ్జ భూరికృపాలయభూమాభిధాన
సవితృమండలకోటిభాస సంసృతిదృఢపాశబంధవిదళన

2. గోపరమణీజారరమణ గోవిందగుణమణిగణవరాభరణ
పాపాసురబృందనిర్హరణ పరమపావనచరిత పాతకహరణ

3. గంధమాల్యాది గృహాణ గళితభవ ఫణీంద్రగరుడవిహరణ
సున్దరమమదేహిసురతమిహ సుఖయమామిహ దేవమమభవశరణం

4. కలితకస్తూరికాతిలక కరధృతమురళీకలనాదరసిక
బలజితసురవైరినివహ బద్ధమాయూరపింఛ వనజాభవన యన

5. పరిపూర్ణానందసముద్ర పాపమహాటవీపావకరౌద్ర
పరిజనకృతబహుభద్ర వరనారాయణతీర్థ ధృతబోధముద్ర

ప. హే విజయగోపాలబాలా!
ఏహి ఏహి = ఇటురమ్మా, ఇటురమ్మా!

అ. హే లోకపాలా! = లోకములను పాలించే శ్రీకృష్ణా!; ఇహ = ఇక్కడ; మాం = నన్ను; పాహి = రక్షించి; పాలయ = పాలించుమా!

1 భువన సుందర! = లోక సుందరుడా!; చారు వదనాబ్జ = సుందరమైన ముఖము గలిగిన; దేవ! = హేస్వామీ!; భూరికృపాలయ = గొప్పదైన కృపకు అలయమువంటివాడా; భూమాభిదానా = 'భూమా' అనుపేరుతో పిలువబడుచుండువాడ; సవిత్రుమండల కోటిభానదేవ = కోటిసూర్యమండలముల కాంతితో ప్రకాశించువాడా; సంసృతి = సంసారరూపమైన; దృఢపాశబంధ = దృఢమైన పాశబంధములను; విదళన = తీసివేయువాడ

2. గోపరమణీ = గోపికాస్త్రీలకు; జారరమణ = జారుడగు భర్త అయిన హేస్వామీ!; గోవిందా! = హే కృష్ణా!;గుణమణిగణ! = గుణములనెడు మణిసమూహములకు; వర = శ్రేష్ఠమైన; ఆభరణ = భూషణమువంటివాడా, పాప అసురబృంద = పాపులనే రాక్షస సమూహములను; నిర్హరణదేవ = సంహరించే స్వామీ!, పరమపావన చరిత = అమిత పావనమైన చరిత్రగలవాడా; పాతకహరణా! = పాతకములను హరించువాడా!

3. గంధమాల్యాది = గంధము, పూలు మొదలైన వాటిని; గృహాణదేవ = గ్రహించెడివాడా; గళితభవ = సంసారమును పోగొట్టువాడా; ఫణీంద్ర = ఆదిశేషమూర్తిమీదనున్నా; గరుడ = గరుత్మంతుని మీదనున్నా; విహరణ = విహరించువాడా, సుందర! = సౌందర్యవంతుడా; దేవ = హేస్వామీ!; ఇహ = ఇక్కడ; సురత = సంభోగమును; మమ = నాకు; దేహి = ఇమ్మా; ఇహ = ఇక్కడ; మాం = నన్ను; సుఖయ = సౌఖ్యపెట్టుమా, దేవ = హేస్వామీ; మమ = (నాయొక్క) నాకు; శరణం = రక్షకుడవు; భవ = కమ్మా (రక్షించుమా)

4. కలిత = ఒప్పుచున్నటువంటి; కస్తూరికాతిలక = కస్తూరిచే తిలకమునుతీర్చిన, దేవ = హేస్వామీ!; కరధృత = హస్తములయందు ధరించబడిన; మురళి = వేణువుయొక్క; కలనాదరసిక = అవ్యక్త మధురధ్వనియందునేర్పు; బల = మీ స్వంతబలముచేత; జిత = జయించబడిన; సురవైరినివహ = దేవతా శత్రువులగు రాక్షససమూహములుగలవాడా; దేవ = హేస్వామీ!; బద్ధ = కట్టబడినటువంటి; మయూరపింఛ = నెమలిపింఛముగలవాడ; వనజా అభ = తామరకమలములవంటి ప్రకాశముగలిగిన, నయన = నేత్రములుగలవాడ.

5. పరిపూర్ణ = సంపూర్ణమైనటువంటి; ఆనందసముద్ర! = ఆనందమే సముద్రముగాగలవాడా; దేవ = హేస్వామీ!; పాప మహాటవి = పాపమనే గొప్ప అరణ్యములకు; పావకరౌద్ర! = రౌద్రమైన అగ్నిహోత్రమువంటివాడా; పరిజనకృత బహుభద్ర = సేవక జనులకు చేయబడిన విశేషమంగళములు గలవాడా!; వరనారాయణతీర్థ = శ్రేష్ఠమైన నారాయణతీర్థులవారిచేత; ధృత = ధరించబడిన; బోధ = జ్ఞానమనెడు; ముద్ర = ముద్రగలవాడా!

పరిజనకృతబహుభద్ర వరనారాయణతీర్థధృతబోధముద్ర

ప. ఓసకలలోకేశ్వరా! విజయగోపాలా! రమ్ము; రమ్ము ననురక్షింపుము.

1. భూమపదవాచ్యా! కరుణాసముద్రా! త్రిలోకసుందరా! కోటిసూర్యప్రకాశుఁడ వగునీవే నంసారబంధమును దొలఁగింపఁగల మహానుభావుఁడవు. మనోహర మగు నీముఖకమలమునుం జూపినాఁడవు.

2. ఓనారాయణా! గోపికారాజా! గుణంబులనియెడు రత్నములే భూషనములుగాఁ గలవాడ వగుటచే నీచరిత్ర మతిపవిత్రము. నీవు రాక్షసుల సంహరించి, పాపములఁ దొలగించి సకలలోకముల రక్షింతువు.

3. ఓసుందరాకారా! భవవిదూర! ఈగంధమాల్యాదుల గ్రహింపుము. ఓ శేషశయనా! గరుడవాహనా! నాకు సురతమునిచ్చి యానందపఱపుము. ఓదేవా! నను దయఁజూడము.

4. కమలములవంటి విశాలనేత్రములతో నొప్పుముఖమున కస్తూరీ తిలకము శోభిల్ల నెమలిపింఛముల నాభరణముగ ధరించుకొని వేణుగానామృతము వర్షించుచు మనసున కానందముఁ గలిగించున్నాఁడవు. రాక్షసుల నెల్ల నద్భుతమగుబలముచే మర్దించి లోకముం గాపాడ నున్నావు.

5. పరమానందసముద్రా! సర్వవ్యాపకా! పాపారణ్యదవానలా! నీవు భక్తులకు సకలశుభముల నొసంగదువు. నారాయణతీర్థయతి స్వానుభవ పూర్వకముగ నిన్నుఁ దెలిసికొనియున్నాఁడు.

శ్లో. సర్వాంగసౌన్దర్య సుధాపగాయా
మపారసంసారవిశోధికాయాం,
కంసద్విషస్తస్య సుఖం చరంతీ
కుబ్జామనోవృత్తి రతన్ని వృత్తా. 9

శ్లో 9. కుబ్జామనోవృత్తి = కుబ్జయొక్క మనోవ్యాపారము; అపార = అంతులేని; సంసార = సంసారమనే (మోహమనే బురదను); విశోధికాయాం = కడిగివేయజాలినట్టి; తస్య కంసద్విషః = అ కంసశత్రువైన శ్రీకృష్ణస్వామివారియొక్క; సర్వాంగ సౌందర్య = సర్వ అవయవ సౌందర్యమనెడు; సుధాపగాయాం = అమృతనదియందు; సుఖం = సుఖముగా; చరంతి = వర్తించుచున్నదియై; అతన్నివృత్తా = దానినుంచి వడువజాలనిది అయెను.

సంసారమనియెడు బురదను కడిగి వైచునట్టి శ్రీకృష్ణ శరీరసౌందర్యమనియెడు నమృత ప్రవాహమున మునింగి, మజ్జనోన్మజ్జనముల నాచరించుచు నాకుబ్జయొక్క మనసు వెనుకకు మరల లేకుండెను.

శ్లో. అకర్ణ్య కుబ్జావచన మాశ్చర్యం తామనిందితాం,
అకరో త్కరసంస్పర్శా దమరీం సుందరీం హరిః. 10

శ్లో 10. హరిః = శ్రీకృష్ణస్వామివారు; అశ్చర్యం = ఆశ్చర్యమైనటువంటి; కుబ్జావచనం = కుబ్జయొక్క మాటలను; అకర్ణ్య = విన్నటువంటివారై; తాం = అకుబ్జను; కరసంస్పర్శాత్ = తమశ్రీహస్తములయొక్క స్పర్శచేత; అనిందితాం = నిర్దోషమైన; అమరసుందరీం = దేవతా సౌందర్యముగలదానినిగా; అకరోత్ = చేసెను.

అప్పు డాకృష్ణుఁడును పరమాశ్చర్యముగ నాకుబ్జ చెప్పినమాటల విని, యాస్త్రీయొక్క సద్గుణములకు మెచ్చెను. అయన, గంధమాల్యాదుల స్వీకరించిన పిదప (తన) హస్తముతో స్పృశింపఁగా, నాయువతియు దేవాంగనయట్లు త్రిభువనసుందరి యయ్యెను.

శ్లో. రిరంసయా తేన సాకం కుబ్జా సా కామమోహితా,
పీతాంబరధరం శ్యామం మధురం ప్రాహ మాధవమ్ 11

శ్లో 11 సాకుబ్జ = ఆకుబ్జ; కామమోహితా = కామమోహితురాలై. తేన సాకం = ఆస్వామివారితోగూడా; రిరంసయా = రమించవలెననే కోరిక కలదియై పీతాంబరధర = బంగారు వస్త్రమును ధరించిన; శ్యామం = నీలమేఘశరీరులైనటువంటి, మాధవం = స్వామివారిని గూర్చి; మధురం = మధురమగునట్లుగా, ప్రాహ = పలికెను

ఇట్లు దివ్య సుందరియై, యాకుబ్జ మన్మధునిశరములకు లోనగుచు నా కృష్ణునితోఁ గ్రీడింపవలయు నను నిచ్ఛ యధిక మగుచుండ, నీలవర్ణుఁడగు నప్పీ తాంబరునిఁజూచి మనోహరముగ నిట్లనియెను.

5వ కీర్తన - భైరవిరాగము - అదితాళము

ప. మాధవ మేరతిందేహి - నాధనాథ మాధవ మే రతిం దేహి
అ. మధురాధరబింబ ధన్యేయం మాననీయా త్వయా నూనం

1. దీనజనదయాఘన దేవకీవరనందన
మానినీమానభంజన మదనమదన
మునిమనోనికేతన మోహతిమిరనిధన
కనకమయపరిధాన కలితనిఖిలభువన

2. నత్యజామి చేలాంచలం నాధ తవ సురతిమూలం
అతినీలఘనసుందరం ఆనందలీలం
సత్య మాశాస్మి గోపాలం సత్యకామాదిగుణజాలం
భృత్యవర్గపరిపాలం బలభద్రానుజం బాలం

3. తరణికోటికిరణ తామసగుణనిర్హరణ
తారకముక్తాభరణ దాసపోషణ
దూరితదుర్జనగణ దోషరహితచరణ
వరనారాయణతీర్థ వర్ణితనిజచరణ

ప. నాథ నాథ! = నాథులకు నాథుడైన; మాధవ = హేస్వామీ!; మే = నాకు; రతిం = సురతి సుఖమును; దేహి = ఇమ్ము.

అ. ఇయం = ఈనేను; మధురాధరబింబ ధన్యా = దేవరవారి అధర బింబముచేత ధన్యురాలను కా తగియున్నాను; నూనం = నిశ్చయముగా; త్వయా = మీచేత; మాననీయా = సన్మానింపబడదగినదానను

1. దీనజనావన = దీనజనులను రక్షించువాడా; దయాఘనా = ఘనమైన దయగలవాడా; దేవకీ వరనందనా! = దేవకీ అమ్మవారి శ్రేష్ఠమైన కుమారుడా; మానినీ మానభంజనా = స్త్రీలయొక్క మానములను భంగముచేసినవాడా; ముని మనోనికేతనా = మునులయొక్క మనస్సులే స్థానముగాగలవాడా; మదన మదన! = మన్మధుని మోహింపజేయువాడా!; ముని మనోనికేతనా = మునులయొక్క మనస్సులే స్థానముగా గలవాడా; మోహ తిమిర నిధనా = మోహమనే చీకటిని నాశనము చేయువాడా; కనకమయ పరిధానా = బంగారు వికారమైన వస్త్రమును ధరించినవాడా, కలిత నిఖిలభువన = సమస్తలోకములను ఏర్పాటు చేసినవాడా

2. న త్యజామి చేలాంచలం = మీయొక్క వస్త్రమును విడువను; నాథ! = హేకృష్ణా!; తవ = నీయొక్క; సు రతిమూలం = క్రీడాకారణమైన (వస్త్రమును విడువను); అతినీల ఘనసుందరం = నీలమేఘశ్యామల వర్ణము గలిగినటువంటిన్నీ; ఆనందలీలం = ఆనంద అనుభవము, లీలానుభవము కలిగినటువంటిన్నీ

   సత్యమాశాస్మి గోపాలం -

   సత్యం = సత్యస్వరూపుడైనట్టిన్నీ, గోపాలం = ఇట్టి గోపాలకృష్ణుడవైన మిమ్ములను - ఇంకనూ; సత్యకామాదిగుణజాలం = సత్యకామాది గుణసమూహములు కలిగినటువంటిన్నీ; భృత్యవర్గ పరిపాలం = దాససమూమములను పరిపాలించునటువంటిన్నీ; బలభద్రానుజం = బలభద్రునికి తమ్ముడు అయినటువంటిన్నీ, బాలం = బాలుడైనటువంటిన్నీ; గోపాలం = గోపాలుడవైన నిన్ను; ఆశాస్మి = కోరుచున్నాను.

3. తరణికోటికిరణ = కోటిసూర్యప్రకాశముగలవాడా; తామసగుణ నిర్హరణ = తామస గుణమును కొట్టివేయువాడా; తారక = నక్షత్రములతో సమానమైన; ముక్తాభరణ = ముత్యాలతో నిండిన అభరణములు ధరించినవాడ; దానపోషణ = దాసులను పోషించువాడ; దూరిత దుర్జనగణ! = దుర్జన నమూహములను వరిహారించినవాడ, దోషరహిత చరణ = నిర్దోషమైన పాదారవిందములుగలవాడా; వరనారాయణతీర్థ వర్ణితనిజచరణ = శ్రేష్ఠమైన నారాయణ తీర్థులవారిచేత వర్ణింపబడు చుండు పాదారవిందములుగలవాడా

   ప. ప్రభువులకు ప్రభువగు నోనారాయణా! నాకు సురతము నిమ్ము.

   అ. నీయధరామృతరసమునిచ్చి నను ధన్యంజేయుము. అవశ్యమునన్ను మన్నింపవలయును.

   1. నీవు సకల ప్రపంచములకును సృష్టికర్తవై, యజ్ఞానముల నశింపఁజేయువాఁడవై, మౌనుల హృదయములందు సర్వకాలమును నివసించుచుందువు. ఓదేవకీపుత్రా! పీతాంబరా! మన్మథమన్మథుండ వగు నినుఁ జూచిన నేయువతి యనురాగముఁ జెందకుండును? నీకును దీనులగు వారివిషయమున దయ మిక్కుటము.

2. ఓనాధా! నీవస్త్రమును విడువను. నీలమేఘశ్యామలుండవును, సత్యకామత్వాది కల్యాణగుణములచే నొప్పుచున్న వాఁడవును, విలాసముచే బలభద్రునకు తమ్ముఁడవుగ గోపాలబాలుఁడవుగ జనించినవాఁడవును అగునోభక్తరక్షకా! ప్రమాణముఁ జేయుచున్నాను. నీవు నాకు సురతము నొసంగువఱకు నీవస్త్రము విడువను.

3. సూర్యకోటి ప్రకాశా! నీవు దోషరహితుఁడవు. నిన్నాశ్రయించినవారల తమోగుణమును బోఁగొట్టి యుద్ధరింతువు. ముక్తామయములగు భూషణముల ధరించియున్న యోకృష్ణా! నారాయణతీర్థుఁ డెప్పుడును నీపాదముల గీర్తింపుచుండును.

*శ్రీకృష్ణుఁడు కువలయాపీడాదుల వధించుట*

శ్లో. ప్రార్థితస్త్వనయా కృష్ణ స్తాం సమాధాయ సత్వరం,
బలాత్కువలయాపీడం కుంజరం నిజఘాన సః 12

శ్లో 12. త్వనయా = ఈకుబ్జచేత; కృష్ణః = స్వామివారు; ప్రార్థితః = ప్రార్థించబడినవాడై; తాం = ఆకుబ్జను; సత్వరం = త్వరగా; సమాధాయ = సమాధానపరచి, ఒప్పించి; సః = ఆస్వామివారు; కువలయాపీడంకుంజరం = కువలయా పీడన మనునట్టి ఏనుగను; బలాత్ = తమ బలాతిశయముచేత; నిజఘాన = చంపివేసెను.

ఇట్లు ప్రార్థించుచున్న కుబ్జ నొకవిధముగ సమాధానపఱచి యవలకుఁబోయెను. అచట కంసునిచే, తనను (కృష్ణుని) వధించుటకై సర్వసన్నాహాములతో నిలువఁబడియున్న కువలయాపీడ మనుగజమును వధించెను.

శ్లో. హత్వా ముష్టికచాణూరౌ ధనుర్భంగం విధాయ చ,
సాగ్రజో మాతులసభాం ప్రవిష్టో గీయతే మరైః 13

శ్లో 13. ముష్టిక చాణూరౌ = ముష్టిక చాణూరులను మల్లులను; హత్వా = చంపివేసి; ధనుర్భంగం = ధనుర్భంగమున్నూ; విధాయచ = ఒనర్చియు; స అగ్రజః = బలరామసహితుడై; మాతులసభాం = మేనమామసభను; ప్రతిష్ఠిః = ప్రవేశించినవారై; అమరే = దేవతలచేత; గీయతే = గానముచేయబడుచున్నారు.

పిదప చాణూరుఁడు, ముష్టికుఁడు అనుజెట్టివారు తనపైకి రాఁగా వారల వధించి యాగశాలయందు నుంపఁబడి పూజింపఁబడుచుండిన ధనుస్సును విఱచి బలరామసహితముగ కంససభను బ్రవేశించెను. అప్పుడు దేవత లాహరి నిట్లని వినుతించిరి.

దేవతలు కంససభం జేరిన శ్రీకృష్ణు నుతించుట

6వ కీర్తన - శంకరాభరణరాగము - ఆటతాళము

| | | |
|---|---|---|
| ప. | అవలోకయత శ్రీగోవిందం | భోభోభూమావవలోకయత |
| అ. | నవజలధరశ్యామలం | నందితబలరామం |
| 1. | భువనసుందరాకారం | భూరికరుణాకరం |
| | అవనీభారసు | రారివిదారం |
| | నవముక్తామణిహారం | నానావిధవిహారం |
| | ధ్రువపదవిధాతారం | దూరితసంసారభారం |
| 2. | మల్లఛాణూరమథనం | మత్తమాతంగనిధనం |
| | ఫుల్లపంకజదళ | సన్నిభనయనం |
| | వల్లవాంగనామదనం | వాసుదేవాభిధానం |
| | కల్లోలమాలిశయనం | కంసేభ కేసరిణం |
| 3. | ఏకాంత దైవతం | యాదవాబ్ధిసముదితం |
| | శ్రీకాకుళనగరీ | శ్రీభూమిసహితం |
| | నాకవల్లభగీతం | నారాయణతీర్థరచితం |
| | వికటమోహరహితం | విజయగోపాల మసితం |

ప. భో! భో! = ఓదేవతలారా!; భూమౌ = భూలోకమునందు; గోవిందం = స్వామివారిని; అవలోకయత = సేవింపుడు.

అ. నవజలధరశ్యామ = నూతన మేఘమువలె శ్యామలవర్ణము కలిగినటువంటిన్నీ; నందిత బలరామం = బలరాముని సంతోషపెట్టునట్టి స్వామివారిని; అవలోకయత = సేవింపుమా

1. భువనసుందరాకారం = లోకములో సర్వాతిశయమ్మైన సౌందర్యముతో కూడుకొనిన అకారముగలవారున్నూ, భూరికరుణాకరం = విస్తారమైన కరుణకు ఆటపట్టు అయినవారున్నూ; అవనీభార = భూమికి భారముగా నుండునట్టి; సురారి విదారం = దేవతలకు శత్రువులైన రాక్షసులను చీల్చునట్టివారున్నూ; నవముక్తమణిహారం = క్రొత్తముత్యములు గూర్చిన హారము ధరించినవారున్నూ; నానావిధ విహారం = అనేకవిధములైన విహారములుగలవారున్నూ; ధృవపదవిదాతారం = స్థిరమైన పదవిని యిచ్చువారున్నూ; దూరిత సంసారభారం = సంసారభారమును నివర్తింపజేయువారున్నూ అగుస్వామివారిని; అవలోకయత = సేవింపుమా

2. మల్లచాణూర మథనం = చాణూరముష్టికులను మల్లులను సంహరించినవారున్నూ; మత్తమాతంగనిధనం = మదించిన ఏనుగును చంపినవారున్నూ; ఫుల్ల = వికసించినట్టువంటి; పంకజదళ = తామరపుష్పముల రేకులతో; సన్నిభ = సమానమైన; నయనం = నేత్రములుగలవారున్నూ; వల్లవాంగనామదనం = గోపికలకు మన్మథుడంటివాడున్నూ; వాసుదేవాభిధానం = వాసుదేవుడు అనుపేరు వహించినవారున్నూ; కల్లోల మాలిశయనం = తరంగములు అనుమాలికలుగల సముద్రమునందు శయనించినవారున్నూ; కంసేభ కే సరిణం = కంసుడు అనేడు ఏనుగకు సింహమువంటి శ్రీకృష్ణస్వామివారిని; అవలోకయత = సేవింపుమా.

3. ఏకాంత దైవతం = పరమ ఏకాంతులకు పరమ దైవస్వరూపుడున్నూ; యాదవాబ్ధి సముదితం = యాదవవంశమును సముద్రమునందు పుట్టినట్టివారున్నూ; శ్రీకాకుళనగం = శ్రీకాకుళపట్టణమందు; శ్రీభూమీ సహితం = శ్రీదేవి, భూదేవితో వేంచేసియుండు వారున్నూ; నాకవల్లభగీతం = దేవతలకు భర్తయైన ఇంద్రునివల్ల గానము చేయబడినట్టిన్నీ; నారాయణతీర్థ రచితం = నారాయణతీర్థులవల్ల రచింపబడినట్టిన్నీ - ఈకీర్తన; వికటమోహరహితం = విపరీత మోహమును నశింపజేయునదిన్నీ; అశితం = కృష్ణవర్ణము గలిగినట్టి; విజయగోపాలం = విజయగోపాలస్వామివారిని; అవలోకయత = సేవించండి.

ప. ఓమిత్రులారా! ఆనారాయణునిఁ జూడుఁడు. భూమిపై విహరించుచున్నాఁడు.

అ. నీలమేఘశ్యాముఁడై, బలరామున కానందముగల్గించువాఁడైయున్న శ్రీకృష్ణుని జూడుఁడు.

1. అదయానముద్రుడు సంసారముతో సంబంధమేమియు లేని వాఁడయ్యు, మోక్షము నొసంగువాఁడయ్యు, రాక్షసుల సంహరించి భూభారముందీర్చుటకై త్రిలోకసుందరుఁడై, ముక్తాహారములు మొదలగు భూషణములుఁ దాల్చి భూమిపై స్వేచ్ఛగా విహరించుచున్నాఁడు.

2. గోపికాజనమన్మథుఁడును, కమలనేత్రుఁడు నగు నావాసుదేవుఁడు కువలయాపీడ మనుగజమును, చాణూరముష్టికులను మల్లులను వధించెను. ఆ క్షీరసముద్రశయనుఁడు కంసుఁడను మదగజమునకు సింహమగుచు సభయందుఁ బ్రవేశించుచున్నాఁడు.

3. యదువంశమను సముద్రమున జనించిన యాగోపాలుఁడే ముఖ్య దైవము. మోహరహితుఁడనియు, లక్ష్మీభూమిసహితుఁడై శ్రీకాకుళమున నివశించుచున్నాఁడనియు, దేవేంద్రుఁ డిమ్మహాత్ముని వినుతించెనని నారాయణ తీర్థుఁడు రచించెను. (ఈగీతమువలన నారాయణతీర్థునివాసము శ్రీకాకుళమని యూహింపవచ్చును.

శ్లో. అవరుహ్యాసనాద్వీరః కంసో రంగగతః ఖలః,
యుద్ధాయ సహ కృష్ణేన స్మరన్ ప్రాగ్దేవభాషితమ్. 14

శ్లో 14. ఖలః = దుర్మార్గుడున్నూ; వీరః = వీరుడున్నూ-అయినట్టి; కంసః = కంసుడు; ప్రాక్ = పూర్వకాలమందు; దేవభాషితం = ఆకాశవాణి చెప్పిన మాటలను; స్మరన్ = జ్ఞాపకమునకు తెచ్చుకున్నవాడై; కృష్ణేనసహ = స్వామివారితో; యుద్ధాయ = యుద్ధము చేయుకొఱకు; ఆసనాత్ = తన సింహాసనమునుండి; అవరుహ్య = దిగినవాడై; రంగగతః = రంగస్థలములోనికి ప్రవేశించెను.

ఇట్లాకృష్ణుఁడు సభను (నడుమనొక మల్లరంగము నేర్పఱచి ఆ కంసుఁడు చుట్టును జనులందఱు కూర్చుండి చూచుటకు తగిన సన్నివేశ మేర్పఱచియుండెను. అదియే యిచ్చట సభయని చెప్పఁబడినది. ఆ సభా ద్వారముననే కువలయాపీడమును, చాణూరముష్టికులును ఉండిరని తెలిసి కొనవలయును) బ్రవేశింపఁగానే కంసుఁడు తన యాసనముపైనుండి దిగి యమ్మహాత్మునితో యుద్ధముచేయుటకై రంగస్థలమునకు వచ్చెను. మొట్టమొదట నాకాశవాణిచెప్పిన వాక్యములను దలంచి, తనమరణమును నిశ్చయించుకొనినను, వీరుఁడగుటచే నాదుష్టుఁడు యుద్ధముచేయుట యావశ్యకమని తలంచెను.

కంసవధ

శ్లో. హతః కంసారిణా కంసః సంసారభయహారిణా,
శౌరిణా హరిణా యుద్ధేజగుస్తం సురభూసురాః 15

శ్లో 15. కంసః = కంసుడు; సంసార భయ హరిణా = సంసారభయమును పోగొట్టునట్టిన్నీ; కంసారిణా = కంసశత్రులైనట్టిన్నీ; శౌరిణా = శూరుని వంశోత్పన్నుడైనట్టిన్నీ; హరిణా = స్వామివారిచేత; యుద్ధే = యుద్ధమునందు; హతః = చంపబడెను; తం = అట్టిస్వామివారిని; సుర భూసురః = దేవతలు, బ్రాహ్మణులున్నూ; జగుః = గానముచేసిరి.

ఇట్లు యుద్ధమునకు వచ్చి సంసారభయమును హరించు నాశ్రీకృష్ణునిచే కంసుఁడొక క్షణమాత్రమున మృతినొందెను. ఈ విషయమును దేవతలును, బ్రాహ్మణులను నిట్లు గానముఁజేసిరి.

7వ కీర్తన - భూపాళరాగము - ఆటతాళము

ప. పాహిపాహిమాం పరమకృపాళో
దేహిమేత్వయి దేవసుభక్తిం

1. అసురసంహార శ్రీవిజయగోపాల
అమరసంరక్షణ విజయగోపాల
వసుదేవతనయ శ్రీవిజయగోపాల
వాసవాదినుత విజయగోపాల

2. సంగీతలోల శ్రీవిజయగోపాల
సద్గుణశీల శ్రీవిజయగోపాల
శృంగారరసపూర విజయగోపాల
శ్రితజనపాల శ్రీవిజయగోపాల

3. ధీరగుణాధార విజయగోపాల
ధేనుకాదిహరణ విజయగోపాల
నారదమునిగేయ విజయగోపాల
నారాయణతీర్థ విజయగోపాల

ప॥ పాహి పాహి మాం పరమ కృపాళో
పరమ కృపాళో = దయా సముద్రా!; మాం = మమ్ములను; పాహిపాహి = రక్షించుమా! రక్షించుమా!; దేవా! = హేస్వామీ!; త్వయి = మీయందు; మే = నాకు; సుభక్తిం = నిర్మలమైన భక్తిని; దేహి = ఇవ్వండి

1. అసుర సంహార = రాక్షసులను సంహరించునట్టి, ఓ విజయగోపాలుడా!; అమర సంరక్షణ = దేవతలను రక్షించునట్టి విజయగోపాలుడా; వసుదేవతనయశ్రీ = వసుదేవుని పుత్రుడవైన విజయగోపాలుడా; వాసవాదినుత = దేవేంద్రుడు మొదలగువారిచేత స్తోత్రముచేయబడుచుండు విజయగోపాలుడా

2. సంగీతలోలా = సంగీతమునందు ఆసక్తిగలిగిన హే! విజయగోపాలా!; సద్గుణశీలా! = సద్గుణములే స్వభావముగాగలిగిన హే! విజయగోపాలా!; శృంగార రసపూర = లావణ్యరసముచేత నిండినట్టి; హే! విజయగోపాలా!; శ్రితజనపాలశ్రీ = ఆశ్రయించినవారలను పాలించునట్టి; హే! విజయగోపాలా

3. ధీరా = ధైర్యసంపన్నుడా; గుణాధారా = గుణములకు ఆధారముగా నుండునట్టివాడా; ధేనుకాది హరణా = ధేనుకుడు మొదలగు రాక్షసులను హరించినవాడా; నారదమునిగేయా = నారదమునిచేత గానముచేయబడుచుండు హే! స్వామీ!; నారాయణ తీర్థ విజయగోపాలా = నారాయణ తీర్థులను రక్షించునట్టి హే! విజయగోపాలస్వామీ!; మాం = నన్ను; పాహి పాహి = రక్షింపుమా! రక్షింపుమా!

ప. ఓదయామయా! సర్వప్రకాశస్వరూపా, ననుఁబ్రోవుము. నాకు నీయందు నిశ్చలభక్తి నొసంగుము.

1. ఓవసుదేవపుత్రా! గోపాల! నీవు రాక్షసులను సంహరించి, దేవతలను రక్షించి యింద్రాదులచే స్తోత్రము చేయఁబడుచుందువు.

2. ఓసామగానలోలా! సద్గుణాకారా! విజయగోపాలా! శృంగారరసప్రవాహమువలె నీరూపము సకల జగన్మనోహరముగ నున్నది. నీ వాశ్రితుల పరిపాలింపఁ గంకణము గట్టియున్నావు.

3. ఓవిజయగోపాలా! నీవు మిగుల ధైర్యవంతుఁడవనియు, సకల సద్గుణ సముద్రుండవనియు, నారదాదులచే సర్వకాలములయందును గానము సేయఁబడుచున్నావనియు, నారాయణతీర్థుఁడు వినుతించుచున్నాఁడు.

శ్లో. మధురాయాం హతే కంసే మాధవేన మహాత్మనా,
వవృషుః పారిజాతాది పుష్పాణ్యా కాశతస్సురాః 16

శ్లో 16 మధురాయాం = మధురానగరమునందు; మహాత్మనా = మహాత్ముఁడైనట్టి; మాధవేన = శ్రీకృష్ణస్వామివారిచేత; కంసేహతే = కంసుడు హతుడుకాగా; ఆకాశతః = ఆకాశమునుండి; సురాః = దేవతలు; పారిజాతాదిపుష్పాణి = పారిజాతము మొదలైన పుష్పములను; వవృషుః = కురిపించిరి.

ఇట్లు శ్రీకృష్ణుఁడు మధురాపురమున నాకంసుని వధింపఁగానే దేవతలందఱును నాకసమునుండి పారిజాతాదతిపుష్పములఁ గురిపించిరి.

శ్లో, అనంతకల్యాణగుణాభిరామౌ
దురన్తసంసారతమోధిరామౌ
నిరంతరం సంస్మరతోః స్వపిత్రో
రథాంతికం సమ్యగవాప్తవంతౌ. 17

శ్లో 17. అనంత కళ్యాణ గుణాభిరామౌ = అంతములేని కళ్యాణ గుణములచేత మనోహరములైనట్టి వారున్నూ; దురంత సంసార తమో విరామౌ = అంతములేని సంసారాంధకారమును నాశనముచేయునట్టివారున్నూ - అయినట్టి బలరామకృష్ణులు; అథ = అనంతరమందు; నిరతరం = ఎల్లప్పుడున్నూ; సంస్మరతోః = స్మరింపుచున్నట్టి; స్వపిత్రో = తమ తల్లిదండ్రులయొక్క; అంతికం = సమీపమును; సమ్యక్ = లెస్సగా; అవాప్తవంతౌ = పొందినవారైరి?

ఇట్లు కంసవధ ముగిసినపిదప సంసారాంధకారమును నివర్తింపఁజేయఁజాలు నాకల్యాణగుణసముద్రులు, రామకృష్ణులు, సర్వకాలములయందును తమనే ధ్యానించుచుండిన తల్లిదండ్రులకడకుఁ బోయిరి.

శ్లో. పరిష్వజ్యాంకమారోప్య మూర్ధ్న్యుపాఘ్రాయ సాదరం,
దేవకీవసుదేవౌ తావాశిషం చక్రతుర్ముదా. 18

శ్లో 18. పరిష్వజ్య = బలరామ కృష్ణులను ఆలింగనము చేసుకొన్నవారలై; అంకమారోప్య = తమవడియందు వుంచుకున్నవారై; సాదరం = ప్రేమపూర్వకముగా; మూర్ధ్ని = శిరస్సునందు; ఉపాఘ్రాయ = వాసనచూచినవారలై; దేవకీ వసుదేవౌ = దేవకీ వసుదేవులు; ముదా = సంతోషముచేత; తౌ = ఆ బలరామకృష్ణులను జూచి; ఆశిషం చక్రతుః = ఆశీర్వాదములు చేసిరి.

ఆ దేవకీవసుదేవులును తమపుత్రుల నాలింగనముఁజేసికొని తొడపైఁ కూర్చుండఁబెట్టుకొని మూర్ధాఘ్రాణముఁజేయుచు నాశీర్వాదము లొనర్చిరి.

శ్లో. జగతీపతిరపి భగవాన్ యదుపతిబంధుస్సుబంధురఖిలాత్మా
హరి రథ మధురానగరీనరపతిమానందయన్ సతత్రాస్తే. 19

శ్లో 19. జగపతి అపి భగవాన్ -

సః భగవాన్ = ఆశ్రీకృష్ణస్వామివారు; జగతీపతిరపి = సమస్త జగమునకు భర్తఅయ్యును; సుబంధువుః = నిరుపాధిక బంధువున్నూ; అఖిలాత్మ = సర్వము తనకు శరీరముగా గలిగినట్టి; యదుపతి బంధుః = ప్రకృతమందు యాదవులకు అందరికి బంధువుగా వేంచేసియున్నట్టి; హరిః = శ్రీకృష్ణస్వామివారు; అథ = అనంతరము; మధురానగరీ నరపతిం = మధురా నగరమునకు రాజుగా నుండునట్టి ఉగ్రసేన మహారాజుగారిని; ఆనందయన్ = సంతోషపఱచుచూ; తత్రాస్తే = ఆ మధురా నగరమునందు వేంచేశియుండిరి.

సర్వాత్మకుడై, సకలజనబంధువై యున్న యాభగవంతుఁడు తాను సకలలోకేశ్వరుఁడైనను, మధురానగరాధిపతి యగు నుగ్రసేనునకు నానందమును గల్గించుచు ఆపురముననే నివసించుచుండెను.

*ఇది దశమతరఙ్గము.*

ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం - శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
కంసనిర్హరణంనామ దశమతరఙ్గః.

## ఏ కాదశ తరఙ్గము ప్రారంభము

### - : కథాసంగ్రహము : -

శ్లో. శ్రీకృష్ణస్య ద్వారవతీ ప్రవేశాఖ్యం చరిత్రకం,
వర్ణ్యతే త్ర మహాచిత్ర మేకాదశతరంగకే. 1

ఆదౌ గోప్యస్తతః కృష్ణ స్తదనంతర ముద్ధవః,
సమాధానాయ గోపీనా ముద్ధవప్రేరణం తదా. 2

గోపికోద్ధవసంవాదః పునః కృష్ణస్య దర్శనం,
విద్యాభ్యాసశ్చ విధినా గురోర్వాంఛితపూరణం. 3

జరాసంధేన సంగ్రామ స్తస్య సేనానిబర్హణం,
తతో గుహాప్రవేశశ్చ నిధనం యవనస్య చ. 4

ముచుకుందస్తుతిశ్చైవ కృపయా తత్ప్రసాదనం,
ద్వారకాయాం ప్రవేశశ్చ సంగ్రహో యం ప్రకీర్తితః. 5

శ్లో.1. శ్రీ కృష్ణస్య = శ్రీ కృష్ణస్వామివారియొక్క ; ద్వారవతీ ప్రవేశాఖ్యం = ద్వారవతీ పట్టణము ప్రవేశించుట యను పేరుగల; మహా చిత్రచరిత్రకం = ఆచర్యకరమైన కథ; అత్ర ఏకాదశ తరంగికే = ఈ ఏకాదశ తరంగము నందు ; వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

శ్లో.2. ఆదౌ = మొదట; గోప్యః = గోపికలున్నూ ; తతః = అనంతరము కృష్ణః = స్వామివారున్నూ ; తదనంతరం = అటుపిమ్మట; ఉద్ధవః : ఉద్ధవుడున్నా (ప్రవేశించుచున్నాడు) గోపీనాంసమాధానాయ = గోపికలను సమాదానపరుచుటకు; ఉద్ధవ ప్రేరణం = ఉద్ధవులను ప్రేరేపించుటయున్నూ; తదా = అటుపిమ్మట; గోపికోద్ధవసంవాదః = గోపికలకున్నూ ఉద్ధవునకున్నూ వాదం జరుగుటయున్నా ; పునః = మరల; కృష్ణస్య దర్శనం = శ్రీకృష్ణులవారిని దర్శించుటయున్నూ ; విధినా = విధ్యుక్తముగా ; విద్యాభ్యాసశ్చ = స్వామివారి విద్యలను అభ్యసించుట యున్నూ ; గురోః = గురువుగారియొక్క; వాంఛితపూరణం = కోరిక తీర్చుట యున్నూ; జరానంధేన సంగ్రామః = జరాసంధునితో యుద్ధముచేయుటయున్నూ; తస్యసేనా నిబర్హణం = అతని సేనలను స్వామివారు సంహరించియున్నూ; తతః = అనంతరము

గుహాప్రవేశశ్చ : స్వామివారు ముచుకుందుని గుహలో ప్రవేశించుటయున్ను ; యవనస్య స్యనిధనం: యవనుని చంపించుటయున్నూ ; ముచికుందస్తుతిశ్చైవ : ముచికుందుడు స్వామివారిని స్తోత్రము చేయుట యున్నూ ; కృపయా : అనుగ్రహము ( చేయుట) చేత ; తత్ ప్రసాదనం : ఆయనను స్వామివారు అనుగ్రహించుట యున్నూ ; ద్వారకాయాం ప్రవేశశ్చ : ద్వారకా నగరములో తాను ప్రవేశించుటయున్నూ ; అయం సంగ్రహ ప్రకీర్తితః : ఇవి అన్నియు సంక్షేపముగా ఈ తరంగమునందు చెప్పబడు చున్నది.

ఈపదునొకండవ తరంగమునందు మిగుల విచిత్రమగు ద్వారకాపుర ప్రవేశకథ వర్ణింపఁబడును. కృష్ణునిగూర్చి విచారించుచు గోపికలు గోకులమునఁ బరితపించుటయు, శ్రీకృష్ణుఁడు వారినింగూర్చి యుద్ధవునితో విచారించుటయు, వారి సమాధానపఱప నయ్యుద్ధవుని గోకులమునకుఁ బుత్తెంచుటయు, గోపికోద్ధవుల సంవాదంబును, ఉద్ధవుఁడు మరల శ్రీకృష్ణునిఁ గాంచుటయు, శ్రీకృష్ణుఁడు విద్యాభ్యాసముకొఱకు అవంతీపురమునకుఁ బోవుటయు, గరుని యభీష్టము నెఱవేర్చుటయు, జరాసంధునితో యుద్ధముఁజేసి వాని సైన్యమును సంహరించుటయు, ముచుకుందుఁడున్న పర్వతగుహలో ప్రవేశించుటయు, అచటకాలయవనుని మరణంబును, ముచుకుందుడు స్తోత్రము చేయుటయు వాని ననుగ్రహించుటయు, అంత ద్వారకమయను పట్టణమును నిర్మించి బంధుసహితముగ నందు ప్రవేశించుటయు ననునది యిందలి కథా సంగ్రహము.

## గోపికోద్ధవసంవాదము

ఉద్ధవాగమన్ -

నాదనామక్రియారాగము - ఆదితాళము

ఉత్సాహం సర్వభూతానాం ఉగ్రకంసాదినిధనం
ఉచ్చైరనుగాయంగాయం ఉద్ధవో యంవిరాజతే

నాదనామక్రియ - ఆదితాళము :- సర్వభూతానాం సమస్త భూతములకు ; ఉత్సాహం : సంతోషమును కలుగ జేయునట్టి ; ఉగ్రకంసాది . భయంకరమైన కంసుడు మొదలగు వారును , నిధన : చంపుటయను కార్యమను ; ఉచ్చైః : ఎలుగెత్తు (గొప్పకంఠముతో); అనుగాయన్ గాయన్ : గానము చేయుచూ చేయుచు; ఉద్ధవో అయంవిరాజతే : ఉద్ధవులవారు ప్రకాశించు చున్నారు.

సమస్తభూతములకును ఉత్సాహము నొసంగుచు, క్రూరులగుకంసాదుల సంహరించి లోకోపకారము సేయుచున్న యా శ్రీకృష్ణుఁని గూర్చి యుద్ధవుఁ డనునొకభక్తుఁడు సర్వకాలములయందును గానము సేయుచుండెను.

శ్లో. సమాధానాయ గోపీనాం గోవిందేన ప్రచోదితః,
ఉద్ధవో గోకులజనైః పృష్టః ప్రత్యాహ కౌశలమ్. 6

శ్లో. 6. గోపీనాం = గోపికా అమ్మవార్లను; సమాధానాయ = సమాధానా పఱుచుట కొఱకు; గోవిందేన = శ్రీకృష్ణ స్వామివారి చేత ; ప్రచోదితః = ప్రేరణ చేయబడినవారై ; ఉద్ధవః = ఉద్ధవులవారు; గోకులజనైః పృష్టః = గోకులములోనుండు జనులచేత అడగబడినవారై; కౌశలమ్=కుశలమును (క్షేమసమాచారమును,) ప్రత్యాహ=చెప్పెను.

ఆయుద్ధవునిఁ బిలిచి శ్రీకృష్ణుఁ డొకనాఁడిట్లనియె. గోకులముననుండు గోపికలు నావిషయమున మిగులఁ జింతించుచుందురు. కావున నీవు వారికడకుఁ బోయి వారి సమాధానపఱచి రమ్ము; అని యిట్లు కృష్ణుఁ డాజ్ఞాపింపఁగనే ఆయుద్ధవుఁడు గోకులమునకుఁ బోయి తన్నడిగినవారికెల్ల కృష్ణుని కుశలము నెఱింగించెను.

శ్లో. నందాద్యైస్తోషిత స్తత్ర మాధవోక్తిం నివేద్య చ,
సంతం రహసి గోప్యస్తం ప్రాహుర్మధుపకల్పితమ్ 7

శ్లో.7. తత్ర=ఆగోకులమునందు; నందాద్యైః=నందుడు మొదలగువారిచేత; స్తోషితః = సంతోషింపచేయబడినవారై; మాధవోక్తిం=శ్రీ కృష్ణ స్వామి వారిచేత చెప్పిపంపిన సమాచారమును; నివేద్యచ=తెల్పినటువంటివారై; రహసి=ఏకాంతమందు, సంతం= ఉన్నటువంటి;తం=ఆ ఉద్ధవుల వారిని గూర్చి; మధుప కల్పితం = భ్రమరమును అన్నట్టుగా కల్పించి; గోప్యః = గోపికలు; ప్రాహుః= పలికిరి.

నందుఁడు, యశోద మొదలగుబంధుజనులందఱితోను శ్రీకృష్ణుడు చెప్పి పంపినవాక్యముల వేఱు వేఱ నెఱింగించెను. ఇట్లాయుద్ధవుఁడు గోకులమున వసించుచుండ నొకనాఁడు గోపిక లందఱును తుమ్మెదపైఁబెట్టి యుద్ధవునితో నేకాంతమున నిట్లనిరి.

## భ్రమరగీతలు

### కల్యాణీ (సావేరీ) రాగము - అటతాళము

ప. మధుప మధుప దూతం మన్యేత్వాంమాధవీయమధునా

అ. మధురాపురనారీ వదనాంబుజ
మకరన్ద మాకలయ మాయాహి యాహి యాహి

1. మధుప మధుపూరితం మాధురీవదనకమలం
మాధవభాస్కర మహితకరకలితం
అధునా యాదవకరుణా సుధయాసముల్లసితం
కథయ కథయ కిమిహ కామయ కలయ కామం

2. భ్రమర భ్రామ్య మకరందసంభృతేషు
పావనగోవింద పదచిహ్నితేషు
కమనీయమధురా కాంతారపాదపేషు
కిమపి మాధవవృత్తం కేన వారదణీయ మిహ

3. అల మసితసఖ్యేన స్మితభాషణే నాలం
చల చంచలస్వభావ చంచరీక
పరికలయ మాధవం బహు ధామరగీతం
వరనారాయణతీర్థ వరదం విజయగోపాలం

ప॥ మధుపా!=హేభ్రమరమా!
అధునా=ఇప్పుడు;త్వాం=నిన్ను; మాధవీయందూతం=శ్రీకృష్ణస్వామివారి దూతగా; మన్యే=తలచుచున్నాము.

అ॥ మధురాపుర=మధురాపట్టణమందు; నారీ వదనాంబుజ=స్త్రీలముఖకమలముల యందలి; మకరందం=అమృతమును; ఆకలయ=సేవించుమా!(పానముచేయుమా!) మాయాహి=ఇక్కడికి రావద్దు; యాహి యాహి=వెళ్ళుమా వెళ్ళుమా.

1. మధుపా! = హే భ్రమరమా! మధుపూరితం= మకరందముతోనిండియుండు; మాధురీ వదనకమలం = మధురాపుర స్త్రీలయొక్క ముఖ కమలము;మాధవభాస్కర= శ్రీకృష్ణస్వామివారు అనునట్టి సూర్యునియొక్క;మహిత కరకలితం= ప్రసిద్ధమైన కిరణములతో కూడుకున్నదియై; అధునా=ఇప్పుడు;యాదవ కరుణాసుధయా సముల్లసితం= యదువంశస్థుడైనట్టి,స్వామివారి కరుణ అనునట్టి, అమృతముచేత బాగా ఉల్లాసకరమైనదిగా వున్నది; కామయకలయ = బాగాసేవించుమా! కిమిహకామయ?=నీవుఏమి కోరెదవు? కథయకథయ = చెపుమా! చెపుమా!.

!.	భ్రమరా! = హే భ్రమరా!
మకరంద సంభృతేషు= మకరందముతో నిండియుండెడు, పావన గోవింద పద చిహ్నితేషు = పావన మైనట్టి స్వామివారి యొక్క పద చిహ్నములయందు ( అడుగు జాడలయందు), కమనీయ= మనోహరమైన; మధురా= మధురాపుర సమీపమునందుండునట్టి; కాంతార=ఉద్యాన వనసంబంధమైన; పాదపేషు = చెట్లయందు; భ్రమయ=సంచరించుమా, ఇహ=ఇక్కడ; మాధవ వృత్తం= స్వామివారి వృత్తాంతమును, కిమపి= ఎంతమాత్రమున్నూ. కేనవా=ఎవరిచేత; ఆదరణీయం = ఆదరించబడతగినది (ఇక్కడ ఎవరు వినేవారు లేరు) అని అర్థం.

3.	అసిత సంఖ్యేన అలం = నల్లవానితో సఖ్యమున్నూ చాలును; స్మితభాషణేన= చిరునవ్వు మాటలున్నూ; అలం= చాలును; చంచల స్వభావ=చపల స్వభావముకలిగినట్టి; చంచరీక!= హే భ్రమరమా! చల = కదలి వెళ్ళుమా! బహుధా అమరగీతం=అనేకవిధములుగా దేవతలచేతగానము చెయబడుచున్నట్టిన్నీ, వరనారాయణతీర్థ=శ్రేష్ఠమైన నారాయణ తీర్థులకు; వరం=వరమునుయిచ్చునట్టన్ని విజయ గోపాలం= విజయగోపాలుడైనటువంటి; మాధవం = శ్రీకృష్ణస్వామివారిని! పరికలయ = బాగా సేవించుమా!.

ప.	ఓతుమ్మెదా! నీవు శ్రీకృష్ణుని దూతవని తలంచుచున్నాము.

అ.	నీ విటకు రాకుము. మధురాపురవాసు లగుస్త్రీలవదనకమలమకరందము నాస్వాదింపుము. పొమ్ము. "వారికడ దూత్యమును జేయుము. మాకడకు రావలదు" అనుట)

1.	ఓభ్రమరమా! మధురాపుస్త్రీల ముఖకమలములు స్వభావముగనే మకరందముతో నిండియుండును. (మనోహరముగానుండు ననియు, మద్యముతో నిండియుండునని భావము) ఇపుడు శ్రీకృష్ణుఁ డనునూర్యునికిరణములు సోఁకుటచే వింగులఁ బ్రకాశించుచున్నవి. ఆయదుకుంజరునిదయామృతముచే పెంపఁబడుచు, మిగుల నభివృద్ధినొందుచున్నవి. నీవు యథేష్టముగ నాపద్మములందు విహరింపవచ్చును. ఇట్లుండ నీకిటకు రానేమిపని? చెప్పుము.

2.	శ్రీకృష్ణుఁడు సర్వోత్తముఁడని చెప్పవచ్చితివేమో, ఆయన చేయుపనులిచట నెవరికిఁ దెలియవు? ఆయన నాదరించువారెవరు నిటలేరు. నీకా యనయందు భక్తిఁగలిగినచో మథురాపురోద్యానములయందు సంచరించుము. అచటిపుష్పములు అధికము లగుపూదేనియలతో నిండియుండును. శ్రీకృష్ణుఁడును సర్వకాలములయందు నచటనే విహరించుచుండును.

3.	ఓభ్రమరమా! నీవు చపలస్వభావము గలదానవు. నల్లనిదానవు. (అధర్మము నలుపని వర్ణించు సంప్రదాయము కలదు కావున "నీ వధర్మాత్ముఁడవు. లేక అపరిశుద్ధుఁడవు" అని భావము) నీతో మాకు స్నేహ మక్కఱలేదు (లేక) నల్లనివాఁడగు శ్రీకృష్ణునితో మాకు స్నేహ మక్కఱలేదు. చిఱునగవులనగుచు నేవేమెవో చెప్పవచ్చుచున్నావు. నీమాటలఁజాలింపుము. నారాయణతీర్థునకు వరము లొసంగుచు, దేవతలచే వినుతింపఁబడుచున్న యా విజయగోపాలునియద్ద కుఁబోయి యథేచ్ఛముగ విహరించుము.

శ్లో. శ్రుత్వా తద్గోపికాగీతం శ్రావ్యం శ్రుతిమనోహరం,
తత్త్వమావేదయన్ గోపీః ప్రత్యాహోద్ధవ ఉత్సుకః.

శ్లో.7. ప్రతి+ఆహ+ఉద్ధవః+ఉత్సుకం (ప్రత్యాహోద్ధవ ఉత్సుకః); ఉద్ధవః=ఉద్ధవులవారు;శ్రావ్యం=శ్రవణ యోగ్యమైనటువంటి;తద్గోపికాగీతం=ఆ గోపికల వాక్యములను; శృత్వా = విన్నటువంటివారై; ఉత్సుకః = సంతోషముగలవారై; శృతిమనోహరం = ఉపనిషత్తుల యొక్కఅంతరార్ధరూపమైన; తత్వ = పరతత్వమును; ఆవేదయన్ =తెలియజేయుచు; గోపీఃప్రతి=గోపికా అమ్మవార్లను గూర్చి ;ఆహ = పలికెను.

ఇట్లు వీనుల కింపుగలుగ గోపికలు చెప్పినవాక్యములను విని యా యుద్ధవుండును శ్రీకృష్ణుని యథార్థస్వరూపము నెఱింగించుచు వారలతో నిట్లనియె.

రేగుప్తి (మోహన) రాగము - ఆటతాళము

| | | |
|---|---|---|
| ప. | గోపీజనగోమధ్యచరంతం | గోపాలం విద్ధి గోపాలం |
| 1. | అంతరంగే సతతం భాంతం | ఆదిమధ్యాంతవసంతం |
| | సంతతం సత్సు చరంతం | సత్య మేకాంతం |
| | అంతరే యోగివిచింత్యం | అనుపమసకలాగమాంతం |
| | హంత దురంతసంసారబంధ | హంతారం విహరంతం |
| 2. | సంయోగవియోగవిహీనం | సాధుమానసజీవనం |
| | మాయోపాధివిదళనం | మానసాననం |
| | కాయక్లేశాదివిహీనం | కారణమానవజన్మానం |
| | భూయోభూయోవిచార్యైనం | భూమానంభూరిమహిమానం |
| 3. | బుద్ధివికల్పిత భేదా భేదం | బోధబాధితసర్వఖేదం |
| | సిద్ధసంభావితసిద్ధిదం | శ్రితజనబర్హి వారిదం |
| | బుద్ధముక్తసిద్ధవేద | బోధితానందమోదం |
| | సిద్ధనారాయణతీర్థ | సేవితశ్రీపాదం |

*-:3వ- కీర్తన. రేగుప్తిరాగము:-*

గోపీజన = గోపీ జనుల యొక్కయున్నూ; గో = గోవుల యొక్కయున్నూ; మధ్య = మధ్యప్రదేశమునందు; చరంతం = సంచరిచుచుండునటువంటి; గోపాలం = శ్రీకృష్ణస్వామివారిని; గోపాలం = అనగా; గాం = భూమిని;గాం = ఇంద్రియములను; గా=దేవతలును; గా = వేదములను;పాలం = పాలించువానిగా; విద్ధి = తెలునుకొనవలసినది; అంతరంగే =

అంతరాత్మయందు (మనస్సునందు); నతతం = ఎల్లప్పుడున్నూ; భాంతం = ప్రకాశించుచున్నటువంటిన్నీ; ఆదిమధ్య అంత = సృష్టియొక్క ఆది-మధ్య-అంతమునందు;వసంతం = ఉండునటువంటివాడున్నూ; సంతతం = ఎల్లప్పుడున్నూ; చరంతం = సంచరించుచువాడున్నూ; సత్యం = (నిర్వికారం) వికారరహితమైనది.(మార్పులేనిది)అనగా పరబ్రహ్మం; ఏకాంతం = ముఖ్యమైనటువంటి పర్యవసానముగా నుండు; అంతరే = మనస్సులయందు; యోగీ = యోగులచేత, విచింత్యం = బాగాచింతింపబడుచుండువారున్నూ; అనుపమ = అసమానమైనటువంటి; సకలాగమాంతం = సమస్తవేదముల అంత్యభాగమైన ఉపనిషత్తుల వల్ల తెలియబడుచుండు వారున్నూ; హంత = ఆశ్చర్యము; దురంత = అంతములేని;సంసారబంధ = జననమరణ రూపమైనటువంటి సంసారబంధము నుంచి; హంతారం= పోగొట్టువాడున్నూ;విహరంతం= విహరించుచున్నటువంటి వారున్నూ-అగు;గోపాలం = శ్రీకృష్ణస్వామివారిని;విద్ధి=తెలియుము; సంయోగ=కూడికయున్నూ; వియోగ=ఎడబాటున్నూ(ఈ రెండున్నూ) విహీనం= లేనివాడున్నూ; సాధుమానసజీవనం = సత్పురుషులను ఉజ్జీవింప చేయువాడున్నూ; మా యోపాధి విదళనం = మాయారూపమైన ఉపాధిని కొట్టివేయువాడున్నూ; మానస ఆననం = మనస్సులే ఆననముగా గలవాడున్నూ; కాయక్లేశాది విహీనం = జన్మ,వ్యాధి,జరా,విపత్తి,మరణములు లేని వారున్నూ; (భూయో భూయో విచార్యైనం)- భూయః భూయః = మాటిమాటికిన్నీ; ఏనం=ఈ స్వామి వారిని; భూమానం = భూమస్వరూపునిగానున్నూ; భూరిమహిమానం = అతిశయమహిమ కలిగినటువంటి స్వామివారిని; విచారయ = విచారించుమా (అట్టిగోపాలం) గోపాలుని; విద్ధి = తెలియుము.

బుద్ధివికల్పిత భేదాభేదం = బుద్ధియొక్క వికారముచేత భేదము అభేదములు గా గోచరించువారున్నూ; బోధ బాధిత సర్వఖేదం = జ్ఞానమును యిచ్చుట ద్వారా సమస్త దుఃఖములను హరించువారున్నూ; సిద్ధసంభావిత సిద్ధిదం= సిద్ధులచేత కోరబడుచుండు అణిమాది సిద్ధులను యిచ్చువాడున్నూ; శ్రితజనబర్హి=భక్తజనులు అను నెమళ్ళకు; వారిదం = మేఘముల వంటి వారున్నూ; బద్ధ = భవపాశబద్ధులకున్నూ; ముక్త=ముక్తపురుషులకున్నూ; సిద్ధ= అస్పృష్ట సంసారగంధులకున్నూ(అనగా అనంత,గరుడ, విష్వక్సేనాదులు జన్మ లేనివారు);వేద = వేదములద్వారాచ్ఛ బోధిత=బోధింపబడిన; ఆనంద మోదం = ఆనందము మోదముగలవారు(ఆనందమను సంతోషము); సిద్ధనారాయణతీర్థ = జ్ఞానసిద్ధుడైన నారాయణతీర్థుల వారిచేత; సేవిత = పూజింపబడుచుండు; శ్రీపాదం = సంపద్యుక్త మైన పాదారవిందములు గలవాడున్నూ- అగునట్టి;గోపాలం=గోపాలుని; విద్ధి = తెలియుము.

ప. గోపికాజనుల నడుమను, గోసమూహముల మధ్యప్రదేశమునను విహరించుచుండిన యాగోపాలుఁడు ఈసకలభూలోకమునకు పరిపాలించుటకు వచ్చిన వేదవేద్యుఁడని యెఱుంగు (ఁడు) ము.

1. ఈప్రపంచమునకు ఆదియు, మధ్యమును, అంతమును ఈ మహాత్ముండే. సకలజనులమానసములందును సాక్షిస్వరూపముతోఁ బ్రకాశించుచు సత్తామాత్రస్వరూపుఁడై, అద్వితీయుఁడై, వేదాంతవాక్యములచే బాగుగ సిద్ధాంతము చేయఁబడి యోగిజనులచే జీవాభిన్నస్వరూపముతో ధ్యానింపఁబడుచు, ఆశ్రితులసంసారబంధముల ద్రుంచివైచుచు, విహరించు సాధుజన పక్షపాతి యాయనయే.

2. ఏవస్తువులతోఁగాని సంబంధపడుటయును, సంబంధపడకుండుటయు, నీమహాత్మునకు లేవు. ఈ సర్వవ్యాపకుఁడు సకల జనుల మనసునందు నున్నాఁడు. శరీరము, అజ్ఞానము మొదలగు పంచక్లేశములు (అవిద్య, అహంకారము, రాగము, ద్వేషము, ఇది నాదియని యభిమానించుట అను నీయైదును క్లేశము లనఁబడును) లేనివాఁడైనను, సత్పురుషులగువారి మాయాబంధములఁ దొలగించి యుద్ధరించుటకై, వారి మనసులకానందము గలిగించుటకై ఆమహాత్ముఁడు మాయామానుషరూపమును దాల్చియున్నాఁడు. కాని సామాన్యమనుష్యుఁడుకాఁడు. కావున నోగోపికలారా! మీ రాపురుషోత్తముని యద్భుత ప్రభావమును బాగుగ విచారించి? ఆయనను నారాయణునిఁగాఁ దెలిసికొనుఁడు.

3. ఆపురుషోత్తముఁడు జీవునికంటె భిన్నుఁడని కొందఱును, కాఁడని కొందఱును, తమతమబుద్ధి ననుసరించి కల్పించుచున్నారు. యథార్థమును విచారించిన నాయన కీభేదాభేదములు రెండును లేవు. నిత్య ముక్తస్వరూపుఁడు, జ్ఞానాత్ముఁడు, స్వతస్సిద్ధుఁడు, సర్వకాలములయందు నొకటే విధమగున్వభావముతో నుండువాఁడు. ఈ విషయమునంతయును వేదము స్పష్టముగ బోధించుచున్నది. ఆ పరమానందస్వరూపుని బాగుగ నెఱింగిన సకలదుఃఖములును శాంతినొందును. ఆశ్రితజనులనెడుమయూరములకు మేఘమువంటివాఁడని యెఱింగియే, అణిమాదిసిద్ధులు గలమహానుభావులు అవ్విభుని తమచిత్తముల ధ్యానించుచు తదనుగ్రహమువలన నిష్టసిద్ధులఁ బొందుచున్నారు. నారాయణతీర్థుఁడును అమ్మహాత్మునిపాదముల సేవించి మోక్షమొందెను.

శ్లో. విగళితభయశోకా విద్యయా లబ్ధతత్త్వాః
కథమపి పరతత్త్వే స్థాపయిత్వా మనాంసి,
ముహురపి పరభక్త్యా విశ్వవంద్యే ముకుందే
మధుకరపరిక్లుప్తం తం ప్రతి ప్రాహురిత్థమ్. 9

శ్లో.9. విగళితభయశోకా = పోగొట్టబడినభయశోకాదులు గల వారై(అనగా భయ శోకాదులు లేనివారై), విద్యయాలబ్ధతత్త్వా = పొందబడిన తత్త్వవిద్యగలవారై; కథమపి = ఏదోవిధముగా; మనాంసి=మనస్సులను; పరతత్త్వే = పరతత్త్వమునందు;స్థాపయిత్వా =నిలపినవారై; ముహురపి = మాటి మాటికి;విశ్వవంద్యే = లోకపూజ్యుడైన;ముకుందే = సామివారియందువుండు; పరభక్త్యా

= శ్రేష్ఠమైన భక్తిచేత; మధుకరపరి క్లుప్తం = తుమ్మెదగా అన్వయించబడినట్టి; తం, ప్రతి = ఆ ఉద్ధవుల వారిని గూర్చి;ఇర్థం=ఈ క్రింద చెప్పబోవువిధముగా; ప్రాహుః=పలికిరి.

ఇట్లు ఉద్ధవుఁడు చెప్పిన వాక్యములను విని జ్ఞానమునొంది కృష్ణుని యధార్థత్త్వమును స్మరణకుం దెచ్చుకొని యాగోపికలు తమకుఁ గలిగిన భయమును, పరితాపమును వదలి యెట్లెట్లో మనసులను పరమాత్మునియందు నిలిపిరి. త్రిలోకవంద్యుఁ డగునారాయణునియం దధికమగు భక్తిగలవారలగుటచే న య్యుద్ధవునిఁజూచి మునుపటివలె తుమ్మెదపై మిషఁబెట్టి యిట్లనిరి.

ధన్యాసిరాగము - త్రిపుటతాళము

ప. కిము రాజతే రాజసదసి

అ. కుముదగణేషు కోటికోటిసంఖ్యాకేషు
కుముదబంధు రివ కోటి మదన ఇవ

1. మధుపకులవతంస కథయ మధుమాధవచరితమిహ
మధుకరాచారరసికో ధమాధవో విజయతే
కథ మపి కదా కింస్మరతి న స్సదసి రహసి
కిము కుశలీ వనమాలీ సుగుణశాలీ

2. స్మరతి కి మథ బృందావనభువి
పరమరహసి నిశిముదా పరయా యత్సుకృతం
సరళమురళీరవసుధయా సమాకృష్ణ
సురవనితాగణసరససంగీత మిహ

3. కతి కతి సంతి న కలహంసగతయః
తత్పరిచర్యావిధానైకకుశలాః
త దిహ న స్మర తీతి సాధు విదిత మిహ
త దల మసితసంగవార్తయా విఫలయా

4. మధురానగరీనారీమధురసంగీతరసికే
మాధవే వసతి మధురాయాం మధురం
వందిమాగధై రధికం గీయతే గీతం జయ హే
గోపికాజార గోపీనాథేతి న హి కిం

5. సృతపంచదశకలాచంద్ర ఇవ జీవాయో
ధ్రువకలయా వయ మధునా
ఇతి మధుసూదనం వద యాహి మాధవం
ప్రతి నారాయణతీర్థ ప్రత్యగాత్మాన మసితం

## 4వ-కీర్తన- ధన్యాసిరాగం-త్రిపుటతాళము

పః కోటికోటి సంఖ్యాకేషు = కోట్లకొలది సంఖ్యగల; కుముదగణేషు = కలువల సమూహములందు;కుద బంధురిన = చంద్రునివలె; కోటిమదనఇవ= కోటిమన్మధుల సౌందర్యరూపుడై; రాజసదసి = రాజసభలయందు (స్వామివారు); కిమురాజతే = ప్రకాశించుచున్నారుగదా!

1. వనమాలి = తులసిమాలను ధరించినటువంటి వారున్నూ; సుగుణశాలి = సద్గుణవంతుడున్నూ (అగుశ్రీకృష్ణుడు); కిము కుశలి? = క్షేమముగా నున్నాడా?; అధ = ఇదిగాక; మధుకరా చార రసికో = తేనె టీగల నడవడి స్వారస్యమును లెలిసినటువంటి; మాధవ = స్వామివారు; విజయతే = సర్వోత్కర్షముగా వర్తించుచున్నారా?; కధమపి=ఏదోవిధముగా; సదసి = సభలయందు; రహసి= ఏకాంతమునందు; కదాకింస్మరతి=ఎప్పుడైనా స్మరించునా?; మధుకుల వతంసం = మధుకర శ్రేష్ఠమా! ఇహ = ఇక్కడ; మాధవ చరితం = శ్రీకృష్ణుని చరిత్రము అను; మధు = మకరందమును; కధయా = చెప్పుమా!

2. అధ = అనంతరమందు; బృందావనభువి= బృందావనభూమియందు;నిశి=రాత్రి సమయమందు, రహశి= ఏకాంతముగా; పరయా ముద= శ్రేష్ఠమైన సంతోషముచేత; యత్ = ఏదైతే; సు= లెస్సగా; కృతం=చేయబడెనో; యంత్సుకృతం=ఏరాసక్రీడ చేయబడినదో; సరళ=ఒప్పుచున్నటువంటి;మురళీరవ= వేణుగానధ్వని-అను; సుధయా= గానామృతముచేత; సమకృష్ణ=ఆకర్షించబడినటువంటి; సురవనితాగణ= రసయుక్తజన సంగీతములు(జరిగిన దానిని) ; ఇహ= ఇక్కడ; స్మరతికిం= స్మరించునా?; రాజసదశి = రాజసభలయందు(స్వామివారు); కిమురాజతే = ప్రకాశించురున్నారు గదా?.

3. తత్ పరి చర్య = ఆస్వామివారిసేవ చేయునట్టి; విధాన = ఏర్పాటులయందు; ఏక = ముఖ్యమైన; కుశలాః= నేర్పుగలిగినట్టి; కలహంస గతయః = హంసనడకలుగలస్త్రీలు; కతికతి = ఎంద రెందరో; నసంతి?=లేకుండావున్నారు? (అనేకమంది వున్నారనుట); తత్ = అకారణము వల్ల; ఇహ=ఇక్కడవుండునట్టి; నః= మమ్ములను; నస్మరతి ఇతి= స్వామివారు స్మరించరని, సాధు విదితం=బాగా తెలిసియే యున్నది; తతు= ఆ కారణము వలన; అశిత= (నల్లనివాడు) స్వామివారి యొక్క; సంగ= సంయోగ విషయమైన;విఫలయా వార్తయా= వ్యర్ధమైన సమాచారము ప్రసంగించుట;అలం=చాలును.

4. మధురానగరి= మదురా పట్టణ సంబంధమైన; నారీ=స్త్రీలయొక్క; మధుర సంగీత = మధుర మైన సంగీతమునందు;రసికే= రసగ్రాహియైన;మాధవే=స్వామివారు; మధురాయాం = మధురయందు; వసతి= వేంచేసియుండగా;వంది మాగధైః=వంది మాగధుల చేత; హే గోపికాజారా!= ఓ గోపీమనోహరా!; హే గోపీ నాథా!=ఓ గోపికల ప్రభూ!; జయఇతి = సర్వోత్కర్షముగా వర్తింపుమని; మధురం=మధురముగా; అధికం=విశేషముగా; న గీతం హి కిం?=గానముచేయబడు చుండుట లేదా?

5. అధునా = ఇప్పుడు; వయం =మేము; స్మృత పంచదశకళా= పదిహేను కళలు క్షీణించినట్టి; చంద్రుడు=చంద్రః; ధృవ కళయా ఇవ=మిగిలిన స్థిరమైన ఒక కళతో జీవించినట్లు; వయం జీవావెూ=యేంవేంన్నూ కొనవూపిరితో నున్నాము; ఇతి= ఇట్లని; మాధవం మధుసూదనం=లక్ష్మీభర్తయున్నూ మధువిరోధిన్నీ - అగునట్టిన్నీ; నారాయణ తీర్థ ప్రత్యగాత్మానం= నారాయణ తీర్థుల యొక్క జీవాత్మకు అంతర్యామి అయినట్టిన్నీ; అశితం=(నల్లవాడైన) స్వామినిగూర్చి; యాహి= వెళ్ళుమా; వద= మాస్థితిని చెప్పుమా.

ప-అ. అనేకకోట్ల సంఖ్యలుగలకలువలలో చంద్రునివలె, కోటిమన్మధుల సముదాయమువలె నా శ్రీకృష్ణుఁడు రాజసభయందు ప్రకాశించుచున్నాఁడా?

1. సద్గుణవంతుఁ డగునా తులసీమాలాభూషణుఁడు, శ్రీకృష్ణుఁడు క్షేమముగనున్నాఁడా? మధురానగరమునందలిభామినుల యధరమకరందము నాస్వాదించుచు, భ్రమరముంబోలె విహరించుచున్నాడా? సభయందుగాని, యేకాంతమునఁగాని, మమ్మెపుడైన స్మరించునా? ఓమధుకరశ్రేష్ఠమా! యీ విషయముల నెల్ల మాకుం జెప్పుము.

2. నాఁటి రాత్రి బృందావనమునం దేకాంతమున చేసినవేణుగానము, రాసక్రీడయు, నెపుడైన స్మరించునా? ఆసంగీతమును విని దేవతాస్త్రీలుగూడ నపుడవ్విభునిఁ జూడవచ్చిరి.

3. ఆయనకు మేమెట్లు జ్ఞాపకమునకువత్తుము. ఆ మధురాపురమున నాయనకు సేవఁజేయుటకు కలహంసగమన లెందఱోయున్నారు. కావున మమ్ముంగూర్చి యాయన యొకప్పుడైనను తలంపఁ డనుట నిశ్చయము. ఇఁక నాయననుగూర్చిన వృత్తాంతము (లేక ప్రశంస) మాకేల?

4. అయిన నొక్కటి యడిగెదము. అకృష్ణుఁ డిప్పుడు మధురాపురమునందలి స్త్రీలగానమునకు కానందించుచు, మమ్ము మఱచి యవ్వూరమున నివసించిన నివసించుగాక. వందిమాగధులైనను "ఓగోపికాజారా! గోపీనాథా! నీవు విజయము నొందుము" అని గానములఁ జేయుటలేదా?

5. మేము, పదునేనుకళలును క్షీణింప నొకకళతో నిలిచియుండు చంద్రునివలె జీవమాత్రావశేషులమై యున్నాము. (పరబ్రహ్మరూపుఁడు గావున నాజీవుఁ డొక్కఁడుమాత్రము నశింపక మిగిలియున్నాఁడనుట) నారాయణతీర్థునిచే జీవరూపముగ ధ్యానింపఁబడుచున్న ('తత్త్వమసి' అని ధ్యానింపఁబడుచున్నదనుట.) నీలవర్ణుఁ డగునాశ్రీకృష్ణునియొద్దకుఁ బోయి యీవృత్తాంతమును జెప్పుము.

శ్లో. దత్తోత్తరస్సమాధాయ గోపీబృందం స చోద్ధవః,
పునర్వివేశ మధురానగరీం హరిమందిరమ్. 10

శ్లో.10. స,చ,ఉద్ధవః = ఆ ఉద్ధవులవారు అయితేనో; గోపీ బృందం= గోపికాసమూహములను; దత్తోత్తరః (దత్త+ఉత్తరః)=ఇవ్వబడిన ఉత్తరములు గలవారై; సమాధాయ= సమాధాన పరచి; మధురా

నగరం=మధురా పట్టణమును గూర్చి;హరి మందిరం= స్వామివారియింటికి; పునః = తిరిగి, వివేశ = ప్రవేసించిరి.

ఇట్లు గోపికలు చెప్పుచున్న వాక్యములను విని, వారికి సమయోచితములగునుత్తరములనిచ్చి వీడ్కొని, యాయుద్ధవుఁడు మరలి మధురానగరమునకు వచ్చి శ్రీకృష్ణుని గృహమునకుఁ బోయెను.

ఉద్ధవుఁడు గోపికలమాటలఁ గృష్ణున కెఱింగించుట

శ్లో. మధురిపుం మధురాపురనాయకం
సమధిగమ్య సచోద్ధననామకః,
రహసి గోపవధూపరిభాషితం
మధురమాహ మనోభవరూషితమ్. 11

శ్లో.11. నచ ఉద్ధవ నామకః = ఆ,ఉద్ధవుడు- అను పేరుగల భక్తుడు, మధురాపురనాయకం=మధురా పట్టణమునకు ప్రభువు అయినటువంటి; మధురిపుం=స్వామివారిని గూర్చి; సమధిగమ్య=సమావేశమైనవారై;రహశి=ఏకాంతమునందు; మనో భవ రూషితం= మనస్సులో ఉత్పత్తి అయిన అనురాగముద్వారా నిష్ఠురముగా; గోపవధూపరిభాషితం=గోపికలచేత పలుకబడినటు వంటి; మధురం= మధుర వాక్యములను; ఆహ=పలికెను.

అంత నేకాంతమున నాకృష్ణునితోఁ గలిసి, గోపికలు కామోద్రేకమున తనతో నేకాంతమున చెప్పినమాటల నన్నిటి నుద్ధవుఁడు మధుర మగురీతి నాయనకు విన్నవించెను.

తాత్పర్యము : అంతనే కాంతమున నాకృష్ణునితో గలిసి, గోపికలు కామోద్రేకమున తనతోనే కాంతమున చెప్పిన మాటలనన్నిటి నుద్ధవుడు మధురమగురీతి నాయనకు విన్నవించెను.

కాంభోజీరాగము ఆదితాళము

ప. ఇతి వదతిహి గోపీ-గోపాలకృష్ణఇతివదతిహి

అ. నతయోనుతయఃస్మృతయఃకృతయః ప్రతిపదమస్మాభిస్త్వయి

1. మధురం మధురానగరీనారీ - మధురంగాయతి మధుసూదనతే
అధునామాధవతవకియదస్మత్ - కృతిభిర్నుతిభిర్నతిభిః స్మృతిభిః

2. నందముకుందం పరమానందం - మందస్మేరసుధావదనేందుం సంతం
బృందావనభువిసంతంవందే - స్మారం, స్మారంవారంవారం

3. శ్రుతయస్మృ తయఃకథయంతిత్వాం - సుధియః స్వాంతఃకరణే
తదపి మనో మే నందకిశోరం - స్మరతిహియువతీకరిణీకలభం

4. మణినాయకమణిరపిపరమధునా- గుణయోగేసతి కాచమణీనాం
మరకతమణిరపి మధ్యేఘటితో - గణనీయః కిం నహి కాచేషు

5. ఇతి గోపీజనకధితం ప్రధితం - నిజజనకధితం విదితం హరిణా
యతినారాయణతీర్థ గ్రథితం - గురుపరకరుణాభరితం గీతమ్.

5వ-కీర్తన-కాంభోజరాంగం-ఆదితాళము

ప॥ గోపాలకృష్ణా!=హేగోపాలకృష్ణుడా!; గోపీ=గోపికాఅమ్మవారు ఇతి = ఈ క్రింద చెప్పబోవు విధముగా; వదతిహి=చెప్పిరి గదా!.

అ॥ నతయః = నమస్కారములున్నూ; నుతయః = స్తోత్రములున్నూ; స్మృతయః = స్మరణలున్నూ; కృతయః = కర్మలున్నూ; ప్రతిపదం = అవి అప్పటికప్పుడే; అస్మాభిః = మాచేత; త్వయి = మీయందు; విహితాః = అర్పించ బడుచున్నవి. ( ఇతి వదతి గోపీ)-

1. హే మధుసూదనా! = హేకృష్ణా!; మధురా నగరీ నారీ = మదురా పురాపురస్త్రీలు ( జా త్యేకవచనం); తే= మిమ్ములను గురించి; మధురం= మధురముగా; గాయతి = గానముచేయుచుండగా; అధునా= ఇప్పుడు; మాధవా!=హే కృష్ణా!; అస్మత్ = మా యొక్క; కృతిభిః = పనులతోనున్నూ, నతిభిః = నమస్కారములతోనున్నూ; నుతిభిః = స్తోత్రములతోనున్నూ;స్మృతిభిః = స్మరణతోనున్నూ; తవకియత్ = మీకేమిఅవసరము?(ఇతివదతిః గోపీ).

2. మందస్మేర=చిరునగవుతో; సుధా = అమృతముతోకూడియున్నట్టి; వదనేందుం=చంద్రునివంటి ముఖము గలవారున్నూ; పరమానందం=శ్రేష్ఠమైన ఆనంద స్వరూపుడువ్నూ( అగు); నందముకుందం=నందయోగికి ముక్తినియిచ్చువాడున్నూ; బృందావనభువి = బృందావన ప్రదేశమునందు; సంతం = వేంచేసివున్నట్టిన్నీ (శ్రీ కృష్ణస్వామివారిని); వారం వారం = మాటి మాటికి; స్మారం స్మారం = స్మరించిన వారమై, వందే= నమస్కరించుచున్నామని(ఇతి వదతిః గోపీ).

3. శ్రుతః = శృతులున్నూ; స్మృతయః = ధర్మశాస్త్రములున్నూ; సుధీయః= విద్వాంసులున్నూ; త్వాం=మిమ్ములను; స్వాంతః=కరణే = స్వకీయ చిత్తములందే; సతం = ఉన్నవానిగా ; కధయంతి = చెప్పుచున్నారు ; తదపి = అట్లాచెప్పుచున్నను; మేమనః = మానస్సులు ; యువతీకరిణి = స్త్రీలను ఆడ ఏనుగులకు ; కలభం = గున్న ఏనుగు (మగ ఏనుగు) అని చెప్పబడతగినట్టి ; నందకిశోరం = నందపుత్రుడైన శ్రీకృష్ణ స్వామివారి) ; స్మరతి = స్మరించుచున్నారు - (అని) ; ఇతి వదతిః = గోపి = ఈ ప్రకారం గోపికలు చెప్పినారు; అధునా = ఇప్పుడు; మణి = మణిరూపమైన ; నాయకమణి = మణులలో శ్రేష్ఠమైన మరకతము ; కాంచమణీనాంగుణయోగే సతిరపి = గాజు మణులదండలలో చేర్చబడిన నప్పటికి ; వరం = శ్రేష్ఠముగానే యెంచబడును. కాచేఘ మధ్యేఘటితో = గాజు మణులదండలలో చేర్చబడిన ; మరకత మణిరపి = మరకతమణిగూడా ; కింనహి గణణీయః = గణణీయముగదా! (గణనీయమే) - అనుట;

5. ఇతి = ఈ విధముగా; గోపిజన కధితం = గోపికలచేత చెప్పబడినది! ప్రథితం = ప్రసిద్ధిమైనది నిజజనకధితం = తన స్వకీయమైన గోపికలచేత చెప్పబడినటువంటి సమాచారములను హరిణా = శ్రీకృష్ణస్వామివారివల్ల ; విదితం = తెలిసి కొనబడినది ; గురువరకరుణా భరితం = శ్రేష్ఠమైన గురువుగారి కరుణవల్ల ; యతి నారాయణ తీర్థ = యతి అయిన నారాయణ తీర్థులవారిచేత ; గ్రథితం = కూర్చబడినది ; గీతం = గానముచేయబడినది ; ఇతి వదతిః గోపీ = గోపికలు ఇలాచెప్పినారు ; నిత్యం = నిత్యములగు ; సిద్ధ = సిద్ధములుగా నుండిన ; ఆగమజ్ఞః అపిభగవాన్ = వేదములను ఉద్ధరించిన భగవంతుడు అయినప్పటికిన్నీ ; లోకశిక్షార్థం = లోకులకు ధర్మములను బోధించుటకై ; సబలంః = బలరామ సహితుడైన శ్రీకృష్ణస్వామివారు) విద్యార్థీ = విద్యనేర్చుకొనువారుగా ; సాందీపమునిం గురుం = సాందీపముని, అను గురువుగారి యొద్దకు ; అగమత్ = వెళ్ళిరి ;

ప. గోపాలకృష్ణా! గోపికలు నీతో నిట్లు విన్నవించుకొనుచున్నారు. ఈగీతమున గోపికలే (యెదుటనుండి చెప్పుచున్నట్లు వ్రాయఁబడియున్నదని తెలిసికొనవలయును. పల్లవిమాత్రము ఉద్ధవునివాక్యము)

అ. మేము (గోపికలు) అనేకవందనము లాచరించుచున్నాము. పలుమాఱు నినుం గొనియాడుచున్నాము. సర్వకాలములందును ధ్యానించుచున్నాము. సర్వకర్మలను నీకు సమర్పణముగా నాచరించుచున్నాము.

1. ఓమధుసూదనా! మిక్కిలి సుందరులగుమధురాపురస్త్రీలు మనోహరముగ నిన్ను గానముసేయుచున్నారు. ఇఁక మా నమస్కారముతోఁగాని, మాస్తోత్రముతోఁగాని, మాధ్యానముతోఁగాని, మాకార్యములతోఁగాని నీ కేమి పని? మేముచేసిననెంత? చేయకున్న నెంత? నీచిత్తమన్యాయత్తమైనది.

2. అయినను, ఓపరమానందస్వరూపా! నందకుమారా! చిఱునగవుతో రాజిల్లునాననముతో, బృందావనమునందు విహరించుచున్న సమయమునందలి నీయాకారమును మాటిమాటికి స్మరించుచు, మేమువమాత్రము వినుతించుచునే యున్నాము. నమస్కరించుచునేయున్నాము.

3. ఓనందకుమారా! నీవు మనసునందేయున్నావని వేదములు, స్మృతులును చెప్పుచున్నవి. అనుభవజ్ఞులగు మహానుభావులు చెప్పుచునేయున్నారు, అయినను, మామనసుమాత్రము అట్లు తృప్తిఁ జెందియుండుటలేదు. మమ్ము (గోపికలను) ఆనందపఱచిన నీసుందరాకారమును సర్వకాలములయందును ధ్యానించుచునే యున్నది. (నిరాకారరూపమును విడచి నీలమేఘశ్యామలవర్ణమును, పీతాంబరము, కౌస్తుభము మొదలగుభూషణములు గలసాకారరూపమును మామనసు ధ్యానించుచున్నది అని భావము)

4. సామాన్య మగుపూసయైనను నాయకమణిగా నుపయోగింపఁబడునేని గౌరవమునొందును. హారములోలేకున్నను దానికిట్టి గౌరవముకలుగుచున్నదనిన నిఁక హారమునఁగూర్చబడిన మరకతమణికి గౌరవముకలుగదా? హారమునందున్నవి గాజుపూసలైన నగుఁగాక. కావున నోమహాత్మా! మేమెట్టివారలమైనను నిప్పటికిఁ బనికిరాకున్నను గౌరవపాత్రుఁడ వగునినుఁదలంచుటకూడఁ దప్పగునా? అంతమాత్రముకూడ మేము నోచుకొనలేదా.

5. ఇట్లు గోపికలుచెప్పిరని యుద్ధవునివలన శ్రీకృష్ణుఁడు తెలిసికొనియెను. గురుకరుణచే నారాయణతీర్థుఁడును ఈగీతమును రచించెను.

5వ - కీర్తన - నాదనామ క్రియ - ఆదితాలము

శ్లో. నిత్యసిద్ధాగమజ్ఞో పి భగవా న్సబలో గమత్,
విద్యార్థి లోకశిక్షార్థం సాందీపనిమునిం గురుమ్.

నిత్యం = నిత్యములగు; సిద్ధ = సిద్ధములుగానుండిన; ఆగమజ్ఞః అపి భగవాన్ = వేదములను ఎరిగించిన భగవంతుడు అయినప్పటికిన్నీ; లోకశిక్షార్థం = లోకులకు ధర్మములను బోధించుటకై; సబలః = బలరామసహితుడైన (శ్రీకృష్ణస్వామివారు); విద్యార్థి = విద్యనేర్చుకొనువారుగా; సాందీపమునిం గురుం = సాందీపముని అను గురువుగారి యొద్దకు; అగమత్ = వెళ్ళిరి.

అంతనాభగవంతుఁడు నిత్యములగు వేదములనెల్ల నెఱింగినవాఁడైనను, లోకములకు సదాచారములను నేర్పుటకై, (గురువునకు శుశ్రూష చేయు నాచారమును నేర్పుటకై) బలరామునితోఁగూడి సాందీపని మహాముని యొద్దకు విద్యార్థియై పోయెను.

రామకృష్ణులు సాందీపనియొద్ద విద్యాభ్యాసము సేయుట

*సాందీపనేరాగమనం గీయతే*

నాదనామక్రియారాగము - ఆదితాళము

నిష్పన్న వేదవిజ్ఞానో నిత్యం స్వాధ్యాయతత్పరః
శిష్యోపశిష్యసేవితో సాందీపని ర్విరాజతే

ప:- నిష్పన్నవేదవిజ్ఞానః = వేదాంత విషయమైనజ్ఞానము ; నిష్పన్న = ఉత్పత్తి అయినవారున్నూ (కలవారున్నూ) ; నిత్యం స్వాధ్యాయతత్పరః = ల్లప్పుడు వేదాంతమును మననము చేయువారున్నూ ; శిష్యోపశిష్యసేవితః = శిష్యులచేతను, ఉపశిష్యులచేతనున్నూ సేవింపబడువారున్నూ; సాందీపని = సాంధీపులవారు ; విరాజతే = ప్రకాశించుచున్నాడు ;

సకలవేదార్థతత్త్వముల నెఱింగి యెప్పుడును వేదాధ్యయనముఁజేయుచు శిష్యులతోను, ప్రశిష్యులతోను గూడియుండు సాందీపని యనునొకముని యవంతీపట్టణమునఁగలడు.

*అథ విద్యాగ్రహణమ్ -*

శ్లో. గృహీతవిద్యో భగవా్ బలరామసహాయవా్,
గురుం ప్రసాద్య విధినా సతస్థౌ బ్రహ్మచారిభిః. 13

శ్లో. 13. భగవాన్ = శ్రీ కృష్ణస్వామివారు ; బలరామ సహాయవాన్ = బలరామునితో గూడినవారై ; గృహీత విద్యః = గ్రహింపబడిన విద్యగల వారై( విద్యను గ్రహించినవారై) ; విధినా = విధ్యుక్తముగా

(శాస్త్రోక్త విధముచేత) ; గురుం ప్రసాద్య = ఆచార్యులను సంతోషపెట్టినవారై (పూజించినవారై); సః = అట్టి స్వామివారు; బ్రహ్మచారిభిః = బ్రహ్మచారులతో గూడా ; తస్థౌ = ఉండిరి

అసాందీపనిముని నాశ్రయించి, బలభద్రసహితుఁ డగునా శ్రీకృష్ణుఁడు బ్రహ్మచారులతోఁగూడి సకలవిద్యల నొక్కక్షణమాత్రమున గ్రహించెను. ఆ గురువునకును కోరినగురుదక్షిణ నొసంగి తృప్తిఁ గలిగించెను. (ప్రభాసతీర్థమున మృతిచెంది యమలోకమున నున్నగురుపుత్రుని మరల బ్రతికించి గురువునకు సమర్పించెను. ఇదియే కృష్ణుఁడు గురువునకిచ్చిన గుదక్షిణ.)

6 వ - కీర్తన - కేదారగౌళరాగము- ఆధితాళము

ప. కంసాసురసంహరణ కలయ కృష్ణ
సంసారసింధుతారణ

అ. పుంసామనన్యపురాణపురుషోత్తమ
హంసయతీశ్వరశంసితచరణ

1. పంచజనాసురపాటకకలితశ్రీ
పాంచజన్యదరపటుతరనాద
వాంఛితగురుపుత్ర జీవనకారణ
మంజుళమౌక్తికమాధవధృతవేద

2. వాచామగోచర వసుదేవతనయ
సదాచారపాలక దనుజాన్తక
హేచారుకమలవిలోచన భవపాశ
మోచన శతకోటిమన్మథమోహన

3. వారిజసంభవవందితపాదాబ్జ
భూరిదయారసభువననాథ
నారాయణతీర్థనతచరణాంబుజ
నానావిధలీలావినోద

ప. సంసార సింధుతారణ = సంసారమును తరింపజేయునట్టిన్నీ ; కంసా సురహరణ = కంసుని హరించి నట్టీన్నీ ; కృష్ణా = హే కృష్ణా ! కలయ = చూడుమా! (అనుగ్రహించుచూ!)

అ. పుంసాం = సమస్త జీవులకు ; అనన్య = విడువకుండా కూడా వుండునట్టి ; పురాణ పురుషోత్తమా! = ప్రళయ కాలమునందుగూడా వుంటూవచ్చిన హే స్వామి! ; (పురారా అస్థితః ) ; పురా = పూర్వం ; అస్థితః = ఉన్నవారు ; హంస = పరమహంసలచేతనున్నూ ; యతీశ్వర = యతీశ్వరులచేతనున్నూ ; శంశిత = ప్రశంస చేయబడుచుండు (కొనియాడబడుచుండు); చరణం = పాదములు గలవాడా ;

పంచజనాసుర = 'పంచజనుడు' - అనురాక్షసుని ; పాటన = నశింప జేయడంద్వారా ; కలిత = ఒప్పుచున్నటువంటి ; శ్రీ పాంచజన్య = సంపద్యుక్తమైన పాంచజన్య యనునట్టి; దర = శంఖముయొక్క ; పటుతరనాద = దృఢమైన నాదముగలవాడ; వాంఛిత = కోరబడినటువంటి ; గురుపుత్ర జీవనకారుణ = మృతి జెందిన గురువు త్రుని జీవింజ జేయుటకు హేతు భూతుడా; మంజుళమౌక్తిక = రమణీయమైపటువంటి ముత్యాలహారముగలుగల హెస్వావి! మధవా! = లక్ష్మీపతే! ధృతవేద! = వేదములనుదరించిందినవాడా! (విద్యను పొందినవాడా)

వాచామ గోచరా! = వేదవాక్కులకు గోచరించనివాడా! వసుదేవతనయా! = వసుదేవునికుమారుడా! సదా చారపాలకా = ఎల్లప్పుడు మంచి ఆచారమును పాలించువాడా; దనుజాంతకా ! = రాక్షసులను సంహరించువాడా ! హే చారుకమల విలోచనా ! = శృంగారమైన కమలములవంటి నేత్రములుగలవాడ; శతకోటి మన్మథమోహన! = నూరుకోట్ల మన్మధులను మోహింపజేయువాడ ;

వారిజనంభవ! = కమలభవుడైన బ్రహ్మ దేవుని చేత;వందిత పాదాబ్జ=ననకరింపబడు పాదారవిందులుగలవాడ; నానా విధ లీలా వినోద = అనేక లీలలతో వినోదించువాడా; భూరిధయారసముగలవాడ; భువననాథా=జగన్నాథా! నారాయణ తీర్థ = నారాయణ తీర్థుల వారిచేత; నతచరణాంభుజ=నుతింపబడు పాదారవిందములు గలవాడా; కంసానుర సంహరణా!=కంసుని సంహరించినవాడా!

ప. సంసారసముద్రమును దరింపఁజేయు నోకంసవైరీ! సకలశుభముల నొసంగును.

అ. జీవస్వరూపా! అనాదిపురుషా! పురుషోత్తమా! సకలయతులచేతను గీర్తింపఁబడుచున్న నీకంటె నీప్రజలకు వేఱొక్కదిక్కులేదు.

1. సకలవేదముల నుద్ధరించిన యోనారాయణా! ముక్తామణిభూషణా! సాందీపనిమహాముని ప్రభాసతీర్థమున మృతిచెందిన తనపుత్రునిఁ దెచ్చియిమ్మని నిన్నువేఁడెను. నీవును ప్రభాసతీర్థమునకుఁ బోయి యచట సముద్రునిచేఁ బూజింపఁబడి యాతనివలన గురుపుత్రవృత్తాంతమేమియుఁ దెలియకపోవుటచే జలమధ్యమునఁ బ్రవేశించితి. మఱియు సముద్రునిప్రేరణవలన నచటనున్న పంచజనాసురుని సంహరించి వానిగర్భమునందున్న పాంచజన్యమను శంఖమును గైకొంటివి. పిదప యమలోకమునకుఁ బోయి యచట నున్న గురుపుత్రునిఁదెచ్చి గురువునకు సమర్పించితివి.

2. శతకోటిమన్మథసమానా! కమలలోచనా! నీవు వాక్కున కతీతమగు (వర్ణించుటకు వీలులేని) నాకారముగలవాఁడవయ్యును, వసుదేవపుత్రుఁడవై జన్మించి రాక్షసుల మర్దించుచు ధర్మసంస్థాపనములఁ జేయుచున్నావు. సంసారబంధమును దొలగించుచున్నావు.

3. కరుణానముద్రుఁడవగు నోజగన్నాథా! నీలీలల్లు, నీవుసేయు వినోదములు అపరిమితములని చతుర్ముఖుఁడు ఎప్పుడును స్తుతించుచుండును. నారాయణతీర్థుఁడెప్పుడును నీపాదములకు నమస్కారము లొనర్చుచుండును.

శ్లో. జరాసంధస్య సైన్యాని హతాని హరిణా సకృత్,
నిహతః కాలయవనో ముచుకుందముఖాగ్నినా 14

శ్లో.14. హరిణా=శ్రీకృష్ణస్వామివారిచేత; జరాసంధస్య=జరాసంధుని యెక్క;సైన్యాని = సేనలు;అసకృత్ = అనేకమారులు; హతాని = చంపబడెను; కాలయవనః = కాలయవనుడు; ముచుకుందముఖాగ్నినా = ముచుకుందుల వారి ముఖాగ్నిచేత; నిహతః = చంపబడెను.(ఇట్లు కాలయవను వధజరిగెను).

ఇట్లు విద్యాభ్యాసమును ముగించి శ్రీకృష్ణుఁడు మధురకుఁ జనినపిదప కంసునిమామ యగుజరాసంధుఁడు మిగులరోషముతో నపరిమితములగు (ఇరువదిమూఁడు అక్షౌహిణీలు) సైన్యములఁ దీసికొని పదునాలుగుమారులు మధురపై దండయాత్రఁ జేసెను. శ్రీకృష్ణుఁడు వాఁడు యుద్ధమునకు వచ్చినప్పుడెల్ల వాని సైన్యముల నిశ్శేషముగ వధింపుచు వానినిమాత్రము విడిచిపెట్టుచుండెను. మఱియొకప్పుడు నారదప్రేరితుఁడై కాలయవనుండనువాడు తన మీఁదికి యుద్ధమునకురాఁగా. ముచుకుందుఁ డనురాజర్షి శయనించియున్న పర్వతగుహలోనికి వానిని మాయోపాయమునఁ గొనిపోయి తా నదృశ్యుఁడయ్యెను. ఆయవనుఁడును, నిదిరించుచున్న ముచుకుందునిఁజూచి, కృష్ణుఁడే తనకు భయపడి యిట్లు దొంగవేషము వేయుచున్నాఁడని తలంచి యాయనను పిడికిటం బొడిచెను. ఆప్రేటువలన మేల్కాంచి, రాజర్షి యుగ్రదృష్టితోఁ జూచుటయు, నాయవనుఁడు భస్మమయ్యెను.

శ్లో. చిరసుప్తోత్థితస్యాస్య ముచుకుందస్య పశ్యతః,
అనుగ్రహాయ భగవానావిర్భూతో గుహాంతరే. 15

శ్లో.15. చిరసుప్తోథిత స్యాస్య (చిరసుప్తః+ఉత్థితస్య+అస్య); చిరసుప్తో త్థితస్య = చిరకాలము నిద్రించి లేచినటువంటి;ముచుకుందస్య= ఈ ముచుకుందులు; పశ్యతః = చూచుచుండగనె, అస్య అనుగ్రహాయ= ఈయనకు అను గ్రహించుటకొఱకు;భగవాన్ = శ్రీకృష్ణస్వామివారు;గుహాంతరే = గుహాలోపలి భాగమునందు, అవిర్భూతః=ప్రసన్నుడదయెను(సాక్షాత్కరించెను).
చాలాకాలమునుండి నిదురించుచుండియు, ఇట్లు మేల్కొంచి యాముచుకుందుఁ డిటునటు చూచుచుండ నాతని ననుగ్రహించుటకై, శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించెను.

శ్లో ముచుకుందో పి తం దృష్ట్వా బంధహంతారమాత్మనః,
నృసింహపదసంలక్ష్యం ప్రణ స్తౌతి దివ్యదృక్. 16

శ్లో.16. ముచు కుందోపి(ముచుకుందః+అపి)=ముచుకుందుల వారుఅయితేవో; అత్మనః = తనయెక్క;బంధహంతారం = బంధములను నివర్తింపచేయునట్టి;తం = ఆ స్వామివారిని, దృష్ట్వా= చూచినటువంటి వారై;దివ్యదృక్ = దివ్యదృష్టిగలవారై;నృశింహ వదనం = నరసింహ

రూపముగాకనుబడిన స్వామివారి ముఖమును; లక్ష్యం = గుర్తించి(దృష్టినిలిపి);ప్రణమన్ = నమస్కారము చేయుచూ; స్తౌతి = స్తోత్రయుచేయుచున్నారు.

అముచుకుందుఁడును దివ్యదృష్టిగలవాడగుటచేఁ దనకు సంసారబంధ విచ్ఛేదమును గావించిన పురుషోత్తముఁడే ప్రత్యక్ష మయ్యెనని దెలిసికొని యాయనకు నమస్కరించి యిట్లని వినుతించెను.

7వ- కీర్తన- కాంభోజి (కళ్యాణి) రాగం, జంపెతాళము

1. వేదాద్రి శిఖరనరసింహమాకలయామి
విమలవిద్యుజ్జ్వలితజిహ్వాం
వేదాంతవేద్య విమలానందవిజ్ఞాన
విదళితదురంతభవమోహం త్వాం నౌమి

2. పరభావభావనాదృఢబంధహరమఖిల
సురవైరిదళనఖరనఖరం
పరిపూర్ణకరుణాసుధాసమాహ్లాదిత
ప్రహ్లాదభయహరముదారం త్వాం నౌమి

3. ఘోరసంసారతారకతారకాధిపతి
తరణిమండలకోటిభాసం
క్షీరగంభీరవారిధిమథనసంజాత
వరలక్ష్మీకౌస్తుభోల్లాసం త్వాం నౌమి

4. జగదణ్డశతకోటి జననీకళత్రమిహ
జన్మమరణాదిభయవిదూరం
నిగమమయఖగవర్య వరయానసంచార
నియతలీలామయశరీరం త్వాం నౌమి

5. మణిమయకిరీటమణిమకరకుండలకాన్తి
మథితదిగ్దశతిమిరభారం
అణిమాదిభూతిదమనన్య శరణార్థినాం
ఆధారమఖిలసుఖసారం త్వాం నౌమి

6. నిరవద్యగుణరత్న నిర్మలాంతఃకరణ
వరణీయవరదాననిపుణం
ధీరశివనారాయణానన్దతీర్థయతి
గూఢపరమార్థ మతికరుణం త్వాం నౌమి

ప. విమల = నిర్మలమైన ; విద్యుజ్జ్వలిత = మెరపువలెప్రకాశించుచుండు;జిహ్వాం=నాలుక కలిగినట్టి;వేదాంత వేద్య = ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడుచుండు, విమలానంద = నిర్మలమైన ఆనందము చేతనున్నూ;విజ్ఞాన =విజ్ఞానముచేతనున్నూ; విదళిత = కొట్టివేయబడిన, దురంత = అంతము లేని; భవమోహం = సంసారమోహముగలవారున్నూ అనగా(సంసార మోహములేని వారున్నూ)-అగు;వేదాద్రి శిఖరనరసింహం=వేదాద్రి శిఖరమునందు వేంచేసిన హే! నృసింహస్వామీ! ఆకలయామి= చూచుచున్నాను; త్వాం = మిమ్ములనుగూర్చి,నౌమి = నమస్కరించుచున్నాను.

2. పరభావ = పరస్వరూపమును;భావనా=భక్తితోసేవించుటవలన; దృఢబంధ=దృఢమైన సంసారబందములను;హర =హరించునట్టిన్నీ; అఖిలసురవైరి=సమస్తరాక్షసులను;దళన=చీల్చుట యందు; ఖర=తీక్షమైనటువంటి; నఖరం = గోళ్ళు గలవారున్నూ,పరిపూర్ణ = సంపూర్ణమైనటువంటి;కరుణా సుధా = దయామృతము చేత; సమాహ్లాదిత = బాగాసంతోష పెట్టబడినటువంటి;ప్రహ్లాదభయహర = ప్రహ్లాదునియొక్క భయమును పోగొట్టిన వారు, ఉదారం = ఔదార్యము గలవారున్నూ-(అగునట్టి),త్వాం=మిమ్ములను గూర్చి నౌమి= నమస్కరించు చున్నాను.

3. ఘోర సంసార తారక = భయంకరమైన సంసారమును తరింపజేయువాడు;తారకాధిపతి=చంద్రుని యొక్క; తరణి=సూర్యుని యొక్క,కోటిమండల = కోటిబింబములతో సమానమైన;భాసం = ప్రకాశమానముగల వారున్నూ;క్షీరగంభీరవారిది= పాలసముద్రమును; మధన = తరచు నపుడు, సంజాత =పుట్టబడిన; వరలక్ష్మీ=లక్ష్మీఅమ్మవారిచేతను ; కౌస్తుభః = కౌస్తుభముచేతను ; ఉల్లాసం = ప్రకాశించుచున్నటువంటి , త్వాం = విమ్ములనుగూర్చి ; నౌమి = నమస్కరింపుచున్నాము.

4. జగదండశతకోటి జననీకళత్రం = నూరుకోట్ల బ్రహ్మాండములకు తల్లి అయిన లక్ష్మిని భార్యగా గరిగినట్టున్నీ ; జన్మ మరణాది భయవిధూరం ఐ జననము, మరణము మొదలగు భయము లెవియు, లేనివాడవున్నా . నిగమయఖగవర్య = (వేదమయుడైన) పక్షీంద్రుడైనట్టి గరుత్మానులవారు అనునట్టి ; వరయాన = శ్రేష్ఠమైన వాహనమెను యొక్కి ; సంచార = సంచరించునట్టి ; నియతి = అలవాటుకలిగిన నట్టి; లీలామయశరీరం = లీలా ప్రచురమైన శరీరముగలిగిన నట్టిన్నీ; త్వాం = మిమ్ములనుగూర్చి ; నేమి = నమస్కరింపుచున్నాను.

5. మణిమయ = మణులచేత నిర్మితమైన ; కిరీట = కరీటమునందలి ; మణి = మణులయొక్కయు ; మకరకుండల = మకరకుండలముల యొక్క యున్నూ ; కాంతి = కాంతులచేత ; మధిత = నాశనముచేయబడిన ; దిగ్దశ = దశ దిక్కుల యందలి : తిమర భావం = చీకట్ల స్వరూపముగల వారున్నూ ; అనన్యశరణార్థినాం = అన్యము విడిచి మిమ్ములనే శరాణాగతి చేయువాకి : ఆధారం = ఆధారముగా వుండేవారున్నూ ; అణిమాది భూతిదం = అణిమాది అష్టసిద్ధులు యిచ్చినట్టి వారున్నూ ; అఃలసుఖసారం = సమస్తసుఖములకు సైఆరభూతరులున్నూ - అగు ; త్వాం = మిమ్ములను గూర్చి ; నేమి = నమస్కరింపుచున్నాము;

నిరవద్య = దోషరహితమైన ; గుణరత్న = మంచిగుణములు ఉండుటచేత; నిర్మల = మాలిన్యములేనట్టి; అంతఃకరణ = మనస్సుచేత; వరణీయ = కోరబడదగినట్టి; వర = వరమును(అనగా మోక్షమును); దాన = ఇచ్చుటయందు, నిపుణ = నేర్పుగలవారున్నూ, ధీర= ధైర్యము గలిగి నటువంటి, శివనారాయణా నందతీర్థయతి = శివనారాయణ తీర్థులవారికి; గూఢపరమార్థం = తీర్థలవారికి గూఢమైన పరమార్థముగా నుండు వారున్నూ, అతికరుణం = మిక్కిలిదయకల్గినట్టి; త్వాం = మిమ్ములనుగూర్చి;నౌమి=నమస్కరింపు చున్నాను;వేదాద్రి శిఖర నరసింహ మాకలయామి-

1. మెఱుపువలె ప్రజ్వరిల్లుచున్న నాలుకగల వేదగిరినృసింహస్వామిని జూచుచున్నాను. వేదాంతవేద్యా! పరమానందస్వరూపా! నిన్ను దెలిసికొనుట వలన సంసారబంధము విడిచిపోవును. ఓమహాత్మా! నీకు నమస్కారము.
2. మిగులవాఁడియగు నఖములచే హిరణ్యకశిపునిఁ జీల్చి, పరిపూర్ణమగు కరుణామృతముచే ప్రహ్లాదుని భయముఁ దీర్చి, యానందపఱచిన యోనృసింహా! నిన్ను ధ్యానించినయెడల సంసారబంధములు దొలంగిపోవును. నీకు నమస్కరించెదను.
3. కోటిసూర్యబింబములును, కోటిచంద్రబింబములు నొక్కమాఱుదయించిన నెట్టికాంతియుండునో, అట్టియధికమగుకాంతితో నీయాకారము ప్రకాశించుచున్నది. ఓ సంసారతారకా! క్షీరసముద్రమును మథించుటవల్ల జనించినలక్ష్మియు, కౌస్తుభమును నీ వక్షస్థలమున రాజిల్లుచున్నవి. అట్టి నీకు నమస్కరించెను.
4. ఈసకలబ్రహ్మాండమునకు తల్లియగు నాలక్ష్మీదేవికి నాయకుండవు. జన్మము, మరణము మొదలగు భయము లేవియును లేనివాఁడవు. వేదరూపుఁడగు గరుత్మంతుఁడే వాహనముగాఁగలవాఁడవు. అట్టి లీలామానుషవిగ్రహుఁడవగు నీకు నమస్కరించెదను.
5. మణిమయ మగుకిరీటముయొక్కయు, మకరకుండలములయొక్కయు, కాంతిచే చీఁకటులను బోఁగొట్టుచున్నట్టియు, 'నీవేదిక్కు' అని దృఢభక్తితో నాశ్రయించువారలకు పట్టుగొమ్మయై అణిమాద్యష్టైశ్వర్యములనిచ్చు వాఁడవును, పరమానందస్వరూపుఁడవును అగునీకు నమస్కరించెదను.
6. సకలగుణరత్నాకరా! పరిశుద్ధచిత్తులగువారు కోరినవరములనెల్ల నొసంగునట్టియు, జ్ఞానియగు నారాయణతీర్థయతివరునిచే ధ్యానింపఁబడుచున్నట్టియు, పరమార్థస్వరూపుఁ డైనట్టియు నీకు నమస్కరించెదను.

శ్లో. ఉద్ధ రోద్ధర గోవింద పతితం భవసాగరే,
భీకరే శ్రీహరే కృష్ణ వృష్ణివంశసముద్భవ. 17

శ్లో.17. వృష్ణివంశ సముద్భవా=యాదవవంశమునందు పుట్టినట్టినీ; గోవింద! = భూమిని ఉద్ధరించినట్టినీ;కృష్ణా=బాలకృష్ణరూపము ధరించినట్టినీ; శ్రీ హరే! = హే నారాయణమూర్తే!

భీకరే = భయంకరమైన;భవసాగరే=సంసార సముద్రమునందు; పీతితం= పడియున్నటువంటి(నన్ను); ఉద్ధర = ఉద్ధరింపుమా; ఉద్ధర= ఉద్ధరింపుమా (లేవదీయుమా); ఉద్ధర,ఉద్ధర = ఉద్ధరింపుమా, ఉద్ధరింపుమా-అనిరెండుసార్లు అన్నారు తీనినే " ద్విరుక్తి" అందురు. యాదవవంశమునందుఁబుట్టి కృష్ణుఁడను పేరుతో మెలంగుచున్న యో నారాయణా! భయంకర మగుసంసారసముద్రమునందుఁ బడియున్న నన్నుద్ధరింపుము. ఓ గోవిందా! నన్నుద్ధరింపుము.

శ్లో. ఇతి స్తువంతం ముచుకుందమాదరాత్
కృపాసుధావర్షిదృశా వలోక్య సః,
హితం సమాదిశ్య చ సత్వరం పునః
వివేశ శౌరి ర్మధురా మరిందమః. 18

శ్లో.18. అరిందమ=శత్రుమర్దనుడైనటువంటి; సః శౌరి = ఆ,స్వామివారు; ఇతి = ఈ విధముగా; ఆదరాత్=భక్తిపూర్వకముగా; స్తువంతం = స్తోత్రము చేయుచున్నట్టి;ముచుకుందం = ముచికుందుల వారిని; కృపాసుధా వర్షి దృశా= దయామృతమును వర్షించునట్టి వన్నుల చేత ; అవలోక్య= చూచి; హితం సమాదిశ్య=హితవాక్యములు ఉపదేశించి,సత్వరం = త్వరగా; పునః = తిరిగి; మధురాం= మధురా పట్టణమును; వివేశ= ప్రవేశించెను.

ఇట్లు స్తోత్రముచేయుచున్న యాముచుకుందుని దయామృతమును వర్షించుదృష్టులతోఁ జూచి, హితమునుపదేశించి యా శ్రీకృష్ణుఁడు తక్షణమే మధురాగనరమునకుం జేరెను.

శ్లో. ద్వారకానగరీ హర్మ్యశారికా గీతసారికా,
తారకోత్కలికా మౌనితారకానందపూరకా. 19
శర్మదా నిర్మలధియాం నిర్మితా విశ్వకర్మణా,
తత్ర సంతం హరిం పౌరాస్తుష్టాస్తుష్టువురీశ్వరమ్ 20

శ్లో.19. ద్వారకా నగరి=ద్వారకాపురమునందు; హర్మ్యవారికా=ప్రాసాదములయందు సంజరములలో వుంచబడిన గోరువంకలచేత; గీత=గానము చేయుబడుచుండు; సారికా=వరమార్థ సారముగలదియు; తారకోత్కలికా=నక్షత్రములవలె ప్రకాశించుచుండు; మౌనితారక = మునీంద్రులనేత్రములకు;ఆనందపూరకా=ఆనందమును నిండింప చేయునట్టి దిన్నీ.

శ్లో.20. నిర్మల ధీయాం= నిర్మలమైన జ్ఞానముకలవారికి; శర్మదా = సుఖమునిచ్చునదియు; విశ్వకర్మణా నిర్మితా = విశ్వకర్మచేత నిర్మింపబడినదియుగానుండెను;తత్ర=ఆ పట్టణమునందు; సంతం= వేంచేసియున్నట్టి;ఈశ్వరం=సర్వనియంతఅగు;హరిం=శ్రీకృష్ణస్వామివారినిగూర్చి;పౌరాః = పురజనులు; తుష్టా=సంతోషించినవారై (ఈ క్రింది విధముగా) ;స్తుష్టువు=స్తోత్రముచేసిరి.

ద్వారక యనుపట్టణమొకటి సముద్రమధ్యమునందుఁ గలదు. అందలి మేడలయందు పంజరములఁబెట్టి పెంపఁబడుచుండు గోరువంకలుకూడ పరమర్థాసారము వచింపుచుండును. మౌనులఁ దరింపఁజేయునదియు, చూచువారికి పరమానంద మొసంగునదియు, పరిశుద్ధహృదయు లగువారికి నిత్యసుఖము (మోక్షము) నొసంగునదియు నగునప్పురమును శ్రీకృష్ణునకై విశ్వకర్మ నిర్మించెను. శ్రీకృష్ణుఁడును స్వజనసమేతుఁడై మధురను విడచి యప్పురముంజేరెను. ఆయన యచ్చట నివసించుటను జూచి, పురజనులిట్లని కొనియాడిరి.

8వ - కీర్తన- సావేరిరాగము-అట; త్రిపుటతాళములు

| | | |
|---|---|---|
| ప. | వయం ధన్యా | వయం ధన్యా |
| | వయం ధన్యా దేవ | వసుధాతలే |
| అ. | స్వయం వ్యక్తం | పరం తత్త్వం |
| | హరిం త్వా మవ | లోకయామః |
| 1. | నిఖిలలోకనిదాన | నిగమబృందైకమాన |
| | సుఖసత్యామితజ్ఞాన | సురపాలన |
| | మఘవదాదిపావన | మాయయా కృతభువన |
| | అఘమూలవినాశన | అచ్యుతానంగమోహన |
| 2. | జలధిమధ్యనిర్మిత | జాంబూనదవర |
| | కలితగోపురహర్మ్య | గణకమనీయా |
| | జలజనాభ తావక | జనరమ్యద్వారకా |
| | అల మధునా స్మాభి | రవలోక్యతే |
| 3. | వసుధాసుధాసౌధ | వసతీకృతవాస |
| | కుసుమబాణవిహరణ | కూలవన |
| | వసుదేవభాగధేయ | వామదేవాదిగేయ |
| | వసుద నారాయణతీర్థ | వరద విజయగోపాల. |

ప. స్వయం వ్యక్తం = స్వయముగా అవిర్భవించినటువంటిన్ని; పదం తత్త్వం= పరతత్త్వ స్వరూపుడవైన టువంటి;హరిం = శ్రీమన్నారాయణ మూర్తివైన; త్వాం= మిమ్ములను;అవలోకయామః = సేవించుచున్నాముగనుక; దేవ! = హేస్వామీ! వసుధాతలే = భూమియందు; వయంధన్యా= మేమేధన్యులము; వయంధన్యా = మేమేధన్యులము.

1. నిఖిలలోక నిదాన = సమస్తలోకములకు ఆదికారణుండవు; నిగమబృందైకమాన = వేదసమూహములేప్రమాణముగా గల వాడు;సుఖ=ఆనంద స్వరూపమైనట్టి; సత్య = నిర్వికారమైనట్టి; అమితజ్ఞాన = మితములేని జ్ఞానము కలిగినట్టి స్వరూపము గలవాడ;సురపాలన = దేవతలనుపాలించువాడ; మఘవదాది పావన = దేవేంద్రుడు మొదలగువారిని పవిత్రము చేయువాడ; మాయయాకృలతభువన = మాయచేత నిర్మింపబడినభువనములు గలవాడు; అఘమూలవినాశన = పాపములకు మొదటి కారణమైన అజ్ఞానమును నశింపజేయువాడ; అచ్యుతా = భక్తులను క్రింద పడనివ్వనివాడ; అనంగమోహన = మన్మధుని మోహింప బెయువాడ

2. జలనిధి మధ్య నిర్మిత = సముద్రమధ్యమునందు నిర్మించబడినటువంటిస్నీ:జాంబూనదవర = శ్రేష్ఠమైన బంగారుచేత;కలిత=కూడుకున్నటువంటి;గోపుర=గోపురములు; హర్మ్య = మేడలయొక్క; గణ = సమూహములచేత; కమనీయ= మనోహరమైన; తావక = నీయొక్క; జన = భక్తులకు; రమ్య = రమణీయమైనటువంటి; ద్వారకా = ద్వారకాపట్టణము; జలజనాభ = హే కమలనాభ! అధునా = ఇప్పుడు; అస్మాభిః = మా అందరిచేత ; అలం = ( పూర్తిగా) చాలినట్లుగా,అవలోక్యతే = సేవించబడుచున్నది; వయంధన్యా = మేముధన్యులము.

3. వసుధా = యావత్తు భూమియందు; సుధాసౌధ = గచ్చుమేడలు అని చెప్పదగిన ; వసతీకృత వాస = వాసయోగ్యమైన ద్వారకా నగరమందు వసియించి యుండు హే స్వామీ! కూలవన = ఉద్యాన వనముల యందు ; కుసుమ బాణ విహరణ = మన్మధునివలె విహరించుచున్నట్టి హేస్వామీ!వసుదేవ భాగదేయ = వసుదేవుని యొక్క పూర్వపు నోముపంటగా; వామదేవాదిగేయ = వామదేవాది ఋషులచేత గానముచేయబడు చుండువాడ; వసుధ = భూమియందు , నారాయణ తీర్థవరద = నారాయణ తీర్థునికి వరమిచ్చువాడ; విజయగోపాలా = హే విజ.యగోపాలా! వయం ధన్యా = మేము ధన్యులము.

ప. ఓదేవా! ఈభూలోకమున మే మే ధన్యులము. మే మే ధన్యులము. మేమే ధన్యులము.

అ. స్వయముగ ప్రకాశించుచున్న (నిరాకారుఁడై యుండుటను జూచి, సాకారుఁడై ప్రత్యక్షముగఁ గనఁబడుచున్న) పరమాత్మస్వరూపుని నారాయణునిఁ జూచుచున్నాము.

1. మాయచే సకలలోకములను నిర్మించిన యో మదనమోహనాకారా! నీవు ఇంద్రుఁడు మొదలగు దేవతలనుగూడ పవిత్రులఁజేసి రక్షింతువు. పాపవినాశనా! వేదాంతములలోఁ జెప్పఁబడు సత్యజ్ఞానానంద స్వరూపుఁడవు; నాశరహిత పరబ్రహ్మంబవు నీవే.

2. ఓపద్మనాభా! నీప్రభావముచే సముద్రమధ్యమున నిర్మింపఁబడి సువర్ణమయములగు గోపురప్రాకారములతో సకలజనుల కానందమును గల్గించుచు, నీకు హృదయప్రియమైయున్న యీ ద్వారకాపట్టణమును గనులారఁ జూచుచున్నాము.

3. భూమియను మేడయందు నివసించునట్టియు (ఈభూలోకమునందలి ప్రజలందఱును తన కుటుంబముగాఁ జూచుకొనుచు నొక్కయింటి యందు తిరుగుచున్నట్లు, ఈ సర్వప్రపంచమునందును విహరించుచున్నాఁడనుట) అనేకములగు నుద్యానవనముల యందు మన్మథవిహారముల జరిపినట్టియు ఓకృష్ణా! వసుదేవపుణ్యఫలమా! నీవు భక్తులకు సకలధనములనొసంగు వాఁడవనియు, నారాయణతీర్థునిఁ బ్రోచితివనియు వామదేవాదులు గానము సేయుచున్నారు.

శ్లో. అమరదుర్లభభూతిరియం సతీ
విమలమానసహంససమాకులా,
కమలనాభ రమాతిమనోరమా
సతతమస్తు తవాద్య మహాపురీ 21

శ్లో.21. ఇయం = ఈ ద్వారకా నగరము, అమర దుర్లభభూతి = దేవతలకున్నూ దుర్లభమైన ఐశ్వర్యము; సతీ = కలదియై; విమల మానస = నిర్మలమైన మనస్సు గల ; హంస = పరమ హంసల చేత ; సమాకుల = కూడుకొని వున్నట్టిదిన్నీ;కమలనాభ,రమా = లక్ష్మీ నారాయణులకు అతి మనోరమ = మనసుసలు మిక్కిలి రంజింపజేయునది యై ; అద్య = ఇప్పుడు;మహాపురి = గొప్పపట్టణమైన ఈ ద్వారకా సట్టణము;తవ = మీకు; సతతం = ఎల్లకాలము; అస్తు = అవుగాక!
ఓశ్రీకృష్ణా! దేవతలకుఁగూడ దుర్లభమగు సమృద్ధిగలదియు, (పురపక్షమున సమృద్ధియనఁగా నైశ్వర్యసమృద్ధి, భార్యాపక్షమున రూపసమృద్ధి) (పరిశుద్ధమగు మనోహంసకలదియు, (నిర్మలమగుమానససరస్సునందలి హంసలచే వ్యాపింపఁబడినదియు, అనఁగా, పురసమీపమునందలి సరస్సులలో నిర్మలములగు హంసలు నివసించుచున్నవనుట. అది పురపక్షమునందలి యర్థము) మిగుల మనోహరమైనదియునగు నిప్పురము లక్ష్మీదేవియునుం బోలె భార్యయగుఁగాక (నీవెప్పుడును ఈపట్టణమునందు మిగుల ననురాగముతో నుండుము)

శ్లో. అద్యాపి భక్తా ననుకంపయన్ ముదా
హృద్యానవద్యాం నగరీమధిష్ఠితః,
నిరస్తశత్రు ర్భగవాన్ విరాజతే
క్ష్మయా చ లక్ష్మ్యా సహ సర్వసంపదా 22
ఇతి శ్రీనారాయణతీర్థవిరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గిణ్యాం
శ్రీకృష్ణద్వారావతీ ప్రవేశవర్ణనంనామ ఏకాదశతరఙ్గః.

శ్లో.22. భగవాన్ = శ్రీకృష్ణస్వామివారు;అద్యఅపి = ఇప్పుడుకూడ భక్తా = భక్తులను; ముదా = సంతోషముచేత ;అనుకంపయ = అనుగ్రహింపు మా ( దయను చూపుమా); నిరస్తశత్రూన్ = శత్రు వులగురాక్షసులను సంహరింపుమా; క్ష్మయాచ= భూదేవితోను; లక్ష్మ్యా = సహ = కూడుకున్నవారై; సర్వసంపదా = సమస్త ఐశ్వర్యముతో; హృద్యానవద్యా = మనోహరముగాను; అనవద్యాం = నిర్దోషముగాను; నగరి = ద్వారకానగరమును; అధిష్ఠితః = పరిపాలింపుచూ విరాజతే = ప్రకాశించుచున్నాను.
ఆ శ్రీకృష్ణుఁడు శత్రువుల మర్దించుచు, శ్రీదేవితోడను భూదేవి తోడనుగూడ భక్తుల ననుగ్రహించుచు, మనోహరమగు నిర్దోషమగు నా పట్టణమునందు ఇప్పటికి నివసించుచున్నాఁడు.

ఇది ఏకాదశతరఙ్గము.

# ద్వాదశ తరఙ్గము

## కథాసంగ్రహము

*అథ రుక్మిణీకల్యాణమహోత్సవవర్ణ నమభినీయతే -*

శ్లో. భీష్మోథ రుక్మీ తత్పుత్రో రుక్మిణీ తత్సుతా సతీ,
వసుదేవో దేవకీ చ బలకృష్ణౌ సబాంధవౌ 1

రుక్మిణ్యా లిఖితం పత్రం శ్రీకృష్ణాయ నివేదితమ్,
బ్రాహ్మణేన తత స్తత్రరథే నాగమనం హరేః. 2

రాజ్ఞాం సమక్షం రుక్మిణ్యాః పాణిగ్రహణమంగళమ్,
రుక్మిణ్యా సహ కృష్ణస్య ద్వారకాయాం సమాగమః 3

రుక్మిణీకృష్ణయో స్సమ్య గ్వివాహ స్తదనంతరమ్,
అష్టపత్నీ సమాహారః కథాసంగ్రహ ఈరితః. 4

*అథ రుక్మిణీ కళ్యాణ మహోత్స వర్ణనం అభినీయతే = వర్ణింపబడుచున్నది.*

శ్లో.1. భీష్మః = భీష్మమ హారాజు అను వారున్నూ ; అథ = అనంతరము ; తత్పుత్రః = ఆయన కుమారుడు - అయిన ; రుక్మీ= రుక్మి అనువాడున్నూ ; తత్సుతా= ఆయన కూతురు అయిన ; సతి = యోగ్యురాలైన రుక్మిణి = రుక్మిణి అమ్మవారున్నూ , వసుదేవః = వసుదేవుడున్నూ; దేవకీచ = దేవకీ దేవిన్నూ ; బలకృష్ణౌ = బలరాములవారున్నూ , కృష్ణులున్నూ ; సబాంధవా = వారి యొక్క బంధువులున్నూ ; రుక్మిణ్యా = రుక్మిణీ అమ్మవారిచేత ; లిఖితం పత్రం =వ్రాయబడిన జాబున్నూ ; శ్రీకృష్ణాయ = శ్రీకృష్ణుని కొఱకు ; బ్రాహ్మణేన = బ్రాహ్మణునిచేత ; నివేదితం = మనవి చేయించడమున్నూ ; తతః = అనంతరమందు; తత్ర = అక్కడికి ; హరేః = స్వామివారు ; రథేన = రథముయొక్క ; ఆగమనం = వచ్చుటయున్నూ ; రాజ్ఞాసమక్షం = రాజుల ఎదుట; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క ; పాణిగ్రహిణమంగళం = చేతితో పట్టుకొనుటద్వారా పాణిగ్రహణ మున్నూ రుక్మిణ్యానహ = రుక్మిణీ అమ్మవారితో కూడుకున్నటువంటి; కృష్ణస్య = శ్రీ కృష్ణులవారి యొక్క ; ద్వారకాయో = ద్వారకాపట్టణమునందు ; సమాగమం = చేరడమున్నూ ; రుక్మిణీ కృష్ణయోః = రుక్మిణీ కృష్ణుల యొక్క ; సమ్యక్ వివాహం = బాగావివాహము జరుగుటయున్నూ ; తదనంతరం = అటుపిమ్మట ; అష్టపత్ని = ఎనిమిదిమంది భార్యలను; సమాహారం = పెండ్లాడుటయున్నూ ; కథా పంగ్రహః =పై జెప్పిన సంక్షేప కథ; ఈ రితః = చెప్పబడుచున్నది ; తత్రాదౌ, భీష్మ ఆగమనం ; తత్ర = ఆ విషయములో ; ఆదౌ = మొట్టమొదటభీష్మాగమనం = భీష్మలవారు ప్రవేశించడము ;

ఈద్వాదశతరంగమున రుక్మిణీకల్యాణ మహోత్సవము వర్ణింపఁబడును :-

భీష్మకుఁడును, ఆయన కుమారుఁడగు రుక్మియు, పుత్రికయగు రుక్మిణియు వచ్చుటయు, ద్వారకయందు బంధుజనులతోఁగూడ దేవకీవసుదేవులును రామకృష్ణులు నుండుటయు, ఒకబ్రాహ్మణుఁడు రుక్మిణీదేవి వ్రాసియిచ్చిన పత్రికను కృష్ణునకుఁ దెచ్చియిచ్చుటయు, శ్రీకృష్ణుఁడు రథమునెక్కి విదర్భకుఁ బోవుటయు, రాజులందఱును జూచుచుండ రుక్మిణి నపహరించుటయు, ద్వారకయందు శ్రీకృష్ణరుక్మిణుల సమాగమంబును, పిదప రుక్మిణీకృష్ణులకు బాగుగ వివాహము జరుగుటయు, అష్టభార్యల వివాహంబులును అనునది యిందలి కథాసంగ్రహము.

భీష్మకుఁడు సభలో రుక్మిణీ కల్యాణముంగూర్చి యాలోచించుట

*తత్రాదౌ భీష్మాగనమ్ -*

నాదనామక్రియారాగము - ఆదితాళము

ధీమా నిహ శ్రీమానయం　　　భీమపరాక్రమాన్వితః
భూమౌ విఖ్యాతమాహాత్మ్యో　　　భీష్మో రాజా విరాజతే

దీమాన్ = జ్ఞానసంపన్నుడున్నూ ; ఇహ = ఇక్కడ ; అయం = భీష్మరాజా = ఈ భీష్మరాజు; భీమ పరాక్రమాన్వితైః = భయంకరమైన పరాక్రమము గలవారున్నూ; భూమౌ = భూలోకమందు; విఖ్యాతమహాత్మా = విఖ్యాత మహిమ గలవాడు అయి ; విరాజతే = ప్రకాశించుచున్నారు ;అథరుక్మాగమనం = అనంతరము రుక్మిప్రవేశము ;

మిగుల బుద్ధిమంతుఁడును, తేజోవంతుఁడును, పరాక్రమసంపన్నుఁడును అగుభీష్మకుఁడనునొకరాజు తనప్రభావము సకలలోకములందును బ్రసిద్ధిచెందుచుండ విదర్భం బాలించుచుండెను.

*అథ రుక్మ్యాగమనమ్ -*

నాదనామక్రియారాగము - ఆదితాళము

రుక్మీరుక్మిణ్యవరజో　　　రుచిరాంగదకుండలీ
తిగ్మాంశుసమకిరీటి　　　దివ్యాయుధః సమాయాతి

*2వ - కీర్తన - నాదనామక్రియరాగము - ఆదితాళము*

రుక్మిరుక్మి ణ్యవరజః = రుక్మి అనువాడు (రుక్మిణినే చెల్లెలుగాగలవాడు) ; రుచిర = మనోహరమైన ; అంగద = భుజకీర్తులు ; కుండలి = కుండలములగలవాడున్నూ; తిగ్మాంశు సమకీరీటి = సూర్యకాంతితో సమామైన కిరిటముగలవాడు; దివ్యాయుధ సమాయాతి = దివ్యాయుధములతో కొల్వుకు వచ్చుచున్నాడు.

మనోహరములగు కేయూరములను, కుండలములను, సూర్యునివలె ప్రకాశించుచున్న కిరీటంబును ధరించి శ్రేష్ఠములగు నాయుధములంబూని యాభీష్ముని యగ్రతనయుండగురుక్మియు తండ్రియొద్ద కొకనాఁడు వచ్చెను.

గ. అథభీష్మమహారాజోరుక్మిణ్యాః స్వసుతాయావివాహమహోత్సవాయ వరమన్విష్య్ స్వమంత్రిభిఃకులవృద్ధైశ్చ సమం పర్యాలోచ్య వాసుదేవం వరం రోచయామాస కిల. రుక్మీచ తద్వృత్తం జ్ఞాత్వా చైద్యపక్షత్వాత్సామర్షమువాచ. అలమహో విచారేణ గోపాలవరకన్యాప్రదానవిషయేణ. అయం హి జారచోరశిఖామణిః పరతంత్రోనాస్మత్కులోచిత వర ఇతి. రాజాపి పుత్రస్నేహవశాత్తద్రోచయామాస. 5

గద్య. అథ=అనంతరమందు; భీష్మమహారాజుగారు; స్వసుతాయా = తనకుమార్తె అయిన; రుక్మిణ్యాః = రుక్మిణి అమ్మవారి యొక్క; వివాహమహోత్సవాయ=వివాహమహోత్సవము కొఱకు;వరం = భర్తను;అన్విషన్ = విచారించుచూ; స్వమంత్రిభిః=తనమంత్రులతోనున్నూ;కులవృద్ధైశ్చసమం = కులవృద్ధులతోకలుసుకొని;పర్యాలోచ్య=లెస్సగా ఆలోచించి; వాసుదేవం = శ్రీకృష్ణస్వామివారిని;వరంరోచయామాసకిల?=వరునిగా చేయుటకు ఇష్టపడెనుకదా? రుక్మీచ = రుక్మి అయితేనో;తద్వృత్తం=ఈ వృత్తాంతమును;జ్ఞాత్వా=తెల్సుకొని; చైద్యపక్షత్వాత్ = శిశుపాలునియందు పక్షపాతము వుండుటవలన; సామర్షం = కోపముతో;ఉవాచ = పలికెను; అహో=ఓహో;గోపాలవర కన్యాప్రదాన విషయేణ=గొల్లవాడుగావుండే వరుడికి కన్యను యిచ్చే విషయమున;విచారేణ=విచారణ;అలం=చాలును;అయం హి= ఇతనైతేనో(ఈ గోపాలుడైతేనో);జారచోరశిఖామణి=జారత్వంలోను,చోరత్వంలోను అగ్రగణ్యుడు;పరతంత్రః=ఒరుల అధీనములో నుండు వాడు(స్వంతరాజ్యం లేనివాడు);అస్మత్కులోచితవర=మనకులమునకు తగిన వరుడు(శిశుపాలున కిత్తునని;న=వాడు;ఇతి=ఇట్లని చెప్పెను.; రాజాపి = భీష్మరాజుకూడ;పుత్రస్నేహవశాత్=కుమారుల్లయందుండే మమకారంచేత;తత్ = కుమారుని అభిమతమును;రోచయామాస=ఇష్టపడెను.

ఆభీష్మమహారాజు తనపుత్రియగు రుక్మిణికి వివాహము సేయఁదలంచి, వరుని విచారించుచుండి, మంత్రులయొక్కయు, కులవృద్ధులయొక్కయు నాలోచనపై కృష్ణుఁడు తన కన్యకు తగినవరుఁడని నిశ్చయించుకొని యుండెను. రుక్మియు శిశుపాలునిపై నభిమానముగలవాఁడగుటచే, తనతండ్రి నిశ్చయమును వినఁగానే కోపించియిట్లనియె. గోపాలుఁడగు కృష్ణునకు కన్నియ నిచ్చెదమని నిశ్చయించితిరా? చాలుచాలు నీ విచారములు. ఈ కృష్ణుఁడు జారుఁడు, చోరుఁడు. అతనికి స్వంతముగ రాజ్యములేదు. ఒకనికి లోఁబడియుండువాఁడు. ఇట్టివాఁడు మనయట్టి యుత్తమవంశస్థులతో సంబంధము సేయ నర్హుఁడగునా? కావున మనకన్యను శిశుపాలున కిత్తము. అని యిట్లు పుత్రుండు చెప్పఁగానే భీష్మకుఁడును వానియందలి యనురాగముచే పూర్వనిశ్చయమును మాని, వాని మతము నంగీకరించెను.

*అథ రుక్మిణ్యాగమనమ్ -*

నాదనామక్రియారాగము - ఆదితాళము

| | |
|---|---|
| ఆయాతి శ్రీరుక్మిణి శనై రిహ | గేయయోషిద్భి రధునా |
| కృష్ణమేవచింతయంతి సదా హృది | వృష్ణివంశసింధుచంద్రం |
| సౌందర్యనిందితామరీ నిరంతర | చారుతరనీలకబరీ |
| తన్వీ స్వతనుభానునా పరాజిత | తపనకిరణా తరుణీ |

అద రుక్మిణ్యాగమనమ్; సౌందర్య నిందితాఅమరీ=దేవతా స్త్రీల సౌందర్యమును ధిక్కరించిన సౌందర్యముకలదిన్నీ; నిరంతరీ= ఎల్లప్పుడున్నూ; చారుతర = మిక్కిలి మనోహరమైన;నీలకబరీ=నల్లని కొప్పుగలదిన్నీ,తన్వీ= సూక్ష్మశరీరము గలది; స్వతను భానునా = తనదేహకాంతులచేత; పరాజిత = తిరస్కరింపబడిన;తపనకిరణా=సూర్య కాంతులు గలదిన్నీ,తరుణి=మంచి వయసు గలదిన్నీ;యోషిద్భిః=చెలికత్తెల చేత,గేయ=గానము చేయబడునటు వంటి దిన్నీ(అనగా స్తోత్రము చేయబడు నటువంటిదిన్నీ);శ్రీరుక్మిణీ= సంపద్యుక్తమైన రుక్మిణీ అమ్మవారు,ఇహ=ఇక్కడికి(క్రీడా గృహమునకు), వృష్ణవంశసింధు=యాదవ వంశమనే సముద్రమునకు; చంద్రం = చంద్రుడైనటు వంటిన్నీ;కృష్ణం ఏవ= శ్రీ కృష్ణస్వామి వారినే;సదా = ఎల్లప్పుడున్నూ; హృది = మనస్సునందు; చింతయంతి = చింతింపుచున్నదియై; శనైః=మెల్లగా;ఆయాతి=వచ్చుచున్నది.

సూర్యునివలె ప్రకాశించుచుండు తనశరీరకాంతిచే సూర్యకిరణముల ధిక్కరించుచు, అతివిస్తారమై, మేఘమువలె నల్లనైయొప్పు కొప్పు ప్రకాశించుచుండ, దేవాంగనల మించుసౌందర్యముగల రుక్మిణి తనచెలికత్తియలతోఁగూడి శ్రీకృష్ణుని మదిలో ధ్యానించుచు మెల్లమెల్లఁగ క్రీడాగృహమునకు వచ్చెను.

శ్లో. క్రీడాగృహం సమాయాంతీం క్రీడంతీం స్వసఖీజనైః,
ప్రత్యాహ రుక్మిణీం దూతీ యద్వృత్తం భీష్మమందిరే.

శ్లో.6. క్రీడా గృహం=ఆడుకునేయింటికి;సమాయాంతీం= వచ్చినదియై; స్వసకిజనైః = తనచెలికత్తెలతోసహా ; క్రీడంతీం=ఆడుకొనుచుండు; రుక్మిణీంప్రతి= రుక్మిణి అమ్మవారిని గూర్చి; దూతీ = చెలికత్తె; భీష్మమందిరే=భీష్మునియొక్క సభయందు;యద్వృత్తం=ఏ సమాచారమైతే జరిగి యున్నదో దానిని;అహ = పలికెను..

ఇట్లు క్రీడాగృహముంజేరి యచట చెల్కత్తియులతోఁగూడి క్రీడించుచుండఁగా రాజసభనుండి యొకదూతికవచ్చి వరనిశ్చయమునుగూర్చి యచట జరిగిన వృత్తాంతమంతయు నామెతో నిట్లని చెప్పెను.

శ్లో. రౌహిణేయే కృతోద్వాహే రేవతీప్రాణవల్లభే,
శ్రీకృష్ణస్యాథ సమయో వైవాహికమహోత్సవే. 7
ఇతి ద్వారవతీపౌరాః ప్రశశంసుః పునః పునః.
రుక్మీ చ రుక్మిణీం దాతుం శిశుపాలాయ రోచతే. 8

పుత్రస్నేహవశాద్రాజా తథైవ హృది నిశ్చితః,
ఏవ మాలోచితం సర్వైః బంధుభిశ్చాపి మానిని. 9

7,8,9,శ్లో॥ మానినీ!=ఓరుక్మిణీ! రౌహిణేయ=రోహణి అమ్మవారి కుమారుడున్ను; రేవతీప్రాణవల్లభే!=రేవతీ అమ్మవారి భర్తయున్ను అయిన బలరాముల వారికి; కృతోద్వాహే = వివాహముకాగా; అథ = అనంతరము; శ్రీ కృష్ణస్య = శ్రీ కృష్ణస్వామివారికి; వైవాహిక మహోత్సవే=కళ్యాణ ఉత్సవమునకు; సమయః = ఇదిసమయగా వున్నది అని; ఇతి = ఇట్లని; ద్వారవతీపౌరా = ద్వారకానగరమందలి జనులు; పునః పునః = మాటి మాటికి; ప్రశశంసుః = ప్రస్తాపించుచున్నారు; రుక్మీచ = మీ అన్న అయితేనో; రుక్మిణీం = రుక్మిణి అయన మిమ్ములను; శిశుపాలాయ = శిశుపాలుని కొఱకు; దామం = యిచ్చుటకు; రోచతే = యిష్టపడుచున్నాడు;

ఓరుక్మిణీ! మీతండ్రిసభయందు నేఁడు జరిగిన వృత్తాంతమును జెప్పెదవినుము. 'బలభద్రునకు రేవతియనెడు కన్యనిచ్చి వివాహముగావించిరి. ఇఁక శ్రీకృష్ణునకు వివాహముఁ జేయవలసిన సమయమువచ్చినది'. అని ద్వారకయందు పౌరులందఱును జెప్పుకొన్నారు. మీతండ్రినిశ్చయ మెట్లున్నను మీయన్నయగు రుక్మికిమాత్రము నిన్ను కృష్ణునకిచ్చి వివాహముసేయుట బొత్తుగ నిష్టములేదు. శిశుపాలున కియ్యవలయునని యాతని మతము. పుత్రునియందలి ప్రేమచే మీతండ్రియు దానికి సమ్మతించెను. మన బంధువులందఱును ఈవిషయముగూర్చియే మిగుల చింతిల్లుచున్నారు.

శ్లో. ఇతి దూతీవచః శ్రుత్వా రుక్మిణీ న్యపతద్భువి,
ఉపలభ్య శనైస్సంజ్ఞాం ప్రలపత్యమలాశయా. 10

ఇతి = ఈవిధముగా; దూతీవచః = చెలికత్తెమాటలను; శ్రుత్వా = విన్నటువంటిదై; రుక్మిణి = రుక్మిణి అమ్మవారు; భువి = భూమియందు; న్యపతత్ = పడిపోయెను; శనైః = మెల్లగా; సంజ్ఞా = తెలివిని; ఉపలభ్య = పొందినదియై; అమలాశయః = నిర్మలహృదయముగలదియై; ప్రలపతి = ప్రలపించెను (చెప్పుకొనుచు దుఃఖించెను)

ఇట్లుదూతికచెప్పిన వాక్యముల వినినతోడనే విమలహృదయమగు రుక్మిణి మూర్ఛిల్లి నేలపైఁబడెను. కొంతసేపటికి మెల్లగఁ దెలివిదెచ్చుకొని యిట్లని విలపింప నారంభించెను.

### *రుక్మిణీ మనోనిశ్చయము*

ఆహిరీ (ఆనందభైరవీ) రాగము - ఆది (జంపె) తాళము

| | | |
|---|---|---|
| ప. | వీక్షే కదా దేవదేవం | గోపాలమూర్తిం |
| అ. | సాక్షాన్మదనకోటి | సౌందర్యభావ్యం |

1. ప్రకట మృగమదతిలక — రమణీయఫాలం
సకలగుణసంపత్తి — సహిత మురుఖేలం

2. బృందావనాంత భువి — విశ్రుతవిహారం
నందనందన మఖిలా — నందితాకారం

3. కాలమేఘశరీర — కలితవిద్యుద్వసనం
కేళీకలాకుతుక — కించిత్కుంచితాధరం

4. తధిమిధిమికిధిమీతి — తాండవవిలోలం
సిద్ధజనవినుత ప్ర — సిద్ధతరశీలం

5. సరసమురళీగీతర — సామృతలహరీ
నిరతనారాయణతీర్థ — నిర్మలమనోహంసం

ప్రకట = దివ్యదర్శనమిచ్చుచున్న; మృగమదతిలక = కస్తూరీ తిలకముతో; రమణీయ = సుందరమైన; ఫాలం = ముఖముగలిగినట్టియు; సకలగుణసంపత్తిసహితం = అన్ని సద్గుణములతో నొవ్వ; ఉరుఖేలం = గొవ్పవిలాన గలిగినట్టియు; బృందావనాంతభువి = బృందావనభూములయందు; విశ్రుతవిహారం = ప్రసిద్ధిచెందిన వనవిహారముగలిగిన; నందనందనం = నందకుమారుని; అఖిల = ఎల్లలోకములను; ఆనందిత ఆకారం = ఆనందింపజేయు రూపము గలిగిన ఆ శ్రీకృష్ణుని; వీక్షేకదా = ఎప్పుడుచూతునోకదా!

1. దేవదేవం = దేవతలకు దేవుడు అయినటువంటి; గోపాలమూర్తిం = శ్రీకృష్ణస్వామివారిని; కదావీక్షే? = ఎప్పుడు చూచెదనో?

2. సాక్షాత్ = ప్రత్యక్షముగా; మదనకోటి సౌందర్యభావం = కోటిమన్మథులతో సమానమైన సౌందర్యముతో గూడిన రూపముగల స్వామివారిని.

3. కాలమేఘశరీర = నీలమేఘము వంటి శరీరమునందు;కలిత = ఒప్పుచున్నటువంటి; విద్యుద్వసనం=మెరుపు తీగతో సమానమైన వస్త్రము గలవారున్నూ;కేళీకలాకుతుక=క్రీడయందలి ఉత్సాహముచే;కించిత్కుంచితాధరం=పెదవిని కొంచెము వంచి యుండువారున్నూ అగు స్వామివారిని;కదావీక్షే?=ఎప్పుడు చూతును?

4. తధిమి ధిమికి ధిమితి అను శబ్దములు పలుకునట్లు నృత్యముచేయుటయందు; తాండవవిలోలం = విశేష ఆసక్తి గల వారున్నూ; సిద్ధజనవినుత = తపస్విద్ధులచేత స్తోత్రము చేబడుచుండు; ప్రసిద్ధ తరశిలం= మిక్కిలి ప్రసిద్ధమైన సత్స్వభావము గలవారున్నూ;దేవదేవం=అగు శ్రీకృష్ణస్వామివారిని;కదా వీక్షే=ఎప్పుడు చూతునో.

5. సరళ మురళీగీత=మనోహరమైన మురళీ నాదము యొుక్కధ్వని;రసామృతలహరి= గానరసమనునట్టి అపూర్వతర ప్రవాహమునందు; నిరత=ఎల్లప్పుడు ఆసక్తి గలిగి వున్నందున;నారాయణతీర్థ=నారాయణతీర్థుల వారికి;నిర్మల మనోహంసం = నిర్మలమైన మనస్సు అనునట్టి హంసగలవారు-అట్టిస్వామి వారిని;కదా వీక్షే?=ఎప్పుడు చూతునో.

ప. గోపాలరూపుఁ డగునాదేవదేవుని నెప్పుడు చూతునో!

అ. ఆమన్మథకోటి సమానసుందరాకారు నెప్పుడు చూతునో!

1. కస్తూరీతిలకముతో నొప్పు ముద్దు మోముఁగలిగినట్టియు, భూమిపైఁ గ్రీడించుచున్నట్టియు, గుణరత్నాకరుండైనట్టియు ఆమన్మథ.......చూతునో!

2. సర్వలోకములకు నానందకర మగురూపముతో బృందావనమున విహరించుచుండిన యానందకుమారుని ఆమన్మథ......చూతునో!

3. నీలమేఘశ్యామలమగు శరీరమునందు మెఱుపునుంబోలెఁ బ్రకాశించుచు పీతాంబరము వెలుంగ, క్రీడయందలి యుత్సాహముచే పెదవిని కొంచెమువంచి చరించుచుండు ఆమన్మథ......చూతునో!

4. "తథిమిదిమికిథిమి" అని నృత్యము సేయుటయందు మిగులనిచ్ఛగల వాఁడును, మహామునులుగూడ నుతించునట్టిజగత్ప్రసిద్ధసత్త్వ భావముగలవాఁడును అగు నామన్మథ.........చూతునో!

5. మనోహర మగువేణుగాన మనియెడు జలప్రవాహమున సర్వకాలములయందును నారాయణతీర్థుల మనస్సనియెడు హంసమునుద్రిప్పుచు నాయతివరునకు కృతార్థతగతి గలిగించునట్టి యామన్మథ..........నెప్పుడు చూతునో!

శ్లో. నిధాయ హృది గోవిందం రుక్మిణీ రుక్మభూషితా,
మనః సంబోధ్య గోవిందే సమాధాయేద మాహతత్ 11

శ్లో.11. రుక్మభూషితా = బంగారు ఆభరణములను ధరించినటువంటి; రుక్మిణి = రుక్మిణి అమ్మవారు; హృది = తన మనసున నందు; గోవిందం=శ్రీకృష్ణుల వారిని; నిధాయ =ఉంచుకున్నటు వంటి దై; తత్ మనః = ఆమెయొక్క ఆ మనస్సును;గోవిందే=గోవిందునియందు;సమాధాయ = నిల్పినటువంటిదై(లెస్సగా వుంచుకున్నదై);సంబోధ్య = అట్టిమనస్సును బోధించుచూ;ఇదం = ఈ క్రింద చెప్పబోవు విధముగా; అహ = పలికెను.

స్వర్ణాలంకారములచే భూషిత యగునారుక్మిణీ శ్రీకృష్ణుని తనమనసున నిలిపి 'ఓమనసా! నాయుపదేశమును వినుము' అని సంబోధించుచు ఆ గోవిందునియందే స్థిరమగు భక్తితో నిట్లనియె.

శ్లో. రేరే చేతః శృణు విమలహృత్పుండరీ కాంతరస్థే
యస్మిన్ మాయావిలసితజగత్కోటయస్సంతి భూమ్ని,
గోపాలం తం భజ నిగమవిద్యావిలాసానుపాలం
భూపాలం తం పరిహర పునర్జన్మబంధై కమూలమ్ 12

రేరే చేతః = ఓ మనసా! శ్రుణు = వినుము; విమల హృత్పుండరీ కాంతరస్తే = నిర్మలమైన హృత్కమల మధ్యము నందు వున్నటు వంటి; యస్మిన్ భూమ్ని = సర్వవ్యాపకస్వరూపమైన ఏ స్వామివారియందు; మాయావిలసిత జగత్కోటయః=భగవద్దివ్య సంకల్పజన్యమైన బ్రహ్మాండ కోట్లు; సంతి = కలవో; నిగమ విద్యావిలా సానుపాలం = వేదవిద్యావిలాసమును పాలించు చున్నటువంటి;తంగోపాలం = అట్టిగోపాలమూర్తిని; భజ = భజించువమా; పునర్జన్మబంధైకమూలం=తిరిగి తిరిగి జన్మ పరం పర ప్రాప్తి రూపమైన బంధములకు మూలకారణమైన; తం భూపాలం = ఇతరరాజసేవ; పరిహర = విడిచిపెట్టుమా!

ఓమనసా! నాయుపదేశమును వినుము. ఆగోపబాలుఁడు సర్వవ్యాపకుఁడు. సకలజనుల హృదయకమలమునందున్నాఁడు. మాయామయములగు నీ ప్రపంచసమూహములన్నియు నావిభునియంద నిలిచియున్నవి. ఆవేదాంతవేద్యుం డగుపరమాత్ము నాశ్రయింపుము. పునర్జన్మమునకును, సంసారబంధమునకు కారణభూతుఁ డగుభూఫాలుని (శిశుపాలుని అని ప్రస్తుతార్థము. అభివృద్ధిని గోరుపురుషుఁడు శ్రీకృష్ణునే సేవింపవలయును గాని రాజుల నాశ్రయించిన ప్రయోజనములేదు, అని అప్రస్తుతార్థము) పరిత్యజింపుము.

5వ - కీర్తన- సావేరి (రేగుప్తి)రాగం- అగతాళం

**రేరే మానస గోపాలం భజ దూరే పరిహర భూపాలం**
**ఆరా దంతరతర మఖిలాత్మకబోధానందఘనం బాలం**
**విమలహృదయకమలోదారం వేదశమితవివిధ విషయాకారం**
**కమనీయతరకరుణాసారం సర్వసమభావభావభావమహోదారం**
**సామాదినిగమాన్తసంచారధీర ధీమదనుస్మృత సుగుణాకారం**
**సమరసమేకమనంతమనన్వయ మమితనిరంతరసుఖసాగరం**
**జగదండకోటిపరాకాశం సర్వ నిగమాంతవిదితస్వప్రకాశం**
**అగణితగుణమణివాగీశం దేవ మాగమరూపనిజాదేశం**
**విగళితమోహజభవపాశం విశ్వమంగళకృతతనుమఖిలేశం**
**భగవన్తమాదిగురుం శివమద్వయచిద్గగనం నవనీతాశం**
**సుందరతరమురళీనాదం ముని బృందవిచింత్యసుందరపాదం**
**నందతనయ మఖిలానందం శర దిందువదన మిహ గోవిందం**
**బృందావనహితగోబృందం ధృతమందర మఖిలనిగమకందం**
**నందసునందాదివంద్య మనన్యక నారాయణతీర్థయతివరదం**

**రేరే మానస = ఓ ఓ మనసా! గోపాలం = శ్రీకృష్ణస్వామివారిని; భజ = భజింపుమా; భూపాలం = రాజులను (ప్రభువులను); దూరే = దూరముగా; పరిహర = విడిచి పెట్టుమా!**

అ. ఆరాత్+అంతరతరం(ఆరాదంతరతరం); ఆరాత్ = దగ్గరలో; అంతర్యామిగానున్నట్టిన్నీ - అనగా అంతరతరం; అఖిలాత్మక బోధానందఘనం; అఖిల = సమస్త జగత్తున్నూ; అత్మక = శరీరముగానుండు నట్టి వారున్నూ; బోధా = జ్ఞాన స్వరూపముతోనున్నూ; ఆనంద = ఆనంద స్వరూపముతోనున్నూ; ఘనం = దట్టమైనటువంటి; బాలం = బాలుడైన స్వామివారిని; భజ = భజించుమూ;

1. విమల హృదయకమలోదారం = నిర్మలమైన హృదయ కమలము నందు ఉదార స్వరూపు లై వేంచేసి యుండువారు; వేద = జ్ఞానము వల్ల; శమిత = శమింపబడిన; వివిధ విషయాకారం = అనేకమైన విషయాకారము గలవారు న్నూ అనగా విషయాకారములు నశించిన విరున్నూ; కమనీయతర = అతిమనోహరమైన; కరుణాసారం = దయారసముగల వారున్నూ; సర్వ = సమస్తభూతములయందు; సమభావ = సమత్వభావమును; భావ = కలిగించుట యందు (ఉత్పత్తి చేయటయందు); మహోదారం = గొప్ప ఔదార్యము గలవారున్నూ; సామాది = సామము మొదలగు; నిగమాంత = వేదములయొక్క అగ్రములైన ఉపనిషత్తులయందు; సంచార = సంచరించు వారున్న; ధీర = ధైర్యముగల (వైరాగ్యముగల); ధీమత్ = జ్ఞానవంతులచేత; అనుస్మృత = అనుసరించి స్మరింపబడు చుండెడు; సుగుణాకరం = కళ్యాణ గుణముల స్వరూపముగల వారున్నూ; సమరసం = సర్వకాలములయందున్నూ ఏకమైన ఆనందము(జ్ఞానము కలవారున్నూ); ఏకం = అసమానుడున్నూ; అనంతం = అంతములేని వారున్నూ; అనన్వయం = విషయముల యందు సంగమము లేని వారున్నూ; అమిత = మితములేని; నిరంతరం = తెంపులేని; సుఖసాగరం = సుఖమునకు సముద్రమువంటివాడు.

3. జగదండకోటి = బ్రహ్మాండకోట్లకు; పరా = అతీతముగా; అకాశం = ప్రకాశించువారున్నూ; సర్వనిగమాంత = సమస్త వేదాంతములను ఉపనిషద్భాగములయందు; విదిత = తెలియబడుచుండు; స్వప్రకాశం = స్వకీయ ప్రకాశముగలవారు; అగణిత గుణమణి = అసంఖ్యాక ములైన కళ్యాణ గుణములను ప్రతిపాదించునట్టి; వాక్ = వేదములను; ఈశం = ప్రవర్తింపజేయువాడున్నూ; దేవం = క్రీడించు వాడున్నూ ( ప్రకాశించు వాడున్నూ); అగమరూపని జాదేశం = వేదరూపమైన స్వకీయమైన అజ్ఞగల వారున్నూ.

4. విగళిత = కొట్టివేయబడిన; మోహజ = మోహజన్యమైన; భవపాశం = సంసారబంధములు గల వాడు; విశ్వ = సరవజగత్తుకు; మంగళ = క్షేమము గలిగించుటకుగాను; కృత = ధరించబడిన; తనుం = శరీరము గల వారున్నూ; అఃలేశం = సమస్తమునకు నియామకుడు న్నూ; భగవంతం = షాడ్గుణ్యపూర్తి గల వారున్నూ; ఆదిగురుం = గురువులలోని మొదటివాడున్నూ; శివం = మంగళకరుడున్నూ; అద్వయం = అసమానమైన; చిత్ = జ్ఞానముచేత; గగనం = ఆకాశమువలె వ్యాపించియుండువాడు; నవనీతాశం ఃీ వెన్న' ఆహారముగా గలిగినట్టి (శ్రీకృష్ణుని); రేరే మానసా! = ఓ ఓ మానసా! గోపాలం భజ = శ్రీకృష్ణస్వామివారిని భజింపుమా!

5. సుందరతర = మిక్కిలి మనోహరమైన; మురళీనాదం = వేణునాదము గలవారున్నూ; ముని బృంద = వేదార్థమును మననము చయుముని నమూహాములచేత; విచింత్య = చింతింపబడుచుండు; సుందరపాదం = సౌందర్యమైన పాదములు గలవారున్నూ; నందతనయం = నందునియొక్క కుమారుడున్నూ; అఖిలానందం = సమస్తజనులకు ఆనందము కలిగించు వారున్నూ; ఇహ = ఇక్కడ; శరత్ ఇందువదన = శరత్కాల చంద్రునితో సమానమైన ముఖముగల; గోవిందం = గోవులకు విందుచేయువారు; గాం = భూమి; విందం = లభింపజేసినవారు - అగు గోపాలస్వామి వారిని; రే రే మానసా = ఓ ఓ మనస్సులారా! భజ = భజింపుమా!

6. బృందావనహిత గోబృందం = గోసమూహములతో బృందావన మున నివసించువారున్నూ; ధృత మందర! = మందర పర్వతమును ధరించిన వారున్నూ; అఖిల నిగమకందం = సమస్త వేదములకు మూలకారణభూతుడున్నూ; నంద సునందాది వంద్య = నంద సునందది యోగుల చేత నమస్కరింవబడుచుండు వారున్నూ; అనన్యగ = వరమాత్మవంటే అన్యమును భజించని;నారాయణతీర్థయతివరదం = నారాయనతీర్థయతికి మోక్షరూపమైన వరమును ప్రసాదించువారున్నూ - అగు, అనన్యగ = వరమాత్మకంటె అన్యమును భజించని, నారాయణతీర్థయతివరదం = నారాయణతీర్థయతికి మోక్షరూవమైన వరమును ప్రసాదించువారున్నూ-అగు; గోపాలం = శ్రీకృష్ణస్వామివారిని; రే రే మానస! = ఓ ఓ జీవులారా! భజ = భజించుమా!

ప. ఓమనసా! గోపాలు నాశ్రయింపుము. రాజులచెంతకుఁబోకుము.

అ. ఆగోపాలుఁడు జ్ఞానానందస్వరూపుఁడు. ప్రపంచమయుఁడగుటచే దూరమునేను, సమీపముననుగూడ నున్నాఁడు. అట్టి అబాలకృష్ణుని సేవింపుము.

1. సర్వనముఁ డగునాకరుణానముద్రుఁడు మిగుల నుదారభావముగలవాఁడు. అనిర్మలచిత్తుఁడు పరమార్థజ్ఞానము నొసంగుటకు వేదముల నిర్మించి వానిమూలమున విషయరూపములనెల్ల శాంతి నొందించుచున్నాఁడు. (సమస్తవిషయములయందును బ్రహ్మభావనగలుగునట్లుచేసి లోకమునకు జ్ఞానదృష్టి నొసంగుచున్నాఁడు అని భావము)

2. ఈయఖండానందస్వరూపుఁడు అద్వితీయుఁడు. దేనితోను సంబంధపడువాఁడు కాఁడు. సమరసస్వరూపుఁ డగునీవేదవేద్యుని జ్ఞానవంతులగు వారందఱును సర్వకాలములందును ధ్యానించుచుందురు. కల్యాణగుణమయమగు నిమ్మహాత్ముని యాకారమును నెప్పుడును జింతించుచుందురు.

3. బ్రహ్మాండకోటుల కాశ్రయ మగుపరమాకాశమే స్వరూపముగాఁ గలవాఁడును, సద్గుణము లనియెడురత్నములచే నలంకృతుండును, వక్షలలో [illegible] అగువాదేవునియాజ్ఞయే యీవేదము. స్వప్రకాశమగు నాపురు[illegible] స్వరూపమును ఆవేదము తప్ప మఱియొకటి స్పష్టము చేయనేరదు.

4. అద్వితీయుఁడును, చిదాకాశస్వరూపుఁడును, పరమానందమయుఁడును అగునాసర్వేశ్వరుఁడు, సకలలోకములకును అదిగురువు. అజ్ఞానమువలన జనించిన యీసంసారబంధము లేనివాఁడయ్యును, ఆ భగవంతుఁడు సకలజగములకును సుఖములు గల్గించుటకు మనుష్యశరీరమునుదాల్చి నవనీత చోరుఁడై యున్నాఁడు.

5. శరత్కాలచంద్రునివంటి మోముతో సకలమునిజనులచే ధ్యానింపఁబడుచున్న సుందరము లగుపాదములతో సకలజనులకు నానందమును గల్గించుచు, మనోహరముగ వేణుగానము సేయుచు, విహరించుచుండు నీ నందకుమారుఁడు నారాయణుఁడే.

6. ఆ మందరధరుఁడే బృందావనమునందు గోవులను మేపుచుండినవాఁడు. సమస్త వేదములకును మూలకారణభూతుఁడై, నందసునందాదిమునులచే వినుతింపఁబడుచున్న యాభగవంతుఁడే తనయం దేకాంతభక్తిగలనారాయణ తీర్థునకు కోరినవరముల నొసంగినాఁడు.

శ్లో. ఇతి నిశ్చిత్య సా భైష్మీ గోవిందావాప్తయే హృది,
ఆరాధయంతి తం కృష్ణం ప్రేమభక్త్యేదమాహ చ. 13

శ్లో.13. సాభైష్మీ = ఆరుక్మిణీ అమ్మవారు; గోవిందం అవాప్తయే = స్వామివారిని లభింప చేసికొనుటకై; ఇతి = ఈ లోగడ చెప్పిన విధముగా;హృది = మనస్సునందు; నిశ్చిత్య = నిశ్చయముచేసికొన్నదై; తం కృష్ణం = ఆ శ్రీకృష్ణస్వామివారిని; ఆరాధయంతి = పూజించుచున్నది యై; ప్రేమభక్త్యా=ప్రేమపూర్వకమైన ( భక్తిచేత) భజనచేత; ఇదం = ఈ క్రింద చెప్పబోవు వాక్యమును; ఆహ = పలికెను.

ఇట్లారుక్మిణి శ్రీకృష్ణునిఁ దప్ప వేఱొకనిని వరింప నని నిశ్చయించుకొని, యాయననే మనసున ధ్యానించుచు భక్తిపరవశయై మరల నిట్లనియె.

6వ - కీర్తన - కమాస్ ( సంతువరాళి) రాగము - ఆదితాళము

ప. గోపాలమేవదైవతం భజే - సదా గోపాల మేవ దైవతం

| | | |
|---|---|---|
| 1. | సర్వలోకకారణం | సత్యకామాదిగుణం |
| 2. | భక్తానుగ్రహాభివ్యక్త | భవ్యమూర్తిధారిణం |
| 3. | యాదవాబ్ధిచంద్రమిహ | యతిజనమోహాపహం |
| 4. | కంసాదివైరివిరామ | కలితదివ్యవిగ్రహం |
| 5. | గోపీకావనకుముద | గురుతరచంద్రోదయం |
| 6. | ఘోరసంసారకారణ | వారణకేసరిణం |
| 7. | మనసా పి న గణయామి | మాధవా దన్యదైవం |

8. భవ్యనారాయణతీర్థ దివ్యదృగ్విధాయినం

ప. సదా = ఎల్లప్పుడున్నూ; గోపాల దైవతం ఏవ = శ్రీకృష్ణ స్వామివారినే; భజే = భజించుచున్నాను.

1. సర్వ లోకకారణం = సమస్తలోకములకు కారణ స్వరూపుడున్నూ సత్యకామాదిగుణం = సత్యకామము,సత్యసంకల్పము మొదలగు గుణములు గల వారున్నూ అగు గోపాలం సదాభజ; భక్తానుగ్రహ = భక్తులను అనుగ్రహించుకొఱకు; అభివ్యక్త = ఇంద్రియములకు మనోహరముగా గోచరింపు చున్నటువంటి; భవ్య = మంగళకరమైన; మూర్తి = రూపమును; ధారిణం = ధరించియున్నవాడున్నూ - అగు గోపాలం సదాభజ

3. ఇహ = ఇక్కడ; యాదవాబ్ధిచంద్ర = యాదక వంశమను సముద్రమునకు చంద్రుని వంటివారున్నూ; యతిజన = యతిజనులయొక్క; మోహ = దేహాభిమానము మొదలగు మోహమును; అపహం = పోగొట్టువారున్నూ - అగు గోపాలం సదా భజే.

4. కంసాదివైరి విరామం = కంసుడుమొదలగు శత్రువులను నశింప జేసిన వారున్నూ; కలిత దివ్యవిగ్రహం = ధరించబడిన దివ్యమంగళ విగ్రహము గలవారున్నూ - అగు గోపాలం సదా భజే.

5. గోపిక ఆనన కముద = మోపికల ముఖములు అను నట్టి కలువలకు; గురుతర చంద్రోదయం = శ్రేష్ఠమైన పూర్ణ చంద్రుడంటివారున్నూ- అగు గోపాలం సదాభజే.

6. ఘోరసంసారకారణవారణ = భయంకరమగు సంసారమునకు కారణముగానుండు మోహమునునట్టి ఏనుగకు; కేసరిణం = సింహము వంటివాడున్నూ-అగు గోపాలం సదాభజే.

7. మాధవాత్ అన్యదైవం = శ్రీకృష్ణునికంటే వేరుదైము; మనసా అది = మనసుసనందు గూడ; న గణయామి = లెక్కించను(ఆదరించను)(తలంచను)(లక్ష్యపెట్టను).

8. భవ్య నారాయణ తీర్థ = మంగళకరమైన మోక్షమునే కోరుచుండు నారాయణ తీర్థులవారికి; దివ్యదృక్ = జ్ఞానదృష్టిని; విధాయినం = ఇచ్చునట్టి వారున్నూ - అగు గోపాలం సదా భజే.

ప. ఆగోపాలునే యెప్పటికిని పరమదైవమునుగా సేవించెదను.

1. సత్త్వకామత్వాది సమస్తకల్యాణగుణములుగల్గి, సకలలోకములకును కారణభూతుఁడైన ఆ గోపాలునే ............సేవించెదను.

2. భక్తుల ననుగ్రహించుటకై యింద్రియగోచర మగుమనోహరాకారముఁ దాల్చినట్టి (నిరాకారుఁడుగా నుండుటను విడచినట్టి) ఆగోపాలునే.......సేవించెదను.

3. యదుకులచంద్రుఁడై జనించి యతులయజ్ఞానము లెల్లఁదొలంగించుచు నున్నట్టి ("యే నిర్జితేంద్రియగ్రామా యతినో యతయశ్చతే" అనువాక్యము ననుసరించి యతులనఁగానింద్రియములజయించినవారు, స్థిరచిత్తులు కావున సన్యాసాశ్రమమును తీసికొనినవారే యతులని తలంపవలదు. అట్లైనను సన్యాసులకు నింద్రియజయ మావశ్యకము కావున, వారియందు యతిశబ్దము సామాన్యముగ వాడఁబడుచున్నది) ఆగోపాలునే........సేవించెదను.

4. కంసుఁడు మొదలగు శత్రువుల (ధర్మశత్రువుల, సజ్జనశత్రువుల) మర్దించుటకై మనోహరమగుమనుష్యరూపముతో జన్మించియున్న యాగోపాలునే...........సేవించెదను.

5. గోపికల ముఖము లనియెడుకలువలకు సంపూర్ణచంద్రుఁడైన యాగోపాలునే.....సేవించెదను.

6. అతిఘోరమగు నీసంసారమును గలిగించిన యజ్ఞానమనియెడు మదగజమునకు సింహమువంటివాఁడైన (అజ్ఞానమును నశింపఁజేయునట్టి అనుట). యాగోపాలునే..........సేవించెదను.

7. ఆ నారాయణునికంటె నితరుఁడగుదైవమును మనసుతోనైనను దలంపను, గౌరవింపను, ఆగోపాలునే....సేవించెదను.

8. నారాయణతీర్థునకు దివ్యదృష్టిని (జ్ఞానమును) దయచేసిన యా సర్వోత్తముని గోపాలునే సర్వకాలములందును సేవించుచుందును. ధ్యానించుచుందును.

గ. **తతో రాజవిగ్రహధారిణేసురవిద్వేషకారిణేశిశుపాలనామ్నే స్వాం దాతుం కృతనిశ్చయం స్వజనం జ్ఞాత్వాసారుక్మిణీగోప రమణీమానస మానససరోవరరాజీవరాజి విరాజమానరాజ హంసంమర్దిత మహాసురకంసంభక్తజనరచిత ప్రశంసంగోవిందం ఆత్మానందం స్మారంస్మారంవిగతమానుషభోగతృష్ణా శ్రీకృష్ణే కబంధుత్వనిష్ఠాతా నిజసహచరసాహచర్యావలంబినీసదాస్తే.**

**తతః** = అటుపిమ్మట; **సారుక్మిణీ** = ఆరుక్మిణి అమ్మవారు; **సురవిద్వేషకారిణే** = దేవతలయందు విరోధముగలవారున్నూ; **రాజవిగ్రహదారిణే** = రాజరూపమును ధరించినవాడున్నూ; **శిశుపాలనామ్నే** = శిశుపాలుడను పేరుగలవానికి; **స్వాం** = తనను; **దాతుం** = ఇచ్చి వివాహము చేయుటకు; **కృతనిశ్చయం** = తీర్మానించుకున్నవారినిగా; **స్వజనం** = తనబంధువుల అభిప్రాయమును; **జ్ఞాత్వా** = గ్రహించినదియై; **గోపరమణీ** = గోపిస్త్రీలయొక్క; **మానస** = మనస్సులు అనునట్టి; **మానస సరోవర** = మానస సరోవరములయందలి; **రాజీవరాజీ** = కమలపంక్తియందు; **విరాజమాన** = ప్రకాశించుచుండెడు; **రాజహంసం** = రాజహంసమువంటివారున్నూ; **మర్దిత** = మర్దించబడిన; **మహాసుర కంసం** = కంసుడనే గొప్పరాక్షసుని గలవాడున్నూ (కంసుని చంపినవారున్నూ); **భక్తజన రచిత ప్రశంసం** = భక్తజనులచేత చేయబడుచుండు ప్రశంసగలవారున్నూ - అగు; **గోవిందం** = గోవిందుడు; **ఆత్మానందం** = ఆత్మలను సంతోషపెట్టువారున్నూ;

స్మారం స్మారం = మాటిమాటికి గ్రహించునదియై; విగతమానుష భోగతృష్ణా = మనుష్య సంబంధమైన భోగములయందు ఆసక్తిని విడచినదియై; శ్రీకృష్ణైక బంధుత్వనిష్టతా = శ్రీకృష్ణస్వామివారే తనకు ముఖ్య బంధువు అనే నిష్ఠగలదియై; నిజ సహచర = తనతోగూడ ఎల్లప్పుడూ వర్తించుచుండు; సహచరి = చెలికత్తెయున్నూ; సదా = ఎల్లప్పుడు; అవలంబిని = అనుకున్నదియై; ఆస్తే = ఉండెను.

ఇట్లారుక్మిణి రాజరూపముతోనున్న రాక్షసుఁడగు శిశుపాలునకు తనబంధువులు తన్నొసంగెదరని తెలియఁగానే మిగుల దుఃఖాక్రాంతమయ్యెను. గోపికలమానసంబులను మానససరస్సులకు రాజహంస యగునా శ్రీకృష్ణుని, కంసాసురమర్దనుని, భక్తశరణ్యుని, సర్వకాలములందును తత్పరయై ధ్యానించుచు, తానాకృష్ణునిఁ జేఁబట్టవలయు ననువాంఛ యంతకంత కధికమగుచుండ సుఖభోగములం దిచ్ఛవదలియుండెను. మిగుల కృశించి, సంచరించుటకుకూడ తనచెలుల సాహాయ్యకమునుఁ గోరుచుండెను.

### రుక్మిణీ శ్రీ కృష్ణునకు పత్రిక సంపుట

శ్లో. బ్రాహ్మణం బ్రహ్మవిద్వర్యం బ్రహ్మణ్యేవ పరాయణం,
దృష్ట్వా తు లిఖితం దత్వా తమాహానయ వైహరిమ్ 15

శ్లో.15. ఆ రుక్మిణీ అమ్మవారు
బ్రహ్మవిద్వర్యం = బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడున్నూ ; బ్రహ్మణ్యేవపరాయణం = పరబ్రహ్మయందే నిష్టగలవాడున్నూ ( అగు అగ్నిజ్యోతనుడు - అను) ; బ్రహ్మణం = (ఒక బ్రాహ్మణుడు) ; దృష్ట్వా = చూచి ; లిఖితం = తాను లిఖించిన లేఖను; దత్వాతు = ఇచ్చినీ ; హరిమ్ = శ్రీకృష్ణ స్వామివారిని ; ఆయన = తీసుకరావలసినదిగా , తం = అబ్రాహ్మణుని గూర్చి ; ఆహ = చెప్పెను.

అంత బ్రహ్మవేత్తయు, బ్రహ్మానందపరాయణుండు నగు నొకబ్రాహ్మణునిఁ బిలిచి యాయనచేతికొక పత్రికనిచ్చి "బ్రాహ్మణోత్తమా! నాపైఁ గరుణించి శ్రీకృష్ణు నిటకుఁ దోడ్తెమ్ము" అని చెప్పి పంపెను.

శ్లో. లిఖిత్వా లిఖితం దత్తం విప్రహస్తే తు కన్యయా,
గృహీత్వా లిఖితం విప్రస్త్వర్యయా ద్వారకాం యయౌ. 16

శ్లో.16. లిఖితం = జాబును ; లిఖిత్వా = వ్రాసినదై ; కన్యయా = రక్మిణీ అమ్మవారిచేత ; విప్రహస్తే = బాహ్మణులయొక్క హస్తమునందు ; దత్తం = ఇవ్వబడెను ; విప్రః ఆ బ్రాహ్మణుడు ; లిఖితం = జాబును ; గృహీత్వా = తీసికొని ; త్వరయా = శీ ఘ్రముగా ; ద్వారకాం = ద్వారకానగరమునకు; యయౌ = వెళ్ళిన; ద్విజః = ఆ బ్రాహ్మణుడు ; రహ్యం = శృంగారమైనటువంటి ; ద్వారకాం = ద్వారకాపట్టణమునుగూర్చి ; సగత్వా = వెళ్ళినవాడై; గోపాలనందనం = శ్రీకృష్ణపస్వామివారిని; దృష్ట్వా = చూచినవారై ; రుక్మణ్య = రుక్మిణీ అమ్మవారియొక్క ; వచః = వాక్కునున్నూ ; లిఖితం : జాబునున్నూ; విజ్ఞాపయామాస = స్వామివారుతో విన్న వించెను.

ఆ పత్రికను స్వయముగనే వ్రాసియిచ్చెను. అబ్రాహ్మణుఁడును దానింగైకొని సత్వరముగ ద్వారకాపురముం జేరెను.

శ్లో. సగత్వా ద్వారకాం రమ్యాం దృష్ట్వా గోపాలనందనం,
విజ్ఞాపయామాస వచో రుక్మిణ్యా లిఖితం ద్విజః. 17

ఇట్లు సుందర మగుద్వారకంజేరి, శ్రీకృష్ణుం జూచి రుక్మిణిపంపిన పత్రిక నొసంగి యందున్న విషయముల స్వయముగాఁగూడ నిట్లని చెప్పెను.

*రుక్మిణ్యాః పత్రికాలేఖప్రకారః -*

గ. తథాహి శ్రీమతే సత్యకామసత్యసంకల్పసర్వకామసర్వరస సర్వగంధ సర్వసంకల్పాదిగుణవతే కృతాకృత మాతృమాన మేయభేదభిన్న సకల జగదాధారావభాసకాయ నిష్ప్రత్యూ హనిరతిశయానందావధీరిత బ్రహ్మలోకానన్దాయ విశ్వవైశ్వా నరాదిసకలనామరూపనిర్వాహకాయ సర్వత్ర శక్తిసమన్వితాయ సర్వాంతర్యామిణే దుష్టనిగ్రహశిష్టప్రతిపాలకాయ భక్తానుకంపయాపరిగృహీత గోపకుమారభావాయ కరచరణ నళినవిలసితధ్వజవజ్రాంకుశాదిరేఖాయ మహాపురుష లక్షణాయ కనకమణిమయమకరకుండలకటకకటిసూత్రాంగదాది దివ్యభూషణభూషితాయి భక్తజనకామితకామవర్షి మహామోఘ నీలమేఘ సముజ్జ్వల విద్యుత్పుంజకల్పి దివ్యపీతాంబర ధారిణే శ్రీవత్సకౌస్తుభాదిశోభితాయ దీనదయాపరమూర్తయే శ్రీకృష్ణాయ శతకృత్యస్సహస్రకృత్వశ్చ నమోనమః.

గద్య:- తథాహి = ఆ లిఖితము ఏమనగా ; శ్రీమతే = లక్ష్మీ సహితుడవై నటువంటిస్నీ; సత్యకామ = (అమోఘమైన) వ్యర్థముకాని కోరిక గలవాడున్నూ ; సత్య సంకల్ప = (వ్యర్థముకాని) అమోఘమైన సంకల్పగలవాన్నూ ; సర్వ కామ = సమస్థగుణములకు; సర్వరస= సమస్థరసములకు; సర్వగంధ = సమస్తవాసలకు ; సర్వసంకల్పాది గుణవతే = సమస్త సంకల్పములు మొదలగు గుణములకు కారణ భూతుడైనటు వంటి స్నీ ; కృత = కార్యములకు ; అకృత = కారణములకు; మాతృ = (కొలుచువాడున్నూ) లెక్కించువాడున్నూ ; మాన = కొలత పాత్రయున్నూ ; మేయ = కొలవబడు వస్తువయున్నూ ; భేదభిన్న = ఈ భేదముల తోటి భిన్న భిన్న ములుగా నుండు నట్టి ; సకల = సమస్తమైన ; జగత్తు = జగమునకు ; ఆధార = ఆధారముగానుండి ; అవభాషకాయ = ప్రకాశింప జేయువాడున్నూ ; నిష్ప్రత్యూహ = విఘ్నమ్ములకు లోబడక ; నిరతిశయ = అన్నిటిని అతిశయించునట్టి ; ఆనంద = ఆనందముచేత ; అవధీరిత = తిరస్కరించబడినట్టి (తక్కువచేయబడినట్టి) ; బ్రహ్మలోకానందాయ = చతుర్ముఖ బ్రహ్మనందము గలవారున్నూ (అనగా బ్రహ్మలోక ఆనందముకు మించిన ఆనందముగలవారు - అనుట) ; విశ్వ = విశ్వుడు (స్థూలదేహమును అభిమానించువాడు ) -

అనగా (జాగ్రతా వస్థను పొందియుండు జీవుడు) ; వైశ్వానరాది = అగ్ని హోత్రుడు మొదలగు; సకల నామరూప = సమస్త నామరూపము అను పదార్థములను ; నిర్వాహకాయ = నిర్వహించువాడుయున్నూ (ప్రవర్తంపచేయువాడున్నూ) సర్వత్ర = సర్వవిషయములందు ; శక్తి సమన్వితాయ = శక్తిగలవాడున్నూ ; సర్వాంతర్యామిణే = సమస్త భూతములయందు అంతరాత్మగా నుండు నట్టి వాడున్నూ ; దుష్టనిగ్రహా = దుర్మార్గులను సహరించువాడున్నూ ; శిష్ట ప్రతిపాలకాయ = సత్పురుషులను రక్షించువాడవున్నూ ; భక్త అనుకంపయా = భక్తులయందు వుండు దయచేత; పరిగృహీత = స్వీకరించబడినట్టి; గోపకుమారభావాయ = గోపాలరూపమును ధరించి నటువంటి వాడవున్నూ ; కరచర నళిన = హస్త కమలములయందున్నూ ; పాదకమల మలయందున్నూ ; విలసిత= ఒప్పచున్నటువంటి ; ధ్వజ = ధ్వజము ; వజ్ర = వజ్రము ; అంకుశ = అంకుశము; ఆది = మొదలగు; రేఖాయ = గుర్తులు కలవారున్నూ ; మహాపురుషలక్షణాయ = పరమపురుష లక్షణములుగలవాడున్నూ ; కనకమణిమయ = మణులతో పొదగబడిన బంగారు తో చేయబడిన ; మకరకుండల = మకరకుండలములున్నూ ; కటక = కంకణములు ; కటిసూత్ర = మొలత్రాడున్నూ; అంగదము = భుజకీర్తులున్నూ; ఆది =మొదలగు ; దివ్యభూషణ = దేవతా సంబంధమైన భూషణములచేత ; భూషితాయ = అలంకృతుడవైనవాడున్నూ ; భక్తజన = భక్తజనులచేత; కామిత = కోరబడు చుంచెను ; కామ = కోరికలను ; వర్షి = వర్షించుట స్వబావముగలిగిన ; మహా = గొప్పది యైన ; అమోఘ = వ్యర్థముగానట్టి ; నీలమేఘ = నీలమేఘము వంటి మీదివ్య మంగళ విగ్రహము ; సముజ్వల బాగా ప్రకాశించు చున్నట్టి ; విద్యుత్పుంజ = మెరుపుగుంపులతో ; కల్ప = సమానమైన; దివ్య = దేవతా సంబంధమైన (అమానుషమైన) ; పీతాంబరధారిణే = పట్టు వస్త్రమును ధరించినవాడవున్నూ; శ్రీ వత్స = శ్రీ వత్సము ; కౌస్తుభ = కౌస్తుభము ; ఆది = మొదలగువాటిచేత ; శోభితాయ = ప్రకాశించు చున్నటువంటివాడున్నూ ) దీ న = భక్తులను ; దయ = అనుగ్రహించుటయందు ; పర = ఆసక్తి గల్గిన = (శివపరుడు) (యుక్తిపరుడు) ఛ మూర్తయే = ఆకారముగలవాడున్నూ - అగు; శ్రీ కృష్ణాయ = శ్రీ కృష్ణునికొఱకు ; శతకృత్వ = నూరుసారులు; సహస్రకృత్వశ్చ = వేయిసారులు; నమోనమః = నమస్కారములు చేయుచున్నాను.(వందనములు సమర్పించుచున్నాము).

కాంతిమంతుఁడవును, సత్యకామత్వము, దృఢసంకల్పము, లోకులనుభవించు సకలవిధము లగునానందములును స్వరూపముగాఁ గలిగియుండుట, సర్వరసములును, సర్వగంధములును, సర్వసంకల్పములును ఆకారముగాఁ గలిగియుండుట మొదలగు సకలకల్యాణగుణములు గలవాఁడవును, కార్యము, కారణము, ప్రమాత, (ఒక ప్రమాణముచే నొకవిషయమును గ్రహించువాఁడు) ప్రమాణము, (ఒకవిషయమును గ్రహించుట కుపయోగింపఁబడు జ్ఞానము) ప్రమేయము, (జ్ఞానముచే తెలియఁదగిన విషయము) అను మొదలగుపరస్పర విరుద్ధము లగుభేదములతోఁగూడిన యీసకలప్రపంచమునకును ఆధారమై వీనిం బ్రకాశింపఁజేయుచున్న వాఁడవును, నిర్విఘ్నమై (అ యానందానుభవమును విఘ్నము

సేయఁ గలపదార్థమేదియును లేదనుట) నిరతిశయమై (అయానందమునకంటె అతిశయ మగు వేఱొకయానందము లేదనుట) యున్న పరమానందము ననుభవించుచు బ్రహ్మలోకమునందలి యానందమునుగూడఁ దృణీకరించియున్న వాఁడవును, విశ్వుఁడు (స్థూలదేహము నభిమానించుజీవుఁడు) వైశ్వానరుఁడు మొదలగు నామములను, రూపములను నిర్వహించువాఁడవును, యేవిషయమునందైనను అడ్డములేని సామర్థ్యము గలవాఁడవును, అంతర్యామి స్వరూపుఁడవును, దుష్టుల శిక్షించుచు, శిష్టులఁబ్రోచుచుండువాఁడవును, భక్తుల ననుగ్రహించుటకై గోపాలరూపమును దాల్చియున్నవాఁడవును, హస్తపాదపద్మములయందు ధ్వజము, వజ్రము మొదలగురేఖలచే నొప్పువాఁడవును, మహాపురుషలక్షణములతో కూడినవాఁడవును, సువర్ణరత్నమయము లగుకర్ణకుండలములు, కంకణములు, మొలత్రాడు, భుజకీర్తులు, కిరీటము మొదలగు నానావిధభూషణములచే నలంకృతుండవై యున్నవాఁడవును, భక్తులయభీష్టముల నిరంతరము వర్షించునట్టియు, అమోఘమైనట్టియు, (ఈమేఘము కనఁబడినచో వర్షము కురిసయే తీరు ననుట) నీలమేఘంబవై యచట మెఱయు మెఱపులోయన దనరారుపీతాంబరము దాల్చువాఁడవును, శ్రీవత్సము, కౌస్తుభము మొదలగువానిచేఁ బ్రకాశించువాఁడవును, దీనులయెడల మిగులఁ గరుణగలవాఁడవును, అగు నోకృష్ణా! నీకు నూరుమాఱులు, వేయిమాఱులు వందనములు.

శ్లో. త్వత్ప్రసాదం పరం కాంక్షే కృష్ణ నాన్యంతు కామయే,
మనసా వచసా నూనం మత్పాణిగ్రహణం కురు. 19

శ్లో.19. కృష్ణా = హేకృష్ణా! పరం శ్రేష్ఠమైన;తత్ప్రసాదం= నీఅనుగ్రహమునే;కాంక్ష = కోరచున్నాను; నూనం = నిశ్చయముగా; మనసా = మనస్సుచేతను; వచసా = వాక్కుచేతను; అన్యంతు = ఇతరమును; న కామయే = కోరను (కావున); మనసా,వచసా-అనుపదములు కాంక్ష,న కామయే-అను రెంటికి అన్వయము;మత్ = నాయొక్క; పాణి గ్రహణం = చేయిపట్టుకొనుట (వివాహమును); కురు = చేయుము.

ఓకృష్ణా! నేను నీయనుగ్రహ మొక్కదానినే కోరుచున్నానుగాని వేఱేమియుఁ గోరుటలేదు. కావున నన్ను వివాహముఁ జేసికొనుటకు మనమున సంకల్పింపుము. అట్లే చెప్పుము. ఆరీతిగ నాచరింపుము.

7వ - కీర్తన - సావేరి(మధ్యమావతీరాగము)-అదితాళము

ప. కాంక్షే తవ ప్రసాదం గోపాలబాల కేవల మే వాహం

1. అమితభాగ్యదాతార మతులభూరివిస్తారం
కమనీయకరుణాకరం గోపాలబాల
విమతమదవిదారకం విద్వజ్జనాధారం
శమితభూరిభూభారం శకలీకృతారినికరం

2. కామయే నాన్య మహం కంసారే తిదురూహం.
శ్యామసుందరవిగ్రహం గోపాలబాల
నామరూపనిర్వాహం నానాభువననివహం
త్వా మేవాశ్రయే సాహం త్వరయానయమాం స్వగేహం

3. ధరణిమండలతిలక తాపసతారక
పరిజనసుఖకారక గోపాలబాల
కలవేణునాదరసిక ఘనతరమౌక్తిక
వరనారాయణతీర్థ వారితదుస్తరానర్థ

1. గోపాలబాల = హే శ్రీకృష్ణా! కేవలం = ముఖ్యముగా; తవప్రసాదం ఏవ = మీ అనుగ్రహమునే; అహం = నేను; కాంక్ష = కోరుచున్నాను.; అమితభాగ్యదాతారం = మితములేని సంపదలను యిచ్చు వాడున్నూ అనగా మోక్షముయిచ్చువాడున్నూ,అతులం = అసమానముగానున్నూ;భూరి = గొప్పదిగానున్నూ;విస్తారం = విస్తారముగానున్నూ, దాతారం = ఇచ్చునట్టివాడున్నూ, కమనీయ = దీనులచేత కోరబడదగినట్టి;కరుణాకరం = కరుణకు స్థానభూతుడైనట్టి వాడున్నూ - అగు;గోపాలబాల = శ్రీకృష్ణస్వామివారినే;కాంక్షే = కోరుచున్నాను;విమతమదవిదారం = శత్రువులమదమును కొట్టివేయువాడు, విద్వజ్జన ఆధారం = పండితులకు ఆధారముగా నుండువారు(పోషకులు); శమిత భూరి భూభారం = గొప్పదైన భూభారమును శమింపజేయు వారున్నూ;శకలీకృతారినికరం= శతృసమూహములను తునకలుగా చేయు వారున్నూ అగు శ్రీ కృష్ణస్వామివారినే;కాంక్ష = కోరుచున్నాను,

2. అహం = నేను, అన్యం = ఇతరమును; నకామయే = కోరను; కంసారే! = హే కంసాంతకా! (హే కృష్ణా!); అతి దురూహం = ఊహించుటకు మిక్కిలి సాధ్యము కాని - నీవు; శ్యామ సుందర విగ్రహం = నీలమేఘశ్యామ సుందర విగ్రహము గలవాడవున్నూ; గోపాలబాల = గోపాల బాలుడవున్నూ; నామరూప నిర్వాహం = నామరూప ప్రపంచమును నిర్వహించే వాడవున్నూ;నానా భువన నివహం = నానా లోక సమూహములు కలవాడవున్నూ అన్నిలోకముల నిండియుండువాడవున్నూ అయనట్టి; త్వాం ఏవ = మిమ్ములనే, సా అహ = అట్టినేను; అశ్రయే = శరణాగతిచేయుచున్నాను; త్వరయా = శీఘ్రముగా; మాం = నన్ను; స్వగేహం = మీస్వంత గృహమునకు; నయ = తీసికొనిపొమ్మా!

3. ధరణి మండల తిలక! = భూలోకమునకు తిలకమువంటివాడా! తాపస తారక! = తపస్సంపన్నులను సంసార సముద్రమునుండి తరింప జేయువాడా! పరిజనసుఖకారకా! = సేవకజనులకు సుకమును యిచ్చునట్టివాడా! గోపాలబాలా! = గోపాల బాలుడా! కలవేణునాదరసికా! = సేవక జనులకు సుఖమునకు తిలకము యిచ్చునట్టిదాడా! ; గోపాలబాలా! = గోపాలబాలుడా ! కలవేణునాదరసిక ! = శ్రేష్ఠమైన ముత్యములను ధరించినవాడా!

వరనారాయణ తీర్థ = శ్రేష్ఠమైన నారాయణ తీర్థమువారి ; దుస్తర అనర్థ ! = దాటుటకు వీలుగాని అనర్థములను (కష్టములను) ; వారిత = నివారింప జేయువాడా ! ( అగు - హే స్వామి!) ; తవప్రసాదం కాంక్షే = మీ అనుగ్రహమునే కోరుచున్నాను.

ప. ఓగోపాల బాలా! నేను నీయనుగ్రహ మొక్కదానినే కోరుచున్నాను.

1. ఓగోపాలా! సకలవిధము లగుభాగ్యములనొసంగునట్టియు, లోకోత్తరమగు సమృద్ధితోఁ గూడినట్టియు, కృష్ణుని యనుగ్రహముకంటె నధికమగునది (అనఁగా అధికమగు మేలు సేయునది) లోకమున లేనేలేదు. (ఈకృష్ణుని యట్లేదేవతలును వాంఛాపూర్తి చేయనేరరనుట) దయామయమైనదియు, (దయయనునది అనుగ్రహమునకు కారణము. అనఁగా ఆశ్రితునియొక్క సుగుణములనుగాని, దైన్యమునుగాని చూచినతోడనే దయగల్గును. పిదప ననుగ్రహింతురు) నగు నీయనుగ్రహము నొక్కదానినే కోరుచున్నాను. విద్వాంసులందఱును సర్వమును బరిత్యజించి నీయనుగ్రహము నొక్కదానినే యాధారముగఁ గోరుచుందురు. నీయనుగ్రహము దొరకెనేని శత్రువులందఱు నడంగుదురు. ఆయనుగ్రహమువలననే భూమికిఁ గలభారమంతయును. దీరిపోయినది.

2. దీనికంటె వేఱేమియునాకక్కఱలేదు. ఓకంసమర్దనా! గోపాలా ఊహించుటకుఁగూడ నలవిగాని స్వరూపముగలవాఁడవయ్యును, నీలమేఘశ్యామల మగుసుందరాకారము గల్గియున్నవాఁడవును, సకలజగన్మయుఁడవై నామరూపముల నిర్వహించువాఁడవై ప్రకాశించువాఁడవునగు నిన్నే యాశ్రయించెదను. నన్ను శీఘ్రముగ నీగృహమునకుఁ గొనిపొమ్ము.

4. భూలోకతిలకమా! వేణుగానలోలా! గోపాలబాలా! నీవు మౌనుల రక్షింతువు నిన్ను నమ్మినవారికి కోరినసౌఖ్యముల నొసంగుదువు. మౌక్తిక భూషణముల ధరించినవాఁడా! నీవు నారాయణతీర్థునకుఁ గలయశుభముల నివారించితివి.

శ్లో. నాన్యం వృణే పతి మశేషగురో రనంతాత్
త్వత్తస్సమస్తగుణధామభిరాత్మ తుల్యాత్,
క్షేమం సదైవ గురుదేవశిఖామణే త్వాం
యాచే త్వదంఘ్రికమలే ప్రణతాస్మి నిత్యమ్. 20

శ్లో. 20. అశేష గురోః = సమస్త జగత్తుకు గరువుగా నుండు నటువంటినీ ; అనంతాత్ = అంతము లేనటువంటినీ ; సమస్తగుణధామభిః = సమస్త కళ్యాణ గుణము (తేజస్సు) చేతనున్నా ; ఆత్మతుల్యాత్ = పరమాత్మతోసమానమైనటువంటినీ ; త్వత్తత్ = మీకంటె ; అన్యం = ఇతరుని; పతి = భర్తగా ; నావృణే = కోరడములేదు ; దేవ శిఖామణే = దేవతలకు శ్రేష్ఠుడా; సదైవ = ఎల్లప్పుడు ; త్వాం = మిమ్ములనే ; యాచే = ప్రర్థించుచున్నాను ; త్వదంఘ్రికమలే = మీ పాదాపద్మములనే ; నిత్యం = ఎల్లప్పుడు ; ప్రణితోస్మి = నమస్కరింపుచున్నాను;

ఓసకలవేదశిఖామణీ! సమస్తసద్గుణరత్నాకరుండవై, సకలజగద్గురుండవై యున్ననిను విడచి మరియొకరిని భర్తగాఁ గోరను. ఓనాశరహితా! నీవే నాకుఁ దగినవిభుండవు. నీవు ననుఁ బరిగ్రహింపవలయు. నీపాదపద్మములకుఁ బలుమాఱులు నమస్కరించుచు నీవిషయముననే పలుమాఱు యాచించు చున్నాను. నాకుశుభము నొడఁగూర్పుము.

*సావేరి (శహనా - మోహనా) రాగము - ఆదితాళము*

ప. క్షేమం కురు సతతం గోపాల-మమ క్షేమం కురు సతతం

అ. కామంతవపాద కమలే భ్రమరీభవతు శ్రీ
మన్మమమానసం మధుసూదన

1. అక్షీణకరుణానిధే-ఆనందఘన ప్రక్షీణదోషతతే
శిక్షితాసురగణ రక్షితనిజజన
కుక్షిస్థితానేక కోటిలోకావన

2. ప్రహ్లాదభయవిదూర-పరమయోగిపావన భువనాధార
మోహరహితచిత్త మౌనిమానసహంస
సాహసహతవైరి సంఘమహోదార

3. అజితవిజయగోపాల-అనంతలీల అద్భుతపదకమల
విజయద్వారకాపురీ విమల కమలాలోల
నిజనారాయణతీర్థ నిత్యానందబాల

ప. గోపాల = హే గోపాల కృష్ణా ! మమ = నాకు ; సతతం = ఎల్లప్పుడున్నూ ; క్షేమం = సౌఖ్యమును ; కురు = చేయుము;

అ. శ్రీమన్ = సంపద్యుక్తములైన ; మధుసూదన = మధువు - అనురాక్షసుని సంహరించినాడా ; తవపాదకమలే = మీ పాదకమలము నందు ; మమమానసం = నా మనస్సు ; కామం = మిక్కిలి ; భ్రమరీభవతు = తుమ్మెదవలె ఆశక్తిగలది అవుగాక!

1. అక్షీణకరుణానిధే = ఎల్లప్పటికి క్షీణించని దయాసముద్రుడా! ఆనందఘన = దట్టమైన ఆనందముగలవాడ ; ప్రక్షీణదోషతతే = పాపసమూహములను క్షీణింపజేయువాడ ; శిక్షిత+ అసురగణ = రాక్షస సమూహములను శిక్షించువాడ ; రక్షిత నిజజన = నిజమైన మీ దాసజనులను రక్షంచువాడ ; కుక్షిస్థిత = ఉదరమునందు ఉండునటివంటి ; అనేక కోటిలోకావన = అనేక కోట్లలోకముల రక్షణ గలవాడ

2. ప్రహ్లాద భయవిదూర = ప్రహ్లాదుని భయమును దూరీకృతము చేసినవాడ ; పరమయోగిపావన = శ్రేష్ఠమైన యోగులను పవిత్రముచేయువాడ ; భువనాధార = లోకములకు ఆదారమైనవాడా ; మోహరహిత = మోహము నివర్తికాబడిన ; చిత్త = మనస్సుగల ; మౌనిమానస = మునులయొక్క మనస్సులకు ; హంస! = హంసస్వరూపుడా ! వైరిసంఘ = శత్రుసమూహములను; సాహస = సాహసముచేత; హత = చంపినవాడా; మహాఉదారా! = గొప్పఔదార్యముగలవాడ.

3. అజిత = ఇతరులచేత జయించబడనివాడ; విజయగోపాలా! =జయప్రదమైన గోపాల మూర్తే; అనంతలీల = అనంతములైన లీలలుగలవాడ;అద్భుత పదకమల= ఆశ్చర్యవైన పాదారవిందములు గలవాడా; విజయ = జయమునుయిచ్చు; ద్వారకాపురి = ద్వారకా పట్టణ సంబంధమైన; విమల = నిర్మలమైన; కమల = పురలక్ష్మీయందు; లోల = అసక్తి గలవాడ; నిజనారాయణ తీర్థ = నీ భక్తుడైన నారాయణ తీర్థులవారి యొక్క;నిత్యానంద = నిత్యానందమును;పాల! = పాలించువాడవగు ఓ కృష్ణా! క్షేమం వురుసతతం = ఎల్లప్పుడును సౌఖ్యమును కలుగ జేయుము.

ప. ఓగోపాలా! సర్వకాలములందును నాకు క్షేమమును గల్గింపుము.

అ. ఓమధుసూదనా! నామనస్సు నీపాదకమలములయందుఁ దుమ్మెద యగుగాత! (నాకు నీ పాదపద్మముల సేవించుభాగ్య మొసంగుమనుట)

1. ఓ ఆనందస్వరూపా! సకలదోషరహితా! నీవు కరుణాసముద్రుఁడవు. నీవు సకలలోకములను గర్భమునందు నుంచుకొని వానిరక్షించుటకై దుష్టులగు రాక్షసుల సంహరింతువు. శిష్టులగు భక్తజనుల రక్షింతువు.

2. ఓమహాత్మా! లోకాధారా! నీవు యోగిజనుల పవిత్రులఁజేసెదవు. అజ్ఞానరహితములై నిర్మలములగు మునిచిత్తము లనియెడు మానసరస్సులకు హంసవై (ఋషులచే ధ్యానింపఁబడుచున్నవాఁడై) యున్నావు. అపరిమిత మగుశౌర్యముచే శత్రువుల మర్దించితివి.

3. అపరిమితము లగువిలాసములతోను మిగుల నాశ్చర్యకరములై భక్తులకోర్కుల నొసంగువదకమలములతోను రాజిల్లుచు నెదురులేని పరాక్రమమున విజయములంగాంచుచు, ద్వారకాపురి యనెడులక్ష్మియందు మిగుల నాదరముగల్గి (ద్వారకావాసివై) భక్తుఁ డగునారాయణతీర్థునకు సర్వకాలములయం దానంద మొసంగుచు నున్న యోగోపాలబాలా! నాకు శుభంబుల నొనర్పుము.

శ్లో. గౌరీశంకరపూజార్థం యాత్రా మే నగరాద్బహిః,
యదా తదా హ్యవసరో భవతో మత్పరిగ్రహే. 21

శ్లో.21. నగరాద్బహి = ఊరివెలుపల వుండునటువంటి; గౌరీశంకరపూజార్థం = పార్వతీ పరమేశ్వరుల పూజకొఱకు; మేయాత్ర = నా ప్రయాణము; యదా = ఎప్పుడో ( ఏ సమయమునందో); తదా = ఆ సమయమునందే; భవతః = దేవరవారు; మత్పరిగ్రహే = నన్ను స్వీకరించుటకు; అవసరః = ఆ సమయమే సరియైన అవసరమై; హి = కదా!

ఓ కృష్ణా! నీవు విదర్భకు శ్రీఘ్రముగ రమ్ము. వివాహమునకు ముందుగఁ బార్వతీ పరమేశ్వరులం బూజించుటకై నేను ఊరివెలుపలికి రావలసియుండును. నీవు నన్నుఁ గొనిపోవుట కదియే సమయము.

శ్లో. ఇతి విప్రముఖాచ్ఛ్రుత్వా రుక్మిణ్యా లిఖితం హరిః,
ప్రత్యుత్తరం లిఖిత్వా థ తత్ర గంతుం మనో దధే. 22

శ్లో.22. హరిః = స్వామివారు; రుక్మిణ్యాలిఃతం = రుక్మిణీ అమ్మవారిచేత వ్రాయబడిన లేఖ సంగతులు, విప్రముఖాత్ = బ్రాహ్మణునివల్ల; ఇతి = ఇట్లని ( పై జెప్పిన విధముగా) శృత్వా = విననటువంటివారై; ప్రత్యుత్తరం = తిరిగి జవాబును; లిఖిత్వా = వ్రాసినటువంటివారై; అథ = అనంతరము; తత్రగంతు = అక్కడికి వెళ్ళుటకు; మనోదధే = నిశ్చయించు కొనెను.
ఇట్లు రుక్మిణి పత్రికయందు వ్రాసియున్నవిషయముల నన్నిటిని బ్రాహ్మణుఁడు చెప్పఁగా విని, శ్రీకృష్ణుఁడును ప్రత్యుత్తరమును వ్రాసిపంపెను. విదర్భకుఁ బోవలయునని నిశ్చయించుకొనియెను.

### *రుక్మిణీవిరహములు*

*రుక్మిణీవచనమ్ -*

శ్లో. హేసూనాస్త్ర సముల్లసద్విరహిణీసంహారదోషా దిహ
ప్రాప్తోసి త్వమనంగతాం తవశరాః పంచత్వ మాపు ర్ధ్రువం,
చాపస్తే ధరణీం గతః స్మర నదీగామీ త్వదీయో ధ్వజః
త్వేవం కృచ్ఛ్రగతోపి మన్మథ వధూహింసాగుణం నోజ్ఝసి.

శ్లో.23. హే!సూనాస్త్రా! = ఓ మన్మధుడా! సముల్లసత్ = బాగా సంతోషముగా నుండి; విరహిణీ = పతియొక్క ఎడబాటు చేత కృశించుచుండెడు స్త్రీలను; సంహారదోషాత్ = సంహరించిన దోషమును బట్టి; త్వం = నీవు; ఇహ = ఈ లోకమునందు;అనంగతాం దేహ రహితత్వమును; ప్రాప్తోసి = పొందితివి; తవశరాః = నీబాణములు ( పూలు) ; ధృవం = నిశ్చయముగా, పచత్వం ఆపుః = నశించిపోయినవి, అనగా (రాలిపోయినవి)-అనగా(అయిదు విధములుగా చీలిపోయినవి);తే = నీయొక్క; చాపః = ధనుస్సు; ధరణిం గతః = నేలపాలయినది; స్మర! = ఓ మన్మధుడా! త్వదీయో ధ్వజః = నీయొక్క ధ్వజము; నదీగామీ = నదిలో కలిసి పోయినది; మన్మధా! = హే మన్మధుడా ! (ఓ మన్మధుడా!) ;ఏవం = ఈ విధముగా ; కృచ్ఛ్రగతోపి = కృశించినవాడవు అయినను ( కష్టములు పొందినను); వధూ హింసా గుణం = స్త్రీలను హింసించు గుణమును; నోజ్ఝసి = వదలి పెట్టక పోయితివి.

అచట రుక్మిణియు శ్రీకృష్ణుఁడు శ్రీఘ్రముగ రాకపోవుటచే మిగులఁ బరితపించుచు మన్మథు నుద్దేశించి యిట్లనియె. ఓమన్మథా! వియోగమును చెందియున్న స్త్రీలవంచించుచుండుటచే అస్త్రీ హత్యాదోషములవలన నీవు శరీరవిహీనుఁడవైతివి. నీబాణములును పంచత్వమునొందినవి. (పంచత్వమనఁగా మృతి అయిదుగానుండుట) నీధనుస్సు (పుష్పములు) నేలపాలైనది. (ఎంతచిన్నగాలి

వీచినను పూలురాలును గావున నిట్లు చెప్పఁబడెను) నీధ్వజము (చేఁప) నదులలో బడినది. నిశ్చయము. ఓమదనా! స్త్రీహత్యాదోషమువలన నిన్ని నష్టములు సంభవించెనని బాగుగ నెఱింగియుండియు, ఆగుణము నిప్పటికిని మానకున్నావు.

శ్లో. అకళంకః కమలాప్త స్సౌమ్యశ్శౌరిర్భవాంస్తు సకళంకః,
కమలారిరుగ్రమౌళిః కథమిందో తవాప్యహో విధునామ.

శ్లో.24. శౌరి = శ్రీమన్నారాయణ మూర్తి ; కమలాప్తః = లక్ష్మికి ప్రియుడున్నూ; అకళంకః = కళంకములేనివాడున్నూ; సౌమ్య = సుప్రసన్నుడున్నూ - అయివున్నాడు, భవాంస్తు = నీవుఅయితేనో; స కళంకః = కళంక సహితుడవున్నూ; కమలారి = కమలములకు శత్రుడవున్నూ; రుద్రమౌళిః = రుద్రుని శిరస్సున వుండువాడవున్నూ అయివున్నావు; అహో ఇందో! = ఓ చంద్రుడా! తవ = ఇట్టినీకు ; విధునామఅపి = విధు అను పేరుగూడ; కథం? = ఎట్లువచ్చినది?

అంత చంద్రు నుద్దేశించి యిట్లనియె. ఓచంద్రా! నీకును 'విధు' అనెడు పేరుండుట మిగులఁ జిత్రముగ నున్నది. అది శ్రీమన్నారాయణుని పేరుకదా. ఆమహాత్ముడు కళంకరహితుఁడు, కమలాప్తుఁడు, (లక్ష్మీదేవి ప్రియుఁడు అనిప్రస్తుతార్థము. కమలములకు ప్రియుఁడు అని రెండవ యర్థము) శాంత స్వభావుఁడు. నీవన్ననో కళంకసహితుఁడవు, కమలారివి. (కమలముకు శత్రువు అని ప్రస్తుతార్థము. లక్ష్మికి శత్రుఁడవు అని రెండవయర్థము) ఉగ్రమూర్తివి భయంకర మగునాకారముగలవాఁడవు అని ప్రస్తుతార్థము. ఈశ్వరుని యష్టమూర్తులలో నొక్కఁడవు అని రెండవయర్థము) ఇట్లు ప్రత్యక్షవిరుద్ధముగా నున్న నీకు విధుఁడను పేరేల గల్గెనో తెలియకున్నది.

శ్లో. శ్రీకృష్ణహృదయం జ్ఞాత్వా పునరాగమనే ద్విజః,
శ్రీకృష్ణాగమనోత్సాహం ప్రాహ భైష్మీం ప్రతి ప్రియమ్ 25

శ్లో.25. ద్విజః = బ్రాహ్మణుడు; శ్రీ కృష్ణ హృదయం జ్ఞాత్వా = శ్రీ కృష్ణుని హృదయ అభిప్రాయమును తెలుసుకొన్న వాడై ; పునరాగమనే= తిరిగి కుండిన నగరమునకు రావడముతోనే ; భైష్మీం ప్రతి = రుక్మిణీ అమ్మవారిని గూర్చి ; ప్రియం = అమ్మవారు వినుటకు సంతోషకరమైనటువంటి ; శ్రీ కృష్ణ ఆగమనోత్సాహం = స్వామివారువేంచేయుటకు ఉత్సాహము కలిగియున్నారు - అనువార్తహతను ; ఆహ = పలికెను.

అంత శ్రీకృష్ణునియొద్దకుఁ బోయి యుండిన బ్రాహ్మణుఁడు తిరిగి వచ్చెను. శ్రీకృష్ణుని యభిప్రాయమును బాగుగఁ దెలిసికొనివచ్చినవాఁడగుటచే తక్షణమే రుక్మిణియొద్దకుఁ బోయి "కృష్ణుఁ డిచటకు రావలయునని మిగుల ఉత్సాహముతో నున్నాఁడు" అని యాశుభవార్త నామె కిట్లని యెఱిఁగించెను.

9వ - కీర్తన - యదకులకాంభోజిరాజిరాగం - ఆదితాళము

| | | |
|---|---|---|
| ప. | శరణం జగతా మేవ | సకలాంతరాత్మా |
| | త్వరయై వాయాతి | హరిస్తే మతి మాతనుతే |

| | | |
|---|---|---|
| 1. | వనమాలీ కిల నూనం | వసుదేవాపత్యం |
| | సనకాదిముని హృదయ | సత్కమలసంవేద్యం |
| 2. | చారుతరేణరథేన | దారుకసారథినా |
| | ద్వారవతీనగరా | దాయాతి తవ స్వామీ |
| 3. | మాబాలే కురు చింతాం | మంజుతరాలాపే |
| | మాధవ మేష్యసి నూనం | వసుధాతలతిలకం |
| 4. | క్షేమం కురుతే తవ | క్షీరాబ్ధిశాయీ |
| | శ్రీమా నఖిలాత్మా | చామీకరపరిధానీ |
| 5. | హరిచరితమధు నారాయణ | తీర్థముఖోద్గళితం |
| | పరిజనమునినరమత్త | భ్రమరైరాపీతం |

ప. జగతాం శరణం = జగత్తు కంతా రక్షకుడుగా నుండి వారున్నూ అగు ; హరి = శ్రీకృష్ణస్వామివారికి; తే ఏవ = నీయందు ; మతిం = మనస్సును ; అతనుతే = విస్తరింపచేయుచున్నారు ; త్వరయైన = శ్రీ ఘ్రముగానే ; ఆయాతి = వచ్చుచున్నాడు ;

1. వసుదేవ అపత్యం = వసుదేవుని సంతానమెన శ్రీ కృష్ణలవారు ; నూనం = నిశ్చయముగా ; వనమాలి = శ్రీమన్నారాయణుడు; కిలా = కదా! ; సనకాదిముని హృదయ = సనక, సనందన మొదలగు మౌనుల హృదయము - అను ; సత్కమల = దివ్యకలములయందు ; సంవేద్యం = బాగాతెలియబడుచుండువారున్నూ;

2. దారుక సారథిన = దారకుడను సారథిచేతోలబడుచుండు ; చారుతరేణ=దివ్యసుందర తరమైన ; రథేన = రథముమీద ; తవ స్వామీ = మీ భర్త యైన స్వామివారు ; ద్వారతీనగర్యాత్ = ద్వారకా నగరమునుంచి ; ఆయాతి = వచ్చుచు న్నారు (విజయముచేయుచున్నారు).

3. మంజుతరాలాపే = మృదుమధురసల్లాపములు గలిగినట్టి ; బాలే = హే అమ్మాయ ! చింతాం = దుఃఖమును ; మాకురు = చేయవద్దు ( దుఃఖపడవద్దు) , వసుధాతల తిలకం = భూమికి అంతా బొట్టు ప్రాయముగానుండు ; మాధవం = శ్రీ కృష్ణస్వామివారిని, లక్ష్మీనారాయణుని ; నూనం = నిశ్చయముగా ; ఏష్యసి = పొందగలవు.

4. క్షీరాబ్ధి శాయి = పాలసముద్రమునందు పవళించుయుండు స్వామివారు ; తవ = నీకు ; క్షేమం =మేలును ( నీ యిష్టమును)

కురుతే = చేయును ; శ్రీ మాన్ = శ్రీమంతుడున్నూ ; అఖిలాత్మ = సమస్త జగత్తుకు అత్మస్వరూపుడుగా నుండువాడున్నూ ; చామీకరపరిధారిని = బంగారు వస్త్రమును ధరించినవారున్నూ అగు శ్రీ కృష్ణలవారు వచ్చుచున్నారు.

5. నారాయణ తీర్థ = నారాయణ తీర్థులవారి యొక్క ; ముఖోద్గళితం = మఖమునుండి వెలువడిన ; హరి చరితం = స్వామివారు వృత్తాంతము అను; మధు - తేనెను ; భ్రమరై = తుమ్మెదలు; పరిజనమునివరమత్త = మదంచిన పరిజనులు మునులు - అను; భ్రమరైః = తుమ్మెదలు ; ఆపీతం = బాగాపానము చేయడుచున్నది.

ప. ఓ రుక్మిణీ! సకలలోకములకును రక్షకుఁడును, సర్వాంతర్యామియునగు శ్రీకృష్ణుఁడు శీఘ్రముగనే వచ్చును. నీవుకోరినట్లే యాచరించును.

1. సనకసనందనాదిమహామునులు తమజ్ఞానదృష్టులవలనఁ దెలిసికొని సర్వకాలములందును ధ్యానించుచుండ, నలరారునట్టి యావసుదేవపుత్రుఁడు వనమాలాలంకారుఁడు నిశ్చయముగ నిటవచ్చును.

2. దారుకుఁ డనువాఁడు సారథ్యము సేయుచుండ, మనోహరమగు రథమునెక్కి నీప్రాణనాథుఁడు ద్వారకానగరమునుండి వచ్చును.

3. ఓ మంజుభాషిణీ! రాజపుత్రీ! నీవు చింతింపవలదు. భూలోక తిలకుండగు నాశ్రీకృష్ణుడు నిను బరిగ్రహించును. సంశయములేదు.

4. శ్రీమంతుఁడును, సర్వాత్ముండును, పీతాంబరుండు నగు నాక్షీరసాగరశయనుఁడు నీకు శుభము లొనర్చును.

5. నారాయణతీర్థుని ముఖకమలమునుండి స్రవించుచున్న శ్రీకృష్ణుని కథయనెడు మకరందమును విష్ణుభక్తులగు మునులును (యతులును), మనుష్యులును, భ్రమరంబులునుంబోలెఁ బానము సేయుచున్నారు. (కృష్ణకథ యాహ్లాదకరముగా నుండును గావున సామాన్యజనులు కూడ, అనఁగా భక్తిలేనివారలుకూడ దీనిని వినుచుందురు. ఈ విషయమును సూచించుటకే ప్రత్యేకముగా నరశబ్దము ప్రయోగింపఁ బడియున్నది)

శ్లో. ద్విజముఖసరసిజగళితం హరివచనామృతం సమాపీయ,
ఆనందానుభవాఢ్యా రుక్మిణ్యాస్తే మనస్సమాధాయ 26

శ్లో. 26. రుక్మిణి = రుక్మిణి అమ్మవారు ; ద్విజముఖసరసిజగళితం = బ్రాహ్మణుని ముఖమను కమలములనుండి (జారిపడినటువంటి) వెలువడినటువంటి ; హరివచనామృతం = శ్రీ కృష్ణుని వాగామృతమును ; సమాపీయ = పుచ్చుకున్నదియై ( విన్నదియై) ; మనః = మనస్సును ; సమాధాయ = సమాధానపరుచుకొని; ఆనందం అనుభావాఢ్యా = ఆనంద అనుభవముతో ఒప్పుచున్నదియై ; ఆస్తే = ఉండెను ;

ఇట్లాబ్రాహ్మణుని ముఖకమలమునుండి స్రవించిన శ్రీకృష్ణవాక్యామృతమును బానముఁజేసి (శ్రీకృష్ణుఁడు చెప్పినమాటలను, బ్రాహ్మణుఁడు తనతోఁ జెప్పఁగా విని) పరమానందము ననుభవించు నారుక్మిణి మదిలో నూరటఁ జెందియుండెను.

గ. అథ కోసల కురుపాంచాలమైథిలచేదిమాగధమత్స్య మాళవ వంగకళింగ సౌరాష్ట్ర ఘూర్జర మహారాష్ట్ర సైంధవ కాశ్మీర కేరళకొంకణ ద్రవిడ నేపాళ కర్ణాటకాది దేశాధిష్ఠితారో మహాప్రభావాః అతిరథమహారథాది పద్మమహాపద్మ సంఖ్యాకసైన్యకాః రాజతజాంబూనదమహర్హ వజ్రవైడూర్యమరకతాది విచిత్రరత్న యుతానేకకోటి తటిద్రత్న ప్రద్యోతమానదివ్య విమానసమారూఢాః ధిక్కృతసురసంపదః మత్తమాతంగ తురంగ వాహనవాహినీశతపరివేష్టితాః మదనమదాపహారి సౌందర్యశాలినః సకలకలాకుశలాః కుండిననగరవరపరిసర సముదితాః పంక్తిరథాస్సమాసతే. 27

గద్య 27. అథ = అనంతరమందు ; కోసల , కురు పాంచాలి,మిధిలి, చేది, మాగధ, మత్స్య, మాళవ, వంగ, కళింగ, సౌరాష్ట్ర, సైవధవ, కాశ్మీర, కేరళా, కొంకణ, ద్రవిడ, నేపాళ, కర్నాటక ఆది = మొదలైనటువంటి; దేశాధిష్టితారః = దేశముల ప్రభువులు; మహాప్రభావాః = గొప్పప్రభావము కలవారున్నూ; అతిరథ = అతిరధులున్నూ; మహారధులున్నూ = మహారధులున్నూ; ఆది = మొదలగునటువంటి; పద్మ మహాపద్మ అను సంఖ్యలు గలిగిన; సైన్యకాః = సైనికులనుకలవారై; రాజిత = వెండిచేతను; జాంబూనద = బంగారుచేతను చేయబడి; మహార్హః = గొప్పవెలగలిగినటువంటి; వజ్ర,వైడూర్య,మరకత,అది; విచిత్ర = అనేకచిత్రములైన; రత్నయుత = అనేక కోట్లరత్నముల చేత (రత్నములతో కూడుకున్న); అనేకకోటిరత్నం= అనేకకోట్లరత్నములచేత; ప్రద్యోతమాన = ప్రకాశించుచుండునట్టి; దివ్యవిమానారూఢాః=దేవతా సంబంధమైన విమానములవంటి రధములమీద; సమానారూఢాః = ఎక్కినటువంటివారై; ధికృత = ధిక్కరించుచున్న; సురసంపదః = దేవతా సంబంధమైన సంపదగలవారై; మత్త = మదించినట్టి; మాతంగ = ఏనుగులు; తురంగ = గుఱ్ఱములు; వాహన = వాహనములు కాగలిగినట్టి; వాహినీశత్నపరివేష్టితాః = అనేకవందల సైన్యములచేత చుట్టుకొన బడినవారై; మదన = మన్మధునియొక్క; మదావహారి = మదమునుపోగొట్టునట్టి; సౌందర్యశాలినః = సౌందర్యముగలవారై; సకలకుశలాః = అన్నివిద్యల యందుపండితులై; కుండిన నగరీవర = శ్రేష్ఠమైన కుండిన నగరము యొక్క; పరిసరసముదితాః = నగరపురోభాగమునందు; పంక్తిరథాః = రథములు పంక్తులుగా ఒప్పునట్లు; సమాసతే = అక్కడ ఉండిరి.

ఇట్లుండ వివాహదినము సమీపించెను. అప్పుడు కోసల, కురు, పాంచాల, మైథిల, చేది, మాగధ, మత్స్య, మాళవ, వంగ, కళింగ, సౌరాష్ట్ర, ఘూర్జర, మహారాష్ట్ర, సైంధవ, కాశ్మీర, కేరళ, కొంకణ, ద్రవిడ, నేపాళ, కర్ణాటకాధీశ్వరులు, పద్మము, మహాపద్మము మొదలగు నపరిమితసంఖ్యలుగల రథగజతురగపదాతి సైన్యములు తమ్ము పరివేష్టించి వచ్చుచుండ వెండితోను, బంగారుతోను చేయఁబడినవియు, వజ్రవైడూర్యాద్యుత్తమరత్నములచే నలంకృతములై, మెఱవుదీఁగెలవలె ప్రకాశించుచుండినవియు నగు రథములపై నెక్కి కుండిననగరప్రాంతమునకుఁ జేరిరి. మన్మథుని జయించు సౌందర్యముతోను, దేవేంద్రునిమించు ధనసమృద్ధితోను, అద్భుత మగుప్రభుశక్తితోను, వర్ణనాతీతమగు పాండిత్యముతోను వీరులై ప్రకాశించుచుండిరి.

శ్లో. త్రైలోక్యసంపత్కలయావతీర్ణా
యా రుక్మిణీ సాగరరాజకన్యా,
నేయం భవానీభవభావయుక్తా
సంపూజ్య నిర్యాతి సఖీసమేతా. 28

శ్లో.28. సాగరరాజకన్యాః = సముద్రుని కుమార్తెయును; త్రైలోక్య = మూడులోకములలో (స్వర్గ,మర్త్య,పాతాళములలో); సంపత్కలయావతీర్ణ = సంపదాంశములతో వశించునటు వంటి;యారుక్మిణి = ఏరుక్మిణీ అయితే కలదో; స+ఇయం(సేయం)= ఆ, ఈ రుక్మిణీ అమ్మవారు; భవానీ,భవ భావయుక్తా = పార్వతీ పరమేశ్వరులయందు తన భావమును ఉంచినదై; సంపూజ్య= పూజించి; సఖీ సమేతా = చెలికత్తెలతో కూడుకున్నదియై; నిర్యాతి = (ఆ రాజులు వశించిన) మార్గము గుండా వచ్చుచున్నది.

త్రిభువనసంపద్రూపిణి యయ్యుఁ, గృష్ణరూపమున నవతరించిన విష్ణువును సేవించుటకై యాలక్ష్మీదేవియే రుక్మిణియై యవతరించియుండెను. అట్టి జగన్మోహిని యగురుక్మిణి యవ్వివాహదినమునఁ దొలుదొలుత పార్వతీ పరమేశ్వరులఁ బూజించుటకై యూరువెలుపలనుండు దేవాలయమునకుఁ బోయి యచట నర్చనను ముగించి యారాజులందఱు నిలిచియున్న మార్గమున బయలుదేరెను.

శ్లో. అత్రాంతరే ద్వారవతీనగర్యా
రథేన గత్వా స రథాంగపాణిః,
ఆస్తే మహీపాలమహాసభాయాం
సూర్యో యథా దీపసహస్రమధ్యే. 29

శ్లో.29. అత్రాంతరే = ఈ లోపల ; ద్వారవతీనగర్యా = ద్వారకా నగరమునుండి; సరథాంగ పాణిః = ఆ చక్రదరుడైన స్వామివారు; రథేన గత్వా = రథముమీద కూర్చుండి వేంచేసినవారై; దీప సహస్రమధ్యే = వెయ్యిదీపముల నడుమనువుండిన, సూర్యః = సూర్యుడు, యధా = ఏప్రకారముగానుండునో; తథా = ఆ విధముగానే; మహీపాల మహాసభాయాం = గొప్ప దేశాధిపతుల మహాసభయందు; ఆస్తే = నిలిచియుండిరి.

ఈ మధ్యకాలముననే చక్రపాణియు రథారూఢుఁడై ద్వారకాపురమునుండివచ్చి దీపములనడుమనున్న సూర్యునియట్లు, ప్రకాశించుచు సమూహమధ్యమున నిలచియుండెను.

గ. తత్ర ఖలు వేత్రపాణయః నిరస్తసమస్తసమ్మర్దా రుక్మిణ్యాః పరిజనాః పరితో బభూవుః.

గద్య.30. తత్ర = అక్కడ; సమస్త సమ్మర్ద=సమస్తమైనజనుల తొకిడినిన్నీ,ధ్వనినిన్నీ; వేత్రపాణయః = చేతియందు బెత్తములు గలవారై; నిరస్త = నివారింపుచూ; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారి సంబంధమైన; పరిజనాః = సేవకులు; పరితో బభూవుః = చుట్టును నిలిచియుండిరి; ఖలు = కదా!

అట్లు ప్రయాణమై వచ్చుచుండిన రుక్మిణీదేవికిఁ చుట్టును బెత్తముల ధరించి జనసమ్మర్దముల నివారించుచు పరిచారకులు నడచుచుండిరి.

శ్లో. పదాంగుళిన్యస్తదృశంవ్రజన్తీం
భైష్మీం ప్రతి ప్రాహ చ దర్శయన్తీ,
తస్యా స్సఖీ రాజసుతాన్ క్రమేణ
వేత్రేణ విజ్ఞాపయతీవ దూతీ. 31

శ్లో.31. పదాంగుళి = పాదముల వేళ్ళయందు;న్యస్త = ఉంచబడిన , దృశం = చూపులు గలిగి; వ్రజన్తీం = నడచుచున్నట్టి; భైష్మీంప్రతి = రుక్మిణీ అమ్మవారిని గూర్చి, తస్యాస్సః = ఆమెగారి చెలికత్తెయున్నూ; దూతి = సమాచారములు చెప్పునదిన్నీ అగు ఒకదాశి; వేత్రేణ = తనచేతి బెత్తముచేత, క్రమేణ = వరుసగా; రాజసుతాన = రాజపుత్రులను; దర్శయంతి = చూపించుచు; విజ్ఞాపయతీచ =నామప్రభావములు విన్నవించుచు; ప్రాహచ = ఇట్లని చెప్పదొడంగెను.
అప్పు డారుక్మిణి తలవంచి పాదాంగుష్ఠములఁ జూచుచు నడచుచుండ, నొకచెలికత్తె యచటనున్న రాజకుమారుల వరుసగఁ జూపుచు నిట్లని విన్నవించె.

10వ కీర్తన - ముఖారిరాగము - అటతాళము

| | | | |
|---|---|---|---|
| 1. | దూతీ. | కోమలాధరి రుక్మిణి<br>కామసుందరమాకలయ | కోసలాధిపతిరయం<br>కల్యాణి రాజకన్యకే |
| 2. | రుక్మిణీ | దూతి మాకురు విలంబం<br>భాతి కిన్న తె మామకం | నీతిసారజ్ఞేసుందరి<br>భావుకం మానసవృత్తం |
| 3. | దూతీ. | పశ్య పాంచాలమైథిలౌ<br>నిశ్చలా విభూతి ర్యత్ర | పార్థివావథ సంపన్నే<br>నీతి రప్యబ్జలోచనే |
| 4. | రుక్మిణీ | తారకా ఇవ దృశ్యంతే<br>వారయ దూతి పార్థివాన్ | శారదచంద్రసన్ని ధౌ<br>సారవివేకచతురే |
| 5. | దూతీ. | కౌరవం కలయ దేవి<br>పౌరజానపదోపేతం | కురుదేశాధిప మిహ<br>పద్మపత్రలోచనే |
| 6. | రుక్మిణీ. | అత్ర కిన్నుతే విచిత్రం<br>తత్ర తత్రాట తన్వంగి | చిత్రచారిత్రసంపన్నే<br>తామసీ మాభవ దూతి |

| | | | |
|---|---|---|---|
| 7. | దూతీ. | మాగధమత్స్యమాళవ<br>నగరఘూర్జరదేశ | వంగకళింగసౌరాష్ట్ర<br>నరపాలానాలోకయ |
| 8. | రుక్మిణీ. | సంతు రాజానో దూతికే<br>కింతతో మే చల బాలే | సఖీ సహస్రశోభువి<br>కీర్తి మాకలయ మయి |
| 9. | దూతీ. | కేరళనేపాళకోంకణద్రవిడాంధ్ర<br>ధరణీపాలకా నవ | కర్ణాటకకోసలకురుపాంచాల<br>ధారయరాజకన్యకే |
| 10. | రుక్మిణీ. | చర్వితచర్వణే నాలం<br>సారకమలసం కాశాక్షం | చక్రిణం దర్శయ బాలే<br>శారదచంద్రసన్నిభాస్యం |
| 11. | దూతీ. సుందరం | పశ్య సుందరి<br>నందనందన మాకలయ | నందయశోదానందనం<br>నారాయణతీర్థయతిగీతం |
| 12. | రుక్మిణీ. | ద్వారకాపురీపాలకం | దూరితదుర్జనజాలకం |

ధీర మాకలయే కృష్ణం - వసుదేవ దేవకీతనయం

1.దూతి: కోమలాధరీ = కోమలమైన పెదవిగల్గినట్టి; కళ్యాణి = శుభన్కరమైనటువంటి, రాజకన్యకే=రాజకుమార్తెవైనటువంటిన్నీ; రుక్మిణీ = ఓరుక్మిణీ! అయం = ఈ కనబడుచున్న పురుషుడు; కోసలాధిపతి = కోసలదేశపు రాజుగానున్నాడు, కామసుందరం = మన్మధుని వంటి సౌందర్యము గల ఈయనను, ఆకలయ = చూడుమా!

2.రుక్మిణి: నీతి సారజ్ఞే = నీతిసారమును తెలిసినటువంటి, సుందరీ ! = సౌందర్యమునుకలిగిన , దూతీ! = ఓ దాసీ! విలంబం = ఆలస్యమును, మాకురు = చేయవద్దు; మామవం = నా యొక్క ; భావుకం = మంగళకర మైన ;మానసవృత్తం = మనోద్దేశ్యము ( మనోర్తనము); తే = నీకు ; నభాతి కిం?= గోచరించలేదాయోను.

3.దూతి:- సంపన్నే! = భాగ్యవంతురాలైన,అబ్జలోచనే = తామర కమలములవంటి నేత్రములుగల ఓరుక్మిణీ! అధ= అనంతరమందు, విభూతి = ఐశ్వర్యమున్నూ; నీతిరపి = సదాచారమున్నూ= యత్ర= ఎవరియందు, నిశ్చల = చలనములేకుండా వుంటూవున్నవో - అట్టి, పాంచాల = పాంచాలదేశముయొక్క; మిధిల = మిధిలదేశముయొక్క; పార్థివ = ప్రభువులుగా నుండు (వీరిని) ; పశ్య = చూడుము.

4.రుక్మిణిం సారవివేక చతురే = జ్ఞానమునందు,చతురతయందుస్వారసయమెరిగిన, దూతీ! = ఓ చెలికత్తె! శారద చంద్ర సన్నిధౌ = వరత్కాలచంద్ర సన్నిధానమునందు ( ఈ రాజులందరున్నూ); తారకయివ = నేత్రములవలె, దృశ్యంతే = ప్రకాశించుచున్నారు; పార్థివాన్ = అట్టిరాజులను; వారయ = తొలగింపుమా.

5.దూతి : పద్మ పత్ర విలోచనే = తామర కమల పత్రముల వంటి నేత్రములుగల , దేవిః = హేరుక్మిణీ దేవీ! ఇహ = ఇక్కడ; పౌరజానపదోపేతం = పురుజనులు పల్లె గ్రామస్తులు వాళ్ళతో కూడుకోనియున్న ; కురుదేశాధిపం = కురు దేశరాజుఅయినటువంటి ; కౌరవం = కురుదేశాధీశుడైన (దుర్యోధనుని ) ; కలయ = చూడుమా ;

6. రుక్మిణి చిత్ర చారిత్ర సంపన్నే! = చిత్రమైన నడవడి కలిగినటువంటిన్నీ ; తన్వంగి = సూక్ష్మశరీరముగలిగినటువంటిన్నీ ; దూతి! = ఓ చెలికత్తె ! అత్ర = ఈ కనపరిచిన రాజులయందు ; తే = నీకు ; విచిత్రం కిన్ను = ఏమి విశేషములు కనపడినవి ? తామసి మాభవ = ఆలస్యము చేయవద్దు ; తత్ర తత్ర అట = ఆ పవిత్రదేశమునకు అటవెళ్ళుమా ( కదలివెళ్ళుమా) సాగిపోనిమ్మా.

7. దూతి : - హే రుక్మిణీ! = మగధ, మత్స్య, మాళవ, వంగ, కళింగ, సౌరాష్ట్ర, ఘూర్జర దేశములలోని , నగర = పట్టణములయొక్క ; నరపాలాన్ = ప్రభువులను; ఆలోకయ = చూడుమా.

8. రుక్మిణి : దూతికే = దాసి అయిన ; సఖీ ! = ఓ చెలికత్తె ! భువి = లోకమునందు; సహస్రశః = వేలకొలది ; రాజానః = రాజులు ; సంతు = కలరు (ఉందురుగాక); అయితే (ఉంటే వుండనీ) ; బాలే! = ఓ చెలికత్తే ; తతః = అందువల్ల ; మే కిం? = నాకు ఏమి ఉపయోగము? చల = జరిగిపొమ్ము ; మాయి ! ఓ అంబా! కీర్తిః = కీర్తి స్వరూపుడైన స్వామివారిని ; ఆకలయ = చూడుమా, చూపించుమా.

9. దూతి : రాజకన్యకే = హే రుక్మిణి ; కేరళ, నేపాళ, కొంకణ, ద్రవిడ, ఆంధ్ర, కర్ణాటక ( దేశములయొక్క) ధారుణీ పాలక = ప్రభువులను ; అవధారయ = గమనించవమ్మా ;

10. రుక్మిణి : బాలే! = హే చెలికత్తే! చర్విత చర్వణేన = చెప్పినదే చెప్పడము ; అలం = చాలును ; సార కమల సంకాశాక్షం = రసవంతమైన కమలములతో సమానమైన నేత్రములు కలిగినటువంటినీ ; శారద = శరత్కాల ; చంద్ర = చంద్రునితో ; సన్నిభ = సమానమైనటువంటి; ఆస్యం = ముఖముగలిగి నటువంటిన్నీ ( అటువంటి) ; చక్రిణం = చక్రధరుడైన స్వామివారిని ; దర్శయ = చూపించుమా.

11. దూతి : సుందరి! = ఓ రుక్మిణీ ! సుంధరం = సౌంధర్యవంతుడైనటువంటిన్నీ ; నందయశోదానందనం = నందుడు యశోదకు ఆనందమును ఇచ్చునట్టిని ; నంద నందనం = నందుని కుమారుడైనటువంటి కృష్ణుని ; ఆకలయ = సేవించుమా ; నారాయణ తీర్థయతి గీతం = నారాయణ తీర్థయతివల్ల గానముచేయబడినది.

12. రుక్మిణి : ద్వారకా పురిపాలకం = ద్వారకా పట్టణమును పాలించువాడున్నూ ; దూరిత దుర్జన జాలకం = దుర్జన సమూహములను నశింపచేసేవారున్నూ ; ధీరం = ధైర్యవంతులున్నూ ; వసుదేవ దేవకీతనయం = వసుదేవ దేవకీతనయుడైనటువంటిన్నీ ; కృష్ణం = శ్రీ కృష్ణులవారిని; ఆకలయే = చూచుచున్నాను.

1. దూతి. ఓ కల్యాణీ! చిగురాకుంబోలె కోమలమగు పెదవిగల సుందరాంగీ! రుక్మిణీ! ఈయన కోసలదేశపురాజు. ప్రత్యక్షముగ మన్మథునివలె నున్నాఁడు. చూడుము.
2. రుక్మిణి. ఓదూతీ! నీవాలస్యము చేయకుము. నీకు నీతిశాస్త్రసారము చక్కగఁదెలియును. నామనసునందున్న మంగళకరమగు నభిప్రాయము నీకుఁ దెలియదా?
3. దూతి. ఓకమలలోచనా! వీరు పాంచాలమిథిలరాజులు. వీరింజూడుము. ఓసంపన్నురాలా! వీరిరాజ్యములందు ఐశ్వర్యమునకు కొదువలేదు. నీతికిని తక్కువలేదు.
4. రుక్మిణి. ఓదూతి! నీవు మిగుల వివేకముగలదానవు. ఈరాజులందఱును చంద్రునియెదుటనున్న నక్షత్రమువలెఁ గన్పట్టుచున్నారు. వీరిని విడువుము.
5. దూతి. కమలమువంటి విశాలనేత్రములుగల యోరుక్మిణీ! ఈయన కురుదేశాధీశ్వరుఁడు. పురజనులతోను గ్రామవాసులతోనుఁ గూడి వచ్చియున్నాఁడు.
6. రుక్మిణి. ఓదూతికా! నీకిట నేమివిచిత్రము గానవచ్చినది. ఓతన్వీ! నీకార్యములు మిగులచిత్రములు. ఇఁక నాలస్యము చేయక అవైపునకుఁబొమ్ము.
7. దూతి. మాగధ మత్స్య మాళవ వంగ కళింగ సౌరాష్ట్ర ఘూర్జరి దేశాధీశ్వరు లిచట నున్నారు. రుక్మిణీ! వారినిఁ జూడుము.
8. రుక్మిణి. ఓచెలీ! ఈభూలోకమున నెందఱో రాజులున్నారు. వేనవేలుగ నున్నారు. వారందఱితో నాకేమిపని? కదలుము. కీర్తిని సంపాదింపుము.
9. దూతి. ఓరుక్మిణీ! కేరళ నేపాళ కొంకణ ద్రవిడాంధ్రకర్ణాటక రాజులును జూడుము.
10. రుక్మిణి. తామరరేకులవలె విశాలములగు నేత్రములు కల్గినట్టియు, శరత్కాలచంద్రునితో సమానమగు ముఖము గలిగినట్టియు, నాశ్రీకృష్ణుని జూపుము. ఓబాలికా! పలుమా రీరాజులను గూర్చి చెప్పనేటికి?
11. దూతి. ఓసుందరీ! రుక్మిణీ! త్రిభువనసుందరుఁ డగునాకృష్ణుఁడిచట నున్నాఁడు. నందయశోదల కానందమును గలిగించినట్టియు, నందుఁడను మునికి మోక్షము నిచ్చునట్టియు, నారాయణతీర్థునిచే వినుతింపఁబడు చున్నట్టియు నాహరినిం జూడుము.
12. రుక్మిణి. ద్వారకాపట్టణమునకు నాయకుండును, దుష్టుల మర్దించువాఁడును, దేవకీవసుదేవులకు పుత్రుండును, ధీరుండు నగు నాశ్రీకృష్ణునిఁ జూచుచున్నాను.

శ్లో. వైదర్భీవసుదేవసూనునయనా న్యన్యోన్యవిన్యాసతో
ధన్యానా మపి ధన్యతాం జనిమతాం కన్యావరాణాం ధురి,
అన్యోన్యోపమితాని యాని భువి సంత్యన్యాని వస్తూనితత్
సర్వస్యాప్యుపమాపయంత్వితి తయోశ్చిత్తైకతాం కుర్వతే.

శ్లో. 32: - వైదర్భి = రుక్మిణీ అమ్మవారియొక్కయు ; వసుదేవసూనూ = శ్రీకృష్ణ స్వామివారియొక్కయూ; నయనాని = కన్నులు ; అన్యోన్యవిన్యాసతః = ఒండొరులమీద ప్రేమ వీక్షణ ప్రసరణలచేత; ధన్యానాం = కన్యావరాణం = ధన్యులైనట్టి కన్యావరులకు , అపి = కూడా? ధురీ =

శ్రేష్ఠత్వమునందు ధన్యతాం = ధన్యత్వమును ; జనిమతాం = కలుగజేయుచున్నవియై (మరియు) ; అన్యోన్య = అనురాగమునందు ఉపమానమును కోరుచూ; యాని అన్యాని వస్తూని = ఏ ఇతరవస్తువులు, భువిసంతి = భూమియందుగలవో;తత్సర్వవ్య = ఆ వసుతవుల యన్నిటికి, వయం = మేమే, ఉపమానితి = ఉదాహరనము అనునట్టి భావములను కనుపర్చుచూ;తయోః= ఆ రుక్మిణీ కృష్ణుల యొక్క; చిత్త ఏకతాం = భావముల ఐకమత్యమును; కుర్వంతె = కలుగచేయుచున్నది.

రుక్మిణీ కృష్ణులయొక్క ప్రేమాంచితములయిన వీక్షణములు అన్యోన్య సమ్మేళితములయి అఖిలములయిన కన్యావరుల ప్రేమాతిశయమునకు నుపమానమును జూపుచున్నవో యనునట్లు మిగుల సుందరములై వారిమనస్సుల నొకటిగాఁ గూర్చెను.

కృష్ణుడు రుక్మిణిని రథముపై నిడుకొని ద్వారక కేఁగుట

శ్లో. గృహీత్వా పాణినా పాణిం రుక్మిణ్యాస్త్వరయా ప్రభుః,
ఆరోప్య స్యందనే భైష్మీం ద్వారకాం ప్రస్థితో హరిః. 33

శ్లో.33. ప్రభుః = జగద్రక్షకుడైన , హరిః = శ్రీకృష్ణ స్వామివారు; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; పాణిం = చేతులను, పాణినాం స్వామివారుతన శ్రియః కరమైన హస్తములచేత, గృహీత్వా = పట్టుకున్నవారై; స్యందనే = రథముమీదికి; భైష్మీం = రుక్మిణీ అమ్మ వారిని , ఆరోప్య = ఎక్కించుకొని; ద్వారకాం = ద్వారకా నగరమునుగూర్చి; ప్రస్థితః = ప్రయాణమయ్యెను.
ఇట్లు తనసమీపమునకు అరుక్మిణీదేవి రాఁగానే శ్రీకృష్ణుఁడు సత్వరముగవచ్చి తనహస్తముతో నామె హస్తమును బట్టుకొని రథముమీఁద నెక్కించుకొని ద్వారకాపురముఁ బ్రయాణమయ్యెను.

శ్లో. రుక్మీతు సమరే కృష్ణం జేతుమగ్నిం పతంగవత్,
ప్రవృత్త స్తేన నిర్జిత్య రథే బద్ధః పశుర్యథా. 34

శ్లో.34. రుక్మీతు= రుక్మి అయితేనో; సమరే = యుద్ధమునందు, కృష్ణం శ్రీ కృష్ణస్వామివారిని; జేతుం = జయించుటకు; అగ్నిం పతంగవత్ = అగ్ని హోత్రముమీద మిడత దూకినవతుగా; ప్రవృత్తః = ప్రవర్తించేను .(దూకెను) ( పూనుకొనెను), తేన = (రుక్మి) ఆస్వామివారిచేత; నిర్జిత్య = జయించబడి, రథే = రథమునందు; పవరుర్యథా = పశువువతు; బద్ధ = బంధించెను.
రుక్మిణి యన్నయగు రుక్మి యగ్నిపై కురుకు మిడుతవలె నాకృష్ణునిపైకి యుద్ధమునకు పోయెను. ఆహరియు నాతని జయించి పశువునుంబోలె తన రథంబునకుం గట్టెను.

శ్లో. రుక్మిణ్యా ప్రార్థితః కృష్ణో రుక్మిణం చతదగ్రజమ్,
ప్రాగ్బంధాన్మోచయిత్వా థ ప్రహస్ ద్వారకాం యయౌ.

శ్లో.35. శ్రీ కృష్ణః = శ్రీ కృష్ణ స్వామి వారు, రుక్మిణ్యాప్రార్థితః = రుక్మిణీ అమ్మవారివల్ల ప్రార్థింపబడిన వారై, తదగ్రజం= ఆమెఅన్న అయిన; రుక్మిణించ = రుక్మిఅనువారిని; ప్రాగ్బంధాన్ = పూర్వముకట్టబడిన బంధములనుంచి, మోచయిత్వా = వదలివేశి; అధ = అనంతరము; ప్రహసన్ = నవ్వుచూ, ద్వారకాం=ద్వారకా పట్టణమును గూర్చి; యయౌ = వెళ్ళిరి.

అపుడు రుక్మిణి తనయన్నను జంపవలదని యాయనను బ్రార్థించెను. అహరియు నామె చేసినప్రార్థన నంగీకరించి రుక్మిని బంధవిముక్తుం గావించి బంపి తాను సంతసముతో ద్వారకకుఁ బోయెను.

శ్లో. సమగ్రసేనయా సార్థం మధ్యేమార్గం సమాహితః,
బలభద్రో ఖిలాన్ జిత్వా పార్థివాన్ ద్వారకాం యయౌ.

శ్లో.36. బలభద్రః = బలరాములవారు, మధ్యేమార్గం = మార్గమధ్యమునందు; సమగ్రసేనయా సార్థం = సమస్థ చతురంగ బలములతో; బమాహితః = కూడుకున్నటువంటి వారౌ, అఖిలాన్ పార్థివాన్= నమన్త వైనరాజులను;జిత్వా = జయించినవారై;ద్వారకాం = ర్వారకానగరము గూర్చి;యయౌ=వెళ్ళిరి.

సకలసైన్యనమేతుఁడై కృష్ణు ననుసరించుచుండిన బలభద్రుఁడు రుక్మిణీ నిమిత్తమున యుద్ధము చేయవచ్చిన రాజులనందఱ నక్రమమున నోడించి ద్వారకకుఁ జేరెను.

శ్లో. రుక్మిణీసమేతే కృష్ణే ద్వారకాపురమాగతే,
వసుదేవాదయస్సర్వే సంతుష్టాస్తాశ్చ యోషితః. 37

శ్లో.37. రుక్మిణీసహితె = రుక్మిణీ అమ్మ వారితో కూడుకొని; కృష్ణే=శ్రీకృష్ణస్వామివారు;ద్వారకా పురం = ర్వారకావట్టణమునకు; అగతే = రాగా;వనుదేవ అదయైు = వనుదేవుడు మొదలగు సమస్తజనములు , తాంశ్చయోషితః=(వారిస్త్రీలు) దేవకీ దేవి మొదలగు స్త్రీ జనంబులు; సర్వే = అందరు; సంతుష్ట =సంతోషించిరి.

ఇట్లు శ్రీకృష్ణుఁడు రుక్మిణీసహితుఁడై ద్వారకాపురము ప్రవేశించుటఁ జూచి వసేదేవాదులును, దేవకీదేవి మొదలగు సకల స్త్రీజనంబులును మిగుల సంతసించిరి.

గ. తత్ర ఖలు ద్వారవత్యాం సకలమరభూసుర గరుడగంధర్వకిన్నర విద్యాధరప్రముఖామర సహితసంపదధరీక్ర తేంద్రమహాసభాయాం తప్తజాంబూనదానేక కోటిచంద్రరవి కాంతస్ఫటిక సంఘటిత వజ్రవైడూర్యాద్యనేకరత్న స్తంభమంటప విరాజమాన సురగురుస్పర్థావర్ధితవిద్యావద్బుధోన్నత సంకులాయాం అనేకకోటిమహాకవివందిగా యకపరిహాసకాది లక్షణలక్షితాయాం ఇక్షుక్షీరదధిమధుఘృత గుడగోరోచన జీరకమరీచి కాదిమంగళ ద్రవ్యసంభారవత్యాంగర్గప్రభృతయః వసుదేవామత్యా మహాసంకల్పపూర్వకం రుక్మిణీకృష్ణ యోర్గాంధర్వవిధినా వైవాహికమహోత్సవాయ లగ్నాష్టకమారభంత.

గద్య .38. తత్ర = అక్కడ , దారవత్యాం = ద్వారకానగరమునందు; సకల,సుర,భూసుర=సమస్త దేవతలు బ్రాహ్మణులు; గరుడ,గందర్వ,కిన్నెర,విద్యాధర. ప్రముఖ = మొదలగు;అమరనహిత = దేవతలతోకూడుకొనిన , సంపత్ = సంపదను; అదరీకృత = నారాకరించినటువంటి; ఇంద్ర మహాసభాయాం = దేవేంద్రుని గొప్పసభయందు - అనగా, ఇంద్రుని సభకంటే మించినటువంటి సభయందు, తప్త = పుతమువేయబడినటువంటి; జాంబూనద = బంగారుతో;అనేకకోటి = అనేకకోట్లసంఖ్యగల; చంద్ర,రవి,కాంత = చంద్ర,సూర్యకాంత మణులచేతను; స్పటిక = సఫటికముల చేతను, సంఘటిత = కూర్చబడిన; వజ్ర వైడూర్య ఆది;అనేక రత్న = వేలకొలది రత్నములచేత చేయబడిన; స్తంభమంటప = స్తంభములుగల మంటపమునందు; విరాజమాన = ప్రకాశించుచున్నటువంటి; సురగురు=బృహస్పతితో; స్పర్ధ= పై పోటీచేత; వర్ధిత = వృద్ధిచేసుకొనబడిన; విద్యావత్ = విద్యను కలిగినటువంటి; విబుధ = పెద్దలచేత; సంకులాయాం= కూడుకొనివుండునటువంటి; అనేకకోటి = లెక్కలేని కోట్లకొలది మహాకవి = గొప్పకవులు న్నూ; వంధి,గాయక,పరిహాసక, మొదలగునటువంటి; లక్షణ లక్షితాయాం=సమస్త లక్షణములచేత ఒప్పొచుండిరి. ఇంకనూ; ఇక్షు = చెఱకుపాలు; క్షీర = పాలు; దధి =పెరుగు; మధు = తేనె; ఘృత= నెయ్యి; గుడ = బెల్లం; గోరోచన = గోరోచనము; జీరక = జీలగర్ర;మరీచిక = మిరియములు; ఆది = మొదలగు; మంగళద్ర వ్య సంభార వత్య = మంగళ ద్ర వ్యములు కూర్చబడు; గర్గ ప్రభృతయః = గర్గాచార్యులు మొదలగు పురోహితులు వసుదేవ అనుమత్య = వసుదేవుని ఆ జ్ఞాను సారముగా; మహాసంకల్పపూర్వకం = మహా సంకల్పపూర్వకముగా ; రుక్మిణీ కృష్ణుల యొక్క గాంధర్వ విధినా = గాంధర్వ విధిన నుసరించి, వైవాహికమహోత్సవాయ = వివాహమహోత్సవము జరుపనుపక్రమించిరి , లగ్నాష్టక మారభంత = అందులగ్నాష్టకము లిట్లని పఠించిరి.

అంత నాద్వారకాపట్టణమున శ్రీకృష్ణవివాహార్థమై సభాభవనములలంకరింపఁబడెను. ఆసభయందు దేవతలును, బ్రాహ్మణులును, యక్ష-కిన్నెర-గరుడ-గంధర్వ-విద్యాధరప్రముఖు లుండుటచే నది దేవసభను మించిన వైభవముతో రాజిల్లుచుండెను. తప్తకాంచనమయములై అనేకకోట్లసంఖ్యలు గలచంద్రకాంత సూర్యకాంత వజ్రవైడూర్యాదిరత్నములచే భూషితములై యుండు విశాలస్తంభములతో మనోహరములై యానభాభవమునందలి మంటపము లలరారుచుండెను. తమబుద్ధివిభవముచే బృహస్పతిని ధిక్కరింపఁజాలు పండితోత్తము లామంటపముల నలంకరింపుచుండిరి. అనేకకోట్ల సంఖ్యలుగలస్తుతి పాఠకులు, గానముసేయువారు, మహాకవులు, వరిహాసకులు మొదలగువారును వారివారిస్థానములయందుఁ గూర్చుండి సభాలక్షణముల పూర్ణము చేయుచుండిరి (గాయకులు మొదలగువారు ఎచ్చటనుందురో, అదియే సభయని చెప్పఁబడి యున్నది) చెఱకు, పాలు, పెరుఁగు, తేనియ, ఘృతము, బెల్లము, గోరోచనము, జీలకర్ర, మిరియములు మొదలగు మంగళద్రవ్యము లందుఁగూర్చుండఁబెట్టి వసుదేవునియనుమతిఁగైకొని గర్గాదులగుపురోహితులు గాంధర్వవిధి ననుసరించి వివాహము జరుపనుపక్రమించిరి. అందు లగ్నాష్టముల నిట్లని పఠించిరి.

## లగ్నాష్టకములు ప్రారంభము

శ్లో. సత్యజ్ఞానసుఖస్వరూపమమలం సర్వోత్తమం నిత్యదృక్
ప్రత్యక్తత్త్వమచింత్య శక్తివిలసద్విశ్వం పరబ్రహ్మ యత్,
లోకానుగ్రహవిగ్రహస్య జగతాం నాథస్య తస్యామరాః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్ సులగ్నే సావధాన. 39

శ్లో.39. సత్యం = నిర్వికార మైనట్టి; జ్ఞానరూపమైనట్టి; జ్ఞాన = జ్ఞానరూపమైనట్టి ; సుఖస్వరూపం = ఆనందస్వరూపమైన ; అమలం = నిరర్మలమైనట్టి ; సర్వోత్తమ = అన్నిటికంటే శ్రేష్ఠమైనట్టి నిత్య దృక్ = ఎప్పుడూ సాక్షిభూతముగా చూడబటు నటువంటి ; ప్రత్యక్ తత్వం = ప్రకృతికి అతీతముగా నుండునట్టిన్నీ ; అంచిత్యశక్తిః = చితించుటకు సాధ్యముకానట్టి ; విలసత్ = ప్రకాశించు చుండునట్టిన్నీ విశ్వం = విశ్వరూపుడున్నూ ; పరబ్రహ్మయత్ = ఏవస్తువు పరబ్రహ్మావాచ్యముగా నున్నదో అట్టి ; లోకానుగ్రహ = లోకులననుగ్రహించు నిమిత్తము; విగ్రహస్య = దివ్య మంగళ విగ్రహమును ధరించినవారున్నూ ; జగతాం = జగత్తులకు ; నాధ్యస్య = దిక్కు అయినటువంటి ; తస్య = అటువంటి స్వామివారికి ; అమరాః = దేవతలు ; రుక్మిణీవివాహ సమయో = రుక్మిణీ అమ్మవారి వివాహసమయమునందు ; సతతం = ఎల్లప్పుడున్నూ ; తే = మీకు మంగళం = శుభములను ; కుర్వంతు = దయచేయదురుగాక ! సులగ్న సావధాన = మంచిలగ్నమునందు సావధారులై యుందురుగాక.

సత్యజ్ఞానానందస్వరూపుఁడును, నిత్యసిద్ధుఁడును, సకలపదార్థములలో నుత్తముఁడును, సాక్షస్వరూపుఁడును, జీవాభిన్నమగు స్వరూపముతో నొప్పువాఁడును, అపరిమితమగు సామర్థ్యముకలవాఁడును, జగద్రూపుఁడు నగు నేపరమాత్మ గలఁడో ఆయనయే నీవు. జగన్నాథా! లోకముల ననుగ్రహించుట కొఱకైమనుష్యరూపము ధరించియున్నావు. అట్టి నీకును రుక్మిణికిని జరుగు నీ వివాహసమయమునందు సకల దేవతలును మంగళముల నొసంగుదురుగాత.

శో. గంగాద్యాః సరితో గ్రహాశ్చ శుభదాగంధర్వవిద్యాధరా
దిక్పాలాఋషయశ్చ దేవమునయో దేవ్యశ్చ గౌర్యాదయః,
శ్రీవత్సాంకితవక్షసస్సు మనసామగ్రేసరస్య ప్రభోః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్. సులగ్నే సావధాన. 40

శ్లో.40. గంగాద్యాః = గంగ మొదలైన ; సరితః = నదులున్నూ ; గ్రహాశ్చ = నవగ్రహములున్నూ శుభధా = శుభములను యిచ్చునవి అవుగాక; గంధర్వవిద్యాధరః = గంధర్యులు విద్యాధరులు ది క్పాలా = దిక్పాలకు ; ఋషయశ్చ = మహర్షులున్నూ ; దైవశ్చగౌర్యాదయః = గౌరి మొదలగు దేవతా స్త్రీలున్నూ ; శ్రీవత్సాంకిత వక్షసంః = శ్రీ వత్సమనే గుర్తు గలిగిన వక్షస్థలం గలిగినట్టి ; సుకనసాం అగ్రే సరస్వ = దేవతలలో శ్రేష్ఠుడైనట్టిన్నీ ; ప్రభోః = ప్రభువు అయినటువంటి స్వామివారుకిన్నీ ; రుక్మిణ్యః = రుక్మిణీ అమ్మవారికిన్నీ జరుగునట్టి ; వివాహసయమయే = వివాహసమయమునందు ; తే = వీరందరు ; మంగళం = శుభములను ; కుర్వంతు = చేయుదురుగాక! సలగ్నే సావధానాః = మంచి లగ్నమునందు సావధానులైయుందురుగాక !

గంగాదిమహానదులును, శుభగ్రహములును, గంధర్వులును, విద్యాధరులును, దిక్పాలకులును, భూలోకవాసులగు ఋషులును, నారదాదిదేవమునులును, పార్వతి మొదలగు దేవపత్నులును, శ్రీవత్సముతో నొప్పుచున్న వక్షస్థలముగల్గి దేవతలలో శ్రేష్ఠుఁడవై సర్వసమర్థుఁడవై రాజిల్లునట్టి నీకును రుక్మినికిని జరుగువివాహమున మంగళము లాచరింతురుగాత.

శ్లో. యో గోపీనయనోత్పలై రనుపమైరారాధితో గోకులే
గోభి ర్గోపసుతైర నేకమునిభిర్హృ త్పద్మకోశాంతరే,
మాయామానుషవిగ్రహస్య మరుతస్తే వాలఖిల్యాదయో
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
సులగ్నే సావధాన 41

## ప్రతిపదార్థము

- : లగ్నాష్టకము :-

శ్లో 41 యః = స్వామివారు; గోకులే = గోకులమందు; గోపీ = గోపికలయొక్క; అనుపమై = అసమానములైన ; నయనోత్పలైః = నేత్రములను కలువలచేతనున్నూ; గోపసుతైః = గోపాలబాలుర చేతనున్నూ; హృత్పద్మకోశాంతరే = హృదయకమల అంతరాళమునందు; మునిభిః = మునులచేతనున్నూ; అరాధితః = పూజింపబడిరో (అట్టి); మాయామానుష విగ్రహస్య = తన దివ్యసంకల్పముచేత మనుష్యరూపము ధరించినటువంటి; మరుతః = దేవతులన్నూ; వాలఖిల్యాదయః = వాలఖిల్యులు మొదలగు ఋషులున్నూ; తే = వీరందరు; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారి యొక్క; వివాహ సమయే = వివాహకాలమునందు; తే = మీకు (ఆ రుక్మిణీ కృష్ణులకు); మంగళం = శుభములను; కుర్వంతు = చేయుదురు గాత! ; సులగ్నే సావధానః = సులగ్నమునంద సావధానులైయుందురు గాత !.

నీవు గోపాంగనల నేత్రము లనియెడు కలువలచే ( బూజింప(బడుచు గోవులచేతను, గోపకులచేతను, సకలమునీంద్రులచేతను, హృదయకమల మధ్యమున భావింప(బడుచు గోకులమున విహరించితివి. ఓ కృష్ణా! మాయా మానుషస్వరూపు(డవైన నీకును రుక్మిణికిని జరుగు వివాహసమయమున దేవతలును, వాలఖిల్యాదిమహామునులును, మంగళముల నొనర్తురు గాత.

శ్లో. బ్రహ్మావిష్ణు రుమాపతి శ్రృతిచయోవాణీరమోమాయుతా
ఆదిత్యా వసవోగణాధిపముఖా రుద్రాశ్చ భద్రప్రదాః,
కాలాంభోధరదివ్య కాంతివిలసత్కా యస్య మాయావినో
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
సులగ్నే సావధాన 42

శ్లో 42 బ్రహ్మా = చతుర్ముఖ బ్రహ్మాయున్నూ; విష్ణుః = శ్రీమన్నారాయణ మూర్తియున్నూ; ఉమాపతి = శివుడున్నూ; వాణి = సరస్వతిన్నీ; రమా = లక్ష్మీ అమ్మవారున్నూ; ఉమాయుత = పార్వతీ అమ్మవారితో కూడుకున్నవారలై; శ్రుతిచయః = వేదసమూహములున్నూ; ఆదిత్యా = =

ద్వాదశాదిత్యులున్నూ; వసవో = అష్టవసువులున్నూ; గణాధిపముఖ = గణపతి మొదలగువారున్నూ; రుద్రాశ్చ = ఏకాదశరుద్రులున్నూ; భద్రప్రదాః = శుభములు కలగుచేయుచున్నవారలై; కాలాంభోధర = నీలమేఘముతో సమానమైన = దివ్యకాంతి = దేవతా సంబంధమైన కాంతితో; విలసత్ = ఒప్పుచున్నటువంటి; కాయస్య = దివ్యరూపము కలిగినటువంటి; మాయావినః = అమితమాయకులైన; తే = స్వామివారివైన నీకు; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; వివాహసమయే = వివాహసమయమునందు; సతతం = ఎల్లప్పుడు; మంగళం = శుభములను; కుర్వంతు = కలుగచేయుదురుగాక; సులగ్నే సావధానః = మంచిలగ్నమునందు సావధానులై యుందురుగాక.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, వేదములు, సరస్వతి, లక్ష్మి, పార్వతి, ద్వాదశాదిత్యులు, గణాధిపతి మొదలగు ప్రమథులు, నకలలోకములకు శుభమునొనంగు నేకాదశరుద్రులు వీరందఱును, నీలమేఘశ్యామలవర్ణముతో నొప్పు శరీరముగలవాఁడవును, మాయావంతుఁడవునగు నీకును రుక్మిణికిని జరుగు వివాహమున మంగళము లాచరింతురుగాత.

శ్లో. వంశీనాదవినోదనందితసునందాద్యో నవద్యో మహా
నందా ద్యైరభిపూజితః పరమయా భక్త్యా ముహుర్లాలితః,
యః పూర్వం కమలేక్షణస్య కమలానాథస్య తస్యామరాః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
సులగ్నే సావధాన 43

శ్లో 43 యః = ఏ స్వామివారైతే; పూర్వం = బాల్యమునందు; వంశనాద = వేణునాదముయొక్క; వినోదః = విలాసముచేత; నందితః = సంతోషపరచబడినట్టి; సునందాద్యః = సునందాది మహామునులు కలవారో; అనవద్య = దోషరహితులున్నూ; మహాన్ = మహాత్ములున్నూ; నందాద్యైః = యశోదానందుడు మొదలగువారిచేత; అభిపూజితః = లెస్సగాపూజింపబడినవారై; పరమయాభక్త్యా = శ్రేష్ఠమైన భక్తిచేత; ముహుర్ముహుః = మాటిమాటికిని; లాలితః = లాలింపబడిన వారైరో; కమలేక్షణస్య = తామర కమలములవంటి నేత్రములుగలవారున్నూ; కమలనాథస్య = లక్ష్మీనాథులున్నూ; తస్యతే = ఇట్టిమీకు; అమరాః = దేవతలు; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; వివాహసమయే = వివాహసమయమునందు; సతతం = ఎల్లప్పుడున్నూ; మంగళం = శుభములను; కుర్వంతు = ఒసగుదురుగాక; సులగ్నేసావధాన = మంచి లగ్నమునందు సావధానులైయుందురుగాక.

ఓ దోషరహితా! మహాత్మా! నీ వింతకు మునుపు గోకులమున నున్నప్పుడు వేణుగానవినోదముచే సనందాదిమహామునుల కానందముఁ గల్గించుచుంటివి. నందుఁడు యశోద మొదలగు గోపవృద్ధులుకూడ నిను లాలించుచున్నవారైనను, మిగుల భక్తితో పూజించుచునే యుండిరి. ఓ కమలలోచనుఁడవగు లక్ష్మీనాథా! అట్టి నీకును రుక్మిణికిని జరుగువివాహమున దేవతలు మంగళము లాచరింతురుగాత.

శ్లో. విద్యుత్పుంజనిభాంబరస్య విలసద్గ్రైవేయకస్య ప్రభోః
ముక్తాహార మహార్ఘకౌస్తుభమణి గ్రీవస్య కృష్ణాత్మనః,
పూర్ణేందు ప్రతిమాననస్య సుతరాం పూర్ణస్యభక్త్యా మరాః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్
సులగ్నే సావధాన 44

శ్లో 44 విద్యుత్పుంజనిభ = తొలకరి మెరుపుల గుంపుతో సమానమైన; అంబరస్య = వస్త్రమును ధరించినవారున్నూ; విలసత్ = ఒప్పుచున్నటువంటి; గ్రైవేయకస్య = (గ్రీవ హారములు) కంఠహారములు కలిగినట్టిన్నీ; ప్రభోః = ప్రభువు అయినటువంటి; ముక్తాహార = ముత్యాల హారములు ధరించినటువంటి; మహార్ఘః = గొప్పదైనటువంటి (వెల లేనటువంటి) కౌస్తుభమణి = కౌస్తుభమణి కలిగినటువంటి; గ్రీవస్య = కంఠముగలవారున్నూ; కృష్ణాత్మనః = కృష్ణరూపముగా అవతరించినటువంటి; పూర్ణేందు ప్రతి మాననస్య = పూర్ణచంద్రునితో సమానమైన ముఖము కలిగినటువంటి; సుతరాంపూర్ణస్య = కేవలం పూర్ణుడైనటువంటిన్నీ; తే = అట్టిస్వామివారైన మీకు; అమరాః = దేవతలు; భక్త్యా = భక్తిగలవారై; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; వివాహసమయే = వివాహకాలమునందు; సతతం = ఎల్లప్పుడు; మంగళం = శుభములను; కుర్వంతు = కలుగజేయుదురుగాక!; సులగ్నే సావధానః = మంచి లగ్నమునందు సావధానులై యుందురుగాక!

మెఱుపులవలెఁ బ్రకాశించుపీతాంబరముధరించి, ముత్యాలహారములు కౌస్తుభరత్నము, వీనిని గంఠమునఁదాల్చి పూర్ణచంద్ర బింబసమానమగు ముఖముతో రాజిల్లుచు, నీలవర్ణుఁడవై యున్న యోసర్వవ్యాపకా! నీకును రుక్మిణికిని జరుగువివాహమున దేవతలు మిగులభక్తితో మంగళము లాచరింతురుగాత.

శ్లో. మీనాంకాధికసుందరస్సు రవధూదృక్చాత కాంభోధరో
గోపీమండలమండనాంచితతనుర్యస్సుందరః పూరుషః,
తస్యాఖండసుఖాత్మకస్య విదుషా మేకాత్మకస్య ప్రభోః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళమ్.
సులగ్నే సావధాన 45

శ్లో 45 యః = ఎవరైతే; మీనాంక అధిక సుందర = మన్మథుని కంటె అధికమైన సౌందర్యము కలవారో; సురవధూ = దేవతాస్త్రీలయొక్క; దృక్కు = నేత్రములు అనునట్టి; చాతక = చాతకపక్షులకు; అంభోధరః = మేఘమువంటివారో; గోపీమండల = గోపికా సమూహములకు; మండన = అలంకారభూతముగా; అంచిత = ఒప్పుచున్నట్టి; తను = దివ్యశరీరముగలవారున్నూ; సుందరః

ఆనందమే స్వరూపముగా గల్గినట్టిన్నీ; విదుషాం = విద్వజ్జనములకు; ఏకాత్మకస్య = ముఖ్యమైన ఆత్మగా నుండునట్టివాడున్నూ; ప్రభోః = (సర్వనియమకుడున్నూ) సర్వసామర్థ్యముగలవారున్నూ; తస్య= అట్టిమీకు; తే = వారు; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; వివాహసమయే = వివాహకాలమునందు; సతతం = ఎల్లప్పుడున్నూ; మంగళం = శుభములను; కుర్వంతు = ఒసంగుదురుగాక; సులగ్నేసావధాన = మంచిలగ్నమునందు సావధనులైయుందురుగాక.

నీవు మన్మథునికంటె నధికమగు సౌందర్యముగల్గి దేవాంగనల నేత్రములనియెడు చాతకములకు మేఘతుల్యుండగుచు, (చాతకపక్షులు నేలపైఁబడిన నీటింద్రావవు. మేఘమువచ్చునంతవఱకుఁ గాచుకొనియుండి వర్షముఁ గురియునపుడు ఆనీటిని నడుమనే ద్రావును. అని తెలిసికొనవలయును) మండలాకారముగ నిలచియున్న గోపికలనడుమ రాజిల్లుచుంటివి. ఓ జగత్ప్రభో! అఖండానందము స్వరూపముగాఁ గల్గి అద్వితీయుఁడవని జ్ఞానులచే నెఱుంగఁబడుచున్న నీకును రుక్మిణికిని జరుగువివాహమున దేవతలు మంగళము లాచరింతురుగాత.

శ్లో. యే సత్యం ప్రవదంతి సర్వభువనే యా ధర్మశీలాః స్త్రియః
పాతివ్రత్యపరాయణాస్సురభయో మందారముఖ్యద్రుమాః,
తే సర్వే యదునాయకస్య మహత స్సర్వాత్మకస్య ప్రభోః
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్వంతుతే మంగళమ్
సులగ్నే సావధాన 46



సర్వభువనే = సమస్తలోకములయందున్నూ; ఏ = ఎవ్వరైతే; సత్యం = నిజమును; ప్రవదంతి = పలుకుచున్నారో (అట్టివారున్నూ); యఃస్త్రియః = ఏస్త్రీలైతే; పాతివ్రత్య పరాయణః = పాతివ్రత్యమందే ఆసక్తిగలిగియుండువారు ఎవరో; ధర్మశీలాః = ధర్మమే స్వభావముగాగల స్త్రీలు ఎవరో; సురభయోః = కామధేనువు మొదలగు ఆవులున్నూ; మందారముఖ్యద్రుమాః = మందార పారిజాతాది సమస్తవృక్షములున్నూ; తే సర్వే = వారందరున్నూ; మహతః = మహిమగలిగినటువంటిన్నీ; యదునాయకస్య = యాదవవంశభూషణుడవు అయినటువంటిన్నీ; సర్వఆత్మకస్య = సమస్త భూతములకు అంతర్మాతకుడైనట్టిన్నీ; ప్రభోః = ప్రభువైన స్వామివారికిన్నీ; రుక్మిణ్యాః = రుక్మిణీ అమ్మవారికిన్నీ; వివాహసమయే = వివాహసమయమునందు; సతతం = ఎల్లప్పుడు; తే = వారు; మంగళం = శుభములును; కుర్వంతు = ఒసంగుదురుగాక; సులగ్నేసావధాన = మంచిలగ్నమునందు సావధానులైయుందురుగాక;

ఈలోకమునందు సత్యవాదులగుమహాత్ము లెవ్వరెవ్వరు గలరో, పాతివ్రత్యమునందు మిగులనియమము గల్గి ధర్మశీలులైయున్న నారీరత్నము లెవ్వరు గలరో వారును, కామధేనువు మొదలగు సమస్తగోగణంబులును, మందార పారిజాతాది సమస్తవృక్షజాతులను, ఇవియన్నియు సర్వమయుఁడును, సర్వప్రభువును, యాదవవంశభూషణుండవు అగునీకును రుక్మిణికిని జరుగు వివాహమున మంగళము లాచరింతురు గాత.

శ్లో. గర్గాద్యైర్మునిభిస్స దామితమహాశీర్వాదవర్మాంచితో
దేవైర్వ్యోమ్ని విమానమధ్య కలితైర్దత్తప్రసూనాంజలిః,
సంతుష్టామరసమ్య గాచరిత భేరీనాదసంతుష్టవాన్
రుక్మిణ్యాస్సతతం వివాహసమయే కుర్యాత్సదా మంగళమ్.
సులగ్నే సావధాన 47

శ్లో 47 రుక్మిన్యావివాహసమయేః = రుక్మిణీ అమ్మవారి వివాహసమయమునందు; గర్గాద్యైమునిభిః = గర్గాదిమునులచేత; సదా = ఎల్లప్పుడున్నూ; అమిత = మితములేని; ఆశీర్వాదః = ఆశీర్వాదములనునట్టి; వర్మ = కవచములచేత; సదా = ఎల్లప్పుడున్నూ; అంచితః = రక్షింపబడుచున్నవారై; వ్యోమ్ని = ఆకాశమునందు; విమానమధ్యకలితైః = విమానమధ్యమునందు ఒప్పుచున్నటువంటిన్నీ; దేవైః = దేవతలచేత; దత్త = సమర్పించుచున్న, ప్రసూనాంజలిః = పుష్పాంజలి గలిగినటువంటిన్నీ; సంతుష్టాః = సంతోషించుచున్నట్టి; అమరా = దేవతలచేత; సమ్యక్ = లెస్సగా; ఆచరిత = జరిగింపబడుచున్నట్టి; భేరీనాద సంతుష్టవాన్ = అట్టి భేరీనాదమునందు ప్రేమగలవారున్నూ అటువంటి స్వామివారు; సతతం = ఎల్లప్పుడూ - లోకులకు; మంగళం = శుభములను; కుర్యాత్ = ఒసగుదురుగాత ! = సులగ్నే సావధానః = మంచి లగ్నమునందు సావధానులైయుందురుగాక.

ఈవిధముగా గర్గాదిపురోహితు లందరు నాకృష్ణు నాశీర్వాదక వచనములచే సురక్షితుంజేసిరి. పరమానందభరితులై దేవతలును ఆకసమున విమానము నందుండి పుష్పవృష్టిఁ గురియించుచు, దేవదుందుభుల మ్రోయించిరి. ఇట్లు రుక్మిణికిని తనకును వివాహము జరుగునప్పుడు పరమానందభరితుఁడై యుండిన యాహరి సర్వకాలములందును లోకములకు సుఖముల నొసంగుగాత.

## రుక్మిణీ కల్యాణము

### శంకరాభరణరాగము - ఆటతాళము

ప. శ్రీ వాసుదేవప్రభో పాలయమాం

1. సకలహితకర సరసగుణగణ నిగమసరసిజనియతరసఘన
విగతభవభయ వినుతసురవరగగనసువిమల గరుడవిహరణ

2. సరసిజోదరచరణవిలసిత సరసనూపుర సాధుహితకర
తరళకుండల తాండవానన మురరిపో ఖిలమోహనాభవ

3. నిరుపమధ్వనినికరపావన మురళి కారవమోహితాఖిల
సురవధూగణసుందరానన కరివరావన కాంచనాంబర

4. దివ్యమంగళగోపవేష దీనపాలన వీతదోష
నవ్యతరనవనీతరసిక నరసఖానఘ నిఖిలజనక

5. దేవకీవసు దేవతనయ దేవరాజవిరచితవినయ
దేవ నారాయణానంద తీర్థవిరచితదివ్యగీత

ప. శ్రీవాసుదేవ ప్రభో! = ఓ శ్రీకృష్ణమూర్తీ!; మాం = నన్ను; పాలయ = రక్షింపుమా.

1. సకలహితకర = అందరికి (సర్వమునకు) హితవుచేయువాడ; సరసగుణగణ = రసయుక్తమైన గుణసమూహముగలవాడ; నిగమ = వేదములనెడు; సరసిజ = కమలమునందు, నియత = నియతమైయుండునట్టి; రస = ఆనందము; ఘన = ఘనమైయుండువాడ; విగత భవభయ = సంసారభయమును పోగొట్టువాడ; వినత సురవర = విశేషముగా నమస్కరింపుచున్న దేవేంద్రుడుగలవాడా; గగన సువిమల = ఆకాశమువలె మాలిన్యము అంటనివాడా; గరుడ విహరణ = గరుత్మంతుడను వాహనముమీద విహరించువాడ.

2. సరసిజోదర = నాభియందు కమలముగలవాడ; చరణ = పాదములయందు; విలశిత = ఒప్పుచున్నటువంటి; సరసనూపుర = మంచి అందెలుగలవాడ; సాధుహితకర = సాధువులకు మేలుచేయువాడ; తరళ = చలించుచున్నట్టి; కుండల = కుండలములయొక్క; తాండవ = నృత్యముచేత ఒప్పుచున్నటువంటి; ఆనన = ముఖముగలవాడ; మురరిపో = మురాసురుడికి శత్రువైనటువంటి హే స్వామీ!; అఖిల మోహన ! = సమస్త జగత్తును మోహింపజేయువాడ; అభవ = పుట్టుకలేనివాడ (అట్టి హేస్వామీ!); మాం పాలయ = మమ్ము రక్షింపుమా

3. నిరుపమ = అసమానమైన; ధ్వని = ధ్వనిచేత; నిఖిల = సమస్తమును; పావన = పవిత్రము చేయుచుండునట్టి; మురళికారవ = వేణుగానముచేత; మోహిత = మోహమునొందించబడుచున్న; అఖిల = సమస్తమైన; సురవధూగణ = దేవతా స్త్రీ సమూహముగలవాడ; సుందరానన! = సౌందర్యమైన ముఖముగలవాడ; కరివరానన! = గజేంద్రుని రక్షించినవాడ; కాంచనాంబర! = బంగారుమయమైన వస్త్రమును ధరించినవాడ ॥ శ్రీ ॥

4. దివ్యమంగళ గోపవేష = దేవతలకుగూడ శోభస్కరుడైన గోపాలవేషమును ధరించినవాడ; దీనపాలన = దీనులను పాలించువాడ; వీతదోష = దోషములేనివాడ (పోగొట్టబడిన దోషముగలవాడ); నవ్యతర = అమితక్రొత్త అయినటువంటి; నవనీత = వెన్నయందు; రశిక = ఇష్టముగలవాడ; నరసఖా = అర్జునిస్నేహితుడా; అనఘా ! = పాపరహితుడా!; నిఖిల జనక ! = సమస్తమునకు తండ్రి అయినట్టివాడ.

5. దేవకీ వసుదేవతనయా = దేవకీ వసుదేవుల యొక్క కుమారుడా, దేవరాజవిరచిత వినయా = దేవేంద్రునిచేత చూపించబడిన వినయము కలిగినటువంటి; దేవ = హే స్వామీ!; నారాయణ నందితీర్థ = నారాయణానందతీర్థులవారిచేత; విరచిత = రచియింపబడిన; దివ్యగీత = దివ్యమైనానముగలవాడ; అగునట్టి శ్రీవాసుదేవప్రభో!

ప. ఓవసుదేవపుత్రా! జగదీశ్వరా! నను రక్షింపుము.

1. ఓగుణరత్నాకరా! నీవు సర్వజనులకును హిత మాచరించువాఁడవు. వేదము లనియెడికమలమునకు మకరందమవు. (వేదసారభూతుఁడ వనుట) సంసారదూరుఁడవై, ఆకాశమువలె నిర్మలుఁడవై యున్న యోగరుడవాహనా! నిను దేవత లెప్పుడును నుతించుచుందురు.

2. ఓజన్మరహితా! జగన్మోహనా! మురవైరీ! నీవు కాలియందెలు ధ్వనించుచుండ, చలించుచున్న కర్ణకుండలములతో ముఖము కదలచుండ నృత్యము సేయుచుందువు. ఓపద్మనాభా! సత్పురుషులకు హితము సేయుచుందువు. (సకలజనులునుగోరు విషయములలో ప్రియములనియు, హితములనియు రెండు తెఱంగులు గలవు. ప్రియములనిన ఉత్తరకాలమున దుఃఖము కలిగించినను, అప్పటికిమాత్రము సంతసము గల్గించునవి. హితములనిన నప్పటికి కొంతకష్టము గలిగించినను ఉత్తరకాలమున నపరిమిత మగునానందము గల్గించునవి యని తెలిసికొనవలయును.)

3. ఓగజసంరక్షకా! పీతాంబరా! లోకమునందు శ్రేష్ఠములని చెప్పఁబడు సకలధ్వనులకంటెను పవిత్రమగు వేణుధ్వనిచే సర్వజనులను మోహింపజేయుచున్నావు. నీవదనమును జూచిన దేవతాస్త్రీలకుఁగూడ ఇంతటి సౌందర్య మెందైనగలదా' అని యాశ్చర్యము గలుగుచున్నది.

4. ఓ పాపరహితా! నరునికి మిత్రుఁడవగు నారాయణా! నీవు సకల జగత్తులకు కారణుండ వగు పరమేశ్వరుండవైనను, దీనులఁబ్రోవ దివ్యమంగళమగు నీగోపాలగ్రహముతో వెన్నముద్దల మ్రింగుచు భూమిపై విహరించుచున్నావు.

5. దేవేంద్రుడు గూడ మిగుల వినయముతో సేవించుచుండ, నారాయణతీర్థుఁడు స్తోత్రము సేయుచుండ విహరించు వోదేవకీపుత్రా, నీవు స్వప్రకాశరూపుఁడవు.

## కల్యాణీరాగము - అటతాళము

| | | |
|---|---|---|
| ప. | కల్యాణం భవతు సదా | కనకాంబర కనకా భేభైష్మి |
| 1. | అవలోకయభైష్మీవదనం కృష్ణ | భువనసుందర భూశశినం |
| | నవనీత ప్రియవదనం భైష్మి | భవభయతారకమతిశుభదం |
| 2. | సంకల్పం కురుకంసరిపో జయ | సత్యం ప్రతిధర్మాచరణం |
| | పంకేరుహనయనామరనరపతి | పరిషదిభైష్మ్యా సహశ్రీకృష్ణ |
| 3. | భ్రూమధ్యంపరిసమ్మృజ్యాచ్యుత | భూషయ భైష్మీవదనమిహ |
| | కామంయుగనిహితాంగుళిమేనాంస్న | పయహరే భైష్మీమధునా |
| 4. | నవ్యసుందరపరిధానే నానఘ | దేవీ మధునాచ్ఛాదయ |
| | దివ్యకనకమణిమంగళసూత్రం | దేవీకంఠే స్థాపయభో |
| 5. | ద్వారవతీ నగరీ తవ సుఖదా | ధీర హరే రమయా భవతు |
| | కారణ నిర్భర జగతా మసురవి | దారణనారాయణతీర్థశరణా |

ప. కనకాంబర = కాంచన చేలుడవైన హేస్వామీ!; కనకాభేభైష్మి! = సువర్ణచ్ఛాయగల హేరుక్మిణీ! (మీ ఇరువురికి); సదా = ఎల్లప్పుడు; కళ్యాణం = శుభములు; భవతు = కలుగుగాక!

1. కృష్ణ = హేస్వామీ!; భువనసుందరం = ప్రపంచమునకంతా సౌందర్యముగలదిన్నీ; భూశశినం = భూమికి చంద్రునివంటిదిన్నీ-అగు; భైష్మీవదనం = రుక్మిణీఅమ్మవారి ముఖమును; అవలోకయ = చూడుమా; భైష్మి! = హే రుక్మిణీ!; భవభయ తారకం = సంసార భయమును తరింపచేయునట్టిదిన్నీ; అతిశుభదం = మిక్కిలి శుభప్రదమైనట్టిదిన్నీ-అగు; నవనీతప్రియవదనం = శ్రీకృష్ణస్వామివారియొక్క ముఖమును; అవలోకయ = చూడుమా.

2. కంసరిపో! = హేశ్రీకృష్ణా!; జయ = సర్వోత్కర్షముగా వర్తించుము; పంకేరుహనయనా! = తామరకమలములతో సమానమైన నేత్రములుగల; శ్రీకృష్ణా! = ఓ కృష్ణా!; అమర నరపతి పరిషది = దేవతలయొక్క రాజులయొక్క సభయందు; భైష్మ్యాసహ = రుక్మిణీ అమ్మవారితోగూడా; సత్యం ధర్మాచరణం ప్రతి = సత్యమైన ధర్మానుష్ఠాన నిమిత్తమై; సంకల్పంకురు = సంకల్పముచేయుమా!

3. ఇహ = ఇక్కడ; అచ్యుత = హేకృష్ణా!; భైష్మీవదనం = రుక్మిణీ అమ్మవారిముఖమును; భ్రూమధ్యం = కనుబొమల నడుమ; పరిసమ్మృజ్య = బాగాతుడిచి; భూషయ = అలంకారము చేయుమా; యుగ = కాడిమ్రానియందు; నిమిత = ఉంచబడిన; అంగుళి = కాలివ్రేళ్ళు కలిగినట్టి; ఏనాంభైష్మీం = ఈ రుక్మిణీ అమ్మవారిని; అధునా = ఇప్పుడు; కామం = మిక్కిలి (విశేషముగా); హరే ! = హేశ్రీకృష్ణా!; స్నపయ = స్నానము చేయించుమా.

4. అనఘా! = పాపరహితుడా! (హేకృష్ణా!); దేవీం = రుక్మిణీ అమ్మవారిని; నవ్యసుందర పరిధానేన = సుందరమైన క్రొత్త వస్త్రములచేత; అధునా = ఇప్పుడు; ఆచ్ఛాదయా = ఉంచుమా; భోః = హేకృష్ణా!; దివ్యకనకమణి మంగళసూత్రం = దేవతా సంబంధమైన మణులతో పొదగబడిన బంగారు మంగళసూత్రమును; దేవీకంఠే = రుక్మిణీ అమ్మవారి కంఠమునందు; స్థాపయ = ధరింపజేయుమా

5. ధీర = ధైర్యముగలిగినట్టి; హరే = హేకృష్ణా!; రమయా = లక్ష్మితో గూడిన; తవ = మీకు; ద్వారవతీనగరి = ద్వారకా నగరము; సుఖదా = సౌఖ్యము నిచ్చునట్టిది; భవతు = అవుగాక; జగతాం = జగత్తునకు; కారణ = కారణస్వరూపుడా; నిర్భర = భారమును తీసివేయువాడ; అసురవిదారణ = రాక్షసులను నాశనముచేయువాడ; నారాయణతీర్థ శరణ = నారాయణతీర్థులవారిని రక్షించువాడ.

ప. ఓపీతాంబరా! కృష్ణా! సువర్ణచ్ఛాయగల రుక్మిణీ! మీకిరువురకును సర్వకాలములందును శుభమగుగాక.

1. ఓశ్రీకృష్ణా! భూలోకమునకువచ్చిన చంద్రుఁడో యనరాజిలుచుండు నారుక్మిణివదనమును వీక్షింపుము. ఓరుక్మిణీ! సంసారభయమునుండి తరింపఁజేయునట్టియు, సకల శుభముల నొసంగునట్టియు ఆశ్రీకృష్ణుని ముఖముఁజూడము.

2. ఓ కమలలోచనా! శ్రీకృష్ణా! దేవతలును, అనేకరాజులును కూడియున్న యీసభయందు, రుక్మిణితో ధర్మమును జేయుటనుగూర్చి (రుక్మిణిని భార్యగా పరిగ్రహించుటను గూర్చి) సంకల్పముఁ జేయుము.

3. ఓనాశరహితా! నీవు రుక్మిణియొక్క భ్రూమధ్యప్రదేశమును దుడిచి ముఖమున తిలకము దిద్దుము. ఓకృష్ణా! యీరుక్మిణి కాడిమ్రాఁకుపై వేలును బెట్టుకొనియున్నది. ఆమ్రాఁకులోని రంధ్రములలోనున్న నీటిని దీసి యీరుక్మిణిపైఁ జల్లుము.

4. ఓపాపరహితా! రమణీయ మగువస్త్రమును నీదేవిపైఁ గప్పుము. సువర్ణరత్నమయమగు నీమంగళసూత్రమును దేవీకంఠమునం గట్టుము.

5. జగత్కారణా! రాక్షససంహారా! ఈద్వారకాపట్టణము లక్ష్మితోఁ గూడ, లేక లక్ష్మీదేవియవతారమగు రుక్మిణీదేవితోఁ గూడ ఆనందకరమగును. ఓ ధైర్యశాలీ! విష్ణూ! నారాయణతీర్థుని కరుణతో రక్షించుచున్నావు. నీకు శుభమగును గాత.

శ్లో. భైష్మ్యాః పాణిసరోరుహాంజలిగతా రక్తాస్తు ముక్తాః స్థితాః
యాముక్తాగళితానురాగవిమలాః కృష్ణోత్తమాఙ్గశ్రయాః,
యాతా స్తస్యయదూద్వహస్య పరమంసామ్యం విశుద్ధాత్మనః
తాః కుర్వంత్వభితశ్శుభాని సతతం శ్రీకృష్ణవైవాహికాః

శ్లో 48 భైష్మ్యాః = రుక్మిణీ అమ్మవారియొక్క; పాణిసరోరుహ = కమలముల వంటి హస్తములయొక్క; అంజలి = దోశలియందు; గతా = (ఉన్నటువంటి) చేర్చుకొనబడినటువంటి; ముక్తాః = ముత్యములు; రక్తాస్తు = ఎరుపువర్ణము కలిగినవియై; స్థితాః = ఉండెను; సురాగ విమలాః = నిర్మలమై ఎరుపువర్ణము కలిగినట్టి; యా ముక్తాః = ఏ ముత్యములైతే పైన చెప్పబడినవో - అవి; గళితాః = పోయబడినవియై (జార్చబడినవియై); కృష్ణోత్తమాంగాశ్రయాః = శ్రీకృష్ణుని శిరస్సుమీద పడినవియై; విశుద్ధాత్మనః = నిర్మల పరమాత్మ స్వరూపుడైన; తస్య యదూద్వహస్య = ఆ యాదవ శిఖామణియైన స్వామివారియొక్క; పరమం సామ్యం = కేవల సమాన రూపత్వమును; యాతాః = పొందినవియాయెను; శ్రీకృష్ణవైవాహికాః = శ్రీకృష్ణునియొక్క వివాహ సంబంధమైన; తాః = ఆముత్యములు; అభితః = అన్నిదిక్కులయందును; సతతం = ఎల్లప్పుడు; శుభాని = మంగళములను; కుర్వంతు = ఒసంగుగాక.

ఇట్లు మంగళసూత్రధారణము ముగిసినపిదప నాదంపతులు తలఁబ్రాలుఁ బోసికొనిరి. ఆసమయమున చిగురాకువలె నెఱ్ఱనివగు రుక్మిణీహస్తములయందు నున్నపుడు, తలఁబ్రాలకై కైకొనఁబడన ముత్యములు రక్తలములయ్యెను. కృష్ణుని శిరము పైఁబడిన వెనుక తమకు సహజమగు శ్వేతకాంతిని మరలఁ గైకొనినవి. దీనిఁజూడ, రుక్మిణీదేవియొద్ద నున్నపుడు అనురాగయుక్తమగు నామెహృదయముతో సరిబోల్చవలయుననియు, శ్రీకృష్ణునియొద్ద నున్నపుడు రాగద్వేషాది దోషరహిత మగునమ్మహాత్ముని నిర్మలహృదయమునకు సాటిగావలయుననియు నాముత్యములు తలంచినవేమోయని తోఁచుచుండెను. (రాగశబ్దమునకు అనురాగమనియు, నెఱుపనియు రెండర్థములు. ఈశ్లోకమునందు 'రక్త'యని యొకచోటను, 'అనురాగ' యని మఱియొకచోటను బ్రయోగించియున్నారు) అట్టి శ్రీకృష్ణవివాహ సమయమునందలి తలఁబ్రాలముత్యములు సకలశుభముల నొసంగుఁగాక.

పున్నాగవరాళిరాగము - రూపకతాళము

| | | |
|---|---|---|
| ప. | రుక్మిణీకల్యాణం | సదా దృశ్యతాం |
| 1. | కల్యాణగోపాలం | కరుణాలవాలం |
| | మాల్యాలంకృత మీడే | మదనగోపాలం |
| 2. | అమరనారీగీతం | ఆగమవిదితం |
| | అమితభాగ్యోపేత | మాశ్రయేనంతం |
| 3. | సత్యకామాదిగుణం | సకలజగత్కారణం |
| | భృత్యసంరక్షణం | భవబంధమోక్షణం |
| 4. | మురళీసరళగానం | మునిబృందాధీనం |
| | శరణాగతపాలనం | శరదిందువదనం |

5. భవతిమిరఘనభానుం భక్తకామధేనుం
శివనారాయణతీర్థ శీఘ్రఫలదానం

ప. రుక్మిణీ కళ్యాణం = రుక్మిణీ వివాహమును; సదా = ఎల్లప్పుడు; దృశ్యతాం = దర్శనము చేయబడుచుండుగాత; కళ్యాణగోపాలం = వివాహముచేసికొనబడిన గోపాలుని; కరుణ ఆలవాలం = దయకు ఉనికిపట్టు అయినటువంటివాడున్నూ; మాల్యాలంకృతం = పూలమాలికలచేత శృంగారించబడినవారున్నూ; మదన గోపాలం = మదన గోపాలస్వామివారిని; ఈడే = స్తోత్రము చేయుచున్నాము.

2. అమర నారీగీతం = దేవతాస్త్రీలచేత గానము చేయబడుచుండునట్టివారున్నూ; ఆగమ విదితం = వేదములవల్ల తెలియబడుచుండునట్టివాడున్నూ; అమిత భాగ్యోపేతం = మితములేని భాగ్యముతోకూడుకున్నవారున్నూ; అనంతం ఆశ్రయే = అట్టి అనంతుని ఆశ్రయించుచున్నాను.

3. సత్యకామాదిగుణం = సత్యసంకల్పము మొదలగు గుణములు కల్గినట్టియు; సకల జగత్ కారణం = సకల జగత్తునకు కారణస్వరూపుడున్నూ; భృత్య సంరక్షణం = సేవకులను రక్షించువాడున్నూ; భవబంధమోక్షణం = సంసారబంధమును తొలగించువారున్నూ.

4. మురళీసరళగానం = మృదువైనటువంటి మురళీగానము చేయువారునూ; మునిబృంద అధీనం = మునిసమూహములకు వశమైయుండువారున్నూ; శరణా గత పాలనం = శరణన్నవారిని పాలించువారున్నూ; శరదిందువదనం = శరత్కాల చంద్రునితో సమానమైన కాంతిగల ముఖముగలవారున్నూ.

5. భవ తిమిర ఘనభానుం = సంసారమను అంధకారమునకు దట్టమైన సూర్యునివంటివారున్నూ; భక్తకామధేనుం = భక్తులకోరికను తీర్చేవారున్నూ; శివనారాయణతీర్థ = శివనారాయణతీర్థులవారికి; శీఘ్ర ఫలదానం = తొందరగా కోరికలను యిచ్చువారునూ; కళ్యాణగోపాలం = వివాహము చేసికొనబడిన గోపాలుడును; సదాదృశ్యాతాం = ఎల్లప్పుడు దర్శనము చేయబడుచుండుగాక.

ప: రుక్మిణీకల్యాణమును జూడుఁడు.

1, కరుణాసముద్రుఁ డగునీమదనగోపాలుఁడు పుష్పమాలికము మొదలగువానిచే నలంకరించుకొని పెండ్లికొడుకై యున్నాఁడు. ఇట్టి యీకృష్ణునకు నమస్కరించెదను.

2. నాశరహితుండవనియు, సకల భాగ్యసమేతుఁడనియు, దేవాంగనలు ఆయనను గూర్చి గానము సేయుచున్నారు. ఈవేదవేద్య నాశ్రయించెను.

3. సత్యకామాఇగుణములు కల్గినట్టియు, సంసారబంధమును తొలంగించి భక్తులఁ బ్రోచునట్టియు, నీజగద్రక్షకుని నాశ్రయించెదను.

4. భక్తులగుటచే నమ్మునులకు భగవంతుఁడనువాఁడును, శరణాగతరక్షకుఁడును, చంద్రునియట్టి ముఖముగల్గి మనోహరుఁడై యుండువాఁడునగు వేణుగానలోలు నాశ్రయించెదను.

5. సంసారమనియెడు చీఁకటికి సూర్యునివంటివాఁడును, కామధేనువుంబోలె భక్తులకు కోరినకోర్కుల నొసంగువాఁడును, నారాయణతీర్థయతికి శీఘ్రముగ శుభఫలముల నిచ్చినవాఁడును అగునా శ్రీకృష్ణు నాశ్రయించెదను.

ఆరభి (శంకరాభరణ) రాగము - ఆది (ధవళ) తాళము

| | | |
|---|---|---|
| ప. | జయ జయ బాలగోపాల | జయ జయ మదనగోపాల |
| | జయ జయ విజయగోపాల | జయ జయ కళ్యాణగోపాల |
| 1. | నిరుపమగుణరత్నాకాశ | నిర్మలకీర్తిపూరితాశ |
| | శరనిధిమధ్యనివేశ | సారసనేత్ర లక్ష్మీశ |
| 2. | బ్రహ్మాదిసురపూజ్యపాద | పాతకజాలవిభేద |
| | బ్రహ్మణ్యదేవ ధృతవేద | బలభద్రావరజ భక్తవరద |
| 3. | పరిజనహృదయప్రభావ | పరిచితమురళీరావ |
| | చరితపుణ్యైక సేవ | శివనారాయణతీర్థదేవ |

ప. జయజయ బాలగోపాలా = హే బాలగోపాల! సర్వోత్కర్షముగా వర్తించుమా; జయ జయ మదన గోపాలా = హేమదన గోపాలా! సర్వోత్కర్షముగా వర్తించుమా; జయ జయ విజయ గోపాలా = హే విజయగోపాలస్వామీ! సర్వోత్కర్షముగా వర్తించుమా!; జయ జయ కళ్యాణ గోపాలా! = హే కళ్యాణ గోపాలస్వామీ సర్వోత్కర్షముగా వర్తించుమా!

1. నిరుపమ గుణ రత్నాకాశ! = అసమానమైనటువంటి గుణరత్నములచేత ప్రకాశించువాడా!; నిర్మలకీర్తి పూరితాశ! = నిర్మలమైన కీర్తిచేత నిండింపబడిన దిక్కులుగలవాడా; శరనిధి మధ్యనివేశ! = సముద్ర మధ్యమునందు ఉనికిపట్టుగా గలవాడా (ద్వారకా పట్టణము నిర్మించినవాడా); సారసనేత్ర = కమలములవంటి నేత్రములుకలవాడా; లక్ష్మీశా = లక్ష్మీనాయకా

2. బ్రహ్మాది సురపూజ్యపాదా = బ్రహ్మ మొదలగుదేవతలచేత పూజింపబడుచుండు పాదములగలవాడా; పాతకజాల విభేధ = పాప సమూహములను కొట్టివేయువాడా; బ్రహ్మణ్యదేవ = బ్రాహ్మణులను పోషించునట్టిస్వామీ; ధృతవేద = వేదములను ధరించినవాడా; బలభద్ర అవరజ = బలరామునికంటె వెనుక పుట్టినవాడా; భక్త వరద! = భక్తులకు వరమిచ్చువాడ

3. పరిజన హృదయప్రభావా = భక్తులయొక్క హృదయములను ఉల్లాసపఱచువాడా; ప్ర = ప్రకర్షేణ; భావ = వృద్ధిజేయువాడ; పరిచిత మురళీరావ = వేణుగానమందు పరిచయముగలవాడ; చరిత

పుణ్యైకసేవ = పుణ్యమైన కర్మలు అనుష్ఠించువారిచేత ముఖ్యముగా సేవించబడువాడా;
శివనారాయణతీర్థదేవ = శివనారాయణతీర్థులవారిచేత సేవింపబడుచుండు దైవ స్వరూపుడా,
జయ జయ బాలగోపాల = బాలగోపాల స్వామీ! సర్వోత్కర్షముగా వర్తించుమా.

ప. ఓబాలగోపాలా! ఓ విజయగోపాలా! మన్మథునితో సమానమగు సుందరాకారముతో నొప్పుచు, పెండ్లికొడుకవై యున్న యోగోపాలా! నీకు జయమగును గాక.

1. ఓకమలలోచనా! పరమాకాశస్వరూపా! నారాయణా! సద్గుణములనియెడు రత్నములచే నొప్పుచు, కీర్తిచే సకలదిక్కుల నిండించుచు క్షీరసముద్రమున నివసించు చుందువు.

2. బ్రహ్మనిష్ఠులగువారలు నిన్నే ధ్యానించుచుందురు. ఓభక్తవరదా! బలభద్రునకు తమ్ముఁడ వగునోకృష్ణా! పాపముల నశింపఁజేయువాఁడవని బ్రహ్మాదులు నీపాదములనే సేవించుచుందురు.

3. ఓ వేణుగాననిరతా! నారాయణతీర్థపూజితా! యెంతయో పుణ్యము చేసినవారలకుఁగాని నిను సేవించుభాగ్యము దొరకదు. అభక్తులహృదయమునందు నీ వెప్పుడును తేజోరూపంబులఁ బ్రకాశించుచుందువు.

శ్లో॥ బ్రహ్మగ్రంథిం విధాయాగ్నిం ప్రతిష్ఠాపయ కేశవ,
కృత్వా సప్తపదం కర్మ ప్రధానం హోమ మాచర 49

కేశవ! = హేకృష్ణా; బ్రహ్మగ్రంథిం = బ్రహ్మముడిని; విధాయ = వేసి; అగ్నిం = అగ్నిహోత్రమును; ప్రతిష్ఠాపయ = ప్రతిష్ఠించుమా!; సప్తపదం కర్మ = సప్తపదమను కర్మకార్యమును; కృత్వా = చేసినవాడవై; ప్రధాన హోమం = ప్రథమ స్థాలీపాక హోమమును; ఆచర = చేయుమా.

ఓకృష్ణా! బ్రహ్మముడి వైచి అగ్నిని స్థాపింపుము. సప్తపదీవిధానమును నడపి ప్రధానహోమము నాచరింపుము.

శ్లో॥ లాజహోమం తతః కృత్వా ప్రవేశం హోమమాచర,
గంధర్వపూజాం కృత్వా థ స్థాలీపాకం సమాచార 50

గంధర్వపూజాం = గంధర్వపూజను; కృత్వా = చేసి, అథ = అనంతరము, లాజహోమం = పేలాల హోమమును; కృత్వా = చేసి, తతః = అనంతరమందు; ప్రవేశహోమం = గృహప్రవేశ హోమమును; ఆచర = ఆచరించుమా; స్థాలీపాకం = స్థాలీపాకమును; సమ్యక్ + ఆచర (సమాచార) = లెస్సగా చేయుమా.

పిదపలాజహోమమును, ప్రవేశహోమమును ముగింపుము. గంధర్వపూజనాచరించి స్థాలీపాకమును చేయుము.

శ్లో. భుక్త్వాద్య బంధుభిస్సార్థం భక్ష్యం పాయసముత్తం,
శేషహోమం కురు స్వామిన్ తతో నాగబలిం కురు 51

అద్య = ఇప్పుడు; బంధుభిస్సార్థం = బంధువులతోకూడా; ఉత్తమం = శ్రేష్ఠమై (మధురమైన), పాయసం = పరమాన్నమునున్నూ; భక్ష్యం = భక్ష్యములున్నూ; భుక్త్వా = ఆరగించి; స్వామిన్ ! = హేకృష్ణా!; శేష హోమం = శేషహోమమును; కురు = చేయుము; తతః = అటుపిమ్మట; నాగబలిం = నాగబలిని; కురు = చేయుము.

ఓ స్వామీ! ఇపుడు బంధువులతో కూడి భుజింపుము. తరువాత శేషహోమము నాచరించి నాగబలి నొనర్తువు.

శ్లో॥ పుష్పశయ్యాసమారూఢో రుక్మిణ్యా రమయా సహ,
భుంక్ష్వా ఖండసుఖం సత్వం భూమాఖ్యం కృష్ణ కేవలమ్.

కృష్ణా! = హే కృష్ణా!; రమయా = లక్ష్మీస్వరూపురాలైన; రుక్మిణ్యాస్సహ = రుక్మిణీ అమ్మవారితోగూడ; పుష్పశయ్యా = పూలపాన్పుమీద; సమారూఢః = ఎక్కినవారై; సత్వం = సాత్వికమగు; భూమాఖ్యం = బూమిపదవాత్సవగు; కేవలం అఖండసుఖం = దుఃఖ మిశ్రమముగాని అఖండ అవిచ్ఛిన్నసుఖమును; భుంక్ష్వా = అనుభవింపుమా.

ఓ కృష్ణా! ఇట్లు వివాహమును ముగించి, లక్ష్మీదేవియవతారమగు రుక్మిణితోఁ గూడి పూలపాన్పున వసించి, భూమపదవాచ్యమును, సాత్వికమగు పరమానందము ననుభవింపుము.

కేదారగౌళరాగము - ఆదితాళము

1. బ్రహ్మగ్రంథిం కురు కృష్ణత్వం
పరిహర మాయాకృతబంధం
బ్రహ్మసభాయామిహవైవాహిక
పావక మిహ సంస్థాపయ భో

2. గురుపదస్త్వం తవ మాయాకృత
సప్తపదాఖ్యం విహితం కర్మ
క్లుప్తం తత్ర ప్రధానహోమం
కృష్ణ కురు త్వం కృతకృత్యో సి

3. లాజహోమమథ కురు కృష్ణ త్వం
లక్షణలక్షిత మిహ లక్ష్మ్యా
శ్రీజానే థ ప్రవేశహోమం
శ్రేయస్కర మాచర కృష్ణ

4. గంధర్వం సంపూజ్య చ విధినా
గరుడధ్వజకేశవకృష్ణ
కురు విధినా స్థాలీపాకాఖ్యం
కర్మ చ కరుణారసజలధే

5. ఇష్టతమం పాయసమతిమృష్టం
పిష్టకమతిసంతుష్టమనా
ఇష్టజనైస్సహ భుంక్ష్వ యథేష్టం
తుష్టిం పుష్టిం కురు జగతాం భో

6. శేషశయన లీలామయవిగ్రహ
శేషహవనమిహ కురు కృష్ణ
దోషరహిత కురు నాగబలిం భువి
భూషయ భైష్మీమిహభూమన్

7. లక్షణశయ్యా మధిరూఢ స్త్వం
లక్ష్మ్యాసహభవ ధనపాలిన్యా
అక్షయసుఖమనుభవనిగమాంత
ర్లక్షణసంబోధితమమలం

8. శ్రీ కల్యాణగోపాలక
రుక్మిణ్యాః కల్యాణమిదం
శ్రీకర మిహ నారాయణతీర్థ
ప్రకటితమితి యతివరసుఖదం

ప॥ కృష్ణా! = హే కృష్ణా! ; త్వం = నీవు; మాయాకృత బంధం = మాయవల్ల ఏర్పడిన బంధమును; పరిహర = త్రోసివేయుమా; బ్రహ్మగ్రంథిం = బ్రహ్మముడిని; కురు = వేయుమా; ఇహ = ఇక్కడ; బ్రహ్మసభాయాం = బ్రాహ్మణుల సభాస్థలియందు; వైవాహికం = వివాహమునకు సంబంధించిన; పావక = అగ్నిహోత్రమును; సంస్థాపయ = లెస్సగావుంచుమా

2. కృష్ణా! = హేకృష్ణా!; త్వం = నీవు; గుప్త పదః = రహస్యమైన స్థానముగలవాడవు; తవమాయాకృత = నీ మాయచేత చేయబడిన; సప్త పదాఖ్యం కర్మ = సప్తపద మనే పేరుగలిగినకర్మ; విహితం = వేదచోదితముగా; క్లుప్తం = నిర్మించబడి యుండునది; తత్ర = దానికి అంగముగా; ప్రధానహోమం = ప్రధాన హోమమును; కురు = చేయుమా; త్వం = నీవు; కృత కృత్యోసి = కృతార్థుడవైతివి.

3. కృష్ణా! = హే కృష్ణా!; త్వం = నీవు; లక్ష్మ్యా = లక్ష్మీ అవతార స్వరూపురాలైన రుక్మిణీ దేవితోగూడా; లక్షణ లక్షితం = శాస్త్రోక్తములైనటువంటి - అనగా శాస్త్ర సమ్మత లక్షణములుగల్గినట్టి; లాజహోమం = పేలాల హోమమును; కురు = చేయుము; చేయుమా; అథ = అనంతరము; శ్రీజానే! = హే లక్ష్మీనాయకా!; శ్రేయస్కరం = క్షేమకరమైనటువంటి; ప్రవేశహోమం = ప్రవేశహోమమును, ఆచర = ఆచరించుమా.

4. హే గరుడధ్వజా! = హేకేశవా! హే కృష్ణా!; హే కరుణాజలధే! = కరుణకు సముద్రమువంటివాడా; విధినా = శాస్త్రోక్తముగా; గంధర్వం సంపూజ్య = గంధర్వుని పూజించి; స్థాలీపాకాఖ్యం కర్మ = స్థాలీపాకమను పేరుగల కర్మను; విధినా = శాస్త్రోక్తముగా; కురు = చేయుమా.

5. భోః = హే కృష్ణా!; ఇష్టతమం = మిక్కిలి ఇష్టమైన పాయసమునున్నూ; అతిమృష్టం = మిక్కిలి రుచ్యమైన; పిష్టకం = పిండివంటలనున్నూ; అతి సంతుష్టమనాః = మిక్కిలి సంతోషముచెందిన మనస్సుగలవాడవై; ఇష్టజనైఃసహా = బంధువులతోగూడా; యథేష్టం = స్వేచ్ఛగా; భుంక్ష్వ = భుజించుమా; జగతాం = జనులకు; తుష్టిం = సంతోషమునున్నూ; పుష్టిం = వృద్ధినిన్నీ; కురు = చేయుమా (కల్గించుమా)

6. హే శేషశయనా! = శేషుని పాన్పుగాగలవాడా; లీలామయ విగ్రహా! = విశేష లీలలతోకూడుకొని యుండు దివ్యమంగళ విగ్రహముగలవాడా!; హే కృష్ణా! = ఓ శ్రీకృష్ణా!; హే దోషరహితా! = దోషములేనివాడా; హే భూమన్ = ఓ సర్వవ్యాపక!; శేష హవనం = శేష హోమమును; కురు = చేయుమా; నాగబలింకురు = నాగబలినిచేయుమా; ఇహ = ఇక్కడ; భైష్మీం = రుక్మిణీ అమ్మవారిని; భూషయ = అలంకరించుమా

7. భో! = హే స్వామీ!; త్వం =మీరు; ధనపాలిన్యా = ధనమును పాలించునట్టి; లక్ష్మ్యాసహ = లక్ష్మీఅవతార స్వరూపురాలైన రుక్మినీ అమ్మవారితోగూడా; లక్షణశయ్యాం = లక్షణయుక్తమగు పాన్పును; అధిరూఢః = ఎక్కినవాడవు; భవ = కమ్మా; నిగమాంతర్లక్షణ సంబోధితం = వేదములయొక్క గూఢ అభిప్రాయమును తెల్పునట్టి ఉపనిషత్తులచేత బోధింపబడుచుండు; అమలం = నిర్మలమైనట్టి; అక్షయసుఖం = నిత్యానందమును; అనుభవ = అనుభవింపుమా

8. శ్రీ కళ్యాణగోపాలకా! = శ్రీ కళ్యాణగోపాలస్వామీ!; యతివరసుఖదం = యతిశ్రేష్ఠులకు సుఖప్రదమైనటువంటిన్నీ; నారాయణతీర్థ ప్రకటితం = నారాయణతీర్థులచేత ప్రచురపరచబడినదిన్నీ అయినట్టి; ఇదం రుక్మిణ్యాః కళ్యాణం = ఈ రుక్మినీ కళ్యాణకథ; ఇహ శ్రీకరం = ఈ లోకమునందు సంపత్తునిచ్చునదిన్నీ; యతివర సుఖదం = మహా నియమముగలిగినవారికి నిత్యానందమును యిచ్చునట్టిదిన్నీ అయి వున్నది.

1. ఓకృష్ణా! బ్రహ్మముడివైవుము. మాయారహితమగు గ్రంధిని పోఁ గొట్టుము. ("బ్రహ్మగ్రంధి" అనుచోట బ్రహ్మశబ్దమునకు పరబ్రహ్మయనికూడ రెండవయర్థముకలదు. 'మాయా గ్రంధిని తీసివైచి బ్రహ్మగ్రంథిని వేయుము అనఁగా పరబ్రహ్మమును హృదయమున స్థిరముఁజేయుము." అని తాత్పర్యము) ఈ బ్రాహ్మణసభయందు వివాహసంబంధమగు నగ్నిని సంస్థాపింపుము.

2. ఓకృష్ణా! నీపదములు (పాదములు, నివాసస్థానములు) మిగుల రహస్యములు అయినను, నీమాయ సప్తపదమగు పేరుగల (యిచట "గుప్తపదుఁడు, సప్తపద (సప్తనివాసస్థానములుగల) మనియెడు కర్మనాచరించుచున్నాఁడు" అనుటలో నొకయపూర్వమగు స్వారస్యము గానవచ్చుచున్నది. సప్తపదమనఁగా "ఏడడుగులదూర మెదురునడుచుట" అని ప్రస్తుతార్థము) యొకకర్మను ప్రపంచహితార్థమై నిర్మించియున్నది ఆకర్మరంగముగా ప్రధానహోమము విధింపఁబడియున్నది. నీవాకర్మ నాచరింపుము. కృతకృత్యుఁడవైతివి (రుక్మిణిని సాధించితివనుట)

3. ఓ కృష్ణా! శాస్త్రోక్తమగు లాజహోమము నాచరింపుము. ఓలక్ష్మీనాధా! లక్ష్మీదేవి యవతారమగు నీరుక్మిణితోఁగూడ ప్రవేశహోమమును జేయుము అది మిగుల శ్రేయస్కరము

4. ఓదయాసముద్రా! గరుడధ్వజా! కేశవా! నీవు వేదోక్తవిధానముతో గంధర్వునిఁ బూజించి స్థాలీపాకము నొనర్పుము.

5. శ్రేష్ఠమగు పాయసమును, రుచ్యములగు పిండివంటలును, మఱియు నానావిధములగు పదార్థముల బంధువులతోఁగూడి భుజింపుము. లోకములకు సంతోషమును, అభివృద్ధిని కలుగఁ జేయుము.

6. ఓ పరమానందస్వరూపా! శేషశాయీ! కృష్ణా! లీలామానుష విగ్రహా! శేషహోమము నాచరింపుము ఓనిర్దోషా! నాగబలి నాచరింపుము. రుక్మిణికి తిలకము దిద్దుము.

7 ధనాధిదేవతయగు లక్ష్మీదేవియొక్క యవతారమైన రుక్మిణితోఁ గూడి లక్షణయుక్తమగుపాన్పు నధిష్ఠింపుము. వేదాంతములచే బోధింపఁబడుచున్న శాశ్వతసుఖము ననుభవింపుము.

8. ఓ కళ్యాణ గోపాలా! యతులకు మేలుసేయుటకై మంగళకరమగు రుక్మిణీకల్యాణమును నారాయణతీర్థుఁడు ఇట్లు ప్రకటించెను.

శ్లో. ఆచార్య వచనాత్సర్వ మకరో ద్యదునందనః,
వాచామగోచరాత్మా పి వాసుదేవస్స్వ మాయయా 53

యదునందనః = యాదవులను సంతోషపరచునట్టి; వాసుదేవః = శ్రీకృష్ణస్వామివారు; (వాచాం అగోచరాత్మా అపి); వాచాం = వేదవాక్కులకుగూడా; అగోచరాత్మా = గోచరించని స్వభావముగలవాడు; అపి = అయినను; స్వమాయయా = తన దివ్యసంకల్పముచేత; అచార్యవచనాత్ = ఆచార్య (అజ్ఞా) వచనమును అనుసరించి; సర్వం = యావత్తు వివాహక్రియాలాపములను; అకరోత్ = జరిగించినవారైరి.

ఇట్లు గర్గాచార్యులు చెప్పుచుండిన వాక్యముల ననుసరించి శ్రీకృష్ణుఁడు సమస్తక్రియల నాచరించెను. ఆవసుదేవపుత్రుఁడు వాక్కుల కగోచరమగు స్వరూపముగలవాఁడైనను తనమాయచే మనుష్యలీలల నాచరించుచునే యున్నాఁడు గదా.

### శ్రీకృష్ణుడు జాంబవతి మున్నగువారలఁ బెండ్లియాడుట

శ్లో. భైష్మీ జాంబవతీ భామా సత్యా భద్రాచ లక్షణా,
కాళిందీ మిత్రవిందా చ మహిష్యోష్టాభవన్ హరేః 54

హరేః = శ్రీకృష్ణస్వామివారికి; భైష్మి = రుక్మిణి అమ్మవారున్నూ; జాంబవతి = జాంబవతియున్నూ; భామా = సత్యభామయున్నూ; సత్యా = నాగ్నజితియున్నూ; భద్రా = భద్రాదేవియున్నూ; లక్షణా = లక్షణదేవియున్నూ; కాళిందీ = కాళిందీ దేవియున్నూ; మిత్రవిందాచ = మిత్రవిందాదేవియున్నూ; అష్టమహిష్యః = ఎనిమిదిమంది పట్టపుదేవులున్నూ; అభవన్ = ఉండిరి. (అయిరి)

అంత క్రమముగ నా శ్రీకృష్ణునకు రుక్మిణి, జాంబవతీ, భామా, సత్యా, భద్రా, లక్షణా, కాళింది, మిత్రవంద అని అష్టభార్య లేర్పడిరి.

శ్లో ద్వారకానగరీమధ్యే సహస్రస్తంభమంటపే,
రత్నసింహాసనారూఢం సకళత్రం జగుస్సురాః 55

ద్వారకానగరీ మధ్యే = ద్వారకా నగరీ మధ్యమునందు; సహస్రస్తంభమంటపే = వెయ్యిస్తంభములు కలిగిన మంటపమునందు; సకళత్రం = పట్టమహిషీలతో సహాకూడుకొని యుండునట్టి; రత్నసింహాసనారూఢం = రత్నసింహాసనమునందు వేంచేసి యున్నటువంటి శ్రీకృష్ణస్వామివారిని; సురః = దేవతలు; జగుః = గానముచేసిరి.

ఇట్లు అష్టభార్యలతోఁగూడి ద్వారకాపురీమధ్యమున నుండువేయి స్తంభములమంటపమున రత్న సింహాసమునపై ఁగూర్చుండి యుండిన శ్రీకృష్ణుని గూర్చి దేవత లిట్లని గానము చేసిరి.

కాంభోజీరాగము - ఆదితాళము

ప. ఆలోకయే రుక్మిణీ కల్యాణగోపాలం
అ. నీలమేఘనిభాకారం బాలార్క సమానచేలం
నీలాంబరానుజం గో పాలం నీలాలకాంతం
1. ద్వారకాపురమంటపే ద్వాదశాదిత్యసన్ని భే
భూరిరత్న సింహాసనే భూసురఘనే
వీరాసనే సమాసీనం వికసితాంబుజాననం
ధీర యోగిసేవ్యమానం దేవకీవసు దేవసూనుం

శంఖదుందుభినాదితే శతశోగంధర్వాదిగీతే
పుంఖానుపుంఖ నిగమ బుధజనావృతే
పంక జేక్షణరంభాది పటునటనవినోదితే
కుంకుమకేసరవర్షితే కోమలాకారచరితే
దివ్యకిరీటకుండల దీప్తపీతాంబరధరం
నవ్యముక్తామణిహారం నానావిహారం
అవ్యయభూతివిస్తారం అమరనారీసురాధారం
భవ్యకౌస్తుభకంధరం భక్తమానససంచారం
అష్టమహిషీసమేతం అమరనారీసుసేవితం
తుష్టపుష్టజనావృతం తుంబురుగీతం
ఇష్టజనసమాశ్రితం ఈశ్వరమపరాజితం
దృష్టసర్వలోకజాతం దేవరాజాదివినుతం
హేమముక్తామణిఛత్రం హీరరత్న కటిసూత్రం
చామరవ్యంజనావృతం శరదిందువక్త్రం
కామకోటిసమగాత్రం కనకాంగదాదివిచిత్రం
శ్యామసుందరం పవిత్రం శరణాగతోద్ధారగోత్రం
చంద్రాననభైష్మీభామా జాంబవతీసత్యామిత్రం
విందాభద్రాలక్షణాకా ళిందీనాయకం
నందనందనమాశ్రిత బృందబృందారకవంద్యం
నందితనారాయణతీర్థ నందద మానందకందం

16వ కీర్తన - కాంభోజీరాగం - ఆటతాళము

నీలమేఘ నిభాకారం = నీలమేఘముతో సమానమైన ఆకారముగలవారున్నూ; బాలార్క సమానచేలం = బాలసూర్యునితో సమానమైన కాంతిగల వస్త్రముగలవారున్నూ; నీలాంబర అనుజం = బరాముని తమ్ముడున్నూ; నీలాలకాంతం = నీలములైన ముంగురులుగలవారునూ; గోపాలం = గోవులను పాలించువాడునూ (దేవతలను పాలించువాడును); రుక్మిణీ కళ్యాణ గోపాలం = **రుక్మిణీ అమ్మవారితోచేరి** యుండు కళ్యాణ గోపాలమూర్తిని; ఆలోకయే = సేవించుచున్నారు; **ద్వారకాపురమంటపే** = ద్వారకా పురమునందుండు మంటపమునందు; ద్వాదశాదిత్యసన్నిభే =

సింహాసనముమీద; భూసురాఘనే = బ్రాహ్మణుల సభమధ్యమందు, వీరాసనే సమాసీనం = క్షత్రియులు కూర్చుండు నటుల వీరాసనముగా కూర్చుండినటువంటి వారున్నూ; వికసిత అంబుజ ఆననం = వికసించబడిన తామరకమలముల వంటిముఖముగలవారున్నూ, వీరయోగి సేవ్యమానం = ధైర్యముగల యోగులవల్ల సేవింపబడు చున్నటువంటివారున్నూ; దేవకీవసుదేవ సూనుం = దేవకీవసుదేవులయొక్క కొమారుడున్నూ - అగు శ్రీకృష్ణస్వామివారిని; ఆలోకయే = చూచుచున్నాను.

2. శంఖ దుందుభినాదితె = శంఖములు దుందుభీ వాద్యములచేతనున్నూ; శతకోటి గంధర్వగీతే = నూరుకోట్ల గంధర్వులు గానముచేయుచుండగా; పుంఖానుపుంఖ నిగమ బుధజన ఆవృతే = అనేకములగు వేదవేత్తలగు బ్రాహ్మణులవల్ల చుట్టుకొనబడివుండునట్టిదిన్నీ; పంకజేక్షణ రంభాది = తామరకమలములతో సమానమైన కండ్లుగల రంభ మొదలగు స్త్రీలచేత; పటునటన వినోదితే = విశేషముగా నాట్యము సలుపబడుచుండునటువంటిదిన్నీ; కుంకుమ కేసరి వర్షితే = కుంకుమతో సమానమైన పువ్వుల వర్షము కలిగినటువంటిన్నీ; కోమలాకార చరితే = కోమలమైన అకారమున్నూ చరిత్రయున్నూగల శ్రీకృష్ణస్వామివారిని; ఆలోకయే = సేవించుచున్నాము.

3. దివ్యకిరీట కుండల = దివ్యమైన కిరీటకుండలములు ధరించినవారున్నూ; దీప్త పీతాంబరధరం = దేవతా సంబంధమైనటువంటి వస్త్రమును ధరించినవారున్నూ; నవ్యముక్తామణిహారం = నూతనమైన ముత్యములు మణులుగలవారున్నూ; నానా విహారం = అనేకవిధములైన విహారములుగలవారున్నూ; అవ్యయ భూతి విస్తారం = శాశ్వతమైనటువంటి విశేషమైనటువంటి ఐశ్వర్యముగలవారున్నూ; అమర నారీ సురాధారం = దేవతా స్త్రీలకు దేవతలకు ఆధారముగా నుండువారున్నూ; భవ్య కౌస్తుభ కంధరం = శ్రేష్ఠమైన కౌస్తుభ మణిని ధరించిన కంఠముగలవారున్నూ; భక్త మానస సంచారం = భక్తులయొక్క మనస్సుల యందు సంచరించుచుండు వారున్నూ; ఆలోకయే = చూచుచున్నారు.

4. అష్ట మహిషీ సమేతం = ఎనిమిది మంది భార్యలతో కూడుకున్నవారున్నూ; అమరనారీ = దేవతా స్త్రీలవల్ల, సుసేవితం = లెస్సగా సేవించబడినవారున్నూ; తుష్ట = సంతోషించుచున్నట్టిన్నీ; పుష్ట = శరీర సౌష్టవం గలిగినటువంటిన్నీ; జనావృతం = జనులచేత చుట్టుకొనబడివుండునట్టిన్నీ; తుంబురు గీతం = తుంబురాదులచేత గానము చేయబడు చున్నటువంటిన్నీ; ఇష్టజన సమాశ్రితం = ఇష్టజనులచేత లెస్సగా ఆశ్రయించబడుచున్నటువంటిన్నీ; ఈశ్వరం = సర్వనియామకుడైనటువంటిన్నీ; అపరాజితం = ఇతరులవల్ల జయింపబడనివారున్నూ (దృష్ట సర్వలోక జాతం); దృష్ట = తనచేత చూడబడుచుండెడి; సర్వలోక జాతం = సమస్తలోకములు కలవారున్నూ; దేవరాజాదివినుతం = దేవేంద్రుడు మొదలగువారివల్ల స్తోత్రము చేయబడుచుండునట్టివారున్నూ - అగు స్వామివారిని; ఆలోకయే = చూచుచున్నారు.

5. హేమ ముక్త మణిచ్ఛత్రం = బంగారు ముత్యములతో మణులతో అలంకరించబడిన గొడుగుగల వారున్నూ; హీర రత్నకటి సూత్రం = వజ్రములచేతను, రత్నముల చేతను పొదగబడిన మొలత్రాడుగలవారున్నూ; చామర వ్యజన ఆవృతం = చామరములచేత తాళ వృంతరములచేత వీవబడుచుండువారున్నూ; శరదిందు వక్త్రం = శరత్కాల చంద్రునితో సమానమైన దేహముతో ప్రకాశమానముగలవారున్నూ; కనకాంగదాది విచిత్రం = బంగారు భుజకీర్తులు మొదలగు విచిత్ర అభరణములచేత ఒప్పువారున్నూ; శ్యామ సుందరం పవిత్రం = శ్యామల వర్ణము గలిగి పవిత్రమైన వారున్నూ అగు స్వామివారిని; అలోకయే = చూచుచున్నారు. ఇంకనూ ; శరణాగతోద్ధారగోత్రం = శరణుజొచ్చినవారినని వుద్ధరించెడి మూర్తిత్వముగలవారున్నూ, అలోకయే = చూచుచున్నారు.

6. చంద్రానన = చంద్రునితో సమానమైన ముఖముగల; భైష్మి = రుక్మిణి అమ్మవారున్నూ; భామ = సత్యభామయున్నూ; జాంబవతి = జాంబవతీ అమ్మవారున్నూ; సత్య = నాగజిత్తిన్నీ; మిత్రవింద = మిత్రవింద అమ్మవారున్నూ; (భద్ర, లక్షణ, కాళింది) - వీరికి; నాయకం = భర్తగా వుండునటువంటివారున్నూ; నందనందనం = నందుని పుత్రుడున్నూ; ఆశ్రిత బృంద = ఆశ్రయించబడిన భక్తులచేతనున్నూ; బృందారక = దేవతలచేతనున్నూ; వంద్యం = నమస్కరింపబడుచుండేవారున్నూ; నందిత = సంతోషపడుచున్నటువంటి; నారాయణతీర్థ = నారాయణతీర్థులవారికి; ఆనందం = ఆనందమును యిచ్చువారున్నూ; ఆనందకందం = ఆనందమే స్వరూపముగాగలవారున్నూ - అగు శ్రీకృష్ణస్వామివారిని; అలోకయే = సేవించుచున్నాము.

ప. రుక్మిణిని వివాహము చేసికొని కూర్చుండి యుండిన యాకల్యాణ గోపాలునిఁ జూచుచున్నాను.

అ. నీల మేఘశ్యామలవర్ణుఁడును, పీతాంబరుఁడును, మేఘములంబోలు కేశములుగలవాఁడును అగు బలభద్రానుజునిఁ జూచుచున్నాను.

1. ద్వాదశాదిత్యులు నొక్కమా ఱుదయించినమాడ్కి మిగులం బ్రకాశమానమై బ్రాహ్మణసమూహముచే నధిష్ఠితంబై, ద్వారకానగరమధ్యమునం దనరారు సహస్ర స్తంభమంటపమున రత్న సింహాసనముపై దేవకీపుత్రుండు కూర్చుండియున్నాఁడు. సకలయోగిజనులును దనను సేవించుచుండ సప్పద్మలోచనుఁడు వీరాననముచే నొప్పుచున్నాఁడు. (వీరాననమనఁగా, హస్తపాదిదతి విన్యాసములలోని భేదము)

2. అమంటపమున శంఖములు, దుందుభులు మొదలగు మంగళవాద్యములు మ్రోగుచున్నవి. గంధర్వాదు లనేకవిధముల గానము సేయుచున్నారు. వేదవేత్తలగు విద్వాంసు లనేకులు పరివేష్టించియున్నారు. కమల నేత్రలగు రంభాదిదేవాంగనలు మనోహరముగ నృత్యము సేయుచున్నారు. అకసమునుండి కుంకుమపువ్వులు వర్షింపఁబడుచున్నవి. ఇట్లుండుటచే నాసభ యొక్క మనోహరాకారము వర్ణింప నశక్యమై యున్నది.

3. మా దేవరక్షకుఁడు, శ్రేష్ఠములగు కిరీట, కుండల, ముక్తాహారాది భూషణములతోను. కౌస్తుభరత్నముతోను, అలంకృతుఁడై, పీతాంబరముంగట్టి యపరిమితమగు కాంతిచే

సర్వకాలములయందును భక్తుల మనసులయందే సంచరించుచున్నాఁడు. (ధ్యానించుటకు మిక్కిలి యనుకూలముగ నున్నాఁడనుట.)

4. సకల ప్రపంచములకు సాక్షియు, నెన్నఁడును అపజయమనుమాట నెఱుంగని పత్రాపవంతుఁడును అగు నీసకలేశ్వరుఁడు, దేవేంద్రుఁడు మొదలగువారు స్తుతించుచుండ, తుంబురులు గానము సేయుచుండ, దేవాంగనలు సకలలోపచారములు సేయుచుండ, పరమానందభరితులై తనస్వజనులు చుట్టుం బరివేష్టించియుండ, అష్టభార్యాసమన్వితుఁడై కొలువుదీరి యున్నాఁడు.

5. నీలమేఘశ్యామలుఁడును, శరత్కాలచంద్రునితో రమ్యమగు ముఖముతోఁ గూడిన మన్మధకోటి సమానసుందరశరీరముతో రాజిల్లువాఁడునగు నాజగత్పవిత్రుఁడు, శరణాగతరక్షకుండు, వజ్రస్థగితమగుకటిసూత్రముతోను, సువర్ణమయములగు కేయూరాదిభూషణములతోను రాజిల్లుచున్నాఁడు. పరిజనులు సువర్ణముక్తామయమగు నాతపత్రమును ధరించి, అన్ని పార్శ్వముల యందును వింజామరములతోను, తాళవృంతములతోను (విసనకఱ్ఱలతోను) వీచుచు సేవించుచున్నారు.

6. చంద్రవదనలగు రుక్మిణీ, భామా, జాంబవతీ, సత్యా, మిత్రవిందా, భద్రా, లక్షణా, కాళిందులకు ప్రాణనాథుఁడగు నానందకుమారుఁడు ఆశ్రితులగు దేవమనుష్యాదులచే సేవింపఁబడుచు, నారాయణతీర్థుని కానందముఁ గల్గింపుచు, కొలువుదీరి యున్నాఁడు.

శ్లో. శ్రీగోపాలఘనాదపారకరుణాపీయూషధారా స్సృతా
యా నారాయణతీర్థ భూధరపరిక్షిప్తా సమస్తా తదా,
సంభూయాచ్యుత భక్తభూమిషువహంత్యా నందయంతీజగత్
పావిత్ర్యం విధునోతు కృష్ణవిలసల్లీలాతరంగిణ్యసౌ 56

శ్రీ గోపాలఘనాత్ = శ్రీకృష్ణస్వామివారు అనే మేఘమునుంచి; అపార = అంతులేని; కరుణాపీయూషధారా = కరుణ అనెడు అమృత ప్రవాహమును; స్సృతా = వర్షించినట్టి; యా = ఏ ప్రవాహముకలదో అట్టి ప్రవాహము; నారాయణ తీర్థ భూదర పరిక్షిప్తా = నారాయణతీర్థులనెడు పర్వతమునందుపడి; సమస్తాతదా = అంతాకూడినదియై; సంభూయ = ఏకమై; అచ్యుత భక్త భూమిషు = భగవద్భక్తులనెడు భూములయందు; వహంతి = ప్రవహించు నదియై; అసౌ = ఈ; కృష్ణలీలసత్ = స్వామివారి యొక్క ప్రకాశించుచున్నట్టి; లీలాతరంగిణి = లీలలనెడు తరంగములుగల నది. జగత్ = జగత్తుయొక్క; పాతిత్యం = పాపములు అను, విధునోతు = పోగొట్టుచున్నదియై; అనందయంత = ఆనందము కలుగజేయుచున్నది.

శ్రీకృష్ణుఁడనియెడు మేఘమునుండి స్రవించినదయ యనియెడునమృత ధార నారాయణతీర్థుఁ డనుపర్వతముపైఁబడెను. అఁట నుండి శ్రీకృష్ణవిలాస వర్ణన మనురూపముతో నది (ఆయమృతధార) యొకనదియై, లోకములెల్ల నానందింపఁజేయుచు విష్ణుభక్తులనియెడు క్షేత్రములపైఁ బ్రవహించుచున్నది. అనది యాశ్రయించినవారలకల్మషముల నపహరించును గాక.

శ్లో. కామదా కామినామేషా ముముక్షూణాంచ మోక్షదా,
శృణ్వతాం గాయతాం భక్త్యా కృష్ణలీలాతరంగిణీ 57
ఇతి శ్రీనారాయణతీర్థ విరచితాయాం శ్రీకృష్ణలీలాతరఙ్గణ్యాం
శ్రీకృష్ణరుక్మిణీ కల్యాణ మహోత్సవ వర్ణనం నామ.

ఏషా = ఈ; కృష్ణలీలా తరంగిణి = కృష్ణలీలా తరంగములను గ్రంథమును; భక్త్యా = భక్తిచేత, గాయతాం = పాడువారలలో; శృణ్వతాం = వినువారలలో; కామినాం = కోరికగలవారికి, కామదా = కోరికలను ఇచ్చునట్టిదిన్నీ; ముముక్షూణాంచ = మోక్షాపేక్షగలవారికి; మోక్షదా = మోక్షమును ఇచ్చునట్టిదిన్నీ అయివున్నది.

గద్య :

ఇతి = ఇది; శ్రీనారాయణతీర్థ విచరితాయం = నారాయణ తీర్థులవారిచేత రచింపబడిన; శ్రీకృష్ణలీలా తరంగిణ్యాం = శ్రీకృష్ణలీలలు అను తరంగములుగల గ్రంథమువందు; శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణ మహోత్సవ వర్ణనం నామ = శ్రీకృష్ణ రుక్మినీ కళ్యాణ మహోత్సవ వర్ణనం అను; ద్వాదశ తరంగం = పంద్రెండవ తరంగము; సంపూర్ణం = పూర్తియైనది.

## మంగళము

శ్లో. స్వామిన్ సర్వజనగన్ని వాస రచితాం డోలాం సురేంద్రాదిభిః
వజ్ర స్తంభవిచిత్రరత్న ఖచితస్వర్ణస్థలే మంటపే,
అరుహ్యామరవర్య గీతమునిభిర్ధ్యే యాత్మమూర్తే హరే
లావణ్యా మృతవారిధే విహర సత్కీ ర్తిం సువిస్తారయ.

సర్వజగన్నివాసా = సమస్త జగములయందు నివశించియుండునట్టి; లావణ్యామృతవారిధే = సౌందర్యమనెడి అమృతమునకు సముద్రమువంటిన్నీ; అమర వర్యగీత = శ్రేష్ఠమైన దేవతలవల్లగానము చేయబడునట్టిన్నీ; మునిభిః = మునులచేత; ధ్యేయ = ద్యానము చేయబడునట్టిన్నీ; ఆత్మమూర్తే = స్వరూపముగలవాడా; హరేః = భక్తులపాదములను హరించునట్టిన్నీ, స్వామిన్ = హేస్వామీ (మీరు); సువర్ణస్థలే = బంగారుమయమైన స్థలము కలిగినటువంటి; మంటపే = మంటపమునందు; సురేంద్రాదిభిః = దేవేంద్రుడు మొదలగువారిచేత; రచితాం = చేయబడిన; వజ్రస్తంభవిచిత్ర రత్నఖచిత = వజ్రస్తంభములు గలిగి విచిత్రమైన రత్నములచేత కూర్చబడిన; దోలాం = ఉయ్యాల యందు; అరుహ్య = అధిష్ఠించినవారై; విహర = విహరించుమా; సత్కీర్తిం = శ్రేష్ఠమైన యశస్సును; సువిస్తారయ = లెస్సగా విస్తరింపచేయుమా.

ఓస్వామీ! జగన్నివాసా! ఇంద్రాదిదేవతలందఱును నిన్ను ఆనందింపఁజేయుటకై యొకయుయ్యలను నిర్మించి, వజ్రస్తంభములతోను, రత్నములచే నతివిచిత్రముగ నలంకరింపఁబడిన సువర్ణమయభూభాగంబును గలమంటపమున నునిచి యున్నారు. ఓలావణ్యసుధాసముద్రా! కృష్ణా! కరుణచే దాని స్వీకరించి దేవతలచేతను, మునులచేతను వినుతింపఁబడుచు విహరింపుము. కీర్తిని విస్తరింపఁజేయుము.

గౌరీరాగము - ఆదితాళము

ప. జయమంగళం - నిత్యశుభమంగళం

1. మంగళం రుక్మిణీరమణాయ శ్రీమతే
మంగళం రమణీయమూర్తయే తే
మంగళం శ్రీవత్సభూషాయ శార్ఙ్గిణే
మంగళం నందగోపాత్మజాయ

2. పూతనాకంసాదిపుణ్యజనహారిణే
పురుహూతముఖ దేవహితకరాయ
సూతాయవిజయస్య సుందరముఖాబ్జాయ
శీతకిరణాదికులభూషణాయ

3. కాళీయమౌళిమణిరంజితపదాబ్జాయ
కాలాంబుదశ్యామ దివ్యతనవే
కారుణ్యరసవర్షినయనారవిందాయ
కల్యాణగుణరత్న వారినిధయే

4. నవనీతచోరాయ నందాదిగోపగో
రక్షిణే గోపికావల్లభాయ
నారదమునీంద్రనుతనామ ధేయాయ తే
నారాయణానందతీర్థగురవే

ప. జయ మంగళం = జయపూర్వకమైన మంగళము అవుగాక!; నిత్య శుభమంగళం = ఎల్లప్పుడు శుభమైన మంగళములు అవుగాక!

1. శ్రీమతే = సంపద్యుక్తమైన; రుక్మిణీరమణాయ = రుక్మిణీ అమ్మవారి భర్త అయినటువంటిన్నీ; శ్రీవత్సభూషాయ = శ్రీవత్సము అనే భూషణము కలిగినటువంటిన్నీ; శార్ఙ్గిణే = ధనస్సును ధరించినట్టిన్నీ; నందగోపాత్మజాయ = నందగోపునకు కుమారుడైనట్టిన్నీ; తే = నీకు; మంగళం = శుభములు కలగుగాక!

2. పూతనాకంసాది = పూతన కంసుడు మొదలగు; పుణ్యజనాః = రాక్షసులను; అమరము ఇట్లు చెప్పుచున్నది·- 'యాతుధాన, పుణ్యజన, నైరుతో, యాతు, రాక్షసి' అని హారిణే = సంహరించినవారున్నూ; పురుహూత = దేవేంద్రుడు; ముఖ = మొదలగు; దేవ = దేవతలకు; హితకరాయ = మేలుచేయునట్టిన్నీ, విజయస్య = అర్జునునియొక్క; సూతాయ = సారధి అయినట్టి; సుందరముఖాబ్జాయ = సుందరమైన ముఖ కమలము కలిగినటువంటిన్నీ; శీతకిరణ = చంద్రునియొక్క; అభిజన = వంశమునకు; భూషణాయ = అలంకారముగా నుండునట్టిన్నీ ఇటువంటి స్వామివారికి; మంగళం = శుభములు కలుగుగాక!

3. కాళీయ మౌళిమణి = కాళీయుడను సర్పరాజుయొక్క శిరస్సునందుండు మణులచేత; రంజిత = ప్రకాశించునటువంటి; పదాబ్జాయ = పాదకమలములుగలవాడ; కాలాంబుదశ్యామ = కాలమేఘముతో సమమగు శ్యామల వర్ణముగల, దివ్యతనవే = దేవతా సంబంధమైన శరీరముగలవాడా; కారుణ్యరసవర్షి = కారుణ్యమనేరసమును వర్షించుచుండెడు; నయనారవిందాయ = నేత్రకమలములుగలవాడా; కళ్యాణగుణరత్న = కళ్యాణగుణములను రత్నములతో నిండిన; వారినిధయే = సముద్రముగలవాడా; జయ మంగళం = శుభములు కలుగునుగాక!

4. నవనీత చోరాయ = వెన్నముద్దలను దొంగిలించినట్టిన్నీ; నందాదిగోప = నందుడు మొదలగు గోపికలను; గో = గోవులను; రక్షిణే = రక్షించుచుండు; గోపికా వల్లభాయ = గోపికలకు భర్త అయినవాడ; నారదమునీంద్రనుత నామధేయాయ = నారదమునీంద్రుడు స్తోత్రము చేయుచుండు నామముగలవాడ; నారాయణానందతీర్థ = ఆనందముగల నారాయణ తీర్థులవారికి; గురవే = ఆచార్యులుగా నుండువాడ; తే = నీకు; మంగళం = శుభములు కలుగుగాక!

శ్రీమన్నారాయణతీర్థ విరచితా
శ్రీకృష్ణలీలా తరఙ్గిణీ సమాప్తా.

ప. ఓశ్రీకృష్ణా! నీకు జయమంగళము; నీకు శుభమంగళము.

1. రుక్మిణీ నాయకుండవును, కాంతియుక్తుఁడవును, మనోహరాకారుఁడవును, శ్రీవత్స మనుమచ్చతోఁ బ్రకాశించువాఁడవును, శార్గమనుధనువుందాల్చువాఁడవును, నందకుమారుఁడవు నగునీకు శుభమంగళము.

2. ఓపార్థసారథీ! సుందరముఖారవిందా! నీవు పూతన, కంసుఁడు మొదలగు రాక్షసుల సంహరించి, దేవతలరక్షించుటకై చంద్రకులాలంకారుండవై జనించినావు. అట్టినీకు శుభమంగళము.

3. కాళీయునిశిరఃఫలయందలి రత్నముల కాంతిచేఁ బ్రకాశించిన (కాళీయమర్దనసమయమునందనుట) పాదపద్మముతో జలసహితమై నిగనిగలాడుచున్న మేఘముతో సమముగ శ్యామలవర్ణముగలిగి రాజిల్లు సుందరశరీరముతో, దయారసమును వర్షించు నేత్రములతో నొప్పుచు, నీవు కల్యాణ గుణములనియెడు రత్నములకు సముద్రంబునుంబోలె నున్నావు. అట్టి నీకు శుభమంగళము.

4. నందాదిగోపకులను, గోవులను రక్షించినట్టియు, గోపికాప్రాణనాథుండవైనట్టియు, ఓనవనీతచోరా! నీవు నారాయణతీర్థయతికి గురుండవై, నారదాది మహామునులచే నుతింపఁబడుచున్నావు. అట్టి నీకు జయమంగళము నిత్యమును శుభమంగళము.

**శ్రీకృష్ణ లీలాతరఙ్గిణి సమాప్తము.**

# ప్రక్షిప్త తరఙ్గములు

**కల్యాణీరాగము - ఆదితాళము**

ప. బ్రూహి ముకుం దేతి
హేరసనే పాహి ముకుం దేతి

1. అక్రూరప్రియ చక్రధ రేతి
హంసనిరంజన కంసహ రేతి

2. రాధారమణ హరే రామేతి
రాజీవాక్ష ఘనశ్యా మేతి

3. కేశవ మాధవ గోవిం దేతి
కృష్ణా నంత స దానం దేతి

4. అచ్యుత కృష్ణ హరే రామేతి
హరినారాయణతీర్థపరేతి.

**ఆరభీరాగము - ధవళతాళము**

ప. జయ జయ వైష్ణవి దుర్గే జయజయ కల్పితసర్గే
జయజయ తోషితభర్గే జయ జయ కుచజితదుర్గే

1. శ్రీకరసద్గుణజాలే సిందూరరంజితఫాలే
పాకశాసనమణినీలే ప్రాలేయభూధరబాలే

2. పాలితకిసలయచాపే పార్వతి లోకైకదీపే
కాళికకోమలరూపే ఖండితత్రిభువనాతాపే

3. భక్తజనామరభూజే భాసితలోకసమాజే
రక్తమృదులపాదాంభోజే రంగదుత్తుంగవక్షోజే

4. శంకరిసత్కృపాపూరే సంభృతసన్మణిహారే
సాంకవలిప్తశరీరే సంగతాంగకేయూరే

5. వీణావినోదిని గిరిజే విద్రుమమణిసన్నిభగిరిజే
మానితలోకసమాజే మదనగోపాలకసహజే

## 3. మధ్యమావతీరాగము - ఆదితాళము

ప. మదనగోపాల తే మంగళం మందరధర తే మంగళం

1. శ్రీరమణీకుచకుంకుమపంకవి లిప్తవిశాలభుజాంతర
వారిజలోచనవల్ల వయువతీ జారసదా తే మంగళం

2. కుండలయుగళీమండితమృదుతర గండస్థల తే మంగళం
భండనసముదితచండపురాసుర ఖండనచరణ తే మంగళం

3. రంగదభంగపరాక్రమ సంగత గంగాధర తే మంగళం
అంగజజనక భుజంగమతుంగతు రంగశయన తే మంగళం

4. దినకరమండలమధ్యగ సంతత వినతామర తే మంగళం
వనజభవార్చితపాదసరోరుహ మునిజనహిత తే మంగళం

5. సామజపోషణ శత్రువిభీషణ సంభృతకౌస్తుభభూషణ
కామితదాయకకమలానాయక సోమాన్వయ తే మంగళం.

## సౌరాష్ట్రరాగము - ఆదితాళము

ప. శివ శివ భవ భవ శరణం - మమ భవతు సదా తవ స్మరణం

1. గంగాధర చంద్రచూడ-జగ న్మంగళ సర్వలోకనీడ

2. కైలాసాచలవాస-శివ కర పురహర దరహా

3. భస్మోద్ధూళితదేహ-శంభో పరమపురుష వృషవాహ

4. పంచానన ఫణిహేష-శివ పరమపురుష మునివేష

5. ఆఈనందనటనవినోద-సచ్చి దానంద విదళితఖేద

6. నవవ్యాకరణస్వభావ-శివ నారాయణతీర్థదేవ.

# తృతీయ భాగము

# శ్రీ నారాయణతీర్థులవారి చరిత్ర

రచయిత : కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ

కోన సీమ భీమేశు నుద్యాన సీమ
సాధు గోదాపయోగర్భ సస్యభూమ
తనరు నాంధ్రీ సతీ గళోద్దామ దామ
కూచిమంచి యనంగ నక్కోనసీమ 1

కలదొక్క యగ్రహార
మ్మలఘు సరస్వతికి రత్నహారము దానన్
గలరు జగతీ సుపర్వులు
తెలిసిన దంపతులు పార్వతీ గంధర్వుల్ 2

కాయము గన్న భక్తియన గల్గెను వారికిఁ బుత్త్రకుండు నా
రాయణ భక్తితత్పరత నట్టిద పేరునుబెట్టి రింతలో
నాయన వేద వేదశిఖరాఖిల మేఖల యైన వాణి సం
ధాయుత భాసమాన రసనానటనంబులఁ దేల్చునట్టిడై 3

గొంతెత్తిపాడెనా, కొమ్మలోఁ గోకిల
మసలు వసంతాగమ మ్మటంచు
శివమెత్తియాడెనా, చెట్టు పంగల నెమ్మి
కడఁగు వర్షాసమాగమ మటంచు
వేదరహస్యముల్ విప్పెనా, మ్రాన్పాటు
భజియింత్రు త్రయ్యర్థపారిషదులు
నామకీర్తనఁ జేసెనా, బాలకృష్ణుఁడు
ఘల్లుఘల్లున వచ్చి గంతులిడును
కూడి శివరామతీర్థులన్ గురువు నొద్ద
సాధువయి నేర్చె సర్వశాస్త్రములు తద్ద
నెగడె నింతలో విద్యలన్నింట బెద్ద
గాగ నెంతెంత వారికిఁ గళలు దిద్ద. 4

మాధవానలు నవతార మహిమఁ జూపు
కాంచె బిల్హణ జయదేవ కవుల రూపు
చదివినది కాదు సంగీత శాస్త్రమందు
నూలుకొని పాడెనేని వీనులకు విందు 5

చ. చిఱుతతనంబునందె తన శిష్యునిభావము బాలకృష్ణ సుం
దర తర సత్కథాపులకితం బగుచుండగఁ జూచి దేశికుం
డురుతరమోదవార్ధి యదియున్ దన భాగ్యముకాఁ దలంచె నం
దఱదగు భాగ్య మాంధ్రవసుధాస్థలి భాగ్యము గీతియోగ్యమున్ 6

ఆ. వయసువచ్చినంత బ్రహ్మవంశకిశోరుఁ
డెంత భక్తికలడో యంత సక్తుఁ
డయ్యెఁ దల్లిదండ్రు లనుకూలవతిఁ దెచ్చి
పెండ్లిఁ జేసినారు పెరిమఁగ్రుచ్చి 7

క. వేదాద్రి యొద్దఁ గృష్ణకు
నాదరి బ్రాహ్మణుల యగ్రహారమునందున్
శ్రీదేవి కుద్ది యయిన త
లోదరి నొక్కర్తు కూర్చి రొగి కనువిందున్ 8

క. కూరిమి తలిదండ్రులతోఁ
బాలుఁడు వేదాద్రియందు భక్తివశత దై
త్యారిని నరసింహేశ్వరుఁ
జేరిక భజియించుచుండె సిరులొలయంగన్. 9

క ఇలు నొడలెంచక కవితా
విలసనములఁ దిరుగుచుండె విద్వాంసుండై
తలిదండ్రు లిచ్చఁ గలఁగగఁ
బొలతుక పుట్టింట విన్నబోవుచు నుండన్. 10

గీ. చల్లపల్లి ముక్త్యాల సంస్థానములను
పండితాఖండలుండయి ప్రతిభఁ జూపి
మహితనాట్యప్రబంధ నిర్మాతయగుచుఁ
బారిజాతాపహరణంబు వ్రాసెఁ గృతిని. 11

చ. చిఱుతలు పూని పాదములఁ జెల్వుగ గజ్జెలు కట్టి తంబురా
యఱుతనుదాల్చి పంచమ సుధాధర మాధురి వొల్చు గొంతుతోఁ
బరము యశోద చిన్ని సుతుఁ బాడిఁ గూడిన వారి కన్నులన్
గిరగిర బాష్పముల్ తిరుగుఁ గృష్ణుఁడు కూడిన లోని మిన్నులన్ 12

క. ఆభక్తుని నాలుకపై
శోభించెను కృష్ణగీతి శుద్ధమహస్సై
శ్రీభూమి యతని యెడదన్
స్వాభావిక రాగరేఖ సాగెఁదమస్సై 13

క ఇటులుండ నొక్క మేఘో
ద్భటగర్జానినద రేఖఁ బండినవర్ష
చ్ఛటఁబొల్చు శ్రావణం బది
పుటవుటనై వచ్చె దేశములు చిగురింపన్ 14

చ. పరువమువచ్చెఁ జెట్లకును బాటల మొల్చిన పచ్చగడ్డికిన్
విరిసినయొక్క నాటి తుదివేళకు సూర్యుఁడు నస్తమించి యు
ద్ధురమయి పొల్చె వానియెదతోడి విచిత్రపు రాగరేఖతా
బరువిడె వానిబుద్ధి సతిపైకి రువారపు పొంగులెత్తుచున్ 15

గీ. అపుడు తానున్న చోటికి నత్తవారి
యింటికిని మధ్యగా నెదురెక్కెఁ గృష్ణ
వఱదలుగఁ బొంగి చనుచుండి వయసుచేత
నెడద విప్రసూనున కెదురెక్కెఁ దృష్ణ. 16

శా. కాలాంతంబునఁ బోలెఁ బొర్లుచుఁ దరంగమ్ముల్ మహాకాశవీ
థీ లీఢంబులుగాగఁ గృష్ణ పొరలెన్ ధీరుండు లోహార్గళో
ల్లీలాబాహుఁడు పీనవక్షుఁడు మనోలీలావశుండై రుషన్
బో లేమాయని బారుటీతకుఁ బడెన్ బోత్రిప్రభుండో యనన్ 17

ఆ నడుముకట్టిదూకి నడియేటఁ బడిపోవు
నతని కాలుసేతు లాడకుండ
నొక్క పెద్దసుడి మహోగ్రంబు ప్రాణాంత
భయము కలుగఁజేసె వాని కపుడు 18

క చేతోవీధి నిరాశా
ధూతముగా బ్రతుకునాప తూలఁగఁ గానీ
భీతిలనేటికటంచును
నాతురసన్న్యాసమాత్మ నవలంబించెన్. 19

శా. ప్రేషోచ్చారణ మంత్రమున్నొడివె దుల్పెన్ సర్వబంధంబు ని
శ్శేషంబైన మూర్ధజం బొకడు తీసెన్ ముండనాంకంబుగాన్
ఈషాపద్ధతి ప్రక్కలించి మదినిట్లేయయ్యె సన్న్యాసిగా
ఘోషల్ వెట్టెడు కృష్ణనీరు తనులోఁగొంచేగు నన్నంతలో 20

గీ. అతఁడు తనుదా నెఱుంగక మృతినిగనక
యొడ్డునకుఁజేరె నద్దియేదో మహత్తు
తన్నుకొనుకీడు తాఁబాసిచన్న వెనుక
మనసు వెనుకటి సంగంబు నిలిచి హత్తు 21

మ. జలగండంబు తొలంగె సన్న్యసన మిచ్చున్ జేసితింగాని యు
జ్జ్వలరాగాత్మకమై యెడందసతిపైఁ బాతెన్ గురుల్ సెప్ప ర
ర్మిలిమై తొయ్యలి యామతింపదు బికారిం బోల్పరిబ్రాట్టునై
తొలగంబోవుట ధర్మమాయనుచు వాదుల్‌పోవు చాత్మన్ ద్రుటిన్ 22

ఉ. రాగవిరాగముల్ పయికిరాఁజను పొంగుల నొండునొండు తా
మాగి పరస్పరంబు నెదనాకులపెట్టగ మామయింటికిన్
మూగిన చీకటుల్ ముదురుముళ్లుగఁ గట్టిన యర్ధరాత్రమం
దేగిన నత్తమామ లెదురేగి సపర్యలుసేయు చల్లునిన్ 23

గీ. మౌనని ద్రావిభూషితు మదనజనక
మదన తన్మయ భావనా మృదువిభావు
భావమెఱుఁగక తద్భార్యఁ బంపి రతని
యున్న చోటికి సతియును నొదిగి యొదిగి 24

క. తను దాసిన భార్యకుఁ బె
ల్చన గదిలో నతఁడు దివ్యసన్న్యాసివలెన్
గనుపింప నామె వెనుకకుఁ
జని విస్మయమున్ భయంబు సమ్మర్దముగాన్ 25

ఆ. తోయజాక్షి తల్లితోఁ జెప్పె సన్న్యాసి
గాని యతఁడు మగఁడు కాదటంచు
శిరసు బోడి కావి చీరలు దండంబు
వింత తేజు కనుల వెలుగునంచు 26

ఉ. అచ్చెరువొంది మామయును నల్లుని జూడగ నల్లుడల్లుఁడై
పొచ్చెములేక యుండె సతి బూమె లివేమని సంశయాత్ముఁడై
గ్రుచ్చియు పృచ్ఛసేయగ వికుంఠపతిన్ మదినెంచి యల్లుఁడున్
మచ్చిక సెప్పె నాత్మకథ మంతనమం దుదయద్విరాగుఁడై 27

ఆ. తెలిసి యాత్మలోనఁ దెలివ జ్ఞానమహత్తఁ
గలఁచి యాత్మలోని కలుషమత్త
మలచె నాత్మయెల్ల మాధవ సంవిత్తు
దొలచె బంధమెల్లఁ దోరహత్తు 28

క. ఆయనఘు డంత నాత్మన్
తోయరుహానన మహత్తు త్రోవం జూపన్
ప్రాయశ్చిత్తిని గని నా
రాయణ తీర్థాఖ్యఁ జేర నరిగెఁ దిరుపతిన్ 29

ఉ. శ్రీగిరియందుఁ దీర్థులు ప్రసిద్ధి గడించెను యోగశాస్త్ర వి
ద్యాగరుఁడై యఖండ యతి ధర్మ సదా చరణ ప్రవీణుఁడై
శ్రీగిరినేత భక్తజనసేవధి శ్రీపతి వెంకటేశ్వరుం
డూగెఁ దదీయ గాన విభవోజ్జ్వలకీర్తనలందుఁ జొక్కుచున్ 30

మ. అలబోధేంద్ర సరస్వతీ ప్రముఖులౌ నాచార్యులున్ శిష్యులై
కొలువం బేర్చి సమస్తశాస్త్రముల వాకోవాక్య సిద్ధాంతముల్
సలుపన్ దక్షుఁడు తీవ్రభక్తి కలనార్చా ప్రీతిగోవిందుఁడై
విలసన్నామజపై కదీక్షితుఁడు తృప్తింబొంది యుండెన్ గడున్ 31

గీ శ్రీ సురేశ్వర కృతము పంచీకరణ సు
వార్తికంబునకున్ వ్రాసెఁ బ్రతిభ మెఱయ
వివరణం బొందు 'దీపిక' పేరు వెలయఁ
దీర్థభూత నారాయణు తీర్థు లెలమి 32

క. పాదులు గట్టిన శ్రీదా
మోదర భక్తునకు నచట నొక్కప్పుడు తీ
వ్రోదర దుర్వ్యాధి కలిగె
నేదారిని బూర్వజన్మకృత మెటు తప్పున్ 33

క. సేవించిన మందులు సం
భావించిన స్వామి కరుణ పనిసేయక తా
గావించిన పూర్వాఘమె
దేవించెను గడుపులోని తీవ్రత యెల్లన్ 34

మ. అరుదారన్ బిరుదార భక్తజన దీవ్యత్పాలనాదీక్షుఁడౌ
బరమేశుం డొకనాడు తోచియనె స్వప్నం బందు నామూర్తిము
న్నరిగెన్ దక్షిణదేశమొక్క డట కీవై యేగు నీబాధయున్
సురుగున్ గొంతకుఁ గొంతగా నుపశమించున్ వింతకున్ వింతగా 35

గీ. పరముడనుకొన్నది వరాహపురము తీర్థుఁ
డాత్మ ననుకొన్నది తిరువయారు వ్యాధి
వ్యాధిగా నున్నయది తోచదాయె యతికి,
కలఁగి యట నడుక్కెరణియన్ గ్రామమేగి 36

క. భజియించున్ మధుసూదను
గజిబిజిపడు పుణ్యమెల్లఁ గాదను దాదృ
జ్ఞిజభక్తి జనిత వేదను
రజని నొకట స్వప్నవీధి వ్రజపతి యనియెన్ 37

క. నాయన! వరాహపురికిం
బో! యన, నిటకేగుదెంచి పొగిలిదవన! రే
పేయన! వరాహయుగ్మం
బాయెడకుం దారిఁ జూపు నరుగుమనంగా 38

గీ. అడవిపందులు రెండయి పొడిచినట్టి
విదియ మొదలు నాలుగునాళ్ళ విధుశిశువుల
చెలువుకోఅలతోడ వేంచేసెనంత
భక్తమణి వానివెంబడిఁ బట్టెఁ బుంత 39

క. జయజయ వేంకటరమణా!
జయజయ దైత్యేంద్రలోక శౌర్యాక్రమణా!
జయజయ ధ్వస్తభ్రమణా!
జయజయ మత్ర్పాణరమణ! జయజయ యంచున్ 40

క. చేరెను వరాహపురి, చే
కూరెను బో, వ్యాధిశాంతి, కూడిన తద్గ్రా
మారూఢ ద్విజసంఘము
తారుగ జనుదెంచి స్వాగతము పచరింపన్ 41

చ. కలఁగఱివేల్పు చెప్పిన ప్రకారము వచ్చిన యాయతీశ్వరున్
వలఁగొని మ్రొక్కి బ్రాహ్మణులు వారకభక్తిమతుల్ రమేశ్వరున్
నిలువకపాడి, నిన్నుఁ గరుణించెను స్వామి యనుగ్రహింపవే
నిలుకడగాగ నిందు నిలునీవు కృపాబ్ధి! మమున్ గ్రహింపవే! 42

క. నారాయణ తీర్థులునున్
వారిట్లన నచట నిలిచి వారాహపురిన్
నారాయణనామ కలా
పారాయణుఁడై వసించె భక్తిమతి సిరిన్ 43

శా. ఆనారాయణతీర్థులంతట సముద్యద్భక్తి యేపార ల
క్ష్మీనారాయణ దైవతంబులకు నిర్మింపించెఁ బెన్గోవెలన్
సానందాత్ముఁడు మూలవిగ్రహప్రతిష్ఠన్ దానుగాఁ జేసియున్
దానై తెచ్చిన పూజయంత్రమును సంస్థాపించె నాకోవెలన్ 44

ఉ అపగవోని భక్తిని మహాత్ముఁడు కృష్ణునిలీలలెల్లఁ దా
నాపగరాని రక్తిని మహాలయ తాళతరంగ రూపకా
వ్యాపదవెట్టె నయ్యుపద యుర్వర భక్తజనాళి పూర్వపు
ణ్యాపగ పొంగివచ్చినటు లయ్యెఁ దరంగ తరంగ గానమై 45

శా శిష్యోత్తంసులచే వరాహపురిలో శ్రీకృష్ణలీలా కథా
భాష్యంబుల్ పొదరించెఁ దా నభినవ ప్రస్తావనా నాట్య సం
తుష్యత్సర్వ జగంబుగా విమలసాధు ప్రేక్షణీయంబుగా
శుష్యత్పాపుఁడు నవ్యనాటక కలాశోభల్ ప్రపంచించుచున్ 46

క. శిక్యోత్సవ మను పేరిట
వాక్యార్థము చేసెఁ గృష్ణ వైభవ లీలా
ధిక్యంబులు కవినట రా
సిక్యంబులు కొల్లగాగ సిద్ధాంతములన్ 47

క. ఆనాటినుండి తెలుగుల
రేనాటఁ బ్రసిద్ధమయ్యెఁ గృష్ణుల లీలా
శ్రీనాటకమ్ము తచ్చి
క్యానందోత్సవము నెల్ల రానందపడన్ 48

క. నారాయణ తీర్థుల వా
రా రీతిని మూడు వత్సరమ్ముల వఱకున్
వారాహపురి వసించిరి
చేరిరి 'తిరుపుంతురుత్తి' సిద్ధిఁ గనుటకై 49

సీ కౌస్తుభరత్నమో కడలి యనుంగు కూ
తురొ యెఱ్ఱదనమంత యురమునందు
పున్నమచంద్రుడో పొంగారు కరుణార
సంబొ యా యంత కంజాయలందు
వనమాలయో లేక పెనవేసికొను జగ
ద్భరమొ వ్రేలాడుకంధరమునందు
తామరపూవొ మెత్తని జీవలోకంబొ
యభయముద్రాంక హస్తాగ్రమందు
నా వెలింగెడు కఱివేల్పు తావులెల్ల
గుబులుకొని పూవుదోట లాగునను వచ్చి
తెలివి నిగుడు నారాయణతీర్థు తెలివి
లోన దానొక్క తెలివియై లీనమయ్యె 50

ఉ. భక్తిని వేదశాస్త్రచయ భాసురశక్తిని, దివ్యయోగ సం
యుక్తిని, నాట్యచిద్రసమహోదయ రక్తిని, నాంధ్రభూమి సం
సక్తిని, దేశదేశములఁ జాటి యుదారమహర్షి మూర్తియై
ముక్తినిఁ, బొందెఁ దీర్థ డవిముక్తపదంబున పట్టభద్రుఁడై 51

# నారాయణ తీర్థకవి

## (శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు)

సుప్రసిద్ధమైన శ్రీకృష్ణలీలాతరఙ్గిణి రచియించిన మహనీయులు వీరు, సంస్కృతమున సులభమైన భక్తిసంబోధనల, కీర్తనల, మధురమైన శ్లోకముల, శ్రీకృష్ణ కథామృతమును ఈ గ్రంథమున గ్రోలనివారుండరు.

ఈమహాకవి సంస్కృతమున శ్రీ వేంకటేశ్వర స్తుతిని, హరిభక్త సుధార్ణవమును కూడ రచియించినట్లు తెలియుచున్నది.

ఇక తెనుగునకూడ 'పారిజాతాపహరణమను నాటకమును రచియించినట్లును ఈ గ్రంథము "తంజావూరు" సమీపమున "మెరటూరు" గ్రామములో బ్రహ్మశ్రీ బాలసుబ్రహ్మణ్యశాస్త్రి గారివద్ద తాము స్వయముగా చూచినట్లును, వి. రాఘవన్ M.A.Ph.D. వారు మెడ్రాస్ మ్యూజికల్ ఎకాడమీ యొక్క 1942 సం॥ 1 నుంచి 4వ సంచిక 74వపేజీలో - నుదాహరించి యున్నారు.

సంస్కృతాంధ్రములలో కవులైన యీయతీంద్రులు, ఆంధ్రులనియు, కూచిమంచి అగ్రహారము (గోదావరి జిల్లాలో 16వ శతాబ్దము చివర) నకు చెందినవారని, మాధవానల అవతారపరంపరలో జయదేవుని తరువాత అవతార పురుషులనియు డాక్టర్ యం. కృష్ణమాచారియార్ వారి సంస్కృతకవుల చరిత్రలో నుదాహరింపబడెను.

కాని యీ శ్రీనారాయణ తీర్థులవారి పూర్వాశ్రమ నామధేయము ప్రఖ్యాతిగా తెలియదు. తెలిసినవారు గోదావరీ కృష్ణామండల విద్వాంసులు పత్రికాముఖమున లోకమునకు తెల్పెదరుగాక!

మద్రాసు మ్యూజికల్ డిపార్టుమెంటు పై అధికారి ప్రొఫెసరు కె. సాంబమూర్తి గారి పరిశోధనవల్లను, శ్రీ జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతి స్వామివారి ఆశీర్వచనమునను, ఎ. రామస్వామి అయ్యర్ వారిచే మైలాపూర్ బాల మనోరమ ముద్రణాలయమున ప్రచురింపఁబడిన "శిక్యోత్సవము" (ఉట్లపండుగ) అనెడి శ్రీ నారాయణకవి (వీరు శ్రీనారాయణతీర్థులవారియొక్క శిష్యపరంపరకు చెందినవారు) యొక్క సంస్కృతప్రబంధమునుండియు వారలఅనుమతిపై కృతజ్ఞతతో గ్రహించి శ్రీ నారాయణతీర్థులవారి సంగ్రహచరిత్రను ఈదిగువ క్లుప్తముగా వివరించుచున్నాము.

వీరి తండ్రి గాంధర్వదేవుడు; తల్లి పార్వతీదేవి; గురువు శివరామానంద తీర్థులు, బాల్యముననే వీరికి విద్యాప్రవీణతయు, అభినయ సంగీతశాస్త్రముల దక్షతయుఁగల్గెనట.

వీరు వివాహానంతరము వేదాద్రిప్రాంతమున కృష్ణానదీతీర గ్రామమున భార్యతో మామగారి యింట నివసించుచు గ్రామాంతరమునకు, ప్రవాహము తక్కువగా నుండిన కృష్ణానదిని మోకాలిలోతు రేవున దాటిపోయియుండిరి. తమపని చూచుకొని మరలి వచ్చుసరికి పైభాగమున వరదలచే నదిపొంగి ప్రవహించు చుండెను. మంచిఈతకారుఁడైన యీయన ధైర్యముగ నదిలో దిగి దాటుటకు ప్రయత్నింపగ ప్రవాహవేగ

మీయనను త్రోసివేసెను. నదిలో కొట్టుకొనిపోయి యీయన జీవితాశ వదలుకొనెను. కాని మనస్సును స్థిరము చేసికొని సన్న్యాసమున గాని మోక్షంలేదని గురువువల్ల నుపదేశము పొందిన వారగుటచే 'అపత్సన్న్యాస' విధానమున ప్రేషోచ్చారణముచేసి ముండనమునకు సూచనగా శిరముపై వ్రేలాడు నొక్కశిరోజమును పెరికివైచి యజ్ఞోపవీతమును త్యజించిరి. కాని అంతలో నీయనచేతికి కొన్ని తుంగలు ఆధారముగా చిక్కగా వానిసహాయమున నదీప్రవాహమును తప్పించుకతాము పోదలచినగట్టునకే చేరుకొనఁ గలిగిరి. కాని సన్న్యాసమును జేకొన్నతానిప్పుడు భార్యవద్దకు పోవచ్చునా యను సంశయము కలిగెను.

తాను సన్న్యసించినట్లు మఱెవ్వరు నెఱుంగరుకదా యని మనస్సును గట్టిపరచుకొని కొంతసేపు గురువును భగవంతుని స్మరించి మామగారి యింటికిపోయెను. అల్లునిరాకకు మామగారును సంతసించిరి. ఆరాత్రి యీయనయొద్దకు భార్య రాగా, ఆమె కనులకు నొక దివ్యతేజస్సుగల 'సన్న్యాసి' వలె కాన్పించిరట. ఆమెఅంతతనతల్లిదండ్రుల యొద్దకేగితన భర్తకాని మఱియొక వ్యక్తియొద్దకు పంపిన కారణమడిగెనట. ఆమె తల్లిదండ్రులు పోయిచూడగా అల్లుడు అల్లుడుగనే వారికి కాన్పించెను. వారు మరల తమ కుమార్తెకు నచ్చఁజెప్పి తిరిగి భర్తవద్దకు పంపిరి. మరల ఆమెకు దివ్యపురుషవ్యక్తియే గోచరమయ్యెను. ఆమెమరల వెనుకకు తప్పుకొని తనతల్లిదండ్రులను కఠినముగా మందలింపసాగెను. ఇంతకు వారు ఆశ్చర్యపడి భక్తాగ్రేసరునిగా తామిదివఱకే యెఱింగిన అల్లునియొద్దకు పోయి, తమ కుమార్తెయొక్క వింతభ్రమతెల్పి, కారణమడిగిరి. అంత నారాయణతీర్థులు జరిగినదంతయు వారికి తెల్పి యికముందు తాను సంసారిగా ప్రవర్తించుట గురుదైవముల ఉద్దేశ్యంకాదని నిశ్చయించి సన్న్యాసాశ్రమమును క్రమవిధానమున స్వీకరించెనట.

అటుపిమ్మట నారాయణతీర్థులు అనేక దివ్యదేశములను సేవించుచు యాత్రసల్పుచుండ వీరికి హృద్రోగ మేర్పడెనట. దానితో బాధపడుచు క్రమముగా తిరుపతినుండి దక్షిణమునకు యాత్రచేయుచో భగవంతుడు వరాహరూపమున ప్రత్యక్షమై, వీరిని తంజావూరు ప్రాంతమున 'వరుహూరు' అనెడి గ్రామముఁ జేర్చి అక్కడ దేవాలయము నిర్మింపుమనియు, 'శ్రీకృష్ణలీలాతరఙ్గిణి' రచింపుమనియు ఆజ్ఞాపించి, అంతర్ధానమయ్యెనట, నారాయణతీర్థులు అచట ఆశ్రమ మేర్పరచుకొని తమ భక్తి సామర్థ్యములచే శిష్యబృందమును జేర్చుకొని దేవాలయమును కట్టించి శ్రీకృష్ణదేవ విగ్రహప్రతిష్ఠలను, తమతో తిరుమల నుండి కొనివచ్చిన శ్రీవెంకటేశ్వర విగ్రహ స్థాపనలను చేయించిరి. క్రమముగా వీరికి హృద్రోగము పోయెను. అంతట భగవదాజ్ఞప్రకారము శ్రీకృష్ణలీలా తరఙ్గిణి రచించి భక్తులచే తరంగ నామామృతము సేవింపఁజేయుచు ప్రతిసంవత్సరము 'శిక్యోత్సవ'మను ఉట్లపండుగను ప్రారంభించి చేయించుచు 'బోధేంద్ర సరస్వతి' మొదలైన మహనీయులను శిష్యులను తరింపఁజేసి అచ్చట వరహూరుననే జీవసమాధిగైకొనిరి. ఇచ్చట నిప్పటికిని భాద్రపదమాసమున 'శిక్యోత్సవము' జరుపుచు భక్తులనేకులు కృష్ణలీలాతరంగములను నృత్యముగానాభినయనములతో కాలక్షేపము చేయుచుందురు. శ్రీనారాయణతీర్థుల చిత్రపటము భక్తులకు అచ్చట దర్శనీయమగును.

## SRI NARAYANA THIRTHA

The spiritual Guru of Sri Bodhendra Saraswathi and mentioned by the latter in several of his works :-

From the History of classical Sanskrit Literature by Dr. M. Krishnamachariar (P. 345) in Adyar Theosophical Library.

TOPICAL PARA 301. "Narayana Thirtha is said to be the last incarnation of Madhavanala. He calls himself the disciple of Sri Sivaramanandha Thirtha. He lived at Kuchimanchi Agraharam in Godavary District about 1,700 A.D. His Krishna Lila Tarangini embraces the story of Sri Krishna in 12 Tarangas. The Musical modes and rhythmic tunes are specified and explanatory verses are inscribed between the songs. The poem is fit for the lyre and shows sentiments of devotion.

Notes :-

1. Kuchimanchi Agraharam is mentioned in the Inam Register in a grant by Kolavenu Buchama and Terumannarao in Fasli 1151.

2. Incarnations of Madhavanala Kavi.

| | |
|---|---|
| 2nd | Bilhana. |
| 3rd | Brihanmangala |
| 4th | Jayadeva |
| 5th | Sri Narayana Thirtha. |

Letter from His Holiness Sri Sankaracharya

Swamighal of Kamakotipeetham

Your letter dated 7-8-1944 was received and placed before His Holiness. I am directed to send herewith a copy of the book called "Sikhyotsawam" by Sri Narayana Kavi.

On page 3 of the Sanskrit introduction to the said book a short account is given of Sri Narayana Thirtha. The "Prasthavikam" of the book gives a more detailed account of the life of Sri Narayana Tirtha. In slokas 70 to 94 of the 1st Aswasa of the text reference is made to him again. A picture of Sri Narayana Thirtha is also found in the book. In addition to the reference given above tradition gives the following history of his life. He is said to belong to the Andhra Country. Shortly after he was married and at the time of the incident narrated below, his wife was living at her

parents' house which was on the other side of the river, probably the Krishna at Vedadri. Narayana Thirtha in his Purvasrama wanted to go over to her one day. While attempting to cross the river, which was then in full flood, he was being carried away by the flood. At that time he thought he might die, and wanted to become a Sanyasi. He took "Apath-Sanyasam" and pronounced 'preshochcharana' Mantram. But fortunately he reached the other side safely. He then thought that since no one knew about his having made 'Preshochcharana', he might as well go to his wife's house. His wife's parents received him and during the night sent his wife to the bed chamber. The girl went near him but returned crying. Though she was pacified and sent back several times, every time she returned crying. He then asked her parents why she was crying like that. When she was asked, she said that when she went to her husband's presence she saw there not her husband, but a Holy Sanyasi. On hearing this Sri Narayana Thirtha thought that-though he wanted to hide the fact of his having renounced the world, God was not for it and that it was God's will that he should be a Sanyasi. He then told the people the real facts and renouncing everything, was going on pilgrimage to various places. We may take it that the incidents referred to in the book sent herewith are a continuation of the story given above. he is said to have lived in Varahur, a village on the Southern Bank of the Kudamurutti, branch of the Cauvewry, and to have attained Siddhi in Tiruppunthuruthi also a village on the Kudamurutti. Both these villages lie on the road leading from Tiruvadi to Tirukkattupalli in Tanjore Taluq. Every year a festival is held in the latter village on the Anniversary of his Siddhi. He was not one of the pontiffs of the Kamakotti Pitha.

It is Sri Bodhendra Saraswathi that was living at Govindapuram a village about 7 miles East of Kumbakonam. He was a great Advocate of Sri Bhagawan-nama-Siddhanata and has written several works about Namasiddhanta. Two of the said books have been printed and we are arranging to send copies of the same to you. There is a Mutt at Marudanallur, a village 3 miles South of Kumbakonam called Sri Sadguru Swami Mutt established by Sri Sadguru Swamy, a lineal disciple of Sri Bodhendra. All the works of Sri Bodhendra are found in the Mutt. Most of them are unpublished, and are on palm leaves. They are now being copied so that they may not be lost to the world.

# SRI NARAYANA THIRTHA

***Dr. V. Raghavan***
Sanskrit Dept. University of Madras

Work 1 : - KRISHNA LILA TARANGINI

Written at Bhupati Rajapuram alias Varahur; the village is referred to in the Tarangini is as also God Venkatesha at the village.

In Madras Government Oriental Manuscripts Library, there is an incomplete commentary on the Krishna Leela Tarangini by one Venkatesha who was assisted by one Govinda Thirtha. The manuscript contains only Tarangas 5-12 and its original came from Nellore District. The number of this Manuscript is R 4064.

2. Haribhakti Sudharnava, a Kavya based on the 10th Skanda of the Bhagavata, even as the Krishna Leela Tarangini. A manuscript, with some chapters missing, is found in the Madras Government, Oriental Manuscripts Library, D. No. 12782.

The Mangalasloka of this poem is the verse "He mangini Tumagupatyam" etc., which is sung by all Bhagavatars as part of their preliminary song in their Hari Katha Kalakshepams.

3. In Advita Vedanta, he wrote a commentary called Vivarnadipika on Suresvaracarya's Panchakarana Varttika. A Manuscript of this sastra work is found in the Tanjore Library No. 7306 of the new catalogue of the Sarasati Mahal Library.

4. The Parijathaharana Nataka, a Yakshagana in Telugu, see my article, an incomplewte manuscript in the Tanjore Library.

The Venkatesa stuti or sloka said to be a work of his in the Sanskrit introduction of the Sikyotsaa is not by him. It is a stale composition by one who knows neither grammer nor metre.

There are a number of Narayana Thirtas and their works ought not to be confused as work of our Narayana Thirtha.

The Bhaktimimamsasutra Vyakhya is also not by our Narayana Thirtha.

***Guru :-***

Sivarama thirtha or Siva Ramananda Thirtha, his own full name is Siva Narayana Thirtha; probably he is known as Siva Narayananda Thirtha.

***Life :-***

I don't know of any authentic source from which we could get any reliable information about his life. Regarding traditional stories they are

given to you already by H. H. Sankaracharya and Prof P. Sambamurthy.

In the notes supplied by H.H. Sankaracharya and by Smbamoorthy there is reference to Vedadri in Andhradesa and the God Name Narasimha at Vedadri is incorporated into the work. This seventh song shows that song on Vedaadri narasimha was probably already compose by Narayana Thirtha and that he was in the Andhradesa before he composed the parijata Nataka at Merattur or the Tarangini at Varahu. The telugu Parijata nataka shows that he was in Andhra-Merattur a centre of music and dance.

***Date :-***

Merattur is called Achyutabdhi after Achyutappa Nayaka, the s of the founder of the Tanjore Nayaka line. In the last song of his Parijathaharana Nataka he refers to God Varadaraja at Achyutabdhi. Achyutappa's date is 1561-1614 A.D. Narayana Thirtha must be latter to this king's time.

As Thirtha was definitely earlier than Tyagayya we may take him to have flourished between about 1600 and 1700 A.D.

In the Tanjore Library there is a work called Panchakosamanjary written by one who calls himself a pupil of Sivanarayanananda Thirtha. Their manuscript belonged to King Tulaja of Tanjore, A.D. 1765-1787. If our Narayana Thirtha or Siva Narayana Thirtha and this Siva Narayanananda Thirtha are the same we may take King Tulaja's time as the lowest limit of Narayana Thirtha's Late. Narayana Thirtha may have flourished between A.D. 1600-1765.

Tyagayya must have been a good student of the Tarangini, (or there are some phrases of Narayana Thirtha which Tyagayya has borrowed for his composition from the Tarangini compositions.

| | Taranga | Thyagaraja |
|---|---|---|
| 1. | Girirajasutasunuh in the very beginning | Girirajasutatanaya sadaya, in his simple song on Ganesa. |
| 2. | Yaga Yoga Raga Bhoga Thaga in his Bhiravi Taranga (Ramakrishna Govidethi) | Found in Tyagayya's Ragesudha-rasa |
| 3. | Taranga I song in Soura-shtra aditala (Sarava-nabhava etc. | Vinakasetuvahana in Thyagayya's Hari Kamboji Piece. |
| 4. | Taranga I song in Ananda-bhairavi - Triputa (vayam Thmyah; Nikhilalokani-dana | Nikilalokanidana in Tyagayya's Nevadanyana in Saranga. |

The last song in Taranga 7 is mentioned by him as a sitadi.

# శ్రీకృష్ణావతార కాలక్రమము

కొవ్వూరు సంస్కృత పారశాల కార్యదర్శి శ్రీశ్రీ చదలవాడ గోపీనాధమువారి యొక్కయు, శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులవారియొక్కయు, యస్.యన్.కె., బీజార్కన్ వారియొక్కయు, శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల అప్పలాచార్యులవారి శ్రీమన్ మహాభారత సంగ్రహము యొక్కయు అభిప్రాయములను సేకరించి, నూజవీడు హైస్కూలు చరిత్రోపాధ్యాయులు, ధన్యంరాజు అప్పారావుగారు సమకూర్చిన భారత భాగవత కథల కాలనిర్ణయము.

గత ద్వాపరయుగము చివర 126 సంవత్సరములు మిగిలియుండగ, శ్రీకృష్ణ భగవానులవారి అవతారము మధురానగరములో

శ్రీముఖ నామసంవత్సర, శ్రావణ బహుళ అష్టమి అర్ధరాత్రి వృషభలగ్నమున అని శ్రీమద్భాగవతమునందును,

విజయ నామసంవత్సర, శ్రావణ బహుళ నవమి మంగళవారము అర్ధరాత్రి రోహిణీ నక్షత్రయుక్త వృషభ లగ్నమున అని హోరాను భవదర్పణమునందును, వచింపబడి యున్నది. అనగా ఇప్పటికి 5044 క్రింద కలిద్వాపర సంధిలో అని తెలియదగును. స్వామి అవతారకాలము మొత్తము 125 సం॥ 7 నెలలు 8 రోజులు.

అవతారకాలము ముగియుటయే ఈ కలియుగారంభము అనగా క్రీస్తు పూర్వము 3225

శ్రీకృష్ణ భగవానుల జాతక చక్రములు

హోరానుభవ దర్పణము ప్రకారము

| | | | |
|---|---|---|---|
| | గు | ల చం | రా |
| | | | కు బు |
| | | | ర శ |
| కే | | | శు |

యస్.యన్.కె. బీజార్కన్‌వారి ఇంగ్లీషు గ్రంథమునుండి

| | | | |
|---|---|---|---|
| కే | | ల చం | |
| | | | గు |
| కు | | | ర |
| | | శు శ | రా బు |

(మధురలో దేవకీవసుదేవులకు జననమైన స్వామి కంసకారాగృహమునుండి నందయశోదలగృహము ప్రవేశపెట్టబడిన తరువాత గోకులమున శ్రీకృష్ణలీలలు.

| కలిపూర్వ సంవత్సరములు | శ్రీకృష్ణుని వయస్సు |
|---|---|

128 ప్రజోత్పత్తి ఆ-శు ౹౹ శతశృంగ పర్వతాశ్రమమున యమధర్మరాజు వరమున, కుంతీపాండు రాజులకు ధర్మరాజు జననము.

127 అంగీరస ......... ........... వాయుదేవునివరమున శతశృంగమునకు కుంతీపాండురాజులకు భీమసేనుని జననము, హస్తినాపురమున గాంధారి ధృతరాష్ట్రులకు దుర్యోధనాదులజననము.

126 శ్రీముఖ శ్రా-బ-౮ జననము మధురలో కంసకారాగృహమున దేవకీవసుదేవులకు శ్రీకృష్ణజననము స్వామి గోకులమునకు యశోదవద్దకు మార్చబడుట, అక్కడ స్త్రీ శిశువుగా నవతరించిన యోగమాయ కంస కారాగృహమునకు తేబడి, కంసుని ధిక్కరించి మాయమగుట (శ్రీకృష్ణులవారి 3వ మాసములోపుగ) పూతనకు ముక్తి, శకటాసుర భంజనము, అయినతోడనే యశోదాదేవికి ప్రధమవిశ్వరూపసందర్శనము. గర్గాచార్యులవారివలన బలరామకృష్ణులకు నామకరణము చేయించబడెను.

6వ మాసమున బాలకృష్ణునకు అన్నప్రాశనము అయినతరువాత తృణావర్తహరణము స్వామిచే గావింపఁబడెను.

శతశృంగమున కుంతీపాండురాజులకు ఇంద్రునివరమున అర్జుని జననము

125 భావ శ్రా-బ- ౮ 1వ సం॥ పూర్తిస్వామి 2వ సంవత్సరమురాగా నేమృత్ భక్షణలీల యశోదాదేవికి ద్వితీయ విశ్వరూప సందర్శనము. అక్కడ శతశృంగాశ్రమమున, మాద్రీపాండురాజులకు అశ్వినీదేవతల వరమున నకులసహదేవులజననము.

124 యువ శ్రా-బ- ౮ 2వ సం॥ పూర్తి ఉలూఖల బంధనము యమళార్జునభంజనము నలకూబరమణిగ్రీవ శాపవిమోచనము, గోకులమునుండి నందాదులు బృందావనమునకు నివాసము మార్చుకొనిరి, ఇంతటి నుండి బృందావనలీలలు 3 సం॥ 11వ సం॥ వరకు

123 ధాత శ్రా-బ- ౮ 3 వ సం॥ పూర్తి వత్సాసురవధ, బకాసురవధ అఘాసురవధ, దేవతలు పుష్పవృష్టి కురిపించి స్తోత్రముచేసిరి.

122 ఈశ్వర శ్రా-బ-౮ 4వ సం॥ పూర్తి బ్రహ్మగోవత్సములను, గోపబాలురను అంతర్ధానము ఒక సంవత్సరమునకు చేయుట, స్వామిగోపబాలురను వత్సరూపములతో నుండి తాము సర్వాంతర్యామియౌట, ప్రకటించిరి (బృందావనమున)

121 బహుధాన్య శ్రా-బ- 5వ సం॥ పూర్తి బ్రహ్మ, గోవత్సములను, గోపబాలురను తిరిగి యిచ్చి స్తోత్రముచేసెను. (గోలోకభగవానుని యిపుడు బ్రహ్మగుర్తించెననియు (యస్.యన్.కె. బీజార్కన్‌గారి గ్రంథము ప్రకారం) స్వామివారి 16వ సంవత్సరమున శ్రీరాధాకళ్యాణము తాను స్వయముగ నెఱవేర్చెననియు, తెలియనగు)

చై-కృ- ౧౪ శతశృంగాశ్రమమున పాండురాజు నిర్యాణము ఇప్పటికి ధర్మరాజు 7 సం॥ భీముడు 6 సం॥ అర్జునుడు 5 సం॥ నకుల సహదేవులు 4 సం॥ వయసుగలవారైయుండి, తండ్రిగారి మరణానంతరము, హస్తినాపురమునకు గొంపోవంబడి, భీష్మనిప్రాపకమున నుండిరి.

120 ప్రమాది శ్రా-బ-౮ 6వ సం॥ పూర్తి బృందావనమున శ్రీకృష్ణునివల్ల ధేనుకాసురభంజనము, కాళీయమర్దనము, ప్రలంబాసురవధ, గ్రీష్మవర్ష శరదృతువులందు స్వామి బృందావన గోపబాలబాలికలతో గోవులను మేపుచు, ఆడుకొనుట, మురళీగానముచే నెల్లరను రంజింపచేయుట, మార్గశీర్ష మాసమునందు గోపకుమరికల కాత్యాయనీ వ్రతము, గోపకుమారి కావస్త్రాపహరణలీల, బాలికలకు వరప్రదానము, బ్రాహ్మణులు అంగీరన యాగముచేయుట, ఆ చెంత గోవులమేపు స్వామికి, గోపబాలురకు, బ్రాహ్మణభార్యలు యజ్ఞప్రసాదము సమర్పించుట.

119 విక్రమ శ్రా-బ-౮ 7వ సం॥ పూర్తి ఇంద్రయాగమును స్వామి మాన్పించుట, గోకులముపై వెల్లువ దేవేంద్రుడు కురిపించుట, స్వామి గోవర్ధనము నెత్తుట, ఇంద్రగర్వభంగము, కామధేనువ క్షీరాభిషేకము స్వామికి చేయుట, వరుణదేవునిచే పట్టుబడిన తన పెంపుడుతండ్రియౌ నందునికై శ్రీకృష్ణుడు వరుణలోకమునకు పోయి, విడిపించి తెచ్చుట, బాల్యరాసక్రీడ (యస్.యన్.కె. బీజార్కన్‌గారి గ్రంథము ప్రకారము) బీసెంటు దొరసానిగారి అభిప్రాయము ప్రకారమును, స్వామివారి 16వ సంవత్సరమున అనగా మధురానగరమునకు పోవుముందు, మఱియొక రాసక్రీడ సూచింపబడినదని యెంచవలయును. అపుడే శ్రీరాధాకృష్ణ కళ్యాణము బ్రహ్మవల్ల నెఱపఁబడెను)

118 వృష శ్రా-బ-౮ 8 సం॥ పూర్తి సర్పరూపమును ధరించిన సుదర్శనుని శాపమును, స్వామి తొలగించుట.

జ్యే-శుద్ధము (పాండురాజు మరణానంతరమున శతశృంగమునుండి హస్తినాపురము గొంపోబడి భీష్మని అధీనమునందున్న పాండవులకు ఉపనయనసంస్కారము, ధర్మరాజుకు ౧౧ సం॥)

| | | | |
|---|---|---|---|
| 117 | చిత్రభాను శ్రా-బ-౮ | 9 సం॥ | శంఖచూడ సంహారము వృషభాసురవధ, కేశిరాక్షసనంహారము, వ్యోమాసురసంహారము, బృందావన గోపాలనలీలలు. |
| 116 | స్వభాను ,, | 10 సం॥ | |
| 115 | తారణ ,, | 11 సం॥ | |
| 114 | పార్థివ ,, | 12 సం॥ | |
| 113 | వ్యయ ,, | 13 సం॥ | |
| 112 | సర్వజితు ,, | 14 సం॥ | |

111 సర్వధారి శ్రా-బ ౮ 15 సం॥ పూర్తి నారదమహర్షి స్వామికి కంసనంహారాది భవిష్యత్కార్యక్రమము వినిపించుట, ఇప్పటికి స్వామి బాల్యము వదలి అవతారకార్యభారము

వహించువయస్సు సమీపించుట చేతనే, నారదమహాముని వచ్చి కార్యమును జ్ఞప్తికి తెచ్చెనని యూహింపవలెను. కాబట్టి స్వామికి వయస్సు ౧౬ సం॥లు అనుట సమంజసము.

110 విరోధి శ్రా-బ ౮ 16 సం॥ పూర్తి (యస్ యన్.కె. బీజార్కన్‌గారి ప్రకారం) (11వ సం॥ భాగవతము ప్రకారము) కంసునియొద్దనుండి పంపబడిన అక్రూరుడు పిలువగ, బలరామకృష్ణులు బృందావనమునుండి మధురానగరమునకు ధనుర్యాగమునకై, బయలుదేరుట, గోపికలు స్వామిని విడువజాలక క్లేశపడుట, మార్గమధ్యమున యమునాతీరమున అక్రూరునకు విశ్వరూపసందర్శన మనుగ్రహించుట, ఇది స్వామివారి 3వ విశ్వరూపసందర్శనము స్వామి బలరామునితో మధురాప్రవేశము చేయుట.

## మధురా కృష్ణలీలలు

( ౧౬ సం॥ నుండి ౩౬ సం॥ వఱకు యస్.యన్.కె. బీజార్కన్‌గారి ప్రకారం)

శ్రీమద్భాగవతము ప్రకారము 12 నుండి 36 వఱకు

స్వామి అక్రూరుని రథముమీద మధురానగరమున బలరామునితో కూడ ప్రవేశించుట మఱునాడు వీధుల వెంటరథము పైవిహరించుచుండగ రజకనిగ్రహము, తంతువాయకసన్మానము, మాలాకారాసన్మానము, కుబ్జాసంభాషణము. ఆమఱునాడు ధనుర్యాగశాలా ప్రవేశము, కువలయాపీడమను ఏనుగును జయించుట.

మల్లరంగమున బలరామకృష్ణులు, ముష్టికచాణూరుల గెల్చుట, కంసునితో పోరాడి, శ్రీకృష్ణుడు కంసుని సంహరించుట, కంససహోదరులతో పోరాడి, బలరాముడు వారిని సంహరించుట. బలరామకృష్ణులు తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను కారాగృహమునుండి విడిపించి, వారిచే లాలింపబడిరి.

కొన్నిదినములతరువాత కంసుని తండ్రియైన ఉగ్రసేనునికి శ్రీకృష్ణుడు పట్టాభిషేకముచేయుట, నందాదిబృందావనగోపనాయకులు, ఉగ్రసేన పట్టాభిషేకమునకు రప్పింపబడిరి.

శ్రీకృష్ణుడు నందునికి ఆధ్యాత్మిజ్ఞానమును, దుర్గాదేవిస్తోత్రము ఉపదేశించి, బృందావనమునకు పంపివేయుట.

109. వికృతి శ్రా-బ- 17 సం॥ పూర్తి (యస్.యన్.కె. బీజార్కన్‌గారి అభిప్రాయప్రకారం 13 శ్రీమద్భాగవతము ప్రకారము)

బలరామకృష్ణులకు, గర్గాచార్యులవల్ల ఉపనయనము, బలరామకృష్ణులు, బ్రహ్మచారులై, గురుశుశ్రూష చేయుట, కాశిక్షేత్రములో వసించుచుండిన, సాందీపమహర్షివద్ద, గురుకులవాసము చేసి, ధనుర్వేదము, ఉపనిషత్తులు అభ్యసించి, విద్యాపరిపూర్తిబడయుట. గురుదక్షిణగ, మృతుడైన గురుపుత్రుని శ్రీకృష్ణుడు సజీవునిగ తెచ్చియిచ్చుటకై ప్రభాసతీర్థమునకు పోయి సముద్రునిచే పూజింపబడి, సముద్రమున ప్రవేశించి, పంచజనాసురుని సంహరించి, పాంచజన్యమను శంఖమును గ్రహించి, యమలోకమునకు బోయి, అచ్చటనుండి గురుపుత్రుని తెచ్చి, గురువునకు కాశిలో సజీవునిగ సమర్పించుట.

108 ఖర శ్రా-బ -ఠ 18 సం॥ పూర్తి (యస్.యన్.కె. బీజార్కన్‌గారి మతప్రకారం 14 శ్రీమద్భాగవతం ప్రకారం)

శ్రీకృష్ణుడు గోపికలవద్దకు ఉద్ధవుని పంపుట, గోపికల భ్రమరగీతలు ఉద్ధవుడు మరలివచ్చి గోపికల ప్రేమభక్తి స్వామికి తెల్పుట.

స్వామి కుబ్జకు వరప్రసాదము అనుగ్రహించుట, శ్రీకృష్ణుడు, బలరాముడు, అక్రూరుని ఆతిథ్యమును పూజలనుగొని బహూకరించుట, పాండవుల క్షేమము విచారించుటకై, స్వామి అక్రూరుని హస్తినాపురమునకు పంపుట.

బాల్యమంతయు ప్రచ్ఛన్నముగ స్వామి, బృందావనమున నందగోవుని గృహమున గడపియుండుటచే, కంసవధానంతరమే పాండవులకు శ్రీకృష్ణునకు ప్రథమపరిచయకాలమని యెంచవలయును.

107 నందన శ్రా-బ-ఠ 19 సం॥ పూర్తి (యస్.యన్.కె. బీజార్కన్ గారి ప్రకారం 15 సం॥ శ్రీమద్భాగవతము ప్రకారము)

జరాసంధుడు (కంసుని మామ) మధురానగముపై మొదటిసారి దండయాత్ర వచ్చుట, యాదవసేనలతో పోరాడి, ఓడి బలరామునిచె పట్టుపడుట, శ్రీకృష్ణుడు జరాసంధుని కరుణించి విడిపించుట.

106 విజయ శ్రా-బ-ఠ 20 సం॥ పూర్తి తిరిగి మూడవ మాసమునకే, జరాసంధుడు కృతఘ్నుడై, మధురపై 2వ దాడిచేయుట, మరలోడిపోవుట ఇట్లు జరాసంధుడు పదునెనిమిది సార్లు, మధురానగరముపై స్వామివారిపై దాడులుచేయుచు, బాధింపుచు వచ్చెను.

105 జయ ఆ-శుద్ధము 21 సం॥ మధురానగముపై జరాసంధుని తృతీయ దండయాత్ర.

పాండవులకథ

ఇంతవఱకు హస్తినాపురమున ద్రోణునివద్ద విద్య నభ్యసించుచుండిన,
పాండవ కౌరవులకు విద్యా, ధనుర్విద్యాభ్యాసపరీక్ష జరిగెను.
మధురానగరముపై జరాసంధుని చతుర్థ దండయాత్ర

104 మన్మధ ఆ-శు-దశమి 22 సం॥ హస్తినాపురమున ధర్మరాజునకు 24 యేట యువరాజ్యపట్టాభిషేకము ధృతరాష్ట్రుడు చేసెను.

103 దుర్ముఖి శ్రా-బ ఠ - 23 సం॥ పూర్తి జరాసంధుడు మధురానగరముపై అయిదవసారి దండెత్తివచ్చుట.

102 హేవళంబి 24 సం॥ జరాసంధుడు మధురానగరముపై ఆరవసారి దండెత్తివచ్చుట.

101 విళంబి 25 సం॥ జరాసంధుడు మధురానగరముపై ఏడవసారి దండెత్తివచ్చుట,

100 వికారి 26 సం॥ జరాసంధుడు మధురానగరముపై ఎనిమిదవ దండయాత్ర చేయుట.

అక్కడ భారతకథ హస్తినాపురమున పెరుగుచున్న పాండవకౌరవ యువకవీరులకు పరస్పరకల్లోలము లేర్పడగ ధృతరాష్ట్రుడు పాండవులను శార్వరి ఫాల్గుణ శుద్ధ అష్టమికి వారణావతరములో నుండబంపుట.

99 శార్వరి 27 సం॥ జరాసంధుడు మధురానగరముపై తొమ్మిదవ సారి దండయాత్ర చేయుట.

98 ప్లవ 28 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదియవసారి దండయాత్ర చేయుట.

అక్కడ పాండువులు ఫాల్గుణ శుద్ధ చతుర్దశికి లాక్షాగృహ దహనమున తల్లియౌ కుంతీదేవితో తప్పుకొనిపోవుట, మార్గమున అరణ్యంలో చైత్ర శుద్ధపాడ్యమినాడు భీముడు హిడింబుని వధించి, హిడింబను వరించి ఘటోత్కజుని గనుట.

97 శుభకృత్ 29 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదకొండవ దండయాత్ర చేయుట.

96 శోభకృత్ 30 సం॥ జరాసంధుడు మధురానగరముపై పండ్రెండవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు, శాలిహోత్రముని ఆశ్రమమున నుండి, ధర్మములు వినుట.

95 క్రోధి 31 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదమూడవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు శాలిహోత్ర ఆశ్రమమునుండి క్రోధి సంవత్సర వైశాఖ శుక్లపక్షములో ఏకచక్రపురమునకు పోవుట, 1వ సం॥

94 విశ్వావసు 32 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదునాల్గవ దండయాత్ర చేయుట.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురనివాసములు 2 సం॥

93 పరాభవ 33 సం॥ జరాసంధుడు మధురానగరముపై పదిహేనవ దంయయాత్ర చేయుట

అక్కడ కుంతీపాండువలు ఏకచక్రపురనివాసులు 3వ సం॥

92 ప్లవంగ 34 సం॥ జరాసంధుడు, మధురానగరముపై పదహారవ దండయాత్ర చేయుట.

జరానంధుడు మధురానగరముపై వదిహేడవదండయాత్ర చేయుట అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపుర నివాసులు 4వ సం॥

91 కీలక 35 సం॥ జరాసంధుడు మధురానగరముపై తుదిసారి 18వ దండయాత్ర చేసెను. కాలయవనుడు పారశీకపురాజును జరాసంధునకు సహాయముగ పశ్చిమదిక్కు నుండి వచ్చెను. 3 కోట్లసైన్యం శత్రువులదని తెలిసి స్వామిముందుగ, కాలయవనునితో పోరాడి, ఓడిపోయినట్లు నటించి, భయముచే పాఱిపోవునట్లు భ్రమకల్పించి ముచుకుందమహర్షి తపస్సుచేయు గుహలో ప్రవేశించిరి. స్వామిని తఱుముకొనివచ్చి కాలయవనుడు ముచుకుందుని సమాధికి భంగము కలిగించి అయన కోపాగ్నిచే దగ్ధము గావింపబడెను. తమ ప్రభువు దగ్ధముచూచి, యవనసేనలు భయపడి పాఱిపోయెను.

అటుపిమ్మట జరాసంధ సేనలతో పోరాడఁజేసి, మధురాపుర యాదవులను, శ్రమపెట్టుటకు ఇష్టములేక తాము లేకున్న మధురను జరాసంధుడు వదలుననియెంచి, శ్రీకృష్ణుడు బలరామునితో ప్రవర్షణగిరి యనుదుర్గమునకు తప్పుకొనిరి. అదివిని జరాసంధుడు మధురను వదిలి ప్రవర్షణగిరి ముట్టడివేసి, ఆదుర్గమును కాల్పించినాశనము చేసెను. బలరామకృష్ణులు అటనుండి తప్పుకొని కొంతకాలము ప్రచ్ఛన్నముగఁ గడపి, పశ్చిమ సముద్రముచేరుకొని, ఆ తీరపుదీవిపై ద్వారకానగర నిర్మాణమును ప్రారంభించిరి (అక్కడ పాండవులు ఏక చక్రపురముననే ప్రచ్ఛన్నముగ నుండిరి) 5 సం॥.

(ద్వారకా కృష్ణలీలలు స్వామి ౩౭ వ సం॥ నుండి 125 సం॥ పైవరకు

90 సౌమ్య 36 సం॥ ద్వారకానగర నిర్మాణము పూర్తియగుట క్రమముగ శ్రీకృష్ణుని ఉనికి తెలిసి యాదవులందరు ద్వారకానగరము చేరుకొనిరి. బృందావనమునుండి నందాది గోపముఖ్యులు, యశోదాది మాతలు మొదలైన భక్తకోటిని క్రమముగా ద్వారకానగరము స్వామి చేర్పించినట్లు గర్గభాగవతము మొదలగు పురాణములలో రచింపబడె) శ్రీ రుక్మిణీకళ్యాణము స్వామి ద్వారకానగర నిర్మాణమున పూర్తిచేయించిన తర్వాత త్వరలో జరిగెను.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురముననే ప్రచ్ఛన్నముగ నుండుట 6వ సంవత్సరము.

89 సాధారణ శ్రా-బ-౮ 37 సం॥ పూర్తి జాంబవతీకృష్ణుల వివాహము, సత్యాదేవి శ్రీకృష్ణుల వివాహము, శ్యమంతకోపాఖ్యానకథ ప్రారంభము, అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురమున ప్రచ్ఛన్నముగ నుండుట 7 వ సం॥

88 విరోధికృత్ ,, ,, 38 సం॥ పూర్తి రుక్మిణీకృష్ణులకు ప్రద్యుమ్న కుమారుడు కలుగుట, పాండవుల క్షేమము తెలిసికొనుటకు స్వామి హస్తినాపురమునకు పోగా, ద్వారకలో శతధ్వనుడు రాత్రి నిద్రించు సత్రాజిత్తుని చంపి శ్యమంతకమణి నెత్తుకొని పాఱిపోవుట.

అక్కడ కుంతీపాండవుల ఏకచక్రపురనివాసము 8 వ సం॥

87 పరీధావి 39 సం॥ పూర్తి తండ్రిగారు హతుడైనందుకు సత్యభామాదేవి విచారించి పిలువనంపగ, శ్రీకృష్ణుడు, ద్వారకకు మరలివచ్చుట విని, శతధన్యుడు శ్యమంతకమణిని అక్రూరునివద్దదాచి, మిధిలవఱకు పాఱిపోయెను. స్వామి మిధిలచెంతకు తఱిమి శతధన్యుని సంహరించి, మణి ఆయనవద్ద లేనందున, ద్వారకకు మఱలివచ్చిరి. స్వామివలన భయము కలుగునని మణితో అక్రూరుడు కాశీపురమునకు పాఱిపోయెను. ద్వారకాపురజనుల కోర్కెపై స్వామి అక్రూరుని మరల రప్పించి, ఆయనచేత మణి ప్రజలకు నిరూపించి అశ్యమంతకమణిని అక్రూరునికే యిచ్చివేసెను. మణిప్రభావమున కలిగిన వైభవముచే అక్రూరుడు యజ్ఞములు, పుణ్యకార్యములు చేసెను.

అక్కడ కుంతీపాండవులు ఏకచక్రపురవాసము 9వ సం॥
ప్రమాదీచ ఆశ్వీయుజ బహుళ కృష్ణాష్టమివఱకు

86 ప్రమాదీచ 40 సం॥ పూర్తి ద్రౌపదీస్వయంవరము, పాంచాలపురములో ప్రకటింపబడగ, తల్లియగు కుంతీదేవితో (ప్రచ్ఛన్న బ్రాహ్మణవేషముతో) పంచపాండవులును, సమస్తరాజులును, శ్రీబలరామకృష్ణులు సాత్యకి మొదలైన యాదవులు, ద్రుపదనగరమున సమకూడిరి. శ్రీకృష్ణుడు స్వయంవరసభలో పాండవులను గుర్తించి, మత్స్యయంత్రమును కొట్టుప్రయత్నమునుండి సాత్యకిని వారించెను. ఇతరు లెవ్వరు కొట్టజాలరైరి. అర్జునుడు మత్స్య యంత్రమును భేదించెను.

ప్రమా-శు-౧౩

ద్రౌపదీ వివాహము నాటికి
ధర్మరాజు వయస్సు 42 సం॥
భీముని ,, 41 సం॥
అర్జునుడు ,, 40 సం॥
నకుల సహదేవులు 30 సం॥

85 ఆనంద మా-బ 41 సం॥ పూర్తి ద్రౌపది వివాహమైన తరువాత 1 సం॥ 2 రోజులకు విదురుని పంపి, పాండవులను కుంతీద్రౌపదుల సహా హస్తినాపురమునకు ధృతరాష్ట్రుడు రప్పించుకొనెను. ధర్మరాజును యువరాజుగ గౌరవించి, అతనిచే రాజ్యపరిపాలనము చేయించెను.

స్వామి హస్తినాపురమున పాండవులను జూడనరిగి, అందుండగా అర్జునితో యమునా తీరమునకు వేట కరిగినపుడు, సూర్యపుత్రియగు కాళిందీ దేవినిచూచి శ్రీకృష్ణుడు ఆమెను ప్రేమించి, హస్తినాపురమునకు తెచ్చి ద్రౌపదీదేవి సంరక్షణలో నుంచిరి. పిమ్మట స్వామి ద్వారకకు కాళిందీదేవిని గొనిపోయి వివాహము చేసికొనిరి. ఈమె స్వామికి 4వ దేవి.

శ్రీకృష్ణుడు అవంతీరాజ సోదరియైన మిత్రవిందాదేవిని వరించి వివాహము చేసికొనెను. ఈ మె స్వామికి 5వ దేవి.

84 రాక్షస శ్రా-బ౭ 42 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు కోసలదేశ రాజకుమార్తె అయిన నాగ్నజితీదేవిని వివాహము చేసికొనెను. ఈమె స్వామికి 6వ దేవి.

83 నల 43 సం॥ పూర్తి స్వామి కేకయదేశ రాజకుమార్తె భద్రాదేవిని 7వ దేవిగ గ్రహించిరి.

82 పింగళ 44 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు మద్రదేశ రాజకుమార్తెయైన లక్ష్మణాదేవిని మత్స్య యంత్రమునుకొట్టి, (అర్జునకు ద్రౌపదీ స్వయంవరమునవలె) 8వ భార్యగ గ్రహించెను. స్వామికి అష్టమహిషులు వాడుకయున్నను, శ్రీరాధాదేవితో 9 మంది భార్యలని తెలియవలెను.

81 కాళయుక్తి శ్రా-బ-౭ 45 సం॥ పూర్తి ఈ వత్సరములలో కౌరవ, పాండవ, యాదవ, రాజ్యములలో కల్లోలములు లేక, ప్రశాంతముగ కాలము గడచెనని యూహింపవలసియున్నది.

80 సిద్ధార్థి మాఘ-బ- ౭ 46 సం॥ పూర్తి ధృతరాష్ట్రుడు పంచపాండవులను అర్ధరాజ్యము యిచ్చి, ఇంద్రప్రస్థమునకు పంపివేసెను.

79 రౌద్రి శ్రా-బ- ౮ 47 సం॥
78 దుర్మతి ,, 48 సం॥
77 దుందుభి ఫాల్గుణములో 49 సం॥ పూర్తి ధర్మరాజు ననుజ్ఞపై
అర్జునుని తీర్థయాత్రాప్రారంభము. 1వ సం॥
76 రుధిరోద్గారి శ్రా-బ ౮ 50 సం॥

| | | | |
|---|---|---|---|
| 75 | రక్తాక్షి | ,, | 51 సం॥ |
| 74 | క్రోధన | ,, | 52 సం॥ |
| 73 | అక్షయ | ,, | 53 సం॥ |
| 72 | ప్రభవ | ,, | 54 సం॥ |
| 71 | విభవ | ,, | 55 సం॥ |
| 70 | శుక్ల | ,, | 56 సం॥ |
| 69 | ప్రమోదూత | ,, | 57 సం॥ |
| 68 | ప్రజోత్పత్తి | ,, | 58 సం॥ |
| 67 | ఆంగీరస | ,, | 59 సం॥ |
| 66 | శ్రీముఖ | ,, | 60 సం॥ |
| 65 | భావ | ,, | 61 సం॥ |
| 64 | యువ | ,, | 62 సం॥ |
| 63 | ధాత | ,, | 63 సం॥ |
| 62 | ఈశ్వర | ,, | 64 సం॥ |

కల్లోలములు లేక ఈ కాలమును ప్రశాంతముగ గడపెను. కౌరవ, పాండవ, యాదవాన్వయములు వృద్ధినొందెను.

అర్జునుడు తీర్థయాత్రలో, ఉలూచి అనే నాగకన్యను వివాహము చేసికొనెను.

అర్జునుడు చిత్రాంగదాదేవిని వివాహము చేసికొనెను, తీర్థయాత్ర క్రమముగా చేయుచుద్వార కానగరమునకు చేరెను. అర్జునుని తీర్థయాత్ర మొత్తము 12 సం॥ తీర్థయాత్ర చివర అర్జునుడు ద్వారకలో దర్శించి అచ్చట కొన్ని మాసములుండి స్వామిచే ప్రోత్సాహపెట్టబడి, సుభద్రను వరించి ఇంద్రప్రస్థమునకు తెచ్చి కళ్యాణము చేసికొనుట.

అంత ఇంద్రప్రస్థమున నుండగా కృష్ణార్జునులు మరల యమునాతీరమున వనవిహారమునకు విచ్చేసిరి. ఆ వనమున అగ్నిదేవుడు వారికి ప్రత్యక్షమై అర్జునునకు గాండీవము అక్షయతూణీరము శ్వేతాశ్వముల రథమును యిచ్చెను.

శ్రీకృష్ణుడు ప్రీతిగఖాండవనమును, అగ్ని చేదహనముచేయించిరి.

ఖాండవదహనమునుండి అర్జునునిచే కాపాడబడి, మయుడు పాండవులకు దివ్యమైన సభను యిచ్చెను. ఇంద్రుడును ప్రీతుడై అర్జునునకు అనేక అస్త్రము లిచ్చెను.

| | | | |
|---|---|---|---|
| 61 | బహుధాన్య | శ్రా-బ | 65 సం॥ |
| 60 | ప్రమాది | ,, | 66 సం॥ |
| 59 | విక్రమ | ,, | 67 సం॥ |
| 58 | వృష | ,, | 68 సం॥ |
| 57 | చిత్రభాను | ,, | 69 సం॥ |
| 56 | స్వభాను | ,, | 70 సం॥ |
| 55 | తారణ | ,, | 71 సం॥ |

స్వామివారికి ఇంద్రుని వద్ద నరకాసురునివల్ల బాధను గురించి సందేశము వచ్చుటయు, స్వామి సత్యభామాదేవితో ప్రాక్జోతిష పురముపైకి వేంచేసి నరకాసురుని జయించి, ఆదితి కుండలములు మరల నిచ్చుటయు, ఇంద్రునివల్ల స్తోత్రముచేయబడిన అమరవతికి సత్యభామాదేవితో కూడ వేంచేసి, పారిజాతమును తెచ్చుటయు, నరకాసురుని సంహారమువల్ల విముక్తులు కాబడిన రాజకన్యకలలో తనను వరించినవారిని ద్వారరకు పంపి. కొదువ వారివారిదేశములకు పంపివేయుటకు. మొదలైన లీలలు యీ కాలము జరిగినవి. శ్రీకృష్ణుడు పౌండ్రక వాసుదేవుని, కాశీరాజుని జయించిరి.

54 పార్థివ ,, 72 సం॥
53 వ్యయ ,, 73 సం॥

శ్రీకృష్ణపుత్రుడౌ అనిరుద్ధకుమారుని ఉషాకన్య ప్రేమించి, మేడకు రప్పించుకొనెను. ఆమెతండ్రి బాణాసురుడు అనిరుద్ధుని నిరోధించెను, స్వామి బాణాసురుని జయించి, అనిరుద్ధుని విడిపించి, ఉషా నిరుద్ధులను ద్వారకకు తీసికొనివచ్చి వివాహము చేసెను

52 సర్వజిత్తు ,, 74 సం॥ అభిమన్యుని జననము
51 సర్వధారి ,, 75 సం॥ ఉపపాండవుల జననము
50 విరోధి కా-శు-౧ మొదలు శుక్ల ౧౪ 76 సం॥

నారదుడు ప్రోత్సాహ పెట్టగా ధర్మరాజు రాజసూయమును కల్పించెను. ముందుగ దిగ్విజయము చేయుటకై కృష్ణార్జునులు, భీముడు గిరివ్రజమునకు పోయి జరాసంధుని భీమునిచే వధింపఁజేసిరి.

జరాసంధునిచే బంధింపబడిన రాజులు, కార్తీక శుక్ల పౌర్ణమినాడు విడుదల గావింపబడిరి.

కా-శు- ౫ జరాసంధుని కుమారుడౌ సహదేవునకు గిరివ్రజా పట్టాభిషేకము శ్రీకృష్ణుడు చేయించిరి.

50 విరోధి 76 సం॥ పూర్తి కురుక్షేత్ర సంగ్రామ సూచకమైన సూర్య గ్రహణము వచ్చెను. అప్పుడు కురుక్షేత్రమున యాదవ, పాండవులు ముఖ్యులు వారి దేవీగణము సమావేశమయ్యెను, అచ్చటకు వచ్చిన మహర్షులు సమస్తబంధువులు స్వామివారిని సేవించిరి.

కురుక్షేత్రమునుండి మరలివచ్చిన తరువాత తనతల్లి దేవకీదేవి ప్రార్థింపగా ఆమెకు తమకంటె ముందు జన్మించి కంసునిచే చంపబడిన 6 గురు పుత్రులను, సుతలలోకమునుండి, బలిచక్రవర్తిని మెప్పించి తెచ్చి, తల్లిగారికి స్వామి చూపి పంపిరి.

49 వికృతి చై-శుక్లమందు 77 సం॥ ధర్మరాజు రాజసూయము, శిశుపాలవధ, శ్రీకృష్ణునకు అగ్రపూజ ధర్మరాజు చేయుట.

ఆశ్వీయుజ శుక్లము రాజసూయానంతరము శ్రీకృష్ణుడు పాండవులతో ఇంద్రప్రస్థమున నుండగ, సాళ్వుడు ద్వారకానగరము ముట్టడించెను. స్వామి ద్వారకానగరమునకు మఱలి సాళ్వుని, పౌండ్రకవాసుదేవుని, దంతవక్త్రుని, సాళ్వుని తమ్ముడైన విధూరధుని యుద్ధములో సంహరించిరి.

ఆశ్వీయుజ శు- ౧౦ ఇట్లు స్వామి ద్వారకలో శత్రుయుద్ధములో నుండగా పాండవులపై అసూయకలిగిన దుర్యోధనుడు శ్రీకృష్ణుడులేని సమయమున ద్యూతమునకు ధర్మరాజును పురికొల్పి ఓడించెను.

కౌరవులచే ద్రౌపదీ వస్త్రాపహరణము యత్నింపబడగా శ్రీకృష్ణునిచే అక్షయవస్త్రప్రదానము ద్రౌపదికిఁ గలిగెను. ద్యూతములో ఓడి ధర్మరాజు రాజ్యమును గోల్పోయి తమ్ములతో, ద్రౌపదితోకూడి వనవాసమునకు పోయెను.

48 ఖర 78 సం॥ పూర్తి పాండవులు వనవాసము చేయుచుండగా మొదటిసారి శ్రీకృష్ణుడు వారిని చూడవచ్చిరి. ద్రౌపది శ్రీకృష్ణునితో తన పరాభవము చెప్పుకొని ఊరడింపఁబడెను.

47 నందన 79 సం॥
46 విజయ 80 సం॥
45 జయ 81 సం॥
44 మన్మధ 82 సం॥
43 దుర్ముఖి 83 సం॥
42 హేవిళంబి 84 సం॥
41 విళంబి 85 సం॥
40 వికారి 86 సం॥
39 శార్వరి 87 సం॥
38 ప్లవ 88 సం॥
37 శుభకృత్ 89 సం॥

నవాసమున, కొన్ని సంవత్సరములతరువాత స్వామి సత్యభామతో పాండవుల వద్దకు రెండవసారి వచ్చి ఆదరించిరి. ద్రౌపదీదేవి సత్యభామకు పతీవ్రతా ధర్మములు తెల్పును.

వనవానము ముగియుముందు స్వామి సారి పండవులకు దర్శనమిచ్చి అభయమిచ్చిరి

శ్రీకృష్ణునిచే ననుగ్రహింపబడిన ద్రౌపదీదేవి తన భర్తలను దూర్వాసుని పరీక్షలో నుత్తీర్ణులుగా చేసెను.

ఈ కాలమున ద్వారకలో కుచేలోపాఖ్యానవృత్తాంతమును, మిధిలాపుర రాజైన బహుళాశ్వుని, శ్రుతదేవుని మిథిలానగరవాసు తరింపజేయును. పాండవ వనవాసము ముగింపగుటయు జరి మొత్తము 12 సం॥

36 శోభకృత్ ఆ-కృ- ౭ సప్తమి వఱకు 90 సం॥ అజ్ఞాతవానము, విరాటమున, పాండవులు విరాటనగరములో ప్రవేశించిన 10 నెలల తరువాత కీచకవధ, ఉత్తర దక్షిణ గోగ్రహణములు, సంభవించెను.

శ్రా- శుక్లపక్షం పాండవులు ఉపప్లావ్యమును ప్రవేశించిరి. ద్వారకకు విచ్చేసిరి. కౌరవపాండవులు, సేనల సమకూర్చుకొను సందర్భమున, దుర్యోధనుడు, అర్జునుడు ఏకకాలమున స్వామి సహాయం నడుగుటయు దుర్యోధనునికి తమసైన్యమువచ్చి, తాము అర్జునసారధ్యము నంగీకరించి అర్జునునితో స్వామి ఉపప్లావ్యమునకు విచ్చేయుటయు జరిగెను.

కా-శు-౧౨ ద్వాదశి స్వామి కౌరవులయొద్దకు రాయబారము వెళ్లుట 8 దినములు రాయబారము నడపి, తమను పట్టదలచిన కౌరవులను విశ్వరూపమున భ్రమపెట్టి విదురుని నుద్ధరించి, మఱలివచ్చుట ఘటిల్లెను అది స్వామివారి 4వ విశ్వరూపదర్శనము.

మార్గ-శు- ౧౩ పూర్తి 90 సం॥ ఉభయ సైన్యములు కురుక్షేత్రము తారసిల్లెను. భగవద్గీతోపదేశము చేయు అర్జుననకు స్వామివిశ్వరూపము చూపిరి. (ఇది స్వామివారి 5వ విశ్వరూపసందర్శనము) యుద్ధారంభమై (శుద్ధఏకాదశినాడే గీతోపదేశమని గోపీనాధన్ గారి అభిప్రాయము.

మార్గ-బ- ౧౫ పదునైదు దినములు ఘోరసంగ్రామమై భారత యుద్ధసమాప్తియయ్యెను.

పు-శు-౧ పాడ్యమి దుర్యోధన పతనము అశ్వత్థామ ఉపపాండవులను సంహరించుట.

అశ్వత్థామను కృష్ణార్జునులు పట్టి తెచ్చి విడుచుట ఈనాడు వాటిల్లెను పు-శు-౧౫ ధర్మరాజు పట్టాభిషేకము, శ్రీకృష్ణుడు చేయుట

మాఘ-శు-౧౧ ఏకాదశి భీష్మని స్వచ్ఛందమరణము, భీష్మతేజస్సు కృష్ణునితో కలిసెను

35 క్రోధి జ్యే-శు-౨ 91 సం॥ పరీక్షిత్తుజననము, అశ్వత్థామ బాణాగ్నిచే నిస్పృహుడైజనించిన పరీక్షితుని స్వామి జీవింపజేసి సంరక్షించిరి.

34 విశ్వావసు చై-శుక్ల-౧౫ 92 సం॥ ధర్మరాజు వ్యాసాజ్ఞవలన అశ్వమేధ దీక్షపూనెను.

33 పరాభవ చై-శుక్ల ౧౫ పౌర్ణమి 92 సం॥ అశ్వమేధయాగము పూర్తియయ్యెను,

అర్జునుడు అశ్వసంరక్షణకై దిగ్విజయము చేయుచు, తనకు చిత్రాంగదవలన కుమారుడైన బభ్రువాహనునిచే జయింపబడి, సంధిచేసికొని, అశ్వమును తెచ్చెను

32 ప్లవంగ శ్రా-బ-౮ 94 సం॥ పూర్తి శ్రీకృష్ణుడు ఉదంకమహాముని ఆశ్రమమునకు వెళ్ళి, ఆయనకు దర్శనముయిచ్చి, విశ్వరూపము తిరిగిచూపి తరింపచేసిరి (ఇది స్వామివారి 6వ విశ్వరూప సందర్శనము)

| | | |
|---|---|---|
| 31 | కీలక | 95 సం॥ |
| 30 | సౌమ్య | 96 సం॥ |
| 29 | సాధారణ | 97 సం॥ |
| 28 | విరోధికృత్ | 98 సం॥ |
| 27 | పరీధావి | 99 సం॥ |
| 26 | ప్రమాదీచ | 100 సం॥ |
| 25 | ఆనంద | 101 సం॥ |
| 24 | రాక్షస | 102 సం॥ |
| 23 | నల | 103 సం॥ |
| 22 | పింగళ | 104 సం॥ |
| 21 | కాళయుక్తి | 105 సం॥ |
| 20 | సిద్ధార్థి | 106 సం॥ |
| 19 | రౌద్రి చైశు విదియ | 107 సం॥ |
| 18 | దుర్మతి | 108 సం॥ |
| 17 | దుందుభి శుక్ల ॥ప | 109 సం॥ |
| 16 | రుధిరోద్గారి | 110 సం॥ |
| 15 | రక్తాక్షి | 111 సం॥ |
| 14 | క్రోధన | 112 సం॥ |
| 13 | అక్షయ | 113 సం॥ |
| 12 | ప్రభవ | 114 సం॥ |
| 11 | విభవ | 115 సం॥ |

శ్రీకృష్ణులవారు కురుక్షేత్రమునందు 12 సం॥లు అనేక యాగములు చేయించిరి ధర్మరాజు రాజ్యము చేయుచు సమస్తజనులను పరిపాలించుచుండెను. గాంధారి ధృతరాష్ట్రులు పుత్రశోకముచే హస్తినాపురములో నుండక, శతకూపాశ్రమములో నుండిరి

వ్యాసులవారచ్చటకు వచ్చి వారిని ఊరడించి గాంధారీదేవి కోరగాయుద్ధమున పోయిన ఆమె కుమారులందరిని, తమ యోగశక్తిచే ఆమెకు చూపించిరి

ధర్మరాజు మొదలగు పాండవులు శతకూపాశ్రమమున కొన్నాళ్ళుండి హస్తినాపురమునకు మరలివచ్చిరి. గాంధారీ ధృతరాష్ట్రాది కురువృద్ధులు నిర్యాణము పొందిరి.

శ్రీకృష్ణ భగవానులు సంకల్పముచే ద్వారక క్షేత్రమందు నారదాదిమహర్షులు సమావేశమైరి.

సురాపాన మత్తులైన యదుకుమారులు వారిని అవమానింపగ, మునులు శాపమిచ్చిరి,

మునులశాపముచే స్త్రీవేషధారియై, ఋషులను హేళనచేసి సాంబునికి ముసలముపుట్టెను, ఆ ముసలమును చూచి భీతిల్లి యాదవులు దానిని సముద్రములో కలిపిరి.

| | | |
|---|---|---|
| 10 | శుక్ల | 116 సం॥ |
| 9 | ప్రమోదూత | 117 సం॥ |
| 8 | ప్రజోత్పత్తి | 118 సం॥ |
| 7 | అంగీరస | 119 సం॥ |
| 6 | శ్రీముఖ | 120 సం॥ |
| 5 | భావ | 121 సం॥ |
| 4 | యువ | 122 సం॥ |
| 3 | ధాత | 123 సం॥ |
| 2 | ఈశ్వర | 124 సం॥ |
| 1 | బహుధాన్య | 125 సం॥ |

నారదమహర్షి ద్వారకానగరమునకు వచ్చి వసుదేవునికి భాగవత ధర్మములువదేశించిరి. జనఋషభ సంవాదమును వివరించిరి

శ్రీకృష్ణ భగవానులు బృందావనమునందు విచ్చేసి, తమ మహిమచే బాలకృష్ణ రూపము ధరించి నందయశోదాదులకు గోపగోపీజనమునకు దర్శనమిచ్చి తరింపజేసిరి ఆధ్యాత్మిక ధర్మముల నువదేశించిరి. స్వామి కరుణచే సమస్త గోప గోపీజనము గోపవృద్ధులు తమ తమ దివ్య ధామములైన గోలోక వైకుంఠాది దివ్యభౌమలం గావించిరి.

స్వామి మఱలి ద్వారకానగరము విచ్చేసిరి. బ్రహ్మేంద్రాది దేవతాముఖ్యులు ద్వారకానగరమునకువచ్చి శ్రీకృష్ణభగవానుని సందర్శించి పరమధామమైన తన గోలోకమునకు విచ్చేయమని ప్రార్థించిరి.

ద్వారకాపట్టణములో మహోత్పాతములు పుట్టెను, స్వామి యాదవులను ప్రభాసతీర్థమునకు పంపిరి. అచ్చట పరస్పరము కలహించి యాదవులు నశించిరి, బలరాముడు స్వకీయమైన సంకర్షణ భగవానునియందు లీనమయ్యెను, స్త్రీజనులు దేహత్యాగము చేసిరి.

ప్రమాది చై శు పాడ్యమి ద్వాపరయుగము 8 లక్షల 64 వేల సం॥ పూర్తి. ద్వారకానగరములోని ఉత్పాతములను గూర్చి విని, అర్జునుడు శ్రీకృష్ణుని సందర్శించ వచ్చెను. కృష్ణార్జునులు సముద్రతీరమునకు వాహ్యాళి విచ్చేసిరి. ముసలముయొక్క ముక్కతో చేయబడిన అగ్రముగల బాణము ఒక బోయడు లేడిచెవియని భ్రమించివైచిన బాణము స్వామి పాదాంగుష్ఠమున తగులగ స్వామి నిర్యాణమును చెందిరి. ఇప్పటికి స్వామి వయస్సు పూర్తి, 125 సం॥ 7 నె॥ 8 రోజులు. అంతముందు గోలోకమునకు విచ్చేసిన శ్రీరాధాదేవి దివ్యగోపక బృందము ప్రత్యుత్థానము చేయగ, స్వామి గోలోకమునకు వేంచేయగా బ్రహ్మాదులు దివ్యవిమానములనుండి చేర్పించిరి.

ప్రమాది చై శు స్వామి గోలోకమునకు విచ్చేసినతోడనే కలియుగ ప్రవేశమగుట తెలిసికొని అర్జునుడు దారకునితో రథముపై ద్వారకకు మరలి సప్తమివఱకు ద్వారకలో నుండె.

భూకంపములు గలుగగా, మిగిలిన సమస్త యాదవబృందముతోను మిగిలిన యావన్మంది జనులతోను ద్వారకను వీడి, మధురకు వెడలెను. ద్వారకానగరము సముద్రమున గ్రుంగెను. అర్జునుడు యావన్మందితో మధుర చేరుకొని అక్కడ అనిరుద్ధ కుమారుడౌ, వజ్రునికి యాదవ రాజ్యాభిషేకము చేసెను

అంతట అర్జునుడు హస్తినాపురమునకువచ్చి, శ్రీకృష్ణుని నిర్యాణము ధర్మరాజునకు తెల్పెను.

వై- శుక్లము పరీక్షితు రాజ్యమును అభిషేకించి పౌర్ణమినాడు మహాప్రస్థానిక దీక్షకై పాంచాలి సహితులైన పాండవులు ఒక సంవత్సరము భూప్రదక్షిణము చేసి, విక్రమ సంవత్సరమున బదరికాశ్రమమును దాటి మేరుపర్వత సమీపమున ఊర్ధ్వలోకములను గాంచిరి.



శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీకృష్ణావతార స్వరూప నిర్ణయము

శ్రీ చదలవాడ గోపీనాథన్‌గారు

కొవ్వూరు సంస్కృత పాఠశాల కార్యదర్శి

*యదువంశం - చంద్రవంశం*

1. బ్రహ్మదేవుని మానసపుత్రుడైన అత్రిమహర్షి వంశమునకు చంద్రవంశము అనిపేరు. ఆచంద్రవంశమందు యదువు అను గొప్ప చక్రవర్తి యుండెను. ఆచంద్రవంశమను ప్రఖ్యాతివహించిన యదువంశము శ్రీకృష్ణావతారకాలమందు ఉగ్రసేనుడను రాజుయొక్క పరిపాలనలో నుండెను. ఆరాజు తనకూతురైన దేవకీదేవిని వసుదేవునికిచ్చి వివాహము చేసెను. అట్టి చంద్రవంశమనే యదువంశమందు బ్రహ్మదేవునియాజ్ఞచొప్పన దేవతలు తమతమ భార్యలతో అవతరించియుండిరి. వీరందఱు చంద్రవంశపు క్షత్రియులు.

*నందగోపునివంశం*

2. నందుడు అష్టవసువులలో ప్రధానడైన ద్రోణుడనే వసువు యందు దేవి ఆయన భార్య అయిన ధరాదేవి, వీరిద్దరు బ్రహ్మదేవుని యాజ్ఞ చొప్పన వ్రజమున పుట్టిరి. నందుని వంశమందు గోలోకవాసులైన గోవగోపికలు మఱియు సురభీదేవి వంశసంబంధమైనగోవులు వేలకొలది గోకులబృందావనము విజృంభించియుండెను. ఆగోవులయందు బ్రహ్మదేవుని యానతీచొప్పన నేలపై ఋషులు తమతమ అంశములతో అవతరించియుండిరి గోకుల బృందావనవాసులందరు గోసంరక్షణ పరాయణులైన వైశ్యకులసంభూతులు ద్విజులు గోలోకములోని శ్రీకృష్ణభగవానులు మూలప్రకృతియైన రాధామహాదేవి తమ చెలికత్తెలతో వృషభానుడను గోపకునికి కళావతీయను గోపికకు కన్నకుమార్తెయై గావించెను. ఈమె అయోనిసంభవురాలు. ఈమెయే నందవ్రజవాసులలో ప్రధానురాలు. కాత్యాయనీ వ్రత మాచరించిన గోపికలు యీమెయొక్క చెలికత్తెలు ఈప్రకారముగా నందవ్రజమంతయు గోలోకమునుండి అవతరించిన గోపగోపికలతో నిండియుండెను. వీరందరు గోసంరక్షణ పరాయణులై యుండిరి.

3. ఈనందుడు గోకుల బృందావనములకు చిన్నరాజై మధురాపురరాజు ఉగ్రసేనునికి కంసునికి కప్పము చెల్లించుచుండేవాడు.

4. ఈప్రకారముగా బ్రహ్మదేవుని అజ్ఞప్రకారం దేవతాఅంశ సంభూతులై క్షత్రియులతో మధురాపట్టణము నిండియుండెను. నందవ్రజము శ్రీకృష్ణభగవానుని ఆజ్ఞప్రకారం గోలోకమునుంచి అవతరించిన గోలోకవాసులతో నిండియుండెను. మధురాపురి తరువాత ద్వారకాపురివాసులైన యదువంశ క్షత్రియసమూహమునకు బృందావనవాసులైన గోలోక వాసులకున్ను యెట్టిసంబంధమున్ను లేదు. ద్వారకాపురివాసులు బ్రహ్మాండాంతర్గతమైన దేవలోకమునుండి అవతరించినవారు బృందారణ్యవాసులు బ్రహ్మాండబహిర్దేశమందున్న గోలోకవాసులు బృందారణ్యమందు విహరించినకృష్ణుడు గోలోకద్విభుజకృష్ణుడు,

బ్రహ్మదేవుడు వక్కాణించిన శుద్ధవర బ్రహ్మస్వరూపము బృందారణ్యలీలలు యావత్తు గోలోకకృష్ణపరబ్రహ్మము గోలోకవాసులైన గోపగోపికలతో ఆచరించిన లీలలు మధురాపురిలోను ద్వారకాపట్టణములో వ్యవహరించిన కృష్ణుడు వైకుంఠవాసియైన చతుర్భుజ కృష్ణుడు, క్షీరసాగరశాయియైన శ్వేతద్వీప కృష్ణుడు, బదరికాశ్రమమందు నివసించియుండు బదరికాశ్రమకృష్ణుడు.

5. ఈప్రకారముగా 1. గోలోకవాసియైన ద్విభుజకృష్ణుని 2. వైకుంఠవాసియైన చతుర్భుజకృష్ణుని 3. శ్వేతద్వీపనివాసియైన శ్వేతద్వీపకృష్ణుని 4. బదరికాశ్రమ నివాసియైన బదరికాశ్రమకృష్ణుని, యీనలుగురి యంశములతో నవతరించిన శ్రీకృష్ణావతారము.

6. వైకుంఠము బ్రహ్మాండ బహిఃప్రదేశమందు బ్రహ్మాండమునకు ఊర్ధ్వముగా ఒకకోటి యోజనముల దూరమునున్నది. చతుర్భుజములుగల లక్ష్మీనారాయణులు అధిష్ఠించియున్నారు. అట్టివైకుంఠమునకు ఊర్ధ్వముగా 50 కోట్ల యోజనముల దూరములో గోలోకమున్నది. ద్విభుజములు ధరించిన శ్రీకృష్ణపరబ్రహ్మస్వరూపం.

గోలోక శ్రీకృష్ణ పరబ్రహ్మం ద్విభుజ స్వరూపం

| 50 కోట్ల యోజనములు

వైకుంఠం శ్రీమన్నారాయణమూర్తి చతుర్భుజ స్వరూపము

| కోటి యోజనములు

బ్రహ్మాండము

శ్వేతద్వీపకృష్ణుడు

చతుర్భుజుడు

|

నరనారాయణ ఋషులు

బదరికాశ్రమకృష్ణుడు

1. 1-11 సం॥ బృందారణ్యలీలలు
2. 12 - 35 సం॥ వఱకు మధురాపుర కృష్ణలీలలు
3. 36 - 90 సం॥ వఱకు ద్వారకా కృష్ణలీలలు
4. 91 - 125 - 7-8 వఱకు యుద్ధానంతరలీలలు

శ్రీకృష్ణావతారము పూర్తి అయినతోడనే ద్వాపరయుగము 8 లక్షలవేల సం॥ పూర్తి అయినది. కలియుగ ప్రారంభము అయినది.

అభినవ కాళిదాసు రచించిన, సంస్కృత చంపూ భాగవతము

సత్యవోలు సోమసుందర కవిగారు

కొత్తమిల్లివారి ఆంధ్రీకరణమునుండి

## రాధామాధవ వివాహాది కధావర్ణనము

గీ. వత్సములదాచు నపరాధ భరముదొలగ
రాధయను రమణీమణి రహినొనర్చి
బాలికను బడయగగోరి పరగు సింహ
ళాధిపతికిచ్చె వరముగా నజుడు మెచ్చి

వ. తరువాత నట్టి సింహళాఖ్యద్వీపాధిపతియగు విజయపరియనునతండు యౌవనంబుగలిగి వెలయుచున్న తన తనయ కనురూపనుండతనికి స్వప్నదశయం దీరీతిగా నుపదేశించెను.

గీ. రాధికను మురవైరికారాధికగను
జేసినాదగు నిర్మాణ కౌశలంబు
సఫలమగునట్టిదానిగా సలిపి పిదప
ధన్యుడవుగమ్ము నృపచంద్ర! ధారుణీంద్ర!

వ. అటుతరువాత నట్టి విజయనిర్మయును నదియే సర్వనందలకు నిదానంబైన దానిగా దలంచుచున్నవాడై దమోదరుం బిలమహోత్సవంబు గావించి యారాధ నతని కర్పించెను.

# భక్తిస్వరూపము, విధములు

## శ్రీ కేశవతీర్థస్వామివారు

సత్యశివసుందర మైనపరమాత్మను పొందుటకు కర్మ, జ్ఞాన, భక్తియోగములనెడి ముఖ్యమార్గములు మూడు కలవు. అన్నిటను భక్తి ప్రథమము, శ్రేష్ఠము, సులభము (శాండిల్య సూ. 22, నారద సూ 25), అతి సహజ మైనది.

భక్తి పదనిర్వచనము 'భజ్' ధాతువు 'క్తి' ప్రత్యయముతో గూడగా 'భక్తి' వెలువడినది. సేవచేయుట, భజించుట, అర్చించుట, ప్రేమించుట - ఇత్యాదులు దీని అర్థము శాస్త్రజ్ఞులు భక్తి అనగా కేవలము ఈశ్వరోపాసన, లేదా ఈశ్వరుని ప్రేమించుట - అని పలికినారు. ప్రాచీనభక్తిసూత్రకారులగు నారదాచార్యులు - 'భగవంతుని యందలి పరమప్రేమయే భక్తి'' (నారద సూ 2) అనియు, శాండిల్య మహర్షి - "ఈశ్వరునియందలి నిరతిశయమైన అనురక్తియే భక్తి" (శాండిల్య సూ. 2) అనియు నిర్వచించినారు. శాండిల్య సూత్రవ్యాఖ్యాతయగు స్వప్నేశ్వరుడు ''పరమేశ్వరస్వభావవైభవముల గ్రహించినపిమ్మట జనించురక్తియే భక్తి" అని వ్యాఖ్యానించినాడు. ''స్వప్నేశ్వరభాష్యము'' - శాండిల్య సూత్రం, 1.1.2) "భగవంతునియెడ నిర్హేతుకము, నిష్కామము, నిరంతరము నైనపరిశుద్ధప్రేమయే భక్తి" యని భాగవతప్రవచనము (భాగ. 3-29 - 11,12) ''అవివేకులకు ఇంద్రియార్థములందు ఎట్టిప్రీతి కలదో అట్టి ప్రీతిని భగవంతునియందుంచుకొనుట భక్తియగు'' నని ప్రహ్లాదుని ఉపదేశము (విష్ణుపురాణము) "స్వస్వరూపానుసంధానము - లేదా ఆత్మనిష్ఠయే భక్తి'' అని శ్రీశంకరులు వచించినారు. (వివేక చూడామణి - గీతాభాష్యము 18-54) "నిరవధికానంతానవద్యకల్యాణగుణ సంపన్ను డనుజ్ఞానముతో తనయందుగాని, తన వారియందుగాని, తుదకు సమస్తవస్తువులందుగాని తన కుండు ప్రీతికంటె ఎన్నోరెట్లు అధికమగు ప్రీతితో వేలకొలది అంతరాయములు వచ్చినను పట్టు వదలక, నిరంతరము భగవంతునియెడ తన ప్రేమను ప్రవహింపజేయుటయే భక్తి'' - అని శ్రీమద్రామానుజులును, "ఏస్నేహము జ్ఞానపూర్వకము, నిత్యము, అనన్యము అగునో అట్టిస్నేహము భక్తియగు'' నని శ్రీమధ్వాచార్యులును తెలిపినారు. భగవద్దర్శనము పరభక్తి అనియు, ఐక్యము పరజ్ఞానమనియు, భగవద్వియోగభయము పరమభక్తిఅనియు శ్రీయామునా చార్యులవారు ప్రవచించినారు. ''ఆర్ద్రీభూత మగుహృదయమందు బింబితమై, నిశ్చలముగ నిలిచినభగవద్రూపమువంక భావమును నిరంతరము ప్రవహింపజేయుటయే భక్తి'' - అని శ్రీ మధుసూదనసరస్వతులును, ''జ్ఞానకర్మ రూపావరణములను దుల్చివైచి, అనన్యకాంక్షా రూపముగా భగవదనుభూతిని పొందుట భక్తి'' అని శ్రీరూప గోస్వాములును పలికినారు. 'ప్రేమద్వారా, లేదా ప్రపత్తి (శరణాగతి) ద్వారా భగవదైక్యము నొందుటే భక్తియోగ' మని శ్రీరామకృష్ణ పరమహంస సందేశము "భక్తి (ప్రేమ) అనగా ఒకవర్ణ నాతీత మైనసమత్వబుద్ధి, ఉజ్జ్వలమాధుర్యము, దివ్యపారవశ్యసంజనితమైన ఉదాసీనత భక్తి అనగా సమస్తమున వాసుదేవుని సందర్శించుట. భక్తి అనగా సమస్తము సుందరమే, ఆసౌందర్యమయ బ్రహ్మము నేనే, నాస్వస్వరూపమే అన్న అనుభూతిని పొందుట - తత్త్వ మసి - ఆ పరమాత్మవు నీవే అని గ్రహించుట. ప్రేమ అనగా రమావ్యలోకనము, సర్వత్ర బ్రహ్మావలోకనము'' అని శ్రీరామతీర్థభాష్యము.

**భక్తివిధములు :** మానవునిమనః ప్రవృత్తులను, ఇంద్రియ వికారములను, భావధారలను, పరమగమ్యమైన ఈశ్వరునకు అభిముఖములొనర్చి, ఉద్దీపింపజేసి, దివ్యీకరించి, పరమాత్మైక్యసుఖమును, నిత్యానందమును అతిసహజవిధానమున సిద్ధింపజేయుటయే భక్తియోగ విశిష్టత. సాధనదశలోని ఈశ్వర ప్రేమకు అపరాభక్తి అని పేరు. సిద్ధావస్థయందలి ఈశ్వర ప్రేమకు పరాభక్తి అని పేరు. బ్రహ్మైక్య రసానుభూతిరూపమైన పరాభక్తిని వివిధమానవ సహజభావములద్వారా సాధించువిధానములను మహాత్ములు చూపియున్నారు. ఈ భక్తి ముఖ్యముగా శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములనెడి పంచ విధసాధనలద్వారా అనుభూతమై, ఏతత్పంచవిధరూపములతో నభివ్యక్త మగుచున్నది.

**శాంతభక్తి :** ఇది పరాభక్తి . ఇది పరాభక్తియొక్క ప్రప్రథమస్వరూపము. బ్రహ్మైక్య జ్ఞానరసానుభవరూప మైన స్వాస్థ్యస్థితియే శాంతభక్తి. కేవలాత్మనిష్ఠయే, అంతర్ముఖతయే శాంత భక్తి. కేవలనివృత్తిపరాయణుడై, విషయని స్పృహుడై, భగవంతుని ఆత్మగా గ్రహించి, సర్వదా అభిన్నుడై, సమదర్శనుడై, అనన్యభావమున ప్రేమించుచు, అద్వైతానందనిమగ్ను డైన బ్రహ్మజ్ఞాని శాంతభక్తుడు. సనక సనందన, సనత్కుమార, సనాతనులు, భాగవతమున పేర్కొనబడిన నవయోగీంద్రులు, శ్రీశంకరాచార్యులు, నివృత్తిదేవుడు, కబీర్, త్రైలింగస్వామి, శ్రీరామతీర్థస్వామి మొదలైన మహాత్ముల నందఱిని ఈశాంత భక్తికి ఆదర్శమూర్తులుగా మనము గ్రహింపవచ్చును.

**దాస్యభక్తి :** భక్తుడు తాను భగవత్సేవకుడనని సంభావించుటయే దాస్యభక్తి. శ్రద్ధాయుక్తుడైన సేవకునకు తన ప్రభువునందుండు అనురాగము దాస్యభక్తునకు ఆదర్శము. ధ్రువ, ప్రహ్లా, దాంబరీష, హనుమదాదులు, భరతలక్ష్మణశత్రుఘ్నులు, కులశేఖర రామానుజ మధ్వాచార్యాదులు, తులసీదాను, జ్ఞానదేవుడు, నామదేవుడు, తుకారాం, సమర్థరామదాస స్వామి, దక్షిణదేశపు ఆళ్వారులు, నందనారుమొదలైన ద్రావిడ దేశపుశైవ భక్తులగు నాయనారులు, త్యాగరాజు, పోతన, శ్రీవివేకానందస్వామి, మహాత్మాగాంధి మొదలైన మహాపురుషులందఱును ఆదర్శదాస్య భక్తులు

**సఖ్యభక్తి :** పరమేశ్వరుని తన ప్రాణమిత్రునిగా ఆరాధించు ఉపాసనమే సఖ్యభక్తి, సుదామ, భీష్మార్జునోద్ధవాదులు, నందగోకులా వాసులగు గోపబాలురు, సుగ్రీవుడు, నరసింహ మెహతా, సూరదాసు మొదలైన దివ్య పురుషులు సఖ్యభక్తికి ఆదర్శప్రాయులు.

**వాత్సల్యభక్తి** భగవంతుని పుత్రభావముతో ప్రేమించుటయే వాత్సల్యభక్తి. నందయశోదాదులు, వల్లభాచార్యుడు, అఘోరమణీదేవి మొదలైనవారు ఆదర్శవాత్సల్య భక్తులు.

**మధుర భక్తి :** భగవంతుని తనప్రాణనాథునిగా నెంచు మహాభావమే మధురభక్తి. శ్రీరాధాదేవి, గోపికలు, జయదేవ చండీదాస చైతన్యాదులు, మీరాబాయి, గోదాదేవి మొదలైనవారందఱును ఈ ఉజ్జ్వలమధుర భక్తికి ఆదర్శమూర్తులు.

ఆధునిక భాగవతోత్తముడైన శ్రీరామ కృష్ణపరమహంస దేవునియందు ఈ పంచవిధ భక్తిభావము లన్నియు ప్రకటీకృతములైనవి. ప్రతిసిద్ధభక్తుని యందును సర్వభావములును గర్భితములుగనుండి ప్రత్యేక భావమేదో యొకటి ప్రధానముగ ప్రకటిత మగుచుండును.

**("దర్శనములు - మతములు" అను విజ్ఞానసర్వస్వము - 7వ సంపుటము నుండి ఈ వ్యాసము తెలుగు భాషాసమితి (మద్రాసు) వారి సౌజన్యముతో పునర్ముద్రితము. - సంపాదకుడు)**

# సిద్దేశ్వరి పీఠస్థాపకులు
# శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
# జగద్గురు శ్రీ శివచిదానంద సరస్వతీ స్వామివారు.
## (శ్రీశ్రీశ్రీ మౌనానందస్వామి)

రచన : గుం. ఆదినారాయణ



శ్రీ మౌనానందస్వామివారి అసలుపేరు అచ్యుతుని శివయ్య వరఫ్ పిచ్చయ్య, తల్లి సీతమ్మ తండ్రి బాపనయ్యగార్లు వీరి 3వ సంతానమే శ్రీ మౌనానంద సరస్వతీ స్వామివారు. వీరి జన్మస్థలం ప్రస్తుతం ప్రకాశంజిల్లా అద్దంకి తాలూకా పమిడిపాడు మజరా నూనెవారి పాలెం, వీరి పుట్టుక 1868వ సం॥ అని తెలియుచున్నది. వీరు 28-12-1943 తేదిన బ్రహ్మీభూతులైరి. వీరు వివాహితులు భార్యపేరు కామేశ్వరమ్మ చీరాలవారు. వీరికి నాగభూషణం అను కుమారుడు, లక్ష్మినరసమ్మ, సుందరమ్మ అను ఇద్దరు ఆడసంతానం కలరు. వీరు పందిళ్లపల్లె గ్రామంలో తమ దగ్గర జ్ఞాతికి దత్తుపోయినారు. పందిళ్లపల్లెలోని మాజేటి శ్రీరాములు శ్రేష్టిగారి వర్తక కార్యాలయంలో గుమస్తాగా పనిచేసిరి. ఆకాలమున కుటుంబ పరిస్థితివల్ల ఆర్థికలోపము సంభవించినందున సునాయాసముగా సంపాదనకు పూనుకొని స్వర్ణయోగము సాధింప నిశ్చయించుకొని యింటిలో ఎవరికి తెలియకుండా సింహాచలమునకు వెళ్లిరి. అచ్చటకు జేరినట్లు సంచారమునకు వెళ్లుతున్నట్లు, ఇకముందు ఉత్తర ప్రత్యుత్తరమునకు అవకాశం లేనట్లు, తనపెద్దలకి లెటరు వ్రాసిరి. ఇట్లు దేశాటనము చేయుచున్న కాలములో స్వర్ణయోగ స్వార్థాభిలాష నశించి, అదృష్టవశాత్తు ఆధ్యాత్మిక చింతన ప్రాప్తించినది. ఈ కాంక్షయే శ్రీరమణమహర్షి గారిని దర్శించి వారితో కలిసి తపస్సు చెయు మాహదవకాశమును కల్పించినది. ఉత్తరదేశ పర్యాటనాక్రమంలో వీరు శ్రీశ్రీశ్రీ అచ్యుతానంద సరస్వతీ స్వామి మరియు శ్రీశ్రీశ్రీ వాసుదేవానంద సరస్వతిస్వామి గార్లను గురువులుగా స్వీకరించి, అనేక యోగ సిద్ధులను, అందుకు సంబంధించిన ముఖ్యమైన విషయములను మర్మములను గ్రహించినవారై అనేక మహిమలను చూపి ఆజన్మాంతము మౌనము పాటించి మౌనానందస్వామిగా ప్రసిద్ధికెక్కి 1905వ సం॥లో తమిళనాడు తిరునల్వేలిజిల్లా కుర్తాళంలో 12 సం॥ లు తపస్సుచేసి అనేక సిద్ధులుపొందినారు. 1916వ సం॥లో కుర్తాళంలో శ్రీ దత్తాత్రేయ మందిరం స్థాపించారు. ఈ కుర్తాళం అగస్త్యాథి మహర్షులచే దర్శింపబడిన మహాక్షేత్రం. 1942లో తాము సేకరించిన గ్రంథాలతో సిద్ధేశ్వరీ గ్రంథాలయం నెలకొల్పిరి. వారు నిర్యాణం నాటికి, తెలుగు, తమిళం, హిందీ, ఇంగ్లీషు భాషలుకు చెందిన 4,343 గ్రంథములు సేకరించబడినవి గ్రంథాలయం ఏర్పడినది. వీరుకాశీలోను తమిళరాష్ట్రంలో అనేక విగ్రహప్రతిష్టలు కుంభాభిషేకములు దేవాలయజీర్ణోద్ధరణలు జరిపించిరి.

ఆంధ్రదేశంలో విశాఖజిల్లా నామవరంలోను చీరాలలో పాన్‌గల్ హౌసులోను గణపతి విగ్రహములను నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలో బాణలింగం, పందిళ్లపల్లెలో శివప్రతిష్ట వాడరేవులో శ్రీ కోదండరామ ప్రతిష్ట గుంటూరుజిల్లా బెల్లంవారి పాలెంలో హనుమాన్ ప్రతిష్ట శ్రీవారి చేతులు మీదుగా నిర్వహింపబడినవి. సిద్దేశ్వరీ పీఠమునకు సారవంతమైన 25 ఎకరముల భూమి శ్రీవారి భక్తులచే సమర్పించబడినది కూడా అచట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిసహాయముచే సుమారు 50 గదులుగల వసతిగృహం ఏర్పాటు చేయబడినది అచట ఆశ్రమమునందు ప్రతి ఆషాడశుద్ధ పూర్ణిమకు వ్యాసపూజయు, ఆశ్వీయుజశుద్ధ పాడ్యమి మొదలు నవరాత్రిదీక్షలో దేవి పూజ జరుగుచున్నది. ఈ సిద్దేశ్వరి పీఠం పరిపాలనకు సంబంధించి ట్రస్టీలను ఏర్పరస్తూ శ్రీవారు ఒక వీలునామా కూడా వ్రాసివున్నారు. శ్రీవారికి అకాలమున ప్రత్యక్ష శిష్యులుగా నున్న ఒంగోలు వాస్తవ్యులు ప్రముఖ న్యాయవాదులు కీర్తిశేషులు, మంచళ్ల వెంకటపున్నయ్య పంతులుగారి ద్వారా శ్రీవారి శక్తి సామర్థ్యములు గురించి అద్భుత విషయములు గురించి యోగ సిద్ధిని గురించి నేను వినియుంటిని. అంతియేకాక శ్రీవారికి తమిళనాడు నందును ఆంధ్రదేశమునందును పెక్కుమంది శిష్యులు కలరు. మరియు ఒంగోలు తాలూకా ధేనువకొండ గ్రామ వాస్తవ్యులు సంగీత సాహిత్య పండితులు, కవి అయిన ధేనువకొండ వెంకయ్యగారికి ఆశ్రమ స్వీకార మొసంగి శ్రీరామతారక బ్రహ్మానంద అవధూతేంద్ర సరస్వతీస్వామి గానామకరణము చేసిరి. వీరును అనంతపురంజిల్లా తాడిపత్రి గ్రామంలో 1931 సం॥లో ఒక ధ్యానమందిరం, ఆశ్రమము మొదలగు కట్టడములు నిర్మించిరి. వీరి జ్ఞాతులు ఆహ్వానించగా 1930 40 సం॥ మధ్య ధేనువకొండలో శ్రీరామతారక బ్రహ్మానంద అవధూతేంద్ర సరస్వతీ స్వామివారిని దర్శించి ధన్యుడనైతిని.

గుంటూరుజిల్లా చేబ్రోలు సమీపమునగల రెడ్డిపాలెం ఆనందాశ్రమం స్థాపకులగు శ్రీ లక్ష్మీకాంతానందయోగి గారికి చీరాలలో జరిగిన వ్యాసపూజ సందర్భమున శ్రీవారు కరుణించి శ్రీచక్ర ప్రదానముగావించిరి ఇప్పటికిని ఆనందాశ్రమంలో శ్రీచక్రమును దర్శించవచ్చును.

ప్రస్తుత సిద్ధేశ్వరీ, నాల్గవ పీఠాధిపతులు శ్రీ శివచిదానంద భారతీస్వామివారు అత్యంత శ్రద్ధతో పీఠాభివృద్ధి కొఱకై అనేక దేవాలయములు, వసతి గృహములు నిర్మించి, శ్రీ సిద్ధేశ్వరి పీఠమును గొప్పయాత్రా స్థలముగా ఏర్పాటు చేయుచున్నందులకు ఆంధ్రులమైన మనమెంతయో గర్వించవలసి యున్నది.

# బ్రహ్మీభూత శ్రీస్వామి శివశంకరులవారు

**(తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు)**

(రచన : రామచంద్రుని వెంకటప్పగారు, స్వాతంత్ర్య సమరయోధుడు, టంగుటూరు, ప్రకాశంజిల్లా)



నవకవికుల శేఖరులగు బ్రహ్మశ్రీ తల్లావఝుల శివశంకర శాస్త్రిగారు, భక్తిరస ఏకైక ప్రధానమైన శ్రీకృష్ణలీలా తరంగిణీ రచించిన నారాయణ తీర్థులవారి వంశమునకు చెందినవారు. తన కుమారులగు కృత్తివాస తీర్థులుగారు ఒంగోలు నగరమందలి సియన్ఆర్ శర్మా కాలేజ్ ప్రారంభమునుండి

అధ్యాపకులుగావున్నారు. ఆకారణమున శ్రీశాస్త్రిగారు ఒంగోలుకు తరచుగా రావటం అవసరమైనది. దురదృష్టవశాత్తు కృత్తివాస తీర్థులుగారు యువదశలోనే అకాల మరణం చెందినారు కానీ వారి కుటుంబము ఒంగోలులోనే వుండుటవలన శాస్త్రిగారి స్థిరనివాసం కూడా ఒంగోలు అయినది. శ్రీ శివశంకర స్వామివారి నివాసయోగ్యత పొందిన ఒంగోలుకు పూర్వముకన్నా మిన్నగా సరస్వతీ ప్రసన్నత సిద్ధించినది. ఒంగోలు తాలూకా మరియు పరిసర ప్రదేశములందు శ్రీకృష్ణలీలా తరంగ భజన కాలక్షేపములకు ప్రసిద్ధినొందిన కారణమున శ్రీశాస్త్రిగారు వంశరీత్యా ఈ ప్రాంతముతో సంబంధం కలిగియున్నారు. నిరంతరము బహుముఖ కవితా వ్యాసంగములతోను, బహుభాషా సాహిత్య వ్యాసంగముతోను నోలలాడించుచున్న శ్రీశాస్త్రిగారు భారతదేశ స్వాతంత్ర్య సమరంలోను ప్రత్యక్షంగా పాల్గొని కారాగారవాస క్లేశములను అనుభవించిన స్వాతంత్ర్య సమరవీరుడుగా ఖ్యాతినొందిరి. ఒంగోలు పౌరులు పలు సమావేశములలో వారి వాగమృతమును గ్రోలి తృప్తిని రసానందమును పొందిన అదృష్టవంతులు. ఓపికలేకపోయినను తమ్ము చూడవచ్చినవారికి అధికారమునకు తగినట్లుగా తనకు తెలిసిన అమూల్యమైన పలుకరములైన విశేషములెన్నిటినో వారి హృదయములందు నిక్షేపించవలెననెడివారి ఉత్సుకత, ఓపిక, ఆతురుత అసామాన్యమైన గుణ విశేషమని చెప్పవలసి యున్నది. వారి మనుమలు, విద్యాపతి శ్రీపతంజలి మొదలుగువారు, వంశగౌరవమును పెంపొందించగల విద్యాధికులై కీర్తి ప్రతిష్ఠ సంపాదించి సుఖులైయున్నారు. శ్రీ శివశంకరస్వామి వారు ఒంగోలులోనే బ్రహ్మీభూతులైరి.

# బ్రహ్మీభూత ధేనువకొండ వెంకయ్యగారు

## *శ్రీరామతారక బ్రహ్మనంద అవధూతేంద్ర సరస్వతి స్వామి*

(ధేనువకొండ కంచివరదం, ఒంగోలు)

సిద్ధేశ్వర పీఠస్థాపకులు వెంకయ్యగారి గురువుగారు కుర్తాళం శివచిదానంద సరస్వతిస్వామి (మౌనస్వామి) (కుర్తాళం) వారు. వివాహితులు సంతానంలేదు. సంగీత, సాహిత్య కవిత్వములలో మంచి పండితులు. వీరి తండ్రి పిచ్చయ్యగారు కూడా కవులు, పండితులు. వెంకయ్యగారు వామన చరిత్ర గయోపాఖ్యానము, ప్రహ్లాద, సుందరాకాండ, ఉత్తరగోగ్రహణము జంగం కథలుగా వ్రాసిరి. ఉత్తరగోగ్రహణము అను యక్షగానం వారి శిష్యులు దొడ్డవరపు వెంకటస్వామిగారు దేశము నలుమూలల ప్రచారం చేసిరి. కొన్ని గ్రంథములను దేనువకొండ వేణుగోపాలస్వామికి అంకింతమిచ్చిరి. వారి కవిత్వమునకు వారి తమ్ముడు చిన్నయ్యగారు స్వరపరచెడివారు. 1929లో పీఠాధిపత్యం తీసుకొనవలసినదిగా మౌనస్వామివారు ఆదేశించిరి. కానీ ఆ అధిపత్యము వహించలేక 1930లో అనంతపురంజిల్లా, తాడిపత్రికి వచ్చిరి. 1931లో అచ్చట ఒక భక్తురాలు కొంత భూమినిచ్చి ఆశ్రమనివాసం ఏర్పాటు చేయవలసినదిగా కోరినది. అందులో ఒక ధ్యానమందిరం, 2 అతిథిగృహాలు నిర్మించినారు. 1932లో ధేనువకొండ రామకోటి వుత్సవాల సందర్భంలో ధేనువకొండకు వచ్చిరి. అచ్చట 4 రోజులు వుండి మరల తాడిపత్రివెళ్లి 1937లో అచటనే సిద్ధిపొందిరి.

ధేనువకొండ పిచ్చయ్యగారి కుమారులు వెంకటసుబ్బయ్య (2) కాంచివరదం (3) చిన్నయ్య (4) వెంకయ్య (5) వెంగయ్య 5 గురుసోదరులు.

# అవధూతేంద్ర సరస్వతీస్వామివారు

కరవది వాస్తవ్యులు శ్రీ పిసుపాటి శ్రీనివాస శాస్త్రి గారికి ముగ్గురు కుమారులు

1. మృత్యుంజయ అవధానిగారు
2. వెంకటేశ్వర అవధానిగారు
3 వీరరాఘవస్వామి

పెద్దవారు మృత్యుంజయ అవధానిగారు క్రమాంతం వేదవిద్య నభ్యసించి, ఆంధ్ర, కర్ణాటక, కేరళ, ఢిల్లీ రాజదానిలోను వేదపండితులుగా ప్రసిద్ధిచెంది కీర్తిశేషులైరి

వెంకటేశ్వర అవధానిగారు మంచిసామర్థ్యంగల వేదపండితులు. వేద పండితులేగాక వేదార్థములుకూడా చెప్పగల సమర్థులు. వీరు చిన్నతనమునందే బ్రహ్మచారిగ సన్యాస ఆశ్రమమును స్వీకరించిరి. వారి ఆశ్రమ స్వీకార నామధేయము 'అవధూతేంద్ర సరస్వతీ స్వామి' వారు. వీరు కొంతకాలం ఒంగోలు కొత్తపట్నం, విజయవాడ గ్రామాదులలో సంచరిస్తూ చివరకు 60 సం॥ వయసులో విజయవాడలో శ్రీ దుర్గాదేవి ఆలయసమీపమున బ్రహ్మీభూతులైరి.

# శ్రీ ప॥ ప॥ శ్రీ జ్ఞానానందతీర్థస్వామివారు

**రచన : గుండ్లపల్లి ఆదినారాయణ**

ఒంగోలు తాలూకా అమ్మనబ్రోలు వాస్తవ్యులు. అసలుపేరు కప్పగంతు అయ్యంభొట్లావధానులు వీరు స్వాధ్యాయవేత్తలును, స్వదర్మానుష్ఠాన నిరతులును, నిరంతర భగవద్భక్తి తరంగి తాంతరంగులును, అయిన నిష్ఠాగరిష్ఠులు. వీరు శ్రీసూత సంహితాంతర్గత సద్యోముక్తికర వ్రతమును అనుష్ఠించుచూ శ్రీకాళహస్తీశ్వర నగరమున నివసించుచూ సన్యాసాశ్రమమును స్వీకరించిరి. సద్యోముక్తికర వ్రతము శాశ్వతముగా జరుగుటకై అమ్మనబ్రోలులోని షుమారు 15 ఎకరముల భూమిని శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వర స్వామివారికి దానపత్రముద్వారా చెందజేసిరి. వారు శ్రీకాళహస్తి నగరముననే బ్రహ్మీభూతులైరి. ఈనాటికిని అచ్చట సద్యోముక్తి కరవ్రతమును దేవాలయాధికారులు శాశ్వతముగా సాగించుచున్నారు.

## బ్రహ్మశ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారు

# పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ మౌనానంద తీర్థస్వామివారు

**రచన : శ్రీ మతంపల్లి కోటయ్యశాస్త్రి - ఒంగోలు.**

వీరి సార్థక నామధేయం పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారు. వీరి స్వగ్రామము ప్రకాశంజిల్లా సంతనూతలపాడు మండలం, బోడపాళెం అగ్రహారం, వీరి తల్లిదండ్రులు, బ్రాహ్మణ నిడమనూరు వాస్తవ్యులు శ్రీ గొల్లపూడి సుబ్బరామయ్య శాస్త్రిగారు, వీరి మేనమామ. వారివద్ద వేదాంతం మీమాంస, ధర్మశాస్త్రము అభ్యసించారు. వ్యాకరణం. తర్కశాస్త్రం, కాశీలో చదువుకున్నారు. కంచికామకోటి పీఠాధిపతి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిస్వామివారు, వీరు కంచిలో భాష్యం అభ్యసించారు. ధర్మశాస్త్రవేత్తగా ప్రసిద్ధిచెందిరి. ఒంగోలులో 1990 సం॥న బ్రహ్మీభూతులైరి.

# హరిదాసు అద్దంకి వెంకట్రాయుడు గారు

(1837 - 1911)

సేకరణ : గుం. ఆదినారాయణ



ఇహపర సాధకులు, నిరాడంబరులు, సాధువులు, విద్యాదాత, భక్తాగ్రేసరులగు కీర్తిశేషులు హరిదాసు వెంకట్రాయుడుగారి వద్ద మా జనక తండ్రి సుబ్బయ్యగారు గుళ్ల పల్లిలోనూ, మా దత్తు తండ్రి వెంకట రంగయ్యగారు, నందిపాడులోనూ, విద్యనభ్యసించిరి. మా జనక తండ్రి ద్వారా వీరి గుణ విశేషములను, శీలసంపత్తిని, శిష్య వాత్సల్యమును పలుమారులు విన్నాను. వారి జ్యేష్ఠ కుమారుడు రామకృష్ణదాసు, ఆయన కుమారుడు విజయరాఘవరావుతో కూడా నాకు పరిచయ భాగ్యం కలిగినది. శ్రీ వెంకట్రాయుడు గారి కుటుంబమునకు, మా కుటుంబమునకు పైవిధముగా సంబంధము ఏర్పడుట ఆనందదాయకము.

హరిదాసు వెంకట్రాయుడు గారు అద్దంకిలో జన్మించిరి. వారి జీవిత చరిత్రను నేను సంకలనం చేయడం కంటే వారిని స్వయముగా దర్శించిన భక్తాగ్రేసరులు శ్రీ పంగులూరి వీర రాఘవుడు గారు రచించిన శ్రీ మదాంధ్ర మహాభక్త విజయం నుండి తీసుకోవడమే ఉత్తమమని భావిస్తున్నాను. అదే విధంగా అవధాన శిరోమణి మహోపాధ్యాయ శ్రీ కాశీకృష్ణాచార్యులగారు, తేది 5-12-1940న వ్రాసిన వ్యాసం కూడా చదువరులకు శ్రీ వెంకట్రాయుడు గారిని గూర్చి సరియైన అవగాహన కలుగచేస్తుంది. కనుక ఈ వ్యాసంలో శ్రీ మదాంధ్ర మహాభక్త విజయం నుండి కొంతభాగాన్ని, కాశీకృష్ణాచార్యుల గారి వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము.

**శ్రీమదాంధ్ర మహాభక్త విజయం నుండి**

తండ్రి త్యాగరాజుగారు, తల్లి కోటమాంబ. జననము కీ.శ. 1900 హేవళింబి ఆర్వేలనియోగి. ప్రధమ భార్య మహాలక్ష్మమ్మ, రెండవ భార్య పేరు తెలియదు. ఈ భక్తాగ్రణిదర్శన భాగ్యము వీరి జీవితములో మూడుమార్లు లభ్యపడింది. అయ్యావి ఎనిమిదవ వర్షప్రాయమున పంగులూరులో జరిగిన రాసక్రీడలోనూ, రెండవమారు పదునైదవ యేట గుండ్లాపల్లిలోనూ మూడవమారు బాపట్ల భావనారాయణస్వామివారి కోవెలలో జరిగిన రాసక్రీడలోను, వీరు ప్రతిదినము మూడు పూటలు భజనానందములో మునుగు చుండువారు.

1. నిష్కామదీక్ష, 2. వినయ వినమితసంపత్తి 3. నిరుపమాన శాంతి 4. ఆధ్యాత్మికానుభూతి 5. అహింస 6. సాత్విక భక్తి 7. నమత్వము 8. బ్రహ్మావలోకన స్థితి మొదలగు సుగుణములు - వీరి యమూల్యాభరణములు. ప్రభాతపవలింపు సేవలు. ద్వాదశి పునర్వసు దీక్షలు శ్రీరామకృష్ణోత్సవములు వీరి నిత్యవ్రతములు. అభ్యాగతాతిథిసేవలు సదానుష్ఠేయములు.

తండ్రి యనంతరము కుటుంబ భారవాహియై కలవకూరులో వల్లెకూటాధిపతియై నీలంరాజుజానకీరామ భాగవతారుగారి వలన భాగవత శ్రవణమును గుళ్లాపల్లి వీధిబడిలో నున్నపుడు మల్లవరపు వెంకటేశ్వరస్వామివారి సమక్షమున గాయత్రీ మంత్రోపాసనాసిద్ధియు, పమిడిపాటి వీధిబడిలో నుండుతరి ఓనమామల జియ్యంగారి వలని నష్టాక్షరీ మంత్రోపదేశమును, నందిపాటి పారశాల కాలమున దక్షిణయాత్రల గావించు సందర్భమున లభించిన యవకాశమును ననుసరించి కంచిలో నాలూరి వెంకటాద్రి స్వామివారి వలన శ్రీరామ తారకోపదేశమును, శ్రీ రంగపురి శ్రీ రంగనాధసన్నిధి యందష్టాక్షరి మహామంత్రోపాసనాసిద్ధియు దద్వారా రంగనాధ సాక్షాత్కారమును అంత శ్రీరంగాజ్ఞననుసరించి దిరుగుపయనమున గంచిగల శ్రీ వెంకటద్రిస్వామివారి సెలవంది పునః నందిపాడు గ్రామ ప్రవేశమును జరిగినవి. ఈ యాత్రలో శ్రీ లక్ష్మీనారాయణ షట్చక్రసీతారామ గోపాలసాలగ్రామముల శ్రీవారి కనుగ్రహించిన వెంకటాద్రిస్వామివారు శిష్యవాత్సల్య మూర్తులు. తన ముప్పదవయేట భద్రగిరీశుడగు సీతారామసన్నిధి రామతారకసిద్ధి గడించి భగవత్సాక్షాత్కార మహాభాగ్య మార్జించిన పుణ్యజీవి. వీరికి ధనధాన్య లక్ష్మిదాసి యైనదని చెప్పుటకు వెనుకాడవలసిన యవసరముండదు.

అనన్యాశ్చింతయంతో మామ్ యేజనాః పర్యుపాసతే. తేషాం నిత్యాభియుక్తానామ్ యోగక్షేమం వహామ్యహమ్.

అను భగవద్వాక్యము కార్యారూపము దాల్చినది. రాసక్రీడ వీరి జన్మహక్కు. జీవితములో దాదా పేబది రాసక్రీడల గరుడ సాక్షాత్కారముతో బూర్తిచేసిన భక్తాగ్రణి. వీరి రాసక్రీడా మహోత్సవముల దిలకించిన వారికి శ్రీవారి గోపికాభక్తి వెల్లడికాక మానదు. ఈభక్తి బాపట్లలో జరిగిన క్రీడామహోత్సవములో గురుతింపగలముకూడ.

బృందావనమున నిరంతరము జరుగుచుండు దివ్యరాసక్రీడయే, దాసుగారి దాసక్రీడ. శ్రీవారు పుత్రులవిద్య కొరకు బాపట్ల నుండుట సంభవించినపుడు సర్వధారివత్సర కార్తీకమందొక పుణ్యదివసమున దన్మహోత్సవము జరుపబడినది. ఇప్పటి దాసుగారి వయస్సు 73వ యేడు. నంజువ్యాధిచే శరీరమంతయు బరువెక్కినది. బలమావంతయూ లేదు. మంచముపై నుండి లేచి గూరుచుండు శక్తిగూడ నన్నయైనది. భోజనమజనాదులకై లేచుటకు మరియొకరి సాయమవసరమై యున్నది. ఈ సమయములో నద్దంకి నుండి, దాసుగారిని జూచుట కనుయాయులగు తాటిగడప శేషయ్య వచ్చి రెండు దినములుండుట తటస్థించినది. రెండవరోజు సంభాషణలో దాసుగారార్తితో "మిత్రమా? మీ సహాయముతో నిప్పటికి షుమారు నలుబదేబది రాసక్రీడలు జరిగినవి. ఇప్పుడు జీవితము ముగిసినది. తుది రాసక్రీడ జరిపి ధన్యుడగు భాగ్యము గలిగించి నా ముచ్చట దీర్పుము. లేవలేనిస్థితిలోనున్నానని శంకింపవలదు. నీ సహాయముండిన దప్పక భగవదనుగ్రహము రాగలదు. ఇంతవరకు నీరాకకై ప్రాణములు చిక్కబట్టుకొని యున్నాడ నీవు స్నేహితుడవు. భక్తుడవు కూడ పట్టుబట్టుము తప్పక జరిగి తీరును. "యద్భావం తద్భవతి" యను ఆర్యోక్తి రిత్తవోవు నా? అట్లెప్పటికిని జరుగదు. రాగల శుద్ధ దశమికి చదలవాడ కేశవులను పిలిపింపుము. చిమట రంగయ్యగా రీయూరనే యున్నారు. రెండు మృదంగములతో ప్రారంభింతమని పలకుచూ చివాలున

లేచి కూరుచున్నాడు; దాసుగారు. లేవలేని స్థితి యెటుబోయినదో తెలియదు. కార్డు తెప్పించి, శేషయ్యగారిచే కేశవులు నకుత్తరము వ్రాయించి చేవ్రాలు చేసినాడు మూడవ నాటికాతడు వచ్చినాడు. కార్తీక శుద్ధ దశమి రాత్రి తొమ్మిది గంటలైనది. క్రీడారంగమునకత్యుత్సాహముతో జేరిరి. రాసక్రీడ ప్రారంభమైనది. వినాయక ప్రార్థన జరిగినది. క్రమముగ గోపిక లొకరినొకరు పిలుచుకొని బృందావనము జేరి దేవగాంధర్వ మభినయించుచు శ్రీకృష్ణుని దర్శించి, భక్తిప్రపత్తులతో పూజించినారు. పిదప గోపికల మందలించి మీ మీ యిండ్లకు బోండని ఖండితముగా శాసించినాడు. శ్రీకృష్ణభగవానులు కృష్ణవియోగమునకు సహింపక గోపికలు వివశులైరి. ఇప్పటికి కథ రక్తికట్టలేదు. సభికులొకరొకరు బయలుదేరి నిజగృహ మార్గములు పట్టినారు. తూర్పారలో దాలెగిరిపోయినది. మెరికలు నిలిచినవి. దాదాపు నూరుమందికి తక్కువగాని సభికులు మాత్రముండిరి. ఇంతవరకు శేషయ్యగారిచే కథ నడుపబడినది. రంగస్థలమందు అస్వస్థుడై కూరుచుండియుండిన వెంట్రాయుడు గారి యందొక నూతన శక్తి తేజోరూపమున ప్రవేశించినది. ఈచిత్రము సభికులు కనులారా జూచి యానందించినారు.

వెంటనే దాసుగారితరుల సహాయము లేకుండగనే లేచి నిలువబడి "దాశరథీ" అని పెద్దకేక పెట్టినారు. అధ్వని దిక్కుల ప్రతిధ్వనింపచేసినది. దీనితో సభికుల మానస క్షేత్రములందుగల భక్తిభీజములు మొలకెత్తి శేషయ్యగారు దాసుగారి పదములకు గజ్జకట్టి చిరుతలు చేతికిడినాడు. ఇరువురు మనుష్యులు మంచము నుండి లేవదీసి నెమ్మదిగ పట్టుకొనివచ్చి రంగస్థలమున కూరుచుండబెట్టిన దాసగా రితరుల సహాయము లేకుండగనే లేచి "దాశరథీ" అని కేకబెట్టుటయేకాక రాసలో బాల్గొనినాడు. కమ్మనిపాట ముద్దులొలుకుట ఆటకనుగుణాభినయము చూచి దీరవలయునేగాని, చెప్పిన దీరదు. ఇపుడు దాసుగారి యందు నవయౌవన ముట్టివడుచున్నది. ఆత్మశక్తి ప్రభావ పూరితులకు వార్ధక్యము యౌవ్వనమగుననుటకిదియే తార్కాణము. అర్చామూర్తిచే నారులక్షల వరహాలను కక్కించిన శక్తి వార్ధక్యమును యౌవనముగా మార్చజాలినదనిన చిత్రమేమి?

కథసాగుచున్నయది. గోపికలందరియందు నన్నిరూపములతో దాండవించిన కృష్ణభగవానుని వలె భక్త బృందములో దాసుగారు తాండవించుచున్నారు. రంగస్థలము దివ్య బృందావనము అయినది. సభికులలో నూతన చైతన్య మావిర్భవించినది. ఆనంద భాష్పములతో నృత్యములు జేయువారు కొందరు, ఒకరి నొకరు కౌగలించుకొని కృష్ణస్మరణతో నేడ్చువారు కొందరు. విపరీతమైన నవ్వులతో మైమరచువారు కొందరు కృష్ణలీలల నభియించువారు కొందరు కృష్ణా, కృష్ణా, కృష్ణా అనుచూ వెలుగెత్తి దిక్కులు ప్రతిధ్వనింప కేకలు వేయువారు కొందరు, నృత్యముల మైమరచి భూమిబడి దొర్లువారు కొందరు, జంటలుగా నిలచి, చేతులు గలిపి గంతులు బెట్టువారు కొందరు, వేయేల? మార్దంగికులు, మృదంగముల నడుముల బిగించి లయ నతిక్రమించినారు. వంతపాటకుల మనం భగవన్ముఖములగుట బిచ్చి కేకలతో దప్పుతాళముల తోకుప్పిగంతులిడుచున్నారు. రాగతాళయాదుల లెక్కసేయక జంతవాయిద్యపరులు తమతమ పనిముట్ల నెట్లో వినియోగించుచూ దలలూపుచూ, దేహస్మృతులు దప్పియున్నారు. దాసుగారు సింగపు పిల్లవలె రంగస్థలి నటించుచూ కృష్ణ నామస్మరణములో మునిగి తేలుచున్నాడు. కృష్ణాంతర్హిత గాధ వచ్చినది. విపరీత దుఃఖము దాసుగారు వెల్లడించినారు. సభికులున్నవారున్నట్లు గోలబెట్టియేడ్చుచూ రంగస్థలి

నాటిన చెట్లలో వెదకువారు కొందరు ఆలయ స్తంభముల బరికించుచూ గండ్లనీళ్లు కండ్లగ్రుక్కుకొనువారు కొందరు ఆలయావరణమంతటను తిరిగి తిరిగి కలయవెదకువారు. కొందరు కనివినియెరుగని చింతామగ్నులైనారు. పిదప 'శ్రీకృష్ణ పాదారవిందము చిహ్నములివిగొనే" అని పాడుచూ దాసుగారు భూమిమీదపడి దొర్లుట చూచి సభికులెల్ల రున్నవారున్నటు లానంద పరవశులై పరుగున వచ్చి శ్రీకృష్ణ పాదచిహ్నములపై బడివందన శతములతో మేనులు మరచిరి. సభ కొంత వడి నిశ్శబ్దమైనది. అంత దాసుగారు బహిర్ముఖులైరి. వెంటనే సభికులందరకు స్మృతులు కలిగి ఖిన్న వదనములతో నుండిరి.

అంత దాసుగారు అనుయాయులతో గలసి విజనస్థలి జేరి గోపికాగీతల ప్రారంభించి, సూర్యోదయమునకు ముగించిరి. గరుడ సాక్షాత్కారమైనది. రాస ముగిసినది. దాసుగారి జీవితములో నాఖరు రాసయిది. మంగళహారతితో భక్తులందరు స్వగృహముల చేరినారు. తదుపరి యచిర కాలమునకు గలువకూరుచేరి తన డెబ్బది నాల్గవయేట క్రీ.శ. 1811 విరోధికృతు వత్సరాశ్వీయుజ శుద్ధ ఏకాదశి బుధవారము సాంయత్రమైదు గంటలకు మంచి స్పృహతో శ్రీవారు పరమపదించిరి.

### కాశీకృష్ణాచార్యులగారి ప్రశంశ

శ్రీ ప్రహ్లాదాంశ సంభూతులయి యశశ్శరీరులైన అద్దంకి వేంకటరాయుడు గారిని నేను బాగుగా నెఱుంగుదును. వీరు భారతభూమియం దవతరించి దాదాపు ఒక శతాబ్ది దాటినది. ముప్పదేడుల క్రిందట వీరు పరమపద మధిష్ఠించిరి. నా తరుణ వయస్సులో వీరి మహిమలు బహుళముగ వినియుంటిని వ్యక్తి దర్శన మొనర్చి కన్నులార వీరి మహత్త్వముగాంచు భాగ్యమెపుడు గల్గునా? అని యువ్విళ్ళూరుచుండగా మాగర్తపురిలో శ్రీజగన్నాథము పంతులవారి కోనేటి ప్రాగ్భాగమున నేటేట జరుగు శ్రీ రామోత్సవ సందర్భమున నమ్మహాత్ముని రాసక్రీడా మహోత్సవ వైభవము నొకటి రెండుసారులు గన్నులార గాంచి యంతకుమున్ను నా హృదయమున హత్తుకొనియున్న సంశయమును బాపికొంటిని. వీరు భక్తులయిన కావచ్చుగాని, వీరి భక్తికి మెచ్చి శ్రీకృష్ణపరమాత్మ గరుడ వాహనారూఢుడయి వారికి దర్శనమిచ్చుట మాత్ర మసంభవమని యప్పటి నాయూహ. కాని యొక అమానుష విషయమును విన్నయపుడు దానిని మనము స్వయముగ గమనింపవచ్చుననియు, వినినచో మానవహృదయమున "అట్టి విషయము నెపుడు సూడనగునా?" యను తహతహ పాటెక్కువయనియు, దెలియకపోలేదు.

అట్లే నాకును వీరి మహిమ గనుగొనుటకు దహతహపాటు గలిగి భగవదనుగ్రహమున రెండుమూడు మార్లును వారి రాసక్రీడోత్సవ దర్శనమును, దదవసానమున "కృష్ణా"యని కూయుచు గరుడాళ్వారు తమరాక ననుమిత మొనర్చుటయును, మఱియొకమారు కూతతోగూడ గరుడావంతుడు నాబోటి బహు ప్రేక్షకులకు బ్రత్యక్షవిషయు డగుటయు దటస్థించి నా హృదయమునంగల విపరీతాభిప్రాయమును మొదలంట గూకటిప్రేళులతో బూర్ణముగ దొలగించినవి.

ప్రేక్షకులలో గొందఱు నాస్తికులు "రాసక్రీడ ముగియుటయు, గరుడుడు వేంచేయుటయు గాకతాళీయముగ నంభవించియుండరాదా?" యని నన్ను ప్రశ్నించిరి. మరియు గరుడాళ్వారు మాత్రమే యగపడిరి గాని కృష్ణపరమాత్మ కానిపించెనా? యనియు బ్రశ్నించిరి. అందులకు నే చెప్పిన జవాబిది.

"భగవంతుడు భక్తపరాధీనుడు గాన, మన వేంకటరాయుడుగారి భక్తికి బరవశుండయి యిచ్చట ప్రేక్షకులలో నాస్తికులుండిరో యాస్తికులుండిరో గురుతింపలేక మన పాపనేత్రములకు గరుడుని జూపించుటయు దప్పే యనియు, నొకవేళ శ్రీకృష్ణపరమాత్మ తన స్వరూపముంగూడ దత్సందర్భమున నగపఱిచినను ఏ పాశ్చాత్యుడో యాకాశయానము నధిరోహించి సాధన చేసికొనుచు దిక్ప్రదర్శన మొనర్చుచున్నాడనియందుముగాని శ్రీకృష్ణభగవానుడు గరుడునిపై విచ్చేసెనని నమ్మజాల" మని జవాబిచ్చితిని. భగవంతుడు స్వయముగ జూపు మహిమలయెడ హేతువాదములకుగాని, సాక్ష్యమునకుగాని తావుండదు. అనుక్షణమును గృష్ణమహిమ గాంచెడు నందయశోదలకును, దేవకీ వసుదేవులకును, బుద్ధి పొరపడుచుండగా నాస్తిక శిఖామణులమగు మన యూరిపేరు లేమనియు బ్రత్యుత్తరించితిని ఇవ్విషయమును నేను గన్నులార చేతులార వ్రాసి ధన్యుడనైతిని. 1912వ సంవత్సరము డిశెంబరు 12వ తేదీన అద్దంకిలోని పౌరులు నాచే నవధానము జేయించిన సందర్భములోగూడ వీరి యమానుష మహిమలను సర్వతోముఖముగ విని యదార్థములని త్రికరణశుద్ధిగ నమ్మితిని

అగ్రహారము, గుంటూరు<br>15-12-1940

అవధాన శిరోమణి,<br>మహోపాధ్యాయ<br>కాశీ కృష్ణాచార్యులు

# శ్రీమాన్ పాలపర్తి నృశింహదాసుగారి చరిత్ర

రచన : గుం॥ ఆదినారాయణ



వీరి స్వగ్రామము పాలపర్రు బాపట్ల తాలూకా వీరి తండ్రి సుందరరామయ్య వీరి తల్లి తాయమ్మ. వీరికి నారాయణ అను సోదరుడు, అగస్త్యమ్మ అను సోదరి కలరు. బంధుత్వ కారణంగా వీరు అద్దంకి చేరిరి వీరు ఆరువేల నియోగి శాఖకు చెందినవారు వీరు పెద్ద విద్యావంతులు కారు. వీరు అద్దంకి సమయోద్దండ కోలాహల లక్ష్మీనరసింహకుమార తిరుమల శ్రీ తిరుమలాచార్య స్వామివారి శిష్యులు. వీరికి శ్రీమన్నారాయణ అను కుమారుడును శ్రీలక్ష్మమ్మ, సీతమ్మ అను పుత్రికలు కలరు. వీరిని నేను 5, 6 సంవత్సరముల వయస్సులో ఉన్నప్పుడు మా అమ్మగారితో వెళ్లి బ్రాహ్మణ నిడమానూరు అనుగ్రామములో ప్రథమంగా చూచుట నా అదృష్టము. మా జనకసోదరులు గుళ్లపల్లి వెంకటసుబ్బయ్యగారు వీరి ముఖ్యశిష్యులలో నొకరుగా నుండెడివారు. మల్లవరం వాస్తవ్యులు గాలి రంగదాసుగారు కూడా వీరి శిష్యులు. వీరు శింగరి కొండమీద వేంచేసి యున్న లక్ష్మీనరసింహ స్వామివారి దేవాలయ ప్రాంగణములో ఉన్న గుహలో తపస్సు చేసిరి. వీరు లక్ష్మి నృశింహోపాసకులు. వీరు తపస్సుచేసిన గుహలో అంతకుముందే శ్రీనారాయణ తీర్థులువారు తపస్సుచేసిరని తెలుసుకున్నాను. వీరు కడుబీదవారు ఐనను ఒకరిని అర్థించక ఏమియూలేనప్పుడు మంచి

తీర్థమునే శ్రీస్వామివారికి నివేదించి ఆ తీర్థమునే తాను పుచ్చుకొని ఆకలిని చల్లార్చుకొనేవారని ప్రతీతి. మా అన్నగారు తరచూ కనీసం వారమునకు రెండు పర్యాయములైనా తమ సద్గురు వగుదాసుగారిని దర్శించి వచ్చెడివారు. వీరికి అనేక గ్రామాదులలో శిష్యులు కలరు. వీరు శాలివాహన శకం రౌద్రి సంవత్సరము మార్గశిర శుద్ధ పంచమి సౌమ్యవారమున లీలావిభూతి చెందిరి (దాసుగారిచే రచింపబడిన శ్రీ నరహరి సంకీర్తనలు అనుపుస్తకంలో వారి శిష్యులగు శ్రీమాన్ పాలపర్తి సీతారామదాసుగారు వ్రాసిన శ్రీ పాలపర్తి నృశింహ దాసచరిత్రమును ఈనావ్యాసమునకు అనుబంధముగా ఈక్రింద ముద్రించటమైనది.

శ్రీమాన్ నృసింహదాసస్వాములు 1844 సం॥రమున జనించిరి నివాసము అద్దంకినగరము. తండ్రి సుందరరామయ్య, తల్లి తాయమ్మ. భారద్వాజగోత్రులు. వీరి పూర్వనివాసము పాలపర్రు గ్రామము. బాపట్ల తాలూకా యందలిది. ఇంటిపేరు పాలపర్తి యునివచ్చినది. తాయమ్మ కాన్యవనగోత్రులగు పోలంరాజువారింటిబిడ్డ. వెంకయ్య లక్ష్మణదాసులకు సోదరి. ఈమెను పరిణయమైన కారణమున సుందరరామయ్య స్వస్థలము వదలి మామగారి యూరగు అద్దంకి జేరవలసివచ్చెను. స్వాములవారికి నారాయణయ్య అను అన్నయు, అగస్త్యమ్మ పేరిటి అక్కయు నుండిరి. వీరు శ్రీమదద్దంకి సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహకుమార తిరుమల శ్రీ తిరుమలాచార్య స్వామివారి శిష్యులు.

అయ్యగారు ద్వాదశ గండములతో గూడిన ఘోరనక్షత్రమున జనించిరి. గండములనుండి సంబంధులను తప్పించుటకు గొందఱు తాయమ్మకు శిశువును గురించి బోధలు గావించిరి. ఆమె వినలేదు. సుతజననము మొదలు ఇరువదియొక్క దినముదనుక నామె పురిటిమంచము దిగక దనకఠోర వ్రతాచరణమువలన దుష్టనక్షత్ర దోష మెవరికిగూడ దగులనీక గాపాడిన మహాసాధ్వీ లలామయట. ఈ గండపురుషుడు ఏన్నాళ్ళో జీవింపబోడని తెలుగువారి వాలకము ననుసరించి "ఉళక్కి" అని తొలుత బిలుచుచుండిరి. అనగా లేడు - లేదు - అను నభిప్రాయము. కావున వీరి మొదటిపేరు "ఉళక్కి".

పురుషులందు పుణ్యపురుషులు వేఱుగదా? అయిదవయేట బడిలో బ్రవేశించిన ఉళక్కికి లౌకికవిద్య గాఢముగ అభిమానపాత్రము గాదయ్యె. చిఱుతప్రాయము నుండియు ఆధ్యాత్మిక సంబంధమగు ఏకాంతచింతనా భావము మెండయ్యె. ప్రహ్లాదునివలె అయ్యవా రొకటిచెప్పిన శిష్యుడింకొకటి యనుట జరుగుచుండెను. పంతు లతికఠినముగ శిక్షించుచుండెను. అదితెలిసి తాయమ్మ పొట్టకూటి చదువులకై తన చిట్టిపట్టిని కట్టిడియై చదువులయ్య పెట్టు యిక్కట్లు భరింపజాలక బడికి బంపించమానివైచెను. వీరికి జదువ వ్రాయ నించించుక మాత్ర మలవడెను.

ఉపనయనము జరిపిరి. 16-17 ఏండ్ల వయసువచ్చెను చుట్టాల ప్రోద్బలమున అద్దంకియందు పోలీసుస్టేషను రైటరుగా జేరెను. అదియు వికటించుటచే మానివైచెను. మేనమామయగు శ్రీ లక్ష్మణదాసుగారి తిరువారాధన (దేవతార్చన) మున బాల్గొన నారంభించిరి. ఆకైంకర్యముల నిమగ్నుడై మైమఱచి యున్నయెడ కట్టెదుటనొక దివ్యతేజ స్సందర్శనము లభించెను. తన్మూలమున నృసింహ (అనుష్టుభము) మంత్రము లభించెను. "దీన నీవు కృతార్థుండవయ్యెదవు ఉపాసింపుము. అను నాజ్ఞనొసంగి తత్తేజోవిశేషము తిరోహితమయ్యెనట. ఏత న్నృహామంత్రోపాసనము ననుష్టించి స్వామివారు తేజోవిశేష మండితులై మౌనులై చూపరులనాకర్షింప దొడగిరి. తిరువారాధన కార్యమున నేమరక తత్పరులై యుండిరి.

**సింగరిగిరి ప్రవేశము** తిరువారాధనమూర్తి కళ్యాణోత్సవానంతరము ఒకప్పుడు భగవత్ప్రసన్నత వీరికి లభించెను. అయ్యది శ్రీ నృసింహదేవుని తేజస్సంపదయని ఆయన నిశ్చయించెను అద్దంకికి సమీపమున "భవనాశనీ" (భవనాసి అని అంటారు) నామకమగు సెలయేటి యొడ్డునగల సింగరి కొండపై వేంచేసియున్న శ్రీ లక్ష్మీనృసింహుని యాలయమును ఉళక్కిగారు ప్రవేశించిరి. అచట సునిశిత దీక్షావలంబనులై నలుబదినాళ్ళు తనకు లభించిన మహామంత్రరాజమును జపించిరి. వారు తపస్సమాధియం దుండునెడ నొక వృద్ధకృష్ణసర్పము రక్షావిధి నొనర్చుచుండెనట. భగవన్ని వేదనము గావించి వారుగై కొనుచుండిన క్షీరముల నా సర్పమును బాల్గొనుచుండెనట. ఈ దృశ్యమును కొంద రితరులేగాక ఒకనాడు మేనల్లుడు ముక్తి నూతుల పాటి వెంకటసుబ్బయ్య, మేనకోడలు రామమ్మ అనువారు దర్శించి వెఱచి పరువెత్తిరట. ఆ సమయమున శ్రీవారు బహిరంగస్థలమున లేరు. గర్భాలయమునందు నొకవైపు కొండగోడయందుగల బిలప్రవేశముజేసి యుండిరి. వారికాగుహాంతర్భాగమున శ్రీనవనారసింహదేవుని ప్రత్యక్షదర్శనమయ్యెనట. అనంతరము వెలువడివచ్చి ఆ బిడ్డలను రా బిల్చి యోదార్చిరట.

**అద్భుత విషయములు** ఒక సమయమున గొందఱు దుండగు లీయనమునితపంబునకు అంతరాయమము గల్పింప సమకట్టివచ్చిరి. శ్రీ నృసింహుని మహిమచే గండశిలలు వారిపై దొర్లిపడుట ప్రారంభమై వారల బలాయితుల గావించ వీరది గ్రహించి కరశబ్దముచే వారల రాబిలిచి భయముదీర్చి అనునయించిపంపిరట.

అద్దంకి సబు మేజిస్ట్రేటు వెలిదండ రంగారావుగారి భార్యకు భూతావేశ మయ్యెను. మాంత్రికుల కసాధ్యమయ్యెను. అయిదార్గురు మనుష్యులైన కదల్పజాలని రాతిరోలును ఆమె ఒకర్తె ఎత్తి నెత్తినబెట్టుకొని భయంకరముగ నార్చుచు వీధిఁబడి పోవుచుండెను. మార్గమం దాకస్మికముగ శ్రీ స్వామివారెదురైరి. ఆమెరోలు నచటబడవైచి ఏడ్చుచునింటికి జనెను. శ్రీవారి తీర్థప్రసాద స్వీకారమున వెంటనే పూర్ణారోగ్యం గలదాయెను.

**స్వామివారి అనుజ్ఞ** సింగరికొండయందు మండల దీక్షాకాలము ముగిసెను. స్వప్నమున ఉపాస్య దైవత దర్శనము లభించెను. మఱునాడు జరుగనున్న కార్యకలాపముల తనంతట నెఱింగించెను. తన అనుగ్రహము నిరంతరము విడువకుండునని అభయ మొసంగి శాంత్యాదికములు దీర్చి ఇంటికి జనుమనెను. దైవ ప్రేరితముగ పరిసర గ్రామములనుండి సమస్త వస్తుసంచయము మఱునాడు వచ్చెను. శాంతి కార్యము చక్కగ జరిగెను. పౌర జానపదులు దర్శించిరి. స్వామియు అద్దంకిజేరిరి.

**నృసింహదాస నామకరణము** అనంతరము కొన్ని నాళ్ళు గడచెను. వీరి ప్రశంసలందందు విరివిగ వ్యాపించెను. వారి సాంప్రదాయ గురువులు తక్కోళ్ళపాటి వాస్తవ్యులు శ్రీ మదద్దంకి సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరుమల శ్రీ తిరుమల దేశికులవారు విచ్చేసి తిరుమంత్రోపదేశముతో పంచసంస్కారదీక్ష నొసంగి "నృసింహదాసు" అను చిరునామము ననుగ్రహించిరి. దాసుగారు తన్మంత్రానుష్ఠానమును షాణ్మాసదీక్షగైకొని యుపాసించిరి. తదాది "శ్రీనృసింహదాస" నామము రూఢికెక్కెను.

శ్రీవారు సంప్రదాయ గ్రంథములనన్నిటి శ్రవణముజేసిరి. తమ ఇష్ట దేవతానుగ్రహమున సకల విద్యాప్రావీణ్యులైరి క్రీ॥ శ॥ 1869 ప్రాంతమున శ్రీరంగమున శ్రీ అల్లూరి వేంకటాద్రి అస్వామివారిని దర్శింపనేగి కొంతకాలము శుశ్రూష యొనర్చిరి. బంధు నిర్బంధమున కొన్నాళ్ళకు 1874 సం॥ ప్రాంతమున మేనమామ లక్ష్మణదాసువారి కుమార్తె లక్ష్మీ నరసమ్మ అనునామెను బరిణయమాడిరి. వీరు చక్కని భజన కాలక్షేప పరులు.శ్రీకృష్ణ లీలాతరంగిణి అష్టపది శ్రీ రామదాస చరిత్రాదు లభిమాన పాత్రములు, చక్కని తాళలయ గలవారు. నృత్యవిద్యానిపుణులు, సంకీర్తన సమయములందు స్వామివారు అపుడపుడు పరవశులగుటయుగలదు. శ్రీలక్ష్మీ నృసింహ ప్రీత్యర్థము వీరు నిత్య పక్షమాస ఉత్సవము లొనర్చుచుండిరి. ప్రతివర్షము వైశాఖశుద్ధమున దొమ్మిదినాళ్ళు ప్రకరణాను సారమగు నుత్సవము లొనర్చెడివారు. ఆ యుత్సవముల భక్తవర్యులగు అద్దంకి (హరిదాసు) వెంకట్రాయులుగారు తాడిగడప శేషయ్యగారు. అద్దంకి పెద్దిరాజుగారు ఇంక గొందఱు శిష్యవర్యులు వీరికి దోడ్పడి కాలక్షేపములు రాసక్రీడా మహోత్సవము లొనర్చుచుండిరి.

వీరికి అనేక గ్రామములలో శిష్యవర్గ మేర్పడెను. వారివారి కోరికలననుసరించి శ్రీవారు మంత్రోపదేశములు గావించి భగవదనుగ్రహ ప్రాప్తికి సంసిద్ధుల నొనర్చిరి. వారి శిష్యులలో ప్రథములు ప్రముఖులు శ్రీ అద్దంకి పెద్దిరాజుదాసు, శ్రీ దామోదర కేశవదాసు, రాధాగోపాలకృష్ణదాసు, వరపు కృష్ణదాసుగారలు.  శ్రీవారు శ్రీ నృసింహదేవు నాజ్ఞచే నరహరి సంకీర్తనలు రచించిరి. వీరి నాశ్రయించి అస్తిక వర్యులయిన వారిలో ప్రశంసా పాత్రులు శ్రీ మన్నేపల్లి వేంకటాచలం పంతులుగారొకరు. ఈ పంతులుగారు జిళ్ళెళ్ళమూడి రామారావు పంతులుగారు, శ్రీస్వామివారి నాశ్రయించి దాసనామములతో పంచసంస్కార పరులైరి.

వీరు 1895 సం॥ రమున శ్రీపరబ్రహ్మసత్ర నామ వైకుంఠ యాగము, ఆచార్యోత్సవము, శ్రీరామ సామ్రాజ్యపట్టాభిషేక చిత్రకూటోత్సవములు విధివంతముగా ఆచరించిరి. దాని నిర్వహణలో విశేష తోడ్పాటొసంగి పాల్గొనిన వీరి శిష్యులు కీ॥ శే॥ బొమ్మరాజు పురుషోత్తమదాసు, ఉప్పలపాటి వెంకటకృష్ణదాసు, గాలి అనంతనారాయణదాసు అనుమహనీయులు ప్రశంసాపాత్రులు. వీరి తిరువారాధన సేవకు కీ.శే. గుళ్ళపల్లి ఆదినారాయణ దాసుగారిని, ఈ దాసుని విశేషంగా నియమించుచుండెడివారు. వీరికి శ్రీలక్ష్మమ్మ, సీతమ్మ అనుకొమరితలును శ్రీమన్నారాయణదానను కుమారులును గలరు. వీరిప్పటికిని అద్దంకియందున్నారు.

1910 సం.రములో శ్రీ నృసింహదాసువారు రాయవేలూరు తిరుమల పర్యటనచేసి వచ్చిరి. 1917 సం॥ రమందు అద్దంకి విజయంచేసిన శ్రీ పుష్పగిరి శంకరాచార్య స్వామివారిచే వీరు గౌరవించపబడిరి. కొరిశపాడు రుద్రవరం మొదలగు గ్రామములలో వీరివలన దేవాలయ నూతన ప్రతిష్టలు జీర్ణోద్ధారణలు మొదలగు కార్యములు నిర్వహింపబడెను. అయా చితముగా శిష్యులు ఆశ్రితులు సమర్పించు సత్కారాదికముల మూలమున శ్రీవారి తిరువారాధన కలాపము అతిథి అభ్యాగత పూజా ద్యుత్సవములు చక్కగ జరుగుచుండెను.

వీరికి దామరాజు నారాయణప్ప అను శిష్యులుండిరి. ఒక నాడాయన వండిన సమస్త పదార్థములను ఆరగింపునకై అయ్యగారి తిరువారాధనకు ముందుంచి తాను పోయి వంటయింట మ్రాగన్నుగా నిదురించుచుండెను. ఆసమయమున నృశింహదాసు నాకృతిని యొకమూర్తివచ్చి ఆయన వీపున బెత్తముతో మోదెనట. ఆబాధతో గోలసేయుచు తలుపు తెఱచుకొని దాసువారివద్దకు పరువెత్తివచ్చి పూరక నన్నేల కొట్టితిరని యేడ్చెను. తన వీపునగల రక్తసిక్తమగు దద్దురునుచూపెట్టెను. అదివిని చూచి వారు ఓరీ నీవు తలుపుతెఱచువరకు నేనిచటనేయుంటిని. నిజము తెలిసికొంటిని నీదోషము దాపక చెప్పుమనెను. అయ్యా! పిల్లిముట్టికొనిన నేతి గిన్నెను శుద్ధిపరచకనే తెచ్చి అరగింపు పదార్థములతో నుంచితి ఇదియ నాతాత్సార లోపము పొరబాటు క్షమించమని వేడెను. వారాయనను కరినముగ మందలించి వీపు గాయముపై మంత్రోదకము చల్ల ఆయనకా బాధ శమించెను. ఆయన జీవితాంతమువరకు వీపునగల వాత గుర్తును చూచిన వారనేకులు గలరు. ఇట్టి సంఘనలనేకములు గలవు. శ్రీ భగవదారాధన సంబంధమున యెవరివలన యేలోపములు వాటిల్లినను వీరికి వెనువెంటనే స్ఫురించి తెలుపుచుండేవారు. వీరు మంత్రశాస్త్ర నిపుణులు స్ఫోటకమారి దుర్భిక్షాది సకల గ్రహపీడలు వీరు స్మరించి యిచ్చిన మంత్రోదకములచే నివర్తించుటగలదు. హరికథా కేసరి. కీ॥ శే॥ రామాయణం సీతాపతిదాసుగారు వీరి శిష్య ప్రముఖులలో నొకరు. వారికి కొత్తపల్లిలో మశూచిజ్వరం ప్రారంభమయిన వార్తవిని తిరుమంత్రము వంటపట్టలేదు కాబోలు అయినా పరవాలేదు అవి కబురంపి తమ శిష్యునిగురించి స్మరించిరి. ఆరాత్రియే పీతాపతిదాసుగారి స్వప్నములో అమ్మవారు కనుపించి నన్నా గడ్డపాయన కొప్పగించితివా? పోతున్నాలే అనెనట. తెల్లవారగనే దాసుగారు రుగ్మత లేనివారివలే ప్రాతఃకాల కృత్యములు తీర్చికొని శీతోదక స్నానముకున్నూ గడంగిరి. అపర నారదుం డనదగిన కీ॥ శే॥ కాకర్ల ఆదినారాయణ దాసుగారు మృదంగీకులలో ప్రసిద్ధివంతుడైన కాకర్ల రంగదాసుగారు, భీమరాజు హనుమంతరామదాసుగారు రావినూతల సీతారామదాసుగారు వీరి పాదముల నాశ్రయించి ధన్యులైరి. వడుగనంబి (ఆంధ్రపూర్ణులు) ఉడయవరులకు బోలిన శిష్యుడగు భీమరాజు హనుమంతరామ దాసుగారు పరమపదోత్సవాంతమున ఒకసంవత్సరమునకు జరుగనున్న తమ చరమ వృత్తాంతమును నృసింహదాసుగారు ఏకాంతమున శ్రీ అద్దంకి వెంకట్రమణ దాసుగారితో సెలవిచ్చిరట. జితేంద్రియులగు వీరు ఉబ్బస వ్యాధిని నిగ్రహించి బాధనణంచుకొని తిరువారాధన శిష్యులకు పంచసస్కారాదికము లొనర్చుచుండిరి. దుర్బలస్థితిలో నుండియు వాలి సుగ్రీవులని పేరొందిన శ్రీమాన్ పొరూరి వెంకటసుబ్బదాసు, వేంకటరమణదాసు అనువారికి సంస్కారదీక్ష నొసంగి తిరుమంత్ర మనుగ్రహించిరి. అది రౌద్రి సం॥ రకార్తీక బహుళదశమి. పైత్యాతిశయమున శ్వాసకోశములనుండి వమనము గానున్న పసరును వెలికి రానీయక నిగ్రహించి సంస్కార కార్య కలాపమును నిర్వహించి అనంతరము దానిని వెలికి బంపిరట. అది తుదిసంస్కారమని చెప్పుచు శిష్యులతో సొపడిరట.

తరువాత వారము రోజులకు శ్రీవారికి దేహమున నీరు వ్యాపించెను. ఎన్నివిధముల వ్యాధి బాధించుచున్నను తిరువారాధనాదికము అవ్యాహితముగ జరుగుచునే యుండెను. చెప్పదగు వారికెల్లరకు ఆధ్యాత్మిక విషయములు సాకల్యముగ చెప్పిరి.

రౌద్రి మార్గశిర శుద్ధ చతుర్థి వచ్చినది. నిత్యకృత్యములన్నియునైనవి. వలయు ముఖ్యవస్తు సంభారమును చేర్పించి తాము సంసిద్ధ మొనర్చుకొనిరి. ఆనాటి సాయంకాలము శ్రీభాగవత పురాణ కాలక్షేపములో శిష్యులకు నిజస్థితి గురువులుపదేశించెదరను కథాభాగము నొక్కి చెప్పిరి. తెల్లవారునంతలో ఈ తనువున తానుండబోనని సెలవిచ్చిరి. శ్రీవారు ప్రాణదైవతము నారాధించి అనంద బాష్పములు జడిగొన

గనులరమోడ్చి బ్రహ్మానంద రసమగ్నులై సెలవుగైకొనిరి. కనుల నీరొత్తుకొనుచు మరలమరల నర్చామూర్తిని వీక్షించుచు నిమీలిత నేత్రులైరి అనుష్ఠానార్థము ధరించిన వస్త్రముతోనే ఆరాత్రి గడచెను. శ్రీకృష్ణ పాదారవింద సందర్శనమున నమందా నందరస కందళిత హృదయంబున భౌతిక దేహమును వీడిన భీష్ముని నిర్యాణమును ఈ యనఘుని పరమపద ప్రవేశము దలపించుచున్నది.

అప్పటికి శ్రీవారికి 76 సం॥ రములు మార్గశిర శు॥లు సౌమ్యవాసరము బ్రాహ్మీ ముహూర్తములోన వీరు లీలావిభూతినుండి పయనించిరి. అరుణోదయ మాయెను. తండోప తండములుగా వచ్చి కడపటి సేవాదర్శన భాగ్యము అనుభవించుచున్న వారలలో వంగోలు సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ శ్రీరాముల రాధాకృష్ణయ్య పంతులువారున్ను ఆగంతుకముగా వచ్చి శ్రీవారి భౌతిక దేహమును బరీక్షింప, భిన్నకపాలమై రక్తమోడుచుండెను. అపుడందఱు అశ్చర్యానంద భిన్నమనస్కులైరి.

స్వామివారి శిష్యప్రవరులలో ప్రేమపాత్ర లోకరిపుడున్ను శతవృద్ధులై ఒంగోలునందున్నారు. ఈ శిష్యుని శ్రీవారు తిరుక్కచ్చినంబి యని పిలుచుచుండెవారు. వారి తిరునామము భగవన్నారాయణదాసు (పేర్ల యల్లమందదాసు. వైశ్యులు) వీరు ఆచార్యకైంకర్య దీక్షాధురంధరులు వీరును ఇతర శిష్యులు, భక్తులు, పౌరులు, బంధువులు, గుంపులు గుంపులుగ జేరి భగవన్నామ ధ్యానభజన కాలక్షేపణ కోలాహలము నిబిడముగ శ్రీవారి భౌతిక దేహమును చందన తులసీ కాష్టాదులచే గుండికా (గుండ్లకమ్మ) నదీతీరమున సంస్కరించిరి. ఆసమయమున శ్రీ గరుడాళ్వారులు కృష్ణాయనుచు నాకసమున విహరించుచుండిరి. శ్రీవారి శిష్యులలో కీ॥ శే॥ దామోదర కృష్ణదాస స్వామి, కాకర్ల ఆదినారాయణ దాసస్వామి ఈ దాసుడు, శ్రీమాన్ అద్దంకి (హనుమంతరావు) వెంకట్రమణ దాసస్వామి అనువారల నాశ్రయించి మంత్రదీక్షా సంస్కారము లొందిన ప్రశిష్యప్రవరులు చాలా మందిగలరు. శ్రీస్వామివారి పరమపదోత్సవమును ఏటేటా శిష్యప్రశిష్యులతి శ్రద్ధతో నిర్వహించుచున్నారు. అయ్యగారితో ఒకసమయమున జగన్నాథమును దర్శించ కోరికగలదనగా సరే పోగానే వారు నీతో మాటాడెదరా యెక్కడికి పోయినను ప్రకృతిబంధములు వీడవు. శ్రీ భగవానునియందు అకలంక భక్తికల్గి ఉన్నచోటనే యుంటే మనతో పయినా ప్రక్కనా వారు వుంటారు అని సెలవిచ్చి తమకు శ్రీరంగనాధుని ద్వారదర్శనము లభింపమినిగురించి వారి అనుభవమును తెల్పిరి. తదాదియే దివ్యదేశయాత్రయం దిచ్ఛలేక ఈ దాసుడు నిలచెను.

ఇందలి విషయములు శ్రీస్వామివారివలన స్వయముగ నేను విన్నవికొన్ని, వారి అనంతర మితరులవలన దెలిసినవి కొన్నియునై యున్నవి. మొదటికూర్పున కీ. శే. బొమ్మరాజు రంగదాసుగారి పీఠికయు ద్వితీయమున కీ.శే బొమ్మరాజు సీతారామదాసు భాగవతులవారి పీఠికయు జేర్చి ముద్రింపబడి యున్నవి. అంది మహానుభావుని జీవితవిశేషములు కొన్ని శ్రీమాన్ నీలంరాజు ఆదిమూర్తి వరపు ఆదినారాయణదాసు ప్రేరణమున నిది వ్రాయించి యిస్తిని. అవ్యాజ వాత్సల్యమున ఈ సంకీర్తనములను అంగలకుదురు (దాసకుటి) ఆశ్రమ శ్రీకోదండరామ సేవక ధర్మసమాజము పక్షమున అనుగ్రహించి 3వ ముద్రణ చేయించిన మహామహులగు శ్రీమాన్ దానశేషస్వామివారి చరణ సరసిజములకు బ్రణమిల్లుచున్నాను. భక్తజను లీ సంకీర్తనా కాలక్షేపముచే తరింతురని ఆశించుచున్నాను.

ఇట్లు
శ్రీ భగవద్దాసానుదాసుడు
పాలపర్తిసీతారామదాసు

# శ్రీ ఇలపావులూరి కూర్మదాసుగారి చరిత్ర (1890 - 1961)

రచన : గుండ్లపల్లి ఆదినారాయణ



పేరాలయందు నెలకొన్న శ్రీ పాండురంగ స్వామి ప్రతిష్టగావించిన కీ.శే కూర్మదాసుగారు 1890వ సం. ప్రస్తుత ప్రకాశంజిల్లా కందుకూరు తాలూకా సింగమనేనిపల్లెలో మేనమామలగు వంకమామిడివారి యింటిలో జన్మించినారు. కూర్మదాసుగారి స్వగ్రామము ఇలపావులూరు మా స్వగ్రామము కొలచన కోటకు పడమరగా 8 మైళ్ల దూరంలో వున్నది. ఈపరమ భక్తశిఖామణిని నేను స్వయంగా సందర్శించడం నా అదృష్టము. వారు చీరాలలో నిర్మించిన ఆలయమునకు నాచేతను, మా బంధువులచేతనూ, ద్రవ్యం ఇప్పించి, మమ్ములను ధన్యులను చేసినారు వీరి చరిత్రను శ్రీ పాండురంగ సుప్రభాతము అను పుస్తకము నుండి సవిస్తారముగా ప్రచురించుచున్నాము. వారు నిర్మించిన దేవాలయము ఇప్పటికీ వారి సంకల్పం ప్రకారం చక్కగా నిర్వహింపబడుచున్నది.

వీరు పిన్నవయసుననే స్వగ్రామములో భజనమండలి స్థాపించిరి వీరికి శ్రీకృష్ణలీలా తరంగములన్న కడుప్రీతి. మల్లాది సుబ్బదాసుగారు వీరి భక్తికి మెచ్చి కూర్మదాసు అనుసార్థక నామమును ప్రదానము చేసిరి.

1923వ సంవత్సరము (దుందుభినామ సంవత్సరం) కూర్మదాసుగారు ఒంగోలులో బ్రహ్మసత్రయాగము నిర్వహించిరి. ఈ కార్యక్రమములో బ్రాహ్మణ నిడమనూరు, కొత్తపల్లి వగైరా గ్రామాలనుండి, వచ్చిన భక్తులు శ్రీకృష్ణలీలా తరంగ కాలక్షేపము చేసిరి. శ్రీ కూర్మదాసు గారికి తరంగములనిన కడుప్రీతి హరిదాసులకు ప్రత్యేక భోజన సదుపాయముల ఏర్పాటు చేసేవారు. ఈ సందర్భంలో జరిగిన ఒక సంఘటన పాఠకుల దృష్టికి తెచ్చుట అవసరము. ఒంగోలులో అప్పటి ప్రముఖ క్రిమినల్ లాయరు నీలంరాజు చలపతిరావుగారు దైవ కార్యములకు, దాన ధర్మములకు విముఖులుగా నుండెడివారు వారి రెండవభార్య బాలాంబగారు మంచి సంస్కారముగల భక్తురాలు. నృసింహోపాసన చేయుచుండెడిది. ఎన్నడూ ధర్మకార్యాలకు విరాళమివ్వని చలపతిరావుగారు శ్రీకూర్మదాసుగారి బ్రహ్మసత్రయాగమునకు ఆరువేల రూపాయలు సమర్పించిరి. ఈ విషయం తెలిసిన సోదర న్యాయవాదులు చలపతిరావుగారిని ప్రశ్నింపగా, కూర్మదాసుగారు మానవుడిగా తనకు గోచరించలేదు. అని సమాధానమిచ్చిరి. ఈ సంఘటన శ్రీకూర్మదాసుగారి నిర్మలాంతః కరణను, సద్గుణ సంపత్తిని తెలియజేయును.

శ్రీకూర్మదాసుగారు సంత్సరమునకు ఒకటి చొప్పున వేమవరము, తెనాలి ఈమని, కడప, ఒంగోలు, నెల్లూరు, నర్సారావుపేట, కావలి, బాపట్ల, పేరాల, చీరాల, కుంకులగుంట, దొనకొండ, యనమదల, గుంటూరు, కందుకూరు, నందిగామ, సికింద్రాబాదు, మద్రాసు మున్నగు ప్రదేశములలో సప్తాహములు కొనసాగించిరి. ఈసప్తాహములలో దీపారాధన చేయుటయే వీరిపని. కావలసిన ద్రవ్యము భగవత్కృపతో సమకూరెడిది.

వీరు మహారాష్ట్ర దేశములోని నాందెడ్ జిల్లా, దేగులూరు వాస్తవ్యులు శ్రీ గుండా మహీపతి మహారాజావారి వద్ద మంత్రదీక్ష పొందిరి వీరికి విశిష్టాద్వైతము నందు అభిమానము. వీరెప్పుడును. ద్వాదశోర్ధ్వపుండ్ర నామములను ధరించెడివారు వీరు భద్రాచల యాత్రికుల సౌకర్యార్థము లింగకూడ, బూరగుమ్మలపాడు లందు ఒక్కొక్క సంవత్సరమును, గోసవీడు, క్రొత్తగూడలందు నాలుగు సంవత్సరములును, ఆంధ్ర యాత్రికుల కొరకు పండరీ పురమునందు తొమ్మిది సంవత్సరములును అన్నసత్రములు నడిపిరి ఈ సత్రములందు బసచేయు యాత్రికులను పరమ భాగవతులనియు, శ్రీరామచంద్రమూర్తి పెండ్లి పెద్దలనియెడు, నుదాత్త భావముతో పసిపిల్లలకుకూడా వలయు సర్వసౌకర్యములతో తదీయారాధన గావించిరి.

వీరికి సప్తాహ అన్నసత్ర కైంకర్యములందనేక భగవదనుభవములు కలిగెను. ఈమని గ్రామములో సప్తాహ సందర్భమున శ్రీనేలనూతల సుబ్బావధానులు గారింట బసచేసి, ఉపవాస దీక్ష సాగించుచూ, సిద్ధాద్రి సంవత్సర ఆషాఢ శుద్ధ పంచమి సప్తాహమునకు ముహూర్తముగా నిశ్చయించగా, ఆయూరి వారి సహకారము లభింపమి క్రతు ప్రారంభమునకు మూడు రోజులు మాత్రమే వుండుటచే దాసుగారు విచారించు చుండిరి. ఆనాటి రాత్రి వైష్ణవ వేషధారులైన ఇరువురు పురుషులు స్వప్నములో దాసుగారికి, సాక్షాత్కరించి, "కూర్మదాసా! నీవు నిర్ణయించిన ముహూర్తము ప్రకారము బ్రహ్మ సత్రమారంభముకాదు. నవమికి మార్చుకొనుము. ఈలోగా కార్యక్రమాహ్వానములను పంచిపెట్టుము తక్కిన పనులు మేము చక్కపెట్టెదము' ' అని చెప్పి అంతర్ధాన మొందిరి.

అట్లే దాసుగారు ఆహ్వానపత్రికలు తయారు చేయించి పంచిపెట్టిరి. పందిళ్లు, పాకలు సుబ్బావధానులు గారి సహాయముతో నిర్మింపచేసిరి. మంటప నిర్మాణము జరిగి అర్చామూర్తులను ప్రవేశపెట్టిరి మొదటిరోజు, ఉభయమిమ్మని పెద్దిరాజు మహలక్ష్మమ్మగారి నర్థించగా వారు బదులుచెప్పలేదు. కాని రాత్రి రెండు జాముల ప్రొద్దుపోయిన తర్వాత మహలక్ష్మమ్మగారు అయిదువందల రూపాయలు, పళ్లెరమందు తీసుకొని వచ్చి సమర్పించి మిగులు తగులులను తానేభరించెదనని చెప్పిపోయెను మరుసటి దినము నుండి, పదిరోజులకు పదిమంది సంపన్న గృహస్థుల విరాళములతో క్రతువు మహావైభవముగా జరిగెను.

కడప సప్తాహ సందర్భమున నొకరేయి కాగితపు బువ్వులతో నలంకరింపబడిన చలువ చప్పరములో స్వామివారికి గజోత్సవము జరుగుచుండెను. ఒక అరమైలు పొడవున మేళములు, జనము స్వామివారి ముందుండిరి. అందరికి ముందు దాసుగారు బండిలో వెళ్లుచుండిరి. భక్తులొసంగు హారతుల నర్చకుడు స్వామివారికొసంగు తఱి, అగ్ని కాగితముల నంటుకొనెను. పెద్దజ్వాల కనుపించెను. అందరునూ భయ విహ్వాలులైరి. దాసుగారు దూరము నుండియే భగవంతుని స్మరించు చుండిరి. అంతలో నూతన యువకుడొకడు గజము నెక్కి, మంటలార్పిదిగిపోయెను. "ఆపని చేసిన దెవరా?" యని అందరును ఆ పురుషుని కొరకు వెదకిరిగాని కనుపించలేదు. భగవానుడే ఆ రూపము[illegible] జనులాబాల గోపాలమాశ్చర్య చకితులైరి.

ఘనముగా చెప్పుకొనదగిన ఒక క్రతువు ఒంగోలులో జరిగెను. రోజునకు రెండు ఎత్తైన కళాయిలలో నేతి డబ్బాలు మూతలు కత్తిరించి, నింపి వాడిరనగా ఆనాటి అన్నదాన బాహుళ్య మహిమ యూహింపదగును.

ఎవరైననూ, సప్తాహము, తదంగముగా అన్నసత్రము జయప్రదముగా జరిపినపుడు, ఆ కార్యక్రమమును ప్రశంసించవలసిన సందర్భమున "శ్రీకూర్మదాసు సప్తాహమువలె" జరిగినదనెడు నానుడి యేర్పడినది.

దాసుగారు చిన్న తనమందు సంగీత విద్య కొంత నభ్యసించెను. వారికి కళాకారులన్న అఖండమైన ప్రేమగలదు. సప్తాహములందు బాహుళ్యమగు సమారాధన జరుగునప్పటికి చాలా అకాలము అగునని "హరిదాసుల"కు ప్రత్యేక బస, భోజనాది సౌకర్యములు ఏర్పాటు చేయబడుచుండెడివి ఈ ప్రత్యేక వసతులను కొన్ని కార్యములందు "హరికథా కేసరి" శ్రీనేతి లక్ష్మీనారాయణ భాగవతులు పర్యవేక్షణ చేయుచుండిరి.

వీరు కార్యక్రమములందు దక్షిణ దేశమునుండి గొప్ప విద్వాంసులను కూడా ఆహ్వానించి కాలక్షేపము నేర్పాటు చేయుచుండిరి. నెల్లూరు సప్తాహమందు ప్రసిద్ధి కెక్కిన శ్రీ చిత్రిగారి నాగస్వర వాయిద్యము నేర్పాటుచేసిరి. "రేడియో" ప్రచారములోనికి రాని ఆ రోజులలో సంగీత, సాహిత్య, కళలను పోషించిరన్నచో అతిశయోక్తి గానేరదు. శ్రీ పాండురంగ దేవాలయ నిర్మాణ మగుచున్న రోజులలో "హరికథాకేసరి" శ్రీమైనంపాటి నరసింగరావు భాగవతులు గారిచే పేరాలలో సంపూర్ణ రామాయణ హరికథా కాలక్షేపము జరిపించి వారిని సన్మానించుటయేగాక, ఏనుగు అంబారీ ఉత్సవము గూడ జరిపించిరి.

వీరు పండరీపుర సత్రమును జరుపు రోజులలో, శ్రీ పాండురంగ స్వామివారికి అక్కడ జరుగు రథోత్సవమును సేవించి, స్వామివారికి సమర్పింపబడు తిరుమంజన అలంకారాదులు తనకు తృప్తి కలుగకుండుటచే "రంగా! నీకు జరుగవలసినంత వైభవము జరుగటలేదు. నీవు మా ఆంధ్రదేశమునకు విచ్చేసినచో, దక్షిణ దేశ దివ్య స్థలములందు వలె, తిరుమంజన అలంకార, ఉత్సవ, వివిధ భోగాది కైంకర్యములతో సేవజేసి ఆనందించెదను" అని నివేదించుకొనిరి. అంతట ఆలయ ప్రయత్నము ప్రథమముగా నెల్లూరునందు చేయదలచిరి.

అంతలో ఒంగోలు కాపురస్తులు, శ్రీ తూములూరి జ్వాలరామయ్యగారి భార్య అన్నపూర్ణమ్మ గారు తన కుమారునితో పేరాలలో నివసించుచూ, ఇచట నొక దేవస్థానము నిర్మింప సంకల్పము చేయుడని మనదాసుగారి నర్థించెను.

అంత చీరాల రైల్వేస్టేషన్‌కు పడమరగా 1932వ సంవత్సరంలో, 11 సెంట్ల స్థలమును దాసుగారు కోవెల నిర్మాణమునకై ప్రథమముగా గొనిరి. దేశమునందునలుమూలల తమ ఒంటెద్దు బండిలో పయనము చేయుచూ, ప్రచారము గావించి, భక్తుల సహాయమున ఆలయ నిర్మాణము గావించిరి. అందు తారణ సం. వైశాఖ శు.౧౩లు శుక్రవారము (ది 5-5-1944) పండరీపురంలో వలె, శ్రీ రుక్మాబాయి సమేత పాండురంగ స్వామివారి మూల ఉత్సవ బేరములను, నిష్కామ సౌభాగ్య దురంధురులైన శ్రీమాన్ ఉవే.

అర్ధంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనరసింహకుమార తిరువేంగడ తాతదేశికా చార్యులయ్యవారలుగారి అధిపత్యమున ఆదిపూడి వాస్తవ్యులు "ప్రతిష్ఠాపనాచార్య శ్రీమాన్ దిట్టకవి తిరుమలాచార్యులవారి చేత పాంచరాత్రాగమానుసారముగా ప్రతిష్ట జరిగెను. అప్పటి నుండి యీ ప్రాంతమునకు "విరల్‌నగర" అను పేరువచ్చెను

తదుపరి ధ్వజ ప్రతిష్ఠయు, గరుడాళ్వారు ప్రతిష్ఠయు జరిగెను. పిమ్మట ప్రత్యేకముగా నిర్మించబడిన గదులందు శ్రీ విళంబి సం.ర జ్యేష్ఠ బ॥ ౧౨లు గురువారం (12-6-58) శ్రీ గోదాదేవి ప్రతిష్ఠయును, మాఘ శు. లు శుక్రవారము 20-2-59 "జప యజ్ఞసదన" మందు షోడశనామ యంత్ర ప్రతిష్ఠయును జరిగెను

# ఇలపావూలూరి వేంకటసుబ్బదాసు గారి జీవిత సంగ్రహము

సమర్పణ : ఇలపావులూరి కామేశ్వరరావు

మా నాన్నగారు ఇలపావూలూరి వెంకటసుబ్బయ్యగారు 1890లో జన్మించిరి. జన్మస్థలం ఇలపావూలూరు. ఇలపావులూరు కామయ్య పంతులు, కోటమ్మగారికి ఏకైక పుత్రుడు. చిన్నతనం నుండి భజన సంప్రదాయమున హరికథా కుతుహలంతో పెరిగి తండ్రిగారితో గూడ శ్రీ పుష్పగిరి పీఠాధిపతుల సేవలో కొన్నాళ్లు గడిపిరి వీరికి నిత్య భజన ఒక అనుష్ఠానము మేము ముగ్గురు సోదరులము, మా అక్క చెల్లెళ్లు అయిదుగురము నిత్య భజనలో తప్పనిసరిగా పాల్గొనుచుంటిమి భజన కార్యక్రమములో తప్పనిసరిగా రెండు మూడు నారాయణతీర్ధ తరంగములు ఉండేవి. శ్రీకృష్ణ లీలా తరంగిణిలోని తరంగములతో మా నాన్నగారు కథాప్రవచనములు చేస్తూండేవారు. అదే వారి జీవనసరళి. ఒంగోలు తాలూకా చెర్లొగుడిపాడు, తిమ్మనపాలెం, దైవాల రావూరు వగైరా గ్రామాలలో వీరిని భజనపంతులు అని పిలిచేవారు. 1936 ప్రాంతములో బృందావన భజన అనే ఒక భజన బృందం ఒంగోలు ప్రాంతంలో చాలా ప్రసిద్ధిచెంది(గ్రామాలలో శ్రీ నారాయణ తీర్థులవారి తరంగాలే కేవలంగా ప్రచారం చేసేది. దాదాపు 15 సంవత్సరాలు నడిచినది. కృష్ణంరాజు అనే వ్యక్తి నాయకుడుగా గ్రామాలలో తరంగాలు నేర్పుతూ కొందరికి శిక్షణ ఇస్తూ వుండేవారు ఆయనకు సంగీత, సాహిత్య విషయాలలో మా నాన్నగారు శ్రీ వెంకటసుబ్బదాసు గారు తగిన సలహాలు ఇస్తూ లయ సహకారం కూడా అందిస్తుండేవారు.

మా ఇంటిలో అందరికి చాలా తరంగాలు పాఠంలో వుండడానికి మా నాన్నగారి శిక్షణే ఆధారము. "క్షేమం కురుసతతం - గోపాలమమ" "కృష్ణం కలయ సఖీ సుందరం" "రక్షరక్ష అసుర శిక్ష" వగైరా తరంగాలు అతి అర్తితో గానం చేస్తూ ఆనందభాష్పాలు వదిలేవారు. కంఠం బొంగురుపోయి పారవశ్యం చెందేవారు. వారికి శ్రీ బొమ్మరాజు సీతారామ దాసుగారితోనూ, మైనంపాటి నరసింగారావు గారితోనూ మిక్కిలి పరిచయం వుండేది. వారి తరంగాన్ని గురించి మాతో చెప్పి మమ్ములను ఉత్తేజపరిచేవారు. వేకువజామున నన్నులేపి "హేరామ" "హేకృష్ణ" "ఇహసముత్తిష్ట" అనే తరంగం గానం చేయించేవారు. ముఖ్యంగా ధనుర్మాసములో ప్రార్ధన మొదలుకొని మంగళం వరకు తీర్థులవారి తరంగాలలో సమయానుకూలమైన తరంగాలను పాడించి గొప్ప భజన సంప్రదాయాన్ని మాకు అందించారు. ఈ అమూల్య సంపదపైనే మాకు నేడు భక్తి, ముక్తులు కలుగుచున్నవి. తిరునామ పుండ్రముతో గరుత్మంతుని లాంటి విగ్రహం వారిది. అట్టి మానాన్నగారు 58 సంవత్సరాలు జీవించి ఏప్రిల్ 1948లో నెల్లూరులో పరమపదించిరి.

# కీ.శే. శ్రీమాన్ బొమ్మరాజు సీతారామదాసుగారు

(సేకరణ పోరూరి లక్ష్మీనరసింహారావు)



వీరు ప్రకాశంజిల్లా నాగులుప్పలపాడు మండలం బ్రాహ్మణ నిడమానూరు గ్రామంలో శ్రీ బొమ్మరాజు పద్మనాభయ్య, సీతమ్మ పుణ్యదంపతులకు తృతీయ పుత్రుడుగా తే 28-6-1879దిన జన్మించిరి. వీరికి చిన్నవయస్సులో ప్రహ్లాదునికి వోలె భక్తిబీజము లేర్పడినవి. స్వయంకృషితో సంస్కృతాంధ్రములలో పాండిత్యమును సంపాదించి అనేక గ్రంధములు రచించుటయేగాక పురాణము చెప్పుచు, నాటకములలో భక్తిపాత్రలు వేయుచు తనమృదు మధురమైన గాత్రముతో హరికథలు గానముచేయుచు, శ్రీకృష్ణలీలాతరంగముల నర్ధసహితంగాను భక్తియుతంగాను గానము చేసెడివారు. వీరు శ్రీధేనువకొండ కంచివరదంగారి కుమార్తె గుణశీలియైన రాఘవమ్మను వివాహమాడిరి. వీరు మహాభక్తులు. వీరు రచించిన భక్తిగేయములు విజయవాడ, కడప, విశాఖపట్నం, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రములనుండి భక్తిరంజనిలో ప్రసారమగుచున్నవి. వీరు చదలవాడ గ్రామం శ్రీరఘునాయకస్వామివారి బ్రహ్మోత్సవములలో శ్రీస్వామివారు గజారూఢులైయుండగా "పూరయమమకామం" అనుతరంగమును ఆర్తితో గానముచేయుచు స్వామివారి యందు దృష్టినినిల్పి తే 2-4-1942దిన స్వామివారి యందు ఐక్యమైన మహాభక్తాగ్రేసరులు. శ్రీ సీతారామదాసుగారు రామాయణము హరికథారూపములో రచించిరి. కాని ముద్రణకాలేదు. వీరు రాసక్రీడా కలాపమును పోరూరి సోదరులు, ఆకిరి శంకరయ్యగారితో కలిసి చక్కగా నిర్వహించేవారు వీరు అనేక మంది శిష్యులకుతరంగగానము నేర్పినారు. వీరు సంగీతవిధ్వాంసులైన శ్రీ ధేనువకొండ చిన్నయ్య పంతులుగారివద్ద సంగీతంనేర్చుకొనిరి.

# శ్రీ బొమ్మరాజు నరసింహ దాసు

వీరు ప్రకాశంజిల్లా బ్రాహ్మణనిడమనూరు వాస్తవ్యులు. పరమభక్త శిఖామణులు. సంగీతసాహిత్య కవిత్వములలో పండితులు. వీరినిగూర్చి ఎక్కువ వివరములు తెలియవు. భక్తిరస ప్రధానమైన అనేక కీర్తనలు వీరిచే రచింబడినవి. వంశానుగతంగా వీరునూ శ్రీకృష్ణలీలా తరంగిణీ భజన కాలక్షేపములను ఆకర్షణీయముగా రసవత్తరముగా నిర్వహించి పరమపదము పొందినారను ప్రసిద్ధికలదు.

# శ్రీ కోటచంద్రమౌళిగారు

వీరు అద్దంకి వాస్తవ్యులు వీరు శివభక్తి, ఆధ్యాత్మిక సాంప్రదాయముగల కుటుంబమునకు చెందినవారు. వీరు సంగీత సాహిత్య లయజ్ఞానముగల ప్రసిద్ధ గాయకులు, భక్తులు, వీరు తరంగ కేసరి అనుబిరుదు పొందినవారు.

వీరి అన్నగారు శివయ్యగారు శివభక్తులు సుప్రసిద్ధ హరికథకుడు. కోట సచ్చిదానంద శాస్త్రిగారు శివయ్యగారి కుమారులు. అద్దంకిలో తరంగ కాలక్షేము చేసినవారిలో గుడివాడ తాలూకా కొతవరం కుందా పిచ్చయ్య, మందాచలపతిగారు, దుద్దుకూరు మాజేటి కామయ్య శాస్త్రిగారు విజయవాడ పారుపల్లి వెంకటేశ్వర్లుగారు ఉన్నారు

# శ్రీ ఘోరకవి వీరరాఘవరావుగారు

రచన : గుండ్లపల్లి ఆదినారాయణ



"శ్రీకృష్ణలీలా తరంగపారంగత" మరియు "భక్తిభావ" యని బిరుదులుపొందిన శ్రీయుతులు ఘోరకవి వీరరాఘవరావుగారు తే 3-2-1911ది అప్పటి గుంటూరుజిల్లా ప్రస్తుత ప్రకాశంజిల్లా, ఒంగోలు తాలూకా, కొత్తకోట (హనుమాపురం)లో మహాలక్ష్మమ్మ, కృష్ణయ్య దంపతులకు జన్మించినారు. వీరి తాతగారు వేంకటప్పయ్యగారు కరణీకం ఉద్యోగం, కవిత్వము మరియు సంగీతము నందు ప్రజ్ఞాశాలి. వీరిపెద తండ్రి ఘోరక వివరదరావు ఒంగోలులో గ్రామ మునసబుగా ఉండేవారు వారికి సంతానము లేనందువలన తన తమ్ముని కుమారుడైన వీరరాఘవరావును దత్త స్వీకారము చేసుకొని తనవద్ద విద్యాభ్యాసము చేయించినారు

ఒంగోలుపట్టణములో 1921 నుండి సెకండరీగ్రేడ్ ట్రైనింగ్ పొంది బ్రాహ్మణ నిడుమానూరులో ఉపాధ్యాయ వృత్తి చేపట్టారు. ఆదిలక్ష్మమ్మను వివాహమాడారు.

బాల్యమునుండి వీరికి సంగీతమునందు ఆసక్తి ఉండేది. శ్రావ్యమైన గాత్రముతో అందరినీ ముగ్ధులనుచేసేవారు. బ్రాహ్మణ నిడుమానూరులోకీ॥ శే॥ బొమ్మరాజు శీతారామదాసు గారి అధ్వర్యములో సంకీర్తనలలో పాల్గొనుచూ వారి శుశ్రూషచేశారు. చదలవాడ, మల్లవరం మొదలగు క్షేత్రముల యందు ప్రతిసంవత్సరమూ జరిగే కల్యాణ ఉత్సవముల యందు ప్రసిద్ధిచెందిన తరంగ విద్వాంసుల సమక్షములో తన విశేషపాండిత్యమును ప్రదర్శించి అనేక ప్రశంసలు పొందినారు. బహుముఖ ప్రజ్ఞాశాలిగా గుర్తించపడినారు.

ఉద్యోగరీత్యా మరలా ఒంగోలులో 1935 నుండి మునిసిపాలిటి అధ్వర్యములో నడపబడు పాఠశాలల యందు ప్రధానోపాధ్యాయుడుగా ఉండేవారు. ఇక్కడ కీ॥ శే॥ చదలవాడ వేంకటరమణదాసుగారి శిష్యరికములో శివనారాయణ తీర్థతరంగములు పాలపర్తి నరసింహదాసుగారి కీర్తనలు మొదలగునవి చాలా భక్తిశ్రద్ధలతో నేర్చుకొని తనకంటూ ఒక విశిష్టమయిన బాణీని ఏర్పరచుకొని నారాయణతీర్థ తరంగములు గానముచేయుటలో ప్రత్యేక ఒరవడిని ఏర్పరచుకొన్నారు. యక్షగాన సంప్రదాయమును పాటిస్తూనే భావము, సాహిత్యము, సంగీతమును మిళితముచేసి పండిత పామరులను విశేషముగా ఆకర్షించిరి. తిరుమల, శ్రీకాళహస్తి, భద్రాచలం, హైదరాబాదు, మద్రాసు మున్నగు పట్టణాలలో అనేక సన్మానములు, ప్రశంసలు పొందారు.

ముఖ్యముగా, వీరు బాలాజీరావుపేట, ఒంగోలులో తన శ్రీనివాస నిలయమునందు ప్రతిసంవత్సరము ధనుర్మాసములో శ్రవణానక్షత్రమందు పద్మావతీ శ్రీనివాసమూర్తుల కళ్యాణమహోత్సవము ముప్పది ఆరు సంవత్సరములు నిరాఘాటముగా జరిపినారు. ఆ తరువాత వారి ఆజ్ఞననుసరించి వీరి కుమారులు ఇదే సంప్రదాయమును వారి అనంతరముకూడ కొనసాగిస్తున్నారు ఈ కల్యాణ విధానమునకు ఒక ప్రత్యేకతగలదు. వీరు వేదవిధిగానూ మరియూ "శ్రీకృష్ణ లీలాతరంగిణి" ద్వాదశ తరంగమునందుగల రుక్మిణీ కల్యాణ ఘట్టములను వర్ణించు వివిధ తరంగములను పాడుచూ విద్వాంసుల సమక్షములో జరుగు ఆ కల్యాణము కన్నులపండుగగా యుండును.

నారాయణతీర్థులవారు మాఘశుద్ధ అష్టమినాడు సిద్ధిబొందారు. ఆయన కీర్తనలు పాడిన వీరరాఘవరావుగారు కూడా మాఘశుద్ధ నవమి యందు అనగా 11-2-1984 (శనివారము) శ్రీ వేంకటేశుని సన్నిధిచేరారు. హరిదాసుగార్వైన రాఘవరావుగారికి బంగారుచాయ, ఊర్ధ్వ పుండ్రములు తీవి ప్రత్యేక ఆకర్షణలుగా ఉండేవి. కళ్యాణానంతరం కానుకొలనువారి ఈ కీర్తన తప్పక అందరు పాడేవారు. మహాభక్తుల హృదయాంతరాళమునుండి వెలువడే బావనా పరంపరల మహా పేటిక యీ కీర్తన విరామము లేక ధ్యానింపదగినది.

పల్లవి : వేదవేద్య దేవాదిదేవ, మధుసూదన శౌరియశోదాత్మజ తవపాదా రవిందందర్శయా

అ॥ ప॥ పరిచర్యాంకరోమి తవమృదుపాదారవిందం దర్శయా॥

చ॥ బృందావన కంటక భూమిషు, బృందైరనుగమన క్లేశంతవ॥

ఉన్నత ప్రవర్షణాద్రి, శిఖరోల్లంఘన, లబ్దాంగలసం॥ తవ॥

కాళీయోరగ మణిమండలకృత ఘనతాండవ లీలాలసం॥ తవ॥

రాసమండలే గోపికాజనైరాచరితనృత్త శ్రమం॥ తవ॥

కానుకొలను వెంకటదాస ధనం కలితదివ్య లక్షణాంచితం॥ తవ॥

వీరికి ముగ్గురు కుమారులు పెద్ద కుమారుడు వరదారావు కీర్తిశేషులు. చి॥ శ్రీనివాస వేంకట సుబ్బారావు, శ్రీకృష్ణ సంపత్‌కుమార్ వీరిరువురూ తండ్రిగారి నుండి తరంగగానమును వంశపారంపర్యముగా పొంది ఆయన నిర్వహించిన కల్యాణమహోత్సవములను, భక్తిప్రపత్తులతో కొనసాగిస్తూ ఉన్నారు.

# పోరూరి సోదరులు

రచన : సంగీతవిద్వాన్ పోరూరి లక్ష్మీనరసింహారావు

వెంకట సుబ్బదాసు



వెంకట రమణదాసు



ప్రకాశంజిల్లా నారాయణతీర్థ తరంగగాన భజన ప్రముఖులలో పోరూరి సోదరులుగూడా ప్రసిద్ధులు వారి జీవితాలను తరంగ భజన కాలక్షేపంలో అంకితం చేశారు ఈ సోదరులలో పెద్దవారు పోరూరి వెంకటసుబ్బదాసు గారు, రెండవవారు పోరూరి వెంకట రమణదాసు గారు, సుబ్బదాసుగారి జననం 12-2-1898; రమణదాసుగారి జననం 1901 వీరి చిన్నతనమందే తండ్రి నారాయణప్పగారు గతించారు. అప్పటినించి వీరిమేనమామగారైన రుద్రవరం వెంకటకృష్ణయ్యగారే వీరి సంరక్షకులయ్యారు. మేనల్లుళ్లు అయిన సుబ్బదాసు, రమణదాసులకు చిన్నతనమందే సంగీతమునందు అభిరుచి ఉండటం గమనించి రుద్రవరంగ్రామానికి 4 మైళ్ల దూరంలో నున్న పెదకొత్తపల్లి గ్రామవాసస్థులు, ప్రముఖ సంగీత విద్వాంసులైన ధేనువకొండ చిన్నయ్య పంతులుగారి శిష్యులు అయిన రామాయణం సీతాపతిగారివద్ద సంగీతం నేర్చుకొనుటకు పంపించినారు. ఎంతో భక్తితో ప్రతిరోజూ రుద్రవరంనించి కొత్తపల్లి వెళ్లి శ్రీ సీతాపతి గారివద్ద సంగీతం నేర్చుకొనుటయేగాక, నారాయణతీర్థ తరంగాలనుగూడా నేర్చుకొని ఎన్నో మెలుకువలను సంగ్రహించినారు. సీతాపతిగారి సోదరులు బలరామమూర్తిగారు భరతశాస్త్రములో ఎంతో ప్రవీణులు. తరంగం పంజర నడపటంలో గూడా ప్రసిద్ధులు. రామాయణం బలరామయ్యగారి వద్దగూడా భరతశాస్త్రంలో ఎన్నో విషయాలను గురించి పంజర నడపటంలో శ్రీ బలరామయ్యగారి బాణీని పుణికిపుచ్చుకున్నారు.

1920వ సంవత్సరంలో శ్రీమాన్ పాలపర్తి నరసింహదాసుగారి వద్ద సోదరులిద్దరు సమాశ్రయము పొందినారు వీరు రుద్రవరంలో ప్రతిసంవత్సరం శ్రీరామ ఉత్సవములు అత్యద్భుతంగా నిర్వహించేవారు. ఆ కార్యక్రమంలో ఎంతోమంది భజనపరులు భక్తితో పాల్గొనేవారు. ఈ అయిదురోజులు భజనపరులే రామాయణంలోని పాత్రలే తామై శ్రీరామజననం మొదలు పట్టాభిషేకం వరకు ప్రత్యక్ష కథాగానం జరిపించేవారు. ఆ అయిదు రోజులు గ్రామమంతా పండుగవాతావరణమే. ప్రతిసంవత్సరం చదలవాడలో జరుగు రఘునాయకస్వామి తిరుణాలకు గజోత్సవానికి వెళ్లి స్వామివారి తలంబ్రాలు పూర్తయేంతవరకు ఉండి తరంగగానంలో ఎంతోభక్తితో పాల్గొనేవారు. అవిధంగానే మల్లారం శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుణాలలో గూడా భక్తితో పాల్గొని స్వామిసేవలో పాల్గొనేవారు. ప్రముఖ భాగవతోత్తములు శ్రీ బొమ్మరాజు శీతారామదాసు సాన్నిహిత్యంతో సాహిత్య, భక్తిభావములు పెంపొందింపజేసుకొని ఆర్తిగా తరంగగానం చేయటం అలవరుచుకున్నారు. సోదరులలో రెండవవారైన వెంకటరమణదాసుగారు సంస్కృతంలో గూడా దిట్ట.

అంతియేగాక నృత్యం అభినయములు చేయటంలో గూడా ప్రావీణ్యం సంపాదించారు. తరంగగానం జరుగుచున్నప్పుడు తరంగ విద్వాంసుల ఇరువరుసల మధ్య బావాభినయములతో నృత్యం అద్భుతంగా చేసేవారు.

సోదరులు తరంగగానం జరుగుచున్నప్పుడు ఒకరి కెదురుగా ఒకరుకూర్చొని ఉద్రేకంలో భరత శబ్దం పలుకుచున్నప్పుడు చూసి తీరవలసినదే. కొందరు యీ సన్నివేశమును చూసి వీరికి వాలి సుగ్రీవులుగా భావించుకొనేవారు. అప్పటినుండి వారిని వాలి, సుగ్రీవులని పిలుచుకొనేవారు. వెంకటరమణదాసుగారు హరికథా గానంచేశేవారు. వైలెన్ వాయించడంలోగూడా కొంచెం ప్రవేశం వుంది.

ఈ సోదరులిద్దరు రుద్రవరంనుంచి శ్రీరంగం నడచివెళ్లి శ్రీరంగనాయకుని సేవించుకొని అచ్చట తరంగగానం చేశారు. మరియు మంగళగిరి నరసింహస్వామిని దర్శించి తరంగగానంతో సేవించి మంగళగిరి అన్నదాతయగు బాలాంబ ఆశీస్సులందుకొన్నారు. 1932వ సంవత్సరంలో పెద్దవారైన శ్రీ వెంకటసుబ్బదాసుగారు ప్రకాశంజిల్లాలోని తిమ్మసముద్రం గ్రామంలో నివాసమేర్పరచుకొని అక్కడ ఎంతో మందికి తరంగగాన శిక్షణనిచ్చారు.

శ్రీ కూర్మదాసుగారు జరిపిన ప్రతిసప్తాహంలోను వీరు ఉండితీర వలసినదే. అంతియేగాక శ్రీనీలంరాజు ఆదిమూర్తి, శ్రీఘోరకవి రాఘవరావు, చీరాలలో శ్రీకూర్మదాసు జరుపు "ఉత్సవములలో" ఎంతో భక్తితో పాల్గొనేవారు. రాసక్రీడలలోను తెల్లవారులూ భక్తితో గానంచేసేవారు. సంతనూతలపాడు శ్రీ చెన్నకేశవ స్వామి దేవాలయ ధర్మకర్తలుగూడా ఈ పోరూరివారే. ఒంగోలులోని ప్రముఖ న్యాయవాది శ్రీమల్లవరపు సుబ్బారావు గారింట్లో జరుగు ప్రతి ఏకాదశి భజనకార్యక్రమంలో శ్రీ బొమ్మరాజు శీతారామదాసుగారితోపాటు వీరుగూడా పాల్గొనేవారు. ఇలా ఎన్నో తావులలో జరుగు ఉత్సవములలో పాల్గొని భక్తితో గానం చేశేవారు. ఇంత యెందుకు తరంగగానమేవారి ఊపిరి, శ్వాస, జీవితాంతం వరకు నారాయణతీర్థ తరంగ గానంతో వీరి జీవితాలను పునీతం చేసుకున్నారు. 16-11-1974 సంవత్సరంలో వెంకటరమణదాసుగారు, 19-3-1977 వెంకటసుబ్బదాసుగారలు తిరువడిని చేరుకున్నారు.

## శ్రీ చదలవాడ వెంకటరమణదాసు గారు



వీరు రామాయణం వెంకటరమణయ్యగారి కుటుంబమునకు దౌహిత్రులు. ఈయన సంగీతసాహిత్యములలోను, భరతశాస్త్రములోను చెప్పుకోదగిన పాండిత్యము సంపాదించిరి. సంగీతోపాధ్యాయునిగా ప్రభుత్వోద్యోగము చేసిరి. తరంగ కాలక్షేపములో కొంతమంది శిష్యులను కూడతయారుచేసిరి. వారి పూర్వీకులగు రామాయణం వెంకట నరసింహదాసుగారు రచించిన శ్రీగోపాలకృష్ణ విలాసమను భక్తిరస ప్రధానమైన గ్రంధమును ముద్రింపించి ధన్యులైన నిరాడంబరులగు భక్తులు. శ్రీరమణయ్య దంపతులు సదాతరంగగానమును చేసికొనుచు

తృప్తిపొందేవారు తరంగములకు తెలుగు ప్రతిపదార్ధములు సాధించుటలో శ్రీమైనంపాటి ధర్మరాజుగారికి సహాయపడిన ధార్మిక చింతగల మనీషి వీరి తమ్ముడు శ్రీ సంతోషరావుకూడ సంగీతసాహిత్యములలో మంచిదిట్ట. అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, వింజనంపాటి అయోధ్యరామారావు మొదలగు యువకులకు తరంగములునేర్పిరి.

# నాగరాజు సుబ్బారావుగారు

రచన : పోరూరి లక్ష్మీ నరసింహారావు



గుంటూరుజిల్లా, తెనాలి తాలూకాలోని అమృతలూరు గ్రామంలో శ్రీనాగరాజు సుబ్బారావుగారు తే 14-5-1909 దిన ఆదినారాయణ, బుజ్జెమ్మలకు జన్మించినారు.

అమృతలూరు గ్రామంలో పూజ్యశ్రీ నాగలింగం వెంకటేశ్వరశాస్త్రిగారి శిష్యత్వంలో సంస్కృత స్కూలులో విద్యార్థిగా వున్నప్పుడు సంగీతము మీద వీరి బుద్ధిపోవుచుండెడిది. వీరికి లయభిక్షపెట్టినవారు అమృతలూరు గ్రామవాస్తవ్యులు శ్రీ యం బాలకోటిగారు.

తదుపరి వీరు 1926వ సం॥లో బందరులో చల్లపల్లి రాజావారి ఆధ్వర్యములో నిర్వహించుచున్న సంగీత స్కూలునందు కొంతకాలము సంగీతము అభ్యసించినారు తదుపరి బందరులో ఒక భజనకార్యక్రమ సమయములో శ్రీ ఏలేశ్వరపు శీతారామంజనేయులుగారు నిర్వహించిన కార్యక్రమములో శ్రీనారాయణ తీర్థులవారు రచించిన బాలగోపాలతరంగము ఐదురోజులపాటు విసుకు, విరామము లేకుండా నయనా నందకరముగా వీరు నృత్యముచేసినారు. ఈ విధముగా వీరు రెండు సంవత్సరముల కాలము శ్రీ ఏలేశ్వరపు శీతారామాంజనేయులుగారి వద్ద శిష్యత్వము నెరిపినారు తదుపరివీరు 1928వ సంవత్సరములో తెనాలి తాలూకా కూచిపూడి కళాక్షేత్రమునకు చేరి భరతనాట్యాచార్య కూచిపూడి కళాప్రవీణులు శ్రీ వెంపటి వెంకటనారాయణగారి వద్ద అభినయ విద్యాభ్యాసమును ఆరంభించి అనతికాలంలోనే భామాకలాపము, పగటివేషధారణ నేర్చుకొనినారు. ఆనాటి రాజమండ్రి సర్వతీగాన సభలలోనూ, కాకినాడలో నిర్వహించు దసరామహోత్సవములలో తరంగ కాలక్షేపములు చేయుటలో ఈయన చూపిన ప్రతిభా పాటవములు పెద్దల ప్రశంసలు సూచికగానూ భావింపబడుతూ వుండేవి. దక్షిణదేశ మహాగాయకుల పాటకచ్చేరీలు, హరికథా పితామహులు శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారి హరికధ మొదలగు కార్యక్రమముల మధ్యలోను సుబ్బారావుగారి తరంగ కాలక్షేపములు ఏర్పాటుచేయ బడేస్థాయికి ఎదిగే దశ అనతికాలంలోనే వీరికి లభించినది

1932 వ సం॥ నాటికి సుబ్బారావుగారు తాదృశ కీర్తి గడించడం విశేషం. అదే సంవత్సరం రాజమండ్రి సంగీతగాన సభలో శ్రీ నారాయణదాసుగారు వీరి తరంగ నృత్యవైఖరికి ముగ్ధులై నాట్యాచార్య అనుబిరుదు ప్రదానముచేసి ఆసుకవితతో ఆశీర్వదించబడినారు. అదే సంవత్సరం పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడిలో

విద్వత్క విశేఖరుడు శ్రీ కోటవెంకటరత్నంగారి అధ్యక్షతన జరిగిన సభలో ప్రసిద్ధ పండితుల సమక్షములో 'భరత నాట్య ప్రవీణ' అను బిరుదాన్ని వీరు అందుకున్నారు.

అదే సంవత్సరం తోట్లవల్లూరులో దేవాలయమునందు జరిగిన కార్యక్రమములో కీ॥ శే॥ వారణాశి బ్రహ్మయ్యగారు వీరు అభినయించిన బాలగోపాల తరంగమునకు బ్రహ్మానంద భరితుడై తరంగ కేసరి అనుబిరుదుతో వీరిని సన్మానించినారు.

వీరికి 1936 వ సం॥లో వివాహమైన తరువాత అప్పటి బాపట్ల తాలూకా, ప్రస్తుతం ప్రకాశంజిల్లా ఇంకొల్లు మండలం కొణికి గ్రామం సుబ్బారావు గారికి స్థిరనివాసమైనది. వీరి తరంగ కాలక్షేపమును విని ముగ్ధులై తే 9-10-1943 చింతలపూడి విశ్వనాధాశ్రమస్వాములవారు "భరతనాట్య సార్వభౌమ" అను బిరుదు నిచ్చి సత్కరించినారు.

1960వ సం॥లో కృష్ణాజిల్లా, తోట్లవల్లూరు గ్రామంలోని శ్రీ మద్భ్రమరాంబా మల్లిఖార్జున స్వామివారి కళ్యాణ మహోత్సవము సందర్భములో వీరు నిర్వహించిన తరంగ కాలక్షేపము విని ముగ్ధులై బ్రహ్మశ్రీ గానార్ణవ క్రోవి సత్యనారాయణగారి అధ్యక్షతన జరిగిన గాయక పండిత పరిషత్ నందువీరికి లయ విశారద అను బిరుదును యిచ్చి సత్కారము చేసినారు.

తే 27-1-1964 దిన అవధానశిరో మణి మహా మహోపాధ్యాయ శ్రీకాశీక్రిష్ణమాచార్య ఆం॥ ప్ర॥ ప్రభుత్వ ఆస్థానకవి వీరి కాలక్షేపమును విని వీరికి తీర్థతరంగ నిష్ణాత అని సార్థక బిరుదాంకితునిగావించిరి.

**సన్మానములు**

1) 1963వ సం॥లో పుట్టపర్తి సాయిబాబాగారి జన్మదిన వేడుకల సందర్భములో శ్రీ సత్యసాయి బాబాగారు వీరిని వెండికంకణము, మరియూ పట్టుశాలవతో ఘనంగా సత్కారము చేసిరి.

2) 1965వ సం॥లో శ్రీ కంచికామకోటి పీఠాధిపతి కాళహస్తిలో నిర్వహించిన 40 రోజుల యజ్ఞమునందు వీరు తరంగ కాలక్షేపము చేసిన సందర్భములో శ్రీ కంచికామకోటిపీఠాధిపతి వీరిని సరస్వతీ గానకళానిధి అను బిరుదుతో సత్కరించి సరస్వతీ అమ్మవారి స్వర్ణ కంకణముతో సత్కరించిరి.

3) 1969వ సం॥లో భద్రాద్రి శ్రీ సీతారామ కళ్యాణ మహోత్సవ సందర్భములో వీరి తరంగ కాలక్షేపమును విని ముగ్ధులై కీ॥ శే॥ శ్రీనందమూరి తారకరామారావుగారు వీరికి సన్మానముగావించిరి.

4) 1971వ సం॥లో ఒంగోలునందు జరిగిన శ్రీ త్యాగరాజస్వామివారి ఉత్సవముల సందర్భమున వీరి తరంగ కాలక్షేపమును విని ముగ్ధులై అప్పటి ఒంగోలు జిల్లా కలెక్టరుగారైన శ్రీ ఉ.కె. దొరైస్వామిగారు గానకళాకోవిదులు మహావాది వెంకటప్పయ్యగారితో పాటు శ్రీ సుబ్బారావు గారిని ఘనంగా సన్మానించినారు.

వీరు ఈక్రింది చూపబడిన ముఖ్యపుణ్యక్షేత్రములలో ప్రతి సంవత్సరము తరంగకాలక్షేపములు నిర్వహించిరి.

1) భీమేశ్వరస్వామి దేవస్థానం, వేములవాడ.
2) శ్రీ సీతారామస్వామివారి దేవస్థానం, భద్రాచలం.
3) శ్రీ సత్యనారాయణస్వామివారి దేవస్థానం, అన్నవరం
4) శ్రీ లక్ష్మీనరశింహస్వామి వారిదేవస్థానం, మట్టపల్లి.
5) ఆర్ష సంస్కృత సదస్సు, తిరుమల
6) శ్రీ మల్లిఖార్జున స్వామి దేవస్థానం, శ్రీకాళహస్తి.
7) శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానం, నెల్లూరు.
8) శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానం, సింహాచలం.
9) ,, ,, యాదగిరి.
10) శ్రీ వెంకటేశ్వరస్వామి వారి దేవస్థానం, చికడపల్లి.
11) మద్రాస్ మ్యూజిక్ అకాడమి
12) ఆకాశవాణి కేంద్రం, విజయవాడ

వీరికి ఐదుగురు మగ మరియు ఐదుగురు ఆడ సంతానముగలరు. శ్రీ నాగరాజు సుబ్బారావుగారు 1992వ సం॥ అక్టోబరునెల 31వ తేదీన పరమపదించినారు.

1971వ సం॥లో ఒంగోలులో శ్రీనారాయణ తీర్థ తరంగభజన మహోత్సవములు 3 రోజులు జరిగినవి ఆకార్యక్రమంలో 6 మృదంగములతో తన తరంగ భజన నృత్య అభినయములతో ప్రదర్శనలిచ్చి ఆనాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యామంత్రి గౌ॥ పి.వి. నరశింహరావుగారి ప్రశంసలనందించిరి.

## శ్రీ ఆకిలి శంకరయ్యగారు

రచన : గుం. ఆదినారాయణ



శ్రీ ఆకిలి శంకరయ్యగారు నెల్లూరు వాస్తవ్యులు. వీరి తల్లిదండ్రులు వెంకటరమణయ్య నారాయణమ్మ. శంకరయ్యగారి సతీమణి కామేశ్వరమ్మగారు. వీరికి ఐదుగురు కొడుకులు. ఇద్దరు కుమార్తెలు గలరు. వీరు మహా కవులుకూడా.

శ్రీ శంకరయ్యగారు 1904లో జన్మించి 1979లో స్వర్గస్తులైరి. ఈయన మహాభక్తుడు, సంగీతసాహిత్యములలో దిట్ట, మచిలీపట్నం వాస్తవ్యులైన శ్రీ కాసుకొలను వెంకటదాసుగారిచే రచింపబడిన గోపికా గీతలు. రాసక్రీడ, తరంగ కాలక్షేపము భక్తి శ్రద్ధలతో చేసెడివారు. శ్రీ బొమ్మరాజు సీతారామదాసుగారు, పోరూరి సోదరులు నిర్వహించిన రాసక్రీడా మహోత్సవములలో వీరు భాగస్వామిగా నుండెడివారు. పైవారు ఒంగోలులో నిర్వహించిన "రాసక్రీడ"కు నేనును హాజరైతిని.

శ్రీకృష్ణ కర్ణామృతము, రామకర్ణామృతము, శ్రీకృష్ణలీలా తరంగిణి, అష్టపదులు సతతము పఠించు చుండెడివారు. నెల్లూరు, ఒంగోలు, చీరాల, విజయవాడ మొదలగు ముఖ్యపట్టణములలో 'రాసక్రీడ'

స్వయముగాను, సీతారామదాసుగారు, పోరూరి సోదరులతో కలసిన్ని నిర్వహించిరి శ్రీ శంకరయ్యగారు సాధువులు, నిరాడంబరులు, నిగర్వి. వీరు "హరి శతకము" శ్రీమూలస్థానేశ్వర స్వామి కందశతకము రచించిరి.

## అచ్యుతుని వెంకట సుబ్బారావుగారు



వీరు చీరాల వాస్తవ్యులు. విద్యా వినయ సంపత్తిగలవారు. నిరాడంబరులు. శ్రీకృష్ణలీలా తరంగములు శ్రావ్యముగా, మధురముగా భక్తిరసాస్వాదన తాననుభవిస్తూ, ఇతరులకు కూడా ఆ భాగ్యమును అందజేసెడివారు. తరంగభజన కాలక్షేపములన్న అత్యంత భక్తిశ్రద్ధలు చూపించెడివారు. సాధ్యమయినంతవరకు ఎల్లపుడు సత్కార్యములకు ప్రాధాన్యతనిచ్చి అధ్వర్యము వహించి కాలమును సద్వినియోగము చేయుటకు ప్రయత్నించెడివారు. భక్తశిరోమణి శ్రీ కూర్మదాసుగారు పేరాలలో తలపెట్టిన పాండురంగ విఠల్ దేవాలయ నిర్మాణ, అభివృద్ధులకై శ్రమించిన కర్తవ్యనిష్టులు. జీవితాంతము పాండురంగ దేవాలయ నిర్వహణకు సారథ్యం వహించిన భగవత్సేవకులు శ్రీకూర్మదాసుగారి తూములూరి లక్ష్మీ నృసింహదాసు గారి చరిత్రలను ఎన్నియో వివరములతో ప్రచురించి ధన్యులైరి.

## శ్రీ పంగులూరి వీరరాఘవుడు గారు

వీరు ప్రథమంలో ప్రకాశంజిల్లా పంగులూరు వాస్తవ్యులు. అవసరమునుబట్టి వీరు గుంటూరుజిల్లా అప్పికట్ల వాస్తవ్యులైరి. వీరు 1877 సం॥ ప్రాంతములో జన్మించిరి. వీరు 1957వ సంవత్సరంలో శ్రీమత్



ఆంధ్ర మహాభక్త విజయము అను పేరుతో రెండు భాగములుగా ఆంధ్రదేశములోని మహాభక్తులు, యోగులు, అవధూతల చరిత్రలు రచించి, ప్రచురించిరి. వీరు సంస్కృతాంధ్ర భాషలందు ప్రావీణ్యముగల పండితులు. తన జీవితమును ఎల్లపుడు భగవత్సేవలో గడిపిన సదాచార సంపన్నులు. వీరు ఆంధ్రదేశమంతటనూ, సంచారముచేసి కులమత వివక్ష లేకుండా, యోగులను, భక్తులను, పండితులను దర్శించి వివరములను సేకరించి ఆంధ్రుల కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపచేసిరి. వీరు హరిదాసు, అద్దంకి వెంకట్రాయుడు, లక్ష్మీకాంతానందయోగి, మాలపిచ్చమ్మ లాంటి మహాయోగులను దర్శించి, అనుభూతిని పొందిన మహాజ్ఞాని. సాధు పుంగవులు ఇట్టి సద్గుణసంపత్తి. సత్కార్య దీక్షా పరతంత్రులు అగు వీర రాఘవుడుగారు మన ఆంధ్రులగుట మన యదృష్టము. వీరి పుస్తకము గురించి అవధాన శిరోమణి,

మహా మహోపాధ్యాయ శ్రీ కాశీ కృష్ణాచార్యులుగా రొసంగిన అభిప్రాయమును ఈ వ్యాసమునకు భాగముగా ప్రచురించుచున్నాము

"శ్రీ పంగులూరి వీరరాఘవుడు గారిచే విరచితమయిన ఆంధ్రభక్త విజయమును ఆమూలాగ్రము చదివితిని. ఇతర భక్తవిజయముల కంటే దీనిలొనొక విశేషము గాన్పించినది ఇతర భక్తవిజయములలోని భక్తులు చాలా మంది మనము కనియెఱుగనివారు ఈ భక్త విజయములోని భక్తులు చాలా మంది మనము కనివినినవారు కాశీలో నున్నవారికంటే కాశీకి చాలా దూరదేశములవారికి గంగ యందు భక్తి యెక్కువ. (పెరటి చెట్టుమందునకు కాదు) అన్నట్లు సన్నిహితులెంత గొప్పవారైననూ వారి గొప్పతనమును గ్రహించుట చాలాకష్టము అటులనే మన యాంధ్రులయి యుండియు మన యాంధ్రులలో, మహాభక్తులయి వివిధ వర్ణముల జన్మించిన మహానుభావులు, తూము నృసింహదాసుగారు, పమిడిఘంటం వెంకట రమణాదసుగారు. అద్దంకి వెంట్రాయుడుదాసుగారు మున్నగు వారిని మనము (ఆంధ్రులము) ప్రత్యక్షముగా నెరిగియుండియూ వారి మహిమలను గుర్తించి భగవద్భక్తిని సంపాదించి తరింప లేకపోవచున్నాము అది పెద్దలోపము. అట్టి లోపమును దీర్చి, పైన పేర్కొనబడిన ఆంధ్రభక్తుల చరిత్రను సర్వసుబోధముగా వ్రాసి యొక గ్రంథరూపమున తయారుచేసిన యీ పంగులూరు వీర రాఘవయ్యగారు ఆంధ్రలోకమునకు మహోపకారకులయిరి".

# శ్రీ తాటిగడప శేషయ్యగారు

వీరు అద్దంకి వాస్తవ్యులు. నాందాసు శ్రీ అద్దంకి వెంకట్రాయుడుగారి సహచరుడుగా రాసక్రీడలలోను, తరంగ కాలక్షేపములలోను పాల్గొనిన మహాభక్తులు

# మైనంపాటి ధర్మరాజుగారు



**రచన : మైనంపాటి హరినారాయణ తీర్థులు**

వీరిది స్వగ్రామం మైనంపాడు, సంతనూతలపాడు మండలం ప్రకాశంజిల్లా. వీరి తండ్రి రామకృష్ణయ్య తల్లి శేషమ్మ. వరఫ్ లక్ష్మీదేవమ్మ. మానాన్నగారు న్యాయవాటగారివద్ద గుమస్తా వృత్తిలో పనిచేసెడివారు. ప్రతిరోజు నియమం ప్రకారం స్నాన సంధ్యావందనాది కార్యక్రమములు నియమబద్ధంగా నిర్వర్తించేవారు. వారు సమయపాలనకు అతి ప్రాధాన్యత యిచ్చేవారు నిరాడంబరుడు శాంతమూర్తులు, మితభాషి ఒంగోలు గడియారంవారి వీధిలో రామమందిరంలో ప్రతిరోజూ జరుగు తరంగభజన కాలక్షేపమునకు హాజరై సంకీర్తనలో పాల్గొనేవారు. అవకాశం వున్నంతవరకు భగవత్ చింత నాది సత్‌కాలక్షేపములకు ప్రాధాన్యతయిచ్చేవారు. వారి ఆధ్యాత్మిక గురువులు

కీర్తిశేషులు అద్దంకి వాస్తవ్యులు శ్రీమాన్ పాలపర్తి నృశింహ దాసుఅయ్యగారు. వారి ధర్మపత్ని లక్ష్మీనరసమ్మ గారు. మా తండ్రిగారు శ్రీకృష్ణ పరమాత్మ కథకు సంబంధించిన శ్రీకృష్ణలీలా తరంగిణి వినుట చదువుట యందు చాలా భక్తిశ్రద్ధలు చూపేవారు. ఈ సందర్భమున అదృష్టవశాత్తు కీర్తిశేషులు పూజ్యులు హరిదాసులునగు శ్రీదామోదర రాధాగోపాలకృష్ణదాసుగారు (కృష్ణదాసుగారు) వారి శిష్యులగు నీలంరాజు ఆదిమూర్తిగారి యింటికి వచ్చుట తటస్థించెను. మా తండ్రిగారు సదాహరిచింతనా సక్తులగు పూజ్యులు, కీర్తిశేషులు నీలంరాజు ఆదిమూర్తిగారు అత్యంత మిత్రులుగుటచే అచట శ్రీకృష్ణదాసుగారిని కలుసుకొనుట తటస్థించినది. ఆ అవకాశమును పురస్కరించుకొని శ్రీకృష్ణలీలా తరంగములను ప్రతిపదార్థ సహితంగా అధ్యయనం చేయవలెనని సంకల్పం కలిగి శ్రీకృష్ణదాసు అయ్యగారిని అభ్యర్థించుట జరిగినది ఆ కోరికను శ్రీకృష్ణదాసు అయ్యవారు పరమానందముతో మన్నించి ప్రారంభించిరి. శ్రీకృష్ణదాసు అయ్యవారు సం॥నకు అప్పుడప్పుడు 10, 15 రోజులు శిష్యులగు ఆదిమూర్తిగారి యింట్లో బసచేసెడివారు. సాయంత్రం విశ్రాంతి సమయమున షుమారు 3 గం॥ కాలము ప్రతిపదార్థ సహితంగా పురాణహేల జరిగెడిది ఈ అధ్యయనము పురస్కరించుకొని మా తండ్రిగారు ఒకనోటు పుస్తకంమీద ప్రతిపదార్థమును చక్కగా పొందుపరచినారు. తదుపరి ఈ గ్రంథం ప్రతిపదార్థ సహితంగా అచ్చుకావలయునని కోరికతో శ్రీయుత కీర్తిశేషులు చదలవాడ వెంకటరమణ దాసుగారి సహాయంతో 31-12-60 సం॥ నాటికిచక్కగా విపులంగా మేలు ప్రతిని తయారుచేసిరి. కానీ మా తండ్రిగారి కోరిక మేరకు ఈ గ్రంథము అర్థసహితంగా ముద్రించపడే అవకాశం కలగలేదు. అయినను వ్రాతప్రతిని జాగ్రత్తగా కాపాడినాను. యిప్పటికి 10 సం॥ క్రిందట ప్రసంగవశాత్తు ఈ గ్రంథమును గురించి శ్రీ గుళ్ళపల్లి ఆదినారాయణగారు. నాతో ప్రస్తావించగా వ్రాతప్రతిభద్రముగా యున్నదనివారికి చెప్పి సంతోషముతో మా తండ్రిగారి కోరికను వెల్లడించివారికి అప్పగించితిని. యిప్పటికి ఈ గ్రంథము ముద్రణకు నోచుకున్నందుకు తృప్తిచెందుచు ఈ పుణ్య కార్యక్రమనకు పూనుకొని మాతండ్రిగారి కోరికను పూర్తిచేసినందుకు గుళ్లపల్లి ఆదినారాయణగారిని హృదయపూర్వకంగా అభినందించు చున్నాను. వీరు నారాయణ తీర్థులవారి మీదగల భక్తికి నిదర్శనముగా మూడవ కుమారుడనైన నాకు హరినారాయణ తీర్థులని నామకరణముచేసి తృప్తిచెందిరి. వీరు 25-8-1978 లో ఒంగోలోనే పరంధామునిలో లీనమైరి. జీవిత లక్ష్యమును గురించి మానాన్న గారు మాకిచ్చిన ఈక్రింది సందేశమును ఎన్నటికి మరువరానిదిగా మనవి చేసుకొనుచున్నాను. ''ఏమన, పగటికాలమున చేసిన పనులవలన రాత్రిసమయమున గాఢనిద్రపట్టవలయును. రాత్రికాలమున ఆచరించిన పనులవలన పగటిపూట ఇతరులను చూచి లజ్జపడరాదు. ఈసందేశము సదానాకు స్మరణకు వచ్చును''.

# ర్యాలి పిచ్చయ్యశాస్త్రిగారు

రచన : గుం॥ ఆదినారాయణ

గుడివాడ తాలూకా చవటపల్లి గ్రామమునకు చెందినవారు. వీరు తరంగములను పాటకచ్చేరి విధానంలో వొక్కరేగానము చేసేవారు. తరంగగానంలో ఒంగోలు - అద్దంకి బాణీని మెచ్చుకొని కొత్తపల్లివెళ్లి ఈబాణీని అలవర్చుకొన్నారు. 1942 సం॥లో 'క్విట్ ఇండియా' పోరాటంలో నాతోపాటు బళ్ళారి క్యాంపుజైలులో ప్రవాసమనుభవించిరి.

# శ్రీ రాచపూడి సీతారామయ్యగారు



రాచపూడి సుబ్బయ్య, లక్ష్మమ్మగార్ల ప్రథమ సంతానము వీరి సోదరులు సత్యనారాయణ, సుబ్బరామయ్య, చిదంబరరావు, వీరి తండ్రిగారైన సుబ్బయ్యగారు శ్రీకృష్ణలీలా తంరగములు, అష్టపదులు, రామదాసుకీర్తనలు, పాలపర్తి నరసింహదాసు కీర్తనలు, తూమునరసింహదాను కీర్తనలు, ప్రభాతసేవకీర్తనలు ప్రతిదినం వారిపూజాగృహంలో గానము చేసెడివారు. ప్రతి సంవత్సరం వీరి గృహమందు శ్రీపాండురంగస్వామివారి కళ్యాణవుత్సవములు జరిపెడివారు ఆసందర్భములో అనేకమంది హరిదానులు వస్తూ వుండెడివారు తండ్రిగారుజరిపెడు కాలక్షేపములు విని వంతపాడి శ్రీ సీతారామయ్యగారు, వారి సోదరులు సంప్రదాయకీర్తనలు, తరంగములు పాడుటలో మంచి అనుభవము సంపాదించిరి. చదలవాడ శ్రీరఘునాయకస్వామివారి కళ్యాణోత్సవములలోను శ్రీ సీతారామయ్యగారు వారి సోదరులు తరంగగానము చేయుచుండెడివారు శ్రీ బొమ్మరాజు సీతారామయ్యగారు, శ్రీ రావినూతల వరదరామదాసుగారు, శ్రీపోలూరి వెంకటసుబ్బయ్య, రమణయ్యగార్లు శ్రీ నాగరాజు సుబ్బారావు, శ్రీ మైనంపాటి నరసింగరావు, శ్రీకోటచంద్రమౌళిగార్ల శిక్షణలో శ్రీ సీతారామ య్యగారు మంచి అనుభవము సంపాదించి, స్వయముగా సోదరులతో కలసితరంగ గానము చేసెడివారు భద్రాద్రి, శ్రీశైలం, శ్రీకాళహస్తి, తిరుపతి మొదలైన దేవస్థానములందు శ్రీ బొమ్మరాజు సోదరులతో తన సోదరులతోను కలసి తరంగములు సంప్రదాయకీర్తనలు గానము చేసెడివారు. శ్రీసీతారామయ్యగారు షుమారు 60 సంవత్సరములు తరంగ గానముచేసి, తన 84 సం॥ ములో పరమపదించిరి. వీరిసోదరులు శ్రీ సుబ్బరామయ్యగారు తీర్థులవారి సమాధి స్థలమగు తిరుకుందుర్తి గ్రామమునకు వెళ్ళి తరంగకాలక్షేపములను చేసి ప్రశంసలనందుకొనిరి.



# నీలంరాజు వెంకటశేషయ్య గారు

(పత్రికా సంపాదకుడు)

రచన : గుం॥ ఆదినారాయణ

వీరు ప్రకాశంజిల్లా కొరిశపాడు మండలం కొరిశపాడు గ్రామ వాస్తవ్యులు. వీరు నేను ఆంధ్రకేసరీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు ఒంగోలులో ఏర్పరచిన జాతీయ విద్యాలయంలో విద్యార్థులం. అయన నాకన్నా వయస్సులోను విద్యలోను పెద్ద. ఆ పాఠశాలలో

తెలుగు (షార్ట్ హాండ్) నేర్చుకొనేవారు తరువాత స్వాతంత్ర్య ఉద్యమంలో కూడా పన్నుల నిరాకరణ శాసనోల్లంఘున, మొదలుగు కార్యక్రమంలో పాల్గొన్న సమరయోధులు. ప్రకాశం పంతులుగారు, ప్రారంభించిన స్వరాజ్య పత్రికలోను తరువాత ఆంధ్రప్రభలో ఎడిటర్‌గాను పనిచేసి మంచి పేరు ప్రతిష్టలు పొందినారు. వారు ఈ ప్రాంతములో లేకున్నను యిచ్చట జరుగు కార్యక్రమములు గురించి ఎంతో ఆప్యాయత అనురక్తి కలిగి యుండేవారు. సంగీతసాహిత్యము, కవిత్వము నృత్యం మొదలగు కళలన్నా ఎంతో మక్కువ చూపెడివారు. శ్రీకృష్ణలీలా తరంగములన్నా ఎంతో ప్రేమ భక్తి చూపెడివారు. తరంగకాలక్షేపములలో ప్రత్యేకమైన మన బాణీని ఒకకళగా రూపొందించి ఆంధ్రదేశములోనేగాక భారతదేశము అంతటను ప్రదర్శించవలెననెడి గొప్ప కోరికగలవాడు. శ్రీ భద్రాద్రిలోను, శ్రీకాళహస్తి, తిరుపతి, శ్రీశైలం, వగైరా ప్రముఖమైన దేవస్థానములలో తన పలుకుబడి వుపయోగించి తరంగ భజన కాలక్షేపములను ఏర్పాటుచేసిరి.

బొమ్మరాజు గోపాలకృష్ణమూర్తి గారు ఉపాధ్యాయులుగా ఒంగోలులో శ్రీకృష్ణ లీలాతరంగ భజన విద్యాలయము స్థాపించుటకై గౌరవనీయులు పి.వి. నరశింహరావుగారు విద్యామంత్రిగా నుండగా శ్రీ వెంకటశేషయ్యగారు ప్రయత్నంచేసినారు. కానీ ఫలించలేదు. ఈ విధంగా శ్రీకృష్ణ లీలా తరంగముల భజనగాన కళను వ్యాప్తిచెందించుటకై ఆజన్మాంతము శ్రమపడిన శ్రీ వేంకటశేషయ్యగారిని ఈ సందర్భమున స్మరించుకొని కృతజ్ఞతలు తెలుపుకొనుట అవసరము. వీరు శ్రీ కంచికామకోటి పరమాచార్యులవారికి ముఖ్య శిష్యులు. శ్రీవారిని గురించి 'నడిచే దేవుడు' అనే పుస్తకాన్ని రచించినారు. వీరు శ్రీ కంచికామకోటి పరమాచార్యులవారికి ముఖ్య శిష్యులు. శ్రీవారిని గురించి "నడిచే దేవుడు" అనే పుస్తకం విరచించినారు.

# శ్రీ బొమ్మరాజు సుబ్బరాయుడుగారు

ఈయన భక్తాగ్రేసరులై, పరమోత్కృష్టమైన భగవత్ సన్నిధిని పొందిన బొమ్మరాజు సీతారామదాసుగారి పెద్ద కుమారులు. తన తండ్రిద్వారా ఆర్జించిన సంగీత సాహిత్యములను చక్కగా సాధించి శ్రీకృష్ణలీలా తరంగ భజన గానమును శ్రోత్రపర్వముగా వినిపించెడివారు. ఉపాధ్యాయ వృత్తిలో వున్ననూ ఎప్పుడూ భగవంతుని కథలను స్మరించెడివారు. తండ్రిగారు రచించిన రామాయణములోని కీర్తనలను వెలుగులోనికి తెచ్చిరి. తన సోదరులగు పాండురంగారావు, గోపాలకృష్ణమూర్తి గారలతో కలసి జీవింతాతము తరంగ కాలక్షేపములు చేసి తరించిరి. షుమారు 5 - 6 సంవత్సరముల క్రితము పరమపదించిరి.

# బొమ్మరాజుగోపాలకృష్ణమూర్తి గారి జీవిత సంగ్రహము

రచన : బొమ్మరాజు పాండురంగారావు



వీరు ప్రకాశంజిల్లా, నాగులుప్పలపాడు మండలం బ్రాహ్మణ నిడుమానూరు గ్రామంలో ప్రముఖకవి, హరికథా కళానిధి, తరంగగాన విశారదులు, మహాభక్తాగ్రేసరులు అయిన శ్రీమాన్ బొమ్మరాజు

సీతారామదాసు, రాఘవమ్మ పుణ్యదంపతులకు చతుర్థపుత్రుడుగా 1926 వ సంవత్సరంలో జన్మించిరి. వీరు పిన్నవయస్సుల నుండి తండ్రిగారికి శ్రీకృష్ణలీలా తరంగ గానములో సహకరించుచూ సంగీతము యందు అభిరుచి కలిగియుండుటచే గాయక చక్రవర్తి కీ॥ శే॥ ధేనువకొండ సుబ్బారావు పంతులుగారి యొద్ద 6 సం॥ విద్యనభ్యశించి 1948 సం॥లో మద్రాసు పట్టణంచేరి అచ్చట కార్పొరేషన్ స్కూలులో తెలుగు వుపాధ్యాయుడుగా పనిచేయుచూ ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీమాన్ వింజమూరి వరదరాజయ్యంగారి వద్ద తన సంగీత విద్యకు తుదిమెరుగులు దిద్దుకొనిరి.

వీరు ప్రముఖ తరంగగాన విద్వాంసులు కీ॥ శే॥ శ్రీమాన్ పోరూరి వెంకటసుబ్బదాసుగారి కుమార్తెయున్ను, స్వరసామ్రాట్ శ్రీ లక్ష్మినరశింహారావుగారి సోదరి అయిన చి॥ సౌ॥ కనకవల్లి తాయారును 1949 సంవత్సరంలో వివాహం చేసుకొనియున్నారు. సంగీత విద్వాన్ శ్రీపోరూరి లక్ష్మీనరశింహారావు గారికి వీరు సంగీత సహోధ్యాయులు. వీరిద్దరు కలిసి అనేక చోట్ల సంగీతకచ్చేరీలు చేసియున్నారు.

వీరు తనతండ్రిగారి వలెనే శ్రీకృష్ణలీలా తరంగములను మృదుమధురమైన గాత్రముతో, భావయుక్తముగాను తన సంగీత సాహిత్యపాండిత్యములతో ఆర్తిగా గానముచేసి భక్త్యావేశముతో ప్రేక్షకులను ముగ్ధులుగావించెడివారు. వీరు పశుమలై - శ్రీశ్రీశ్రీ లలితానంద సరస్వతీ సద్గురు పాదసేవచేసివారిచే వుపదేశము పొందిరి

వీరు తమ సోదరులైన శ్రీసుబ్బరాయుడు పాండురంగారావు గారి సహకారముతో, తిరుపతి భద్రాచలం, శ్రీకాళహస్తి, శ్రీశైలం అనేక పుణ్యక్షేత్రములు మొ॥ పట్టణములలోను తరంగగాన ప్రదర్శనలిచ్చి విశేషకీర్తి నార్జించిరి.

1982వ సంవత్సరములో వరంగల్ పట్టణంలో జరిగిన శ్రీపోతన పంచశత జయంతి వుత్సవములలో వీరు తన బృందముతో జరిపిన తరంగగానకచ్చేరీని అప్పట్లో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమి ఛైర్మెన్‌గాయున్న శ్రీ నటరాజ రామకృష్ణగారు విని యిటువంటి బాణీయెుచ్చటా లేదని ప్రశంశించి అకాడమి తరపున వీరిని హైదరాబాదుకు ఆహ్వానించగా, సోదరులైన శ్రీ సుబ్బారాయుడు, పాండురంగారావుగారల సహకారముతో 22 తరంగములు 18 గంటలు గానంచేయగా అకాడమివారు రికార్డుచేసుకొని ఘనముగా సన్మానించియున్నారు.

తే 16-7-1989 ది న మద్రాసు పట్టణం టి.నగర్ కృష్ణగాన సభలో తిరుపుందుర్తి శ్రీనారాయణతీర్థ భక్తసంఘము వారు జరిపిన శ్రీనారాయణతీర్థులవారి జయంతి వుత్సవములలో ప్రముఖ గాయనీమణులు శ్రీమతి యం.యస్. సుబ్బులక్ష్మి, డి.కె. పట్టమ్మాళ్, మణికృష్ణస్వామి, ప్రముఖ మృదంగ విద్వాంసులు శ్రీకందస్వామి యింకా అనేకమంది విద్వాంసుల సమక్షములో వీరు తమ సోదరుల సహకారముతో శ్రీకృష్ణలీలా తరంగములను 3 రోజులు గానం చేయగా వారు వీరి బాణి, సాంప్రదాయమును కొనియాడియున్నారు.

వీరు భక్తిగానామృతలహరి అనుపేరుతో షుమారు 500 కృతులను రచించి సంగీత చక్రవర్తి శ్రీమంగళంపల్లి బాలమురళీకృష్ణ, సంగీత సామ్రాట్ శ్రీ యం.యస్. బాలసుబ్రహ్మణ్యశర్మ, ప్రముఖ వీణావిద్వాంసులు శ్రీ చిట్టిబాబు, పద్మశ్రీ శ్రీమతి భానుమతీరామకృష్ణ, శ్రీ టి.ఆర్. సుబ్రహ్మణ్యం, ప్రముఖ సాహితీవేత్త శ్రీ వేదం వెంకటరామశాస్త్రిగారులవల్ల ప్రశంసలను పొందియుండిరి. వారు ఆగ్రంధమును గురించి అభిప్రాయములను వ్రాసియిచ్చిరి.

ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ జేసుదాసుగారు వీరిని ఆహ్వానించి వీరిచే శ్రీకృష్ణలీలా తరంగములు పాడించుకొని రికార్డు చేసుకొని సన్మానించియున్నారు.

అట్టివీరు తే 23-12-1997 దిన గుండెపోటు వచ్చి విష్ణు సహస్రనామస్తోత్రం చేయుచూ స్వర్గస్తులైరి వీరి మరణంతో ఒంగోలు బాణీ తరంగ కాలక్షేపములకు కొరత ఏర్పడినదని చెప్పక తప్పదు

ఈయన మైనంపాటి ధర్మరాజుగారి వ్రాతలోయున్న కృష్ణదాసుగారు అనుగ్రహించిన ప్రతిపదార్ధమును ఆరునెలలు శ్రమించి చక్కని వ్రాతతో ముద్రణకు అనుకూలముగా తిరిగి వ్రాశినారు. వ్రాతప్రతి చివరిలో నమ్రతతో “దాసుడు” అను వ్రాసి 16992 దిన సంతకం చేసినారు. ఈవిధంగా ఆయన సహాయ పడినందుకు చిరస్మరణీయుడు.

## గాయకరత్న, సంగీతవిద్వాన్
# ధేనువకొండ సుబ్బారావు పంతులుగారు

సంగీత, సాహిత్యములలో పండితులు. తండ్రి చిన్నయ్య పంతులుగారి వద్ద సంగీత మభ్యసించిరి తరంగములన్న మహాప్రీతి. మల్లవరం చదలవాడ, ఒంగోలు మొదలగు ప్రదేశములలో నాహ్లాదకరముగ తరంగ కాలక్షేపము చేసెడివారు. వీరి శిష్యులలో బొమ్మరాజు గోపాలకృష్ణమూర్తి, పోరూరి లక్ష్మీనరసింహారావు, రాచపూడి సీతాపతి యనువారలు సుప్రసిద్ధులు.

# చీమకుర్తి శేషగిరి రావుగారు

(స్వాతంత్ర్య సమరయోధుడు)



రచన : గుం॥ ఆదినారాయణ

వీరిజన్మస్థలం గుంటూరుజిల్లా పొన్నూరు తాలూకా వెల్లటూరు గ్రామము. 14-6 1913 న జన్మించినారు. వీరు చిన్నతనంలో వైష్ణవస్వాములవద్ద పంచకావ్యములు పఠించిరి. తరువాత గుంటూరులో బి.ఎ. చదువుచూ చదువుచాలించి స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. చిల్లరవారి కుటుంబము నుంచి చీమకుర్తి వెంకటప్పయ్య గారికి చీమకుర్తిలో దత్తత కాబడినాడు. 1942 క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొన్న కారణంగా ప్రభుత్వంవారు వారంటు ఇవ్వగా అనేక ఇబ్బందులు సహించి పోలీసువారి కన్నుకప్పి 1942 నుంచి 1946 వరకు

అజ్ఞాతవాసములో గడిపినారు. ప్రభుత్వంవారు ఎంత ప్రయత్నించిన పట్టుబడలేదు. గొప్ప ప్రజ్ఞాశాలి, ధైర్యవంతుడు, సహనశీలిగా పెద్దలచే పొగడ్తలను అందుకున్నాడు. జయప్రకాశ్‌నారాయణ గారి సహచరుడుగా సోషలిస్టు ఉద్యమంలో పనిచేశాడు. మంచి ఖరీదుగల పిత్రార్జితపు ఆస్తిని దేశముకొరకు యితరుల విద్య మొదలగు ఉత్తమ కార్యములకు వెచ్చించుటయేకాక చీమకుర్తి గ్రామంలో హైస్కూలు కొరకు 3 ఎకరములు భూమిని గూడా దానము మొనర్చిరి. ఈయన గొప్ప మేధావి. సదా యితరుల మేలుకోరెడువాడు. నిగర్వి, నిరాడంబరుడు. జీవిత యాత్ర కొరకు 1951లో మద్రాసులో తెలుగు భాషా సమితి అనుసంస్థలో సహాయ సంగ్రాహకుడుగా చేరి తెలుగు విజ్ఞాన సర్వస్వం సంపుటములకు సంకలన కర్తగా సంపాదకులుగా కార్యభారము వహించి డా॥ బెజవాడ గోపాలరెడ్డి మోటూరు సత్యనారాయణ వగైరా ప్రముఖములచే ప్రశంసలను అందుకొన్న కార్యదక్షుడు ప్రపంచ రాజ్యసర్వస్వం లలిత కళాపదకోశంలను స్వయంగా తయారుచేసి వెలువరించినారు 50 వ దశకంలోనే తెలుగు సంస్కృతిపై ఒక గ్రంథమును నెహ్రూగారి కొరకై 15 రోజులలో రచించిన ఘనత ఈయన సామర్థ్యమునకు మచ్చు తునకగా నెంచుకోవచ్చును. అనేక గ్రంథములు రచించిరి. వీరికి శాసనములన్న మక్కువ ఎక్కువ కీర్తిశేషులు చారిత్రక విద్వాంసులు ప్రొఫెసర్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి ప్రభావం వీరి కార్యదక్షతకు బలముగా నుండెడిది. డా॥ శంకర్ దయాళ్‌శర్మ, నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, యన్.టి.ఆర్. పి.వి. నరసింహారావు మొదలగు ప్రముఖులచే సన్మానించబడినారు వీరికి బుద్ధదేవుడన్న వారి ఆశయాలన్న ప్రగాఢమైన భక్తి విశ్వాసములు కలవు బుద్ధిమాంద్యముగల బీద బాలబాలికల నెందరినో విద్యాసంపన్నులుగా తీర్చిదిద్దిన ఉపాధ్యాయ చక్రవర్తి. శత్రుమిత్ర భేదములేని సమతావాది వీరికి ఇన్ని కార్యక్రమాలలో నిమగ్నమై ఉన్నను - ఆత్మ జిజ్ఞాశ తత్వవిచారణలకుప్రథమ ప్రాముఖ్యతనిచ్చే మహామనీషి. శ్రీకృష్ణలీలాతరంగముల పుస్తకములు దొరకనిరోజులలో నావద్దనుండి జెరాక్స్ కాపీ తీయించుకొని హైదరాబాద్ స్త్రీ సమాజమువారికి అందజేసిన ఉదారచరితుడు. వీరి ఆత్మ జిజ్ఞాసను తెలుపుటకై వారిచే రచియింపబడిన పద్యమును ఈక్రింద వివరించుచున్నాను.

సీ॥ ధర్మమిది దీనినొనర్తింపదగునటంచు
నెఱిగియును చేయలేకుంటి నిది యధర్మం
బనుచు దెలిసియు దానినే, యాచరింతు
నిట్టి విపరీతజాడ్యంబుమట్టువెట్టు
మందు నీదయగాక వేరేదికలదు
నీదు దయలేక మానస నిగ్రహంబు
కలుగునను మాట కల్ల, వేయేలనింత
దనుక మనసు నిరోధింపదలచి వే
విధములన్ యత్నములు సల్పి, విసివి,
కడకునిన్ శరణంటిని కావుమయ్య
పాహిమాం పరమేశ్వర పాహిపాహి ॥

ఆయన నాకు పూజ్యమిత్రుడు. దేశ స్వాతంత్ర్యము ఉద్యములలో బహు ముఖములుగా నాకు సహకరించిన మిత్రుడు శేషగిరిరావు.

# శ్రీ ఘోరకవి రామారావు

వీరు ఒంగోలు వాస్తవ్యులు. వీరు న్యాయస్థానములలో ఉద్యోగిగా వుంటూ, ప్రతి అష్టమిరోజున 'తన గృహములో తరంగ భజన కాలక్షేపము నిర్వహిస్తూ భజన పరులను, భక్తులను హరిదాసులను ఆహ్వానించి ఆరాధించేవారు. అందుకు నిదర్శనముగా ఈ పుస్తకంలో 1937లో వీరి ఇంటిలో తీయబడిన ఛాయాచిత్రము ప్రచురిస్తున్నాము ఈఛాయాచిత్రములోని హరిదాసుల పేర్లుకూడా ప్రచురిస్తున్నాము.

# అద్దంకి వెంకటభుజంగరావు గారు :



వీరిది విశిష్టాద్వైత సాంప్రదాయము. వీరు సంగీతమును అభ్యసించిరి కాని వృత్తిగా స్వీకరించలేదు. వీరి తండ్రిగారు అద్దంకి హనుమంతరావుగారు (వెంకటరమణదాసు) పాలపర్తి నరసింహదాసు అయ్యగారి శిష్యులు అయినందున భుజంగరావుగారు కూడా శిష్టాచార సంప్రదాయమును పాటించెడివారు బ్రహ్మోత్సవములలోనూ ఇతర సమయములలోనూ శ్రీ కృష్ణలీలా తరంగాలను భావభక్తి సహితముగా గానము చేసెడివారు ప్రస్తుతము వీరి కుమారులలో ఒకరగు శ్రీరామచంద్రమూర్తి కూడా తరంగభజనలో అనుభవము సంపాదించి ఆకర్షణీయముగా గానం చేయుచున్నారు. వీరికి సంగీతం నేర్పించినవారు మల్లవరం వాస్తవ్యులు రామచంద్రుని పిచ్చయ్యశాస్త్రిగారు.

# జిల్లేళ్ళమూడి లక్ష్మమ్మగారు (తరంగాల లక్ష్మమ్మ)

రచన : గుం॥ ఆదినారాయణ



ఈమె స్వగ్రామం ఒంగోలు తాలూకా నాగులుప్పలపాడు. చిన్నతనమందే వైధవ్యం సంభవింపగా శ్రీవానుదానుగారి శిష్యురాలై బొమ్మరాజు సీతారామదాసుగారివద్ద తరంగములు నేర్చుకొని సంగీతసాహిత్యములందు ప్రావీణ్యము సంపాదించి అనేక గ్రామములలో స్త్రీలకు తరంగములు, రాసక్రీడ, భజనలు నేర్పి ఎంతమందినో భగవత్సేవకు పురికొల్పిన పుణ్యాత్మురాలు. నిరంతర భగవత్సేవాపరాయణురాలగు లక్ష్మమ్మగారు నిర్మలమనోభావముగల భక్తురాలు. ఒంగోలులో నున్నప్పుడు మాయింటిలో స్వయముగాను వొకటి రెండుమార్లు బాలాంబగారితో కలసి తరంగములు రాసక్రీడ వైభవంగా

జరిపినారు. ఈమె అన్ని విషయములలోను వైష్ణవ సాంప్రదాయమను సరించెడిది. ఈమె మూడు సంవత్సరముల క్రిందట పరమపదించిరి.

## నీలంరాజు బాలాంబగారు

ఈమె ప్రసిద్ధ క్రిమినలు న్యాయవాది నీలంరాజు చలపతిరావుగారి భార్య. ఈమెకు సంగీతము, ఆంధ్రభాషలలో ప్రావీణ్యతకలదు. కవిత్వము కూడ చెప్పగలదు. మా యింట్లో రాసక్రీడ, తరంగ భజన కాలక్షేపము రెండు పర్యాయములు నిర్వహించిరి. తరంగ కాలక్షేపమన్న అత్యంత భక్తిశ్రద్ధలు చూపేవారు. ఈమె సనాతన కుటుంబమునకు చెందిన ధార్మిక గుణములుకల స్త్రీరత్నము.

## రామాయణం వెంకట నరసింహదాసు

**(కొత్తపల్లి, మద్దిపాడు మండలం)**

గోపాలకృష్ణ విలాసమను పద్యగేయ ప్రబంధమను భక్తకోటికి అందచేసిన శ్రీ వెంకట నరసింహదాసుగారు శ్రీమద్రామాయణ పారాయణాపరులైన వంశములో జన్మించిన భక్తాగ్రేసరులు, 1963వ సంవత్సరములో ప్రచురితమైన "గోపాలకృష్ణ విలాసము"నకు వ్రాయబడిన పీఠికలో శ్రీ నరసింహదాసుగారి జీవిత విశేషములున్నవి. ప్రథమములో చెన్నుపాటి వంశము వారైననూ, వంశకర్త ముద్దులయ్య రామాయణ పారాయణములో రామాయణం వారుగా నామాంతరం పొందిరి.

శ్రీ నరసింహదాసుగారు 1805 ప్రాంతములో జన్మించి 1870 వరకు జీవించిరి. సంస్కృతాంధ్ర భాషలందునూ, సంగీతమునందును విద్వాంసులు. వేదాంత జ్యోతిర్యాస్తు శాస్త్రాదులలో దిట్ట. ఈ కవి గాయకుడు భగవంతుని పలువిధముల వర్ణించుకొనుచూ గానము చేసెడివారు. కృష్ణాష్టమికి, శ్రీరామనవమికి, నియముగా ఉత్సవములు చేసెడివారు ఆ ఉత్సవములందు గానము చేయుటకై శ్రీ గోపాలకృష్ణ విలాసము, శ్రీరామ జన్మ ప్రకరణము రచించిరి. వీరు రచించిన కీర్తనలు అసంఖ్యాకములు. "ద్వాత్రింశన్మంజరి" రామకృష్ణ తారావళి, "కృష్ణతారావళి" "నారాయణతారావళి" "పరమాత్మ తారావళి" మున్నగు పద్యస్తోత్ర కృతులెన్నో గలవు.

శ్రీకృష్ణలీలాతరంగణివలె పద్య గేయాత్మకముగా నుభయ భాషలలో శ్రీకృష్ణ జననమునుండి, రుక్మిణీ కళ్యాణమువరకు రచించిరి.

శ్రీ నరసింహ దాసుగారి చరిత్ర స్ఫూర్తిదాయకము, మంగళకరము, రామాయణమువారి వంశము కేవలము భక్తుల వంశము.

## కీ॥ శే॥ శ్రీ మైనంపాటి నరశింగరావు

తరంగగానంలో మైనంపాటి నరసింగరావుగారికి ప్రత్యేకమైన స్థానం వున్నది. హరికథాకేసరీ అనుబిరుదు పొందిన నరసింగరావుగారి తరంగగానము విలక్షణమైనది. వీరు సున్నితంగా స్వరయుక్తంగా

యధోచిత అభినయచాయలతో తరంగ కాలక్షేపం చేయగా హరినాగభూషణంగారు "తరంగాలు బాగాపాడగలనని నాకు గర్వంకూడా ఉన్నది. కానీ తీర్థులవారి "హృదయాన్ని నరసింగరావు గారిలాగా గ్రహించినవారిని నేను చూడలేదు అయన పాడుతున్నంతసేపు తన్మయత్వంతో కన్నులు మూసుకొని కూచున్నాను. శ్రీకృష్ణుని లీలా విలాసాలు కంటికి కట్టినట్లుగా కనిపించాయి. ఆనాడు యశోద అనుభవించిన భాగ్యం ఈనాడు శ్రీనరసింగరావుగారి వల్ల లభించింది" అని అన్నారట.

## శ్రీకాకర్ల ఆదినారాయణదాసు
## శ్రీ కాకర్ల రంగదాసు

వీరిరువురూ ప్రస్తుతం ప్రకాశంజిల్లా చిమట వాస్తవ్యులు.

ఆదినారాయణ దాసుగారు కవి. వీరి అన్న రంగదాసుగారు మృదంగశిఖామణి. హరిదాసు వెంట్రాయుడు గారి రాసక్రీడలలో రంగదాసుగారు మృదంగముతో సహకరించేవారు. అన్నదమ్ములిద్దరూ శ్రీ పాలపర్తి నృసింహదాసస్వామివారి శిష్యులు.

ఆదినారాయణదాసుగారు పరమ భాగవతులు. వీరి 46వ సం॥లో సిద్ధార్థి ఆశ్వీయుజ శుద్ధ నవమినాడు చిమటలో స్వగృహములో తిరువారాధన మందిరమునకు ఎదుట సంకీర్తన జరుపుచూ, తిరువారాధనపూర్తి చేయించి మంగళ మిప్పించుచూ శరీరమును వదలిరట. (నీలంరాజు ఆదిమూర్తిగారి శ్రీకాంత భోగావళి నుండి)

## శ్రీ అక్కి పెద్ది రామకృష్ణశాస్త్రిగారు

వీరు ప్రకాశంజిల్లా అద్దంకి వాస్తవ్యులు, తరంగ భజనలో బహుప్రజ్ఞాశాలిగా బహు ప్రసిద్ధిపొంది కీర్తి ప్రతిష్టలు సాధించినారు.

## వెంకటరమణ బ్రహ్మచారి

ప్రస్తుతం ఒంగోలుజిల్లా అద్దంకి తాలూకా అలవలపాడు వాస్తవ్యులు పమిడిఘంటంవారు ఆరువేల నియోగి. తండ్రి సుబ్బరామయ్యగారు చిన్నప్పటినుండి వస్త్రదారణ మొదలగు అలంకారములను ఆశింపక ధావళి గోచితో మాత్రమే తిరుగుతుండెడివారు. భద్రాచలమునందు తండ్రిగారితోపాటు భిక్షవృత్తిని అవలంబించి తండ్రిగారివలె యాత్రికులకు శక్తికొలది అన్నపానాదులు నొసంగి సేవచేయుచూ చిన్న తాటిఆకు గుడిసెలతో కుటీరములను ఏర్పరచి శ్రీరామచంద్రమూర్తి దేవతార్చమును ఏర్పరచుకొని యాత్రికులకు అన్నదానం చేయుచుండెడివారు. వృద్ధులై కూడా గౌతమీనది నుండి జలమును మోసుకొనివచ్చి అన్నసత్రమును సాగించెడివారు. అదియే నేటి అంబసత్రము. వారికి శ్రీరామచంద్రమూర్తివారి అనుగ్రహమువలన అవసరమైనప్పుడుల్లా అన్న సత్రమునకు సహాయమందించిన సంఘటనలు కలవు. ఆఖరున వారు అన్నదాన సత్రమును శ్రీయుతులు న్యాయవాది తుంగదుర్తి నరశింహరావుగారికి అప్పగించి క్రీ॥ శ॥ 1919 సంవత్సరము నిత్యవిభూతినందిరి.

## శ్రీ ఏలేశ్వరపు సీతారామాంజనేయులు

వీరు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా వాస్తవ్యులు. వీరు సంగీతసాహిత్యములలో, భరతశాస్త్ర అభినయ నృత్యములలోనూ, శ్రీకృష్ణ లీలాతరంగ కాలక్షేపములలోనూ నిష్ణాతులు. వీరి వద్దనే అభినయ నృత్యతరంగ కాలక్షేపములలో సుప్రసిద్ధులైన నాగరాజు సుబ్బారావుగారు విద్య నభ్యసించిరి.

# నీలంరాజు ఆదిమూర్తి గారు (ఆదినారాయణదాసు)



శిష్యప్రశిష్యులు
పాలపర్తి నృసింహ దాసు
రాధా గోపాలకృష్ణదాసు
నీలంరాజు ఆదినారాయణదాసు

వీరు ప్రకాశంజిల్లా కోరిశపాడు మండలం వాస్తవ్యులు. వీరు వృత్తిరీత్యా ఒంగోలులో ఆస్తి-పాస్తులు ఇల్లు కలిగి ఒంగోలు వాస్తవ్యులైనారు. వృత్తితో నిమిత్తము లేకుండా సాధు స్వభావము కలిగి సనాతన ధర్మ పరాయణుడు. విశిష్టాద్వైత ఆకర్షితుడై శ్రీమాన్ దామోదర రాధాగోపాల కృష్ణదాసుగారి (కృష్ణదాసు) శిష్యులైనారు. గురువుగారి ఆదేశానుసారం భారతదేశంలో బదరీయాత్రతో సహా అన్ని పుణ్యక్షేత్రాలను సందర్శించినారు. చాలా కాలము ప్రతి సంవత్సరం తన స్వగృహమునందు కృష్ణ కళ్యాణ మహోత్సవమును జరిపించెడివారు. కృష్ణ లీలాతరంగములందు యనలేని శ్రద్ధాభక్తులు కలవారు. తనింటనే కాక ఎచ్చట కాలక్షేపమున్ననూ తప్పక పాల్గొనేవారు. వినికిడి వలననే సంగీత, లయ, జ్ఞానములను సంపాదించిరి.



శ్రీకాంత భోగావళి అనే ఒకగ్రంధములో అనేక మంది పరమ భక్తుల కీర్తనలను సేకరించి తద్వారా భగవత్ సేవా పరాయణుల వివరములు సేకరించి ధన్యులైరి, కృష్ణలీలా తరంగములకు తెలుగు ప్రతిపదార్థమును ప్రసాదించిన శ్రీమాన్ పుణ్య శ్లోకులు దామోద కృష్ణదాసు అయ్యగారే వీరి పరమ గురువులు. వీరి ఇంటి యందే ఈ ప్రతిపదార్ధ రచనా కార్యక్రమము వీరి ప్రోత్సాహము, స్వయంకృషితోనే నిర్వహింపబడినది. వీరి పరార్ధ భాగవత సేవానిష్టకు మనమంతయు కృతజ్ఞతలు చెప్పుకొనవలసిన అవసరమున్నదని విజ్ఞప్తి చేయుచున్నాను.

# చెరువు వెంకటేశ్వర్లుగారు

వీరు ప్రకాశంజిల్లా అద్దంకి మండలం బొమ్మనపాడు వాస్తవ్యులు. అక్కిపెద్ది రామకృష్ణయ్యశాస్త్రిగారు, కోట చంద్రమౌళిగారు, వీరు, ముగ్గురు అద్దంకికి చెందినవారే. వీరిలో చెరువు వెంకటేశ్వర్లు గారు కాశి, వేదాద్రి, సూర్యాపేట, ఏలూరు, విజయవాడ, రాజమండ్రి, భీమవరం, నెల్లూరు, మార్కాపురం, చీరాల, వగైరా ఇతర గ్రామాలలో విరివిగా తరంగ కాలక్షేపములు జరిపెడివారు. ప్రస్తుతము వారి కుమారుడు బ్రహ్మశ్రీ చెరువు వెంకటప్పయ్యశాస్త్రి అద్దంకి మండలం రామకూరు గ్రామములో నివశిస్తున్నారు. తండ్రి వలెనే వీరు కూడా తరంగ భజన కాలక్షేపములు హరికథా కాలక్షేపములు సమర్థంగా శ్రావ్యంగా ప్రజారంజకంగా నిర్వహించుచున్నారు.

# శ్రీ అన్నంరాజు వెంకటప్పయ్యగారు

వీరు అమ్మనబ్రోలు వాస్తవ్యులు, శిష్టాచార సంపత్తిగల విశిష్టాద్వైత సాంప్రదాయముకలవారు చాలాకాలము ఒంగోలులో నివసించిరి. భక్తిభావముతో లయజ్ఞానముతో అర్థసహితముగా తరంగ గానముచేసెడివారు.

# శ్రీ రామాయణం సీతాపతిగారు

### శ్రీరామాయణం బలరామస్వామిగారు

వీరిరువురు ప్రకాశంజిల్లా మద్దిపాడు మండలం పెద్దకొత్తపల్లి వాస్తవ్యులు. వీరి తండ్రి సీతారామయ్యగారు. వీరియింటిపేరు ప్రథమంలో చెన్నుపాటివారుగా నుండేది. వీరి వంశీకులలో ముద్దులయ్య అనువారు మహాపండితుడేగాక భక్తినిష్ఠాపరులగుట చేతప్రతిదినం రామాయణం పారాయణ మొనర్చుటచే వీరింటిపేరు రామాయణంగా మార్పుచెందినది. రామాయణం వెంకటనరసింహకవి వీరి ప్రపితామహులు. వీరి వంశీకులు సంగీత, సాహిత్య, జ్యోతిష, వాస్తు, అశ్వశాస్త్రములలో ఆరితేరిన ప్రతిభావంతులేగాక, భగవద్భక్తులుగా పరిణతి చెందినవారు. రామాయణం హేమాద్రి, వెంకటరమణయ్యగార్లు విజయనగర సంస్థానాధీశులు శ్రీ ఆనంద గజపతిరాజు గారివద్ద తమ తండ్రియొక్క స్వీయక విత్వములనేగాక తరంగములనుకూడ గానముచేసి వారినుండి సువర్ణపతకాలు, అనేక సన్మానములు పొందిరి. వీరివంశము భాగవతవంశముగా గణుతికెక్కినది. వీరిలో సీతాపతిగారు దక్షిణాదిలో సంగీతవిద్యనభ్యసించిన ప్రముఖ గాయకుడు. ధేనువకొండ చిన్నయ్య పంతులుగారివద్ద సంగీతమభ్యసించిరి. మిగులశాంత స్వభావులు. సులలితమైన కంఠ మాధుర్యంకలవారు. హరికథలలో సుందరకాండము ప్రసిద్ధిచెందినది. తరంగకాలక్షేపములలో ప్రసిద్ధికెక్కిన పోరూరి సోదరులు వీరిశిష్యులే. బలరామస్వామిగారు భరతశాస్త్ర ప్రవీణ బిరుదాంకితుడు. భరతశాస్త్రమును ఔపోసనపట్టి ఆంధ్రభాషలో పద్యకావ్యముగా రచించిన కవికోవిదులు. లయ ప్రస్థారమున బహుముఖ ప్రజ్ఞాపాటవలమును సాధించిపండితులచే ప్రశంసలను పొందిరి. ఆకాలమున జరిగే సప్తాహములు బ్రహ్మసత్ర యాగములు, బ్రహ్మోత్సవాలలో రామాయణంవారి భజన కాలక్షేపమొక భాగముగా నుండెడిది. ప్రజలనాకర్షించుట కిదియొక ప్రత్యేకకళగా భావింపబడేది. రామాయణంవారి జట్టుగా పిలువబడేది. వీరి భజనకు తగినట్టు ప్రత్యేక ఫక్కీలో అజానుబాహుడైన కొత్తపల్లి సీతారామయ్యగారి మృదంగవాద్యముండెడిది.

# శ్రీమాన్ పాలపర్తి సీతారామదాసుగారు

వీరి స్వగ్రామమేదో తెలియదుగాని నాకు తెలిసినప్పటినుండి అమ్మన బ్రోలులోను, ఆఖరిదశలో కొంతకాలము కావలిలోనున్నారు. వీరు శ్రీమాన్ పాలపర్తి నృసింహదాసుగారి ముఖ్యశిష్యులు. మా అన్నగారు వెంకట సుబ్బయ్యగారు, మల్లవరంగాలిరంగదాసుగారు కూడ నృసింహదాసుగారి శిష్యులైనందున తఱచు మా అన్నగారింటికి, రంగదాసుగారింటికి వచ్చేవారు. వీరు అవివాహితులు. విశిష్టాద్వైత సంప్రదాయమును చక్కగా పాటించేవారు. బ్రాహ్మణ నిడమానూరుకు చెందిన బొమ్మరాజు

పురుషోత్తందాసుగారు చీర్వనుప్పలపాడు గ్రామస్థులు ఉప్పలపాటి వెంకటకృష్ణదాసు గార్లకు సన్నిహితులు. అమ్మనబ్రోలు గ్రామంలో వీరు సప్తాహం చేయగా నాచిన్న తనంలో నా అన్నగారితో కూడివెళ్ళి చూచుట జరిగినది. మల్లవరం శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో వీరు 40 రోజులు దీక్షతో జపముచేసి పూర్ణాహుతి జరిపించిరి. మాయింటికికూడ తరచుగా వచ్చి దేవతార్చన చేసెడివారు దేవతార్చనలో విగ్రహములు మంచి అలంకరణతోనుండెడివి స్వామివారి పడకనిమిత్తము చిన్నవూయల, పట్టుపరుపు దిండు కూడ వుండెడివి. జీవితాంతము సదాచార సంపత్తితో బ్రహ్మచారిగా జీవితము గడపిన హరిభక్తులు. వీరు కావలిలో పరమపదించిరి

# రావినూతల వరదరామదాసు, సీతారామదాసుగారు

రచన : గుండ్లపల్లి ఆదినారాయణ

రావినూతల వరదరామదాసు సీతారామదాసు గార్లు వీరిద్దరూ సోదరులు వీరిద్దరూ మౌనస్వామివారి గ్రామమునకు సంబంధించిన పమిడిపాడు గ్రామ వాస్తవ్యులు. వీరు విశిష్టాద్వైత సాంప్రదాయమును పాటించే సనాతనపరులు. ఎల్లప్పుడు భగవత్సేవాతత్పరులు శ్రీమాన్ పాలపర్తి నృసింహదాసుగారి శిష్యులు. ప్రతిసంత్సరము శ్రీరామ ఉత్సవములు జరుపుచూ తరంగములు భజనలు శ్రద్ధగా చేయుచూ ఆహ్వానమున్ననూ లేకున్ననూ తరంగభజన కాలక్షేపములలో పాల్గొనేవారు. వీరిలో వరదయ్యగారు ఫిడేలు, వీణ, వగైరా వాయిద్యములలో సుప్రసిద్ధులు. వీరు బ్రాహ్మణ నిడమానూరు బొమ్మరాజువారికి చాలా సన్నిహితులైనందున భగవత్సేవా కార్యక్రమములలో తరచుగా పాల్గొనేవారు.



కూర్చున్నవారు . మృదంగం - కాకర్ల సీతాపతి; కుడినుంచి మూడవవారు · మైనంపాటి ధర్మరాజు; కుర్చీలో కూర్చున్నవారు . ఎడమనుంచి నాలుగవవారు, బొమ్మరాజు సీతారామదాసు; రెండవవారు : రామాయణం బలరామస్వామి, కుడివైపు చివర : అద్దంకి హనుమంతరావుగారు, బిలబడ్డవారు - ఎడమవైపు మొదటివారు . నీలంరాజు ఆదిమూర్తిగారు; ఎడమనుంచి నాలుగవారు · గుంటపల్లి వెంకటసుబ్బయ్యగారు; కుడివైపు చివర - పేర్ల ఎల్లమందగారు



శ్రీమాన్ ఘోరకవి రామారావుగారి యింటివద్ద జరిగిన శ్రీ కృష్ణోత్సవములయందు పాల్గొనిన హరిదాస బృందము, ఒంగోలు 23-5-1937
క్రింద కూర్చున్నవారు ఎడమనుంచి రెండు, మూడువారు - పోరూరి సోదరులు; మధ్యవరుస ఎడమనుంచి రెండవవారు - నీలంరాజు ఆదిమూర్తిగారు, ఎడమనుంచి నాలుగవవారు రాధాగోపాలకృష్ణదాసుగారు; ఎడమనుంచి ఆరవవారు - అద్దంకి హనుమంతరావుగారు,
నిల్చున్నవారు : ఎడమనుంచి మూడవవారు మైనంపాటి ధర్మరాజుగారు. ఘోరకవి రామారావుగారు కూడా ఉన్నారు.

# ఆచార్య తమ్మవరపు రుద్రనరశింహారావు

వీరివంశమువారు తిమ్మనపాళెం వాస్తవ్యులు తదుపరి వీరితండ్రిగారి హయాములో మద్దిపాడు స్వస్థలముగా చేసుకొని స్థిరపడినారు. రామక్రిష్ణయ్య లక్ష్మమ్మగార్లకు రెండవ కుమారునిగా జన్మించినారు. వీరికి 68 సంవత్సరములు. వీరిది మధ్యతరగతి కుటుంబము సామాన్యగృహస్థుడువీరు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అనుబంధమైన రాజమండ్రి కళాశాలలో బియస్.సి. డిగ్రీచదివి ఫిజిక్స్ సబ్జెక్టులో విశ్వవిద్యాలయంలోనే ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులైరి బెంగుళూరులో డిఐఐఎస్ఇ. పూర్తిచేసి బొంబాయిలోని టి.ఐ.ఎఫ్.ఆర్. సంస్థలో ఉద్యోగిగా జీవితాన్ని ప్రారంభించారు. మహేంద్ర అండ్ మహేంద్ర కంపెనీవారు ఉపకారవేతనం మంజూరుచేయగా అమెరికాలోని మిచిగాన్ యూనివర్శిటీలో ఎరి యస్ సి చేశారు అదే విశ్వవిద్యాలయంలో కంప్యూటర్ విభాగంలో పరిశోధనచేసి డాక్టరేటు సంపాదించారు. ప్రస్తుతం లూసియానావిశ్వవిద్యాలయంలో సీనియర్ ఆచార్యులుగా పనిచేస్తున్నారు. దాదాపు విద్యాసందర్భమున 1960 ప్రాంతంలో అమెరికాకు వెళ్ళిన మొదటివ్యక్తి కావడంవలన అనేకమంది విద్యార్థులకు అమెరికాలో విద్యావసతి, అవకాశములు కల్పించి సహాయపడినారు. అంతేకాకుండ అప్పుడప్పుడు తన స్వగ్రామమైన మద్దిపాడు వచ్చినప్పుడు స్థానిక కడియాల యానాదయ్య జిల్లాపరిషత్ హైస్కూల్‌లో చదువుతున్న విద్యార్థులుకు లెక్కలు పాఠాలు చెబుతూ సహాయపడేవారు. ఇతరదేశములలో కూడా కంప్యూటర్ విద్యకు సంబంధించిన అనేక సదస్సులలో పాల్గొని అధ్యక్షత వహించి పేరు ప్రఖ్యాతులు గడించి భారతదేశమునకు కీర్తిని సంపాదించి పెట్టిన విజ్ఞానసంపన్నుడు. కంప్యూటర్ విద్యకు సంబంధించి అమెరికా ఆధునికశాస్త్రవేత్తలు చెప్పిన కంప్యూటర్ సిద్ధాంతాలకు 500 సం॥ కాలమునాటి పాణిని సంస్కృత వ్యాకరణమే ప్రాతిపదిక అని ప్రపంచమున సంచలనాత్మకమైన పరిశోధన వ్యాసములు రచించి నూతన ఆలోచనలకు ప్రేరణ కలిగించి ఆశ్చర్య చకితులనుచేసిన పరిశోధన పిపాసిగా భాసించిన ప్రధమ భారతీయునిగా భావించవలసియున్నది. రావు నిరాడంబరుడు, నిగర్వి, ఆర్షవిద్యయన్న అత్యంత అనురాగా భావములుగల సహృదయులు పారమార్థిక చింతగల బుద్ధిశాలి. తన తల్లిదండ్రుల జ్ఞాపకార్థమై మద్దిపాడులో వెంకటేశ్వరుని స్వామి ఆలయంలో మంటపము నిర్మించిరి. ఈ గ్రంథప్రచురణ విషయం చెప్పిన వెంటనే ఎంతగానో సంతసించి ఈ గ్రంథ ప్రచురణకు వీరుయిచ్చిన చేయూతవల్లనే ఈ ప్రచురణ కార్యక్రమము పూర్తిచేయుటకు నాకు ఎంతో ప్రోత్సాహము కల్గినది. వీరి పిల్లలు అమెరికాలోనే స్థిరపడినారు. ఒకరు చదువుకొనుచున్నారు. ఈయన నామేనమామగారి రెండకుమారుడు. నాకు చాలా సన్నిహితుడు.

# శ్రీ బొమ్మరాజు పాండురంగారావు గారు

వీరు శ్రీ బొమ్మరాజు సీతారామదాసుగారి కుమారులు ప్రస్తుతం ఒంగోలు వాస్తవ్యులు. తమ సోదరులైన కీ.శే. సుబ్బరాయుడు, గోపాలకృష్ణమూర్తిగార్లవలె వంశానుగతమైన కృష్ణలీలా తరంగములను గానము చేయుచున్నారు. వీరు ఆర్తిగా, జనాకర్షణముగా, భరత శాస్త్రశబ్దసహితముగా ముక్తాయింపులతో తరంగకాలక్షేపము చేస్తారు. వీరికి ప్రభుత్వము వారి పారితోషికము కూడా లభించినది. ఇపుడు వీరి వయసు షుమారు 70 సంవత్సరములు.

ఈ ప్రాంతమున పురాతన బాణీని కల్తీలేకుండా సాంప్రదాయ పద్ధతిలో మనకందించే వారిలో వీరు సుప్రసిద్ధులని భావించవచ్చు రోజురోజుకు క్షీణించే భగవత్సన్నిధానమును అనుగ్రహించే పరమోత్కృష్టమైన ఈ కళను ఉద్ధరించుట వీరి కర్తవ్యమని అందుకు తగిన అన్ని అర్హతలు సామర్థ్యముగల వీరు ఉదాసీనత వహించక చొరవతీసుకొని కార్యరంగమున ప్రవేశించి మన పూర్వీకులకు వారసులుగా పేరుప్రతిష్టలు సాధించుటయేగాక విద్యాదానమొసంగి లబ్ధప్రతిష్టులు కాగలరని విశ్వశించుచున్నాము

# శ్రీ చెరువు వెంకటప్పయ్య శాస్త్రి

వీరు ప్రస్తుతం ప్రకాశంజిల్లా వలపర్ల గ్రామంలో నివశిస్తున్నారు వీరి తండ్రిగారు చెరువు వెంకటేశ్వర్లుగారు తండ్రిగారివలె కృష్ణలీలా తరంగములు భక్తితో గానముచేస్తూ, ఈ ప్రాంతములో జరిగే మల్లవరం శ్రీ వెంకటేశ్వరస్వామి కళ్యాణ సమయంలో ప్రతి సంవత్సరం పాల్గొంటారు. వీరు, జైపూరు, పూరిజగన్నాథం, కాశీ, రామేశ్వరం, మురదాసు, హైదరాబాద్, మహారాష్ట్ర, విజయవాడ, తెనాలి, వేదాద్రి, మట్టుపల్లి, నెల్లూరు, కర్నూలు, సిద్ధిపేట, బందరు, ఏలూరు, రాజమండ్రి, ఛత్రపూర్, భీమవరం, చీరాల, అద్దంకి, మార్కాపురం, ఖమ్మం, వరంగల్, ఖాజీపేట, హరిద్వారం మరియు తీర్థులవారు సమాధి అయిన తిరుపుందుర్తిలోనూ, సహచరులతో వెళ్లి తరంగకాలక్షేపములు చేశారు. తగు సన్మానములు పొందారు.

శ్రీపి వి. నరసింహారావు, శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు, శ్రీ యన్.టి. రామారావుగారు వీరిని సన్మానించారు

# ఘోరకవి శ్రీకృష్ణ సంపత్ కుమార్

ఈయన కృష్ణలీలా తరంగ కాలక్షేపములలో నిష్ణాతులయిన వీరరాఘవరావుగారి కుమారులు. ప్రభుత్వ ఉద్యోగంలో వున్నా వారి తండ్రిగారి సంప్రదాయం. నిలబెట్టుచూ, తరంగ కాలక్షేపములు భక్తి,శ్రద్ధలతో వినసొంపుగా గానం చేస్తారు. తరంగములయందు, తరంగ కాలక్షేపములయందు ప్రత్యేక శ్రద్ధతో నిత్యసాధన చేస్తున్నారు మల్లవరం, చదలవాడ బ్రహ్మోత్సవములలో ప్రతిసంవత్సరం పాల్గొంటారు.

# శ్రీ రాచపూడి చిదంబరము, రాచపూడి సత్యనారాయణ

వీరిద్దరూ సోదరులు. వీరి స్వగ్రామం రాచపూడి. వీరి తండ్రి సుబ్బయ్య, సోదరులు సీతారామయ్య, సుబ్బరామయ్య గార్లవలెనే వీరిద్దరూ తరంగ భజన కాలక్షేపములు లయబద్ధంగానూ, భావసహితంగానూ, గానం చేస్తారు. వీరిలో చిదంబరంగారు నారాయణతీర్థులవారి సమాధిగల తిరుకుందుర్తి వెళ్లి మన బాణీని వినిపించి వారి మన్ననలను పొందారు. ఇప్పటికి తరంగ కాలక్షేపములలో శ్రద్ధగా పాల్గొంటారు.

# అద్దంకి శ్రీరామచంద్రమూర్తి

ఈయన అద్దంకి వెంకటభుజంగరావు గారి కుమారులు. చదలవాడ వెంకటరమణదాసుగారి వద్ద తరంగ భజన విధానము, లయజ్ఞానము యధాశక్తి నేర్చుకున్నారు. ప్రస్తుతం చదలవాడ మల్లవరం బ్రహ్మోత్సవములలోనూ, ఒంగోలులోని, త్యాగరాజమందిరం వగైరా అన్ని మందిరములలో జరిగే తరంగ కాలక్షేపములలో శ్రద్ధగా పాలుపంచుకుంటారు.

# చిట్టాసుబ్రహ్మణ్యా శాస్త్రి భాగవతులు

వీరు వేద సాంప్రదాయము నందు విశ్వాసముగలిగిన నైష్టికులు. కూర్మదాసుగారి యందును, వారి కార్యక్రమములందునూ, పరమభక్తి విశ్వాసములుగలవారు. దాసుగారి ఆశయములననుసరించి బ్రహ్మ సత్రయాగమను పేరుతో ఆంధ్రదేశమందేగాక, ఇతర రాష్ట్రములలోనూ, అన్ని పుణ్యక్షేత్రములలోనూ, అతి క్లిష్టమైన ప్రయాణావకాశములేని కురుక్షేత్రము మొదలగు ప్రదేశములందునూ, ఇచటి నుండి, హరిదాసులను తరంగభజన చేసెడివారిని వెంటతీసుకొని, సత్రయాగములు నిర్వహించుచున్నారు. కాశీ, ప్రయాగలలో సత్రయాగములు నిర్వహించిరి. ఈవిధముగా కృష్ణలీలా తరంగములు ప్రచారమునకు దోహదమొనర్చుచున్నారు.

# శ్రీ పబ్బిశెట్టి రాఘవయ్య

ఈయన ఒంగోలు వాస్తవ్యుడు. శ్రీ రాచపూడి చిదంబరంగారితో కలిసి, 1993లో తిరుపుందుర్తిలో తీర్థులవారి సమాధివద్ద తరంగ గానం చేశారు. 1994వ సం॥లో సహచరులతోనూ, 1995లో వీరు ఒక్కరూ, తిరుపుందుర్తిలో తరంగ గానంచేసి, సన్మానం పొందారు. ప్రశంసా పత్రం ఇవ్వబడింది.

# వింజనంపాటి అయోధ్య రామారావు

ఈయన ఒంగోలు వాస్తవ్యుడు. ఉపాధ్యాయునిగా పని చేస్తున్నారు. ఈయన అద్దంకి శ్రీరామంచద్రమూర్తి, చదలవాడ వెంకటరమణదాసుగారి వద్ద యధాశక్తిగా తరంగగానం నేర్చుకున్నారు.

# తప్పొప్పుల పట్టిక

## కీర్తనలు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 30 | 24 | కౌస్తుభూషాయ | కౌస్తుభ భూషాయ |
| 37 | చివరి పంక్తి | భూరావి | భూరాది |
| 90 | 15 | శ్యామధానున్ | శ్యామధామన్ |
| 90 | 19 | కారణమఖండరస | కారణమఖండరసం |
| 97 | 13 | ఆఘహరణ | అఘహరణ |
| 112 | 21 | అనపద్య | అనవద్య |
| 116 | 10 | ధునుహి | ధునీహి |
| 118 | 17 | (అ)ఖల | (అ)ఖిల |
| 119 | 8 | సంసారసార | సంసారపార |
| 125 | 25 | | 13వ కీర్తన మోహనరాగం - ఆదితాళం |
| 129 | 15 | చింతత | చింతిత |
| 129 | 17 | పరహంస | వరహంస |
| 137 | 1 | కుటిలాలలక | కుటిలాలక |
| 143 | 26 | పృష్ణి | వృష్ణి |
| 150 | 21 | అళికుం | అళికులం |
| 172 | 24 | మచ్చుత | మచ్యుత |
| 184 | 11 | శోభస ఫలదాచార | శోభనఫలదాచార |
| 184 | 20 | శ్రీదర | శ్రీధర |
| 202 | 2 | పరిపరిహారం | పరపరిహారం |

| | | | |
|---|---|---|---|
| 234 | 19 | మయాదతిషు | మయాదిషు |
| 240 | 8 | అఖిలషితం | అభిలషితం |
| 245 | 12 | జగదణ్ణ | • జగదణ్డ |
| 254 | 1 | జగతీశం | జగదీశం |
| 254 | 13 | భవి | భువి |
| 254 | 13 | రేసం | రేనం |
| 256 | 24 | సారతలా | సారలీలా |
| 256 | 24 | ఫలితం | లలితం |
| 271 | 28 | వరిధావతి | పరిధావతి |
| 293 | 21 | దినకరతానిశా | దినకర తారనిశా |
| 293 | 31 | భూత్ని | భూతే |
| 294 | 1 | జలదాఖే | జలదాభే |
| 294 | 2 | మాలినివ | మాలిని |
| 298 | 26 | హృదయయేన | హృదయేన |
| 303 | 1 | ఆహిరిరాగం | కళ్యాణి (ఆహిరి) రాగం |
| 354 | 14 | శిగీత | శివగీత |
| 399 | 14 | అగతాళం | అటతాళం |
| 399 | 25 | ముళీవాదం | మురళీనాదం |
| 415 | 2 | వేడ్యం | వేద్యం |
| 419 | 25 | అట్ర | అత్ర |
| 434 | 6 | పరిషది | వరిషది |
| 441 | 20 | మమమలం | మమలం |
| 441 | 24 | నరసుఖదం | వరసుఖదం |
| 450 | 5 | శార్ఙిణే | శార్ఙ్గిణే |

## శ్లోకములు

| | | | |
|---|---|---|---|
| 3 | 23 | సురరిపుతిమారారిం | సురరిపుతిమిరారిం |
| 104 | 24 | గోపనూనుభి | గోపసూనుభి |
| 115 | 2 | తన్మాత్రృ | తన్మాత్రృా |
| 142 | 8 | చేతనః | చేతసః |
| 142 | 9 | నన్నృతు | సన్నృతు |
| 190 | 4 | షష్ఠేసిన్ | షష్ఠేస్మిన్ |
| 261 | 20 | న్ఫుట | స్ఫుట |
| 276 | 5 | స్తద్వదోషదోష | స్తద్వదోష |
| 276 | 6 | వాంగాః | వాంగనాః |
| 346 | 6 | బా్య | బాహ్యా |
| 348 | 2 | నరస్వతీ | సరస్వతీ |
| 381 | 30 | బగవా్ | భగవాన్ |
| 384 | 26 | ప్రణ్ | ప్రణమన్ |
| 418 | 3 | నేయం | సేయం |

## గద్యం

| | | | |
|---|---|---|---|
| 191 | 9 | విశేసాను | విశేషాను |
| 216 | 17 | నమాగమ | సమాగమ |
| 218 | 9 | నంచర | సంచర |
| 218 | 9 | వత | పత |
| 218 | 11 | కలింద | కళింద |
| 218 | 12 | నంగ | సంగ |
| 218 | 12 | నుధా | సుధా |
| 279 | 11 | సంతావ | సంతాప |
| 279 | 16 | వసుధాదవ | వసుధావ |
| 279 | 18 | వచనాచ | వచసాచ |
| 393 | 9 | భీష్మాగనమ్ | భీష్మాగమనమ్ |
| 394 | 4 | కన్యాప్రదాన | కన్యాప్రదాన |

# ఈ గ్రంథ సంకలనముకు ఉపకరించిన గ్రంథములు

1. శ్రీకృష్ణ లీలా తరఙ్గిణి (వావిళ్ళవారు ప్రచురించినది)

2. శ్రీ కృష్ణ లీలా తరఙ్గిణి (తెనుగు అనువాదము) - శ్రీ రాజా వేంకటాద్ర్యప్పారావు బహద్దూర్

3. శ్రీ మదాంధ్ర మహాభక్తవిజయము - (పంగులూరి వీరరాఘవుడు)

4. శ్రీ పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాశిన తీర్థులవారి చరిత్ర

5. రామకృష్ణ ప్రభ సంచికలు (రామకృష్ణ మఠంవారి ప్రచురణ)

6. అద్దంకి వెంకట్రాయుడుగారి జీవిత చరిత్ర

7. నరహరి సంకీర్తనలు.

8. గుండ్లపల్లి ఆదినారాయణ షష్ఠిపూర్తి సంచిక

9. శ్రీకాంతభోగావళి (ప్రచురణకర్త నీలంరాజు ఆదినారాయణదాసు)

10. పాలపర్తి నృసింహదాసుగారి చరిత్ర.

11. సద్యోముక్తికర వ్రతము

12. పాండురంగ సుప్రభాతము.

# కృష్ణ లీలాతరంగిణి కర్త - మహాకవి శ్రీ నారాయణతీర్థ

భక్తులును, జ్ఞానులును, పండితులును సాధారణముగ కారణజన్ములుగా నుందురు. వారు వారి యాచరణముచేతను, ఉపదేశములచేతను లోకమునకు నీతిని, భక్తినేర్పి వారి విజ్ఞానమును లోకమునకు జాటుచుందురు. వారి మూలమున నెందరో తరించుచుందురు. వారీ ప్రపంచమున వ్యవహరించుచుండినను వారి మనస్సు మాత్రము భగవంతునియందే లగ్నమై యుండును. వారు ప్రపంచవిషయములనన్నింటిని దుచ్ఛములుగభావించుచుందురు. కామినీ, కాంచన, ప్రతిష్ఠా కాంక్షలకు దూరముననుందురు. అట్టివారిలో మన నారాయణతీర్థులొకరు. వీరు రచించిన తరంగములను భారతదేశమంతటను బాడుకొనుచుందురు. ముఖ్యముగ దక్షిణదేశమున వీని ప్రచార మెక్కువ. వీరాంధ్రులైనను ఆంధ్రులు వీరిచరిత్రము నెరుగజాలకున్నారు.

వీరు పదునేడవ, పదునెనిమిదవ శతాబ్దములలో నున్నట్లు తోచుచున్నది. సుమారు 1700వ సంవత్సరముననుండి యుందురు. వీరు మొదట మాధవానలకవిగను, తర్వాత బిల్హణుడుగను, అనంతరము బృహన్మంగళుడుగను, ఆమీదట జయదేవుడుగను, చివరకు నారాయణతీర్థులుగ నవతరించి శ్రీకృష్ణభక్తిరసామృత స్రవంతిని భూలోకమున ప్రవహింపజేసెనని చెప్పుచుందురు.

వీరి కవిత్వము సరళమును, మధురమును, యమకమును కలిగి భక్తిలోగల భూమికలనన్నిటిని జవిచూచి చివరకు వాని నదిగమించి అద్వైతానుసంధానమొనర్చినట్లు తోచుచున్నది. వీరురచించిన గ్రంథములనేకములు కలవు. శ్రీకృష్ణ లీలాతరంగిణి, పారిజాతాపహరణ నాటకము (తెలుగు), భక్తి చంద్రికా (శాండిల్య భక్తిమీమాంసకు వ్యాఖ్యానము) - మొదలగు గ్రంథములెన్నో రచించినట్లు చెప్పుదురు.

వీరి జన్మస్థలము గోదావరిజిల్లాలోని కూచిమంచి అగ్రహారము. వీరింటిపేరు తల్లావఝులవారు. శ్రీ తల్లావఝుల శివశంకరస్వామి, ఉపనిషత్స్వాములవారును, యశ్వంతసింహా - మొదలగు వారందరును వీరివంశములోనివారే. వీరి తండ్రిపేరు గాంధర్వదేవుడనియు, తల్లి పార్వతీదేవియనియు జెప్పెదరు. కాని, వీరి వంశవృక్షమున వీరి తండ్రిపేరు నీలకంఠశాస్త్రియనియు, నారాయణతీర్థులవారి పూర్వాశ్రమనామము గోవిందశాస్త్రియనియు చెప్పుదురు. తల్లావఝులవారు గోదావరి మండలమునుండి కృష్ణాజిల్లాలోని మంగళగిరి వద్ద కాజగ్రామమునకు వలసవచ్చిరి. మన గోవిందశాస్త్రి బాల్యముననే సంస్కృతాంధ్రములందును, సంగీత, భరతనాట్యశాస్త్రములందును, వేదవేదాంగములందును గొప్ప పాండిత్యమును సంపాదించెను. ఈతడును బాల్యముననే తల్లిదండ్రులను గోల్పోయెను. జ్ఞాతులందరును బయలుదేరగా తానును వారితో బయలుదేరి విజయవాడకు రాగానే కృష్ణా స్నానమొనర్చి, శ్రీ కనకదుర్గనుదర్శించి 'జయ జయదుర్గే - జితవైరివర్గే - వియదనిలాది విచిత్రసర్గే' - అని కీర్తించి, తానేకాంతమున

భగవద్ధ్యానమొనర్చుకొనదలచుకొని కృష్ణాతీరముననే బయలుదేరి వెడలి వేదాద్రికి జేరుకొని అచ్చట నొక కుటీరమును వైచుకొని తంబురచిటికెలతో గానమొనర్చుకొనచుండెను. వేదాద్రికి ఆవలియొడ్డున గల గింజుపల్లి అగ్రహారమున నొక కృష్ణ భక్తుడుకలడు. అతనికి శ్రీకృష్ణానుగ్రహమున నొక కుమార్తె కలిగెను. ఆమె కాతడు అచ్యుతమ్మ అని పేరు పెట్టుకొనెను. జనులందరామెను 'అచ్చమ్మ' అని పిలువసాగిరి. ఆమెకు వివాహముచేయదలచి శ్రీకృష్ణుని బ్రార్థింపగా శ్రీకృష్ణుడు స్వప్నమున సాక్షాత్కరించి వేదాద్రిలోగల తనభక్తుడగు గోవిందశాస్త్రికి నామె నీయవలసినదని యాజ్ఞాపించెను. మొదట గోవిందశాస్త్రి నిరాకరించెనుగాని చివరకు తనకును నట్టి యాదేశమురాగా నామెను పెండ్లాడెను. చాలకాలమునకు వారికి పునస్సంధాన ముహూర్తము శ్రావణశుద్ధపంచమినాడు పెట్టబడెను. గోవిందశాస్త్రి అనుష్ఠానము కావించుకొని ముహూర్తమునకు ఆవలియొడ్డునకు పోవుచుండ బై నుండి ప్రవాహమువచ్చి అతనిని ద్రోసివైచెను. అప్పుడాతడు "రక్షరక్ష అసుర శిక్ష" - అని ప్రార్థించెను. లాభములేదని తెలిసికొని చివరకు రక్షణప్రయత్నమును మానుకొని జందెమును ద్రెంపుకొని, శిఖనూడబెరికి ఆతురసన్యాసమును గ్రహించెను. ఇంతలో నాతని కావలియొడ్డున దుంగచిక్కెను. అంత వస్త్రముల నారవైచుకొని అత్తవారింటికి బోయెను. భార్య ఈతని జూడగనే ఆమెకీతడు సన్యాసిగ గోచరించెను. ఎన్నిసార్లు చూచినను సన్యాసిగనే తోచెను. అంత విచారిం :ా నాతడు ప్రేషోచ్చారణ మొనర్చినట్లును, ఆతుర సన్యాసమును గ్రహించినట్లును దెలుసుకొనిరి. అప్పుడాతడు శాస్త్రీయముగా శ్రీ శివరామానంద తీర్థులవారివద్ద సన్యాసమును గ్రహించెను. అప్పుడీతడు శ్రీ నారాయణతీర్థులనియు, శివనారాయణ తీర్థులనియు పిలువబడుచుండిరి.

అనంతర మీతడు కాశికి బయలుదేరెను. అతనితో బూర్వాశ్రమమున నాతనిభార్య అచ్చమ్మయును శుశ్రూషకు బయలుదేరెను. కాశిలోనుండగా గొందరు దుర్మార్గులు వీరినల్లరిపెట్టవలయునని యోజించిరి. వీరు కృష్ణలీలాతరంగమునుబాడునప్పుడు శ్రీకృష్ణుడు తాళానుసారముగను, భావానుసారముగను నృత్యమొనర్చెడివాడు. ఒక దినమున సఖ్యభావమున 'నీలమేఘశరీర నిత్యానందం దేహి' - అను కీర్తనమును బాడుచుండ శ్రీ కృష్ణుడాడుచుండెను. 'వ్యత్యస్తపాదారవింద - విశ్వవందితముకుంద' అనుచోట శ్రీకృష్ణుడు వ్యత్యస్తపాదమును బెట్టక వూరక నృత్యమొనర్ప తనచేతిలోని తాళముతో గుడికాల్మిపై కొట్టగా నప్పుడు వ్యత్యస్తపాదమును బెట్టెనట. అచ్చట కాశీపండితులు వీరిని సన్యాసికి గాననృత్యము లేమిటని ఆక్షేపించిరి. దానికి వారికి సమాధానములు జెప్పి వారిని జయించిరి. అప్పుడప్పుడు వీరికి భావసమాధి వచ్చుచుండెడిది. మఠములో నేకాంతమున గానమొనర్చుకొనుచు సమాధిస్థుడుకాగా శిష్యురాలు అచ్చమ్మ వీచుచుండెను. కృష్ణుడును వెదురుగ నాడియాడి నిలిచియుండెను. అట్టితరి దుర్మార్గులు తలుపులకు రంధ్రములొనర్చియును, కప్పు విప్పియును జాడగ వారికిని శ్రీకృష్ణుని దర్శనమయ్యెను. అంతవారందరును తీర్థులవారికి పాదాక్రాంతులైరి. అచ్చటి దుర్మార్గులే వారికి దాసులుకాగా వారికి కాశీలో బ్రతిష్ఠ యెక్కువయ్యెను. 'ప్రతిష్ఠా సూకరీ నిష్ఠా' - అని తెలిసికొని వారు ప్రయాగకు బోయిరి.

ప్రయాగలో జనులందరును గేవలము జలములలో మునుగుచుండ వారందరకును నామప్రయాగలో మునుగుడని ఇట్లు ప్రబోధించెను: "రామకృష్ణ గోవిందేతి నామ సంప్రయోగే - కామమిహ స్నాతవ్యం సర్వోత్తమ ప్రయాగే" - అని వారందరును నామములో మునుగునట్లొనర్చి మధురకు వెడలిరి. అచ్చట "రామా మధురా నగరీరమ్యా" - అని కీర్తించి, బృందావనమునకు బోయి ఇద్దరును మధురభక్తి భావావేశులై శ్రీకృష్ణునుపాసించిరి. అచ్చటనే శిష్యురాలు శరీరమును విడిచెను.

అంత వారికి కడుపులో శూలనొప్పి ప్రారంభమయ్యెను. అచ్చటినుండి మరల నీ ప్రాంతమునకు వచ్చి విజయవాడవద్ద దుర్గను బ్రార్థించి మరల వేదాద్రి కరిగి వేదాద్రిశిఖర నృసింహుని గొనియాడి, పవిత్రమైన స్థలమని కృష్ణాతీరమున గల వెల్లటూరునకు బోయిరి. ఈ వెల్లటూరిప్పుడు రేపల్లె తాలూకాలోనున్నది.

అచ్చటినుండి తిరుపతికి వెడలిరి. అచ్చట నాతనికి రెండు వరాహములు కనబడెను. స్వప్నమున నా వరాహము లెచ్చటకు బోయి అంతర్ధానమగునో అచ్చటకు బోయిన కడుపుశూల శమించునని చెప్పగా నా వరాహముల వెంట బయలుదేరెను. చివర కాతడు తన వెంట తిరుమలనుండి తెచ్చుకొనిన విగ్రహమునుగూడ తీసికొని పోగాపోగా నావరాహములు తంజావూరుజిల్లాలో కావేరీనది కొక పాయయగు కడుంగలు నదియొడ్డున గల భూపతి రాజపురము వచ్చెను. అచ్చట దేవాలయములోనికి అవిపోయిఅంతర్ధానములయ్యెను. అప్పటి నుండి దానికి వరాహపురియను పేరువచ్చెను. అచ్చటనే నీ లొక కోవెలను నిర్మించి దానిలో నీ వేంకటేశ్వర ఉత్సవమూర్తిని స్థాపించిరి. ఆ స్వామిని "జయజయ రమానాథ - జయజయ ధరానాథ - జయ జయ వరాహపురి జయ వేంకటేశ" - అని కీర్తించిరి.

చివరకు వీరు వరాహపురియందు నాల్గుసంవత్సరములున్న తరువాత 'తిరువుంతురుత్తియను ప్రదేశమునకు బోయి అచ్చట సమాధిని జెందెను. ఇదియును గావేరిశాఖయగు గడుంగలునది యొడ్డుననే కలదు. ఇప్పటికిని వారి సమాధి నచ్చట దర్శింపవచ్చును. నీ రాదేశమున శిక్యోత్సవమును జరిపింపజేసిరి. మనదేశమునను నది యుట్లు పండుగగ నిప్పటికిని బ్రచలితమై ఉన్నది.

ఇట్టి నారాయణతీర్థులు మన ఆంధ్రులు, మహాపండితులు, గాయకులు, భరతనాట్యాచార్యులు, శాస్త్రవేత్త, మహాభక్తులు, మహాజ్ఞాని. ఇట్టి మహామహుని జయంతులుగాని, వర్ధంతులుగాని మనదేశమున జరుగకపోవుట శోచనీయము. హరికథకులు హరికథలుగ జెప్పరాదా? కవులు హరికథగ రచింపరాదా? నటకులు నాటకములాడరాదా? తెరమీద కెక్కించియును శ్రీ నారాయణతీర్థుల కీర్తిని లోకమున వ్యాపింపజేయరాదా? తరంగగానమును సాంప్రదాయసిద్ధముగ బాడించరాదా? అట్లు పాడువారిని బ్రోత్సహించి సన్మానింపరాదా? శ్రావణశుద్ధపంచమి వారు సన్యసించిన దినము. యతులకదే జన్మదినము కావున శ్రావణశుద్ధ పంచమినాడు వారి జయంతి చేయుట సమంజసము.

—— శ్రీ కుందుర్తి వెంకటనరసయ్య (అలభ్యముగా లభించిన వ్యాసము)